| విషయము | పుట |
| --- | --- |

శ్రీరస్తు

శ్రీకృష్ణాయ నమః

# శ్రీమదాంధ్రభాగవతము

## అష్టమస్కంధము

శ్రీమన్నామ పయోద-శ్యామ! ధరాభృల్లలామ! జగదభిరామా!
[1]రామాజనకామ! మహో-ద్దామ! గుణస్తోమధామ! దశరథరామా! 1

వ. మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండైన సూతుం డిట్లనియె; నట్లు ప్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని. 2

క. "వినఁబడియెను స్వాయంభువ-మనువంశము; వర్ణధర్మమర్యాదలతో
మనుజుల దనుజుల వేల్పుల-జననంబులు [2]స్రష్ట లెల్ల జనియించుటయున్. 3

ఉ. ఏమనుకాలమందు హరి యీశ్వరుఁ డేటికి సంభవించె? నే
మేమి యొనర్చె? నమ్మనువు లే? రతఁ డేక్రియఁ జేయుచున్నవాఁ?
డేమి నటించు మీఁద? గత మెయ్యది? సజ్జను లైనవారు ము
న్నే మని చెప్పుచుందురు? మునీశ్వర! నా కెఱిఁగింపవే దయన్!" 4

వ. అనిన శుకుం డిట్లనియె. 5

క. "ఈకల్పంబున [3]మనువులు-ప్రాకటముగ నార్వురైరి; పదునలువురలో
లోకములజనులపుట్టువు-[4]లాకథితము లయ్యె వరుస నఖిలములు నృపా! 6

వ. ప్రథమమను వైన స్వాయంభువునకు నాకూతి దేవహూతు లను నిద్దఱు కూఁతులు గలరు; వారికిఁ గ్రమంబునఁ గపిలయజ్ఞనామంబుల లోకంబులకు ధర్మజ్ఞానబోధంబు సేయుకొఱకు హరి పుత్రత్వంబు నొందె; నందుఁ గపిలుని చరిత్రంబు మున్న చెప్పంబడియె; యజ్ఞునిచరిత్రంబు సెప్పెద వినుము. 7

మ. శతరూపాపతి కామభోగవిరతిన్ సంత్యక్తభూభారుఁడై
సతియుం దానును గాన కేఁగి, శతవర్షంబుల్ సునందానదిన్

1. స్త్రీలసముదాయమునకు మన్మథునివంటివాఁడు. 2. బ్రహ్మలు. 3. డెబ్బదియొక్క మహాయుగముల కాలము పరిపాలించువారు. 4. చక్కఁగాఁ జెప్పఁబడినవి.

వ్రతి యై యేకపదస్థుఁ డై నియతుఁ డై వాచంయమస్ఫూర్తితో
గతదోషుండు తపంబు సేసె భువనఖ్యాతంబుగా భూవరా! 8

వ. ఇట్లు తపంబు సేయుచు స్వాయంభువమనువు దనమనంబులోన. 9

సీ. "సృష్టిచే నెవ్వఁడు చేతనపడకుండు? సృష్టి యెవ్వనిచేఁతచే జనించు?*
జగములు నిద్రింప జాగరూకత నొంది యెవ్వఁడు బ్రహ్మాండ మెఱుఁగుచుండు?
నాత్మకాధారంబు నఖిలంబు నెవ్వఁడౌ? నెవ్వనినిజధనం బింతవట్టు
బొడగాన రాకుండఁ బొడగను నెవ్వఁడే? నెవ్వనిదృష్టికి నెదురు లేదు?

ఆ. జననవృద్ధివిలయసంగతిఁ జెందక-యెవ్వఁ డెడపకుండు నెల్లయెడలఁ?
దనమహత్త్వసంజ్ఞఁ దత్త్వ మెవ్వఁడు దాన-విశ్వరూపుఁ డనఁగ విస్తరిల్లు?"

వ. అని మఱియు "నిరహంకృతుండును బుధుండును నిరాశియుఁ బరిపూర్ణుండును ననన్యప్రేరితుండును నృశిక్షాపరుండును నిజమార్గసంస్థితుండును నిఖిలధర్మభావనుండును నైనపరమేశ్వరునకు నమస్కరించెద"; నని యుపనిషదర్థంబులు పలుకుచున్నమనువుం గనుంగొని. 11

క. రక్కసులు దినఁగఁ గడఁగిన-వెక్కసముగ యజ్ఞనామవిష్ణుఁడు వారిం
జక్కడిచెఁ జక్రధారల-మిక్కుటముగ వేల్పులెల్ల మేలని పొగడన్. 12

వ. ఇది ప్రథమమన్వంతరం; బింక ద్వితీయమన్వంతరంబు వినుము. 13

సీ. స్వారోచిషుం డన [1]సప్తార్చిబిడ్డఁడు మనువు; వానికి నాద్యుమత్సుషేణ
రోచిష్మదాదు లారూఢపుత్త్రులు ధాత్రి నేలిరి; రోచనుఁ డింద్రుఁ డయ్యె;
నధికులు తుషితాదులమరు; లూర్జస్తంబముఖ్యులాద్యులు సప్తమునులు నాఁడు;
వేదశిరుం డనువిప్రునికయితకుఁ దుషితకుఁ బుత్త్రుఁడై తోయజాక్షుఁ

ఆ. డవతరించెను విభుఁ డన; [2]నశీత్యష్టస-హస్రమునులు నధికు లయినవారు
ఘనులనుగ్రహింపఁ గౌమారకబ్రహ్మ-చారి యగుచు నతఁడు సలిపె వ్రతము.

వ. తదనంతరంబ. 15

సీ. మనువుమూఁడవవాఁడు మనుజేంద్ర! యుత్తముం డనఁ బ్రియవ్రతునకు నాత్మజుండు
పాలించె నిలయెల్లఁ; బవనసృంజయయజ్ఞహోత్రాదు లాతనిపుత్త్రు లధిక
గుణులు; వసిష్ఠునికొడుకులు ప్రమథాదులై రి సప్తర్షులు; నమరవిభుఁడు
సత్యజిత్తనువాఁడు, సత్యభద్రాద్యులు సురలు; ధర్మునకుని సూనృతకును

---

* 'సృష్టి యెవ్వనిచేతఁ జేతనించు' అని కొన్నిప్రతులు అసలుపాఠము. 'యేన చేతయతే విశ్వం' అని మూ. 'మాయచే జనించు' అని పాఠాంతరము.

1. అగ్నిదేవుఁడు. అగ్నికి ఏడు జ్వాలలుకలవు. 2. ౮౮౦౦౦ (ఎనుబది ఎనిమిదివేలు.)

ఆ. పుట్టి సత్యనియతిఁ బురుషోత్తముఁడు సత్య-సేనుఁ డనఁగ దుష్టశీలయుతుల
దనుజయక్షపతుల దండించె సత్యజి-న్మిత్రుఁ డగుచు జగము మేలనంగ. 16

గజేంద్రమోక్షణ కథాప్రారంభము.

వ. చతుర్థమనుప్రకాల ప్రసంగంబు వివరించెద. 17

సీ. "మానవాధీశ్వర! మనువు నాలవవాఁడు తామసుం డనఁగ నుత్తమునిభ్రాత;
పృథివీపతులు కేతుపృథునరఖ్యాతాదు లతనిపుత్రులు పద్గు రధికబలులు;
సత్యకహరివీరసంజ్ఞులు వేల్పులు; త్రిశిఖనామమువాఁడు దేవవిభుఁడు;
మునులు జ్యోతిర్వ్యోమముఖ్యులు, హరిపుట్టె హరిమేధునకుఁ బ్రీతిహరిణియందు;
ఆ. [1]గ్రాహబద్ధుఁ డయినగజరాజు విడిపించి-ప్రాణభయమువలనఁ బాపి కాచె;
హరి దయాసముద్రుఁ డఖిలలోకేశ్వరుఁ"-డనిన శుకునిఁ జూచి యవనివిభుఁడు.

క. "నీరాటవనాటములకుఁ-బోరాటం బెట్లు గలిగెఁ? బురుషోత్తముచే
నారాట మెట్లు మానెను;-ఘోరాటవిలోనిభద్రకుంజరమునకున్? 19

క. మునినాథ! యీకథాస్థితి-వినిపింపుము వినఁగ నాకు వేడుక పుట్టెఁ;
వినియెదఁ; గర్ణేంద్రియములు-పెనుఁబండువు సేయ, మనముఁ బ్రీతిం బొందన్.

క. ఏకథలయందుఁ బుణ్య-శ్లోకుఁడు హరి సెప్పఁబడును సూరిజనముచే,
నాకథలు పుణ్యకథ లని-యాకర్ణింపుదురు పెద్దలతిహర్షమునన్. 21

వ. ఇవ్విధంబునఁ బ్రాయోపవిష్టుండై నపరీక్షిన్నరేంద్రుండు బాదరాయణి నడిగె" నని చెప్పి, సభాసదులయినమునులనవలోకించి, సూతుండు పరమహర్షసమేతుండై చెప్పె, నట్లు శుకుండు రాజున కిట్లనియె. 22

సీ. "రాజేంద్ర! విను సుధారాశిలో నొకపర్వతము త్రికూటం బనఁ దనరుచుండు;
యోజనాయుత మగునున్నతత్వంబును, నంతియ వెడలుపు నతిశయిల్లుఁ;
[2]కాంచనాయస్సారకలధౌతమయములై మూఁడుశృంగంబులు మొనసియుండుఁ;
దటశృంగబహురత్నధాతుచిత్రితములై దిశలు భూనభములుఁ దేజరిల్లు;
తే. భూరిభూజలతాకుంజపుంజములును-మ్రోసి పఱతెంచుసెలయేటిమొత్తములును,
మరగితిరిగెడుదివ్యవిమానములును-జఱులఁ గ్రీడించుకిన్నరచయముఁ గలిగి. 23

వ. అది మఱియును, మాతులుంగ లవంగ లుంగ చూత కేతకీ భల్లాత కామ్రాతక సరళ పనస బదరీ వకుళ వంజుళ వట కుటజ కుంద కురవక కురంటక కోవిదార ఖర్జూర నారికేళ సిందువార చందన పిచుమంద మందార జంబూ జంబీర మాధవీ మధూక తాల తక్కోల తమాల హింతాల రసాల సాల ప్రియాళు

1. మొసలిచే బంధింపఁ బడినవాఁడు. 2. బంగారు, ఉక్కు, వెండి వికారములుగలవి.

బిల్వామలక క్రముక కదంబ కరవీర కదళీ కపిత్థ కాంచన కందరాళ శిరీష శింశు పాశోక పలాశ నాగ పున్నాగ చంపక శతపత్ర మరువక మల్లికా మతల్లికా ప్రముఖ నిరంతర వసంతసమయ సౌభాగ్య సంపదంకురిత పల్లవిత కోరకిత కుసుమిత ఫలిత లలిత విటప విటపి పీడన్నివహాలంకృతంబును, మణివాలుకానేక విమలపులినతరంగిణీసంగతవిచిత్రవిద్రుమలతామహోద్యానశుకపికనికర నిశిత సమంచిత చంచూపుట నిర్దళిత శాఖశాఖాంతర పరిపక్వఫలరంధ్ర ప్రవర్షిత రసప్రవాహబహుళంబును, గనకమయసలిలకాసార కాంచనకుముద కహ్లారకమల పరిమళమిళితకబళాహారసంతతాంగీకారభారపరిశ్రాంత కాంతాసమాలింగితకుమార మత్తమధుకర విటసముదయ సమీపసంచార సముదంచిత శకుంత కలహంస కారండవ జలకుక్కుట చక్రవాక బక బలాక కోయష్టిక ముఖర జలవిహంగవిసర వివిధకోలాహల బధిరీభూత భూనభోంతరాళంబును, దుహినకరకాంత మరకత కమలరాగ వజ్ర వైదూర్య నీల గోమేధిక పుష్యరాగ మనోహర కనకకలధౌతమయానేకశిఖరతటదరీవిహరమాణ విద్యాధర విబుధ సిద్ధ చారణ గరుడ గంధర్వ కిన్నర కింపురుష మిథున సంతత సరససల్లాప సంగీతప్రసంగమంగళాయతనంబును, గంధగజ గవయ గండభేరుండ ఖడ్గ కంఠీరవ శరభ శార్దూల శశ చమర శల్య భల్ల సారంగ సాలావృక వరాహ మహిష మర్కట మహోరగమార్జాలాదినిఖిలమృగనాథ సమూహసమర సన్నాహసంరంభసంచకితశరణాగతశమనకింకరంబు నై యొప్పు నప్పర్వత సమీపంబునందు. 24

క. భిల్లీ భిల్ల [1]లులాయక-భల్లుక ఫణి ఖడ్గ గవయ బలిముఖ చమరీ
[2]ఝిల్లీ హరి శరభ కిటి-మల్లాద్భుత కాక [3]ఘూకమయ మగు నడవిన్. 25

శా. అన్యాలోకనభీకరంబులు, జితాశానేకపానీకముల్,
వన్యేభంబులు గొన్ని మత్తతనులై, వ్రజ్యావిహారాగతో
దన్యత్వంబున భూరిభూధరదరీద్వారంబులందుండి సా
జన్యక్రీడల నీరుగాలి వడి కాసారావగాహార్థ మై. 26

ఆ. "అంధకార మెల్ల నద్రిగుహాంతర-వీథులందుఁ బగలు వెఱచి డాఁగి
[4]యెడరు వేచి, సంధ్య నినుఁడు వృద్ధత నున్న-వెడలె" ననఁగ గుహలు వెడలెఁ [గరులు.

క. తలఁగవు కొండల కైనను; మలఁగవు సింగముల కైన మార్కొను కడిమిం;
గలఁగవు పిడుగుల కైనను-నిల బలసంపన్నవృత్తి నేనుఁగుగున్నల్. 28

సీ. పులుల మొత్తంబులు పొదరిండ్లలోఁ దూఱు; ఘోరభల్లూకముల్ గుహలు సొచ్చు;
[5]భూదారములు నేలబొఱియలలో డాఁగు; హరిదంతముల కేఁగు హరిణచయము;

1. అడవిదున్న. 2. ఈలపురుగు. 3. గ్రుడ్లగూబ. 4. సమయము. 5. అడవిపందులు.

మడువులఁ జొరఁ బాఱు మహిషసంఘంబులు; గండశైలంబులఁ గపులు ప్రాఁకు;
వల్మీకములు సొచ్చు వనభుజంగంబులు; నీలకంఠంబులు నింగి కెగయు;
తే. వెఱచి చమరీమృగంబులు విసరు వాల-చామరంబుల విహరణశ్రమము వాయ,
భయదపరిహేల విహరించు భద్రకరుల-గాలివాఱినమాత్రాన జాలిఁబొంది. 29

క. మదగజదానామోదము-గదలనితమకములఁ ద్రావి, కడుపులు నిండం
బొదలుచుఁ దుమ్మెదకొదమల-కదుపులు ‘‘జుంజు’’మ్మటంచు గానము సేసెన్. 30

క. తేఁటి యొకటి యొరుప్రియకును-మాటికి మాటికిని నాగమదజలగంధం
బేటికని, తన్నుఁ బొందెడి-బోటికి నందిచ్చు నింపుబోటుఁదనమునన్. 31

క. అంగీకృతరంగన్మా-తంగీమదగంధ మగుచుఁ దద్దయు వేడ్కన్
సంగీతవిశేషంబుల-భృంగీగణ మొప్పె మ్రానుపెట్టెడిమాడ్కిన్. 32

క. వల్లభలు వాఱి మునుపడ-వల్లభ మని ముసరి రేని, వారణదానం
బొల్లక మధుకరవల్లభు-లుల్లంబులఁ బొంది రెల్లయుల్లాసంబుల్. 33

వ. అప్పుడు. 34

మ. కలభంబుల్ సెరలాడుఁ బల్వలము లాఘ్రాణించి మట్టాడుచున్;
ఫలభూజంబులు రాయుచుం, జివురుజొంపంబుల్ వడిన్ మేయుచుం,
బులులం గాఱెనుపోతులన్ మృగములం బోనీక శిక్షించుచుం,
గొలఁకుల్ సొచ్చి కలంచుచున్-గిరులపైఁ *గొబ్బిళ్లు గోరాడుచున్. 35

క. తొండంబుల మదజలవృత-గండంబులఁ గుంభములను ఘట్టన సేయం
గొండలు దలక్రిందై పడు-బెండుపడున్ దిశలు సూచి బెగడున్ జగముల్.

క. ఎక్కడఁ జూచిన లెక్కకు-నెక్కువ యై యడవి నడచు నిభయూథములో
నొక్కకరినాథుఁ డెడతెగి-చిక్కె [1]నొకకరేణుకోటి సేవింపంగన్. 37

వ. ఇట్లు వెనుక ముందట నుభయపార్శ్వంబులఁ దృషార్దితంబులై యరుగుదెంచు
నేనుంగుగములం గూడికొని తెఱంగు దప్పి తొలంగుపడి యాశ్వాసాయత్తం
బైన చిత్తంబు సంవిత్తంబు గాకుండుటం జేసి తానును దనకరేణుసముదయం
బును నొక్క తెరువై పోవుచు. 38

సీ. పల్వలంబుల లేఁతపచ్చిక మచ్చికఁ జెలుల కందిచ్చు నచ్చికము లేక;
నివురుజొంపములఁ గ్రొవ్వేలయుపూఁగొమ్మలఁ బ్రాణవల్లభలకుఁ బాలువెట్టు;
ఘనదానశీతల కర్ణతాళంబుల దయితల చెమటార్చుఁ దనువులరసి;
మృదువుగాఁ గొమ్ముల మెల్లన గళములు నివురుచుఁ బ్రేమతో నెఱపు వలపు;

* ‘పైఁ గ్రొబ్బిళ్లు’ అని ప్రాఁతిముద్రణములం దెల్లఁగలదు.
1. ఆడుఏనుగుల సముదాయము.

తే. పిఱుఁదుచక్కట్ల డగ్గఱిప్రేమతోడ-డాసిమూర్కొని దివికిఁ దొండంబు సాఁచు;
[1]వెద వివేకించుఁ; గ్రీడించు;విశ్రమించు-మత్తమాతంగమల్లంబు మహిమతోడ.

సీ. తనకుంభములపూర్ణతకు డిగ్గి యువతులకుచములు పయ్యెదకొంగు లీఁగఁ;
దనయానగంభీరతకుఁ జాలకబలలయానంబులందెల్ల నడఁగిపోఁగఁ:
దనకర(శ్రీ)ఁ గని తలఁగి బాలలచిఱుదొడలు మేఖలదీప్తి దోడు పిలువఁ;
దనదంతరుచి కోడి తరుణులనగవులు ముఖచంద్రదీప్తుల ముసుఁగు దిగువఁ;
తే. దనదులావణ్యరూపంబుఁ దలచి చూడ-నంజనాభ్రముకపిలాదిహరిదిభేంద్ర
దయితలందఱుఁదన వెంటఁదగిలినడవఁ-గుంభివిభుఁ డొప్పెనొప్పులకుప్పవోలె. 40

వ. మఱియు నానాగహనవిహరణమహిమతో మదగజేంద్రంబు మార్గంబుఁ దప్పి, పిపాసాపరాయత్తచిత్తంబున మత్తకరేణువుల మొత్తంబునుం దానునుం జనిచని. 41

మ. అటఁ గాంచెం గరిణీవిభుండు నవఫుల్లాంభోజకహ్లారమున్,
నటదిందిందిరవారముం, గమఠమీనగ్రాహదుర్వారమున్,
వట హింతాల రసాల సాల సుమనో వల్లీకుటీతీరముం,
జటులోద్ధూతమరాళచక్ర బకసంచారంబుఁ గాసారమున్. 42

వ. ఇట్లనన్యపురుషసంచారంబై నిష్కళంకంబైన యప్పంకజాకరంబుఁ బొడగని.

సీ. తోయజగంధంబు దోఁగినచల్లనిమెల్లనిగాడ్పుల మేను లలరఁ,
గమలనాళాహారవిమలవాక్కలహంసరవములు సెవులపండువులు సేయ,
ఫుల్లదిందీవరాంభోరుహామోదంబు ఘ్రాణరంధ్రంబుల గారవింప,
నిర్మలకల్లోలనిర్గతాసారంబు వదనగహ్వరములవాడు దేర్పఁ,
తే. ద్రిజగదభినవసౌభాగ్యదీప్తమైన – విభవ మీక్షణములకును విందు సేయ,
నరిగి,[2]పంచేంద్రియవ్యవహారములను-మఱచి,మత్తేభయూథంబుమడుఁగుసొచ్చె.

క. తొండంబులఁ బూరించుచు-గండంబులఁ జల్లుకొనుచు, గళగళరవముల్
మెండుకొన వలుఁదకడుపులు-నిండన్ వేదండకోటి నీరుం ద్రావెన్. 45

వ. అప్పుడు. 46

మ. ఇభలోకేంద్రుఁడు హస్తరంధ్రముల నీ రెక్కించి, పూరించి, చం
డభమార్గంబున కెత్తి, నిక్కి, వడి నుడ్డాడించి, పింజింప నా
రభటిన్ నీరములోనఁ బెల్లెగసి, నక్రగ్రాహపాఠీనముల్
నభమందాడెడుమీనకర్కటముల న్బట్టెన్ సురల్ [3]మ్రాన్పడన్. 47

1. పశువులకు ఋతుకాలము. 2. త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణముల వ్యాపారములు.
2. చేష్టలులేనట్లు, కొయ్యఁబాఱి.

వ. మఱియు నగ్గజేంద్రంబు నిరర్గళవిహారంబున. 48

సీ. కరిణీకరోజ్ఝితకంకణచ్ఛటఁ దోఁగి సెలయేటినీలాద్రి చెలువుఁ దెగడు;
హస్తినీహస్త విన్యస్త పద్మంబుల వేయిగన్నులవాని వెరవు సూపుఁ;
గలభసముత్కీర్ణ కహ్లారరజమునఁ గనకాచలేంద్రంబు ఘనతఁ దాల్చుఁ;
గుంజరీపరిచితకుముదకాండంబుల ఫణిరాజమండన ప్రభ వహించు;
ఆ. మదకరేణుముక్త మౌక్తికశుక్తుల - మెఱుఁగు మొగిలుతోడ మేలమాడు;
నెదురు లేని[1] గరిమ నిభరాజమల్లంబు-వనజగేహకేళి వ్రాలునపుడు. 49

వ. మఱియు నాసరోవరలక్ష్మి మదగజేంద్రవివిధవిహారవ్యాకులితనూతనలక్ష్మీవిభవ యై యనంగవిద్యానిరూఢ పల్లవప్రబంధపరికంపితశరీరాలంకార యగుకుసుమకోమలియునుం బోలె వ్యాకీర్ణచికురయు మత్తమధుకరనికరయు విగతరసపదకమలయు నిజస్థానచలిత సచరథాంగయుగలయు లంపటితజఘనపులినతలయు నై యుండె; నంత. 50

## గజేంద్ర మకరేంద్రముల పోరాటము

సీ. భుగభుగాయితభూరిబుద్బుదచ్ఛటలతోఁ గదలుచు దివికి భంగంబు లెగయ;
భువనభయంకరఫూత్కారరవమున ఘోరనక్రగ్రాహకోటి బెగడ;
వాలవిక్షేపదుర్వారఝంఝానిలవశమున ఘుమఘుమావర్త మడరఁ;
గల్లోలజాలసంఘట్టనంబులఁ దటీతరు లమూలంబులై ధరణిఁ గూల;
తే. సరసిలోనుండి పొడగని, సంభ్రమించి-యుదరి కుప్పించి, లంఘించి, హుంకరించి,
భానుఁ గబళించు పట్టుస్వర్భానుపగిది-నొక్కమకరేంద్రుఁ డిభరాజు నొడిసిపట్టె.

క. వడిఁ దప్పించి కరీంద్రుఁడు, నిడుదకరం బెత్తివ్రేయ నీరాటంబుం
బొడ వడఁగినట్లు జలములఁ, బడి-కడువడిఁ బట్టెఁ బూర్వపదయుగళంబున్. 52

చ. పదములఁ బట్టినం దలఁకుఁబాటొకయింతయు లేక శూరతన్
మదగజవల్లభుండు ధృతిమంతుఁడు దంతయుగాంతఘట్టనం
జెదరఁగఁ జిమ్మె; నమ్మకరిచిప్పలు పాదులు దప్ప నొప్పఱన్,
వదలి జలగ్రహంబు కరివాలముమూలముఁ జీరె గోరులన్. 53

క. కరిఁ దిగుచు మకరి సరసికిఁ;-గరి దరికిని మకరిఁ దిగుచుఁ; గరకరి బెరయన్
గరికి మకరి, మకరికిఁ గరి,-భర మనుచును నతలకుతలభటు లరుదుపడన్. 54

వ. ఇట్లు కరిమకరంబులు రెండును నొండొంటి సముద్దండంబులై తలపడి నిఖిల లోకాలోకనభీకరంబులై యన్యోన్యవిజయశ్రీవశీకరంబులై సంక్షోభిత కమ

1. గొప్పతనము, నీటియందు సంచరించునది - మొసలి.

లాకరంబులై, హరి హరియును, గిరి గిరియునుం, దాఁకి, పెఱితెవియక పెనంగు తెఱంగున, నీరాటంబయినపోరాటంబున బెట్టుచు, వెలికి లోనికిం దిగుచుచుఁ, గోలంకు గలంకం బొందఁ గడువడి నిట్టట్టుఁ బడి తడఁబడి, బుడబుడానుకారంబులై బుగులుబుగుల్లనుచప్పుళ్లతో నురువులు గట్టుచు జలంబు లుప్పరంబెగయం జప్పరించుచుఁ, దప్పక వదనగహ్వరంబులనప్పళించుచు, నిశితనితాంతదురంతదంతకుంతంబుల నింతింతలు దునియలయి నెప్పళంబునం బునుకచిప్పలు గుదుల్లొదప్పి రక్తంబులు గ్రమ్ముదేర, హుమ్మని యొక్కుమ్మడిం జిమ్ముచు, నితరేతరసమాకర్షణంబులం గదలక, పదంబులమొదలిపట్టు వదలక, సుదూరైవర్తించుచుఁ, బరిభ్రమణవేగంబున జలంబులం దిరుగుచు, మకరకమఠకర్కటగండకమండూకాది సలిలనిలయంబులప్రాణంబులు క్షీణంబులుగా నొండొంటిం దాఁకురభసంబున నిక్కులువడ మ్రక్కుంద్రొక్కుచు, మెండుచెడి బెండువడి నాఁచుగుల్ల చిప్పతండంబులఁ బరస్పరతాడనంబులకు నడ్డంబుగా నొడ్డుచు, నోలమాసగొనక గెలుపుఁ దలంపులు జెట్టిదంబులై రెట్టింప, నహోరాత్రంబులుంబోలెఁ గ్రమక్రమ విజృంభమాణంబులై బహుకాలకలహవిహారంబులై, నిర్గతనిద్రాహారంబులై యవక్రపరాక్రమఘోరంబులై పోరుచున్న సమయంబున. 55

క. జవమును జలమును బలమును – వివిధములుగఁ బోరు కరటివీరతకు భువిన్
దివి మకరమీనకర్కట–నివహము లొక్కటన మిత్రనిలయముఁ బొందెన్. 56

శా. ఆటోపంబునఁ జిమ్ము ఱొమ్ముగల వజ్రాభీలదంతంబులం
దాటించున్, మెడఁ జుట్టిపట్టి హరిదోర్దండాభశుండాహతిన్
నీటన్ మాటికి మాటికిం దిగువఁగా నీరాటముల్ నీటిపో
రాట నొక్కటమిపాటుఁ జూపుట [1]కరణ్యాటంబు వాచాటమై. 57

వ. అప్పుడు. 58

ఆ. మకరితోడఁ బోరుమాతంగవిభుని నొ–క్కరుని డించి పోవఁ గాళ్లు రాక,
కోరి చూచు చుండెఁ గుంజరీయూథంబు;–మగలు దగులు గారె మగువలకును?

వ. అంత. 60

ఆ. [3]జీవనంబు దనకు [4]జీవనం బై యుంట – నలవుఁ జలము నంతకంత కెక్కి,
మకర మొప్పె; డస్సె మత్తేభమల్లంబు – బహుళపక్షశీతభానుపగిది. 61

మ. ఉఱుకుం గుంభయుగంబుపై హరిక్రియన్ హుమ్మంచుఁ; బాదంబులన్
నెఱయం గంఠము వెన్ను దన్ను; నెగయున్; హేలాగతిన్ వాలముం

---

1. సూర్యుని నివాసము. 2. అరణ్యమునఁ సంచరించునది, ఏనుగు. 3. నీరు. 1. బ్రదుకుఁ దెరువు.

జఱచుఁ; నుగ్గుగఁ దాఁకు, ముంచు, మునుఁగుఁ, శల్యంబులుఁ దంతముల్
విఱుగన్ వ్రేయుచుఁ బొంచి పొంచి కదియున్, వేదండయూథోత్తమున్. 62

మ. పొడ గానంబడకుండ డాఁగు; వెలికిం బోవంగఁ దా నడ్డమై
పొడచూపుం; జరణంబులం బెనఁగొనుం; బో రాక రా రాక బె
గ్గడిలం గూలఁగఁ దాఁచు; లేచుతఱి నుద్ఘాటించు; బ
ల్విడిఁ [1]జీరుం; దలఁగుఁ; మలంగు; నొడియన్ వేధించుఁ, గ్రోధించుచున్. 63

వ. ఇట్లు విస్మితనక్రచక్రంబయి నిర్వక్రవిక్రమంబున నల్పహృదయజ్ఞానదీపంబు నతిక్రమించుమహామాయాంధకారంబునుం బోలె నంతకంతకు నుత్సాహకలహసన్నాహబహువిధజలావగాహం బయినగ్రాహంబు మహాసాహసంబున.

శా. పాదద్వంద్వము నేల మోపి, పవనున్ బంధించి, పంచేంద్రియో
న్మాదంబుం బరిమార్చి, [2]బుద్ధిలతకున్ మాఁటాకు హత్తించి, ని
ష్ఖేదబ్రహ్మపదావలంబనరతిం గ్రీడించు యోగీంద్రుమ
ర్యాదన్ నక్రము విక్రమించెఁ గరిపాదాక్రాంతినిర్వక్రమై. 65

ఆ. వనగజంబు నెగచు [3]వనచారిఁ బొడగని – వనగజంబ కాన వజ్రిగజము
వెల్ల నై సురేంద్రు వేచి, [4]సుధాంధులు – పట్టఁ బట్ట నీక బయలు ప్రాఁకె. 66

ఉ. ఊహ గలంగి, జీవనపుటోలమునం బడి, పోరుచున్ మహా
మోహలతానిబద్ధపదమున్ విడిపించుకొనంగ లేక సం
దేహముఁ బొందు దేహిక్రియ, దీనదశన్ గజ ముండె భీషణ
గ్రాహదురంతదంతపరిఘట్టితపాదఖురాగ్రశల్యమై. 67

వ. ఇవ్విధంబున. 68

క. అలయక, సొలయక, వేసట – నొలయక, కరి మకరితోడ నుద్దండత రా
త్రులు, సంధ్యలు, దివసంబులు – సలిపెం బో రొక్క వేయిసంవత్సరముల్. 69

మ. పృథుశక్తిన్ గజ మాజలగ్రహముతోఁ బెక్కేండ్లు పోరాడి, సం
శిథిలం బై, తనలావు వైరిబలముం జింతించి, "మిథ్యామనో
రథ మింకేటికి? దీని గెల్వ, సరి పోరం జాల రా"దంచు న
వ్యథ మై యిట్లనుఁ బూర్వపుణ్యఫలదివ్యజ్ఞానసంపత్తితోన్. 70

శా. "ఏరూపంబున దీని గెల్తు? నిట మీఁ దేవెంటఁ జింతింతు? నె
వ్వారిం జీరుదు? నెవ్వ రడ్డ? మిఁక నివ్వారిప్రచారోత్తమున్

1. పిలుచును. 2. బుద్ధియను తీఁగను చిగిరింపఁజేసి. 3. నీటసంచరించునది, మొసలి.
4. అమృతము ఆహారముగాఁ గలవారు, దేవతలు.

వారింపం దగువార లెవ్వ? రఖిలవ్యాపారపారాయణుల్
లేరే? మ్రొక్కెద దిక్కుమాలిన మొఱాలింపం బ్రపన్నాత్మకుల్. 71

శా. నానానేకపయూథముల్ వనములోనం బెద్దకాలంబు స
న్మానింపన్, దశలక్షకోటికరిణీనాథుండనై యుండి, మ
ద్దానాంభఃపరిపుష్టచందనలతాంతచ్ఛాయలం దుండ లే
కీనీరాస నిటేల వచ్చితి? భయం బెట్లో కదే యీశ్వరా! 72

గజేంద్రము భగవంతుని బ్రార్థించుట

ఉ. ఎవ్వనిచే జనించు జగ? మెవ్వనిలోపల నుండు లీనమై?
యెవ్వనియందు డిందుఁ? బరమేశ్వరుఁ డెవ్వఁడు? మూలకారణం
బెవ్వఁ? డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు? సర్వముఁ దాన యైనవాఁ
డెవ్వఁడు? వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేఁడెదన్. 73

క. ఒకపరి జగములు వెలి నిడి,-యొకపరి లోపలికిఁ గొనుచు, నుభయముఁ దానై
సకలార్థసాక్షి యగున-[1]య్యకలంకుని నాత్మమూలు నర్థిఁ దలంతున్. 74

క. లోకంబులు లోకేశులు-లోకస్థులుఁ దెగినఁ దుది నలోకం బగుపెం
జీఁకటి కవ్వల నెవ్వం-డేకాకృతి వెలుఁగు? నతని నే సేవింతున్. 75

క. నర్తకునిభంగిఁ బెక్కగు-మూర్తులతో నెవ్వఁ డాడు? మునులు దివిజులుం
గీర్తింప నేర? రెవ్వని-వర్తనమొరు లెఱుఁగ? రట్టివాని నుతింతున్. 76

ఆ. ముక్తసంగులైన మునులు [2]దిదృక్షులు-సర్వభూతహితులు సాధుచిత్తు
లసదృశవ్రతాఢ్యులై కొల్తు రెవ్వని-దివ్యపదము? వాఁడు దిక్కు నాకు. 77

సీ. భవము దోషంబు రూపంబుఁ గర్మంబు నాహ్వయములు గుణము, నెవ్వనికి లేక
జగములఁ గలిగించు సమయించుకొఱకునై నిజమాయ నెవ్వఁడిన్నియును దాల్చు?
నా పరేశునకు, ననంతశక్తికి, బ్రహ్మ, కిద్ధరూపికి, రూపహీనునకును,
జిత్రచారునికి, సాక్షికి, నాత్మరుచికిని, బరమాత్మునకుఁ, బరబ్రహ్మమునకు,
ఆ. మాటలను నెఱుకల మనములఁ జేరంగఁ-గానిశుచికి, సత్త్వగమ్యుఁ డగుచు
నిపుణుఁడైనవాని నిష్కర్మతకు మెచ్చు-వానికే నొనర్తు వందనములు. 78

సీ. శాంతున[3]కపవర్గసౌఖ్యసంవేదికి, నిర్వాణభర్తకు, నిర్విశేషు
నకు, ఘోరునకు, గూఢునకు గుణధర్మికి, సౌమ్యున, కధికవిజ్ఞానమయున
కఖిలేంద్రియ[4]ద్రష్ట కధ్యక్షునకు, బహుక్షేత్రజ్ఞునకు దయాసింధుమతికి,
మూలప్రకృతి, కాత్మమూలున, కఖిలేంద్రియజ్ఞాపకునకు దుఃఖాంతకృతికి

1. మలినములేనివానిని. 2. చూడఁగోరినవారు. 3. మోక్షసుఖమును దెలిసినవానికి.
4. చూచువాఁడు.

ఆ. నిజసత్త్వమున నెఱింగి తనతో వెలుఁగుచు-నుండు [1]నొక్కటికి, మహాత్మునకు,
నిఖిలకారణునకు, నిష్కారణునకు, న-మస్కరింతు నన్ను మనుచుకొఱకు. 79

క. యోగాగ్నిదగ్ధకర్ములు – యోగీశ్వరు లేమహాత్ము నొం డెఱుఁగక, స
ద్యోగవిభావితమనముల – బాగుగ వీక్షింతు; రట్టిపరము భజింతున్. 80

సీ. సర్వాగమామ్నాయజలధికి, నపవర్గమయునికి, నుత్తమమందిరునకు,
సకలగుణారణిచ్ఛన్నబోధాగ్నికిఁ, దనయంత రాజిల్లుధన్యమతికి,
గుణలయోద్దీపితగురుమానసునకు, సంవర్తితకర్మనిర్వర్తితునకు,
దిశ లేని నాబోఁటిపసులపాపంబు లడఁచువానికి, సమస్తాంతరాత్ముఁ
ఆ. డై వెలుంగువాని, కచ్ఛిన్నునకు, భగ-వంతునకుఁ, దనూజపశునివేశ
దారసక్తులయినవారికిఁ గానఁగ రాని-వాని, కాచరింతు వందనములు. 81

వ. మఱియును. 82

సీ. నరధర్మకామార్థవర్జితకాములై విబుధు లెవ్వాని సేవించి, యిష్ట
గతిఁ బొందుదురు? చేరఁ గాంక్షించువారి కవ్యయదేహ మిచ్చు నెవ్వాఁడు కరుణ?
ముక్తాత్ము లెవ్వని మునుకొని చింతింతు? రానందవార్ధి మగ్నాంతరంగు
లేకాంతు లెవ్వని నేమియుఁ గోరక భద్రచరిత్రంబుఁ బాడుచుందు?
ఆ. రామహేశు, నాద్యు, నవ్యక్తు, నధ్యాత్మ-యోగగమ్యుఁ, బూర్ణు, నున్నతాత్ము
బ్రహ్మమయినవానిఁ, బరుని, నతీంద్రియు-నీశు స్థూలసూక్ష్ము నే భజింతు." 83

వ. అని మఱియు నిట్లని వితర్కించె. 84

సీ. పావకుం డర్చుల, భానుండు దీప్తుల, నెట్లంగి [2]నిగిడింతు? రెట్లడంతు?
రాక్రియ నాత్మకరావళిచేత బ్రహ్మాదుల, వేల్పుల, నఖిలజంతు
గణముల, జగముల, ఘననామరూపభేదములతో మెఱయించి, తగ నడంచు?
నెవ్వఁడు మనము బుద్ధీంద్రియములుఁ దాన యై గుణసంప్రవాహంబు నెఱపు?
తే. స్త్రీనపుంసకపురుషమూర్తియును గాక-తిర్యగమరనరాదిమూర్తియును గాక
కర్మగుణభేదసదసత్ప్రకాశి గాక-వెనుక నన్నియుఁ దా నగువిభుఁ దలంతు. 85

క. కలఁ డందురు దీనులయెడఁ;-గలఁ డందురు పరమయోగిగణములపాలం;
గలఁ డందు రన్నిదిశలను;-గలఁడు; కలం డనెడువాఁడు గలఁడో? లేఁడో? 86

సీ. కలుగఁడే నాపాలికలిమి సందేహింపఁ గలిమిలేములు లేక కలుగువాఁడు?
నాకడ్డపడ రాఁడె నలి నసాధువులచేఁ బడిన సాధుల కడ్డపడెడువాఁడు?
చూడఁడే నాపాటుఁ జూపులఁ జూడక చూచువారలఁ గృపఁ జూచువాఁడు?
లీలతో నామొఱాలింపఁడే [3]మొఱఁగులమొఱ లెఱుంగుచుఁ దన్నుమొఱఁగువాఁడు?

1. ఒక్కఁడుగా నుండువాఁడు. 2. వ్యాపింపఁజేయుదురు. 3. మొఱలు పెట్టువారు.

తే. అఖిలరూపముల్ దనరూపమైనవాఁడు-ఆదిమధ్యాంతములు లేక యడరువాఁడు,
భక్తజనములదీనులపాలివాఁడు-వినఁడె? చూడఁడె? తలఁపడె? వేగ రాఁడె! 87

క. విశ్వకరు విశ్వదూరుని - విశ్వాత్ముని విశ్వవేద్యు విశ్వు నవిశ్వున్
శాశ్వతు నజు బ్రహ్మప్రభు-నీశ్వరునిం బరమపురుషు నే భజియింతున్." 88

వ. అని పలికి, తనమనంబున నగ్గజేంద్రుం డీశ్వరసన్నిధానంబు కల్పించుకొని యిట్లనియె. 89

శా. "లా వొక్కింతయు లేదు; ధైర్యము విలోలం బయ్యెఁ; బ్రాణంబులుం
[1]ఠావుల్ దప్పెను; మూర్ఛ వచ్చెఁ; దనువుం డస్సెన్, శ్రమం బయ్యెడిన్;
నీవే తప్ప నితఃపరం బెఱుఁగ; మన్నింపం దగుం దీనునిన్;
రావే యీశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా! 90

క. విను[2]దఁట జీవులమాటలు?-చనుదఁట చనరానిచోట్ల? శరణార్థుల "కో"
యను దఁట? పిలిచిన సర్వముఁ-గను దఁట? సందేహ మయ్యెఁ గరుణావార్ధీ! 91

ఉ. ఓకమలాప్త! యోవరద! యోప్రతిపక్షవిపక్షదూర! కు
య్యో! కవియోగివంద్య! సుగుణోత్తమ! యోశరణాగ[3]తామరా
నోకహ! యోమునీశ్వరమనోహర! యోవిమలప్రభావ! రా
వే! కరుణింపవే! తలఁపవే! శరణార్థిని నన్నుఁ గావవే!" 92

వ. అని పలికి, మఱియు "నరక్షితరక్షకుం డైన యీశ్వరుం డాపన్నుం డైన నన్నుం గాంచుఁ గాక!" యని నింగి నిక్కి చూచుచు, నిట్టూర్పులు నిగిడించుచు, బయ లాలకించుచు, నగ్గజేంద్రుండు మొఱ సేయుచున్న సమయంబున. 93

ఆ. విశ్వమయత లేమి, వినియు నూరక యుండి-రంబుజాసనాదు లడ్డపడక ;
విశ్వమయుఁడు విభుఁడు విష్ణుండు జిష్ణుండు-భక్తియుతున కడ్డపడఁ దలంచె. 94

మ. అల వైకుంఠపురంబులో నగరిలో నామూలసౌధంబు దా
పల మందారవనాంతరామృతసరఃప్రాంతేందుకాంతోపలో
త్పలపర్యంకరమావినోది యగు నాపన్న ప్రసన్నుండు వి
హ్వలనాగేంద్రము "పాహి పాహి" యనఁ గుయ్యాలించి సంరంభియై. 95

మ. సిరికిం జెప్పఁడు, శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁ; డే
పరివారంబును జీరఁ;[4]డభ్రగపతిం బన్నింపఁ; డాకర్ణికాం
తరధమ్మిల్లముఁ జక్క నొత్తఁడు; వివాదప్రోత్థితశ్రీకుచో
పరిచేలాంచల మైన వీడఁడు; గజప్రాణావనోత్సాహి యై. 96

1. స్థానములు. 2. సందేహమును దెల్పుపదము. 3. కల్పవృక్షమువంటివాఁడు.
4. పక్షిరాజు = గరుడుఁడు.

వ. ఇట్లు భక్తజనపాలనపరాయణుండును నిఖిలజంతుహృదయారవిందసదనసంస్థితుండును నగు నారాయణుండు కరికులేంద్రవిజ్ఞాపితనానావిధదీనాలాపంబు లాకర్ణించి, లక్ష్మీకాంతావినోదంబులం దగులు సాలించి, సంభ్రమించి, దిశలు నిరీక్షించి, గజేంద్రరక్షాపరత్వంబు నంగీకరించి, నిజపరికరంబు మరల నవధరించి, గగనంబున కుద్గమించి వేంచేయునప్పుడు. 97

మ. తన వెంటన్ సిరి, లచ్చి వెంట [1]నవరోధవ్రాతమున్, దాని వె
న్కను బక్షీంద్రుఁడు, వాని పొంతను ధనుఃకౌమోదకీశంఖచ
క్రనికాయంబును, నారదుండు, ధ్వజినీకాంతుండు, రా వచ్చి రొ
య్యన వైకుంఠపురంబునం గలుగు వా రాబాలగోపాలమున్. 98

వ. తదనంతరంబ ముఖారవిందమకరందబిందుసందోహపరిష్యందమానానందదిందిందిరయగు నయ్యిందిరాదేవి గోవిందకరారవిందసమాకృష్యమాణసంవ్యానచేలాంచలయయి పోవుచు. 99

మ. "తన వేంచేయుపదంబుఁ బేర్కొనఁ; డనాథస్త్రీజనాలాపముల్
వినెనో? మ్రుచ్చులు మ్రుచ్చిలించిరొ? ఖలుల్ వేదప్రపంచంబులన్?
దనుజానీకము దేవతానగరిపై దండెత్తెనో? భక్తులం
గని చక్రాయుధుఁ డేడి? చూపుఁ డని ధిక్కారించిరో దుర్జనుల్." 100

వ. అని వితర్కించుచు. 101

శా. తాటంకాచలనంబుతో [2]భుజనటద్ధమ్మిల్లబంధంబుతో
శాటీముక్తకుచంబుతో నదృఢచంచత్కాంచితో శీర్ణలా
లాటాలేపముతో మనోహరకరాలగ్నోత్తరీయంబుతోఁ
గోటీందుప్రభతో నురోజభరసంకోచద్విలగ్నంబుతోన్. 102

క. "అడిగెద నని కడువడిఁ జను; నడిగినఁ దను మగుడ నుడుగఁ డని నడ యుడుగున్;
వెడవెడ చిడిముడి తడఁబడ-నడుగిడు; నడుగిడదు; జడిమ నడుగిడు నెడలన్.

సీ. నిటలాలకము లంటి నివుర జుంజుమ్మని ముఖసరోజము నిండ ముసరుఁ దేంట్లు;
నళులఁ జోఁపఁగఁ జిల్క లల్ల నల్లన చేరి యోష్ఠబింబద్యుతు లొడియ నాలుకు;
శుకములఁ దోలఁ జక్షుర్మీనములకు మందాకినీ[3]పాఠీనలోక మెసఁగు;
మీనపంక్తుల దాఁట మెయిదీఁగతో రాయ శంపాలతలు మింట సరణి గట్టు;
ఆ. శంపలను జయింపఁ జక్రవాకంబులు-కుచయుగంబుఁ దాఁకి క్రొవ్వు సూపు;
మెలఁత మొగిలుపిఱిఁది మెఱుఁగుఁదీవయుఁబోలె-జలదవర్ణు వెనుకఁ జనెడునపుడు.

1. అంతఃపురమునందలి వారిసముదాయము. 2. భుజములందు ఎగురుచున్న కొప్పుముడితో.
3. చేపలు.

మ. వినువీథిం జనుదేరఁ గాంచి రమరుల్ విష్ణున్, సురారాతిజీ
వనసంపత్తినిరాకరిష్ణుఁ, గరుణావర్ధిష్ణు, యోగీంద్రహృ
ద్వనవర్తిష్ణు, సహిష్ణు, భక్తజనబృందప్రాభవాలంకరి
ష్ణు, నవోఢోల్లసదిందిరాపరిచరిష్ణున్, జిష్ణు, రోచిష్ణునిన్. 105

వ. ఇట్లు పొడగని. 106

మ. "చనుదెంచెన్ ఘనుఁ డల్లవాఁడె! హరి[1] పజ్జం గంటిరే లక్ష్మి? శం
ఖనినాదం బదె; చక్ర మల్లదె; భుజంగధ్వంసియున్ వాఁడె; క్ర
న్నన యేతెంచె" నటంచు వేల్పులు "నమోనారాయణా"యేతిని
స్వను లై మ్రొక్కిరి మింట హస్తిదురవస్థావక్రికిం జక్రికిన్. 107

వ. అయ్యవసరంబునఁ గుంజరేంద్రపాలనపారవశ్యంబున దేవతానమస్కారంబు లంగీకరింపక, మనస్సమానసంచారుం డై పోయి పోయి, కొంతదూరంబు శింశుమారచక్రంబునుంబోలె గురుమకరకుళీరమీనమిథునం బై, కిన్నరేంద్రుని భాండాగారంబునుంబోలె స్వచ్ఛవర[2]కచ్ఛపం బై, భాగ్యవంతునిభాగధేయంబునుంబోలె సరాగజీవనం బై, వైకుంఠంబునుంబోలె శంఖచక్రకమలాలంకృతం బై, సంసారచక్రంబునుంబోలె ద్వంద్వసంకులపంకసంకీర్ణం బై యొప్పు నప్పంకజాకరంబుఁ బొడగని. 108

శ్రీ మహావిష్ణువు మకరిని సంహరింపఁ జక్రము బంపుట.

మ. కరుణాసింధుఁడు శౌరి వారిచరమున్ ఖండింపఁగాఁ బంపె; స
త్వరితాకంపితభూమిచక్రము, మహోద్యద్విస్ఫులింగచ్ఛటా
పరిభూతాంబరశుక్రమున్, బహువిధబ్రహ్మాండభాండచ్ఛటాం
తరనిర్వక్రముఁ బాలితాఖిలసుధాంధశ్చక్రముం జక్రమున్. 109

వ. ఇట్లు పంచిన. 110

శా. అంభోజాకరమధ్యనూతననళిన్యాలింగనక్రీడనా
రంభుం డైన వెలుంగుఱేని చెలువారన్ వచ్చి, నీటన్ గుభుల్
గుంభధ్వానముతోఁ, గొలంకువు గలంకం బొందఁగాఁ జొచ్చి, దు
ష్టాంభోవర్తి వసించు[3]చక్కటికి డాయం బోయి, హృద్వేగ మై. 111

శా. భీమం బై తలఁ ద్రుంచి, ప్రాణములఁ బాపెం జక్ర మాశుక్రియన్;
హేమక్ష్మాధరదేహముం జకితవన్యేభేంద్రసందోహముం
గామక్రోధనగేహమున్ గరటిరక్తస్రావగాహంబు ని
స్సీమోత్సాహము వీతదాహము జయశ్రీమోహమున్ గ్రాహమున్. 112

1. దగ్గఱ. 2. తాఁబేలు, నిధి. 3. సమీపమునకు.

వ. ఇట్లు నిమిషస్పర్శంబున సుదర్శనంబు మకరితలఁ ద్రుంచునవసరంబున. 113

క. [1]మకర మొకటి రవిఁ జొచ్చెను-[2]మకరము మఱియొకటి ధనదుమాటున డాఁగెన్;
మకరాలయమునఁ దిరిగెడు-మకరంబులు కూర్మరాజు మఱువున కరిగెన్. 114

మ. తమముం బాసినరోహిణీవిభు క్రియన్, దర్పించి సంసారదుః
ఖము వీడ్కొన్నవిరక్తచిత్తునిగతిన్, గ్రాహంబుపట్టూడ్చి, పా
దములల్లార్చి, కరేణుకావిభుఁడు సౌందర్యంబుతో నొప్పె సం
భ్రమదాశాకరిణీకరోక్షితసుధాంభస్స్నానవిశ్రాంతుఁడై. 115

శా. పూరించెన్ హరి పాంచజన్యముఁ, గృపాంభోరాశిసౌజన్యమున్,
భూరిధ్వానచలాచలీకృతమహాభూతప్రచైతన్యమున్,
సారోదారశితప్రభాచకితపర్జన్యాదిరాజన్యమున్,
దూరీభూతవిపన్నదైన్యమును నిర్ధూతద్విషత్సైన్యమున్. 116

మ. మొరసెన్ నిర్జరదుందుభుల్; జలరుహామోదంబులై వాయువుల్
దిరిగెం, బువ్వులవానజల్లు గురిసెన్; దేవాంగనాలాస్యముల్
పరఁగెన్ దిక్కులయందు; జీవజయశబ్దధ్వానముల్ నిండె; సా
గరముప్పొంగెఁ దరంగచుంబితనభోగంగాముఖాంభోజమై. 117

క. నిడుద యగు కేల గజమును-మడువున వెడలంగఁ దిగిచి, మదజలరేఖల్
దుడుచుచు మెల్లన పుడుకుచు-నుడిపెన్ విష్ణుండు దుఃఖ ముర్వీనాథా! 118

క. శ్రీహరికరసంస్పర్శను - దేహము దాహంబు మాని, ధృతిఁ గరిణీసం
దోహంబుఁ దాను గజపతి-మోహనఘీంకారశబ్దములతో నొప్పెన్. 119

క. కరమున మెల్లన నివురుచుఁ-గర మనురాగమున మెఱసి, కలయం బడుచుం
గరి హరికతమున బ్రదుకుచుఁ-గరపీడన మాచరించెఁ గరిణుల మరలన్. 120

సీ. జననాథ! దేవలశాపవిముక్తుఁడై, పటుతరగ్రాహరూపంబు మాని,
ఘనుఁడు హూహూనామగంధర్వుఁ డప్పుడు దనతొంటినిర్మలతనువుఁ దాల్చి,
హరికి నవ్యయునకు నతిభక్తితో మ్రొక్కి, తవిలి కీర్తించి, గీతములు పాడి
యాదేవుకృపనొంది, యందంద మఱియును వినతశిరస్కుఁడై, వేడ్కతోడ
ఆ. దళితపాపుఁ డగుచుఁ దనలోకమున-కేఁగె; నపుడు శౌరి కేల నంటి నడవ
హస్తిలోకనాథుఁ డజ్ఞానరహితుఁడై-విష్ణురూపుఁ డగుచు వెలుఁగుచుండె.

మ. అవనీనాథ! గజేంద్రుఁ డామకరితో నాలంబు గావించె; ముక [illegible]
ద్రవిళాధీశుఁ డతండు, పుణ్యతముఁ, డింద్రద్యుమ్ననాముండు, వై [illegible]

1. మొసలి 2. నిధులలో నొకటి. శ్రీహరికర సంస్పర్శను. పా-

ష్ణవముఖ్యుండు, గృహీతమౌననియతిన్ సర్వాత్ము నారాయణున్
సవిశేషంబుగఁ బూజ సేసెను మహాశైలాగ్రభాగంబునన్.

మ. ఒకనాఁ డానృపుఁ డచ్యుతున్ మనములో నూహించుచున్, మౌని యై
యకలంకస్థితి నున్నచోఁ, [1]కలశజుం డచ్చోటికిన్ వచ్చి; లే
వక పూజింపక యున్నమౌనిఁ దను, నవ్యక్రోధుఁ డై, ''మూఢలు
బ్ధకరీంద్రోత్తమయోనిఁ బుట్టు''మని శాపం బిచ్చె భూవల్లభా! 123

క. మునిపతి నవమానించిన-ఘనుఁ డింద్రద్యుమ్నవిభుఁడు గౌంజరయోనిం
జననం బందెను; విప్రులఁ-గని యవమానింపఁ దగదు ఘనపుణ్యులకున్. 124

క. కరినాథుఁ డయ్యె నాతఁడు; కరు లైరి భటాదులెల్ల; గజముగ నయ్యున్
హరిచరణసేవకతమునఁ-గరివరునకు నధికముక్తి గలిగె మహాత్మా! 125

ఆ. కర్మతంత్రుఁ డగుచుఁ గమలాక్షుఁ గొల్చుచు-నుభయనియతవృత్తి నుండెనేనిఁ
జెడును గర్మ మెల్ల శిథిలమై మెల్లన; ప్రబల మైనవిష్ణుభక్తి చెడదు. 126

క. చెడుఁగరులుహరులుధనములుఁ-జెడుదురునిజసతులుసుతులుఁ; జెడుచెనఁటులకుం
జెడక మనునట్టిగుణమునకుఁ, జెడనిదార్థములు విష్ణుసేవానిరతుల్. 127

వ. అప్పుడు జగజ్జనకుండగునప్పరమేశ్వరుండు దరహాసితముఖకమలయగునక్కమల
కిట్లనియె. 128

క. ''బాలా! నా వెనువెంటను-[2]హేలన్ వినువీథినుండి యేతెంచుచు, నీ
చేలాంచలంబుఁ బట్టుట-కాలో నేమంటి నన్ను? నంభోజముఖీ!

క. ఎఱుఁగుదు తెఱవా! యెప్పుడు, మఱవను సకలంబు; నన్ను మఱచినయెడలన్
మఱతు; నని యెఱిఁగి, మొఱఁగక-మఱవక మొఱయిడిర యేనిమఱియన్యములన్.''

వ. అని పలికిన నరవిందమందిర యగునయ్యిందిరాదేవి మందస్మితచంద్రికాసుందర
వదనారవింద యగుచు [3]ముకుందున కిట్లనియె. 131

క. ''దేవా! దేవరయడుగులు, భావంబున నిలిపి కొలుచుపని నాపని గా
కోవల్లభ! యేమనియెద? నీ వెంటను వచ్చుచుంటి నిఖిలాధిపతీ! 132

క. దీనుల[4]కుయ్యాలింపను,-దీనుల రక్షింప, మేలు దీవనఁ బొందన్,
దీనావన! నీ కొప్పును;-దీనపరాధీన! దేవదేవ! మహేశా'' 133

వ. అని మఱియును సముచితసంభాషణంబుల నంకించుచున్న యప్పరమవైష్ణవీ
రత్నంబును సాదరసరససల్లాపమందహాసపూర్వకంబుగా నాలింగనంబు
గావించి, సపరివారుండై గరుడగంధర్వసిద్ధవిబుధగణజేగీయమానుండై,

---

1. అగస్త్యుఁడు. 2. వేడుకతో. 3. మోక్షము నిచ్చువాఁడు-విష్ణువు. 4. మొఱవినుటకు.

గరుడారూఢుండగుచు నిజసదనంబునకుం జనియె; నని చెప్పి, శుకయోగీంద్రుం
డి ట్లనియె. 134

సీ. ''నరనాథ! నీకును నాచేత వివరింపఁబడినయీకృష్ణానుభావ మైన
గజరాజమోక్షణకథ వినువారికి యశము లిచ్చును; గల్మషాపహంబు;
దుస్స్వప్ననాశంబు; దుఃఖసంహారంబుఁ; బ్రొద్దున మేల్కాంచి [1]పూతవృత్తి
నిత్యంబుఁ బఠియించునిర్మలాత్మకులైన విప్రులకును బహువిభవ మమరు;
తే. సంపదలు గల్గుఁ; బీడలు శాంతిఁ బొందు-సుఖము సిద్ధించు; వర్ధిల్లు శోభనములు;
మోక్షమఱచేతిదై యుండు;ముదము చేరు-ననుచువిష్ణుండు ప్రీతుఁడై యానతిచ్చె.''

వ. అని మఱియు నప్పరమేశ్వరుం డిట్లని యానతిచ్చె; ''నెవ్వరేని నపరరాత్రాంతంబున మేల్కాంచి, సమాహితమనస్కులయి నన్నును, నిన్నును, నీసరోవరంబును, శ్వేతద్వీపంబును, నాకుం బ్రియంబైనసుధాసాగరంబును, హేమనగంబును, నిగ్గిరికందరకాననంబులను, వేత్రకీచకవేణులతాగుల్మసురపాదపంబులను, నేనును, బ్రహ్మయు, ఫాలలోచనుండును నివసించియుండునక్కొండశిఖరంబులను, కౌమోదకీ కౌస్తుభ సుదర్శన పాంచజన్యంబులను, శ్రీదేవిని, శేష గరుడ వాసుకి ప్రహ్లాద నారదులను, మత్స్యకూర్మవరాహాద్యవతారంబులను, దదవతార కృతకార్యంబులను, సూర్య సోమపావకులను, బ్రణవంబును, ధర్మ తపస్సత్యంబులను, వేదంబును, వేదాంగంబులను, శాస్త్రంబులను, గో భూసుర సాధు పతివ్రతాజనంబులను, జంద్ర కాశ్యపజాయాసముదయంబును, గౌరీ గంగా సరస్వతీ కాళిందీ సునందా ప్రముఖపుణ్యతరంగిణీనిచయంబును, నమరులను, నమరతరువులను, నైరావతంబును, నమృతంబును, ధ్రువుని, బ్రహ్మర్షినివహంబును, బుణ్యశ్లోకులయినమానవులను, [2]సమాహితచిత్తులై తలంతురు; వారలకుఁ బ్రాణావసానకాలంబున మదీయం బగువిమలగతి నిత్తు;'' నని హృషీకేశుండు నిర్దేశించి, శంఖంబు పూరించి, సకలామరవందితచరణారవిందుండై విహంగ[3]పరివృఢవాహనుండై వేంచేసె;విబుధానీకంబు సంతోషించె;'' నని చెప్పి శుకుండు రాజునకిట్లనియె. 136

క. ''గజరాజమోక్షణంబును - నిజముగఁ బఠియించునట్టినియతాత్ములకుఁ
గజరాజవరదుఁ డిచ్చును - గజతురగస్యందనములుఁ, గైవల్యంబున్. 137

క. తామసుతమ్ముఁడు రైవత-నామకుఁడై వెలసె మనువు; నలువురమీఁదం
భూమికిఁ, * బ్రతివింధ్యార్జున-నామాదులు, నృపులు మనువునందనులు నృపా!

1. నిర్మలమయిన ప్రవర్తనముతో. 2. నిశ్చలమయిన మనస్సుగలవారు. 3. అధిపతి-రాజు.
* 'బలివింధ్య' అని మూలగ్రంథము పాఠము.

సీ. మునులు హిరణ్యరోముఁడు నూర్ధ్వబాహుండు వేదశీర్షుండనువీరు మొదలు;
నమరులు భూతరయాదులు; శుభ్రునిపత్ని వికుంఠాఖ్య పరమసాధ్వి
యాయిద్దఱకుఁ బుత్రుఁ డై తనకళలతో వైకుంఠుఁ డనఁ బుట్టి, వారిజాక్షుఁ
డవనిపై వైకుంఠ మనియెడిలోకంబుఁ గల్పించె; నెల్లలోకములు మ్రొక్క-
తే. రమయెదుర్కోలు సేకొనె; రాజముఖ్య!-తదనుభావంబుగుణములుఁదలఁపఁదరమె?
యీధరారేణుపటలంబు నెఱుఁగవచ్చు-గాని రాదయ్య! హరిగుణగణముసంఖ్య.

వ. తదనంతరంబ. 140

సీ. చక్షుస్తనూజుండు చాక్షుషుం డనువీఁడు దాఱవమను వయ్యె; నవనినాథ!
భూమీశ్వరులు * పురుపురుషసుద్యుమ్నాదు లాతనినందను; లమరవిభుఁడు
మంత్రద్యుమాఖ్యుఁ; డమర్త్యు లాప్యాదిక; లాహవిష్మద్వీరకాదిఘనులు
మును; లందు విభుఁడు సంభూతికి వైరాజునకుఁ బుట్టి యజితుండు నాఁగ నొప్పె;
ఆ. నతఁడ కాఁడె కూర్మమై మందరాద్రిని-నుదధిజలములోన నుండి మోచె?
నతఁడ చువ్వె దివిజు లర్థింప నమృతాబ్ధిఁ ద్రచ్చి యిచ్చె నాసుధారసంబు?" 141

క్షీరసాగరమథనకథాప్రారంభము

వ. అని పలికినఁ బరీక్షిన్నరేంద్రుండు మునీంద్రున కిట్లనియె. 142

మ. "విను మున్నేటికిఁ ద్రచ్చెఁ బాలకడలిన్ విష్ణుండు? కూర్మాకృతిన్
వనధిం జొచ్చి, య దెట్లు మోచె? బలుకవ్వం బైనశైలంబు? దే
వనికాయం బమృతంబు నెట్లు వడసెన్? వారాశి నేమేమి సం
జనితం బయ్యె! మునీంద్ర! చోద్యము గదా? సర్వంబుఁ జెప్పంగదే! 143

క. అప్పటనుండి బుధోత్తమ!-చెప్పెడుభగవత్కథావిశేషంబులు నా
కెప్పుడుఁ దనివి జనింపదు-సెప్పఁ గదే చెవులు నిండ శ్రీహరికృతముల్."

వ. అని మఱియు నడుగంబడినవాఁ డై యతని నభినందించి, హరిప్రసంగంబు చెప్ప నుపక్రమించె; నని సూతుండు ద్విజుల కిట్లనియె; నట్లు శుకుండు రాజుం జూచి. 145

క. "కసిమసఁగి యసురవిసరము-లసిలతికల సురల నెగవ నసువులు వెడలం
బసఁ జెడిరి; పడిరి; కెడసిరి-యసమసమరవిలసనముల నను ♦ వెడలి నృపా!

క. సురపతివరుణాదులతో-సురముఖ్యులు గొంద ఱరిగి సురశైలముపై
సురనుతుఁ డగునజుఁ గనియా-సురదుష్కృతిఁ జెప్పి రపుడు పొలయుచు నతులై.

---

* 'పూరుపూరుష'—'మంత్రద్రుమ'—అని మూలగ్రంథరూపములు.

♦ 'అను వెడలి' అని పూ. ము. ప్రాసము రక్షితమైనను పునరుక్తిదోషము. 'అసమెడలి' అని యుండఁబోలును.

క. దుర్వాసు శాపవశమున-నిర్వీర్యత జగము లెల్ల నిశ్శ్రీకము లై
పర్వతరిపుతోఁ గూడ న-పర్వము లయి యుండె హతసుపర్వావళు లై. 148

ఆ. నెలవు వెడలి వచ్చి, నిస్తేజు లై నట్టి-వేల్పుగములఁ జూచి, వేల్పుఁబెద్ద
పరమపురుషుఁ దలఁచి, ప్రణతుఁ డై సంఫుల్ల-పద్మవదనుఁ డగుచుఁ బలికెఁ దెలియ.

క. ఏనును మీఁదను గాలము-మానవతిర్యగ్లతాద్రుమస్వేదజముల్
మానుగ నెవ్వనికళలము-వానికి మ్రొక్కెదము గాక వగవఁగ నేలా? 150

క. వధ్యుండు రక్షణీయుఁడు-సాధ్యుఁడు మాన్యుఁ డని లేక సర్గత్రాణా
వధ్యాదు లొనర్చునతం-[1]డాద్యంతవిధానమునకు నర్హుఁడు మనకున్. 151

క. వరముని బరము జగద్గురుఁ-గరుణాపరతంత్రు మనము గనుఁగొన దుఃఖ
జ్వరములు చెడు నని సురలకు-సరసిజజని చెప్పి యజితుసదనంబునకున్. 152

వ. తానును దేవతాసమూహంబును నతిరయంబునం జని, వినయంబునఁ గానం బడనియవ్విభు నుద్దేశించి, దైవికంబు లగువచనంబుల నియతేంద్రియుఁడై యిట్లని స్తుతియించె. 153

సీ. ఎవ్వనిమాయకు నింతయు మోహించుఁ? దఱిమి యెవ్వనిమాయ దాఁటరాదు?
తనమాయ నెవ్వఁ డింతయు గెల్చినట్టివాఁ? డెవ్వనిఁ బొడగాన రెట్టిమునులు?
సర్వభూతములకు సమవృత్తి నెవ్వఁడు చరియించుఁ; దనచేత జనిత మయిన?
ధరణిపాదములు, చిత్తముసోముఁ, డగ్నిముఖంబు, గన్నులు సోమకమలహితులు,
తే. చెవులు దిక్కులు, రేతంబు సిద్ధజలము-మూఁడు మూర్తులపుట్టిల్లు మొదలినెలవు,
గర్భమఖిలంబు, మూర్ధంబుగగన, మగుచు-మలయు నెవ్వఁడు? వానినమస్కరింతు.

వ. మఱియు నెవ్వనిబలంబున మహేంద్రుండును, బ్రసాదంబున దేవతలును, గోపంబున రుద్రుండును, బరుషంబున విరించియు, నింద్రియంబులవలన వేదంబులును మునులును, మేఢ్రంబునఁ బ్రజాపతియును, వక్షంబున లక్ష్మియు, ఛాయవలనఁ బితృదేవతలును, స్తనంబులవలన ధర్మంబును, బృష్ఠంబులవలన నధర్మంబును, శిరంబువలన నాకంబును, విహారంబువలన నప్సరోజనంబులును, ముఖంబువలన విప్రులను, గుహ్యంబున బ్రహ్మంబును, భుజంబులవలన రాజులును బలంబును, నూరువులవలన వైశ్యులును నైపుణ్యంబును, బదంబులవలన శూద్రులును నవేదంబును, నధరంబున లోభంబును, నుపరిరదచ్ఛదంబువలనఁ బ్రీతియు, నాసాపుటంబువలన ద్యుతియు, స్పర్శంబునఁ గామంబును,

---

1. మనోవ్యాధిని బోఁగొట్టుకార్యమునకు. ఈ పద్యపాఠము కొంతవఱకు మూలానుసారి. కొన్ని ప్రా. ము. లలో నెల్ల నీ క్రింది పాఠమున్నది.

క. ఆద్యుండు రక్షకుండు న-నామ్యుఁడు మాన్యుండు లోకసర్గత్రాణాం
తాద్యాదు లొనర్చునతం-డాద్యంత విధానములకు నర్హుఁడు మనకున్.

భ్రూయుగళంబున యమంబును, బక్షంబునఁ *గాలంబును సంభవించె, నెవ్వని
యోగమాయావిహితంబులు ద్రవ్యవయఃకర్మగుణవిశేషంబులు, చతుర్విధ
సర్గం బెవ్వనియాత్మతంత్రం బెవ్వని వలన సిద్ధించిలోకంబులును లోకపాలురును
బ్రదుకుచుందురు, పెరుగుచుందురు, దివిజులకు నాయువు సంధంబు బలంబు
నై, నగంబులకు నీశుండై, ప్రజలకుఁ బ్రజనుండై, ప్రజావనక్రియాకాండ
నిమిత్తసంభవుం డగుజాతవేదుం డై, యంతస్సముద్రంబున ధాతుసంఘాతం
బులం బ్రపంచించుబ్రహ్మమయుండై ముక్తిద్వారంబై యమృతమృత్యుస్వరూ
పుండై చరాచరప్రాణులకుఁ బ్రాణంబై యోజస్సహోబలవాయురూపంబులైన
ప్రాణేంద్రియాత్మశరీరనికేతనుండై పరమమహాభూతి యగునప్పరమేశ్వరుండు
మాకుం బ్రసన్నుండగుం గాక! యని మఱియును. 155

క. మొదల జలమిడిన భూజము-దుది నడుమను జల్లదనము దొరకొనుమాడ్కిన్
మొదలను హరికిని మ్రొక్కిన-ముద మొందుదు మెల్లవేల్పుమూకలు నేనున్.

క. ఆపన్నులగుదివ్యఋషుల-కోపుణ్యా! భవన్ముఖాబ్జ మొయ్యన తఱితోఁ
బ్రాపింపఁ జేయు సంపద;-నోపరమదయానివాప! యుజ్జ్వలతేజా!" 157

వ. అని యిట్లు దేవగణసమేతుండై యనేకవిధంబుల గీర్తించుచున్నపరమేష్ఠి
యందుఁ గరుణించి, దయాగరిష్ఠుం డగువిశ్వగర్భుం డావిర్భవించె. 158

మ. ఒకవేయర్కులు గూడి కట్టి కదుపై యుద్యత్ప్రభాభూతితో
నొకరూపై చనుదెంచుమాడ్కి, హరి నా నొప్పారె నావేలుపుల్
వికలాలోకనులై విషణ్ణమతులై విభ్రాంతులై మ్రోలఁ గా
నక శంకించిరి; కొంతప్రొద్దు విభుఁ గానం బోలునే వారికిన్? 159

వ. అప్పుడు. 160

సీ. హారకిరీటకేయూరకుండలపాదకటకకాంచీలతాకంకణాది
కౌస్తుభోపేతంబుఁ, గౌమోదకీశంఖచక్రశరాసనసంయుతంబు,
మరకతశ్యామంబు, సరసిజనేత్రంబుఁ, గర్ణాభరణకాంతిగండయుగముఁ,
గలితకాంచనవర్ణకౌశేయవస్త్రంబు, శ్రీవనమాలికాసేవితంబు,
ఆ. నై మనోహరంబునై దివ్యసౌభాగ్య, మైన యతనిరూపు హర్ష మెసఁగఁ
జూచి బ్రహ్మహరుఁడు సురలును దానును-బొంగి, నమ్రుఁడగుచుఁబొగడఁదొడఁగె.

క. జననస్థితిలయదూరుని,-మునినుతు, నిర్వాణసుఖసముద్రుని, సుగుణుం
[1]దనుతనునిఁ, [2]బృథులపృథులుని,-ననఘాత్ము, మహానుభావు, నభినందింతున్.

* 'వక్షంబున' అని పూర్వముద్రణములు. 'పక్షంబున' అనియున్నచో మూలానుకూలమగును.

1. సూక్ష్మమయినవానిలో సూక్ష్ముడు. 2. గొప్పవారిలో గొప్పవాఁడు. అణోరణీయాన్ మహతోమహీయాన్.

క. పురుషోత్తమ! నీరూపము-పరమశ్రేయంబు భువనపంక్తుల కెల్లన్
స్థిరవైదిక యోగంబున-వరుసను మీాయంద కానవచ్చెను మాకున్. 163

క. మొదలును నీలోఁ దోఁచెను-దుదియును నటఁ దోఁచె, నడుము దోఁచెను, నీవే
మొదలు,నడుము,దుది,సృష్టికి-గదియఁగఘటమునకు మన్నుగతియగుమాడ్కిన్.

క. నీమాయచేత విశ్వము-వేమాఱు సృజింతువనుచు, విష్ణుఁడవనుచున్
ధీమంతులు గుణపదవిని-నేమంబున సగుణుఁడైననినుఁ గాంతు రొగిన్. 165

ఆ. అన్న మవనియందు, నమృతంబు గోవుల-యందు, వహ్ని సమిధలందు, నమర
యోగవశతఁ బొందునోజను, బుద్ధిచే-నగుణు నిన్నుఁ గాంతు రాత్మవిదులు.

మత్తకోకిలము. పట్టు లేక బహుప్రకారవిపన్నచిత్తుల మైతి; మే
మెట్టకేలకు నిన్నుఁ గంటి; మభీప్సితార్థము వచ్చుఁ; బె
న్వెట్ట యైనదవానలంబున వేఁగునేనుఁగు మొత్తముల్
నిట్ట లేచిన గంగలోపల నీరు గాంచినచాడ్పునన్. 167

మత్తకోకిలము. నీకు నేమని విన్నవింతుము; నీవు సర్వమయుండ వై
లోక మెల్లను నిండి యుండఁగ లోకలోచన! నీపదా
లోకనంబు శుభంబు మాకును లోకపాలకు లేను నీ
నాకవాసులు నీవ; వహ్నిఁ దనర్చు[1] కేతుతతిక్రియన్." 168

వ. అని కమలసంభవప్రముఖులు వినుతిసేసి" రని చెప్పి నరేంద్రునకు శుకుం డిట్లనియె.

శా. "ఈరీతిం జతురాననాదినుతుఁడై యేపార జీమూతగం
భీరంబై నరవంబునం బలికె సంప్రీతాత్ముఁడై యీశ్వరుం;
డారోమాంచితకాయులన్ నవవిముక్తాపాయులం బ్రేయులం
బ్రారబ్ధోగ్రమహార్ణవోన్మథనవాంఛానల్పులన్ వేల్పులన్. 170

క. "ఓనలువ! యోసురేశ్వర!-యోనిటలతటాక్ష! యోసురోత్తములారా!
దానవులతోడ నిప్పుడు-మానుగఁ బోరామి గలిమి మనుటే యొప్పున్. 171

వ. అది యెట్లంటి రేని. 172

క. ఎప్పుడు దనకును సత్త్వము-సొప్పడు, నందాఁక రిపులఁ జూచియుఁ దనమైఁ
గప్పికొని యుండవలయును- నొప్పుగ నహి మూషకమున కొదిగినభంగిన్.

క. అమృతోత్పాదనయత్నము-విమలమతిం జేయుటొప్పు; వేల్పులు! వినుఁడీ!
యమృతంబుఁ ద్రావి జంతువు-లమృతగతిన్ బ్రదుకుచుండు నాయుర్వృద్ధిన్.

---

1. మంటలసముదాయమువలె.

సీ. పాలమున్నీటిలోపల సర్వతృణలతౌషధములు దెప్పించి, చాల నైచి,
మందరశైలంబు మంథానముగఁ జేసి, తనర వాసుకిఁ దరిత్రాడు సేసి,
నాసహాయత చేత నలి నందఱును మీరు తరువుఁడు వేగ నతంద్రు లగుచు
ఫలము మీఁ దయ్యెడు: బహుళదుఃఖంబులఁ బడుదురు దైత్యులు పాపమతులు;
ఆ. అలస జేమి లేక యఖిలార్థములుఁ గల్గు-[1]విషధిలోన నొక్క విషము పుట్టుఁ;
గలఁగి వెఱవవలదు; కామరోషంబులు-వస్తుచయమునందు వలదు చేయ."

వ. అని యాదేశించి. 176

క. అంతాదిరహితుఁ డచ్యుతుఁ-డంతర్ధానంబు నొందె; నజఫాలాక్షుల్
సంతోషంబునఁ దమతమ, కాంతాలయములకుఁ జనిరి గౌరవ మొప్పన్. 177

క. కయ్యంబు సేయ నొల్లక-నెయ్యంబున నతులు వెట్టి, నిర్జరనికరం
బియ్యప్పనములు పెట్టుచుఁ-దియ్యంబునఁ గొల్చె బలిని దేవద్వేషిన్. 178

క. పస చెడి తనకును వశ మై-సుసరపుగతిఁ గొల్చుచున్న సురసంఘములన్
గసిమసఁగి చంపఁ బూనిన-నసురుల వారించె; బలియు నతినయయుక్తిన్. 179

వ. అట్లు వారించి వైరోచని రాక్షససముదయంబున కిట్లనియె. 180

క. పగవారు శరణువొచ్చిన-మగతనములు నెఱపఁ దగదు మగవారలకున్;
దగుసమయ మెఱుఁగ వలదే?-మగఁటిమిఁ జాటింప వలదమర్త్యులతోడన్. 181

వ. అని పలికి కొలువుకూటంబున సురనికరపరివృతుం డై నిఖిలలోకరాజ్యలక్ష్మీసహితుం డై యఖిలవిబుధవీరవిజయాహంకారనిజాలంకారుం డై సుఖంబునం గొలువున్న విరోచననందనుం గని, శచీవిభుం డుత్తమసచివుండునుం బోలె సాంత్వనవచనంబుల శాంతిం బొందించి, పురుషోత్తమశిక్షితం బైన నీతిమార్గంబున శంబరునికిం బ్రియంబు సెప్పి యరిష్టనేమి ననునయించి త్రిపురవాసు లగుదానవుల నొడంబఱిచి, జంభునిసమ్మతంబు సేకొని, హయగ్రీవునివిగ్రహంబు మాన్పి, నముచితారకబాణాదులతో సఖ్యంబు నెఱపి, విప్రచిత్తికిం బొత్తు హత్తించి, శకుని విరోచన ప్రహేతులకుఁ [2]బోరామి సూపి, మయమాలిసుమాలిప్రముఖులకు మైత్రి యొఱింగించి, కుంభనికుంభులకు సౌజన్యంబు గైకొలిపి, పౌలోమకాలకేయనివాతకవచాదులయెడ బాంధవంబు ప్రకటించి, వజ్రదంష్ట్రికి నశక్తుం డై యితరదానవదైత్యసమూహంబువలన నతిస్నేహంబు సంపాదించి, మనకు నక్కసెలియండ్రబిడ్డలకు [3]నొడ్డారంబు లేమిటికి? నేక కార్యపరత్వంబున నడ్డంబు లేక బ్రదుకుద; మన్యోన్యవిరోధంబు లేల? తొల్లి యన్యోన్యవిరోధంబున నలం

1. సముద్రము, విషము, నీరు, పాషాణము. 2. పోకుండుట. (వదలక స్నేహముతో నుండుట)
3. విరోధము.

గితి; మీఁది మొదలు దనుజదివిజసముదయంబులకు రాజు విరోచననందనుండ; మన మందఱ మతనిపంపు సేయంగలవార; ముభయకులంబును వర్ధిల్లునట్టి యుపాయం బెఱింగింతు; నని యమృతజలధిమథనప్రారంభకథనంబు దెలియం జెప్పె; నట్లు సురాసురయూథంబులు బలారాతిబలిప్రముఖంబులై పరమోద్యోగంబున సుధాసంపాదనాయత్తచిత్తులై యైకమత్యంబునొంది, యమందగమనంబున మందరనగంబునకుం జని. 182

సీ. వాసవవర్ధకి వాఁడిగాఁ జఱచిన ¹కుద్దాలముఖములఁ గొంత ద్రవ్వి,
ముసలాగ్రములు చొన్పి మొదలిపాఁతగలించి, దీర్ఘపాశంబులఁ ద్రిండు సుట్టి,
పెకలించి బాహులఁ బీడించి, కదలించి, పెల్లార్చి తమతమపేరు ²వాడి,
పెఱికి మీఁదికి నెత్తి, పృథులహస్తంబులఁ దలల భుజంబులఁ దరలకుండ
తే. నాని, మెల్లన కుఱుతప్పటడుగు లిడుచు-భార మధికంబు;మఱవక పట్టుఁ;డనుచు
మందరనగంబుఁ దెచ్చి రమందగతిని-దేవదైత్యులు జలరాశితెరువు పట్టి. 183

క. మందరము మోవ నోపమి-నందఱుఁ బైఁ బడియె నదియు నతిచోద్యముగాఁ;
గొందఱు నేలం గలిసిరి-కొందఱు నుగ్గయిరి; చనిరి కొందఱు భీతిన్. 184

క. ఏలా హరికడ కేఁగితి?-మేలా దొరఁకొంటి మధికహేలన? శైలో
న్మూలనము చేసి తెచ్చితి-మేలా? పెక్కండ్రు మడిసి రేలా నడుమన్. 185

క. ఏటికి మముఁ బనిపంచెను?-నేటికి మనఁబోఁటివారి కింతలు పను? లిం
కేటికి రాఁడు రమేశ్వరు?-డేటి కుపేక్షించె? మఱవ నేటికి మనలన్? 186

వ. అని కులకుధరపతన³జన్యం బగుదైన్యంబు సహింప నోపక పలవించుచున్న దివిజ దితిజులభయంబు మనంబున నెఱింగి,సకలవ్యాపకుం డగుహరి తత్సమీపంబున.

మ. గరుడారోహకుఁడై గదాదిధరుఁడై కారుణ్యసంయుక్తుఁడై
హరికోటిప్రభతో నొహో! వెఱవకుం; డంచుం బ్రదీపించి త
ద్గిరిఁ గేలన్ ⁴నొవకుండ గందుకముమాడ్కిం బెట్టి క్రీడించుచు
న్గరుణాలోకసుధన్ సురాసురుల ప్రాణంబుల్ సమర్థించుచున్. 188

క. వారలు గొలువఁగ హరియును-“వారాన్నిధికరుగు”;మనఁగ వసుధాధరమున్
వారిజనయనునిఁ గొంచు న-వారితగతిఁ జనియె విహగవల్లభుఁ డఱుతన్. 189

క. చని జలరాశితటంబున-వనజాక్షుని గిరిని డించి, వందనములు స
ద్వినుతులు సేసి, ఖగేంద్రుఁడు⁵-పనివినియెను భక్తి నాత్మభవనంబునకున్.
వ. అప్పుడు. 191

1. గడ్డపాఱలు. గునపములు. 2. ఉపయోగించి. 3. కలిగినది. 4. నలువొందయని పాఠాంతరము పెట్టి పక్షీంద్రుపై. పా. 5. నెలవు తీసికొనియెను.

సీ. భూనాథ! వినవయ్య! భోగీంద్రు వాసుకిఁ బిలిపించి, యతనికిఁ బ్రియము సెప్పి;
ఫలభాగమీ నొడఁబడి, సమ్మతునిఁ జేసి, మెల్లన చేతుల మేను నివిరి,
నీవ కా కెవ్వరు నేర్తు రీపని? కియ్యకొ మ్మని యతనికై కోలు వడసి,
కవ్వంపుఁగొండ నిష్కంటకంబుగఁ జేసి, గర్జించునతనిభోగంబుఁ జుట్టి,
ఆ. కడఁగి యమృతజలధిఁ గలశంబుఁ గావించి-త్రచ్చ నవసరమునఁ దలఁపులమర
బద్ధవస్త్రకేశభారులై, యా రెండు-[1]గములవారు తరువఁ గదిసి రచట. 192

వ. తదనంతరంబ. 193

క. హరియును దేవానీకము-నురగేంద్రునితలలు పట్ట నుద్యోగింపన్,
హరిమాయాపరవశు లై-సురవిమతులు గూడి పలుకఁ జొచ్చిరి కడిమిన్. 194

మత్తకోకిలము. స్వచ్ఛ మైనఫణంబు మీరలు చక్కఁ బట్టి మథింపఁగాఁ
బుచ్ఛ మేటికి మాకుఁ బట్టఁగఁ? బూరుషత్వము గల్గి మే
[2]మచ్ఛమైనతపోబలాధ్యయనాన్వయంబులవార మై
యిచ్ఛయింతుమె తుచ్ఛవృత్తికి? నిండు మాకు ఫణాగ్రముల్. 195

వ. అని పలుకుదనుజులం జూచి. 196

క. విస్మయముఁ బొంది, దానవ-ఘస్మరుఁ డహిఫణము విడువఁ గైకొని యసురుల్
విస్మితముఖు లై యార్చిరి-విస్మితముగఁ గొనిరి సురలు వీఁకం దోఁకన్. 197

వ. ఇట్లు సమాకర్షణస్థానభాగనిర్ణయంబు లేర్పఱచుకొని, దేవతలు పుచ్ఛంబును బూర్వదేవతలు ఫణంబులుం బట్టి, పయోరాశిమధ్యంబునం బర్వతంబు పెట్టి, పరమాయత్తచిత్తు లై యమృతార్థంబు త్రచ్చుచున్నసమయంబున. 198

క. విడువిడుఁ డని ఫణి పలుకఁగఁ-గడుభరమున మొదలఁ గుదురు గలుగమి, [3]గెడ వై
బుడబుడరవమున నఖిలము-వడవడ వడఁకఁగ మహాద్రి వనధి మునింగెన్. 199

ఉ. గౌరవ మైనభారమునఁ గవ్వపుఁగొండ ధరింప లేక, దో
స్సారవిహీను లై యుభయసైనికులుం గడుసిగ్గుతో నకూ
పారతటంబునం బడిరి పౌరుషముం జెడి; పాండవేయ! యె
వ్వారికి నేరఁ బోలు బలవంతపుదైవము నాక్రమింపఁగన్? 200

క. వననిధిజలములలోపల-మునిఁగెడిగిరిఁ జూచి, దుఃఖమునఁ జింతాబ్ధి
మునిఁగెడివేల్పులఁ గనుఁగొని-వనజాక్షుఁడు వార్ధినడుమ వారలు సూడన్.

### కూర్మావతారకథాప్రారంభము

సీ. సవర నై లక్షయోజనముల వెడలు పై కడుఁ గఠోరము నైన [4]కర్పరమును,
నదనైన బ్రహ్మాండ మైన నాహరించు ఘనతరం బగుముఖగహ్వరంబు,

1. తెగలు. 2. స్వచ్ఛము. పరిశుద్ధము - మలినములేని. 3. తలక్రిందు లై. 4. తాఁబేటివీఁపుచిప్ప.

సకలచరాచరజంతురాసుల నెల్ల మ్రింగి లోఁగొను నట్టిమేటికడుపు,
విశ్వంబుపై వేఱువిశ్వంబు పైఁబడ్డ నాఁగినఁ గదలనియట్టికాళ్లు,
తే. వెలికి లోనికిఁ జనుదెంచువిపులతుండ,-మంబుజంబులఁ బోలెడునక్షియుగము,
సుందరంబుగ విష్ణుండు సురలతోడి-కూర్మి చెలువొందనొకమహాకూర్మ మయ్యె.

మ. కమఠం బై జలరాశిఁ జొచ్చి, లఘుముక్తాశుక్తిచందంబునన్
సమదద్రీంద్రము నెత్తె వాసుకిమహానాగంబుతో లీలతో;
సమరేంద్రాదులు హాళికంపములతో "నౌ నౌఁ గదే! బాపురే!
కమలాక్షా! శర" ణంచు భూదిశలు (ల?) నాకాశంబునన్ మ్రోయఁగన్.

వ. ఇవ్విధంబున. 204

క. [1]తరిగాండ్రలోన నొకఁ డఁట?-తరిగడవకుఁ గుదురు నాఁకట్రా డఁట? చేరుల్
దరిగవ్వంబును దా నఁట-[2]హరిహరి! హరిచిత్రలీల హరియే యెఱుఁగున్. 205

ఆ. జలధిఁ గడవ సేయ, శైలంబుఁ గవ్వంబు-సేయ, భోగిఁ ద్రాడుసేయఁ, దరువ
సిరియుసుధయుఁబడయ శ్రీవల్లభుఁడు దక్క-నొరుఁడుశక్తిమంతుఁడొకఁడు గలఁడె?

ఆ. గొల్లవారిబ్రదుకు గొఱఁ తన వచ్చునె;-గొల్లరీతిఁ బాలకుప్పఁ ద్రచ్చి,
గొల్ల లైరి సురలు; గొల్లయ్యె విష్ణుండు;-చేటులేనిమందు సిరియుఁ గనిరి. 207

వ. ఇట్లు సురాసురయూథంబులు హరిసనాథంబు లయి కవచంబులు నెట్టంబులు వెట్టికొని, పుట్టంబులు [3]పిరిచుట్లు సుట్టికొని, కరంబులు కరంబుల నప్పళించుచు భుజంబులు భుజంబుల నొరయుచు, "లెండు లెండు; తరువఁ దొడంగుఁడు; రం", డని యమందగతిం బెరుఁగు ద్రచ్చుమందగొల్లలచందంబున మహార్ణవమధ్యంబున మంథాయమానమందరమహీధర విలగ్నభోగిభోగాద్యంతంబులం గరంబులం దెమల్చుచుఁ, బెనుబొబ్బలం బ్రహ్మాండకటాహంబు నిర్భరంబయి గుబ్బుగుబ్బని యఱలుకొండకవ్వంబుగుత్తి జిఱజిఱం దిరుగువేగంబున ఛటచ్ఛటాయమానంబులయి బుగులుబుగుల్లనుచప్పుళ్లనుప్పరంగ బెగసి లెక్కకు మిక్కిలి చుక్కల కొమ్మలచెక్కులనిక్కులువడుమిసిమిగలమీఁది మీఁగడపాలతేటనిగ్గుఁదుంపరల పరంపరలవలన నిజకరక్రమక్రమాకర్షణ పరిభ్రాంత ఫణిఫణాగర్భ సముద్భూత నిర్భరవిషకీలికీల జాలంబుల నప్పటప్పటికి నుప్పతిల్లినదప్పిం గొండొక మందగతిం జెందక, యకూపారవేలాతటకుటజకుసుమగుచ్ఛ పిచ్ఛిలస్వచ్ఛమకరందసుగంధి గంధవహంబులం గ్రొంజెమటనీటిపెనువఱదగము లోడళ్ల నిగుర, నొండొరులం బరిహ

1. చిలుకునట్టివారు. 2. ఆశ్చర్యమును దెలుపు పదము. 3. నడుమునకు బిఱ్ఱుగా బిగింపఁబడిన వస్త్రములచుట్లు.

సించుచుఁ జేరవాడి విలసించుచు, మేలు మేలని యుగ్గడించుచుఁ గాదు కా దని భంగించుచు, నిచ్చ మెచ్చనిమచ్చరంబులవలన వనధివలమానవై శాఖవసుంధరాధరపరివర్తనసంజనితఘుమఘుమారావంబును, మథనగుణాయమాన మహామహీంద్రముఖముహుర్ముహురుచ్చలితభూరి ఘోర ఫూత్కారఘోషంబును, [1]కులకుధరపరిక్షేపణక్షోభితసముల్లంఘనసమాకులితంబు లై వెఱచఱచి, గుబురుగుబురు లై మొరలు కమఠకర్కటకాకోదరమకరతిమితిమింగిలమరాళచక్రవాకబలాకభేకసారసానీకంబుల మొఱలునుం గూడికొని, ముప్పిరిగొని దనుజదివిజభటాట్టహాసతర్జనగర్జనధ్వనులు నలుపురి యై, మొత్తినల్లైన దశదిగంతభిత్తులను బేఁటెత్తి పెల్లగిలం, ద్రుళ్ళుచుఁ గికురు పొడుచుచు, నొకఁ డొకనికంటె వడియునుం దడవునుం గలుగఁ ద్రచ్చుచుఁ, బంతంబులిచ్చుచు, సుధాజననంబుఁ జింతించుచు, నూతనపదార్థంబులకు [2]నెదుళ్లు సూచుచు, నెంతదడవు ద్రత్త మని హరి నడుగుచు, [3]నెడపడనితమకంబుల నంతకంతకు మురువు డింపక త్రచ్చుసమయంబున. 208

క. అప్పాలవెల్లిలోపల - నప్పటికప్పటికి మందరాగము దిరుగం
జప్పుడు నిండె నజాండము ; - సెప్పెడి దే ? మజుని చెవులు చిందఱగొనియెన్.

వ. అంత నప్పయోరాశిమధ్యంబున. 210

క. ఎడమఁ గుడి మునుపు దిరుగుచుఁ-గుడి నెడమను వెనుకఁ దిరుగు కులగిరి గడలిం
గడవెడల సురలునసురలుఁ-దొడితొడి ఫణిఫణము మొదలుఁదుదియునుదిగువన్.

క. వడిగొని, కులగిరిఁ దరువఁగ-జడనిధి, ఖగమకరకమఠఝషఫణిగణముల్
సుడివడఁ దడఁబడుఁ, గెలకులఁ-బడు, భయపడి నెగసి బయలఁబడు నురలిపడున్.

క. అమరాసురకరవిపరి - భ్రమణధరాధరవరేంద్రభ్రమణంబున దాఁ
గమఠేంద్రుపీఁపుతీఁటను-(యు?)శమియింపఁగఁ జాలదయ్యె జగతీనాథా! 213

వ. తదనంతరంబ. 214

క. ఆలోలజలధిలోపల - నాలో నహి విడిచి, సురలు నసురలుఁ బఱవం
గీలాకోలాహలమై - హాలాహలవిషము పుట్టె నవనీనాథా! 215

వ. అదియునుం బ్రళయకాలాభీలఫాలలోచనలోచనానలశతంబుచందంబున నమందంబై, విలయదహనసహస్రంబుకైవడి వడియై, కడపటి పట్టపగలింటి వెలుంగుల లక్ష తెఱంగున దుర్లక్షితం బై, తుదిరేయి వెలింగిన మొగిలుగములవలనం బడు బలుపిడుగులవడువున బెడిదం బై, పంచభూతంబులుం దేజోరూపంబు లైన చాడ్పున దుస్సహం బై, భుగభుగాయమానంబు లై నపొగలును, జిట

1. కులపర్వతముయొక్క తిరుగుటవలన. 2. ఎదురునకు బహువచనము. 3. తగ్గిపోని.

జటాయమానంబు లైన విస్ఫులింగంబులును, ధగధగాయమానంబు లైన నెఱ మంటలును గలిగి మహార్ణవమధ్యంబున మందరనగం బమంథరంబుగం దిరుగు నెడ జనియించి పటపటాయమానం బై, నింగికిం బొంగి, దిశలకుం గేలుసాఁచి, బయల్లు ప్రబ్బికొని తరిగవ్వంపుఁగొండ నండఁగొనక నిగిడి, నలుగడలకుం బఱచి, దరుల కుఱికి, సురాసురసముదయంబులఁ దరికొని, గిరివరగుహాగహ్వరంబుల సుడివడక, కులశిఖరిశిఖరంబుల నెరగలివడి, గహనంబుల దహించి, కుంజమంజరీ పుంజంబుల భస్మంబుసేసి, జనపదంబు లేర్చి, నదీనదంబు లెరియించి దిక్కుంభి కుంభంబులు నిక్కలునడ నిక్కి, తరణితారామండలంబులపై మిట్టించి, మహార్లోకంబు దరికొని, యుపరిలోకంబునకు మాఱుగొన లిడి, సుడివడి ముసరుకొని, బ్రహ్మాండగోళంబు సిటిలిపడఁ దాఁటి, పాతాళాదిలోకంబులకు వెల్లివాఱి, సర్వలోకాధిక్యంబై శక్యంబుగాక, యెక్కడఁ జూచినం దాన యై, కురంగంబు క్రియం గ్రేళ్లుఱుకుచు, భుజంగంబువిధంబున నొడియుచు, సింగంబు భంగి లంఘించుచు, విహంగంబుపగిది నెగయుచు, మాతంగంబుపోలికి నిలువంబడుచు, నిట్లు హాలాహలదహనంబుజగంబులం గోలాహలంబు సేయుచున్న సమయంబున, [1]మెలకుసెగల మిడుకం జాలక నీఱైన దేవతలును, నేలం గూలిన రక్కసులును, డుల్లినతారకలును, గీటడంగినకిన్నర మిథునంబులును, గమరిన గంధర్వవిమానంబులును, జీకాకుపడినసిద్ధచయంబులును, జిక్కువడినగ్రహంబులును, జిందఱవందఱ లయినవర్ణాశ్రమంబులును, నిగిరిపోయిననదులును, నింకిన సముద్రంబులును, గాలినకాననంబులును, బొగిలినపురంబులును, బొనుఁగుపడినపురుషులును, బొక్కిపడినపుణ్యాంగనాజనంబులును, బగిలిపడినపర్వతంబులును, భస్మంబు లైనప్రాణిసంఘంబులును; వేఁగినలోకంబులును వివశ లైన దిశలును, [2]నొడ్డగెడవు లైనభూజచయంబులును నఱవఱ లైనభూములును నై యకాలవిలయకాలంబై తోఁచుచున్నసమయంబున. 216

క. ఒడ్డారించి విషంబున - కడ్డము చనుదెంచి కావ నధికులు లేమిఁ
[3]గొడ్డేఱి మ్రంది, రాలన, - బిడ్డన, నెడ లేక జనులు పృథ్వీనాథా! 217

వ. అప్పుడు. 218

మ. చని కైలాసముఁ జొచ్చి, శంకరునివాసద్వారముం జేరి, యా
ఘనదౌవారికు లడ్డపడ్డఁ దల మంచుం జొచ్చి, "కుయ్యో! మొఱో!
విను మాలింపుము; చిత్తగింపుము; దయన్ వీక్షింపు;" మం చంబుజా
సనముఖ్యుల్ గని రార్తరక్షణకళాసంరంభునిఁ, శంభునిన్. 219

క. వారలు దీనత వచ్చుటఁ - గూరిమితో నెఱిఁగి, దక్షుకూఁతురు దానుం
బేరోలగమున నుండి ద - యారతుఁడై, చంద్రచూడుఁ డవసర మిచ్చెన్. 220

1. మండుచున్న తాపములచే. 2. తలక్రిందు లయిన. 3. మొత్తమయి,

వ. అప్పుడు భోగిభూషణునకు సాష్టాంగదండప్రణామంబులు గావించి, ప్రజాపతి ముఖ్యు లి ట్లని స్తుతియించిరి. 221

సీ. "భూతాత్మ! భూతేశ! భూతభావనరూప! దేవ! మహాదేవ! దేవవంద్య!
యీలోకముల కెల్ల నీశ్వరుండవు నీవ; బంధమోక్షములకుఁ బ్రభుఁడ వీవ;
యార్తశరణ్యుఁడ వగుచుండుదువు; నిన్నుఁ గోరి భజింతురు కుశలమతులు;
సకలసృష్టిస్థితిసంహారకర్త వై, బ్రహ్మవిష్ణుశివాఖ్యఁ బరగు దీవు;
ఆ. పరమగుహ్య మయిన బ్రహ్మంబు సదసత్త - మంబు నీవ; శక్తిమయుఁడ వీవ;
శబ్దయోని వీవ; జగదంతరాత్మవు-నీవ ప్రాణమరయ నిఖిలమునకు. 222

క. నీయంద సంభవించును;-నీయంద వసించి యుండు; నిఖిలజగములున్
నీయంద లయముఁ బొందును;-నీయుదరము సర్వభూతనిలయము రుద్రా! 223

సీ. అగ్ని ముఖంబు, పరాపరాత్మక మాత్మ, కాలంబు గతి, [1]రత్నగర్భ పదము,
శ్వసనంబు నీయూర్పు, [2]రసన జలేశుండు, దిశలు కర్ణంబులు, దివము నాభి,
సూర్యుండు గన్నులు, శుక్లంబు సలిలంబు, జఠరంబు జలధులు, చదలు శిరము
సర్వౌషధులు రోమచయములు, శల్యంబు లద్రులు, మానస మమృతకరుఁడు,
తే. ఛందములు ధాతువులు, ధర్మసమితి హృదయ,
మాస్యపంచక ముపనిషదా[3]హ్వయంబు,
నయిననీరూపు పరతత్త్వమై శివాఖ్య
మై స్వయంజ్యోతి యై యొప్పు నాద్య మగుచు. 224

క. కొందఱు గలఁ డందురు నినుఁ;-గొందఱు లేఁ డందు; రతఁడు గుణిగాఁ డనుచుం
గొందఱు; గలఁ డని, లేఁ డని,-కొందల మందుదురు నిన్నుఁ గూర్చి మహేశా!

సీ. తలఁపఁ బ్రాణేంద్రియద్రవ్యగుణస్వభావుఁడవు; కాలక్రతువులును నీవ;
సత్యంబు ధర్మ మక్షరము ఋతంబును నీవ; ముఖుండవు నిఖిలమునకు;
ఛందోమయుండవు; సత్త్వరజస్తమశ్చక్షుండవై యుందు సర్వరూప!
కామపురాధ్వరకాలగరాదిభూతద్రోహభయము చోద్యంబు గాదు;
తే. లీల లోచనవహ్నిస్ఫులింగశిఖల-నంతకాదులఁ గాల్చినయట్టినీకు
రాజఖండావతంస! పురాణపురుష-దీనరక్షక! కరుణాత్మ! దేవదేవ! 226

ఆ. మూఁడుమూర్తులకును, మూఁడులోకములకు,
మూఁడుకాలములకు, మూలమగుచు,
భేదమగుచుఁ, దుదినభేదమై యొప్పారు
బ్రహ్మ మనఁగ నీవ ఫాలనయన! 227

---

1. భూమి (రత్నములు లోపలఁగలది) 2. నాలుక. 3. పేరు.

క. సదసత్తత్త్వచరాచర-సదనం బగునిన్నుఁ బొగడ జలజభవాదుల్
పెదవులు గదలుప నెఱుఁగరు;-వదలక నినుఁ బొగడ నెంతవారము దేవా! 228

మత్తకోకిలము. బాహుశక్తి సురాసురుల్ చని [1]పాలవెల్లి మథింప, హా
లాహలంబు జనించె; నేరి కలంఘ్యమై, భువనంబు గో
లాహలంబుగఁ జేసి, చిచ్చును [2]లాగముంగొని, ప్రాణిసం
దోహముల్ బ్రదికింపవే దయ దొంగలింపఁగ నీశ్వరా! 229

క. లంపటము నివారింపను,-సంపదఁ గృప సేయ, జయము సంపాదింపం,
జంపెడివారి వధింపను,-సొం పారఁగ నీక చెల్లు సోమార్ధధరా! 230

క. నీకంటె నొం డెఱుంగము;-నీకంటెం బరులు గావ నేరరు జగముల్;
నీకంటె నొడయఁ డెవ్వఁడు-లోకంబుల కెల్ల? నిఖిలలోక స్తుత్యా!'' 231

వ. అని మఱియు నభినందించుచున్న ప్రజాపతిముఖ్యులం గని సకలభూతసముం
డగునద్దేవుండు దనప్రియసతి కి ట్లనియె. 232

శివుండు దేవప్రార్థితుం డై హాలాహలమును పానము సేయుట.

క. ''కంటే జగములదుఃఖము?-వింటే జలజనితవిషము వేఁడిమి? ప్రభు వై
యుంటకు నార్తులయాపద-గెంటింపఁగ ఫలము గాదె కీర్తి? మృగాక్షీ! 233

క. ప్రాణేచ్ఛ వచ్చి చొచ్చిన-ప్రాణుల రక్షింప వలయుఁ బ్రభువుల; కెల్లం
బ్రాణుల కిత్తురు సాధులు-ప్రాణంబులు నిమిషభంగురము లని మగువా! 234

క. పరహితము సేయ నెవ్వఁడు-పరమహితుం డగును; భూతపంచకమునకుం
బరహితమె పరమధర్మము;-పరహితునకు నెదురు లేదు; పర్వేందుముఖీ! 235

క. హరి మది నానందించిన-హరిణాక్షీ! జగంబు లెల్ల నానందించుం;
హరియును జగములు మెచ్చఁగ-గరళము వారించు టొప్పుఁ; గమలదళాక్షీ!

క. శిక్షింతు హాలహాలమును;-భక్షింతును మధురసూక్ష్మఫలరసము క్రియన్;
రక్షింతుఁ బ్రాణికోట్లను;-వీక్షింపుము నీవు నేఁడు వికచాబ్జముఖీ!'' 237

వ. అని పలికిన ప్రాణవల్లభునకు వల్లభ, దేవా! దేవరచిత్తంబుకొలంది నవధరింతు
గాక! యని పలికె; నని చెప్పిన నరేంద్రుం డి ట్లనియె. 238

మ. అమరన్ లోకహితార్థమంచు, నభవుం డౌఁ గాక యం చాడెఁ బో;
యమరుల్ భీతిని మ్రింగవే యనిరి పో; యంభోజగర్భాదులుం
దముఁ గావన్ హర! లెమ్ము లె మ్మనిరి పో; తాఁ జూచి కన్గొంట న
య్యుమ ప్రాణేశ్వరు నెట్లు మ్రింగు మనె నయ్యుగ్రానలజ్వాలలన్?'' 239

1. పాలసముద్రము. 2. లఘువు. చులకన - అవలీల. 3. చంచలము.

వ. అనిన శుకుం డిట్లనియె. 240

క. "మ్రింగెడువాఁడు విభుం డని, - మ్రింగెడిదియు గరళ మనియు, మే లని ప్రజకున్,
మ్రింగు మనె సర్వమంగళ, - మంగళసూత్రంబు నెంత మది నమ్మినదో? 241

మ. తనచుట్టున్ సురసంఘముల్ జయజయధ్వానంబులన్ [1]బొబ్బిడన్
ఘనగంభీరరవంబుతో శివుఁడు 'లోకద్రోహి! హుం! పోకు; ర,
మ్మని కెంగేలఁ దెమల్చి, కూర్చి, [2]కడిగా నంకించి, జంబూఫలం
బని (న?) సర్వంకషమున్ మహావిషము నాహారించె హేలాగతిన్. 242

వ. అయ్యవిరళమహాగరళదహనపానసమయంబున.

మ. కదలం బాఱవు [3]పాఁపపేరు; లొడలన్ ఘర్మాంబుజాలంబు పు
ట్టదు; నేత్రంబులు నెఱ్ఱ గావు; నిజజూటాచంద్రుఁడుం గందఁడున్; 243
వదనాంభోజము వాడ; దావిషము నాహ్వానించుచోఁ, డాయుచోఁ,
బదిలుం డై కడి సేయుచో, దిగుచుచో, భక్షించుచో, మ్రింగుచోన్. 244

క. ఉదరము లోకంబులకును, సదనం బగు టెఱిఁగి, శివుఁడు చటులవిషాగ్నిం
గుదురుకొనఁ గంఠబిలమునఁ, బదిలంబుగ నిలిపె సూక్ష్మఫలరసము క్రియన్.

క. మెచ్చిన మచ్చిక గలిగిన - నిచ్చిన నీవచ్చుఁ గాక! యిచ్చ నొరులకుం
జిచ్చుఁగడి గొనఁగ వచ్చునె? - [4]చిచ్చఱరూ [5]పచ్చుపడినశివునకుఁ దక్కన్.

ఆ. హరుఁడు గళమునందు హాలాహలము పెట్టఁ - [6]గప్పు గలిగి, [7]తొడవుకరణి నొప్పె;
సాధురక్షణంబు సజ్జనులకు నెన్న - భూషణంబు గాదె? భూవరేంద్ర! 247

వ. తదనంతరంబ. 248

క. గరళంబుఁ గంఠబిలమున - హరుఁడు ధరించుటకు మెచ్చి, 'యహా నో'యనుచున్
హరియు,విరించియు,నుమయును, - సురనాథుఁడుఁ బొగడి రంత సుస్థిరమతితోన్.

క. హాలాహలభక్షణకథ - హేలాగతి విన్న, వ్రాయ, నెలమిఁ బఠింపన్,
వ్యాళానలవృశ్చికముల - పాలై చెడ రెట్టిజనులు భయవిరహితు లై. 250

వ. మఱియు నారత్నాకరంబు సురాసురులు ద్రచ్చునెడ. 251

పాలకడలిం దరుచునెడ నైరావతాదులు జనించుట

క. తెల్లనిమేనును, నమృతము - జిల్లున జల్లించుపొదుఁగు, శితశృంగములుం
బెల్లుగ నర్థులకోర్కులు - వెల్లిగొలుపు మొదవు పాలవెల్లిం బుట్టెన్. 252

1. ధ్వనిచేయఁగా. 2. ముద్ద, కబళము 3. సర్పహారములు. 4. అగ్నియొక్క స్వరూపము.
5. రూపముగా నేర్పడిన. 6. నలుపు. 7. ఆభరణము.

ఆ. "అగ్నిహోత్రి" యనుచు నాసురభిని దేవ-మునులు పుచ్చికొనిరి, మున్నెఱింగి
విబుధసంఘములకు వెరవుతో నధ్వర-హవ్యములు పెట్టుకొఱకు నవనినాథ! 253

వ. మఱియు నాజలరాశియందు. 254

క. సచ్చంద్రపాండురంబై - యుచ్చైశ్శ్రవ మనఁగఁ దురగ మొగి జనియించెం;
బుచ్చికొనియె బలి దైత్యుం; - డిచ్చగొనం డయ్యె నింద్రుఁ డీశ్వరశిక్షన్. 255

క. ఒఱపగుసురమును బిఱుఁదును-సెఱఁ దోఁకయు ముఖముసిరియు నిర్మలఖురముల్
కుఱుచచెవులుఁ దెలిగన్నులుఁ-దఱచగుకందంబుఁ జూడఁ దగు నాహరికిన్.

వ. అంత నప్పాలకుప్పయందు. 257

క. దంతచతుష్టాహతి శై - లాంతంబులు విఱిగి పడఁగ, నవదాతకుభృ
త్కాంతం బగునైరావణ - దంతావళ ముద్భవించె ధరణీనాథా! 258

క. తడ లేనినడపువడి గల - యొడలును, బెనునిడుదకరము, నురుకుంభములున్,
బెడఁగై యువతులమురిపపు-నడకలకున్ మూలగురు వనన్ గజ మొప్పెన్.

వ. మఱియు నత్తరంగిణీవల్లభు మథించునయ్యెడ. 260

ఆ. ఎల్లఋతువులందు నెలరారి, పరువమై - యింద్రువిరులతోఁట కేపు దెచ్చి,
కోరివచ్చువారికోర్కులనీనెడు - వేల్పుమ్రాను పాలవెల్లిఁ బుట్టె. 261

వ. మఱియునుం గొండకవ్వంబునం గడలి మథింప నప్సరోజనంబు జనించె నంత.

క. క్రొక్కారుమెఱుఁగుమేనులు - గ్రిక్కిఱిసినచన్నుఁగవలుఁ గ్రిస్సిననడుముల్
పిక్కటిలి యున్నతుఱుములుఁ-జక్కనిచూపులును దివిజసతులకు నొప్పెన్.

వ. మఱియు నారత్నాకరంబునందు సుధాకరుం డుద్భవించి, విరించియనుమతం
బునఁ దనయథాస్థానంబునం బ్రవర్తించుచుండె నంత, 264

క. తొలుకారుమెఱుఁగుకై వడిఁ-దళతళ మని మేను మెఱవ, ధగధగ మనుచున్
గలుముల నీనెడుచూపులఁ-జెలువంబుల [1]మొదలిటెంకి సిరి పుట్టె నృపా! 265

సీ. పాలమున్నీటిలోపలిమీఁది మీఁగడ మిసిమిజిడ్డునఁ జేసి మేను వడసి,
క్రొక్కారుమెఱుఁగులకొనలక్రొత్తళుకులమేనిచే గలనిగ్గు మెఱుఁగు సేసి,
నాఁటినాఁటికిఁ బ్రొద్దినవకంపుఁదీవల నునుఁబోదనెయ్యంబు నూలుకొలిపి,
క్రొవ్వాఁడుకెందమ్మికొలఁకునఁ బ్రొద్దునఁ బొలసినవలపునఁ బ్రోది వెట్టి,
తే. పసిఁడిచంపకదామంబు బాగుఁ గూర్చి-వాలుక్రొన్నెలచెలువున వాఁడి దీర్చి,
జాణతనమునఁ జేతుల జడ్డు విడిచి-నలువ యీకొమ్మ నొగిఁ జేసినాఁడు నేఁడు.

1. మూలస్థానము.

క. కెంపారెడునధరంబును, - జంపారెడినడుము, సతికి శంపారుచులన్
సొంపారుమోముఁగన్నులుఁ,-బెంపారుచు నొప్పు,గొప్పపిఱుఁదును,గుచముల్.

వ. అని జనులు పొగడు చుండ. 268

సీ. తరుణికి మంగళస్నానంబు సేయింత మని పెట్టె నింద్రుఁ డనర్ఘమైన
మణిమయపీఠంబు ; మంగళవతు లైన [1]వేలుపుగరితలు విమలతోయ
పూర్ణంబు లై యున్న పుణ్యాహకలశంబు లిడిరి; పల్లవములనిచ్చె భూమి ;
గడిమి గోవులు పంచగవ్యంబులను నిచ్చె; మలసి వసంతుఁడు మధు వొసంగె;
తే. మునులు కల్పంబుఁ జెప్పిరి; మొగిలుగములు-పణవగోముఖకాహళపటహమురజ
శంఖవల్లకీవేణునిస్వనము లిచ్చెఁ-బాడి రాడిరి గంధర్వపతులు సతులు. 269

క. పండితసూక్తులతోడుతఁ - దుండంబులు సాఁచి, తీర్థతోయము లెల్లం
దుండముల ముంచి, [2]దిగ్వే - దండంబులు జలక మార్చె దరుణీమణికిన్. 270

సీ. కట్టంగఁ బచ్చనిపట్టుఁబుట్టపుడోయి ముదితకుఁ దెచ్చి సముద్రుఁ డిచ్చె ;
మత్తాళినికరంబు మధు వాన మూఁగినవై జయంతీమాల వరుణుఁ డిచ్చెఁ;
గాంచనకేయూరకంకణకింకిణీకటకాదులను విశ్వకర్మ యిచ్చె ;
భారతి యొకమంచితారహారము నిచ్చెఁ; బాణిపద్మము నిచ్చెఁ బద్మభవుఁడు ;
ఆ. [3]కుండలివ్రజంబు గుండలముల నిచ్చె- శ్రుతులు భద్రమైననుతులు సేసె ;
నెల్లలోకములకు [4]నేలికసాని వై, బ్రదికె దనుచు దిశలు పలికె ; నధిప ! 271

వ. మఱియును. 272

సీ. పలుకుల నమృతంబు చిలుక నెవ్వానితో భాషించె, వాఁడెపో బ్రహ్మ యనఁగ;
నెలయించి కెంగేల నెవ్వని వరియించె, వాఁడె లోకములకు వల్లభుండు ;
మెయిదీఁగె నెవ్వనిమేనితోఁ గదియించె, వాఁడెపో పరమసర్వజ్ఞమూర్తి ;
నెలఁతుక యెప్పుడు నివసించె నేయింట, నాయిల్లు పర మగునమృతపదము ;
ఆ. నింతిచూపు వాఱె నెచ్చోటి కచ్చోటు - జిష్ణుధనదధర్మజీవితంబు ;
గొమ్మపిన్ననగవు గురుతరదుఃఖని - వారణంబు సృష్టికారణంబు. 273

వ. మఱియు నక్కొమ్మ నెమ్మనంబున. 274

సీ. భావించియొకమాటు బ్రహ్మాండ మంతయు నాటలబొమ్మరిల్లని తలంచుఁ;
బోలించి యొకమాటు భువనంబు లన్నియుఁ దనయింటిలో దొంతు లని తలంచుఁ,
బాటించి యొకమాటు బ్రహ్మాదిసురలను దనయింటిలో బొమ్మ లని తలంచు;
గొనకొని యొకమాటు కుంభినీచక్రంబు నలవడ బొమ్మపీఁ టని తలంచు;

1. అచ్చరలు. 2. దిగ్గజములు. 3. సర్పముల సమూహము. 4. అధికారిణి.

ఆ. సాలసి యొక్కమాట సూర్యేందురోచుల-నచటిదీపకళిక లని తలంచు;
భామ యొక్కమాట భారతీదుర్గల-నాత్మసఖు లటంచు నాదరించు. 275

వ. తదనంతరంబ. 276

ఆ. చంచరీకనికరఝుంకారనినదంబు-డనరుసుత్పలములదండ వెట్టి
మేఘకోటినడిమిమెఱుఁగుఁ [1]బుత్తడిమాడ్కి-సురలనడుమ నిల్చె సుందరాంగి.

క. ఆకన్నులు, నాచన్నులు,-నాకురు, లాపిఱుఁదు, నడుము, నాముఖ, మాన
వ్యాకారముఁ గని, వేల్పులు-చీకాకునఁ బడిరి కలఁగి శ్రీహరి దక్కన్. 278

వ. అట్లు నిలిచి, దశదిశలంబఁ వేష్టించి యున్న యక్షరక్షస్సిద్ధసాధ్యదివిజగరుడ
గంధర్వచారణప్రముఖనిఖిలయూథంబులం గనుంగొని, యప్పురాణప్రౌఢ
కన్యకారత్నంబు దనమనంబున నిట్లని వితర్కించె. 279

సీ. [2]ఐదువ నై యుండ నలవడ దొకచోట; నొకచోట సవతితో నోర్వరాదు;
తగనొకచోట సంతతవైభవంబు గా; దొకచోట వేఁడిమి నుండఁ బోల;
దొకచోటఁ గరుణ లే దొక్కింత వెదకిన; నొకచోట దగ్గఱి యుండ వెట్టు;
నెరయంగ నొకచోట నిలుకడ సాలదు; చర్చింప నొకచోట జడత గలదు;

ఆ. కొన్నిచోట్లు కామగుణగరిష్ఠంబులు;-క్రోధసంయుతములు గొన్ని యెడలు;
గొన్ని మోహలోభకుంఠితంబులు; గొన్ని-ప్రమదమత్సరానుభావకములు.

వ. అని సకలసత్పురుషజననవర్తనంబులు మానసించి, పరిహరించి. 281

సీ. అమర ముత్తైదువనై యుండవచ్చును; వరుసకె సవతు లెవ్వరును లేరు;
వెలయంగ నశ్రాంతవిభవ మీతనియిల్లు; శృంగారచందనశీతలుండు;
గలఁగఁ డెన్నఁడు శుద్ధకారుణ్యమయమూర్తి;విమలుండు గదిసి సేవింపవచ్చు;
నెఱి నాడి తిరుగఁడు నిలుకడ గలవాఁడు; సకలకార్యములందు జడత లేదు;

ఆ. సాధురక్షకుండు షడ్వర్గరహితుండు, నాథుఁ డయ్యెనేని నడప నోపు;
నితఁడె భర్త యనుచు నింతి సరోజాక్షుఁ-బుష్పదామకమునఁ బూజసేసె. 282

క. ఇందీవరదామమున ము-కుందునిఁ బూజించి, తనకుఁ గూడి వసింపన్
మందిరముగఁ దద్వక్షము-నందంద సలజ్జదృష్టి నాలోకించెన్. 283

ఆ. మోహరుచులవలన ముద్దియ దల యెత్తు;-సిగ్గువలన బాల శిరము వంచు;
నింతి వెఱపువలన నెత్తదు వంపదు-తనదుముఖము ప్రాణదయితుఁ జూచి.284

క. హరి సూచిన సిరి సూడదు;-సిరి సూచిన హరియుఁ జూడ సిగ్గును బొందున్;
హరియును సిరియును దమలో-సరిచూపులఁ జూడ మరుఁడు సందడి [3]చేసెన్.

---

1. బంగారు. 2. సుమంగళి. మంగళసూత్రము, పసపు, కుంకుమము, గాజులు, చెవ్వాకు అను అయిదువస్తువులు కలది. 3. పెట్టెన-పాఠాంతరము.

చ. జగములతండ్రి యై తనదుశౌరి జగంబులతల్లి నిందిరం
దగ నురమందుఁ దాల్చె; నటఁ దత్కరుణారసదృష్టిచేఁ బ్రజల్
మగుడఁగ దొంటిభంగి నతిమంగళసాధ్విపతిత్వసంపదల్
నెగడినలోకముల్ గని; రనేకశుభంబులఁ బొంది రత్తఱిన్. 286

వ. అటమున్న యబ్ధిరాజు దనయందు నున్న యమూల్యంబయిన కౌస్తుభంబు పేరిటి యనర్ఘమణిరాజంబు నయ్యంబుజాక్షునకు సమర్పించిన, దానిం దనవక్షస్స్థలంబున ధరియించె; నప్పు డయ్యాదిలక్ష్మియు శ్రీవత్సకౌస్తుభ వైజయంతీవనమాలికాతారహారాద్యలంకృతం బైన పుండరీకాక్షువక్షస్స్థలంబున వసియించె; నయ్యవసరంబున. 287

శా. మ్రోసెన్ శంఖమృదంగవేణురవముల్; [1]మున్నాడి పెంజీఁకటుల్
వాసెన్; నర్తనగానలీలల సురల్ భాసిల్లి; రార్యుల్ జగ
ద్వ్యాసుల్ విష్ణుని బ్రహ్మదేవముఖరుల్ దల్లింగమంత్రంబులం
బ్రాసక్తిన్ వినుతించి రుల్లసితపుష్పశ్రేణి వర్షించుచున్. 288

క. ఆపాలవెల్లికూఁతురు-దీపులచూపులను దోఁగి తిలకింపఁ బ్రజల్
చేపట్టిరి సంపదలను;-బ్రాపించెను మేలు; జగము బ్రదికె నరేంద్రా! 289

క. పాలేటిరాచకన్నియ, మేలారెడుచూపు లేక, మిడుమిడు కంచుం
జాలిం బురపురఁ బొక్కుచు-దూలిరి రక్కసులు, కీడు దోఁచిన నధిపా! 290

క. వారిధిఁ దరువఁగ నంతట-వారుణియను నొక్కకన్య వచ్చిన, నసురుల్
వారిజలోచనుసమ్మతి-వారై కైకొనిరి దాని వారిజనేత్రిన్. 291

వ. మఱియుం దరువం దరువ నప్పయోరాశియందు. 292

సీ. తరుణుండు దీర్ఘదోర్దండుండు, గంబుకంధరుఁడు, పీతాంబరధారి, స్రగ్వి
లాసితభూషణాలంకృతుం, డరుణాక్షుఁ, డున్నతోరస్కుఁ, డత్యుత్తముండు,
నీలకుంచితకేశనివహుండు, జలధరశ్యాముండు, మృగరాజసత్త్వశాలి,
మణికుండలుఁడు, రత్నమంజీరుఁ, డచ్యుతునంశాంశసంభవుం, డమలమూర్తి
ఆ. భూరియాగభాగభోక్త ధన్వంతరి, యనఁగ నమృతకలశహస్తుఁ డగుచు
నిఖిలవైద్యశాస్త్రనిపుణుఁ, డాయుర్వేది-[1]వేల్పువెజ్జు గడలి వెడలివచ్చె. 293

వ. తదనంతరంబ. 294

ఆ. అతనిచేతనున్న యమృతకుంభము సూచి-కెరలు వొడిచి, సురలఁ [2]గికురువెట్టి
పుచ్చికొనిరి యసురపుంగవు లెల్లను-మాఱు లేనిబలిమి మానవేంద్ర! 295

వ. వెండియు. 296

1. దేవవైద్యుఁడు. 2. మోసగించి, తిరస్కరించి. 3. గ్రహింపఁగా.

ఆ. "చావు లేనిమందు చక్కఁగ మన కబ్బె;"
ననుచుఁ గడవ నసుర [1]లాఁచికొనిన
వెఱచి, సురలు హరికి మొఱలువెట్టిరి; "సుధా
పూర్ణఘటము వోయెఁ బోయె" ననుచు. 297

శ్రీ విష్ణుమూర్తి మోహినీస్వరూపంబు నొందుట

వ. ఇట్లుశరణాగతు లైన వేల్పులదైన్యంబు పొడగని, భృత్యజనకామదుం డగు
నప్పరమేశ్వరుండు "మీరలు దుఃఖింపవలవ; దేను నామాయాబలంబునం జేసి
మీయర్థంబు మరల సాధించెద;" నని పలికెఁ, దత్సమయంబున నయ్యమృత
పూరంబు నేమ త్రావుద మని తమకించు దైత్యదానవజనంబులలోపల నమం
గళం బగుకలి సంభవించినకతంబునఁ బ్రబలు లగురక్కసులు(ల?) విలోకించి
"సత్త్రయాగంబునందు నడచుచందంబునఁ దుల్యప్రయాసహేతువు లగుసుర
లును, సుధాభాగంబున కర్హు లగుదురు, గావునఁ, బంచి కుడుచుట కర్తవ్యం;
బిది సనాతనం బగుధర్మం బగుటం జేసి, యియ్యమృతకుంభంబు విడువుం; డని
దుర్బలు లగునిశాచరుల (లు?) జాతమత్సరు లై ప్రబలు లైనతమవారల
వారించుచున్న సమయంబున. 298

ఆ. ఒకనిచేత నుండ నొకఁడు బలిష్ఠుఁడై - పుచ్చికొనిన, వానిఁ బొదుగఁ బట్టి
యంతకంటె నధికుఁ డమృతకుంభము నెత్తి-కొంచుఁ బాఱెఁ, బరులు గుయ్యిడంగ.

వ. అంత. 300

సీ. మెత్తనియడుగుల మెఱుఁగారుజానువు, లరఁటికంబములదో యైనతొడలు,
ఘన మగుజఘనంబుఁ గడు లేఁతనడుమును, బల్లవారుణ కాంతిపాణియుగముఁ,
గడుదొడ్డపాలిండ్లుఁ, గంబుకంఠంబును, బింబాధరముఁ, జంద్రబింబముఖముఁ
దెలిగన్నుఁగవయును, నలికుంతలంబును, బాలేందుసన్నిభ ఫాలతలము
తే. నమరఁ, గుండలకేయూరహారకంక - ణాదు లేపార, మంజీరనాద మొప్ప;
నల్లనవ్వులఁ బద్మదళాక్షుఁ డసుర - పతుల నడఁగింప; నాఁడురూపంబు దాల్చి.

వ. అయ్యవసరంబున జగన్మోహనాకారంబున. 302

సీ. పాలిండ్లపై నున్నపయ్యెద జాఱించు; జాఱించి మెల్లన చక్క నొత్తు;
దళ్కుదళ్కనుగండఫలకంబు లొలయించు: నొలయించి కెంగేల నుజ్జగించుఁ;
గడుమెఱుంగులు వాఱుకడకన్ను లల్లార్చు; నల్లార్చి తెప్పల నండగొలుపు;
నవరనిదరహాసచంద్రికఁ జిలికించుఁ; జిలికించి కెమ్మోవిఁ జిక్కవఱచు;

1. గ్రహింపఁగా.

తే. దళిత[1]ధమ్మిల్లకుసుమగంధమ్ము నెఱపుఁ; గంకణాదిఝణంకృతుల్ గడలుకొలుపు;
నొడలికాంతులు పట్టులే కులుకఁ బాఱు-సన్నవలింపుఁబ[2]య్యెద చౌకళింప.

వ. ఇవ్విధంబున నక్కపటయువతీరత్నంబు, జగన్మోహన దేవతయునుంబోలె, నెమ్మొగంబుతావికి మత్తిల్లిన తేఁటిమొత్తంబులఁ గెలిచి, చిగురుజొంపంబుల నెడగలుగ జడియుచు, ముఱియుచుండ రాక్షసవరులు గనుంగొని. 304

సీ. "అవ్వుఁగదే లావణ్య?మవ్వుఁగదే మాధుర్య? మవ్వుఁగదే సతి నవయౌవనాంగి?
యెటనుండి వచ్చితి? యేమి [3]యిచ్ఛించెదు? నీనామమెయ్యది నీరజాక్షి!
యమరగంధర్వసిద్ధాసురచారణమనుజ కన్యలకు నీమహిమ గలదె?
ప్రాణచిత్తేంద్రియపరిణామదాయి వై నిర్మించెఁ బో విధి, నిన్నుఁ గరుణ
తే. వనిత! కశ్యపుసంతతివార; మేము - భ్రాతలము సురలకు; నిద్ధపౌరుషులము
జ్ఞాతులకు. మాకు [4]నేకార్థసంగతులకుఁ - బాలు దీఱనియర్థంబు పంచి యిమ్ము.

క. సభ వై యుండెద మిందఱ, - మభయంబున వచ్చుకొలఁది నమృతంబును నీ
విభరాజగమన! తప్పక - విభజింపు విపక్షపక్షవిరహిత మతి వై" 306

వ. అని మందలించినదైత్యులం గని, మాయాయువతిరూపుం డగుహరి తనవాఁడి వాలుచూపుటంపఱవలన వారల[5]తాలుముల నగలించి, చిఱునగవు లెగయ మొగ మెత్తి యి ట్లనియె. 307

క. సుందరు లగుపురుషులఁ గని - పొందెడునాయందు బుద్ధిపుట్టునె? మీకున్
బృందారకరిపులారా! - చెందరు కామినుల; విశ్వసింపరు పెద్దల్. 308

క. పలుకులు మధురసధారలు; - దలఁపులు నానాప్రకారదావానలముల్;
చెలుములు సాలావృకములు; - చెలువల నమ్ముటలు వేదసిద్ధాంతములే? 309

క. నా నేర్చుకొలఁది మీకును - మానుగ విభజించి యిత్తు; మానుఁడు శంకం;
గానిం; డనవుడు నిచ్చిరి - దానవు లమృతంపుఁగడవఁ దరుణీమణికిన్. 310

క. ఆశాంతాలోకనములు - నాశీతలభాషణములు నాలాలితముల్
రాశిపరంపర లగుచుం - బాశము లై, వారినోళ్ళు బంధించె నృపా! 311

వ. ఇట్లు సుధాకలశంబు కేలనందికొని, మందస్మితభాషణంబుల సుందరీరూపుం డగు ముకుందుండు "మేలు గీ డనక నేను బంచి యిచ్చిన తెఱంగున నంగీకరించుట కర్తవ్యం;" బనవుడు "నగుం గాక!" యని, సురాసురదైత్యదానవసమూహం బుపవసించి, కృతస్నాను లై, హోమంబులాచరించి, విప్రులకు గోభూహిరణ్యాది దానంబులు సేసి, తదాశీఃప్రవచనంబులు గైకొని, ధవళపరిధాను లై,

1. కొప్పు. 2. పయి + ఎద = పైఁట. 3. కోరుదువు. 4. ఒకేకార్యము గలవారము. 5. ఓర్పులు.

గంధమాల్యభూషాదీపాలంకృతం బగుకనకరత్నశాలామధ్యంబునఁ బ్రాగగ్రకుశ
పీఠంబులం బూర్వదిశాభిముఖులై పంక్తులు గొని, యున్నసమయంబున. 312

క. శ్రోణీభరకుచయుగభర - వేణీభరములను డస్సి, వివిధాభరణ
క్వాణ యయి, యువిద వచ్చెను-బాణిసరోజమున నమృతభాండముఁ గొంచున్.

క. భాసురకుండలభాసిత - నాసాముఖకర్ణగండనయనాంచల యై,
శ్రీసతి యగుసతిఁ గని, దే - వాసురయూథంబు మోహ మందె నరేంద్రా!

వ. అప్పుడు. 315

క. ''అసురులకమృతము వోయుట-పోసఁగదు; పాములకుఁ బాలు వోసినమాడ్కిన్
దోసఁ గగు;'' నంచును వేఱొక-దెసఁ గూర్చుండంగఁ బెట్టె [1]దేవాహితులన్.

వ. ఇట్లు రెండుపంక్తులుగా నేర్పరించి. 317

సీ. ''వేగిరపడకుఁడీ వినుఁడు దానవులార! తడవు సేయక వత్తు దైత్యులార!
యటు సక్కఁగూర్చుండుఁ,'' డని కన్నులల్లార్చి, చనుఁగవపయ్యెద జాఱఁ దిగిచి,
వదినెమఱందలి [2]వావులు కల్పించి, మర్మంబు లెడలించి, మఱుఁగు సేసి,
మెల్లనినగవుల మేనులు మఱపించి; కడుజాణమాటలఁ గాకుపఱిచి;

ఆ. యసురవరులనెల్ల నడకించి, సురలను-''దడవు సేయ వలదు; ద్రావుఁ;''డనుచు
వచ్చుకొలఁది నమృతవారి విభాగించెఁ-దరుణి దివిజులెల్లఁ దనిసి పొగడ. 318

వ. అయ్యవసరంబున. 319

సీ. మనకు వేల్పులకును మందట లే కుండఁ బంచి పెట్టెదనని పడఁతి పూనెఁ;
దా నేల తప్పును; దప్పదు; తరళాక్షి గాక; రమ్మనుచును గడఁక బిల్వ
మఱుమాటలాడదో? మఱి చూడకుండునో? చనుఁగవఁ గప్పునో? చాలుననుచు,
నొండొడ కలుగుచు నొక్కింతసొలయునో? మనమెడఁ గందునో? మగువయనుచు,

ఆ. నెలఁతచూడ్కిఁ గముల నీరై కరంగుచుఁ-[3]బ్రణయభంగభీతి బద్ధు లగుచు,
నూరకుండ్రు; గాని, యువిద! తే తెమ్మని-యడుగఁ జాల రప్పు డసురవరులు.

వ. అప్పుడు. 321

మ. అమరవ్రాతములోనఁ జొచ్చి, దివిజుం డై, రాహు [4]పీయూషపా
నము సేయం గని, చంద్రభాస్కరులు సన్నల్ సేయ, నారాయణుం
డమరారాతిశిరఁబు చక్రహతిఁ డున్మాడెన్; సుధాసిక్త మై
యమరత్వంబును జెందె మూర్ధము;దదన్యాంగంబు నేలం బడెన్. 322

---

1. రాక్షసులను. 2. వరుసలు బంధుమర్యాదలు. అన్న, బావ మొదలగునవి, 3. ప్రేమ చెడిపోవునను భయముతో. 4. అమృతమును ద్రావుట.

ఆ. అజుఁడు వానిశిరము నంబరవీథిని-గ్రహము సేసి పెట్టి, గారవించె;
వాఁడు పర్వములను వైరంబు దప్పక-భానుచంద్రములను బట్టుచుండు. 323

క. ఒకబొట్టుఁ జిక్కకుండఁగ-సకలసుధారసము నమరసంఘంబులకుం
బ్రకటించి పోసి, హరి దన, సుకరాకృతిఁ దాల్చె నసురశూరులు బెగడన్.

మ. అమరుల్ రక్కసులుం బ్రయాసబలసత్త్వార్థాభిమానంబులన్
సములై లబ్ధవికల్పులైరి; యమరుల్ సంశ్రేయముం బొందిరి; ర
య్యమరారుల్ బహుదుఃఖముల్ గనిరి తా మత్యంతదౌర్గత్యులై;
కమలాక్షున్ శరణంబు వేడనిజనుల్ గల్యాణసంయుక్తులే? 325

క. దానవు లమృతము ద్రావం-బూని, బయోరాశిఁ దచ్చి, పోగిలినమాడ్కిన్
శ్రీనాథపరాఙ్ముఖులగు-హీనులు వొందంగఁ జాల రిష్టార్థంబుల్. 326

క. శోధించి, జలధి నమృతము, సాధించి, నిలింపవైరిచతురంగబలన్
[1]రోధించి, సురలకిడి, హరి, బోధించి-ఖగేంద్రునెక్కి పోయె నరేంద్రా! 327

దేవాసురయుద్ధము

క. శుద్ధముగ సురల కమృతము-సిద్ధించిన నసురవరులు చిడిముడిపడుచున్
గ్రుద్ధులు నానాయుధస-న్నద్ధులు నయి, యుద్ధమునకు నడచిరి బలిమిన్. 328

క. ధన్యులు వైరోచనిశత-మన్యుప్రముఖులు మదాభిమానులు దమలో
నన్యోన్యరణము బాహా-విన్యాసంబులను బేర్చి, వెలసిరి కడిమిన్. 329

మ. అరుదై, కామగమై, మయాసురకృతంబై, లోకితాలోక్యమై,
వరశస్త్రాస్త్రసమేతమై, [2]తరళమై, వైహాయసంబై, మహా
సురయోధాన్విత మైనయానమున సంశోభిల్లెఁ; బూర్ణేందు సు
స్థిరకాంతిన్ బలి చామరధ్వజచమూదీప్తస్థితిన్ ముందటన్. 330

వ. మఱియు నముచి శంబర బాణ ద్విమూర్ధ కాలనాభ శకుని జంభాయోముఖ
ప్రహేతి హేతి భూతసంత్రాస హయగ్రీవ కపి ఇల్వ లోత్కల మేఘదుందుభి
మయ త్రిపురాధిప విప్రచిత్తి విరోచన వజ్రదంష్ట్ర తార కారిష్టారిష్టనేమి శుం
భ నిశుంభ శంకు శిరగప్రముఖులును, పౌలోమకాలేయులును, నివాతకవచప్ర
భృతులును,దక్కినదండయోధులునుం గూడికొని, యరదంబులం, దురగంబుల,
మాతంగంబుల,హరిణంబుల, హరి కిరి శరభ మహిష గవయ ఖడ్గ గండభేరుండ
చమరీ జంబుక శార్దూల గోవృషాదిమృగంబులను, గంక గృధ్ర కాక కుక్కుట
బక శ్యేన హంసాదివిహంగంబులను, దిమితిమింగిలాదిజలచరంబులను,నరులను,
నసురసురనికరవికృతవిగ్రహరూపంబులగు జంతువులను నారోహించి, తమకు

1. అడ్డగించి. 2. చలించునది.

నడియాలంబు లగుగొడుగులు [1]పడగలు, జోడుగైదువులు, పక్కెరలు, బొమిడికంబులు మొదలగు [1]పోటుముట్లాయితంబుగఁ గైకొని, వేఱువేఱ మొనలై, విరోచననందనుం డగుబలిముందట నిలువంబడిరి; దేవేంద్రుండును నైరావతారూఢుండై వైశ్వానరవరుణవాయుదండధరాద్యనేకనిర్జరవాహినీసందోహంబును దాను నెమరుపడి, పిఱుతివియక మోహరించె; నట్లు సంరంభసన్నాహసముత్సాహంబుల రెండుదెఱంగులవారును బోరాడువేడుకల మీఁటగుమాటల సందడించుచున్న సమయంబున. 331

సీ. వజ్రదంష్ట్రాంచితవ్యజనంబులును, బర్హ చామరంబులు, సితచ్ఛత్రములును,
జిత్రవర్ణధ్వజచేలంబులును, వాతచలితోత్తరోష్ణీషజాలములును,
జప్పళ్ళ నెసఁగుభూషణకంకణంబులుఁ, జండాంశురోచులశస్త్రములను,
వివిధఖేటకములు, వీరమాలికలును, బాణపూర్ణములైన తూణములును,
ఆ. నిండి, పెచ్చు రేఁగి, నిర్జరాసురవీర-సైన్యయుగ్మకంబు సాల నొప్పె;
గ్రాహతతులతోడఁ గలహంబునకు వచ్చు-సాగరములభంగి జనవరేణ్య! 332

క. భేరీభాంకారంబులు,-వారణఘీంకారములును, వరహరిహేషల్,
భూరిరథనేమిరవములు,-ఘోరములై పెల్లగించెఁ గులశైలములన్. 333

వ. ఇవ్విధంబున నుభయబలంబులును మోహరించి, బలితో నింద్రుండును, దారకునితో గుహుండును, హేతితో వరుణుండును, బ్రహేతితో మిత్రుండును, గాలనాభునితో యముండును, మయునితో విశ్వకర్మయు, శంబరునితోఁ ద్వష్టయు, విరోచనునితో సవితయు, నముచితోఁ బరాజితుండును, వృషపర్వునితో నశ్విదేవతలును, బలిసుతబాణాదిపుత్రశతంబుతో సూర్యుండును, రాహువుతో సోముండును, బులోమునితో ననిలుండును, శుంభనిశుంభులతో భద్రకాళీదేవియు, జంభునితో వృషాకపియును, మహిషునితో విభావసుండును, నిల్వలవాతాపులతో బ్రహ్మపుత్త్రులును, దుర్మర్షణునితోఁ గామదేవుండును, నుత్కలునితో మాతృకాగణంబును. శుక్రునితో బృహస్పతియు, నరకునితో శనైశ్చరుండును, నివాతకవచులతో మరుత్తులును, గాలేయులతో వసువులు నమరులును, బౌలోములతో విశ్వేదేవగణంబును, గ్రోధవశులతో రుద్రులును, నివ్విధంబునం గలసి పెనంగి, ద్వంద్వయుద్ధంబు సేయుచు, మఱియు రథికులు రథికులను, పదాతులు పదాతులను, వాహనారూఢులు వాహనారూఢులనుం దాఁకి సింహనాదంబులు సేయుచు, నట్టహాసంబు లిచ్చుచు, నాహ్వానంబు లొసంగుచు, నన్యోన్యతిరస్కారంబులు సేయుచు, బహునాదంబుల విజృంభించుచుఁ [3]బెనుబొబ్బల నుబ్బి రేఁగుచు, హుంకరించుచు, నహంకరించుచు, ధనుర్గుణం

1. యుద్ధసాధనములు, 2. వెనుకకు మఱలక. 3. గొప్పకేకలు, సింహనాదములు.

బులఁ దంకరించుచు, శరంబుల నాటించుచు, బరశువుల నఱకుచుఁ, జక్రంబులం జెక్కుచు, శక్తులం దునుముచుఁ, గశలం బెట్టుచుఁ, గుఠారంబులఁ బొడుచుచు, గదల నడచుచు, గరంబులఁ బొడుచుచుఁ, గరవాలంబుల వ్రేయుచుఁ, బట్టిసంబుల నొంచుచుఁ, బ్రాసంబులం ద్రెంచుచు, బాశంబులం గట్టుచుఁ, బరిఘంబుల మొత్తుచు, ముసలంబుల మోఁదుచు, ముద్గరంబులఁ జదియుచు, ముష్టివలయంబుల ఘట్టించుచు, దోమరంబుల నుఱుముచు, శూలంబులఁ జిమ్ముచు, నఖంబులం జీరుచుఁ, దరుశైలంబుల ఱువ్వుచు, [1]నుల్ముకంబులం జూఁడుచు, నిట్లు బహువిధంబులం గలహవిహారంబులు సలుపునవసరంబున, భిన్నంబులైనశిరంబులును, విచ్ఛిన్నంబులైనకపాలంబులును, వికలంబులైన కపోలంబులును, జిక్కువడిన కేశబంధంబులును, భగ్నంబులైనదంతంబులును, గృత్తంబులైనభుజంబులును, ఖండితంబులైనకరంబులును, విదళితంబులైన [2]మధ్యంబులును, వికృతంబులైనవదనబింబంబులును, వికలంబులైననయనంబులును, వికీర్ణంబులయినకర్ణంబులును, విశీర్ణంబులైననాసికలును, విఱిగిపడిన యూరుదేశంబులును, విసంధు లయినపదంబులును. జిరిఁగినకంకటంబులును, రాలినభూషణంబులును, వ్రాలిన కేతనంబులును, గూలినఛత్త్రంబులును, మ్రొగ్గిన గజంబులును, నుగ్గయినరథంబులును,నుఱు మైనహయంబులునుఁజిందఱవందఱలైనభటసమూహంబులును, నొఱలెడు కొఱప్రాణంబులును, బొరలెడుమేనులును, నుబ్బియాడెడు భూతంబులును, బాఱెడురక్తప్రవాహంబులును, గట్టలు గొన్నమాంసంబులును, నెగసితిరిగెడికళేబరంబులును, గలకలంబులుసేయుకంకగృధ్రాదివిహంగంబులునయి, యొప్పు నప్పో రతిఘోరం బయ్యె నప్పుడు. 334

శా. నాకాధీశుఁ బదింట, మూఁట గజమున్, నాల్గింట, గుఱ్ఱంబులన్
ఏకాస్త్రంబున, సారథిం జొనిపె దైత్యేంద్రుండు; వీరిన్ సువ
ర్లోకాధీశుఁడు ద్రుంచి యన్నిటిని, [3]దోఃస్తో నన్నిభల్లంబులన్
రా కుండన్ రిపువర్గముం దునిమె గీర్వాణారి యగ్గింపఁగన్, 335

సీ. తనతూపులన్నియుఁ దరమిడి శక్రుండు నఱికిన జోదువిన్ననువు మెఱసి,
బలి మహాశక్తిచేఁ బట్టిన నదియును నతఁడు ఖండించె నత్యద్భుతముగ;
మఱి ప్రాసశూలతోమరములు గైకొన్నఁ దోఃస్త్రోడ నవియును దునిమి వైచె;
నంతటఁ బోక యెయ్యది వాఁడు సాధించెఁ, దొడరి తా నదియును దుమురుసేసె;
ఆ. నసురభర్త విరథుఁడై తనపగఱకుఁ-గానఁబడక వివిధకపటవృత్తి
నేర్పు మెఱసి, మాయ నిర్మించె మింటను-వేల్పుగములు సూచి వెఱఁగుపడఁగ.

వ. ఇట్లు దానవేంద్రునిమాయావిశేషవిధానంబున సురానీకంబులపైఁ బర్వతంబులు వడియె, దావాగ్నిదందహ్యమానతరువర్షంబులు గురిసె, సటంకశిఖరనికరశిలా

1. కొఱవులు. 2. నడుములు. 3. వెన్వెంట.

సారంబులు గప్పె, మహోరగదందశూకంబులు గఱచె, వృశ్చికంబులు
మీటె, వరాహవ్యాఘ్రసింహంబులు గదిసి విదళింపం దొరకొనియె, వన
గజంబులు పట్టి మల్లాడం జొచ్చె, శూలహస్తులు దిగంబరులు నై "రంపు
రం" డని బలురక్కసులు శతసహస్రసంఖ్యలు ఛేదనచ్ఛేదనభాషణంబులు
సేయం దొడంగిరి, వికృతవదనులు గదాదండధారులు నాలంబితకేశభారులునై
యనేకరాక్షసవీరులు "పోనీకు పోనీకుఁడు; తునుము తునుముం;" డని వెను
తగిలిరి, పరుషగంభీర నిర్ఘాతసమేతంబు లయినజీమూతసంఘాతంబులు వాతా
హతంబు లై యుప్పతిల్లి నిప్పులకుప్పలు మంటలప్రోవులుం గురిసె; మహాపవన
విజృంభిత మైనకార్చిచ్చు ప్రళయానలంబుచందంబునం దరికొనియె; ప్రచండ
ఝంఝూనిలప్రేరిత సముత్తుంగతరంగావర్తభీషణం బయినమహార్ణవంబు
సెలియలికట్ట దాఁటి వెల్లివిరిసిన ట్లమేయం బై యుండె; నాసమయంబునం
బ్రళయకాలంబునుంబోలె మిన్ను మన్నును రేయుం బగలు నెఱుంగ రా
దయ్యె; నయ్యవసరంబున. 337

క. ఆయసురేంద్రునిబహుతర-మాయాజాలంబులకును మా టెఱుఁగక వ
జ్రాయుధముఖరాత్యు*ల-పాయంబును బొంది చిక్కువడిరి నరేంద్రా! 338

వ. అప్పుడు. 339

క. ఇయ్యసురులచేఁ జిక్కితిఁ;-మెయ్యది దెరు; వెందుఁ జొత్తు;మిటు వోలయుఁ గదే!
యయ్యో! దేవ! జనార్దన!-కుయ్యో! మొఱ్ఱో! యటంచుఁ గూయిడి రమరుల్.

వ. అని మొఱ యిడునవసరంబున. 341

మ. విహగేంద్రాశ్వనిరూఢుఁ డై, మణిరమావిభ్రాజితోరస్కుఁ డై,
బహుశస్త్రాస్త్రరథాంగసంకలితుఁ డై, భాస్వత్కిరీటాదిదు
స్సహుఁ డై, నవ్యపిశంగచేలధరుఁ డై, సంఫుల్లపద్మాక్షుఁ డై,
విహితాలంకృతితోడ మాధవుఁడు దా వేంచేసె నచ్చోటికిన్. 342

చ. అసురుల మాయ లన్నియును నబ్జదళాక్షుఁడు వచ్చినంతటం
గసిబిసి యై, నిరర్థ మయి, గ్రక్కునఁ బోయెను; నిద్ర నొంది సం
తసమున మేలుకొన్నగతిఁ దాల్చి చెలంగిరి వేల్పులందఱుం;
బస చెడ కేల యుండు హరిపాదపరిష్కృతి సేయ నాపదల్. 343

వ. అయ్యెడ. 344

ఆ. కాలనేమి ఘోరకంఠీరవము నెక్కి-తార్క్ష్యుశిరము శూలధారఁ బొడువ,
నతని[1]పోటుముట్టు హరి కేల నంకించి-దానఁ జావఁ బొడిచె దానవునిని. 345

---

* ముఖరశబ్దము ముఖార్థమున ఇందు పలుచోట్ల వింతగా ప్రయుక్తమైనది.

1. యుద్ధసాధనము (శూలము)

క. పదపడి మాలిసుమాలులు - బెదరించినఁ దలలు ద్రుంచెఁ బృథుచక్రహతిన్
గదఁగొని గరుడుని జెక్కులు - చెదరించిన మాల్యవంతు శిరమున్ వ్రేసెన్. 346

వ. ఇట్లు పరమపురుషుం డగు హరి కరుణాపరత్వంబునం బ్రత్యుపలబ్ధమనస్కులైన
వరుణవాయువాసవప్రముఖులు పూర్వంబున నెవ్వారెవ్వరితోఁ గయ్యంబు
సేయుదురు; వారు వారలం దలపడి నొప్పించి; రయ్యవసరంబున. 347

క. బాహుబలంబున నింద్రుఁడు - సాహసమున బలిని గెలువ సమకట్టి, సము
త్సాహమున వజ్ర మెత్తిన - హాహానినదంబు సేసి రఖిలజనములున్. 348

వ. ఇట్లు సముద్యతభిదురహస్తుం డై యింద్రుండు దనపురోభాగంబునం బరాక్ర
మించుచున్న విరోచననందను నుపలక్షించి యి ట్లనియె. 349

మ. "జగతిన్ వైరి మొఱంగి గెల్చుటదియున్ శౌర్యంబె? ధైర్యంబె? తా
మగవాఁ డయ్యును దన్నుఁ దా నెఱిఁగి, సామర్థ్యంబునుం గల్గియున్
బగవానిం గని, డాఁగెనేని, మెయి సూపం జాలఁడేనిం, గటా!
నగరే బంధులు? దిట్టరే బుధులు' గన్యల్ గూర్తురే? దానవా! 350

శా. మాయల్ సేయఁగ రాదు; పో; నగవులే మాతోడి పోరాటముల్?
దాయా! చిక్కితి వ్రక్కలించెదఁ [1]గనద్దంభోళిధారాహతిన్
నీయిష్టార్థము నెల్లఁ జూడుము; వెసన్ నీవారలం గూడుకో;
నీయాటోపము నిర్జరేంద్రుఁ డడఁచున్ నేఁ డాజిలో దుర్మతీ!" 351

వ. అని యుపాలంభించిన విని విరోచననందనుం డి ట్లనియె. 352

శా. "నీవే పోటరివే? సురేంద్ర! తెగడన్ నీకేల గెల్పోటముల్?
లేవే? యెవ్వరిపాలఁ బోయినవి? మే ల్గీడుల్ విరించాదులుం
ద్రోవం జాలుదు రెవ్విధానమున? సంతోషింప శోకింప నా
దైవం బేమి? కరస్థలామలకమే? దర్పోక్తులుం బాడియే? 353

ఆ. జయము లపజయములు, సంపద లాపద - [2]లనిలచలితదీపికాంచలములు,
చంద్రకళలు, మేఘచయములు, దరఁగలు - మెఱుఁగు, లమరవర్య! మిట్టిపడకు."

వ. అని యిట్లాక్షేపించి. 355

క. వీరుఁడు దానవనాథుఁడు - నారసముల నింద్రు మేన నాఁటించి, మహా
ఘోరాయుధకల్పము లగు - శూరాలాపములు సెవులఁ జొనిపెన్ మరలన్.

వ. ఇట్లు [3]తథ్యవాది యైన బలిచే నిరాకృతుం డై. 357

---

1. ప్రకాశించు వజ్రాయుధము. 2. గాలిచేఁ గదలింపఁబడిన దీపము యొక్క కొసభాగములు.
3. సత్యము పలుకువాఁడు.

క. శత్రువు నాక్షేపంబునఁ - దోత్త్రాహతగజముభంగిఁ ద్రుళ్లుచు, బలి నా
వృత్త్రారి వీచి వైచిన - గోత్త్రాకృతి నతఁడు నేలఁ గూలె నరేంద్రా! 358

క. చెలికాని పాటు గనుఁగొని - బలిసఖుఁ డసురజంభుఁ డతులబాహాశక్తిం
జెలితనము సాల నెఱపుచు-''నిలు నిలు'' మని, వీఁకఁ దాఁకె నిర్జరనాథున్

క. పంచాననవాహనుఁ డై - చంచద్గద జంభుఁ డెత్తి, శైలారిని దాఁ
కించి, [1]సురేభంబును నొ - ప్పించి, విజృంభించి, యార్చి పేర్చెం గడిమిన్.

క. వీఁక సెడి, ఘనగదాహతిఁ - దోఁకయుఁ గదలింప లేక, దుస్సహపీడన్
మ్రోఁకరిలఁ బడియె నేలను; - సోఁకోర్వక దిగ్గజంబు సుడిసుడిగొంచున్. 361

వ. అయ్యెడ. 362

క. సారథి వేయుహయంబుల - తే రాయితపఱచి తేర, దేవేంద్రుఁడు దా
నారోహించెను; దైత్యుఁడు - దారత మాతలిని శూలధారం బొడిచెన్. 363

ఆ. శూలనిహతి నొంది, స్రుక్కక యార్చిన-సూతు ''వెఱకు'' మంచు సురవిభుండు
వానిశిరముఁ దునిమె వజ్రఘాతంబున - దైత్యసేన లెల్లఁ దల్లడిల్ల. 364

చ. చని సురనాథుచేఁ గలన జంభుఁడు చచ్చుట నారదుండు చె
ప్పిన విని, వానిభ్రాతలు గభీరబలాధికుఁ డాబలుండు పా
కనముచు లాపురందరునిఁ గాంచి, ఖరోక్తులఁ దూల నాడుచున్
ఘనబలధారలన్ నగముఁ గప్పినచాడ్పునఁ గప్పి రమ్ములన్. 365

సీ. విబుధలోకేంద్రుని వేయుగుఱ్ఱంబుల నన్నికోలల బలుఁ డదర నేసె;
నిన్నూటి మాతలి, నిన్నూటి రథమును, నారీతి నింద్రు [2]ప్రత్యంగకమును,
వేధించెఁ; బాకుండు వింట వాఁ డస్త్రంబు లేయుట, దొడుగుట, యెఱుఁగరాదు;
కనకపుంఖంబులకాండంబు లొకపదియేనింట నముచియు నేసి యార్చె; 366

ఆ. బలిమి నిట్లు ముగురు పగవాని రథసూత-సహితు ముంచి రస్త్రజాలములను;
వనజలోకసఖుని వానకాలంబున - మొగిలుగములు మునుఁగ మూఁగినట్లు.

వ. అయ్యవసరంబున. 367

మ. అమరారాతులబాణజాలములపా లై పోయితే? చెల్ల రే!
యమరాధీశ్వర! యంచు ఖిన్నతరు లై యంభోధిలోఁ జంచల
త్వమునం గ్రుంకువణిగ్జనంబులక్రియన్ దైత్యాధిపవ్యూహమ
ధ్యమునం జిక్కిరి, వేల్పు లందఱు విపద్ధ్యానంబులం జేయుచున్. 368

1. దేవతాగజము, ఐరావతము. 2. ఒక్కొక్కయవయవమును.

శా. ఓహో “దేవతలార! కుయ్యిడకుఁ; డే నున్నాఁడ;” నం[1]చంబుభృ
ద్వాహుం డాశరబద్ధపంజరము నంతం జించి, తేజంబునన్
వాహోపేతరథంబుతోడ వెలికిన్ వచ్చెన్; నిశాంతోల్లస
న్మాహాత్మ్యంబునఁ దూర్పునం బొడుచునామార్తాండుచందంబునన్. 369

వ. ఇట్లు వెలువడి. 370

చ. విఱిగినసేనఁ గాంచిఁ, సురవీరుఁ డోహో! యని బిట్టు చీరి, క్ర
మ్మఱఁ బురిగొల్పి, పాకబలమస్తకముల్ నిశితాస్త్రధారలన్
నెఱసినతీక్ష్ణవజ్రమున నేలకు వ్రాల్చెను; వానిచుట్టముల్
వెఱచిరి; తచ్చమూపతులు విహ్వలులై చెడి పాఱి రార్తితోన్. 371

వ. అప్పుడు నముచి నిలువంబడి. 372

మ. “తనచుట్టంబులఁ జంపె వీ”డనుచు నుద్యత్క్రోధశోకాత్ముఁడై
కనకాంతంబును నశ్మసారమయముం ఘంటాసమేతంబునై
జనదృగ్దుస్సహమైనశూలము నొగిన్ సారించి, వైచెన్ సురేం
ద్రునిపై; “దీన హతుండ వౌ”దని మృగేంద్రుం బోలి గర్జించుచున్. 373

శా. ఆకాశంబున వచ్చుశూలమును జంభారాతి ఖండించి నా
నాకాండంబుల వానికంఠము దెగన్ [2]దంభోళియుం వైచె న
స్తోకేంద్రాయుధముం సురారిగళముం ద్రుంపంగ లే దయ్యె; వాఁ
డాకంపింపక నిల్చె దేవవిభు డత్యాశ్చర్యముం బొందఁగన్. 374

వ. ఇట్లు నిలిచి యున్ననముచిం గనుంగొని, వజ్రంబు ప్రతిహతం బగుటకు శంకించి, బలభేది తనమనంబున. 375

సీ. కొండలఱెక్కలు ఖండించి వైచుచో వజ్ర మెన్నఁడు నింత వాఁడి సెడదు?
వృత్రాసురాదుల విదళించుచో నిది తిరుగ దెన్నఁడు పనిఁ దీర్చికాని?
యింద్రుండఁ గానొకో యేను? దంభోళియుఁ గాదొకో యిది? ప్రయోగంబు సెడెనొ?
దనుజాధముఁడు మొనతాఁకు దప్పించెనో? [3]భిదురంబు నేఁ డేల బెండుపడియె?

ఆ. ననుచు వజ్రి వగవ, “నార్ద్రశుష్కంబులఁ-జావకుండఁ దపము సలిపె నీతఁ
డితరమెద్ది యైన నింద్ర! ప్రయోగింపు;-వైళ”, మనుచు దివ్యవాణి పలికె.

వ. ఇట్లాదేశించిన దివ్యవాణిపలుకు లాకర్ణించి పురందరుండు, 377

ఆ. ఆత్మబుద్ధిఁ దలఁచి, యార్ద్రంబు శుష్కంబు, గానిసాధనంబు [4]ఫేనమనుచు
నది యమర్చి; దాన నమరులు మెచ్చంగ-నముచిశిరముఁ ద్రుంచె నాకవిభుఁడు.

---

1. ఇంద్రుఁడు. 2. వజ్రాయుధము. 3. వజ్రాయుధము. 4. నురుగు.

వ. అయ్యవసరంబున. 379

సీ. పురుహూతు నర్చించి, పుష్పాంజలులు సేసి, మునులు దీవించిరి ముదముతోడ;
గంధర్వముఖ్యులు ఘనులు విశ్వావసుండును బరావసుఁడు నింపెనయఁ బాడి;
రమరాంగనాజనులాడిరి; దేవతాదుందుభులును మ్రోసె; దురములోన,
వాయువహ్నికృతాంతవరుణాదులు [1]బ్రతిద్వంద్వుల గెల్చి దుర్దండవృత్తి;

తే. నల్పమృగముల సింహంబు లట్ల తోలి-రమరవర్యులు దనుజుల నదటు వాయ;
నజుఁడు పుత్తేర నారదుఁ డరుగుదెంచె, దైత్యహరణంబు వారింప ధరణినాథ!

వ. వచ్చి సురలకు నారదుం డిట్లనియె. 381

శా. "సిద్ధించెన్ సురలార! మీ కమృతమున్; శ్రీనాథసంప్రాప్తులై
వృద్ధిం బొందితి రెల్లవారలును; విద్వేషుల్ మృతిం బొంది; రీ
యుద్ధం బేటికి? నింకఁ జాలుఁ; బని లే; దోహో! [2]పురే! యంచు సం
బద్ధాలాపము లాడి మాన్పె సురలం బాండవ్యవంశాగ్రణీ! 382

వ. ఇట్లు నారదవచననియుక్తులై రాక్షసులతోడిసంగ్రామంబు చాలించి, సకల దేవముఖ్యులును ద్రివిష్టపంబునకుం జనిరి; హతశేషులైన దైత్యదానవులు విపన్నులైనబలిం దోడ్కొని, పశ్చిమశిఖరిశిఖరంబుఁ జేరిరి: విధ్వంసమాన కంధరులై, వినష్టదేహు లగుయాతుధానచరుల నెల్లను శుక్రుండు మృతసంజీవని యైనతనవిద్య పెంపునం జేసి బ్రదికించె; బలియును భార్గవానుగ్రహంబున విగతశరీరవేదనుండై, పరాజితుం డయ్యును, లోకతత్త్వవిచక్షణుం డగుటం జేసి దుఃఖింపక యుండె" నని చెప్పి రాజునకు శుకుం డిట్లనియె. 383

సీ. "కైలాసగిరిమీఁద ఖండేందుభూషణుం డొకనాఁడు గొలువున నున్నవేళ
నంగన యై, విష్ణుఁ డసురుల వంచించి, సురలకు నమృతంబు [3]నూరలిడుట
విని, దేవియును దాను వృషభేంద్రగమనుఁడై కడువేడ్క-భూతసంఘములుగొలువ
మధుసూదనుం డున్నమందిరంబున కేఁగి, పురుషోత్తముని చేతఁ బూజ వడసి

తే. తానుగూర్చుండిపూజించెదనుజవైరి-"కుశలమేమీకుమాకునుకుశల",మనుచు
మధురభాషలహరిమీఁదమైత్రినెఱపి-హరుఁడుపద్మాక్షుఁజూచి యిట్లనియెఁ బ్రీతి.

సీ. "దేవజగన్మయ! దేవేశ! జగదీశ! కాలజగద్వ్యాపకస్వరూప!
యఖిలభావములకు నాత్మయు హేతువునైన యీశ్వరుఁడ; వాద్యంతములకు
మధ్యంబు, బయలును, మఱి లోపలయు లేక పూర్ణమై, భూరిసత్య,
మానందచిన్మాత్ర, మవికార, మాద్య, మనన్య మశోకంబు, నగుణ, మఖిల

తే. సంభవస్థితిలయము లదంభకంబు-నైనబ్రహ్మంబు నీవ; నీయంఘ్రియుగము
నుభయసంగవిసృష్టులై యున్నమునులు-గోరి కైవల్యకాములై కొల్తు రెపుడు.

---

1 శత్రువులను. 2. ఆశ్చర్యమును దెలుపును. 3. సంపూర్ణముగా నిచ్చుట.

సీ. భావించి కొందఱు బ్రహ్మంబు నీ వని తలపోసి, కొందఱు ధర్మ మనియుఁ,
జర్చించి, కొందఱు సదసదీశ్వరుఁ డని, సరవిఁ గొందఱు శక్తిసహితుఁ డనియుఁ,
జింతించి కొందఱు చిరతరుం డవ్యయుం డాత్మతంత్రుఁడు, పరుం, డధికుఁ డనియుఁ,
దొడరి యూహింతురు; తుది నవ్యయద్వయసదసద్విశిష్టసంశ్రయుఁడ వీవు;
తే. తలఁప నొక్కింత వస్తుభేదంబు గలదె?, కంకణాదులు పసిఁడియొక్కటియ కాదె?
కడలు పెక్కైన వార్ధి యొక్కటియ కాదె-భేదమంచును నిను వికల్పింపవలదు.

సీ. [1]యద్విలాసము మరీచ్యాదు లెఱుంగరు; నిత్యుఁడ వై యున్న నేను నెఱుఁగ;
యన్మాయ నంధులై యమరాసురాదులు వనరెద; రఁట యున్నవార లెంత
యేరూపమునఁ బొంద కేపారుదువు నీవు; రూపి వై సకలంబు రూపు సేయ,
రక్షింపఁ, జెఱుపఁ, గారణ మైనసచరాచరాఖ్య మై విలసిల్లు దంబరమున;
తే. ననిలుఁ డేరీతి విహరించు, నట్ల నీవు-వలసి వర్తింతు, సర్వాత్మకత్వ మొప్ప
జగములకు, నెల్ల బంధమోక్షములు నీవ-నీవ సర్వంబుఁ దలపోయ నీరజాక్ష!

మ. ఘనతన్ నీ[2]మగపోఁడుముల్ పలుమఱుం గన్నారఁ గన్నార; మే
నిను విన్నారము; చూడ మెన్నఁడును మున్; నీయాఁడుఁజందంబు మో
హిని వై దైత్యులఁ గన్నుఁబ్రామి, యమృతం బింద్రాదిదేవాళి కి
చ్చిననీరూపముఁ జూపుమా! కుతుకముం జిత్తంబునం బుట్టెడిన్. 388
క. మగవాఁడ వై జగంబులఁ-దగిలిచి చిక్కులను బెట్టు[3]దంటకు నీకున్
మగువతనంబున జగములఁ-దగులముఁ బొందింప నెంతదడవు? ముకుందా!"

వ. అని పలుకు చున్నశూలపాణిచే నపేక్షితుం డై, విష్ణుండు భావగంభీరం బగు
నవ్వు నివ్వటిల్ల నవ్వామదేవున కి ట్లనియె. 390
శా. "శ్రీకంఠా! నిను నీవ యేమఱకుమీ? చిత్తంబు రంజించెదన్
నాకద్వేషుల డాఁగురించుటకు నై, నాఁ నేను గైకొన్నకాం
తాకారంబు [4]జవన్నిమజ్జనము; నీకై చూచెదేఁ; జూపెదం
గైకో నర్హము లంద్రు కాముకులు సంకల్పప్రభావంబులన్," 391

హరి తనమోహినీరూపంబుచే నీశ్వరుని మోహింపఁ జేయుట

వ. అని పలికి కమలలోచను డంతర్హితుం డయ్యె; నయ్యుమాసహితుం డయిన
భవుండు విష్ణుం డెటు వోయెనో? యెందుఁ జొచ్చెనో?" యని దశదిశలం
గలయ నవలోకించు చుండం దనపురోభాగంబున. 382

సీ. ఒకయెలదోఁటలో నొకవీథి నొకనీడఁ గుచకుంభములమీఁదికొంగు దలఁగఁ;
గబరికాబంధంబు గంపింప నుదుటిపైఁ జికురజాలంబులు చిక్కువడఁగ;

1. ఎవనియొక్క వేడుక. 2. పౌరుషములు-పురుషలీలలు. 3. సమర్థుఁడు. 4. లోకమునుముంచునది.

ననుమానమై మధ్య మల్లాడఁ, జెక్కులఁ గర్ణకుండలకాంతి గంతు లిడఁగ,
నారోహభరమున నడుగులు దడఁబడి, దృగ్దీప్తిసంఘంబు దిశలఁ గప్ప;
తే. వామకరమున జాఱినవలువఁ బట్టి, కనక నూపురయుగళంబు గల్లనంగఁ,
గంకణంబులఝుణఝుణత్కార మెసఁగ-బంతిచే నాడుప్రాయంపుటింతిఁ గనియె.

వ. కని, మున్ను మగువ మరగి, సగ మయినమగవాఁ డమ్మగువవయోరూపగుణ
విలాసంబులు దన్ను నూరింపఁ, గనుఱెప్ప వ్రేయక తప్పక చూచి, మెత్త
నయిన చిత్తంబున. 394

శా. "ఈకాంతాజనరత్న మెవ్వరిదొకో? యీయాఁడురూపంబు ము
న్నే కల్పంబులయందుఁ గాన; మఱుఁ డీయింతిన్ సృజింపంగఁ దా
లే కుం డెల్ల నిజంబు; వల్లభత నీలీలావతిం జేరఁ గా
నేకాంతుండు గలండొ? క్రీడలకు నా కీయింతి సిద్ధించునే?" 395

వ. అని మఱియుం జెఱకువిలుతునిమెఱవడిఁ దరపినసెఱబిరుదు వెఱంగుపడఁ,
దెఱవ దుఱిమినతుఱుముబిగిముడి వదలి కదలి భుజముల మెడల నదరి చెదరిన
కురులు నొసలిమృగమదతిలకంపుటసలు మసల, విసవిస నగుమొగముమెఱుం
గులు దశదిశలం బసలుకొలుపఁ, జిఱునగవుమెఱయ, నునుఁజెమటం దడంబడి
పులకరములు గులకరములుగాన, హృదయానందకం బగు కందుకంబుఁ గరా
రవిందంబునం దెమల్చి, యక్కునం జేర్చి, చెక్కున హత్తించి, చుబుకంబు
మోపి, చూచుకంబులం గదియించి, నఖంబుల మీటుచు, మెల్ల మెల్లన
గెల్లాడుకరకమలంబున కనకమణివలయంబులు ఝుణఝుణ యనం, గుచకల
శంబు లొండొంటి నొరయ, నెడమఁ గుడిం దడంబడ గ్రమ్మన నెగురఁ జిమ్ముచు,
నెగురఁ జిమ్మి తనకుఁ దానె కొన్ని చిన్నపన్నిదంబులు సేసికొని, బడుగు
నడుము బెడఁకి వడవడ వడంక, నతితిసరులు గలయఁబడఁ దిరుగుచు, తిరుగు
నెడఁ బెనఁకువలుగొనఁ జెవులతొడవులరుచులు గటముల నటనములు సలుపఁ,
బవిరిదిరిగి యొడియుచు, నొడిసి కెలంకులఁ జడియుచు, జడిసి [1]జడనుపడక
వలువనెలవు వదలి దిగంబడం, గటిస్థలంబునఁ గాంచీకనకమణికింకిణులు
మొరయఁ,జరణకటకమ్ములు గల్లుగల్లు మనం గరకంకణమణిగణములు మెఱయ
వెనుకొని యుఱికపట్టుచుఁ, బట్టి పుడమింబడవైచి, పాటువెంటన మింటి కెగ
సినఁ గెంటక కరంబునం గరంబు దిరంబయి పలుమఱు నెగయనడుచుచు,
నెగయునెడం దిగంబడుతఱిని నీలంపుమెఱుంగునిగ్గు సోగపగ్గంబులవలలు వైచి,
రాఁదిగిచినపగిది వెనుకొనంగ, విలోకన జాలంబులు నిగిడించుచు, మగిడిం
చుచుఁ, గరలాఘవంబున నొకటి, పది, నూఱు, వేయి, చేసి నేర్పులు వాటిం

1. మాంద్యములు పొందక,

చుచు, నరుణచరణకమలరుచుల నుదయశిఖరిశిఖర[1]తరణికరణిఁ సేయుచు, ముఖ
చంద్రచంద్రికలఁ జంద్రమండలంబులు గావించుచు, నెడనెడ సరోజదుర్గనిర్గత
చేలాంచలంబుఁ జక్కనొత్తుచుఁ, గపోలఫలకాలోలఘర్మజలబిందుబృందంబుల
నఖాంకురంబుల నోసరించుచు, నధరబింబారుణసంభ్రాంతసమాగతరాజకీరం
బులం జోపుచు, ముఖసరోజపరిమళాసక్తమత్తమధుపంబుల నివారించుచు,
మందగమనాభ్యాసకుతూహలాయత్తమరాళయుగ్మంబులకుం దలంగుచు, విలాస
వీక్షణానందితమయూరమిథునంబులకు నెడగలుగుచుఁ, బొదరిండ్ల యిఱుము
లకుంబోక మలంగుచుఁ, గరకిసలయాస్వాదకాముక కలకంఠ దంపతులకు
దూర మగుచుఁ, దీఁగెయుయ్యేలల నూఁగుచు, మాధవీమండపంబు లెక్కుచుఁ,
గుసుమరేణుపటలంబుల [2]గుబ్బళ్లు ప్రాకుచు, మకరందస్యందబిందుబృందంబు
నుత్తరించుచుఁ, గృతకశైలంబుల నారోహించుచుఁ, బల్లవపీఠంబులం బథి
శ్రమంబు పుచ్చుచు, లతాసౌధభాగంబులఁ బొడసూపుచు, నున్నతకేతకీస్తం
భంబుల నొరగుచుఁ, బుష్పదలఖచితవాతాయనంబులం దొంగిచూచుచుఁ, గమల
కాండపాలికల నాలంభించుచుఁ, జంపకగేహళీమధ్యంబుల నిలువంబడుచుఁ,
గదళికాపత్త్రకవాటంబుల నుద్ఘాటించుచుఁ, బరాగనిర్మితసాలభంజికానివహం
బుల నాదరించుచు, మణికుట్టిమంబుల మురియుచుఁ, జంద్రకాంతవేదికల నోల
యుచు, రత్నపంజరశారికానివహంబులకుం జదువులు సెప్పుచుఁ, గోరినక్రియం
జూచుచుఁ, జూచినక్రియ మెచ్చుచు, మెచ్చినక్రియ వెఱఁగుపడుచు, వెఱఁగు
పడినక్రియ మఱచుచు, మఱవక యేకాంతం బగునవ్వనాంతంబున ననంతవిభ్ర
మంబుల జగన్మోహిని యై విహరించుచున్నసమయంబున. 396

ఆ. [3]వాలుఁగంటివాఁడివాలారుఁజూపుల – శూలి ధైర్య మెల్లఁ గోలుపోయి,
తఱలి, యెఱుక లేక మఱచె గుణంబుల; – నాలి మఱచె; నిజగణాలి మఱచె.

వ. అప్పుడు. 398

ఆ. ఎగుర వైచి పట్ట నెడలేమిఁ జే దప్పి – వ్రాలుబంతిఁ గొనఁగ వచ్చునెడను
బడఁతివలువ వీడి పడియె మారుతహతిఁ–జంద్రధరునిమనము సంచలింప. 399

మ. రుచిరాపాంగిని, వస్త్రబంధనపరన్, రోమాంచవిభ్రాజితం,
గుచభారానమితం, గరద్వయపుటీగూఢీకృతాంగిం, జల
త్కచబంధం, గని మన్మథాతురత నాకంపించి, శంభుండు ల
జ్జ చలింపం, దనకాంత చూడఁ గదిసెం జంద్రాస్యకేల్దమ్మికిన్. 400

ఆ. పదము సేర వచ్చుఫాలాక్షుఁ బొడఁ గని – చీర వీడి పడిన సిగ్గుతోడ
మగువ నగుచుఁ, దరులమాటున డాఁగెను;–వేల్పుఱేఁడు నబల వెంటఁ బడియె.

---

1. సూర్యునివలె. 2. తిప్పలు-గుట్టలు. 3. సోగలైన కన్నులు కలది.

మ. ప్రబలోద్వృత్తకరేణిం గరీంద్రుఁడు రమింపన్ వచ్చులీలన్, శివుం
"డబలా! పోకుము; పోకుమీ;" యనుచు డాయంబాఱి, కెంగేలఁ ద
త్కబరీబంధము పట్టి సంభ్రమముతోఁ గౌఁగిళ్ల నోలార్చె, నం
త బహిఁగ్రప్రక్రియ నెట్టకేనిఁ గదియం దద్బాహునిర్ముక్త యై. 402

సీ. వీడి వెన్నున నాడువేణీభరంబుతోఁ, జఘనభారాగతశ్రాంతితోడ,
మాయావధూటి యై మరలి చూచుచుఁ బాఱువిష్ణునద్భుతకర్ము వెంటఁ దగిలి,
"యీశాను మరల జయించె మరుం;" డనఁ [1]గరిణివె న్ననుకరికరణిఁ దాల్చి,
కొండలు నేఱులుఁ గొలఁకులు వనములు దాఁటి, శంభుఁడు సనం, దన్మహాత్ము,
తే. నిర్మలామోఘవీర్యంబు నేలమీఁదఁ-బడినచోటెల్ల వెండియుఁ బైఁడియయ్యె;
ధరణివీర్యంబువడఁ,దన్నుఁదా నెఱింగి-దేవమాయాజడత్వంబు దెలిపె హరుఁడు.

క. జగదాత్మకుఁ డగుశంభుఁడు-మగిడెను హరి నెఱిఁగి; తనదుమాహాత్మ్యమునన్
విగతత్రపుఁ డై నిలిచెను,-మగువతనం బుడిగి హరియు మగవాఁ డయ్యెన్.

ఆ. కాముఁ గెలువవచ్చుఁ, [2]గాలారి గావచ్చు,-మృత్యుజయము గలిగి మెఱయవచ్చు
నాఁడువారిచూపుటంపఱ గెలువంగ - వశము గాదు త్రిపురవైరి కైన. 405

వ. ఇట్లు పురుషాకారంబు వహించినహరి హరున కి ట్లనియె. 406

సీ. "నిఖిలదేవోత్తమ! నీ వొక్కరుఁడు దక్క నెవ్వాఁడు నామాయ నెఱుఁగనేర్చు;
మానిని యైననామాయచే మునుఁగక, ధృతిమోహితుండవై తెలిసి తీవు;
కాలరూపంబునఁ గాలంబుతోడ నాయందును నీమాయ యధివసించు;
నీమాయ నన్ను జయింప నేరదు; నిజ; మకృతాత్ములకు నెల్ల ననుపలభ్య;
తే. మిపుడు నీ నిష్ఠపెంపున నెఱిఁగి;" తనుచు-సత్కరించిన సఖ్యంబు చాల నెఱపి,
దక్షతనయగణంబులుఁ దన్నుఁ గొలువ - భవుఁడువిచ్చేసెఁదగనిజభవనమునకు.

శా. పారావారముఁ ద్రచ్చుచోఁ, గిరిసముద్యద్భారమై కచ్ఛపా
కారుం డైన రమేశువర్తనము నాకర్ణింపఁ, గీర్తింప, సం
సారాంభోనిధిలో మునుంగుకుజనుల్ సంశ్రేయముం బొంది, వి
స్తారోదారసుఖంబుఁ జెందుదురు; తథ్యం బెంతయున్ భూవరా! 408

మ. ఎలమిన్ దైత్యుల నాఁడురూపమున మోహింపించి, [3]పీయూషముం
జలితాపన్నులకున్ సురోత్తములకుం జక్కన్ విభాగించి, ని
ర్మలరేఖల్ విలసిల్లు శ్రీవిభునిఁ దన్మాయావధూరూపముం
దలఁతున్; మ్రొక్కుదు నాత్మలోన దురితధ్వాంతార్కరూపంబుగన్." 409

వ. అని చెప్పి శుకుం డి ట్లనియె. 410

1. ఆఁడు ఏనుఁగు. 2. కాలమును జయించువాఁడు. 3. అమృతము.

తే. "నరవరాధీశ! యిప్పుడు నడుచుచున్న-వాఁడు సప్తమమనువు వై వస్వతుండు;
శ్రాద్ధదేవుం డనం దగు జనవరేణ్య!-పదురు నందను లతనికిఁ బ్రకటబలులు.

వ. వార లిక్ష్వాకుండును, నభగుండును, ధృష్టుండును, శర్యాతియు, నరిష్యంతుం డును నాభాగుండును, దిష్టుండును, గరూశకుండును, బృషధ్రుండును, వసు మంతుండును ననువారు పదుగురు రాజులు; పురందరుం డనువాఁ డింద్రుం; డాదిత్యమరుదశ్వివసురుద్రసంజ్ఞలు గలవారు దేవతలు; గౌతమకశ్యపాత్రి విశ్వామిత్రజమదగ్నిభరద్వాజ వసిష్ఠు లనువారు సప్తర్షు లయి యున్న వా; రందుఁ గశ్యపున కదితిగర్భంబున విష్ణుండు వామనరూపుం డై జనియించి, [1]యింద్రావరజుం డయ్యెఁ; నిప్పు డేడుమన్వంతరంబులు సెప్పంబడియెఁ; రాఁ గల మన్వంతరంబులును శ్రీహరిపరాక్రమంబునుం జెప్పెద; దత్తావధానుండ వై విను" మని శుకుం డి ట్లనియె. 412

సీ. "జననాథ సంజ్ఞయు ఛాయయు ననువారు గల రర్కునకు విశ్వకర్మతనయ
లిరువురు వల్లభ; లిట మున్న చెప్పితి.; బరఁగుఁ దృతీయము బడబ యనగ;
సంజ్ఞకు యముఁడును, శ్రాద్ధదేవుండును, యమునయుఁ బుట్టిరి హర్ష మెసఁగ;
ఛాయకుఁ దపతియు, సావర్ణియును, శనైశ్చరుఁడును, గలిగిరి; సంవరణుఁడు

తే. దపతి నాలిఁగఁ గైకొనెఁ దా వరించి-[2]యశ్వియుగళంబు బడబకు నవతరించె;
వచ్చు నష్టమవసువు సావర్ణి; వాఁడు,-తపము సేయుచు నున్నాఁడు ధరణినాథ!

క. ఒకపరి సూచిన వెండియు - నొకపరి సూడంగ లేక యుండుసిరులకై
యొకనొకనిచేటువేళకు-నొకఁ డొక్కఁడు మనువుఁ గాచి యుండు నరేంద్రా!

వ. సూర్యసావర్ణిమన్వంతరంబున నతనితనయులు నిర్మోహవిరజస్కాద్యులు, రాజు లును;సుతపోవిరజోమృతప్రభు లనువారు దేవతలును గాఁగలరు; గాలవుండును, దీప్తిమంతుండును, బరశురాముండును, ద్రోణపుత్త్రుం డగునశ్వత్థామయుఁ, గృపుండును, [3]మజ్జనకుం డగుబాదరాయణుండును, ఋష్యశృంగుండును, సప్తర్షులయ్యెదరు; వార లిప్పుడు దమతమయోగబలంబుల నిజాశ్రమమండ లంబులం జరియించు చున్నవారు; విరోచననందనుం డగుబలి యింద్రుం డయ్యెడు;" నని చెప్పి శుకుం డి ట్లనియె. 415

సీ. "బలి మున్ను నాకంబు బలిమిమైఁ జేకొన్న, వామనుండై హరివచ్చి వేఁడఁ,
బాదత్రయం బిచ్చి, భగవన్నిబద్ధుఁ డై సురమందిరముకంటె సుభగ మైన
సుతలలోకంబున సుస్థితి నున్నాఁడు వెత లేక; యట మీఁద వేదగుహికి,
నాసరస్వతికిఁ, దా నట సార్వభౌముండు; నాఁ బ్రభువయి, హరి నాకవిభునిఁ

---

1. ఇంద్రునకుఁ దమ్ముఁడు. 2. అశ్వినీదేవత లిరువురు. 3. నాతండ్రి, అనఁగా శుకుని తండ్రి వేదవ్యాసుఁడు.

ఆ. బదవిహీనుఁ జేసి, బలిఁదెచ్చి నిలుపును;-బలియు నిర్జరేంద్రపదము నొందు;
నింద్రపదము హరికి నిచ్చినకతమున, దానఫలము సెడదు, ధరణినాథ! 416

వ. అట మీఁదటికాలంబున వరుణనందనుం డగుదక్షసావర్ణి తొమ్మిదవమను వయ్యెడు; నతనికొడుకులు ధృతకేతుదీప్తకేతుప్రముఖులు రాజులును; బరమరీచిగర్గాదులు నిర్జరులును; నద్భుతుం డనువాఁ డింద్రుండును; ద్యుతిమత్ప్రభృతు లగువారలు ఋషులును నయ్యెద; రందు. 417

ఆ. దనుజహరణుఁ డంబుధార కాయుష్మంతు-నకు జనించి, రక్షణంబు సేయ,
మూఁడులోకములను మోదంబుతో నేలు-నద్భుతాఖ్యు నొప్పు నమరవిభుఁడు.

వ. మఱియు నుపశ్లోకసుతుం డగుబ్రహ్మసావర్ణి దశమమను వయ్యెడిఁ; దత్పుత్త్రులు భూరిషేణాదులు భూపతులును; హవిష్మత్ప్రముఖులు మునులును; శంభుం డనువాఁ డింద్రుండును; విబుద్ధాద్యులు నిర్జరులును నయ్యెద; రందు. 419

ఆ. విశ్వసృజునియింట విభుఁడు విషూచికి-సంభవించు నంశసహితుఁ డగుచుఁ;
జెలిమి శంభుతోడఁ జేయు; విష్వక్సేనుఁ-డనఁగ జగముఁ గాచు నవనినాథ!

వ. మఱియుం [1]దదాగమిష్యత్కాలంబున ధర్మసావర్ణి పదునొకండవమను వయ్యెడి; మనుతనూజులు సత్యధర్మాదులు పదుండ్రు ధరణిపతులును; విహంగమ, కామగమన, నిర్వాణచరులనువారు సురలును; వైధృతుం డనువాఁ డింద్రుండును; నరుణాదులు ఋషులును నయ్యెద; రందు. 421

ఆ. అంబుజాతనేత్రుఁ డాసూర్యసూనుఁడై-'ధర్మసేతు' వనఁగఁ దగ జనించి,
వైభవాఢ్యుఁ డగుచు వైధృతుఁ డలరంగఁ-గరుణఁ ద్రిజగములనుగావఁగలఁడు.

వ. మఱియుఁ దద్భవిష్యత్సమయంబున భద్రసావర్ణి పంద్రెండవమను వయ్యెడి; నతనినందనులు దేవవదుపదేవదేవశ్రేష్ఠాదులు వసుధాధిపతులును; ఋతుధాముం డనువాఁ డింద్రుండును; హంతాదులు వేల్పులును, దపోమూర్తితపాగ్నీధ్రగాదులు బుషులును నయ్యెద; రందు. 423

ఆ. జలచలోచనుండు సత్యతపస్సూనృ-తలకు సంభవించుఁ దనయుఁ డగుచు,
ధరణిఁ గాచు నంచితస్వధామాఖ్యుఁడై-మనువు సంతసింప మానవేంద్ర! 424

వ. మఱియుం [2]దదేష్యత్కాలంబున నాత్మవంతుం డగుదేవసావర్ణి పదుమూఁడవమను వయ్యెడి; మనుకుమారకులు చిత్రసేనవిచిత్రాదులు జగతీనాయకులును; సుకర్మసుత్రామసంజ్ఞలు గలవారు బృందారకులును; దివస్పతి యనువాఁ డింద్రుండును; నిర్మోహతత్త్వదర్శ్యాద్యులు ఋషులును నయ్యెద; రందు.

---

1. అతని తర్వాతవచ్చుకాలమునందు. 2. అతని తర్వాతికాలము.

ఆ. ధరణి దేవహోత్రదయితకు బృహతికి-యోగవిభుఁడు నాఁగ నుద్భవించి,
వనజనేత్రుఁ డాదివస్పతి కెంతయు-సౌఖ్య మాచరించు జగతినాథ! 426

వ. మఱియు నట వచ్చు కాలంబున నింద్రసావర్ణి పదునాలవ మను వయ్యెడి; మను నందనులు గంభీరవస్వాదులు రాజులును; బవిత్రచాక్షుషు లనువారు దేవగణంబులును; శుచి యనువాఁ డింద్రుండును; నగ్నిబాహుశుచిశుక్రమాగధాదులు ఋషులును నయ్యెద; రందు. 427

తే. తనర సత్త్రాయణునకు వితానయందు-భవము నొందెడి హరిబృహద్భానుఁ డనఁగ;
విస్తరించుఁ, గ్రియాతంతు[1]విసరములను-నాకవాసులు ముద మంద నరవరేణ్య!

క. జగతీశ! త్రికాలములను-బొగడొందు మనుప్రకారములు సెప్పఁబడెం;
దగఁ బదునలువురుమనువులు-[2]దెగ, యుగములు వేయు నడవ దిన మజునకగుఁ."

వ. అనినఁ బరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె. 430

ఆ. "ఈపదంబు లందు నీమనుప్రముఖుల-నెవ్వ రనుచు, వార లేమికతన
నధికవిభవు లైరి? హరి యేల జనియించె?-నెఱుఁగఁ బలుకు నాకు నిద్ధచరిత."

వ. అనినం బారాశర్యకుమారుం డిట్లనియె. 432

సీ. "మనువులు, మునులును, మనుసుతు, లింద్రులు, నమరులు, హరియాజ్ఞ నడఁగువారు;
యజ్ఞాదు లందఱు హరిపౌరుషాకృతు; లామనువులు దత్సహాయశక్తి
జగముల నడపుదు; రొగి నాల్గుయుగములకడపటఁ [3]గాలసంగ్రస్తమైన
నిగమచయంబును, నిజతపోబలముల మరలఁ గాంతురు ఋషివరులు; దొంటి
తే. పగిది ధర్మంబు నాలుగుపాదములును-గలిగి వర్తిల్లు; మనువులుఁ గమలనేత్రు
నాజ్ఞ దిరుగుదు; రేలుదు రవనిపతులు-జగతి భాగించి తమతమసమయములను.

వ. మఱియుం బ్రాప్తులయినవారల నింద్రపదంబులను, బహుప్రకారంబుల దేవపదంబులను, హరి ప్రతిష్ఠించుచుండు; వారలు విహితకర్మంబుల జగత్త్రయంబునుం బరిపాలింతురు; లోకంబులు సువృష్టంబులై యుండు; నందు. 434

సీ. యోగీశరూపుఁడై యోగంబుఁ జూపుచు మౌనిరూపమునఁ గర్మంబు దాల్చు;
సర్గంబు సేయుఁ బ్రజాపతిరూపుఁడై, యింద్రుఁడై దైత్యుల నేపడంచు;
జ్ఞానంబు నెఱిఁగించుఁ జతురసిద్ధాకృతిఁ; గాలరూపమునఁ నాశంబు సేయు;
నానావిధము లైననామరూపంబులఁ గర్మలోచనులకుఁ గానఁబడఁడు;
ఆ. చనినరూపములను జనురూపముల నింకఁ-జనఁగ నున్న రూపచయము నతఁడు
వివిధుఁడై, యనేక వృత్తుల వెలిగించు-విష్ణుఁ డవ్యయుండు విమలచరిత!"

---

1. సముదాయము. 2. నశింపఁగా. 3. కాలముచే మ్రింగఁబడినది.

## వామనచరిత్ర కథాప్రారంభము

వ. అనిన భూవరుం డి ట్లనియె. 436

మ. "బలి నంభోరుహనేత్రుఁ డేమిటికి నై పాదత్రయిన్ వేఁడె? ని
శ్చలుఁడుం, బూర్ణుఁడు, లబ్ధకాముఁడు, రమాసంపన్నుఁడై, తాఁ బర
స్థలికిన్ దీనునిమాడ్కి నేల చనియెం? దప్పేమియున్ లేక ని
ష్కలుషున్ బంధనమేల చేసెను? వినం గౌతూహలం బయ్యెడిన్." 437

వ. అనిన శుకుం డిట్లనియె. 438

సీ. "పురుహూతుచే నొచ్చి పోయి, భార్గవులచే బలి యెట్టకేలకు బ్రదికి, వారి
చిత్తంబు రాఁ గొల్చి, శిష్యుఁడై వర్తింప, వారు నాతనిభక్తివలన మెచ్చి,
విశ్వజిద్యాగంబు విధితోడఁ జేయింప, భవ్యకాంచనపట్టబద్ధరథము,
నర్కవాజులఁ బోలుహరులఁ, గంఠీరవధ్వజము, మహాదివ్యధనువుఁ, బూర్ణ
తే. తూణయుగళంబుఁ, గవచంబుఁ, దొలుతహోమ, పావకుండిచ్చె, నమ్లానపద్మమాలఁ
గలుషహరుఁ డగుతనతాత కరుణనొసఁగె-సోమసంకాశశంఖంబు శుక్రుఁడిచ్చె.

వ. ఇవ్విధంబున. 440

క. పాణియు, రథియుఁ, గృపాణియుఁ,-తూణియు, ధన్వియును, [2]స్రగ్వి, తురగియు, దేహ
త్రాణియు, ధిక్కృతవిమత-ప్రాణియు, మణికనకవలయపాణియు నగుచున్. 441

మ. బలుదానంబుల విప్రులం దనిపి, దద్భద్రోక్తులం బొంది, పె
ద్దలకున్ మ్రొక్కి, విశిష్టదేవతల నంతర్భక్తిఁ బూజించి, ని
ర్మలుఁ బ్రహ్లాదునిఁ జీరి. నమ్రశిరుఁడై రాజద్రథారూఢుఁడై
వెలిఁగెన్ దానవభర్త శైలశిఖరోద్వేల్లద్దవాగ్ని ప్రభన్. 442

క. దండితమృత్యుకృతాంతులు, ఖండితసురసిద్ధసాధ్యగంధర్వాదుల్,
పిండితదిశు లమరాహిత-దండాధీశ్వరులు సములు, దన్నుం గొలువన్. 443

క. చూపుల గగనము మ్రింగుచు-నేపున దివి భువియు [3]నాతలీతల సేయన్
రూపించుచు, దనుజేంద్రుఁడు-ప్రాపించెను దివిజనగరపథము నరేంద్రా! 444

వ. ఇట్లు బలవంతుండగుబలి, సురేంద్రుని సాధింప సమకట్టి, దండగమనంబు సేసి,
నిడుదపయనంబుల జని చని. 445

మ. కనియెం బుణ్యజనౌకమున్, విగతరోగస్వప్నపీడాన్నభా
దనసంశోకముఁ, బుష్పపల్లవఫలోద్దామద్రుమానీకమున్,
స్వనితోద్ధూతపతాకముం, బ్రవిచరద్దైవ్యమానికానీకమున్,
ఘనగంగాసలిలైకమున్, మఘవయుక్తశ్రీకమున్, నాకమున్. 446

1. సింహము గుర్తుగల పతాకము (జెండా). 2. హారము గలవాఁడు. 3. అస్తవ్యస్తము-తలక్రిందులు.

వ. కని, రక్కసులఱేఁడు వెక్కసంబై చాల్పు గలవేల్పులనెలవు దఱియం జొచ్చి, చెచ్చెర ముందటికిం జని చని, ముందట నెడపడక మొనమోసి, యిరుగుచు చిగురు తలిరాకుజొంపంబు నన మొగుడు మొగ్గ యరవిరి నెఱవిరి గుత్తి పిందె పూఁప దోరగాయ పండు గెలలతండంబుల వ్రేఁగు లాఁగలేక మూఁగి, వీఁగి, వ్రేఁక లగుమ్రాఁకులప్రోకలకుఁ జేఁట లగు పెందోఁటలును, దోఁటల గాటంబులై నిన్వాఁకిల్లు మవ్వంపుఁ గ్రొవ్విరులకుఁ గవలు విన్వాక కసిమసలు గలిగి ముసరి, కొసరి పూని పోనితేనియ లాని విసరు గలిగి [1]మసరు కవిసి క్రొవ్వి రిమ్మగొని, ఝుమ్ముఝు మ్మనుచు జంజాటించు తేఁటిదాఁటులను, దాఁటువడక నాఁటుకొని కూడి జోడువీడక క్రొమ్మావులకమ్మలకొమ్మల నిమ్ముల ముసరి, పసిమి గలకిసలయములు పొసంగ మెసంగి, కిసరు పడక కసరు సెడి, బిట్టురట్టడితనంబులలచి, మించి కరాళించుకోయిలల మొత్తంబులును, మొత్తంబులై చిత్తంబులు మత్తంబులుగఁ దత్తరంబునం దియ్యనిపండ్లకు గదియంబడి గయ్యాంబులు సేసి, చయ్యన నేసరేఁగి, బేసంబులు గాసంబులు గొని వాకికెక్కి పలుబాస లాడుచు బహుప్రకారంబులగుకీరంబులును, గీరంబులకు సరి గడచి మింట నంట నెగసి పెట్టలం బట్టి చీరి, యిట్టట్టుఁ జనక నెట్టుకొని సెలవుల వ్రాలుచు, నింపుగలరవమ్ములు గలుగుకలరవమ్ములును, గలరవమ్ములలరం దొలంకని కొలంకుల కెలంకులఁ గడంకల బ్రియల నిడుకొని, క్రమ్మి దొమ్మిసేసి మొలవమ్మితూఁడుల వాఁడు లగుచంచువులం జించి, మెక్కి చొక్కి, మిక్కిలి కలఁకలం బడుచు నలబలంబులు సేయుకలహంసంబులును, హంసరుచిజనితవికసనముల వికవికనగుచుం బస గలిగి, మిసమిస మెఱుచుపసిఁడికెందమ్ములిందిరామందిరమ్ములచందమ్ములుగ నందమ్ము లగుకొలంకులును, కొలంకుల కరళ్లఁ దడిసి, వడవడ వడంకుచు నల్లిబిల్లులు గొని, సాఁగినతీఁగెయిండ్ల గండ్లయీరములం దోరములు సెడి పలువిరులకమ్మవలపులవ్రేఁగునం దూఱలేక యీఁడిగిలంబడుగాడ్పులును, గాడ్పుల వలన నెగసి గగనమున విరిసి, పలువన్నెలం జెన్నగు మేలుకట్టుఁబట్టంబుల తెఱంగున దట్టంబులయిన కుసుమపరాగంబులును, బరాగంబుల సరాగంబులగువాఁగువ్రంతలచెంతల గుంపులుకొని గఱికజొంపంబుల లంపులు దిని, మంపులు గొని పెల్లునెమర్లు వెట్టుచు నొదుఁగులపొదుఁగులు గదల వాడల వాడలజాడలం బరుగులిడుదూడల క్రీడల వేడుకలం గూడుకొని యిండ్లవాకిండ్లకుం జేరి, పౌరులకోరికల కనుసారిక లగుచు నమృతంబు గురియుకామధేనువులును, గామధేనువులకు నిలువ నీఁడలగుచు నడిగినజనమ్ములకు ధనమ్ములు ఘనమ్ముగఁ బుడుకు కల్పతరువులును. గల్పతరువులపల్లవమంజరులఁ [3]గుంజరులకు విఱిచి యిచ్చుచు, మచ్చికలకలిమి నిచ్చ మెచ్చుచుఁ, గృత

1. పొగరు ఆక్రమించి. 2. అలలు 3. ఆఁడుఏనుగులు.

కగిదులచఱులసిరుల నడరుపడఁతులనడలకు గురువులగుచు, మెఱయుమురువుల నొత్తరించుమత్తేభంబులును, నిభంబులసరస నొరసికొని వఱుసఁ బఱుసఁ దనము లెడలి, సుకరము లగుమకరతోరణస్తంభంబులును, తోరణస్తంభంబులచేరువ నిలిచి, చెఱకువిలుతుం డొఱవెఱికిన జెడిదము లగునవకంపు మెఱుఁగుంజిగురుటడిదముల తెఱంగున, నిలుకడసంపదలు గలుగుశంపల [1]శంపల సొంపునం, గరచరణాదిశాఖలు గలచంద్రరేఖలపోఁడిమిని, వాహినిగలమోహినీ విద్యల గ్రద్దనఁ జూపులకుం దీపు లొదవించుచు, ధర్మకర్మంబులయశంబుల వశంబు గలిగి యనూనంబు లగువిమానంబు లెక్కి చక్కవచ్చినసచ్చరిత్రులకుం జెచ్చెర నెదురుచని, తూఁగొని తోఁగొనిపోవు రంభాదికుంభికుంభకుచల కలకలంబులును, గలహంసకారండవకోకసారసబృంద సుందర సుందరియు, నిందీవరారవిందసందదిందిందిరయు, సభంగయు, సభంగయు, నగుగంగ నింగికిం బొంగెనో! యని మిగుల దిగులుపడఁ బొగడ్తల కెక్కినయగడ్తలును, నగడ్తల మిన్నేటి తేటనీట నీటు లీనుపాటి నూటిచల్లులాటల మేటికూటువలు గొనుచు, నేచినఖేచరకన్యకావారంబులును, వారవనితాసుపూజితరాజిత [2]దేహళీపాటవంబులగుగోపురకనకకవాటంబులును, గవాటవేది కాఘటితమణిగణకిరణోదారంబు లగునింద్రనీలస్తంభగంభీరంబులును, గంభీర విమలకమలరాగపాలికామాలికావారంబు లగు చతుర్ద్వారంబులును, ద్వారదేశంబులచావిళ్ళ[3]గావళ్ళుండి, ప్రొద్దుపోక రక్కసుల వేల్పుల కయ్యంబులు నెయ్యంబులం జెప్పికొనుచున్న యస్త్రశస్త్రధారులు శూరులు నయినమహాద్వారపాలకవీరులును, వీరరసజలధివేలోదారంబు లయి శుద్ధస్ఫటికబద్ధమహోత్తానంబులగుసోపానసుభగాకారంబులును, సుభగాకార ప్రదీప్రంబు లగువజ్రమహారజతవప్రంబులును, వప్రోపరివజ్రకుడ్యశిరోభాగచంద్రకాంత కాంతారుణహిమకరకిరణముఖరంబు లగు సాలశిఖరంబులును, శిఖరస్తోమధామనికృత్తతారకంబులును, దారతారమణిశిలాకారకఠోరంబు లగుచు, మిగుల [4]గరిత యగునగరిసిరి మీఱు నమరు మొగులు పొడగని, నిలుకడలకు నలువ నడిగికొని, పడసినపసిఁడి తెరలవలువల బెడంగునం దోరంబు లగుప్రాకారంబులును, ప్రాకారకాంచనాంచితయుద్ధసన్నద్ధమహాఖర్వ గంధర్వవాహినీపాలకంబు లగుమరకతాట్టాలకంబులును, నట్టాలకోత్తుంగ వజ్రమయస్తంభోదంచనంబులును, బరభటప్రాణవంచనంబులు సముదంచనంబులు నగుదంచనంబులును, దంచనంబులతుదలు రథంబులయిరుసు లొరసికొనం గోటయీవలావల కావలి దివియలకరణి రుచిరము లగుచుఁ బచరించునహిమకరహిమకరమండలంబులును, హిమకరమండలంబు నిద్దంపుటద్దం బని మూఁగి

---

1. కడప (గుమ్మము) మ్రానుల పటుత్వము. 2. కావలి - బహువచనము - పాలించుచుండుట. 3. ఆఁడుది. 4. మెఱుపులు.

తొంగిచూచుచు నళికఫలకంబులఁ గులకములు గొనునలకములం దరపి తిలక
ములం దెఱఁగుపఱుచుకొను సమయముల వెనుక నొదిఁగి, కదిసి, ముకురంబు
లం బ్రతిఫలితులైనపతులితరసతులరతుల కనుమతు లని కనుకని మరలి నీడ
తలంగినం గలంగి, చని, కాంతలు వాలయ నలయుముగుదలకు నేకాంతం
బులై గగనసముత్సేధంబులైన రాజసౌధంబులును, సౌధంబులసిరులముత్తియం
పుసరులతోడి నిబ్బరపుగుబ్బచన్నులచెన్నులం బ్రక్కలం జక్కవదువ్రు లుండ
మండితసౌధశిఖరంబులకు శృంగారంబులయినభృంగారంబులును, భృంగార
శయనజాలక డోలికాని శ్రేణికాదివిశేషరమ్యంబులైనహర్మ్యంబులును, హర్మ్య
కనకగవాక్షరంధ్ర నిర్గతకర్పూరకుంకుమాగురుధూపధూమంబులును, ధూమం
బులు జీమూతస్తోమంబు లని, ప్రేమంబు లుబ్బ గొబ్బునం డబ్బాటు పబ్బంబు
లబ్బె నని, మరులుగొని పురులవన్నియలసిరులు సరులుగొనం గుటపిటపములఁ
దటపెట నటించుచుఁ బలుకులు విరిసి, కికురువోడుచు వలజేనిమఱువ్రుఁజదువుల
టీక లనం గేక లిడు నెమిళ్లును, [1]నెమిళ్ళపురులనారలు నారు లగురతనంపు
విండ్లనినదము లనుతలంపులం దోఁకలు జడిసి, వీఁకలు మెఱసి, మూఁకలు
గొని, దివి కెగిరి, రవికిం గవిసినరాహువ్రక్రియం దివిఁ దడంబడుపడగలును,
బడగలును గొడుగులును దమకు నాలంబులకు నడియాలంబులుగఁ, దోరంబు
లైనసారంబుల బీరంబులు మెఱసి, బెబ్బులు గలగబ్బునం గరులసిరుల సింగం
బులభంగుల శరభంబులరభసంబుల [2]ధూమకేతువులరీతుల వైరిం జీకికిం గొనక,
శంక లుడిగి, అంకె లిడుచు లంకెలై లెక్కకు మిక్కిలి యగుచు, రక్కసుల
చక్కటి రెక్కటికయ్యముల దయ్యము లెఱుంగం దిరుగువీరభటకదంబంబు
లును, గదంబకరవాలశూలాదుల మెఱుంగులు మెఱపులతెఱంగుల దిశలచెఱం
గులం దుఱంగలింప, నేమినినదంబులు దరము లగునుఱుములుగ నడ మొగిళ్ళ
పెల్లునం బ్రవర్షితరథికమనోరథంబు లగు రథంబులగములును, గములు గొని,
గమనవేగములవలన హరిహరుల నగి, గాలిం జాలిం బడం గేలిగొని, ఘనంబు
లగుమనంబులం దెగడి, నెగడుసురంగంబు లగు తురంగంబులును; రంగ
దుత్తుంగవిశదమదకలకరటికటతటజనిత మదసలిలకణగణవిగళితదశశతనయన
భుజసరళమిళితలలితలిఖలదిగధిపతిశుభకరకరకనకకటకఘటిత మణిసముదయ
సముదిత రేణువర్గదుర్గమంబు లయిననిర్వక్రమార్గంబులును, మార్గస్థలోపరిగతా
గతశతశతాయుతానేక గణనాతీతరోహణాచలతటవిరాజమానంబు లగు విమా
నంబులును, విమానవిహరమాణ సుందరసుందరీసందోహసంవాదిత భూరిభేరీ
వీణాపణవమృదంగ కాహళశంఖాదివాదనానూనగానసాహిత్య నృత్యవిశేషంబు
లును, విశేషరత్నసంఘటితశృంగార[3]శృంగాటక వాటికాగేహదేహళీప్రదీపం

1. నెమిలి పింఛము. 2. తోఁకచుక్కలు. 3. నాలుగుత్రోవలు కలియు స్థలము.

బులును, దీపాయమానమానితసభామండపఖచితరుచిరచింతారత్నంబులునుం, గలిగి, రత్నాకరంబునుం బోలె ననిమిషకౌశికవాహినీవిస్తృతం బయి, శ్రుతివాక్యంబునుం బోలె సకల్మషసువర్ణప్రభూతం బయి,భూతపతికంఠంబునుం బోలె భోగిరాజికాంతం బయి,కాంతాకుచంబునుం బోలె సువృత్తం బయి,వృత్తజాతంబునుం బోలె సదాగురులఘునియమాభిరామం బయి,రామచంద్రుని తేజంబునుం బోలె ఖరదూషణాదిదోషాచరానుపలబ్ధం బయి, లబ్ధవర్ణచరిత్రంబునుం బోలె నమలాంతరంగద్యోతమానం బయి, మానధనునినడవడియునుం బోలె సన్మార్గ ఖ్యాతిసుందరం బయి, సుందరోద్యానంబునుం బోలె రంభాంచితాశోకపున్నాగం బయి, పున్నాగంబునుం బోలె సురభిసుమనోవిశేషం బయి, శేషాహిమస్తంబునుం బోలె నున్నతక్షమావిశారదం బయి,శారదసముదయంబునుం బోలె ధవళ [1]జీమూతప్రకాశితం బయి,సితేతరాజినదానంబునుంబోలె సరసతిలోత్తమంబై, యుత్తమపురుషవచనంబునుం బోలె ననేకసుధారసప్రవర్షంబై, వర్షాదియునుం బోలె నుల్లసదింద్రగోపం బయి,గోపతిమూఁపురంబునుం బోలె విచక్షురార్యాలంకృతం బయి, కృతార్థం బయినయమరావతీనామనగరంబు సేరం జని కోట చుట్టునుం బట్టు గలుగ బలంబులఁ జలంబున విడియం బంచి, పొంచి మార్గంబులెల్ల నరికట్టుకొని, యేమఱక యుండె; నంత. 447

క. మాయరు;నగవులకును గను-మూయరు; కాలంబుకతనఁ ముదియరు; ఖలులకా
డాయరు ; పుణ్యాజనంబులఁ-బాయరు ; సురరాజువీటిప్రముదాజనముల్. 448

వ. అప్పుడు. 449

క. దుర్భరదానవశంఖా - విర్భూతధ్వనులు నిండి, విబుధేంద్రవధూ
గర్భములు పగిలి, లోపలి - యర్భకతతు లావు రనుచు నాక్రోశించెన్. 450

వ. అంత. 451

సీ. బలి వచ్చి విడియుట, బలభేది వీక్షించి, గట్టిగాఁ గోటకుఁ గాపు వెట్టి,
దేవవీరులఁ దాను దేవతామంత్రిని రప్పించి, సురవైరిరాకఁ జెప్పి,
ప్రళయానలునిభంగి భాసిల్లుచున్నాఁడు ; ఘోరరాక్షసులను గూడినాఁడు ;
మనకోడి చని, నేఁడు మరల వీఁ డేతెంచె ; నేతపంబున వీని కింత వచ్చె?
ఆ. నీదురాత్మకునకు నెవ్వఁడు దోడయ్యె ? - నింక వీని గెల్వ నేది త్రోవ ?
యేమి సేయువార ? మెక్కడి మగఁటిమి? - నెదురు మోహరింప నెవ్వ డోపు?

క. మ్రింగెడు నాకాశంబును - బొంగెడు నమరాద్రికంటెఁ [2]బొడవై ; వీఁడుర్
మ్రింగెడుఁ గాలాంతకుక్రియ - భంగించును మరలఁ బడ్డఁ బంకజగర్భున్. 453

1. నీటికి మూఁతగానుండునది, మేఘము. 2. ఉన్నతము, ఎత్తు.

క. ఈకాదు రాజ్యమెల్లను ;- బోరాదు రణంబు సేయఁ; బోయితిమేనిన్
రారాదు ; దనుజుచేతను - జారా ; దిట మీఁద నేమిజాడ ? మహాత్మా !'' 454

వ. అనిన సురరాజునకు నాచార్యుం డిట్లనియె. 455

సీ. వినవయ్య! దేవేంద్ర! వీనికి సంపద బ్రహ్మవాదులు భృగుప్రవరు లక్ష్మి
నిచ్చిరి ; రాక్షసునెదురను నిలువంగ హరి యీశ్వరుఁడు దక్క నన్యజనులు
నీవును నీసముల్ నీకంటెనధికులుఁ జాలరు ; రాజ్యంబు చాలు నీకు ;
విడిచి పోవుట నీతి విబుధనివాసంబు ; విమతులు నలఁగెడువేళ చూచి

తే. మరలి మఱునాఁడు వచ్చుట మామతంబు ;-విప్రబలమున వీనికి వృద్ధి వచ్చె ;
వారిఁ గైకొన కిటమీఁద వాఁడు చెడును;-వలఁగుమంగాఁక రిపుపేరు దడవవలదు.

క. పరు గెలువవలయు నొండెను;-సరి పోరఁగ వలయు నొండెఁ; [1]చావలె నొండెన్,
సరిగెలుపు మృతియు దొరకమి-సరసంబుగ మున్న తొలఁగి చనవలె నొండెన్.

వ. అనినఁ గార్యకాలప్రదర్శి యగుబృహస్పతివచనంబులు విని, కామరూపు లై దివిజులు త్రివిష్టపంబు విడిచి, తమతమపొందుపట్లకుం జనిరి ; బలియునుం బ్రతిభట వివర్జిత యగు[2]దేవధాని నధిష్ఠించి, జగత్త్రయంబునుం దనవశంబు సేసికొని, విశ్వవిజయుండై, పెద్దకాలంబు రాజ్యంబు సేయుచుండె ; శిష్యవత్సలు లగుభృగ్వాదు లతనిచేత శతాశ్వమేధంబులు సేయించిరి తత్కాలంబున. 458

శా. అర్థుల్ వేఁడరు ; దాతలుం జెడరు ; సర్వారంభముల్ పండుఁ; [3]బ్ర
త్యర్థుల్ లేరు ; మహోత్సవంబులను దేవాగారముల్ పొల్చుఁ; బూ
ర్ణార్థుల్ విప్రులు ; వర్షముల్ గురియుఁ; గాలార్హంబు లై ధాత్రికిన్
సార్థం బయ్యె వసుంధరాత్వ, మసురేంద్రాధీశురాజ్యంబునన్. 459

వ. అంత, 460

సీ. తనతనూజులప్రోలు దనుజులు గొనుటయు, వేల్పులెల్లను డాఁగ వెడలుటయును,
భావించి సురమాత పరితాపమునఁ బొంది, వగ ననాథాకృతి వనరు చుండ
నాయమ్మపెనిమిటి యగుకశ్యప బ్రహ్మ మఱి యొకనాఁడు సమాధి మాని,
తనకుటుంబిని యున్న ధామంబునకు నేఁగి, నాతిచే విహితార్చనములు వడసి,

ఆ. వంది, వ్రాలి, కుంది, వాడినయిల్లాలి - వదనవారిజంబు వడువుఁజూచి,
చేరఁ దిగిచి, మగువచిబుకంబు పుడుకుచు-"వారిజాక్షి! యేల వగచె? దనుచు."

వ. అమ్మహాత్ముం డిట్లనియె. 462

మ. "[4]తెఱవా! విప్రులు పూర్ణులే? చెలఁగునే దేవార్చనాచారముల్ ?
తఱితో వేలుతురే గృహస్థులు ? సుతుల్ ధర్మానుసంధానులే ?

1. చావవలయును, 2. దేవతల రాజధాని, నివాసము, అమరావతి. 3. శత్రువులు. 4. ఆఁడుదానా!

నెఱి నభ్యాగతకోటి కన్నిడుదే? నీరంబునుం బోయుదే;
మఱి లేకర్థుల దాసులన్ సుజనులన్ మన్నింపుదే? పైదలీ! 463

ఆ. అన్నమైనఁ, దక్రమైనఁ, దోయంబైన - శాకమైనఁ, దనకు జరగుకొలఁది
నతిథిజనుల కడ్డ మాడక యిడరేని - లేమ! వారు గలిగి లేనివారు. 464

వ. మఱియు. 465

ఆ. నెలఁత విష్ణునకును నిఖిలదేవాత్మున - కాననంబు శిఖియు నవనిసురులు;
వారు దనియఁ దనియు, వనజాతలోచనుఁ;-డతఁడు దనియ,జగములన్ని దనియు.

క. బిడ్డలు వెఱతురె? నీ కఱ - గొడ్డంబులు సేయ కెల్లకోడండ్రను మా
[1]ఒడ్డారింపక నడతురె? - యొడ్డము గాకున్నదే? మృగేక్షణ! యింటన్!

వ. అని పలికినం బతికి సతి యిట్లనియె. 468

ఉ. "ప్రేమ యొకింత లేక దితిబిడ్డలు బిడ్డలబిడ్డలున్ మహా
భీమబలాఢ్యులై తనదుబిడ్డల నందఱఁ దోలి, సాహసా
క్రామితవైరు లయ్యు, నమరావతి నేలుచు నున్నవారు; నీ
కేమని విన్నవింతు; హృదయేశ్వర! మేలు దలంచి చూడవే! 469

క. అక్కాచెల్లెండ్రయ్యును-దక్కరు(దు?)నాతోడిపోరు; దానున్ దితియున్
రక్కసులు సురల మొత్తఁగ-నక్కట! వల దనదు చూచు;నౌనౌ! ననుచున్.

సీ. ఎండ కన్నెఱుఁగనియింద్రునియిల్లాలు పలుపంచలను జాలిఁ బడియె నేఁడు;
త్రిభువనసామ్రాజ్యవిభవంబుఁ గోల్పోయి దేవేంద్రుఁ డడవులఁ దిరిగె నేఁడు;
గలిమి గారాబుబిడ్డలు జయంతాదులు [2]శబరార్భకుల వెంటఁ జనిరి నేఁడు;
నమరుల కాధార మగునమరావతి యసురుల కాట పట్టయ్యె నేఁడు;
ఆ. బలి జగముల నెల్ల బలియుచునున్నాఁడు-వాని గెలువరాదు వాసవునకు;
యాగభాగ మెల్ల నతఁ డాహరించుచుఁ-గడఁగి సురల కొక్కకడియు నీఁడు.

క. ప్రజలకు నెల్లను సముఁడవు-ప్రజలను గడుపారఁ గన్నబ్రహ్మవు; నయ్యుం
ప్రజలందు దుష్టమతులను-నిజముగ శిక్షింప వలదె? నీవు మహాత్మా! 472

మ. సురలన్, సభ్యుల, నార్తులన్, విరథులన్, శోకంబువారించి, ని
ర్జరధానిన్ నిలువంగ, రాత్రిచరులన్ శాసింప, సత్కార్య మే (మీ?)
వెర వేరీతి ఘటిల్లు; నట్టిక్రమమున్ వేగంబ చింతింపవే;
కరుణాలోకసుధాఝరిం దనుపవే; కల్యాణసంధాయకా!" 473

1. తిరస్కరింపక. 2. బోయపిల్లవాండ్రు.

వ. అనిన మనోవల్లభపలుకు లాకర్ణించి, ముహూర్తమాత్రంబు చింతించి, విజ్ఞాన దృష్టి నవలంబించి, భావికాలకార్యంబు విచారించి, కశ్యపబ్రహ్మ యిట్లనియె.

మ. "జనకుం డెవ్వఁడు? జాతుఁ డెవ్వఁడు? జనిస్థానంబు లెచ్చోటు? సం
జననం బెయ్యది? మేను[1] లేకొలఁది? సంసారంబు లేరూపముల్?
వినుమా; యింతయు విష్ణుమాయ; దలఁపన్ వే ఱేమియున్ లేదు; *మో
హనిబద్ధం బది మూల మింతటికి; జాయా! విన్నఁబో నేటికిన్? 475

వ. అగు నయిననుం గాలోచితకార్యంబు సెప్పెద. 476

మ. భగవంతుం, బరముం, జనార్దనుఁ, గృపాపారీణు, సర్వాత్మకున్,
జగదీశున్, హరి సేవ సేయు; మతఁడున్ సాంగత్యముం బొంది, నీ
కగు నిష్టార్థము లెల్ల నిచ్చు; నిఖిలార్థావాప్తి చేకూరెడిన్;
భగవత్సేవలఁ బొందరాదె? బహుసౌభాగ్యంబులం బ్రేయసీ!" 477

వ. అనిన గృహస్థునకు గృహిణి యి ట్లనియె. 478

క. "నారాయణుఁ బరమేశ్వరు-నేరీతిఁ దలంతు? మంత్ర మెయ్యది? విహితా
చారంబు లేప్రకారము?-లారాధనకాల మెద్ది? యానతి యీవే." 479

వ. అనినఁ గశ్యపప్రజాపతి సతికిఁ బయోభక్షణం బను వ్రతం బుపదేశించి, తత్కాలంబును, దన్మంత్రంబును, దద్విధానంబును, దదుపవాసదానభోజనప్రకారంబులును, నెఱింగించిన నదితియును ఫాల్గునమాసంబున శుక్లపక్షంబునఁ బ్రథమ దివసంబునన్ [2]దొరకొని, పండ్రెండుదినంబులు హరిసమర్పణంబుగా వ్రతంబు సేసి, వ్రతాంతంబున నియత యై యున్న యెడఁ, జతుర్బాహుండును, పీతవాసుండును, శంఖచక్రగదాధరుండును నై నేత్రంబుల కగోచరుం డైన నారాయణదేవుండు ప్రత్యక్షం బైనం, గనుంగొని. 480

క. కన్నులసంతోషాశ్రులు-చన్నులపైఁ బఱవఁ, బులకజాలము లెసఁగన్,
సన్నతులును, సన్నుతులును, నున్నతరుచిఁ జేసి, [3]నిటలయుక్తాంజలి యై. 481

క. చూపుల శ్రీపతిరూపము-నాపోవక త్రావిత్రావి, హర్షోద్ధత యై
వాపుచ్చి, మంజుమధురా-లాపంబులఁ బొగడె నదితి లక్ష్మీనాథున్. 482

సీ. యజ్ఞేశ! విశ్వంభ! రాచ్యుత! శ్రవణమంగళనామధేయ! లోకస్వరూప!
యాపన్నభక్తజనార్తివిఖండన! దీనలోకాధార! తీర్థపాద!
విశ్వోద్భవస్థితివిలయకారణభూత! సంతతానంద! శశ్వద్విలాస!
యాయువు; దేహంబు, ననుపమలక్ష్మియు, వసుధయు, దివముఁ, [4]త్రివర్గములును

---

* మోహానిబద్ధంబు నిదాన మింతటికి. పాఠాంతరము. 1. ఎంతమాత్రము. 2. మొదలు కొని. 3. నొసటియందుఁ జేర్చఁబడిన దోసిలికలది. 4. ధర్మార్థకామములు.

తే. వైదికజ్ఞానయు_క్తియు,వైరిజయము-నిన్నుఁ గొలువనినరులకు నెఱయఁ గలదె?
వినుతమందార! గుణహార! వేదసార!-ప్రణతవత్సల! పద్మాక్ష! పరమపురుష!

ఆ. అసురవరులు సురల నదలించి జెవరించి-నాక మేలు చున్న నాఁటనుండి
కన్నకడుపు గాన,కంటఁ గూరుకు రాదు-[1]కడుపుఁబొక్కు మాన్పి కావవయ్య!''

వ. అనిన విని దరహాసితవదనుం డయి,యాశ్రితకామధేను వైనయప్పర మేశ్వరుం
డి ట్లనియె. 485

శా. ''నీకోడండ్రును, నీకుమారవరులున్, నీనాథుఁడున్, నీవు సం
శ్లోకింపన్, సతులుం బతుల్ మిగుల సమ్మోదింప, రాత్రించరుల్
శోకింపన్, భవదీయ గర్భమునఁ దేజోమూ_ర్తి జన్మించెదన్
నాకున్ వేడుక పుట్టు; నీసుతుఁడనై న_ర్తించి వ_ర్తింపఁగాన్. 486

మ. బలిమిన్ దైత్యుల్యఁ జంపరాదు; వినయోపాయంబునంగాని, సం
చలనం బొందరు; నేను నీనియతికిన్ సత్య_క్తికిన్ మెచ్చితిన్;
బలివిద్వేషియు, నానిలింపగణముం, బౌలోమియున్, మెచ్చ దై
త్యులరాజ్యంబు హరింతు; నింద్రునికి నిత్తున్; దుఃఖ మిం కేటికిన్? 487

క. నీరమణుని సేవింపుము-నారూపము మానసించి; నలి నీగర్భా
గారంబు వచ్చి చొచ్చెద;-గారామునఁ బెంప వమ్మ! కరుణన్ నన్నున్. 488

క. ఏలింతు దివము సురలను;-బాలింతు మహేంద్రయువతి భాగ్యశ్రీలం;
దూలింతు దానవుల; ని-ర్మూలింతు రిపుప్రియాంగములభూషణముల్.'' 489

వ. అని యిట్లు భ_క్తజనపరతంత్రుం డగుపురాణపురుషుం డాన తిచ్చి, తిరోహితుం
డయ్యెఁ; నయ్యదితియుఁ గృతకృత్య యై, సంతోషంబునఁ దనమనోవల్లభుం డగు
కశ్యపు నాశ్రయించి, సేవించు చుండె; నంత నొక్క దినంబున. 490

ఆ. ఘనసమాధినుండి కశ్యపుఁ డచ్యుతు. నంశ మాత్మ నొలయ, నదితియందుఁ
దనదువీర్య మధికతరము సేర్చెను; గాలి, శిఖిని దారువందుఁ జేర్చినట్లు. 491

వ. ఇట్లు కశ్యపచిరతరతపస్సంభృతవీర్యప్రతిష్ఠితగర్భ యై, సురలతల్లి యుల్లంబున
నుల్లసిల్లుచు నుండె; నంత. 492

క. చలచల నై, పిదపిద నై-గలలం బై, కరుడు గట్టి, గళనాళముతోఁ
దల యేర్పడి, గర్భంబై-నెల మసలం, జీరచిక్కె నెలఁతకు నధిపా! 493

క. నెలఁతకుఁ [2]జూలై, నెల, రె-న్నెలలై, మఱి మూడు నాల్గునెల లై, వరుసన్
నెల లంతకంత కెక్కఁగ-నెలలును దగ్గఱియె నసురనిర్మూలతకున్. 494

---

1. సంతానమువలనిదుఃఖము. 2. గర్భము.

క. మహితతర మేఘమాలా-పిహితాయుత చండభానుబింబ ప్రభతో
విహితాంగంబులఁ గశ్యపు-గృహిణీగర్భమున శిశువు క్రీడించె నృపా! 495

క. తనకడుపున నొకయిరవున-ననరుహగర్భాండభాండవసతిచయంబుల్
గొనకొని జగములు నిడుకొని-తనుగతి గడు నడఁగి మడఁగి తనరెం బెడం గై.

వ. అంత నక్కాంతాతిలకంబు క్రమక్రమంబున. 497

మ. నిలిచెన్ దెప్పల బృందిమన్, విశదిమన్ నేత్రంబులం, జూచుకం
బుల నా[1]కాళిమ, మేఖలం బ్రథిమ, నెమ్మోమారఁగాఁ బాండిమ,
న్వలిమం జన్నుల, శ్రోణిపాళిఁ గరిమ, న్మధ్యంబునన్ బృంహిమ,
న్నలితాత్మన్ లఘిమన్, మహామహిమ సొంపన్, గర్భ ముర్వారమై. 498

క. పెట్టుదురు నుదుట భూతిని-బొట్టిడుదురు; మేనఁ బట్టుఁబట్టుపునోయిం
బెట్టుదురు; వేల్పులమ్మకుఁ-గట్టుదురు సురక్ష పడఁతి గర్భంబునకున్. 499

వ. ఇవ్విధంబున. 500

తే. విశ్వగర్భుఁడు దనగర్భవివరమందుఁ-బూఁటపూఁటకుఁ బూర్ణుఁడై, [2]పొటకరింప
వ్రేఁకఁ జూలాలితనమున వేల్పుఁబెద్ద-పొలఁతి కంతట నీళ్లాడుప్రొద్దు లయ్యె.

వ. తదనంతరంబునం జతురాననుం డరుగుదెంచి, యదితిగర్భపరిభ్రమవిభ్రముం
డగునప్పరమేశ్వరు నుద్దేశించి, యిట్లని స్తుతియించె. 502

సీ. “త్రిభువనమయరూప! దేవ! త్రివిక్రమ! పృథులాత్మ! శిపివిష్ట! పృశ్నిగర్భ!
శ్రిత త్రిణాభ! త్రిపృష్ఠ! జగంబుల కాద్యంతమధ్యంబు లరయ నీవ;
జంగమస్థావరజననాది హేతువు నీవ; కాలంబవై నిఖిలమాత్మ
లోపల ధరియింతు లోనిజంతుల నెల్ల స్రోతంబులోఁ గొని సుందరతను;

తే. బ్రహ్మలకు నెల్ల సంభవభవన మీవ-దివమునకుఁ బాసి దుర్దశ దిక్కులేక
శోకవార్ధి మునింగినసురుల కెల్లఁ-దేల నాధారమగు చున్న తెప్ప వీవ. 503

క. విచ్చేయు మదితిగర్భము-చెచ్చెర వెలువడి మహాత్మ! చిరకాలంబున్
[3]విచ్చలవిడి లేకమరులు-ముచ్చటపడి యున్నవారు ముద మందింపన్. 504

వామనావతారకథాప్రారంభము

వ. అని యిట్లు కమలసంభవుండు వినుతి సేయునయ్యవసరంబున. 505

మ. రవి మధ్యాహ్నమునం జరింప, గ్రహతారాచంద్రభద్రస్థితిన్
శ్రవణద్వాదశినాఁడు, శ్రోణ, నభిజిత్సంజ్ఞాతలగ్నంబునన్,

1. నల్లఁదనము (నలుపు) 2. ప్రకాశింపఁగా. 3. విడి+విడి=ఇష్టానుసారముగా, స్వేచ్ఛతో.

భువనాధీశుఁడు పుట్టెఁ వామనగతిం; బుణ్యవ్రతోపేతకుఁ
దివిజాధీశ్వరుమాతకుం, బరమపాతివ్రత్యవిఖ్యాతకున్. 506

వ. మఱియు నద్దేవుండు శంఖచక్రగదాకమలకలితచతుర్భుజుండును, బిశంగవర్ణ
వస్త్రుండును, మకరకుండలమండితగండభాగుండును, శ్రీవత్సవక్షుండును, నలిన
చక్షుండును, నిరంతరశ్రీవిరాజితకోలంబకదంబాలంబిత వనమాలికాపరిష్కృ
తుండును, మణికనకాంచిత[1]కాంచీవలయాంగదకిరీటహారనూపురాలంకృతుం
డును, గమనీయకంఠకౌస్తుభాభరణుండును, నిఖిలజనమనోహరుండునై
యవతరించిన సమయంబున. 507

శా. చింతం బాసిరి యక్షతార్క్ష్యసుమనస్సిద్ధోరగాధీశ్వరుల్;
సంతోషించిరి సాధ్యచారణమునీశబ్రహ్మవిద్యాధరుల్;
గాంతిం జెందిరి భానుచంద్రములు రంగద్గీతవాద్యంబులన్;
గంతుల్ వైచిరి మింటఁ గింపురుషులున్ గంధర్వులుం గిన్నరుల్. 508

క. దిక్కులకావిరి వాసెను;-నెక్కువనిర్మలత నొందె నేడుపయోధుల్;
నిక్కమెయి నిలిచె ధరణియుఁ;- [2]జుక్కలత్రోవయును విప్రసురసేవ్యములై.

క. ముంపుగొని విరులవానల-జొంపంబులు గురియ సురలు, [3]సుమనోమధువుల్
తుంపర లెగయఁ, బరాగపు-రొంపుల భూభాగ మతినిరూషిత మయ్యెన్. 510

వ. తదనంతరంబ. 511

ఆ. "ఈమహానుభావుఁ డెట్లింతకాలంబు-నుదరమందు నిలిచియుండె;" ననుచు
నదితి వెఱఁగుపడియె; నానందజయశబ్ద-ములను గశ్యపుండు మొగి నుతించె.

వ. అంత నవ్విభుండు సాయుధసాలంకారం బగుతనదివ్యరూపంబు నుజ్జగించి,
రూపాంతరం బంగీకరించి, కపటవటునిచందంబున నుపనయనవయస్కుం డైన
వామనబాలకుం డై దల్లిముంగటఁ గుమారసముచితాలాపంబు లాడుచుఁ,
గ్రీడించు సమయంబున, నదితియుం దనయవిలోకనపరిణామపారవశ్యంబున.

ఆ. నన్నుఁ గన్నతండ్రి! నాపాలిదైవమ!-నాతపఃఫలంబ! నాకుమార!
నాదుచిన్నివడుగ! నాకులదీపక!-రాఁ గదయ్య! భాగ్యరాశి వగుచు. 514

క. అన్నా! రమ్మని దగ్గఱఁ-జన్నులపాలేఱు వాఱ, సంశ్లేషిణి యై,
చిన్నారిమొగము నివురుచుఁ-గన్నారం జూచెఁ గన్నకడుపై యుంటన్. 515

క. "[4]పురుడీబోటికి నిందిర-పురుడంబిక; గాక యొరులు పురుడే?" యనుచున్
బురటాలికిఁ బదిదినముల-పురుడు ప్రవర్తించి రెలమిఁ బుణ్యపుగరితల్. 516

1. ఒడ్డాణము, నడుమునకు ధరింపఁదగిన యాభరణము. 2. ఆకాశము. 3. పూఁదేనెలు. 4. సమానము.

వ. అంతనబ్బాలునకు సంతసంబున మహర్షులు గశ్యపప్రజాపతిం బురస్కరించుకొని, సముచితోపనయనకర్మకలాపంబులు సేయించిరి; సవిత సావిత్రి నుపదేశించె; బృహస్పతి యజ్ఞోపవీతంబును, గశ్యపుండు ముంజియుఁ, గౌపీనం బదితియు, ధరణి గృష్ణాజినంబును, దండంబు వనస్పతి యగుసోముండును, గగనాధిష్ఠానదేవత ఛత్త్రంబును, గమండలువు బ్రహ్మయు, సరస్వతి యక్షమాలికయు, సప్తర్షులు కుశపవిత్రంబులు నిచ్చిరి; మఱియును. 517

క. భిక్షాపాత్రిక నిచ్చెను - యక్షేశుఁడు వామనునకు నక్షయమనుచున్ ;
సాక్షాత్కరించి పెట్టెను - భిక్షునకు భవాని పూర్ణభిక్ష ; నరేంద్రా ! 518

క. శుద్ధబ్రహ్మర్షిసమా - రాధ్యుం డై, విహితమంత్రరాజి జదువుచుం
[1]బ్రోద్ధం బగునలంబున - వృద్ధాచారమున వటుఁడు [2]వేల్చెం గడఁకన్. 519

బలిచక్రవర్తికడకు వామనమూర్తి యేతెంచుట

వ. ఇట్లు కృతకృత్యుం డైనమాయామాణవకుండు దేశాంతరసమాగతులగు బ్రాహ్మణులం గొందఱ నవలోకించి, యి ట్లనియె. 520

క. “వత్తురె విప్రులు వేఁడఁగ; - నిత్తురె దాతలును వేడ్క నిష్టార్థములం ;
దెత్తురె మీరును సంపద; - లి త్తెఱఁగున దానవీరుఁ డెవ్వఁడొ? చెపుఁడా !”

వ. అనిన నఖిలదేశీయు లగుభూసురు లి ట్లనిరి. 522

మ. “కలరున్ దాతలు ; నిత్తురున్ ధనములుం ; గామ్యార్థముల్ గొంచు వి
ప్రులు నేతెంతురు ; గాని, యీవిని బలిం బోలన్ వదాన్యుండు లేఁ;
డలఘుం డై యొనరించె నధ్వరశతం బా[3]భార్గవానుజ్ఞచే ;
బలి వేఁడం, బడయంగ వచ్చు బహుసంపల్లాభముల్ వామనా !” 523

వ. అని తెలియం జెప్పిన బ్రాహ్మణులవచనంబు లాలకించి, లోకంబులకుం బ్రీతి వుట్టింపఁ బయనం బై, లాభవచనంబులు గైకొనుచుఁ, దల్లిదండ్రుల వీడ్కొని, శుభముహూర్తంబునం గదలి. 524

క. ప్రక్షీణదివిజవల్లభ - రక్షాపరతంత్రుఁ డగుచు రాజీవాక్షుం
డాక్షణమున బలియింటికి - భిక్షాగమనంబు సేసెఁ బేదఱికము తోన్. 525

క. హరిహరి! సిరి యురమునఁ గల - హరి, హరిహయుకొఱకు దనుజు నడుగం జనియెం;
బరహితరతిమతియుతులగు - దొరలకు నడుగుటయు “[4]నొడలితొడవగుఁ బుడమిన్.

క. సర్వప్రపంచగురుభర - నిర్వాహకుఁ డగుటఁ జేసి, నెఱిఁ జనుదేరన్
ఖర్వునివ్రేఁగు సహింపక - నుర్వీస్థలి గ్రుంగె ; మ్రొగ్గె నురగేంద్రుండున్. 527

1. ప్రకాశింపఁజేయఁబడినది. 2. హోమముచేసెను. 3. శుక్రుఁడు. 4. దేహమున కలంకారము.

వ. ఇట్లు చని చని. 528

క. శర్మద, యమదండక్షత - వర్మద, నతికఠినముక్తివనితాచేతో
మర్మద, నంబునివారిత - దుర్మద, నర్మదఁ దరించెఁ ద్రోవన్ వటుఁడున్. 529

వ. దాఁటి తత్ప్రవాహంబున కుత్తరతటంబునందు. 530

శా. చండస్ఫూర్తి వటుండు గాంచె బహుధాజల్పన్నిశాటంబు, ను
ద్దండాహూతమునీభ్యబిభ్యదమృతాంధస్సిద్ధకూటంబు, వే
దండాశ్వధ్వజినీకవాటము, మహోద్యద్ధూమసంఛన్న మా
ర్తండస్యందనఘోటమున్, బలిమఖాంతర్వేదికావాటమున్. 531

వ. కని, దానవేంద్రునిహయమేధవాటి దఱియం జొచ్చునయ్యవసరంబున. 532

శా. "శంభుండో? హరియో? పయోజభవుఁడో? చండాంశుఁడో? వహ్నియో?
దంభాకారత వచ్చెఁ గాక! ధరణిన్ ధాత్రీసురుం డెవ్వఁ డీ
శుంభద్ద్యోతనుఁ, డీమనోజ్ఞతనుఁ", డంచున్ విస్మయభ్రాంతులై
సంభాషించిరి బ్రహ్మచారిఁ గని తత్సభ్యుల్ రహస్యంబు గన్. 533

క. గుజగుజలు వోవువారును - గజిబిజిఁ బడువారుఁ; జాలఁ గలకలపడుచున్
గజిబిజి యైరి; సభాస్థలి - ప్రజ లెల్లను బొట్టివడుగుఁ బాపనిరాకన్. 534

వ. ఆసమయంబున బలిసభామండపంబుఁ దఱియం జొచ్చి. 535

సీ. [1]చవులుగాఁ జెవులకు సామగానంబులు చదువునుద్గాతలచదువు వినుచు,
మంత్రతంత్రార్థసంబంధభావములు పేర్కొనెడిహోతలతోడఁ గూడికొనుచు,
హోమకుండంబులందున్న త్రేతాగ్నుల వెలిఁగించుయాజకవితతిఁ గనుచు,
దక్షులై బహువిధాధ్వరవిధానంబులు చెప్పెడుసభ్యులఁ జేరఁ జనుచు,
తే. జెట్టు గోరెడు వేడుక పట్టుపఱుప - నదితిపుట్టువు, లచ్చికి నాటపట్టు,
గోరి చరియించె సభలోనఁ గొంతదడవు-పుట్టువెన్నుఁడు నెఱుఁగనిపొట్టివడుగు.

వ. మఱియును. 537

క. వెఱచుచు, వంగుచు, వ్రాలుచు, నఱిముఱి [2]గుబురులకుఁ జనుచు, హరిహరి! యనుచున్
మఱఁగుచు, నులుకుచు, దిఱదిఱ-గుఱుమట్టపుఁబొట్టివడుగు గొంత నటించెన్.

క. కొందఱితోఁ జర్చించును;- గొందఱితో [3]జటలు సెప్పు; గోష్ఠిం జేయుం;
గొందఱితోఁ దర్కించును;- గొందఱితో ముచ్చటాడుఁ; గొందఱ నవ్వున్

వ. మఱియు ననేకవిధంబుల నందఱకు నన్నిరూపులై వినోదించుచు. 540

క. వెడవెడ నడకలు నడచుచు-నెడనెడ నడుగిడఁగ నడరి, యిల దిగఁబడఁగా
బుడిబుడి నొడువులు నొడువుచుఁ-[4]జిడిముడి తడఁబడఁగ వడుగు సేరెన్ రాజున్.

---

1. రుచులు. 2. గుంపులు. 3. వేదములను బఠించుటలోఁగల భేదములు. 4. సిగ్గు.

వ. ఇట్లు డగ్గఱి, మాయాభిక్షుకుండు రక్షోవల్లభుం జూచి, యి ట్లనియె. 542

మ. "ఇతఁడే దానవచక్రవర్తి, సురలోకేంద్రాగ్నికాలాదిది
క్పతిగర్వాపనయప్రవర్తి, గతలోభస్ఫూర్తి, నానామఖ
వ్రతదానప్రపణానువర్తి, సుమనోరామామనోభేదనో
ద్ధతచంద్రాతపకీర్తి, సత్యకరుణాధర్మోల్లసన్మూర్తి, దాన్." 543

వ, అని కుశపవిత్రాక్షతసంయుతం బగుదక్షిణహస్తంబు సాఁచి, యి ట్లనియె. 544

ఉ. "స్వస్తి! జగత్త్రయీభువనశాసనకర్తకు, హాసమాత్రవి
ధ్వస్తనిలింపభర్తకు, నుదారపదవ్యవహర్తకున్, మునిం
ద్రస్తుతమంగళాధ్వరవిధానవిహర్తకు, నిర్జరీగళ
న్యస్తసువర్ణసూత్రపరిహర్తకు, దానవలోకభర్తకున్." 545

వ. అని దీవించి, కరచరణాద్యవయవంబులు ధరించినవేదరాశియుంబోలె, ముం
దట నకుటిలుండును, జటిలుండును, సదండచ్ఛత్త్రుండును, గక్షలంబితభిక్షాపాత్త్రుం
డును, గరకలితజలకమండలుండును, మనోహరవదనచంద్రమండలుండును,
మాయావాదనటుండును, నగువటువుం గని, దినకరకిరణపిహితంబు లైన
గ్రహంబుల చందంబునఁ దిరోహితులై, [1]భృగువులు గూర్చున్న యెడల
లేచి, సేమం బడిగి, తియ్యనిమాటల నాదరించిరి; బలియును నమస్కరించి,
తనగద్దియ నునిచి, పాదంబులు దుడిచి, తన ప్రాణవల్లభ పసిండిగిండి నుదకం
బులు పోయ వడుగుంగొమరునిచరణంబులు గడిగి, తడియొత్తి, తత్సమ
యంబున. 546

ఆ, వటునిపాదశౌచవారి శిరంబునఁ-బరమభద్ర మనుచు బలి వహించె;
నేజలము గిరీశుఁ [2]డిందుజూటుఁడు దేవ-దేవుఁ డుద్వహించె ధృతి శిరమున.

వ. మఱియు నయ్యజమానుం డభ్యాగతున కిట్లనియె. 548

మ. "వడుగా! యెవ్వరివాఁడ? వెవ్వఁడవు? సంవాసస్థలం బెయ్య? ది
య్యెడకున్ నీవరుదెంచుటన్ సఫలమయ్యెన్, వంశమున్, జన్మముం;
గడు ధన్యాత్ముఁడ నైతి; నీమఖము యోగ్యం బయ్యె; నాకోరికల్
గడతేఱెన్; సుహుతంబు లయ్యె [3]శిఖులుం; గల్యాణ మిక్కాలమునన్. 549

మ. వరచేలంబులొ? మాడలో? ఫలములో? వన్యంబులో? గోవులో?
హరులో? రత్నములో? రథంబులొ? విమృష్టాన్నంబులో? కన్యలో?
కరులో? కాంచనమో? నికేతనములో? గ్రామంబులో? భూములో?
ధరణీఖండమొ? కాక యేమడిగెదో? ధాత్రీసురేంద్రోత్తమా!" 550

1. శుక్రాచార్యులు. 2. చంద్రుఁడు జడముడినిగలవాఁడు. 3. అగ్నులు.

వ. అని ధర్మయుక్తంబుగాఁ బలికిన వైరోచనివచనంబులు విని, సంతోషించి, యాశ్వరుం డి ట్లనియె. 541

సీ. "ఇది నాకు నెల వని యేరీతిఁ బలుకుదు? నొకచో టనక యెందు నుండ నేర్తు;
నెవ్వనివాఁడ నం చే మని పలుకుదు? నాయంతవాఁడ నై నడవ నేర్తు;
నీనడవడి యని యెట్లు వక్కాణింతుఁ? బూని ముప్పోకలఁ బోవ నేర్తు;
నదినేర్తు; నిదినేర్తు; నని యేల చెప్పంగ? నేరుపు లన్నియు నేన నేర్తు;
ఆ. నొరులు గారు నాకు; నొరులకు నే నౌదు;-నొంటివాఁడఁ;జుట్టమొకఁడు లేఁడు;
సిరియుఁ దొల్లి గలదు; చెప్పెద నాకెంకి-సుజనులందుఁ దఱచు సొచ్చియుందు.

వ. అని య ట్లుండ నిమ్ము. 553

సీ. "జననాథ! నీమాట సత్యంబు;సత్కీర్తిదంబుఁ;గులార్హంబు; ధర్మయుతముఁ
గరుణానువర్తులు ఘనతత్త్వమూర్తులు గాని, మీకులమందుఁ గలుగ రొరులు;
రణభీరువులు వితరణభీరువులు లేరు; ప్రత్యర్థులర్థులు ప్రబ్బికొనిన,
దానశౌండిమమునఁ దనుపుదు రధికులై; మీతాత లందఱు మేటిమగలు
ఆ. మీకులంబునందు మెఱయుఁ బ్రహ్లాదుండు-మింటిచంద్రుమాడ్కి మేలిరుచులఁ
బ్రకటకీర్తితోడ భవదీయవంశంబు-నీర రాశిభంగి నెగడు చుండు. 554

వ. తొల్లి మీమూఁడవతాత హిరణ్యాక్షుండు విశ్వజయంబు సేసి గదాయుధుం డై భూతలంబునఁ బ్రతివీరులం గానక సంచరింప, విష్ణుండు వరాహరూపంబున నతని నమయించెఁ; దద్భ్రాత యగుహిరణ్యకశిపుం డది విని,హరిపరాక్రమం బునకు నాశ్చర్యంబు నొంది, తనజయంబును బలంబునుం బరిహసించి, గ్రద్దన నుద్దవిడి నద్దనుజమర్దనుమందిరంబునకుం జనియె నప్పుడు. 555

క. శూలాయుధహస్తుం డై-కాలాకృతి వచ్చుదనుజుఁ గని, విష్ణుండుం
గాలజ్ఞత మాయాగుణ-శీలత ని ట్లని తలంచెఁ; జిత్తములోనన్. 556

మ. "ఎదురై పోర జయింపరా దితనిఁ; గాకెందేనియుం బోవ భీ
ప్రదుఁ డై ప్రాణులఁ దోలు; మృత్యువుక్రియం బై వచ్చు;" నంచుం గ్రియా
విదుఁ డబ్జాక్షుఁడు సూక్ష్మరూపమున నావేశించె నిశ్శ్వాసరం
ధ్రదిశన్ దైత్యుహృదంతరాళమునఁ బ్రత్యక్క్రియాభీరుఁ డై. 557

వ. అంత నద్దైత్యవల్లభుండు వైష్ణవాలయంబు సొచ్చి, వెదకి, హరిం గానక, కోపంబు మానక, మిన్ను మన్ను నన్వేషించి, త్రిదివంబున నరసి, దిశలం బరికించి, భూవివరంబులు వీక్షించి, సముద్రంబులు వెదకి, పురంబులు శోధించి, వనంబులు విమర్శించి, పాతాళంబు పరీక్షించి, జగంబున నదృష్టశత్రుం డై [1]మార్గణంబు సాలించి, తనలో ని ట్లనియె. 558

1. వెదకుట.

క. పగవాఁడు మఱియు నొప్పును-దెగఁ జేసియు నెదురుపడఁడె? దేహధరులకుం
దెగినయెడఁ బగఱమీఁదను-బగఁ గొనఁ దగ;" దనుచు నుడిగెఁ బ్రాభవశక్తిన్.

వ. అతండు మా ప్రపితామహుం; డతనిగుణంబు లనేకంబులు గల; వవి యట్లుండ నిమ్ము. 560

క. ఆతురభూసురగతిఁ [1]బురు-హూతాదులు దన్ను వేఁడ, నొగిఁ గొం డనుచున్
మాతండ్రి యిచ్చె నాయువు;-నేతన్మాత్రుఁడవె నీవు లోకమునన్? 561

క. ఏలితివి మూఁడుజగములుఁ;-దోలితి వింద్రాదిసురులఁ; దొల్లిటివారిం
బోలితివి దానగుణముల;-బోలితివి పిశాచరాక్షసుల రక్షింపన్. 562

వ. అదియునుంగాక. 563

క. రాజ్యంబు గలిగె నేనిం-బూజ్యులకును యాచకులకు భూమిసురులకున్
భాజ్యముగ బ్రదుకఁ జేనిం-[2]ద్యాజ్యంబులు, వానిజన్మధనగేహంబుల్. 564

క. మున్నెన్నుదురు వదాన్యుల;-నెన్నెడుచో నిన్నుఁ ద్రిభువనేశుం డనుచున్;
ఇన్నిదినంబులనుండియు-నెన్నఁడు నినుఁ జెట్టు మనుచు నింద్రము సేయన్. 565

ఆ. ఒంటివాఁడ; నాకు నొకటి రెండడుగుల-మేర యిమ్ము; సొమ్ము మేర యొల్ల;
గోర్కి దీర [3]బ్రహ్మకూఁకటి ముట్టెద;-దానకుతుకసాంద్ర! దానవేంద్ర!"

వ. అనినఁ బరమయాచకునకుఁ బ్రదాత యి ట్లనియె.

ఆ. "ఉన్నమాటలెల్ల నొప్పును; విప్రుండ;-సత్యగతులు వృద్ధసమ్మతంబు;
లడుగఁ దలఁచి కొంచె మడిగితి; వోచెల్ల!-దాత పెంపు సొంపుఁ దలఁపవలదె?"

వ. అని మఱియు నిట్లనియె. 569

మ. "వసుధాఖండము వేఁడితో? గజములన్ వాంఛించితో? వాజులన్
వెస నూహించితొ? కోరితో యువతులన్? వీక్షించి కాంక్షించితో?
పసిబాలుండవు; నేరవీ వడుగ: నీభాగ్యంబు లీపాటి గా;
కసురేంద్రుండు పదత్రయంబడుగ నీయల్పంబు నీ నేర్చునే?" 570

వ. అనిన మొగంబునం జిఱునగవు మొలకలొత్త గృహమేధికి మేధావి యిట్లనియె.

మ. "గొడుగో? జన్నిదమో? కమండలువొ? నాకున్ ముంజియో? దండమో?
వడు గే నెక్కడ? భూము లెక్కడ? కరుల్ వామాక్షు లశ్వంబు లె
క్కడ? నిత్యోచితకర్మ మెక్కడ! మదాకాంక్షామితం బైన మూఁ
డడుగుల్ మేరయ త్రోవ కిచ్చు;టది బ్రహ్మాండంబు నాపాలికిన్, 572

1. ఇంద్రుఁడు మొదలగువారు. 2. వదలిపెట్టఁదగినవి. 3. బ్రహ్మయొక్క శిరోభాగము.

వ. అదియునుం గాక. 573

క. వ్యాప్తిం బొందక, వగవక – 'ప్రాప్తం బగులేశ [1]మైనఁ బదివే' లనుచుం
దృప్తిం జెందనిమనుజుఁడు – సప్తద్వీపముల నయినఁ జక్కంబడునే? 574

శా. ఆశాపాశము దాఁ గడుం నిడుపు; లేదంతంబు రాజేంద్ర! వా
రాశిప్రావృత మేదినీవలయసామ్రాజ్యంబు చేకూడియుం,
గాసిం బొందిరి గాక; వైన్యగయభూకాంతాదులు; న్నర్థకా
మాశం బాయఁగ నేర్చిరే? మును? నిజాశాంతంబులం జూచిరే? 575

సీ. సంతుష్టుఁ డీమూఁడుజగములఁ బూజ్యుండు; సంతోషి కెప్పుడు జరుగు సుఖము;
సంతోషి గాకుంట సంసారహేతువు; సంతసంబున ముక్తిసతియు దొరకుఁ;
బూఁటపూఁటకు జగంబుల యదృచ్ఛాలాభతుష్టిని దేజంబు దోన పెరుఁగుఁ;
బరితోషహీనతఁ బ్రభ సెడి పోవును; జలధార ననలంబు సమయునట్లు;
ఆ. నీవు రాజ వనుచు నిఖిలంబు నడుగుట – దగవుగాదు; నాకుఁ దగినకొలఁది
యేను వేఁడికొనిన యీపదత్రయమును – జాల; దనక యిమ్ము;చాలుఁజాలు,''

వ. అని పలుకు చున్న [3]ఖర్వునకు నుర్వీదానంబు సేయం దలంచి, కరకలిత సలిలకలశుం డై నయవ్వితరణముఖరునిం గని, నిజవిచారయుక్తదనుజచక్రుం డగుశుక్రుం డి ట్లనియె. 577

సీ. ''దనుజేంద్ర!యీతఁడు ధరణీసురుఁడు గాఁడు; దేవకార్యంబు సాధించుకొఱకు
హరి విష్ణుఁ డవ్యయుం డదితిగర్భంబునఁ గశ్యపసూనుఁ డై కలిగె; నకట!
యెఱుఁగ కితనికోర్కి నిచ్చెదనంటివి; దైత్యసంతతి కుపద్రవము వచ్చు;
నీలక్ష్మిఁ, దేజంబు; నెలవు, నైశ్వర్యంబు, వంచించి యిచ్చుఁ దా వాసవునకు;
ఆ. మొనసి జగములెల్ల మూఁడుపాదంబుల–నఖిలకాయుఁ డగుచు నాక్రమించు;
సర్వధనము విష్ణు [4]సంసర్జనము చేసి–బడుగుపగిది నెట్లు బ్రదికె దీవు? 578

క. ఒక్కపదంబున భూమియు–నొక్కటఁ ద్రిదివంబుఁ ద్రొక్కి, యున్నతమూర్తిన్
దిక్కులు గగనముఁ దా నై–వెక్కస మై యున్న,నెందు వెడలెదు చెపుమా?

సీ. ఇచ్చెద నని పల్కి యీకున్న నరకంబు; ద్రోవ నీవును సమర్థుఁడవు గావ;
యేదానమున నాశమే తెంచు, నదియును దానంబుగా దండ్రు తత్త్వవిదులు;
దానంబు యజ్ఞంబుఁ దపము గర్మంబును, దా విత్తవంతుఁడై తలఁపవలయుఁ;
దనయింటఁ గలసర్వధనమును నైదుభాగములుగా విభజించి, కామమునకు,
ఆ. నర్థమునకు, ధర్మయశముల, కాశ్రిత – బృందములకు, సమతఁ బెట్టు నట్టి
పురుషుఁ, డిందు నందుఁ బూర్ణుఁడై మోదించుఁ, దన్ను మాని [5]చేతఁ దగవుగాదు.

1. మొలత్రాడు. 2. తమయొక్కఆశ తుదిభాగము. 3. పొట్టివానికి, 4. స్వాధీనము.
5. చేయుట, కార్యము.

వ. అదియునుంగాక యీ యర్థంబునందు బహ్వృచగీతార్థంబు గల దొక్కటి సావధానుండ వై యాకర్ణింపుము. 581

సీ. 'అంగీకరించిన నఖిలంబుఁ బోవుచో నసృతంబు గాదు; లే దనిన నధిప!
యాత్మవృక్షముమూలమనృతంబు నిశ్చయ; మనృతమూలముగల్గ నాత్మ చెడదు;
పుష్పఫలము లాత్మభూజంబునకు సత్య;మాత్మాను[1] బ్రదుకమి నదియుఁ జెడును;
ఫలపుష్పములు లేక పస చెడి వృక్షంబుమూలంబుతో వృద్ధిఁ బొందఁ గాదె!

తే. చేటుఁగొఱఁతయులఘిమయుఁజెందకుండ-నిచ్చుపురుషుండు సెడకుండు;నిద్ధచరిత!
కాక యంచితసత్యసంగతి నటంచు-నిజధనం బర్థికిచ్చిన నీకు లేదు. 582

ఆ. సర్వమయినచోట సర్వధనంబులు – నడుగ లే;దటంచు నసృతమాడు
చెనఁటిపంద, నేమి సెప్పఁ? బ్రాణముతోడి, శవము వాఁడు: వానిజన్మ మేల?'

వ. మఱియు నిం దొక్క విశేషంబు గలదు వివరించెద. 584

ఆ. వారిజాక్షులందు, వైవాహికములందుఁ,-బ్రాణవిత్తమానభంగమందు,
[2]చకితగోకులాగ్రజన్మరక్షణమందు,-బొంకవచ్చు: నఘముఁ బొందఁ దధిప! 585

మ. కులముం, రాజ్యముఁ, దేజముం, నిలుపు; మీకున్ఁబుండు విశ్వంభరుం;
డలుఁతింబోఁడు: త్రివిక్రమస్ఫురణవాఁ డైనిండు బ్రహ్మాండముం;
గలఁడే మాన్ప నొకండు; నాపలుకు లాకర్ణింపు కర్ణంబులం;
వల దీదానము గీనముం; బనుపుమీ వర్ణిం వదాన్యోత్తమా!'' 586

వ. అని యిట్లు హితంబు పలుకుచున్న కులాచార్యునకు క్షణమాత్రనిమీలితలోచనుం డయి యశస్వి యిట్లనియె. 587

సీ. ''నిజ మానతిచ్చితి నీవు మహాత్మక! మహిని గృహస్థధర్మంబు నిదియ;
యర్థంబుఁ గామంబు యశమును వృత్తియు నెయ్యది ప్రార్థింప నిత్తు ననియు,
నర్థలోభంబున నర్థిఁ బొమ్మను టెట్లు? పలికి లే దనుకంటెఁ బాప మెద్ది?
'యెట్టిదుష్కర్ముని నే భరించెదఁ గాని, సత్యహీనుని మోవఁ జాల, ననుచుఁ

తే. బలుకదే? తొల్లి భూదేవి బ్రహ్మతోడ-సమరమునమండి తిరుగక చచ్చుకంటెఁ
బలికి బొంకక నిజమునఁ బరఁగుకంటె-మానధనులకుభద్రంబు మఱియుఁగలదె?

క. ధాత్రిని [4]హాలికునకును సు – క్షేత్రము, బీజములు, నొకటఁ జేకుఱుభంగిం
జిత్రముగ దాత కీవియుఁ – బాత్రము, సమకూరునట్టిభాగ్యము గలదే? 589

శా. కారే రాజులు? రాజ్యముల్ గలుగవే? గర్వోన్నతిం బొంద రే?
వా రేరీ? సిరి మూట గట్టికొని పోవం జాలి రే? భూమిపైఁ

1. జీవింపకుండుట. 2. భయపడిన. 3. శుభము. 4. సేద్యగాఁడు, రైతు.

పేరైనం గలదే? శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు? వారలన్ మఱచిరే యిక్కాలమున్? భార్గవా! 590

క. ఉడుగని క్రతువుల వ్రతములఁ-బొడగనఁ జనవట్టి[1]పొడవు, పొడవునఁ గుఱుచై
యడిగెడి నఁట? నను బోఁటికి-నిడ రాదె మహానుభావ! యిష్టార్థంబుల్? 591

శా. ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ, దనువుపై, [2]నంసోత్తరీయంబుపైఁ,
బాదాబ్జంబులపైఁ, గపోలతటిపైఁ, బాలిండ్లపై, నూత్నమ
ర్యాదం జెందు కరంబు క్రిందగుట; మీఁదై నాకరంబుంట; మేల్
గాదే? రాజ్యము గీజ్యమున్ సతతమే? కాయంబు నాపాయమే? 592

మ. నిరయంబైన, నిబంధమైన, ధరణీనిర్మూలనంబైన, దు
ర్మరణంబైనఁ, గులాంతమైన, నిజమున్ రా నిమ్ము; కానిమ్ము, పో!
హరుఁ డైనన్, హరి యైన, నీరజభవుం డభ్యాగతుం డైన నౌఁ;
దిరుగన్ నేరదు నాదుజిహ్వా; వినుమా; ధీవర్య! వే యేటికిన్? 593

ఆ. నోడి వినంతవట్టు నుసలక యిచ్చుచో-నేల కట్టు విష్ణుఁ? డేటిమాట?
గట్టెనేనిఁ దాన కరుణించి విడుచును-విడువకుండ నిమ్ము; విమలచరిత! 594

క. మేరువు దల క్రిందైనను-బారావారంబు లింకఁ బాఱిన, లోలో
ధారుణి రజమై పోయినఁ-[3]దారాధ్వము బద్ధమైనఁ దప్పక యిత్తున్. 595

మత్తకోకిలము. ఎన్నఁడుం బరు వేడఁ బోఁ డఁట? యేకలుండఁట? కన్నవా
రన్నదమ్ములు నైన లే రఁట? యన్నివిద్యలమూలగో
ష్ఠి న్నెఱింగిన ప్రోడగు జ్జఁట? చేతు లొగ్గి వసింప, నీ
చిన్నిపాపనిఁ ద్రోసి పుచ్చఁగఁ జిత్త మొల్లదు సత్తమా!” 596

వ. అని యిట్లు సత్యపదవీప్రమాణతత్పరుండును, వితరణకుతూహలసత్వరుండును, విమలయశస్కుండును, దృఢమనస్కుండును, నియతసత్యసంధుండును, నర్థిజనకమలబంధుండును, నైన బలిం జూచి, శుక్రుండు గోపించి, మదీయశాసనం బతిక్రమించితివి; గావున శీఘ్రకాలంబునఁ బదభ్రష్టుడవు గ”మ్మని శాపం బిచ్చె. బలియును గురుశాపతప్తుం డయ్యు ననృతమార్గంబున కభిముఖుండు గాకుండె; నప్పుడు.

ఆ. బ్రదుక వచ్చుఁ గాక! బహుబంధనములైన-వచ్చుఁగాక! లేమి వచ్చుఁ గాక!
జీవధనములైనఁ జెడుఁ గాక! పడుఁ గాక!-మాటఁ దిరుగ లేరు మానధనులు.

వ. అయ్యవసరంబున. 599

ఆ. దనుజలోకనాథు[4]దయిత వింధ్యావళి,-రాజవదన, మదమరాళగమన,
వటుని కాళ్లు గడుగ, వరహేమఘటమున-జలము దెచ్చె, భర్త సన్న యెఱిఁగి.

1. రూపము, ఆకారము. 2. పైఁటపై. 3. ఆకాశము. 4. భార్య.

వ. అయ్యవసరంబునఁ గపటవటునకు నద్దానవేంద్రుం డిట్లనియె. 601

క. "రమ్మా! మాణవకోత్తమ!-లెమ్మా, నీవాంఛితంబు లే దన కిత్తుం;
దెమ్మా యడుగుల; నిటు రా-నిమ్మా, కడుఁగొంక వలదు నేఁటికిఁ దడయన్?"

వ. అనిన విని. 603

మ. బలిదైత్యేంద్రకరద్వయీకృతజలప్రక్షాళనవ్యాప్తికిన్,
జలజాతాక్షుఁడు సాఁచె యోగిసుమనస్సంప్రార్థితశ్రీదమున్,
గలితానమ్రరమాలలాటపదవీకస్తూరికాశాదమున్,
నలినామోదము, రత్ననూపురితనానావేదమున్, బాదమున్. 604

క. సురలోకసముద్ధరణము-నిరతశ్రీకరణ మఖిలనిగమాంతాలం
కరణము, భవసంహరణము-హరిచరణము, నీటఁ గడిగె నసురోత్తముఁడున్.

వ. ఇట్లు ధరణీసురదక్షిణచరణప్రక్షాళనంబు సేసి, వామపాదంబు గడిగి, తత్పావన
జలంబు శిరంబునం జల్లుకొని, వార్చి దేశకాలాదిపరిగణనంబు సేసి. 606

శా. "విప్రాయ, ప్రకటవ్రతాయ, [1]భవతే, విష్ణుస్వరూపాయ, వే
దప్రామాణ్యవిదే, త్రిపాదధరణిం దాస్యామి," యంచుం గ్రియా
క్షిప్రుండై, దనుజేశ్వరుండు వడుగుం జేసాఁచి, పూజించి, "బ్ర
హ్మప్రీత"మ్మని ధార వోసె భువనం బాశ్చర్యముం బొందఁగన్. 607

వ. తత్కాలంబున. 608

ఆ. నీరధారఁ బడఁగనీక, యడ్డంబుగాఁ-గలశరంధ్ర మాఁపఁగాను దెలిసి,
హరియుఁ [2]గావ్యనేత్ర మటఁ గుశాగ్రంబున-నడువ, నేక నేత్రుఁ డయ్యె నతఁడు.

వ. అంత. 610

మ. అమరారాతికరాక్షతోజ్ఝితపవిత్రాంభఃకరశ్రేణికిం
గమలాధీశ్వరుఁ డొడ్డె, ఖండితదివౌకస్స్వామిజిహ్మస్తమున్,
గమలాకర్షణసుప్రశస్తము, రమాకాంతాకుచోపాస్తమున్,
విమలశ్రీకుచశాతచూచుకతటీవిన్యస్తమున్, హస్తమున్. 611

క. మునిజననియమాధారను-జనితాసురయువతినేత్రజలకణధారన్,
దనుజేంద్రనిరాధారను-వనజాక్షుఁడు గొనియె బలివివర్జితధారన్. 512

ఆ. కమలనాభు నెఱిఁగి, కాలంబు దేశంబు-నెఱిఁగి, శుక్రుమాట లెఱిఁగి, నాశ[గలఁడె?
మెఱిఁగి, పాత్రమనుచు నిచ్చెదానము బలి;మహి వదాన్యుఁ డొరుఁడు మఱియుఁ

1. నీకొఱకు. 2. శుక్రుడు,

క. *బలి సేసిన దానమునకు-నలినాక్షుఁడు, నిఖిలభూతనాయకుఁ డగుటం
"గలకల"మనిదశదిక్కులు-"బళిబళి"యని పొగడె [1]భూతపంచకమనఘా! 614

క. క్షితిదాన మిచ్చునతఁడును,-నతికాంక్షఁ బరిగ్రహించునతఁడును, దురిత
చ్యుతులై శతవత్సరములు-శతమఖలోకమునఁ గ్రీడ సలుపుదు రెలమిన్.

వ. అట్లు గావున "నేదానంబును భూదానంబునకు సదృశంబు గానేరదు; గావున వసుంధరాదానం బిచ్చితి; [2]నుభయలోకంబులం గీర్తిసుకృతంబులు వడయు;" మని పలికి యమ్మాయావటుం డిట్లనియె. 616

క. ఇది యేమి వేఁడితని నీ-మది వగవక ధారవోయుమా; సత్యము పెం
పొదవఁగఁ, గోరిన యర్థం-బిది యిచ్చుట ముజ్జగంబు లిచ్చుట మాకున్. 617

వ. అని పలికినవటునిపలుకులకు హర్షనిర్భరచేతస్కుండై వైరోచనుండు. 618

ఆ. "పుట్టి నేర్చుకొనెనో? పుట్టక నేర్చెనో?-చిట్టిబుద్ధు లిట్టిపొట్టివడుగు;
బొట్ట నున్న వెల్ల బూమెలు;" నని నవ్వి-యెలమి ధరణిదాన మిచ్చె నపుడు.

వామనమూర్తి విశ్వరూపము నొంది విజృంభించుట

ఆ. గ్రహమునీంద్రసిద్ధగంధర్వకిన్నర-యక్షపక్షి దేవతాహిపతులు
పొగడి రతనిపెంపుఁ; బుష్పవర్షంబులు-గురిసె; దేవతూర్యకోటి మొరసె. 620

వ. ఇట్లు ధారాపరిగ్రహంబు సేసి. 621

శా. ఇంతింతై, వటుఁ డింతయై, మఱియుఁ దానింతై, నభోవీథిపై
నంతై, తోయదమండలాగ్రమున కల్లంతై, ప్రభారాశిపై
నంతై, చంద్రుని కంతయై, ధ్రువునిపై నంతై, మహర్వాటిపై
నంతై, సత్యపదోన్నతుం డగుచు బ్రహ్మాండాంతసంవర్ధియై. 622

మ. రవిబింబం బుపమింపఁ బాత్ర మగు ఛత్రంబై, శిరోరత్నమై,
శ్రవణాలంకృతియై, [3]గళాభరణమై, సౌవర్ణకేయూరమై,
ఛవిమత్కంకణమై, కటిస్థలి నుదంచద్ఘంటయై, నూపుర
ప్రవరంబై, పదపీఠమై, వటుఁడు దా బ్రహ్మాండమున్ నిండుచోన్. 623

వ. ఇట్లు విష్ణుండు గుణత్రయాత్మకం బగువిశ్వరూపంబు ధరియించి, భువియును నభంబును దివంబును దిశలును [4]దిశాఛిద్రంబులును సముద్రంబులును జలద

---

* ఈ పద్యము ప్రాంతముద్రణములలో ౬౧౫ వ పద్యమునకు తరువాతఁ గలదు. వావిళ్ళ వారి ప్రతిలోమాత్ర మిందున్నది.

1. పృథివ్యాపస్తేజోవాయ్వాకాశములు. 2. భూలోకము స్వర్గలోకము - ఇహపరలోకములు. 3. మెడయందలి హారము. 4. దిక్కులరంధ్రములు అనఁగా విదిక్కులు.

ఖిలభూతనివహంబులుం దాన యై యేకీభవించి. క్రమక్రమంబున భూలోకంబునకుం బొడవై, భువర్లోకంబు నతిక్రమించి, సువర్లోకంబును దలకడచి, మహర్లోకంబు దాఁటి, జనలోకంబునకు మీఁదై, తపంబునకు నుచ్ఛ్రితుండై, సత్యలోకంబుకంటె నౌన్నత్యంబు వహించి, యెడ లిఱుకులు సందులు రంధ్రంబులు లేకుండ నిండి, మహాదేహమహితుం డై, చరణతలంబున రసాతలంబును బాదంబుల మహియును, జంఘల మహీధ్రంబులును, జానువులం బతత్త్రిసముదయంబులును, నూరువుల నింద్రసేనమరుద్గణంబులును, వాసస్స్థలంబున సంధ్యయు, గుహ్యంబునఁ బ్రజాపతులును, జఘనంబున దనుజులును, నాభిని నభంబును, నుదరంబున నుదధిసప్తకంబును, నురంబునఁ దారకానికరంబును, హృదయంబున ధర్మంబును, నురోజంబుల ఋతుసత్యంబులును, మనంబునఁ జంద్రుండును, వృక్షంబునఁ గమలహస్త యగులక్ష్మియుఁ, గంఠంబున సామాదిసమస్తవేదంబులును, భుజంబులఁ బురందరాదిదేవతలును, గర్ణంబుల దిశలును, శిరంబున నాకంబును, శిరోజంబుల మేఘంబులును, నాసాపుటంబున వాయువును, నయనంబుల సూర్యుండును, వదనంబున వహ్నియు, వాణి నఖిలచ్ఛందస్సముదయంబును, [1]రసనను జలేశుండును, భ్రూయుగళంబున విధినిషేధంబులును, ఱెప్పల నహోరాత్రంబు లును, లలాటంబునఁ గోపంబును, నధరంబున లోభంబును, స్పర్శంబునఁ గామంబును, రేతంబున జలంబును, బృష్ఠంబున నధర్మంబును, గ్రమణంబుల యజ్ఞంబులును, ఛాయల మృత్యువును, నగవున ననేకమాయావిశేషంబులును, రోమంబుల నోషధులును, నాడీప్రదేశంబుల నదులును, నఖంబుల శిలలును, బుద్ధి నజుండును, బ్రాణంబుల దేవర్షిగణంబులును, గాత్రంబున జంగమస్థావరజంతుసంఘంబులును, గలవాఁడై, జలధరనినదశంఖ శార్ఙ్గసుదర్శనగదాదండఖడ్గాక్షయబాణతూణీరవిభ్రాజితుండును మకరకుండల కిరీట కేయూరహార కటకకంకణ కౌస్తుభమణిమేఖలాంబరవనమాలికావిరాజితుండును, సునందజయవిజయప్రముఖపరిచరవాహినీసందోహపరివృతుండును, నమేయతేజోవిరాజితుండును నై, బ్రహ్మాండంబు దనమేనికప్పు తెఱంగున నుండ విజృంభించి.

మ. ఒకపాదంబున భూమిఁ గప్పి దివి వేఱొంటన్ [2]నిరోధించి, యొం
డొకటన్ మీఁదిజగంబు లెల్లఁ దొడి, యొం డొంటన్ విలంఘించి ప
ట్టక బ్రహ్మాండకటాహముం బగిలి, వేండ్రం బై పరు(ఱు?)ల్ గాన రా
నొకఁ డై, వాగ్దృగలభ్యుఁ డై, హరి విభుం డొప్పారె విశ్వాకృతిన్. 625

1. నాలుక. 2. అడ్డగించి.

ఆ. ఒకపదంబుక్రింద నుర్వి పద్మము నంటె-నొక్క [1]పంకలవము కొమరుఁ దాల్చె;
నొకటి విహాయసఁ దమ్మి కొదిఁగిన తేఁటి నా-వెలసె మిన్ను; నృప! త్రివిక్రమమున.

వ. తత్సమయంబున. 627

ఆ. జగము లెల్లఁ దాఁటి, చనిన త్రివిక్రము-చరణనఖరచంద్రచంద్రికలను
బొనుఁగుపడియె; సత్యమున బ్రహ్మతేజంబు-దివసకరునిరుచుల దివియ వోలె.

సీ. భవబంధములఁ బాసి, బ్రహ్మలోకంబునఁ గాఁపురంబులు సేయుఘనులు రాజు,
లామరీచ్యాదులు, నాసనందాదులు, నాదివ్యయోగీంద్రు, లచట నెపుడు
మూర్తిమంతంబులై మ్రోయుపురాణతర్కామ్నాయనియమేతిహాసధర్మ
సంహితాదులు, గురుజ్ఞానాగ్నినిర్దగ్ధకర్ములై మఱియును గలుగునట్టి

ఆ. వార లెల్లఁ జొచ్చి, వచ్చి, సర్వాధిపు-నంఘ్రిఁ జూచి, మ్రొక్కి, "రధికభక్తి
దమమనంబులందుఁ దలఁచునిధానంబు-గంటి"; మనుచు "నేఁడుమంటి"; మనుచు.

మ. తన[2]పుట్టిల్లిదె పో? మ్మటంచు నజుఁడుం దన్నాభిపంకేరుహం
బు నిరీక్షించి, నటించి, యున్నతపదంబుం జూచి, తత్పాద[3]సే
చనముం జేసెఁ గమండలూదకములం జల్లించి; తత్తోయముల్
వినువీథిం బ్రవహించె దేవనది నా విశ్వాత్మకీర్తిప్రభన్. 630

వ. తత్సమయంబున. 631

సీ. యోగమార్గంబున నూహించి, బహువిధపుష్ప[4]దామంబులఁ బూజ సేసి,
దివ్యగంధంబులు దెచ్చి, సమర్పించి, ధూపదీపములఁ దోడ్తోడ నిచ్చి,
భూరిలాజాక్షతంబులు సల్లి, ఫలములు గానిక లిచ్చి, రాగములఁ బొగడి,
శంఖాదిరవములుజయఘోషములుఁ జేసి, "కరుణాంబునిధి త్రివిక్రమ!" యటంచు

ఆ. బ్రహ్మ మొదలు లోకపాలురు గొనియాడి, రెల్లదిశల; వనచరేశ్వరుండు
జాంబవంతుఁ డరిగి చాటె భేరీధ్వని-వెలయఁ జేసి "విష్ణువిజయ! మనుచు. 632

క. అన్ని జగంబులఁ దానై-యున్న జగన్నాథుఁ జూడ, నొగి భావింపం
గ న్నందక, మన మందక-సన్నుతులం జేసి రపుడు సభ్యులు బలియున్. 633

వ. అంత నొయ్యన పూర్వప్రకారంబున వామనాకారంబు వహించి, యున్న వామ
నునిం గని, "పదత్రయ[5]వ్యాజంబున నితండుసకలమహీమండలంబునాక్రమించెఁ;
గపటవటురూపతిరోహితుం డగువిష్ణుం డని యెఱుంగక మనదానవేంద్రుండు
సత్యసంధుండు గావున మాట దిరుగక యిచ్చె; నతనివలన నేరంబు లే; దీకుబ్జుం
డప్రతిహతతేజఃప్రభావంబున సజ్జకంబుగా నిజ్జగంబులం బరిగ్రహించి, పర్జ

---

1. బురదయొక్క రేణువు. 2. జన్మస్థానము. 3. తడుపుట, అభిషేకము. 4. హారము. 5. కారణము.

న్యాదులకు విసర్జనంబు సేయం దలంచి యున్నవాఁ, డీపాఱునిం దూఱి పాఱనీక నిర్జించుటకర్జం;" బని తర్జనంబులును, గర్జనంబులును జేయుచు, వజ్రాయుధాదిమదజేత లగు హేతిప్రహేతివిప్రచిత్తిముఖ్యు లయినరక్కసులు పెక్కండ్రుక్కుమిగిలి యుద్ధంబునకు సన్నద్ధులై పరశుపట్టిసభల్లాదిసాధనంబులు ధరియించి, కసిమసంగి, ముసరికొని దశదిశలం బ్రసరించినం జూచి, హరిపరిచరులు సునందనంద జయ జయంత విజయ ప్రబలోద్బల కుముద కుముదాక్ష తార్క్ష్య పుష్పదంత విష్వక్సేనశ్రుతదేవ సాత్వత ప్రముఖు లగుదండనాథు, లయుతవేదండసముద్దండబలులు దమతమయూథంబుల నాయుధంబులతోడం గూర్చుకొని, దాన[1]వానీకంబులఁ బరలోకంబున కనుచువారలై, వారల నెదుర్కొని, కదనంబునకుఁ బరవసంబు సేయుచున్నం గనుంగొని, శుక్రశాపంబుఁ దలంచి, దనుజవల్లభుం డిట్లనియె.

సీ. "రాక్షసోత్తములార! రండు పోరాడక; కాలంబు గాదిది కలహమునకు;
సర్వభూతములకు సంపదాపదలకుఁ బ్రభువైనదైవంబుఁ బరిభవింప
మన మోపుదుమె? తొల్లి మనకు రాజ్యంబును సురలకు నాశంబు సొరిది నిచ్చి,
విపరీతముగఁ జేయువేల్పు నే మందము? మనపాలిభాగ్యంబు మహిమ గాక!
తే. వెలుచి పలుమాఱుఁ బాఱెడివిష్ణుభటులు-మిమ్ము నెగచుట దైవంబు మేరగాదె?
మనకు నెప్పుడు దైవంబు మంచిదగును-నాఁడు గెలుతము; పగవారి నేఁడు వలదు.

వ. అదియునుం గాక. 636

క. బలుదుర్గంబులు సచివులు, బలములు, మంత్రౌషధములు, బహు[2]శేముషియుం
గలిగియు, సామోపాయం, బులఁ గాల మెఱింగి, నృపుఁడు పోపట యొప్పున్.

వ. అట్లు గావున రణంబున కిప్పుడు శత్రుల[3]మోహరించుట కార్యంబు గాదు; మనకుం దగుకాలంబున జయింతము; నలంగక తొలంగుం," డనినఁ దలంగి భాగవతభట భీతులై చిక్కి, రక్కసులు రసాతలంబునకుం జని; రంత హరిహృదయం బెఱింగి తార్క్ష్యనందనుండు యాగసుత్యాహంబున వారుణపాశంబుల నసుర వల్లభుని బంధించె నంత. 638

క. బాహులఁ బదములఁ గట్టిన-"శ్రీహరికృప గాక! యేమి సేయుదు?" నని సం
దేహింపక బలి నిలిచెను-హాహారవ మెసఁగె దశదిగంతములందున్. 639

క. సంపద సెడియును దైన్యముఁ, గంపంబును లేక తొంటికంటెను బెంపుం
దెంపును, [4]నెఱుకయు, ధైర్యము, నింపనిసురవైరిఁ జూచి వటుఁ డిట్లనియెన్.

సీ. "దానవ! త్రిపదభూతల మిత్తు నంటివి; ధరణిఁ జంద్రార్కులెందాఁక నుందు;
రంతభూమియు నొక్కయడుగయ్యె నాకును; స్వర్లోకమును నొక్కచరణమయ్యె;

1. సైన్యము, 2. తెలివి, మనస్సు, బుద్ధి. 3. ఎదిరించుట, 4. జ్ఞానము.

నీసొమ్ము సకలంబు నేఁడు రెండడుగులు; గడమపాదమునకుఁ గలదె భూమి?
యిచ్చెద నన్నర్థమీనిదురాత్ముండు నిరయంబుఁ బొందుట నిజము గాదె?
తే. కాన దుర్గతికిని గొంతకాలమరుగు;-కాక యిచ్చెదవేని వేగంబ నాకు,
నిపుడు మూఁడవపదమున కిమ్ముఁజూపు;-బ్రాహ్మణాధీనములు ద్రోవ బ్రహ్మవశమె''?

వ. అని యిట్లు వామనుండు పలుక, సత్యభంగసందేహవిషదిగ్ధశల్యనికృత్తహృద
యుండయ్యును, విషణ్ణుండుగాక, వైరోచని ప్రసన్నవదనంబుతోడఁ జిన్నిప్రోడ
వడుగున కిట్లనియె. 642

ఆ. ''సూనృతంబు గాని నుడియదు నాజిహ్వ,-బొంకఁజాల; నాకు బొంకు లేదు;
నీతృతీయపదము నిజము నాశిరమున-[1]నెలవు సేసి పెట్టు నిర్మలాత్మ! 643

ఆ. నిరయమునకుఁ, బ్రాప్తనిగ్రహంబునకును-బదవిహీనతకును, బంధనమున,
కర్థభంగమునకు, నఖిలదుఃఖమునకు-వెఱవ; దేవ! బొంక వెఱచినట్లు. 644

వ. అదియునుం గాక. 645

సీ. తల్లిదండ్రులు నన్నదమ్ములుఁ జెలికాండ్రు గురువులు శిక్షింపఁ గొఱఁతవడునె?
పిదప మేలగుఁగాక! పృథుమదాంధులకును దానవులకు మాకుఁ దఱి యెఱింగి;
విభ్రంశచక్షువు వెలయ నిచ్చుటఁ జేసి, గురువులలో నాదిగురువ వీవ;
నీవు బంధించిన నిగ్రహమో? లజ్జయో? బాధయో? తలంప;
తే. నిన్ను నెదిరించి పోరాడి, నిర్జరారు, లాదియోగీంద్రు లందెడునట్టిటెంకి
నందరే తొల్లి పెక్కండ్రు? హర్షమూర్తి! *యీశ! నీయెడ దుర్లభ మేమి గలదు?

మ. చెలియే మృత్యువు; చుట్టమే యముఁడు; సంసేవార్థులే కింకరుల్;
శిలలం జేసెనె బ్రహ్మ దన్ను? దృఢమే జీవంబు? నోచెల్లరే!
చలితంబౌట యెఱుంగ కీకపటసంసారంబు నిక్కంబుగాఁ
దలఁచుం మూఢుఁడు సత్యదానకరుణాధర్మాదినిర్ముక్తుఁడై. 647

సీ. చుట్టాలు దొంగలు; సుతులు ఋణస్థులు; కాంతలు సంసారకారణములు;
ధనము లస్థిరములు; దను వతిచంచల; గార్హ్యార్థ లన్యులు; గడచుఁ గాల;
మాయువు సత్వర; మైశ్వర్యమతిశీఘ్ర;మని కాదె తమతండ్రి [2]నతకరించి
మాతాత సాధుసమ్మతుఁడు ప్రహ్లాదుండు నీపాదకమలంబు నియతిఁ జేరె?
తే. భద్రుఁడతనికి మృతిలేని బ్రదుకు గలిగె: వైరులై కాని తొల్లి మావారుగాన;
రక్షివై వచ్చి, నీవు నన్నడుగుటెల్లఁ, బద్మలోచన! మాపుణ్యఫలముగాదె?648

వ. అని యిట్లు పలుకుచున్న యవసరంబున. 649

---

* 'వైరిభక్తులు గట్టిగా వలయుఁగాక' అని యొకయధికపాదమందు ప్రాఁతయచ్చులలోఁ గలదు. 1. స్థానము. 2. తక్కువపఱచి

శా. ఆద్దైత్యేంద్రుఁడు, పీనవక్షు, నవపద్మాక్షుం, [1]బిశంగాంబరా
చ్ఛాదుఁ, నిర్మలసాధువాదు, ఘనసంసారాదివిచ్ఛేదు, సం
శ్రీదుఁ, భక్తిలతాతిరోహితహరిశ్రీపాదు, నిగతఖేదుఁ; బ్ర
హ్లాదుఁ, బోధకళావినోదుఁ గనియెన్ హర్షంబుతో ముందటన్. 650

వ. ఇట్లు సమాగతుం డైన తమతాతం గనుంగొని, విరోచననందనుండు వారుణపాశ
బద్ధుండు గావునఁ దనకుం దగిననమస్కారంబు సేయ [2]రామిం జేసి, సంకులాశ్రు
విలోలలోచనుండై సిగ్గుపడి, నతశిరస్కుండై, నమ్రభావంబున మ్రొక్కు
సెల్లించె; నంతఁ బ్రహ్లాదుండు ముఖమండపంబున సునందాదిపరికరసమేతుం డై
కూర్చున్న వామనదేవునిం గని. యానందబాష్పంబులు బులకాంకురంబులుఁ
నెఱయ దండప్రణామం బాచరించి, యిట్లని విన్నవించె. 651

సీ. "ఇతనికి మున్ను నీవింద్రపదం బిచ్చి, నేఁడు త్రిప్పుటయును నెఱయ మేలు;
మోహనాహంకృతి మూలంబు గర్వాంధతమసవికారంబు; దాని నూన్చి
కరుణ రక్షించుటగాక బంధించుటే తత్త్వజ్ఞునకు మహేంద్రత్వమేల?
నీపాదకమలంబు నియతిఁ గొల్చినదానిఁ బోలునే సురరాజ్యభోగపరత?
తే. గర్వమే పారఁ గన్నులుఁ గానరావు – చెవులు వినరావు; చిత్తంబుచిక్కువడును
మఱచు నీసేవలన్నియుఁ మహిమ మాన్పి – మేలు సేసితి;నీమేటి మేర నూపి."

వ. అని పలికి జగదీశ్వరుండు నిఖిలలోకసాక్షియు నగు నారాయణదేవునకు నమ
స్కరించి ప్రహ్లాదుండు పలుకుచున్న సమయంబున 653

మ. తతమత్తద్విపయానయై, కుచనిరుంధచ్చోళసంవ్యానయై,
ధృతబాష్పాంబువితానయై, కరయుగాధీనాలికస్థానయై,
"పతిభిక్షాం మమ దేహి, కోమలమతే! పద్మాపతే! యంచుఁ ద
త్సతి వింధ్యావళి చేర వచ్చెఁ ద్రిజగద్రక్షామనున్ వామనున్. 654

వ. వచ్చి యచ్చేడియ తచ్చరణసమీపంబునం బ్రణతయై నిలువంబడి, యిట్లనియె.

క. "నీకుం గ్రీడార్థము లగు – లోకంబులఁ జూచి, పరులు లోకులు కుమతుల్
లోకాధీశుల మందురు – లోకములకు రాజవీవ! లోకస్తుత్యా! 656

క. కాదనఁడు; పొమ్ము! లే; దీ – రా; దనఁడు; జగత్త్రయైకరాజ్యము నిచ్చెన్;
నాదయితుఁ గట్ట నేటికి? శ్రీదయితాచిత్తచోర! శ్రితమందారా!" 657

వ. అని యిట్లు వింధ్యావళియుం బ్రహ్లాదుండును విన్నవించునవసరంబున హిరణ్య
గర్భుండు సనుదెంచి యిట్లనియె. 658

1. పచ్చని 2. రాకుండుటవలన 3. విషయమును సంపూర్ణముగఁ దెలిసినవాఁడు.

సీ. "భూతలోకేశ్వర! భూతభావన! దేవ దేవ! జగన్నాథ! దేవవంద్య!
తనసొమ్ము సకలంబుఁ దప్పక నీకిచ్చె; దండయోగ్యుఁడు గాఁడు; దానపరుఁడు;
గరుణింప నర్హుండు కమలలోచన! నీకు; విడిపింపు మీతని వెఱపుదీర్చి;
తోయపూరము సల్లి, దూర్వాంకురంబులఁ జేరి నీపదము లర్చించునట్టి
తే. భక్తియుక్తుఁడు; లోకేశపదమునందు-నీవు ప్రత్యక్షముగవచ్చి, నేఁడు వేఁడ
నెఱిఁగి, తనరాజ్యమంతయు నిచ్చినట్టి-బలికిఁ దగునయ్య దృఢపాశబంధనంబు!

వ. అని పలికిన బ్రహ్మవచనంబులు విని భగవంతుం డిట్లనియె. 660

సీ. "ఎవ్వనిఁ గరుణింప నిచ్చయించితిని; వాని యఖిలవిత్తంబు నే నపహరింతు:
సంసారగురుమదస్తబ్ధుఁడై యెవ్వఁడు దెగడి, లోకము, నను ధిక్కరించు;
నతఁడెల్లకాలంబు నఖిలయోనులయందుఁ బుట్టను; దుర్గతి బొందుఁ; బిదప
విత్తవయోరూపవిద్యాబలైశ్వర్య కర్మజన్మంబులగర్వ ముడిగి
తే. యేకవిధమునవిమలుఁడై, యెవ్వఁడుండు-వాఁడు నాకూర్చిరక్షింపవలయువాఁడు;
స్తంభలోభాభిమానసంసారవిభవ, మత్తుఁడై చెడ నొల్లఁడు [1]మత్పరుండు. 661

శా. బద్ధుండై గురుశాపతప్తుఁడయి తా బంధు వ్రజత్యక్తుఁడై,
సిద్ధైశ్వర్యముఁ గోలుపోయి విభవక్షీణుండునై, పేదయై,
శుద్ధత్వంబును సత్యముం, గరుణయుక్, సొంపేమియుం దప్పఁ; డు
ర్బుద్ధుం డై యజయాఖ్యమాయ గెలిచెం, బుణ్యుం డితం డల్పుఁడే? 662

ఆ. అసురనాథుఁ డనుచు, ననఘునిమర్యాద-యేను జూత మనుచు, నింత వలుక
నిజము వలికె నితఁడు; నిర్మలాచారుండు-మేలుమేలు నాకు మెచ్చువచ్చు. 663

క. సావర్ణిమనువువేళను-దేవేంద్రుండగు నితండు; దేవతలకు దు
ర్భావిత మగునాచోటికి-రావించెద నంతమీఁద రక్షింతు దయన్. 664

క. వ్యాధులుఁ దప్పులు నొప్పులు-బాధలుఁ జెడి, విశ్వకర్మభావితదనుజా
రాధితసుతలాలయమున-[2]నేధితవిభవమున నుండు నితఁడందాఁకన్." 665

వ. అని పలికి బలిం జూచి భగవంతుం డిట్లనియె. 666

సీ. "సేమంబు నీకింద్రసేనమహారాజ! వెఱవకు; మేలు నీవితరణంబు;
వేలుపులందుండ వేడుకపడుదురు; దుఃఖంబు లిడుమలు దుర్మరణము;
[3]లాతురతలు, నొప్పు,లందుండువారికి నొందవు; సుతలమం దుండు నీవు;
నీపంపు సేయనినిర్జరారాతుల నాచక్రమే తెంచి నఱకుచుండు;

1. నాయందు శ్రద్ధ కలవాఁడు. 2. వృద్ధిపొందఁబడిన 3. దానముచేయుటయం దాసక్తికలవాఁడు.

ఆ. లోకపాలకులకు లోనుగా వక్కడ;-నన్యు లెంత వార? లచట నిన్ను
నెల్ల ప్రొద్దు వచ్చి, యేను రక్షించెదఁ - గరుణతోడ నీకుఁ గానవత్తు. 667

క. దానవదైత్యుల సంగతిఁ-బూనిన నీ యసురభావమును దోస్తోమ
ద్ధ్యానమునఁ దలఁగి పోవును:-మానుగ సుతలమున నుండుమా మాయాజ్ఞన్."

వ. అని యిట్లు పలుకుచున్న ముమ్మూర్తులముదుక వేల్పు దియ్యని నెయ్యంపుఁబలుకుఁ జెఱకురసంపు[1]సోనలు వీనుల తెరువులం జొచ్చి, లోను బయలు నిండి, ఱెప్పల కప్పు దప్పం ద్రోచికొని, కనుఁగవకొలంకుల నలుఁగులు వెడలిన చందంబున సంతసంబునం గన్నీరు మున్నీరై పఱవ, నురగిఫలకంబునం బులకంబులు [2]కులకంబులయి తిలకంబులొత్తఁగేలు మొగిడ్చి, నెక్కొన్న వేడుకం ద్రొక్కుడువడుచుఁ జిక్కని చిత్తంబునఁ జక్కనిమాటల రక్కసులతేఁడిట్లనియె. 669

ఉ. "ఎన్నఁడు లోకపాలకుల నీకృపఁ జూడని నీవు, నేఁడు న
న్నున్నతుఁ జేసి, నా బ్రదుకు [3]నోజయు నానతియిచ్చి, కాచి; తీ
మన్నన లీదయారసము, మాటల పెద్దఱికంబుఁ, జాలవే?
పన్నగతల్ప! నిన్నెఱిఁగి పట్టిన నాపద గల్గ నేర్చునే?" 670

వ. అని పలికి, బంధవిముక్తుండై నమస్కరించి, బ్రహ్మకుం బ్రణామంబు సేసి, యిందుధరునకు వందనం బాచరించి, తనవారలతోఁ జేరికొని, బలిసుతలంబునకుఁ జనియె; నంత హరికృపావశంబునం గృతార్థుండై, కులోద్ధారకుండయిన మనుమనిం గని, సంతోషించి, ప్రహ్లాదుండు భగవంతునకిట్లనియె. 671

సీ. చతురాననుఁడు నీప్రసాదంబు గానఁడు; శర్వుఁ డీలక్ష్మిల జాడఁ బొందఁ;
డన్యుల కెక్కడి? దసురులకును మాకు బ్రహ్మాదిపూజితపదుఁడ వయిన
దుర్లభుండవు నీవు దుర్గపాలుఁడ వైతి; పద్మజాదులు భవత్పాదపద్మ
మకరందసేవనమహిమ నైశ్వర్యంబు లందిరి కాక; మేమల్పమతుల;
తే. మధికదుర్యోధులము; కుత్సితాత్మకులము;-నీకృపాదృష్టిమార్గంబు నెలవు సేర
నేమి తప మాచరించితి; మెన్నఁగలమె?-మమ్ముఁ గాచుట చిత్రంబు మంగళాత్మ!

వ. అదియునుం గాక. 673

ఆ. సర్వగతుఁడవయ్యు సమదర్శనుఁడవయ్యు-నొకట [4]విషమవృత్తి నుండు; దరయ
నిచ్చ లేనివారి, కీవు భక్తులుగోరు-[5]తలఁపు లిత్తు కల్పతరువుమాడ్కి." 674

వ. అని విన్నవించుచున్న ప్రహ్లాదుం జూచి, పరమపురుషుం డిట్లనియె. 675

తే. "వత్స! ప్రహ్లాద! మేలు; నీవారు నీవు-సారుది మనుమనిఁ దోడ్కొ-ని సుతలమునకుఁ
బయన మైపొమ్ము; నే గదాపాణి నగుచుఁ-జేరి రక్షింప దురితంబు సెందదచట."

1. ధారలు. 2. నిండినవి. 3. తేజస్సు. 4. భేదభావముతో. 5. కోర్కులు.

వ. అని యిట్లు నియమించినం బరమేశ్వరునకు నమస్కరించి, వలగొని కరకమల
పుట ఘటితనిటలతటుండై వీడ్కొని, బలిం దోడ్కొని, సకలాసురయూథంబు
నుం దాను నొక్కమహాబిలద్వారంబు సొచ్చి, ప్రహ్లాదుండు సుతలలోకంబు
నకుం జనియె; నంత బ్రహ్మవాదులయిన యాజకులసభామధ్యంబునం గూర్చున్న
శుక్రునిం జూచి నారాయణుం డిట్లనియె. 677

ఆ. "ఏమి గొఱంతపడియె? నీ బలిజన్నంబు-విస్తరింపు కడమ విప్రవర్య!
విషమమయిన[1]కర్మవిసరంబు బ్రాహ్మణ-జనులుచూచినంత సమతఁ బొందు."

భ. అనిన శుక్రుం డిట్లనియె. 679

సీ. "అఖిలకర్మంబుల కధినాథుఁడవు నీవ; యజ్ఞేశుఁడవు నీవ; యజ్ఞపురుష!
ప్రత్యక్షమున నీవు పరితుష్టి నొందినఁ, గడమేల కల్గు నేకర్మములకు;
ధనదేశకాలార్హ తంత్రమంత్రంబులఁ గొఱఁతలు నిన్నుఁ బేర్కొనిన మాను;
నయినఁ గావింతు నీయానతి; భవదాజ్ఞ మెలఁగుట జనులకు మేలుగాదె?
తే. యింతకంటెను శుభము నాకెచటఁ గలుగు" ననుచు[2]హరిపంపు శిరమున నావహించి
కావ్యుఁడసురేంద్రుజన్నంబు కడమదీర్చె, మునులు విప్రులు సహాయ్యమునఁ జరింప.

వ. ఇవ్విధంబున వామనుం డయి హరి బలి నడిగి, మహిం బరిగ్రహించి, తనకున
గ్రజుం డగునమరేంద్రునకుం ద్రిదివంబు సదయుండయి యొసంగె; నత్తఱి దక్ష
భృగు ప్రముఖప్రజాపతులును, భవుండును, గుమారుండును, దేవర్షిపితృగణం
బులును, దానును, గూడికొని చతురాననుండు గశ్యపునకు నదితికి సంతో
షంబు గా "లోకంబులకు లోకపాలురకు వామనుండు వల్లభుండని నియమించి
యంత" ధర్మంబునకు యశంబునకు లక్ష్మికి శుభంబులకు దేవతలకు వేదంబు
లకు స్వర్గాపవర్గంబులకు నుపేంద్రుండు ప్రధానుండని సంకల్పించె; నాసమ
యంబున. 681

క. "కమలజుఁడు లోకపాలుర-నమరేంద్రునిఁ గూడి, దేవయానంబున న
య్యమరావతికిని వామను-నమరం గొనిపోయి రంత; నటమీఁద నృపా! 682

ఆ. [3]బల్లిదంపుఁదోడుప్రాపున నింద్రుని-కింద్రపదము చేరు టిట్లు గలిగె;
దనకు సాధ్యుఁ డైన తమ్ముఁడు గలిగిన-గోర్కులన్న కేలకొఱంత నొందు? 683

క. పా లడుగఁడు; మే లడుగం;-డేలఁడు; భిక్షించి యన్న కిచ్చెఁ ద్రిజగముఁ;
వేలుపులతల్లి[4]కడపటి-చూలుం బోలంగఁ గలరె సోలయనితమ్ముల్? 684

ఆ. కడుపు బడర గాఁగ గొడుకులఁ గనుకంటెఁ-దల్లి కొకఁడె చాలు బల్లిదుండు;
త్రిదశగణముఁ గన్నయదితి గానుపు దీఱఁ-జిన్నిమేటివడుగుఁ గన్నయట్లు.

---

1. కర్మసముదాయము. 2. విష్ణుమూర్తియొక్క యాజ్ఞ. 3. బలముగల సాయముయొక్క ఆధారముచే. 4. తుట్టతుది కుమారుఁడు.

వ. ఇట్లు దేవేంద్రుండు వామనభుజపాలితంబగు త్రిభువనసామ్రాజ్యవిభవంబు మరల సంగీకరించె; నప్పుడు బ్రహ్మయు శర్వుండును కుమారుండును భృగుప్రముఖు లయినమునులును పితృదేవతలును దక్షాదిప్రజాపతులును సిద్ధులును వైమానికులును మఱియుం దక్కినవారలును బరమాద్భుతం బైనవిష్ణునిసుమహాకర్మంబులకు నాశ్చర్యంబు నొందుచుఁ, బ్రశంసించుచు, నాడుచుం, బాడుచుఁ దమ తమ నివాసంబులకుం జని'' రని చెప్పి శుకుం డిట్లనియె. 686

తే. ''మనుజనాథ! త్రివిక్రముమహిమ కొలఁది యెఱుఁగ వర్ణింప లెక్కింప నెవ్వఁ డోపుఁ?
గుంభినీరేణుకణములు గుఱుతు పెట్టువాఁడు నేరఁడు; దక్కినవారివశమె? 687

క. అద్భుతవర్తనుఁడగుహరి – సద్భావితమైనవిమలచరితము వినువాఁ
డుద్భటవిక్రముఁడై, తుది – నుద్భాసితలీలఁ బొందు నుత్తమగతులన్. 688

తే. తగిలి మానుష పైతృక దైవకర్మ – వేళలందుఁ ద్రివిక్రమవిక్రమంబు
లెక్కడెక్కడఁ గీర్తింతు రెవ్వరేని–బొందుదురు నిత్యసౌఖ్యంబు భూవరేంద్ర!''

మత్స్యావతారకథాప్రారంభము

వ. అని యిట్లు శుకుండు రాజునకు వామనావతారచరితంబు సెప్పె నని సూతుండు మునులకుం జెప్పిన విని వార లతని కిట్లనిరి. 690

సీ. ''విమలాత్మ! వినమాకు వేడ్క యయ్యెడు; మున్ను హరిమత్స్యమైనవృత్తాంత మెల్లఁ
గర్మబద్ధునిభంగి ఘనుఁ డీశ్వరుఁడు లోకనిందితంబై తమోనిలయమైన
మీనరూపము నేల మేలని ధరియించె; నెక్కడ వర్తించె; నేమి సేసె;
నాద్యమై వెలయునయ్యవతారమునకు నెయ్యది కారణంబు? కార్యాంశ మెట్లు?
ఆ. నీవు దగుదు మాకు నిఖిలంబు నెఱిఁగింపఁ – దెలియఁ జెప్ప వలయు; దేవదేవు
చరిత మఖిలలోకసౌభాగ్య[1]కరణంబు – గాదె? విస్తరింపు క్రమముతోడ.''

వ. అని మునిజనంబులు సూతు నడిగిన నతం డిట్లనియె; ''మీర లడిగిన యీయర్థంబుఁ బరీక్షిన్నరేంద్రుం డడిగిన భగవంతుం డగు బాదరాయణి యిట్లనియె. 692

సీ. ''విభుఁ డీశ్వరుఁడు వేదవిప్రగోసురసాధుధర్మార్థములఁ గావఁ దనువుఁ దాల్చి,
గాలిచందంబున ఘనరూపములయందుఁ [2]దనురూపములయందుఁ దగిలియుండు;
నెక్కువ దక్కువ యెన్నఁడు నొందక నిర్గుణత్వంబున [3]నెఱయు ఘనుఁడు;
గురుతయు గొఱఁతయు గుణసంగతి వహించు; మనుజేశ! చోద్యమే మత్స్యమగుట?
తే. వినుము; పోయినకల్పాంతవేళఁ దొల్లి – ద్రవిళదేశపురాజు సత్యవ్రతుండు
నీరు ద్రావుచు హరిఁ గూర్చి నిష్ఠతోడఁ – దపముఁ గావించె నొక యేటితటమునందు.

1. చేయునది. 2. సూక్ష్మరూపములు. 3. వ్యాపించు.

వ. మఱియు నొక్కనాఁ డమ్మేదినీకాంతుండు గృతమాలిక యనునేటిపొంత హరి సమర్పణంబుగా జలతర్పణంబు సేయుచున్నసమయంబున, నారాజుదోసిట నొక్కమీనుపిల్ల దవిలి వచ్చిన, నులికిపడి, మరలం దరంగిణీజలంబునందు శకుల శాబకంబు విడిచె; నట్లు విడిచిన నీటిలో నుండి జలచర[1]పోతంబు భూతలేశ్వరున కిట్లనియె. 694

మత్తకోకిలము. "పాటు వచ్చినజ్ఞాతిఘాతులు పాపజాతిఝషంబు లీ
యేటఁ గొండొకమీనుపిల్లల నేఱి, పట్టి వధింప, న
చ్చోట నుండక నీదుదోసిలి సొచ్చి వచ్చిననన్ను, [2]న
ట్టేటఁ ద్రోవఁగఁ బాడియే? కృప యింత లేక దయానిధీ! 695

ఆ. వలలు దారు నింక వచ్చి జాలరివేఁట, కాఱు నేఱు గలఁచి తాఱు వెట్టి
మిడిసి పోవ నీక, మెడఁ బట్టుకొనియెద-రప్పుడెందుఁ జొత్తు ననఘచరిత! 696

క. భక్షించు నొండె ఝషములు?-శిక్షింతురు ధూర్తులొండెఁ? జెడకుండ ననున్
రక్షింపు దీనవత్సల! - [3]ప్రక్షీణులఁ గాచుకంటె భాగ్యము గలదే?" 697

వ. అనిన విని, కరుణాకరుండగునవ్విభుండు, మెల్లన నయ్యంభశ్చరడింభకంబును గమండలు జలంబునంబెట్టి, తననెలవునకుం గొనిపోయె; నదియు నొక్కరాత్రంబునం [4]గుండిక నిండి, తనకు నుండ నిమ్ముసాలక రాజన్యునకిట్లనియె. 698

క. 'ఉండ నిది గొంచె మెంతయు-నొండొకటిం దెమ్ము భూవరోత్తమ!' యనుడున్
[5]గండకముఁ దెచ్చి విడిచెను-మండలపతి సలిలకలశమధ్యమునందున్. 699

వ. అదియును ముహూర్తమాత్రంబునకు మూఁడుచేతులనిడుపై, యుదంచనంబు నిండి, పట్టుసాలక, 'వేఱొండు దె'మ్మనవుడు నారాచపట్టి కరుణాగుణంబునకు నాటపట్టు గావున, గండకంబు నొండొక్కచిఱుతమడుఁగున నునిచె; నదియు నాసరోవరజలంబునకు నగ్గలంబై 'తనకు సంచరింప నిది గొంచెం'బని పలికినం, బుడమిఱేఁడు మంచివాఁ డగుటం జేసి, యా[6]కంచరంబు నుదంచితజలాస్పదంబైన హ్రదంబునందు నిడియె; నదియు నాసలిలాశయంబునకును నధికంబై, 'పెరుఁగ నిమ్ము సాల'దని చెప్పికొనిన నప్పుణ్యుండొప్పెడినడవడిం దప్పనివాఁడైనకతంబున నమ్మహామీనంబును మహార్ణవంబున విడిచె; నదియును మకరాకరంబునం బడి రాజునకిట్లనుఁ; "బెనుమొసళ్లు ముసరికొని కసిమసంగి మ్రింగెడి నింతకాలంబు నడపి, కడపట దిగవిడువకు; వెడలఁ దిగువు"మని యొలింగింపం దెలిసి యన్నిటి తిరుగుడుప్రోడకుం బుడమిఱేఁ డిట్లనియె. 700

1. పిల్ల, చిన్నది. 2. నడు+ఏఱు ఏటిమధ్యమున. 3. శక్తిలేనివారు. 4. జలపాత్ర, కమండలువు. 5. చేపపిల్లను. 6. చేప.

సీ. "ఒకదినంబున శతయోజనమాత్రము విస్తరించెదు నీవు; వినము; చూడ;
మిటువంటిఝషముల నెన్నఁడు నెఱుఁగము? మీనజాతుల కిట్టిమేను గలదె?
యేమిటికి? కెవ్వఁడ? వీలీలఁ ద్రిప్పెదు; కరుణ నాపన్నులఁ గావ వేఁడి,
[1]యంభశ్చరంబైన హరివి; నే నెఱిఁగితి; నవ్యయ! నారాయణాభిధాన!
తే. జననసంస్థితిసంహారచతురచిత్త!-దీనులకు భక్తులకు మాకు దిక్కు నీవ;
నీదులీలావతారముల్ నిఖిలభూత-భూతిహేతువుల్ మ్రొక్కెదఁ బురుషవర్య!

క. ఇతరులము గాము; చిత్సం-గతులము; నూపాల నీవు గలిగితి; భక్త
స్థితుఁడ వగునిన్ను నెప్పుడు-నతి సేసినవాని కేల నాశము గలుగున్? 702
క. శ్రీలలనాకుచవేదికఁ-గేళీపరతంత్రబుద్ధిఁ గ్రీడించుచుఁ
లోలుఁడవు; దామసాకృతి-నేలా మత్స్యంబవైతి; వెఱిఁగింపు హరీ!" 703

వ. అని పలుకుసత్యవ్రతమహారాజునకు నయ్యుగంబుకడపటఁ బ్రళయవేళా
సముద్రంబున నేకాంతజనప్రియుండయి విహరింప నిచ్ఛించి, మీనరూపధరుం
డైన హరి యిట్లనియె. 704

సీ. "ఇట మీఁద నీరాత్రి కేడవదినమునఁ బద్మగర్భుని కొక్కపగలు నిండు;
భూర్భువాదికజగంబులు మూఁడు విలయాబ్ధిలోన మునుంగు; నాలోనఁ బెద్ద
నావ సేరఁగ వచ్చు నాపంపుపెంపున; దానిపై నోషధితతులు బీజ
రాసులు నిడి, పయోరాశిలో విహరింపఁ గలవు సప్తర్షులఁ గలసి తిరుగ;
ఆ. మ్రోలఁ గాన రాక మించుపెంజీకటి-మిడుకుచుండు మునులు మేనివెలుఁగు
దొలఁకుచుండు; జలధి; [2]దోధూయమానమై-నావ దేలుచుండు నరవరేణ్య!
వ. మఱియు నన్నావ [3]మున్నీటికెరల్లకు లోను గాకుండ, నిరుగెలంకుల వెనుక
ముందట నేమఱకుండఁ జెన్నొలు లగునాగజులక్,జడియుచుఁ బొడువ వచ్చిన
బలుగ్రాహంబుల నోడియుచు సంచరించెద; నొక్కపెనుబాము చేడువ నాయ
నుమతిం బొడసూపెదు; దానం జేసి, సుడిగాడ్పులకతంబున నావ వడిం దిరుగం
బడకుండ నాకొమ్ముతుదిం బదిలముచేసి, నీకును మునులకును నలజడి సెంద
కుండ, మున్నీట నిప్పాటం దమ్మిచూలి రేయి [4]వేగునంతకు మెలంగెద, నది
కారణంబుగా జలచరరూపంబుఁ గయికొంటి, మఱియునుం బ్రయోజనంబు
గలదు; నామహిమ పరబ్రహ్మం బని తెలియుము; నిన్ను ననుగ్రహింతు;" నని
సత్యవ్రతుండు నూడ హరి దిరోహితుండయ్యె; నయ్యవసరంబున. 706
ఆ. మత్స్యరూపి యైనమాధవునడుగులు - దలఁచికొనుచు, రాచతపసి యొక్క
దర్భశయ్యఁ దూర్పు దలగడగాఁ బండి-కాచి యుండె; నాఁటికాలమునకు.707

1. నీటఁదిరుగునది, చేప. 2. ఇటునటు కదలుచున్నదై. 3. సముద్రపుటలలకు,
4. తెల్లవాఱుకొఱకు.

వ. అంతఁ గల్పాంతంబు డాసిన. 708

క. ఉల్లసితమేఘపంక్తులు—జల్లించి, మహోగ్రవృష్టి జడిగొని, కురియన్
వెల్లి విరిసి జలరాసులు—[1]చెల్లెలికట్టలనుదాఁటి, సీమల ముంచెన్. 709

వ. తదనంతరంబు. 710

తే. మున్ను పోయినకల్పాంతమున నరేంద్ర—బ్రాహ్మ మనఁగ నైమిత్తిక ప్రళయవేళ
నింగిపై నిట్టతోలఁకుమున్నీటిలోనఁ—గూలె భూతాళి జగములకొలఁదు లెడలి.

వ. అంత నమ్మహారాత్రియందు. 712

మ. నెఱి నెల్లప్పుడు నిల్చి ప్రాణిచయముల్ నిర్మించి నిర్మించి, వీ
పిఱియన్ నిల్గుచు, నావులించుచు, నజుం డేస్సృష్టియున్ మాని, మే
నొఱఁగన్ ఱెప్పలు మూసి, [2]కేల్ దలగడై యుండంగ నిద్రించుచున్,
గుఱువెట్టం దొడఁగెం, గలల్ గనుచు నిర్ఘోషించుచున్ భూవరా! 713

ఆ. అలసి సొలసి నిదుర నందినపరమేష్ఠి—ముఖమునందు వెడలె మొదలిశ్రుతులు;
నపహరించె నొకహయగ్రీవుఁడనుదైత్య—భటుఁడు; దొంగఁదొడరఁబరులవశమె;

క. చదువులు దనచేఁబడినని—జదువుచుఁ బెన్బయల నుండ శంకించి, వడిం
జదువులముదుకఁడు గూరుకఁ—[3]జదువులతస్కరుఁడు సొచ్చె జలనిధికడుపున్.

వ. ఇట్లు వేదంబులు దొంగిలి, దొంగరక్కసుండు మున్నీట మునింగిన, వాని
జయింప వలసియు, బ్రాహ్మణులకల విత్తనంబులపొత్తరలు పెన్నీట నాని చెడ
కుండ నునుప వలసియు, నెల్లకార్యంబులకుం గావలి యగునాపురుషోత్తముం
డప్పనురేయిచొరుదలయందు. 716

క. [4]కుఱుగుఱులు వలుఁద మీసలు—చిఱుదోఁకయుఁ బసిఁడిమొడలుసిరిగలపొడలున్
నెఱిమొగము నొక్కకొమ్మును—మిఱుచూపులుఁగలిగి విభుఁడు మీనంబయ్యెన్.

వ, అట్లు లక్షయోజనాయతం బయినపాఠీనంబై, విశ్వంభరుండు జలధిసొచ్చి. 718

సీ. ఒకమాటు జలజంతుయూథంబుతోఁగూడు; నొకమాటు దరులకు నుఱికివచ్చు;
నొకమాటు మింటికి నుదరి యుల్లంఘించు; నొకమాటు లోపల నొదిఁగియుండు;
నొకమాటువారాశినొడలుముంపఁగఁజూచు; నొకమాటు బ్రహ్మాండమొఱయఁదలఁ
నొకమాటుఝషకోటినొడిసియాహారించు; నొకమాటుజలములనుమిసివైచు; [చు;

తే. గఱులు సారించు; మీసలు గడలుకొలుపుఁ;
బొడలు మెఱయించుఁ; గన్నులపొలప మార్చు;

---

1. సముద్రముయొక్కగట్టులను, 2. చెయి. 3. వేదముల దొంగ. 4. గొప్పబెక్కలు.
5. పట్టుకొని.

నోడలు జళిపించుc; దళతళ లోలయుమీన
వేషి పెన్నీట [1]నిగమగవేషి యగుచు. 719

వ. అంతకు మున్న సత్యవ్రతుండు మహార్ణవంబులు మహీవలయంబు ముంచునవ సరంబున భక్తపరాధీనుండగు హరిందలంచుచునుండ, నారాయణప్రేరితమై యొక్కనావ వచ్చినం గనుంగొని, 720

మ. చని సత్యవ్రతమేదినీపతుc డోజం బూని, మ్రాన్దీగవి
త్తనముల్ పెక్కులు నావపై నిడి, హరిధ్యానంబుతో దానిపై
మునిసంఘంబులు, దాను, నెక్కి, వెఱతో మున్నీటిపైc దేలుచుం
గనియెన్ ముందట భక్తలోకహృ[2]దలంకర్మీణమున్ మీనమున్. 721

వ. కని జలచరేంద్రునికొమ్మున నొక్క [3]పెనుcబాcపత్రాట నన్నావc గట్టి, సంతసించి దెందంబు నివురుకొని, తపస్వులుం దాను నారాచపెద్ద మీనాకారుండగు వేల్పుతేని నిట్లని పొగడం దొడంగె. 722

మ. "తమలోc బుట్టునవిద్య గప్పికొనుడుం, దన్మూలసంసారవి
భ్రము లై కొందఱు దేలుచుం, గలcగుచున్, [4]బల్వెంటలన్ దైవయో
గమునం దేపరమేశుc గొల్చి, ఘనులై, కైవల్యసంప్రాప్తులై,
ప్రమదంబందుదు; రట్టినీవు కరుణం బాలింపు మమ్మీశ్వరా! 723

ఉ. కన్నులు లేనివాcడు మఱి కానని వానికిc ద్రోవc జూపగాc
జన్న తెఱంగు, మూఢునకసన్మతి దా గురుc డౌట, సూర్యుcడే
కన్నులు గాcగ, భూతములc గాంచుచునుండురమేశ! మాకు ను
ద్యన్నయమూర్తివై, గురువవై, యలసద్గతిజాడc జూపవే; 724

క. ఇంగలముతోడిసంగతి - బంగారము వన్నెగలుగుభంగిని, ద్వత్సే
వాంగీకృతులయఘంబులు-భంగంబులc బొందు, ముక్తి ప్రాపించు హరీ! 725

క. హృదయేశ! నీప్రసన్నత-పదివేలవపాలిలేశభాగముకతనం
ద్రిదశేంద్రత్వము గల దcట-తుది నిను మెప్పింప నేది దొరకదు? శ్రీశా! 726

క. పెఱవాcడు గురుc డటంచును-గొఱగానిపదంబు సూపc గుజనుండగు, నీ
[5]నెఱత్రోవ నడవ నేర్చిన-నఱమఱ లేనట్టి పదము నందు; దయాబ్ధీ! 727

మ. చెలి వై, చుట్టమ వై, మనస్థితుడవై, చిన్మూర్తి వై, యాత్మ వై,
వల నై, కోర్కులపంట వై, విభుcడ వై, వర్తిల్లుని న్నొల్లకే

1. వేదములను వెదకునట్టివాcడు. 2. భూషణముగా నుండునది. 3. గొప్పపాము అనుత్రాటి చేత 4. అనేక మార్గములయందు. 5. మంచిమార్గము.

పలువెంటంబడి లోక మక్కట! వృథాబద్ధాశమై పోయెడిన్;
నిలువన్ నేర్చునె హేమరాశిఁ గనియున్ నిర్భాగ్యుఁ; [1]డంభశ్శయా! 728

ఆ. నీరరాశిలోన నిజకర్మబద్ధమై-యుచితనిద్రఁ బొంది యున్న లోక,
మేమహాత్ముచేత నెప్పటి మేల్కాంచు-నట్టినీవు గురుఁడ వధిప! మాకు. 729

క. ఆలింపుము విన్నప; మిదె-వేలుపుగమి తేనినిన్ను వేఁడికొనియెదన్
నాలోనిచిక్కు మానిచి-నీలోనికిఁ గొంచుఁ బొమ్ము; నిఖిలాధీశా!'' 730

వ. అని యిట్లు సత్యవ్రతుండు పలికిన సంతసించి, మత్స్యరూపంబున మహాసము
ద్రంబున విహరించుహరి పురాణపురుషుం డగుటం జేసి, సాంఖ్యయోగక్రియా
సహిత యగుపురాణసంహిత నుపదేశించె; నమ్మహారాజు మునిసమేతుం డై
భగవన్నిగదితం బై సనాతనం బగుబ్రహ్మస్వరూపంబు విని, కృతార్థుం డయ్యె;
నతం డిమ్మహాకల్పంబున వివస్వంతుం డనం బరఁగినసూర్యునకు శ్రాద్ధదేవుం డన
జన్మించి, శ్రీహరి కృపావశంబున నేడవమను వయ్యె; నంత నవ్విధంబున
బెనురేయి నిండునంతకు సంచరించి, జలచరాకారుం డగు నారాయణుండు
నన్నిశాంతసమయంబున. 731

మ. ఉఱ కంభోనిధి రోసి, వేదముల [2]కుయ్యున్ దైన్యముం జూచి, వే
గఱు లల్లార్చి, ముఖంబు సాఁచి, బలువీఁకం దోఁక సారించి, మే
న్మెఱయన్ దాడలు దీటి, [3]మీస లదరన్ మీనాకృతిన్ విష్ణుఁ డ
క్కఱటిం దాఁకి వధించె ముష్టిదళితగ్రావున్ హయగ్రీవునిన్. 732

వ. అంతం బ్రళయావసానసమయంబున. 733

సీ. ఎప్పుడు వేఁగునం చెదురుచూచుచు నుండు మునులడెందంబులు ముదము నొందఁ;
దెలివితోఁ బ్రక్కనిద్రించుభారతి లేచి యోరపయ్యెద జక్క నొత్తికొనఁగ;
మలిన మై వెనురేయి ప్రక్కన తేజంబు దొంటిచందంబునఁ దొంగలింపఁ;
బ్రాణులసంచితభాగధేయంబులు గన్నులకొలుకులఁ గానఁబడఁగ;
తే. నవయవంబులు గదలించి, యావులించి,
నిదురఁ దెప్పిఱి, మేల్కాంచి, [4]నీల్గి, మలఁగి,
యొడలు విఱుచుచుఁ, గనుఁగవ నుదురుకొనుచు,
ధాత గూర్చుండె సృష్టిసంధాత యగుచు. 734

వ. అయ్యవసరంబున. 735

ఆ. వాసవారిఁ జంపి, వానిచేఁబడియున్న-వేదకోటిచిక్కు విచ్చి, తెచ్చి
నిదుర మాని యున్న నీరజాసనునకు-నిచ్చెఁ గరుణతోడ నీశ్వరుండు. 736

1. నీటశయనించువాఁడా! 2. మొఱను. 3. మీసములు 4. శరీరమునుజాచి.

క. జలరుహనాభునికొఱకై-జలతర్పణ మాచరించి, సత్యవ్రతుఁ డా
జలధి బ్రదికి మను వయ్యెను-జలజాక్షునిఁ గొలువ కేమి సంపద గలదే? 737

ఆ. జనవిభుండు తపసి సత్యవ్రతుండును-మత్స్యరూపి యైన మాధవుండు
సంచరించినట్టి సదమలాఖ్యానంబు-వినినవాఁడు బంధవిరహితుండు. 738

క. హరిజలచరావతారము-నరువడిఁ బ్రతిదినముఁ జదువఁ బరమపదంబున్
నరుఁ డొందు; వానికోర్కులు-ధరణీశ్వర! సిద్ధిఁ బొందుఁ; దథ్యము సుమ్మీ!

మ. ప్రళయాంభోనిధిలోన [1]మేనమఱచి, నిద్రం జెందువాణీశుమో
ముల వేదంబులు గొన్నదైత్యుని మృతిం బొందించి, సత్యవ్రతుం
డలరన్ బ్రహ్మము మాటలం దెలిపి, సర్వాధారుఁ డై మీన మై,
జలధిం గ్రుంకుచుఁ దేలుచున్ మెలఁగు [2]రాజన్మూర్తికిన్ మ్రొక్కెదన్." 740

వ. అని చెప్పి 741

క. రాజేంద్ర! దైత్యదానవ - రాజమహాగహనదహన! రాజస్తుత్యా!
రాజావతంస! మానిత-రాజధరార్చిత! గుణాఢ్య! రాఘవరామా! 742

మాలిని. దివిజరిపువిదారీ! దేవలోకోపకారీ!
భువనభరనివారీ! పుణ్యరాక్షానుసారీ!
ప్రవిమలశుభమూర్తీ! బంధుపోషప్రవర్తీ!
ధవళబహుళకీర్తీ! ధర్మనిత్యానువర్తీ! 743

## గద్యము

ఇది శ్రీ పరమేశ్వరకరుణాకలిత కవితావిచిత్ర, కేసనమంత్రిపుత్ర, సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబయిన శ్రీ మహాభాగవతపురాణంబను మహాప్రబంధంబునందు స్వాయంభువస్వారోచి షోత్తమతామసమనువులచరిత్రంబును, గరిమకరంబులయుద్ధంబును, గజేంద్రరక్షణంబును, రైవత చాక్షుషమనువులవర్తనంబును, సముద్రమథనంబును, కూర్మావతారంబును, గరళభక్షణంబును, నమృ తాదిసంభవంబును, దేవాసురకలహంబును, హరి కపటకామినీ రూపంబున నసురుల వంచించి దేవతల కమృతంబు వోయుటయుఁ, రాక్షసవధంబును, హరిహరసల్లాపంబును, హరికపటకామినీరూపవిభ్రమ ణంబును, వైవస్వత సూర్యసావర్ణి దక్షసావర్ణి భద్రసావర్ణి దేవసావర్ణీంద్రసావర్ణి మనువుల వృత్తాం తంబును, బలియుద్ధయాత్రయును, స్వర్గవర్ణనంబును, దేవపలాయనంబును, వామనావతారంబును దివిక్రమవిస్ఫురణంబును, రాక్షసుల సుతలగమనంబును, సత్యవ్రతోపాఖ్యానంబును మీనావతారం బును ననుకథలుఁ గలయష్టమస్కంధము.



1. మేను+మఱచి. 2. ప్రకాశించుచున్న రూపముగలవాఁడు.

శ్రీ ర స్తు

శ్రీకృష్ణాయ నమః

# శ్రీమదాంధ్రభాగవతము

## న వ మ స్కం ధ ము



శ్రీరాజిత! మునిపూజిత! - వారిధిగర్వాతిరేక వారణబాణా!
సూరిత్రాణ! మహోజ్జ్వల - సార యశస్సాంద్ర! రామచంద్ర నరేంద్రా! 1

వ. మహనీయగుణగరిష్ఠులగు సమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండయిన సూతుం డిట్లనియె; నట్లు ప్రాయోపవిష్టుం డయిన పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని. 2

సీ. మనువుల[1] నడవళ్లు, మర్యాదలును వింటి; మన్వంతరంబున మాధవుండు
దిరిగినజాడలు దెలిసె; సత్యవ్రతుం డను రాజు ద్రవిళదేశాధిపుండు
పోయినకల్పాంతమున విష్ణు సేవించి, విజ్ఞానమునుబొంది, [2]వెలుఁగుతేని
కతఁడు వైవస్వతుండై పుట్టి, మనువయ్యె; నతనికి నిక్ష్వాకుఁ డాది గాఁగఁ
తే. బదుగు రొగుకులు గల రండ్రు; పరఁగ వారి-వంశమేరీతి వర్తించె? వారిలోనఁ
జనినవారిని, జనువారిఁ, జనెడువారిఁ - జెప్పవే వ్యాసనందన! చిత్తగించి. 3

క. చెవులార నేఁడు వినియెద; - రవివంశమునందుఁ గలుగురాజులకీర్తుల్
వివరింపు వరుసతోడను;-భువిఁ బుణ్యులకీర్తి వినినఁ బుణ్యము గాదే? 4

వ. అనినం బరాశరమునిమనుమం డిట్లనియె. 5

### వైవస్వతమనువంశకథనము

ఆ. వినుము; మనువుకులము వేయినూఱేండ్లను - బరఁగ విస్తరించి పలుకరాదు;
నాకుఁ దోఁచినంత నరనాథ! వేగంబ - యెఱుకపడఁగఁ బ్రీతి నేర్పరింతు. 6

క. ఎక్కువతక్కువ పోడవుల - కెక్కటి మొదలయినపురుషుఁ డింతయుఁ జెడఁ, దా
నొక్కఁడుఁ గల్పాంతంబున - నక్కజమై నిల్చె విశ్వమతఁడై యుంటన్. 7

1. ప్రవర్తనములు, 2. సూర్యుఁడు, 3. అవతారములను.

సీ. భూమీశ! యమ్మహాపురుషునినాభిమధ్యమున బంగారుఁ [1]గెందమ్మి మొలచె;
నాతమ్మిపూవులో నటమీఁదఁ దనయంత నాలుగుమోముల నలువ వుట్టె;
నా బ్రహ్మమనమున నట మరీచి జనించెఁ; గశ్యపుం డతనికిఁ గలిగె; నంత
నాకశ్యపునికి దక్షాత్మజ యదితికిఁ గొమరుఁడై [2]చీఁకటిగొంగ వొడమె;
తే. జలజబంధునిపెండ్లాము సంజ్ఞయందు-శ్రాద్ధదేవుండు మనువు సంజాతుఁ డయ్యె;
మనువునకు శ్రద్ధయనియెడి మగువయందుఁ-బదురుగొడుకులుగలిగిరిభద్రయశులు.

వ. వార లిక్ష్వాకుండును, నృగుండును, శర్యాతియు, దిష్టుండును, ధృష్టుండును, కరూశకుండును, నరిష్యంతుండును, బృషధ్రుండును, నభగుండును, గవియు, నన నెగడి; రట మున్ను మనువు, గొడుకులులేనివాఁడై మిత్రావరుణుల నుద్దేశించి. 9

సీ. మనువు బిడ్డలు వుట్ట మఖమాచరించుచో, నతనిభార్యయు హోతనాశ్రయించి,
"కూఁతురువుట్ట, నాకుం జేయు" మనిపల్కి, వరభక్తితోఁ బయోవ్రతముఁ సలిపె;
నాసతి సెప్పిన ట్లధ్వర్యుఁడును, హోత; నగుఁగాక! వేలువు" మనుచుఁ బలికె;
హవి నందుకొని "కూఁతురయ్యెడు"మని వషట్కారంబు సెప్పుచుఁ గదిసివేల్వ,
తే. హోత పెడచేత నిల యనునువిద వుట్టె;-దానిఁ బొడగని మనువుసంతాపమంది,
"కొడుకు మేల్ గాక, యేటికిఁ గూఁతు? రకట!-చెప్పవే" యనిపోయెవసిష్ఠుకడకు.

వ. చని యిట్లనియె. 11

క. "అయ్యా! కొడుకులకొఱకై-యియ్యాగము నీయనుజ్ఞ నేఁ జేయంగా
నియ్యాఁడు దేల పుట్టెను?-*మీయంతటివారి కొందుమేరయుఁ గలదే?" 12

వ. అదియునుం గాక మీరు బ్రహ్మవాదులరు; మంత్రవాదులరుఁ; బాపంబు లంద కుండం జేయించువా; రిది యేమి?" యనవుడు మాతాత వసిష్ఠుండు హోతృ వ్యభిచారం బెఱింగి, మనువున కి ట్లనియె. 13

తే. "అధిప! సంకల్పవైషమ్య మగుటఁ జేసి-హోతకల్లతనంబున నువిద గలిగె;
నైనఁ గలిగింతు నీకుఁ బ్రియాత్మజునిని;-నీవు మెచ్చంగఁ జూడు నానేర్పుబలిమి!"

వ. అని పలికి భగవంతుం డగు వసిష్ఠుండు, గీర్తితత్పరుండు గావున, మనువుకూఁతు మగతనంబుకొఱకు, నేకచిత్తంబున నాదిపురుషుం డగుహరిం బొగడిన, నప్పర మేశ్వరుండు మెచ్చి, తపసికోరినవరం బిచ్చె; నది నిమిత్తంబుగా నిలాకన్యక సుద్యుమ్నుం డను కుమారుం డయి, రాజ్యంబు సేయుచు. 15

సీ. ప్రొద్దు వో కొకనాఁడుపోయి, [3]పేరడవులవెంట వేఁటాడుచు, వేడ్కతోడఁ
గొందఱుమంత్రులు గూడ రా, సైంధవం బయినగుఱ్ఱము నెక్కి, యంద మైన

1. ఎఱ్ఱనికమలము, 2. సూర్యుఁడు, * ఇందలి ప్రాసము చింత్యము. 3. ఘోరారణ్యము.

బలువిల్లు గ్రొవ్వాఁడిబాణంబులును దాల్చి, పెనుమెకంబులవెంట బిఱుసుతోడ నుత్తరదిశను మహోగ్రుఁడై చని చని, మేరుపుపాంతఁ గుమారవనముఁ

తే. జేరె; నందు మహేశుండు శివయు నెపుడు
రతి సలుపుచుందు; రందుఁ జొరంగఁ బోవ
నాఁడు దయ్యెను రాజు; రాజానుచరులుఁ
బడఁతులైరి; తదశ్వంబు బడబ యయ్యె. 16

వ. ఇట్లు మగతనంబు సెడి, మగువలై, యొండొరులమొగంబులు సూచి, మఱుఁగు చుండి; రనిన విని శుకునకు రా జిట్లనియె. 17

ఆ. "రాజుఁ దోడివారు రమణు లై రంటివి;-కాంత లగుట యేమికారణమున?
నిట్టిదేశ మెఱుఁగ మెన్నఁడు; నా కథల్-వేడ్కదీర నాకు విస్తరింపు. 18

వ. అదియునుం గాక. 19

ఆ. మగువతనము మాని, మగవాఁడు గావచ్చుఁ-గాక; పేరుఁ బెంపు గాసి గాఁగ,
మగతనంబు మాని మగువ గావచ్చునె-మానవంతుఁడైన మానవునకు?" 20

వ. అని యడిగిన నర్జునపౌత్రునకు వ్యాసపుత్త్రుం డి ట్లనియె. 21

సీ. "పురవైరి యొకనాఁడు పొడసూపు వేడుకఁ దద్దయు దిక్కులతమము లెల్లఁ
దమతమవెలుఁగులు దగిలి, గొందులు సొరఁ, గొందఱు మానులు గోరి రాఁగఁ,
బ్రాణేశుతోడఁ దలప్పై భాసిల్లునంబిక వారలఁ జూచి, మై వలువ లేమి
సిగ్గు పుట్టిన లేచి, చీరఁ గట్టినఁ జూచి, దేవియు దేవుండు దీర్ఘలీల

తే. నొంటి దమలోనఁ గ్రీడించు చున్నవారు;
మనకు సమయంబు గా దని, మరలి మునులు,
నరుఁడు నారాయణుండు ననారతంబు,
మెలఁగు చోటికి నడచిరి మేదినీశ! 22

వ. అది కారణంబుగా భగవంతుం డగు శివుండు దనప్రియురాలివేడుకలకొఱకు ని ట్లని వక్కాణించె. 23

క. "ఈనెల వెవ్వఁడు సొచ్చిన,-మానిని యగు;" ననినతొంటిమాటకతమునన్
మానవుఁడు మగువపోఁడిమి-మానక, పేరడవులందు మఱియుం దిరిగెన్. 24

వ. ఇట్లు చెలికత్తియలమొత్తంబులుం, దానును, నారాచపూఁబోఁడి వాఁడిచూపుల నాఁడుపోఁడిమి నెఱపుచు, దైవయోగంబున సోమసుతుండును, భగవంతుండును నగు బుధునియాశ్రమంబు సేరి, మెలఁగుచున్నయెడ. 25

ఆ. రాజుకొడుకుఁ జూచె రాజీవదళనేత్ర;–రాజవదనఁ జూచె రాజుపట్టి;
దొంగకాముఁ డంత దొండడిఁ[1]జిగురాకు, వాలు వెఱికి, యుఱికి, వారిమొత్తె.

వ. ఇట్లలరువిల్తుని నెఱబిరుదుచిగురుటడిదంబు మొనకు నోహటించి, వార లిరువు
రుం బైపడి, వేడుకలకుం జొచ్చిన వారలకుం బురూరవుం డను కుమారుండు
పుట్టె; నివ్విధంబున. 27

ఆ. మనుసుతుండు ఘనుఁడు మగనాలితనమునఁ, గొడుకుఁ గాంచి, విసివి, కుందికుంది,
చింతఁ బొంది, గురు వసిష్ఠుని భావించె;–నతనితలఁపుతోన యతఁడు వచ్చె. 28

వ. వచ్చి సుద్యుమ్నుండు మగవాఁ డగుకొఱకు, నమ్మునిపుంగవుండు శంకరునారా
ధింప, నీశ్వరుండును దపసిప్రయాసంబునకు సంతసిల్లి, యి ట్లనియె. 29

మ. "తనమున్నాడినమాటయుక్ నిజముగాఁ, దన్మౌనికిం బ్రీతిగా,
[3]మనుజుండుక్ నెల వో నెలం బురుషుఁడై, మాసాంతరం బైనఁ గా
మినియై, యీగతి వీఁడుపా టమర భూమిం దాన రక్షించుఁ బో;"
మ్మనినక్ వచ్చె వసిష్ఠుఁ; డామనుసుతుం డారీతి రాజ్యస్థుఁడై. 30

ఆ. మగువ యగుచు, మరల మగవాఁడు నగుచును–[4]భూతధాత్రి యంత నాతఁడేలెఁ;
బ్రజలు సంతసింప బాహాబలముతోడ, గురునికరుణఁజేసి కువలయేశ! 31

వ. అతనికి నుత్కలుండును, గయుండును, విమలుండును, నను కొడుకులు మువ్వురు
గలిగి, ధర్మపరులై యుత్తరాపథంబునకు రాజులయిరి; సుద్యుమ్నుండు ముదు
సలియై, ప్రతిష్ఠానపురంబు విడిచి, పురూరవునకు భూమి యిచ్చి, వనంబునకుం
జనియె; నివ్విధంబున. 32

సీ. కొడుకు సుద్యుమ్నుండు ఘోరాటవుల కేఁగ, వందుచు మనువు నై వస్వతుండు
దనకు బిడ్డలు గల్గఁ దప మాచరించెను, హరిఁ గూర్చి నూఱేండ్లు యమునలోన;
హరి యంత నిష్ఫలకుఁ డాదిగాఁ బదుగురు పుత్త్రుల నిచ్చెను; బొసఁగ వారి
యందుఁ బృషద్ధ్రాఖ్యుఁ డగువాఁడు,గురునాజ్ఞ విమలధర్మంబులు వెలయఁబూని,
తే. పసులకదుపులఁ గాచుచు, బలుమొగిల్లు
వచ్చి నడురేయి జోరున వానగురియ,
మందవిడియించి, చుట్టు నేమఱక యుండె
నడవిమెకములు సొరకుండ నరసికొనుచు. 33

వ. అంత. 34

---

1. మన్మథుని బాణములలో నొకటి: ఖడ్గము. 2. సిద్ధపడి. 3. మనుజేంద్రుండు నెలక్ నెలక్-పాఠాంతరము. 4. భూమి, ప్రాణులను ధరించినది.

క. ప్రబ్బికొనిన పెంజీఁకటి - నిబ్బరముగ నడికి నడికి, నింగికి వడితోఁ
గొబ్బున నెగసి, తటాలున-బెబ్బులి మందావుఁ బట్టెఁ బెలుకుఱి యఱవన్. 35

క. ఉల్లములు గలఁగి మొదవుల - వెల్లువ లన్నియును లేచి, విచ్చలవిడితోఁ
జెల్లాచెదరై, పాఱెను;-బెల్లుగ నంబే యటంచు బెబ్బులిగాలిన్. 36

వ. అయ్యవసరంబున. 37

శా. ఆపెంజీఁకటి మ్రోల గాన కడిదం బంకించి, శార్దూల మం
చాపుల్లావుశిరంబుఁ ద్రుంచి, తెగదో యంచుం, బులిన్ వెండియున్
వాపోవం దెగ వ్రేసి, భూవరుఁడు ద్రోవన్ ఖడ్గరక్తంబుచేఁ
బై పై గీయుచుఁ, జేరి చూచెఁ దల ద్రెవ్వంబడ్డయద్ధేనువున్. 38

వ. చూచి, దుఃఖితుండై యున్న పృషధ్రునిం గని, కులగురుం డగు వసిష్ఠుండు కోపించి, "నీవు రాజత్వంబునకుఁ బాసి, యీయపరాధంబున శూద్రుండవు గ"మ్మని శపియించె; నతండును గృతాంజలియై, తన కులాచార్యునివలన మరలం గైకోలు వడసి, యతనియనుమతంబున. 39

సీ. అఖిలాత్ముఁడగు చున్నహరియందుఁ, బరునందు, భక్తితోఁ జాలఁ దత్పరత మెఱసి,
యూర్ధ్వరేతస్కుఁడై యున్నప్రాణులకెల్ల నాప్తుఁడై, సర్వేంద్రియములు గెల్చి,
సంగంబునకుఁ బాసి, శాంతుండు [1]నపరిగ్రహుండు నై, కోరక యుండి, తనకు
వచ్చినయదియ జీవనము గావించుచుఁ, దనుఁ దాన నిలుపుచు, ధన్యబుద్ధి
తే. జడుని తెఱఁగున, నంధుని చందమునను,
జెవిటిభంగిని, మహి నెల్లఁ జెల్లఁ దిరిగి,
యడవులకు నేఁగి, కార్చిచ్చునందుఁ జొచ్చి,
చిక్కి నియతుఁడై బ్రహ్మంబుఁ జెందె నతఁడు. 40

క. కవి యనుకడపటికొమరుఁడు-భవనము రాజ్యంబు విడిచి, బంధులతో నేఁ
గి, వనమునఁ బరమపురుషునిఁ-బ్రవిమలమతిఁ దలఁచి తలఁచి, పరముంబొందెన్.

వ. మఱియుఁ గరూశుం డను మానవునివలనం, గొందఱు కారూశులు క్షత్త్రియులు గలిగి, ధర్మంబుతోడిప్రియంబున బ్రహ్మణ్యులై, యుత్తరాపథంబునకు రక్షకు లైరి; ధృష్టునివలనధార్ష్టం బనువంశంబు గలిగి, భూతలంబున [2]బ్రహ్మభూయంబు నొంది, నెగడె; నృగునివంశంబున సుమతి పుట్టె; నతనికి భూతజ్యోతి పుట్టె, నతనికి వసువు జనించె; వసువునకుం బ్రతీకుండు గలిగెఁ; బ్రతీకునికి నోఘవంతుండు జనించె; నతని కూఁతు నోఘవతి యను కన్యకను, సుదర్శనుండు

1. ఇతరులవలన నేమియుఁ దీసికొననివాఁడు. 2. మోక్షము.

వివాహం బయ్యె; నరిష్యంతుం డనుపుత్త్రునికి జిత్రసేనుం, డాపిభునకు దక్షుం డాపుణ్యునకు మీఢ్వాంసుం, డాసుజనునికి శర్చుం, డమ్మహాత్మునికి నింద్రసేనుం, డా రాజునకు వీతిహోత్రుం, డాసుమతికి సత్యశ్రవుం డాఘనునికి నురుశ్రవుం; డావీరునకు దేవదత్తుం, డాపండితునకు నగ్నివేశుండును సుతులయి జనియించి; రయ్యగ్నివేశుండు గానీనుం డన నెగడి, జాతకర్ణుం డను మహర్షి యై వెలసె; నతనివలన నాగ్నివేశ్యాయనం బను బ్రహ్మకులంబు గలిగె; నివ్విధంబున. 42

క. తెలుపఁబడె నరిష్యంతుని - కుల మెల్లను నీకు; దిష్టకులములం దెలియం
దెలిపెద రాజేంద్రోత్తమ! - తెలియును సర్వంబు నీకుఁ దేటపడంగన్. 43

వ. దిష్టునికొడుకు నాభాగుం డనువాఁడు కర్మవశంబున వైశ్యత్వంబునొందె; నా నాభాగునికి హలంధనుండు కలిగె; నతనికి వత్సప్రీతియు; వత్సప్రీతికిఁ బ్రాంశువు, నతనికిఁ బ్రమతియుఁ, బ్రమతికి ఖమిత్రుండు, ఖమిత్రునికిఁ జాక్షుషుండు, నతనికి వివింశతియు, వివింశతికి రంభుండు, రంభునికి ధార్మికుం డైన ఖనినేత్రుండు, నతనికిఁ గరంధనుండుఁ, గరంధనున కవిక్షిత్తు, నాయవిక్షిత్తునకు మరుత్తుండు జనియించి; రా మరుత్తుండు చక్రవర్తి యయ్యె; నతనిచరిత్రంబు వినుము. 44

సీ. "అంగిరస్సుతుఁడు మహాయోగి సంవర్తుఁ, డతనియాగమునకు యాజకుండు,
దిరిగి యుండెడివాఁడు మరుదాఖ్యగణము; లొప్పారువిశ్వేదేవు లచటిసభ్యు;
లధికదక్షిణల బ్రాహ్మణకోటిఁ దనిపెను; సోమపానంబున సురవరుండు
మది నుబ్బి, బంగారుమయము గావించెను యాగవస్తువు లెల్ల; నధికనియతి
తే. నామరుత్తుఁడు సేసినయట్టిభంగి, ధీరభావంబుఁ [1]జాగంబుఁ దెంపు గలిగి,
మఖము సేసినవారిని, మఱియు నెఱుఁగ - మెల్లలోకములందు; నరేంద్రముఖ్య! 45

వ. ఆమరుత్తునకు దముండును, దమునకు రాజవర్ధనుండును, రాజవర్ధనునకు సుధృతియు, సుధృతికి సౌధృతేయుండును, సౌధృతేయునకుఁ గేవలుండును, కేవలునకు బంధుమంతుండును, నతనికి వేదవంతుండును, వేదవంతునికి బంధుండును, బంధునకుఁ దృణబిందుండును సంభవించి రంత. 46

క. అచ్చరకన్య యలంబుస - గ్రచ్చఱఁ దృణబిందుఁ జూచి, కామించి, తుదిం
బచ్చవిలుకానియమ్ముల - [2]ముచ్చిచ్చున వెచ్చి, పొందె మోహాతుర యై. 47

వ. ఆ దంపతులకు నిలబిల యను కూఁతురు జన్మించె; నాకొమ్మను విశ్రవసుండు వొందిన, నైలబిలుం డనం గుబేరుండు పుట్టె; మఱియు నా తృణబిందునకు విశాలుండును, శూన్యబంధుండును, ధూమ్రకేతుండును ననువారు ముగ్వురు గొడుకులు గలిగి; రందు విశాలుండు వంశవర్ధనుండై, వైశాలి యను నగ

1. త్యాగము. 2. అగ్ని.

రంబు నిర్మించె; నారాజునకు హేమచంద్రుం, డానరేంద్రునకు ధూమ్రాక్షుం, డాపుడమిఱేనికి సహదేవుం, డా బలిష్ఠునకుఁ గృశాశ్వుం, డాతనికి సోమదత్తుండు జనించె; నతండు. 48

ఆ. అమరవిభుఁడు మెచ్చ, నశ్వమేధము సేసి-భూరిపుణ్యగతికిఁ బోయె నెలమి;
సోమదత్తుకొడుకు సుమతికి జనమేజ-యుండనంగఁ గొమరుఁ డుప్పతిల్లె. 49

వ. వీరలు వైశాలు రనంబరఁగి, తృణబిందునికీర్తి వహించి, రాజ్యంబుసేసిరి మఱియును. 50

సీ. శర్యాతి యనురాజు జనియించె బ్రహ్మపరుండైన మనువుకు రూఢితోడ;
నతఁ డంగిరసనిసత్త్రమందు రెండవనాఁటి విహితకర్మము లెల్ల వెలయఁ జెప్పె;
నతనికూఁతురు సుకన్యక యను వనజాక్షి దనతండ్రితోఁ దపోవనికి నరిగి,
చ్యవనాశ్రమముఁ జేరి, సఖులును దానును ఫలపుష్పములు గోయఁ బాఱి, తిరిగి

ఆ. యొక్కపుట్టలోన నొప్పారుజ్యోతుల, రెంటిఁ గాంచి, [1]వాఁడిముంటఁ బొడిచెఁ;
గన్య ముగుద మఱచి, [2]ఖద్యోతయుగ మంచు, దైవవశముకతనఁ దమకి యగుచు.

క. జ్యోతుల ముంటం బొడిచిన, వాతుల నెత్తురులు గురిసె; వసుధేశభట
వ్రాతములకెల్ల నచ్చట, నాతఱి మలమూత్రబంధమయ్యె నరేంద్రా! 52

వ. వారలం జూచి, రాజర్షి యగు శర్యాతి విస్మితుండై, "మీర లియ్యాశ్రమ దూషణంబు సేయ నోపుదు; రది కారణంబుగా మీ కీ నిరోధంబు సిద్ధించె" నని పలుకు నవసరంబునఁ దండ్రికి సుకన్యక యిట్లనియె. 53

తే. "అయ్య! యీపుట్టచేరువ నాడి యాడి-యిందులో రెండుజ్యోతుల నేను గాంచి,
కంటకంబునఁ బొడువ రక్తంబు గురిసె;-నేవిధంబునఁ గురిసెనో? యెఱుఁగుమీవు."

వ. అనిన శర్యాతి భీతుండై కూఁతుం దోడ్కొని, వల్మీకంబుకడకుం జని, యందుఁ దపంబు సేయుచున్నచ్యవనునిం గని, తననేర్పున నతనివలనఁ బ్రసన్నత వడసి తపసిచిత్తంబు నెఱింగి, తనపుత్త్రిక నిచ్చి, యెట్టకేలకుఁ బ్రదికినవాఁడై, మునీశ్వరుని వీడ్కొని, పురంబునకు జనియె; నంత. 55

ఆ. పరమకోపుఁ డయినభార్గవుఁ బతిఁ జేరి, మిగులఁ బనులయెడల మెచ్చఁ దిరిగి,
యతనిపర్ణశాల నాసుకన్యక యను, మగువ గొన్నియేండ్లు [3]మనువు మనియె.

వ. అంత నొక్కనాఁడయ్యాశ్రమంబునకు వేల్పువెజ్జులైనయాశ్వినులిద్దఱు వచ్చిన వారలం బూజించి, తనముదిమి సూపి, చ్యవనుండిట్లనియె; "మీకు మున్ను యాగభాగంబుల లేని సోమపానంబు నేడు గల్పించి యిచ్చెద; సోమపాన

1. పదునుగల ముల్లుచేత. 2. మిణుఁగురుపురుగులజంట. 3. కాఁపురము.

సమయంబునఁ బానపాత్రంబు మీకు నందిచ్చెద; నాముదిమి మానుపుం''
డని యిట్లనియె. 57

క. ''[1]నవకంబగు ప్రాయంబున, జవరాండ్రఁ గరంచుమేనిచక్కఁదనంబున్
శివతరముగఁ గృప సేయుఁడు; దివిజాధిపవైద్యులార! దీవింతు నిమున్.''

వ. అనిన నశ్విదేవతలు సంతోషించి, ''సిద్ధనిర్మితంబయిన యీ మడుఁగున
మునుఁగు'' మని పలికి. 59

సీ. ముసలితాపసుఁబట్టి, మొగినెత్తుకొనిపోయి, ముగురు నామడుఁగునమునిఁగి, లేచి,
వనితాజనము నెల్ల వలపించువారలై, సుందరమూర్తులై, సుభగులగుచుఁ,
గమలమాలికలతోఁ గనకకుండలములతో, మంచిచీరలతోడఁ, దుల్యు
లై, సూర్యతేజస్కులై యున్నవారల ముప్వురఁ బొడగాంచి, ముగుద బాల
తే. యింటఁ బెనిమిటి పీఁ డని యెఱుఁగ లేక,
గరిత గావున నిజనాథుఁ గాన గోరి
''[2]సుభగమతులార! నానాథుఁజూపుఁ''డనుచు,
నశ్విదేవతల కపుడయ్యబల మ్రొక్కె. 60

వ. వార లా పతివ్రతనిజమరితనంబునకు మెచ్చి, వయోరూపసంపన్నుండయిన
చ్యవనుం జూపి, దంపతుల వీడ్కొని, విమానారూఢులై వేలుపులప్రోలికిం జని;
రంత. 61

సీ. యాగంబు సేయంగ నర్థించి శర్యాతి, చ్యవనమునీంద్రు నాశ్రమముకడకుఁ
గూఁతు నల్లునిఁ దోడుకొని పోవువేడుక వచ్చి, పుత్రికకుఁ బార్శ్వంబునందు
సూర్యతేజంబున సొంపారు నరుఁ గని, ''వీఁ డెవ్వఁడో? దీనివిభుఁడు గాఁడు;
చెల్లరే!''యని పుత్రి సేసినప్రియములు మ్రొక్కులు నొల్లక, మోము వాంచి,
తే. మాఱుమాటాడ దీవింప మనసురోసి,
''చ్యవనుఁ డధికుండు; మునిజనసత్తముండు;
భువనసన్నుతుఁ; డతఁ డెందుఁబోయె? నాతఁ,
డెట్లు వంచింపబడియె? వీఁడెవ్వఁ? డబల! 62

మ. తగవే? ధర్మమె? శీలమే? కులజవై, దర్పించి మోదింప? నా
జగదారాధ్యుని, బుణ్యశీలుఁ, దపసిన్, సాధ్వీమనస్సమ్మతున్,
మగనిన్, మాని, భుజంగుఁ బొందఁ దగునే? మానంబు వాటింపఁగాఁ
దగదే? దుర్గతిఁ ద్రోచితే కఠినవై తండ్రిం బతిం గూఁతురా! 63

---

1. నూతనము, క్రొత్తది. 2. ఐశ్వర్యవంతులు, అందముగలవారు.

ఆ. పద్మనయన! మగఁడు ప్రాయంపువాఁ డైనఁ-గాఁపువెట్టి, కొంతఁ గావ నేర్చుఁ
గడఁగి ముసలితపసి గావంగ నేర్చునే?-యువతి ముదుకఁ గూర్ప నొప్పదెందు"

వ. అని పలికిన నప్పరమపతివ్రతాలలామంబు చిఱునగవు చెక్కుటద్దంబులఁ జిడి
ముడిపడఁ దండ్రి కిట్లనియె. 65

క. "నీ*యల్లుఁ డితఁడు భార్గవుఁ;-డయ్యా! జారుండు గాఁడు; హర్షముతోడన్
నెయ్యంబు నిల్పు"; మంచును-దొయ్యలి సర్వంబు దండ్రితో వినిపించెన్.

వ. అంత శర్యాతియు నప్రమత్తుం డై, కూఁతుం గౌఁగిలించుకొని, గారవంబున
"నయిదువవు గమ్మ"ని దీవించె; నంత భార్యాసహితుం డై చ్యవనుండు చని,
తనమామకు యాగంబు సేయించి, యొక్కపాత్రంబున సోమభాగంబుఁ బట్టి,
నిజతపోబలంబున నశ్విదేవతల కిచ్చినం జూచి. 67

క. కోపముతోడను వాసవుఁ-డేపున ముని పైని వజ్ర మెత్తిన, మరలం
దాపసుఁడు వజ్రిభుజమున, నా[1]పవి నిలిపెన్ జగంబు - లాశ్చర్యపడన్. 68

వ. ఇవ్విధంబున నశ్విదేవత లిద్దఱు వైద్యులై, సోమభాగంబు లేనివారయ్యుఁ,
జ్యవనుసామర్థ్యంబునఁ [2]బ్రాప్తభాగు లయి చనిరి; శర్యాతికి నుత్తానబర్హియు,
నానర్తుండును, భూరిషేణుండు నను మువ్వురు కొడుకులు గలిగి; రందు. 69

సీ. ఆనర్తునకు రైవతాహ్వయుం డుదయించె; నతఁడు కుశస్థలి యను పురంబు
నీరధిలోపల నిర్మించి, పెంపుతో నానర్తముఖవిషయంబు లేలెఁ;
గనియెఁ గకుద్మిముఖ్యం బైననందనశతము; రైవతుఁడు విశాలయశుఁడు;
దనకూఁతు రేవతి ధాత ముందటఁ బెట్టి, తగు వరు నడిగెడితలఁపుతోడఁ

తే. గన్యఁ దోడ్కొని, బ్రహ్మలోకమున కేఁగి-యచట గంధర్వకిన్నరు లజునిమ్రోల
నాటపాటలుసలుపఁగ,నవసరంబు-గాక నిలుచుండె, నతఁ డొక్కక్షణముతడవు.

వ. అంత నవసరం బయిన నజునికి నమస్కరించి, రైవతుండు రేవతిం జూపి
యిట్లనియె. 71

"ఆ. చాల ముద్దరాలు, జవరాలు గోమరాలు-నీసుభాత్మురాలి కెవ్వఁ డొకొ
మగఁడు? సెప్పు" మనిన మడిఁ జూచి పకపక-నవ్వి భూమిపతికి నలువ వలికె.

సీ. "మనుజేశ! దీనికై మదిలోనఁ దలఁచినవార లెల్లను గాలవశతఁ జనిరి;
వారలబిడ్డల, వారలమనుమల, వారలగోత్రంబువారి నైన
వినము మేదినిమీఁద; వినుము నీవచ్చినయీలోన నిరువదియేడుమాఱు
లొండొండ నాలుగుయుగములుఁ జనియె; నీవటు గాన ధరణికి నరుగు; మిపుడు,

* ప్రాసము చింత్యము. 1. వజ్రాయుధము. 2. పొందఁబడిన భాగములు గలవారు.

తే. దేవదేవుండు హరి, బలదేవుఁ డనఁగ-భూమిభారంబు మాన్పంగఁ బుట్టినాఁడు;
సకలభూతాత్మకుఁడునిజాంశంబుతోడ-యువతిమణి నిమ్ము జనమణివున్నతాత్మ!''

వ. అని యానతిచ్చిన బ్రహ్మకు నమస్కరించి, భూలోకంబునకుఁ జనుదెంచి, సోదర స్వజనహీనం బగు తననగరంబున కారాజు వచ్చి, బలభద్రుం గాంచి, రేవతీకన్య నతని కిచ్చి, నారాయణాశ్రమంబగు బదరికావనంబునకు నియమంబునఁ దపంబుసేయం జనియె. 74

క. నభగుఁ డను మనుజపతికిని,-శుభమతి నాభాగుఁ డనఁగ సుతుఁ డుదయించెం;
బ్రభు లై కవి యనుతలఁపున,-విభజించిరి భ్రాత లతని విత్తము, నధిపా! 75

వ. అంత నాభాగుండును బ్రహ్మచారి యై, తనతోడంబుట్టువులను ధనంబులపాలడిగిన, వారలు ''దండ్రి చెప్పినక్రమంబున నిచ్చెద'' మనిన నాభాగుండు తండ్రి యగు నభగు కడకుంజని, ''విభాగంబుసేయు'' మని పలికిన, నతం ''డిందు నంగిరసులు మేధగలవార లయ్యును, సత్త్రయాగంబు సేయుచు, నాఱవదినంబున నర్వకర్మంబులు దోఁపక, మూఢులయ్యెదరు; వారలకు నీవు వైశ్వదేవసూక్తంబులు రెం డెఱింగించినఁ, గవియనం బ్రసిద్ధికెక్కెదవు; దానంజేసి వారు [1]కృతకృత్యులై స్వర్గంబునకుఁ బోవుచు, [2]సత్త్రపరిశేషితం బై నధనంబు నీ కిచ్చెద''రని పలికినం దండ్రి వీడ్కొని నాభాగుండు చని, యట్లు సేసిన, నంగిరసులు సత్త్రపరిశేషితధనంబు లతని కిచ్చి, నాకంబునకుం జని; రంత. 76

క. అంగిరసు లిచ్చుపసిఁడికి,-మంగళమతిఁ జేరు నృపుని మానిచి, యొకఁడు
త్తుంగుఁడు కృష్ణాంగుఁడు దగ,-ముంగల నిలుచుండి విత్తముం జేకొనియెన్.

వ. వానింజూచి, నాభాగుండు దనకు మునులిచ్చుటంజేసి తనధనం బని పలికిన, ''నమ్మహాపురుషుండు మీతండ్రి సెప్పినక్రమంబ కర్తవ్యం'' బనిన నాభాగుండు నభగునడిగిన, నతండు ''యజ్ఞమందిరగతం బై యుచ్ఛిష్టం బగు ధనంబు దొల్లి మహామునులు రుద్రునకిచ్చి; రది కారణంబుగా నా దేవుండు సర్వధనంబునకు నర్హుం'' డనిన విని వచ్చి, నాభాగుండు మహాదేవునకు నమస్కరించి, ''దేవా! యీధనంబు నీయధీనం'' బని మాతండ్రి సెప్పె; నే నపరాధంబు సేసితి; సహింపు;'' మనవుడు భక్తవత్సలుం డగు నమ్మహాపురుషుండు నభగుసత్యవచనంబునకు, నాభాగునినిజంబునకు మెచ్చి, నీవు దప్పక పలికితివి; కావున సత్త్రపరిశేషితం బగు ధనంబు నీకు నిచ్చితినని పలికి, యంతర్దర్శిత్వంబును సనాతనంబగుబ్రహ్మజ్ఞానంబును నుపదేశించి, తిరోహితుం డయ్యె; నివ్విధంబున. 78

---

1. నెఱవేఱిన కార్యములు గలవారు. 2. యజ్ఞముచేయఁగా మిగిలినధనము.

క. భువిలో నాభాగునికథ,-దవిలి మతిన్ రేపుమాపుఁ దలఁచినమాత్రం
గవి యగు; మంత్రజ్ఞుం డగు,-బ్రవిమలగతిఁ బొందు నరుఁడు భద్రాత్మకుఁడై.

వ. అంత నాభాగునకు నంబరీషుండు జనియించె; నతనియందు జగదప్రతిహతం
బైన బ్రాహ్మణశాపంబు నిరర్థకం బయ్యె" ననిన విని "యేమికారణంబున
దురంతరంబైన బ్రహ్మదండంబువలన నతండు విడువంబడియె" ననిన నప్పుడమి
ఱేనికి శుకుం డిట్లనియె. 80

## అంబరీషోపాఖ్యానము

శా. "సప్తద్వీపవిశాలభూభరము, [1]దోఃస్తంభంబునం బూని, సం
ప్రాప్త(శ్రీ)యుతుఁడై, మహావిభవసంపచ్ఛాతురిం గల్గి, దు
ర్వ్యాప్తిం జెందక, వైష్ణవార్చనలమేరం గాలముం బుచ్చుచున్,
సుప్తిం బొందక, యొప్పె సద్గుణగరిష్ఠుం డంబరీషుం డిలన్, 81

సీ. చిత్తంబు మధురిపు(శ్రీ)పాదములయంద; పలుకులు హరిగుణపఠనమంద;
కరములు విష్ణుమందిరమార్జనములంద; శ్రవములు హరికథాశ్రవణమంద;
చూపులు గోవిందరూపవీక్షణమంద; శిరము కేశవనమస్కృతులయంద;
పదము లీశ్వరగేహ[2]పరిసర్పణములంద; కామంబు చక్రికైంకర్యమంద;

తే. సంగ మచ్యుతజనతనుసంగమంద,-ఘ్రాణ మసురారిభక్తాంఘ్రికమలమంద;
రసనతులసీదళములంద; రతులుపుణ్య,-సంగతులయందయారాజచంద్రమునకు.

వ. మఱియు నమ్మహీవిభుండు. 83

సీ. ఘనవైభవంబునఁ గల్మషదూరుఁడై, యజ్ఞేశు నీశు నబ్జాక్షుఁ గూర్చి,
మొనసి వసిష్ఠాదిమునివల్లభులతోడఁ దగిలి, సరస్వతీతటమునందు
మేధతో బహువాజిమేధంబు లొనరించె గణుతింపరాని దక్షిణలు వెట్టి;
[3]సమలోష్టహేముఁడై, సర్వకర్మంబులు హరిపరంబులు గాఁగ నవనినేలె;

ఆ. విష్ణుభక్తులందు, విష్ణువునందుఁ గ,-లంకమెడల, మనసు లంకెవెట్టి,
విహితరాజ్యవృత్తి విడువనివాఁడు నై,-యతఁడు రాచతపసి యనఁగ నొప్పె.

వ. వెండియు నమ్మహాభాగవతుండు. 85

క. హరి యని సంభావించును;-హరి యని దర్శించు; నంటు; నాఘ్రాణించున్;
హరి యని రుచిగొనఁ దలఁచును; హరి! హరి! ఘను నంబరీషు నలవియె పొగడన్.

వ. ఇట్లు పుణ్యచిత్తుండు నీశ్వరాయత్తుండు నై యల్లనల్లన రాజ్యంబు సేయుచున్న
సమయంబున. 87

---

1. భుజము అను స్తంభము, స్తంభమువంటి భుజమున నని భావము. 2. సంచారము.
3. బంగారమునందును, ఱాతియందును సమానమయిన బుద్ధిగలవాఁడు.

ఆ. అతని కీహ మానె హరులందుఁ; గరులందు,-ధనములందుఁ; గేహవనములందుఁ;
బుత్రులందు; బంధుమిత్రులయందును,-బురమునందు; నంతిపురమునందు. 88

వ. అంతఁ గొంతకాలంబున కమ్మేదినీకాంతుండు సంసారంబువలనితగులంబు విడిచి, నిర్మలుండై, యేకాంతంబున భక్తిపరవశుం డయి యుండ, నారాచతపసికి భక్తలోకవత్సలుం డగు పురుషోత్తముఁడు ప్రతిభటశిక్షణంబును, నిజజనరక్షణంబును, నిఖిలజగదవక్రంబును నగు చక్రంబు నిచ్చి చనియె; నంత. 89

క. తనతోడినీడకై వడి,-ననురూపగుణాఢ్య యైనయాత్మమహిషితోఁ
జనవిభుఁడు ద్వాదశీవ్రత,-మొనరఁగ హరిఁగూర్చి, చేసె నొకయేఁ డధిపా! 90

వ. ఇట్లు వ్రతంబు సేసి, యావ్రతాంతంబునం గార్తికమాసంబున మూఁడురాత్రు లుపవసించి, కాళిందీజలంబుల స్నాతుం డయి, మధువనంబున మహాభిషేకవిధానంబున విహితపరికరసంపన్నుం డయి, హరి నభిషేకంబు సేసి, మనోహరంబులయినగంధంబులు సమర్పించి, యభినవామోదంబు లైన పుష్పములం బూజించి, తదనంతరంబ. 91

శా. పాలేఱై ప్రవహింప *డగ్గఱుచు లేఁ బ్రాయంబులున్, రూపము
ల్మేలై, ధూర్తలుగాక, వెండిగొరిజల్ హేమోరుశృంగంబులుం
గ్రాలం, గ్రేపుల యట్లు నాఁకుచును, నంగచ్ఛాయలై యున్నమం
దాలన్ న్యర్బుదషట్క మిచ్చె విభుఁ డుద్యద్వైదికశ్రేణికిన్. 92

క. పెక్కండ్రు విప్రవరులకు-గ్రక్కున నతిభక్తితోడఁ గడుపులు నిండం
[1]జొక్కపుటన్నం బిడి, విభుఁ-డొక్కెడఁ బారణము సేయ నుద్యోగింపన్. 93

వ. అయ్యవసరంబున. 94

క. భాసురనిగమపదోప-న్యాసుఁడు, సుతపోవిలాసుఁ-డనుపమయోగా
భ్యాసుఁడు, రవిభాసుఁడు,దు-ర్వాసుఁ డతిథి యయ్యెఁ దన్ని-వాసంబునకున్.

వ. అట్లతిథియై వచ్చిన యమ్మునివల్లభునకుఁ బ్రత్యుత్థానంబు సేసి, కూర్చుండ గద్దియయిడి, పాదంబులు గడిగి, పూజించి, సేమంబరసి, తనయింట నన్నంబు గుడువుమని నమస్కరించిన, నమ్మహాత్ముండు సంతసించి, భోజనంబునకు నంగీకరించి, నిర్మలంబులగుకాళిందీజలంబులం బరమధ్యానంబు సేయుచు మునింగి, లేచి రాక, తడవుసేసిన, ముహూర్తార్ధావశిష్టయగుద్వాదశియందుఁ బారణ సేయవలయుటఁ జింతించి, బ్రాహ్మణాతిక్రమదోషంబునకు శంకించి, విద్వజ్జనంబుల రావించి, వారల నుద్దేశించి. 96

* నంగరుచులున్ - పాఠాంతరము. 1. స్వచ్ఛమగు అన్నము.

క. "ముని నీరుసొచ్చి, వెడలఁడు- చనియెడు ద్వాదశియు; నింత చనియెన్నిలో
నన పారణయున్ వలయును-వినిపింపుం డర్హధర్మవిధ మెట్టిదియో ?" 97

వ. అని పలికిన నారాజునకు బ్రాహ్మణజను లి ట్లనిరి. 98

ఆ. అథితి వోయి రామి, నధిప! యీద్వాదశీ-పారణంబు మానఁ బాడిగాదు;
గుడువకుంట గాదు; కుడుచుటయును గాదు;-సలిలభక్షణంబు సమ్మతంబు."

వ. అని ధర్మసందేహంబు వాపిన, నా రాజర్షిశ్రేష్ఠుండును మనంబున హరిం
దలంచి, నీరు పారణంబు సేసి, జలంబుల మునింగిన తపసిరాక కెదురుచూచు
చున్నసమయంబున. 100

సీ. యమునలోఁ గృతకృత్యుఁడై వచ్చి, రాజుచే సేవితుండై, రాజుచేష్టితంబు
బుద్ధిలో నూహించి, బొమముడిమొగముతో, నదరెడిమేనితో, నాగ్రహించి,
రెట్టించి యాఁకలి గొట్టుమిట్టాడంగ, "నీసంపదున్మత్తు, నీనృశంసు,
నీదురహంకారు నిందఱుఁ గంటిరే? విష్ణుభక్తుఁడు గాఁడు; వీఁడు నన్నుఁ

తే. గుడువరమ్మని, [1]మునుముట్టఁగుడిచినాఁడు-ధర్మభంగంబు సేసి,దుష్కర్ముఁడయ్యె;
నయిన నిప్పుడు నూపెద; నన్నిదిశల-నేను గోపింప మాన్పువాఁ డెవ్వఁ?"డనుచు.

చ. పెటపెటఁ బండ్లు గీటుచును, భీకరుఁడై కనుఁగ్రేవ నిప్పుకల్
పొటపొట రాల, [2]గండములు పొంగ, మునీంద్రుఁడు హుంకరించుచున్,
జటమొద లంటఁగాఁ బెఱికి, చక్కన దానన కృత్య, నాయుధో
త్కటవరశూలహస్తయుతఁ,గా నొనరించి, కవించె రాజుపై. 102

వ. అంత. 103

క. కాలానలసన్నిభయై-శూలాయుధహస్త యగుచు, సుఱసుఱ స్రుక్కన్
నేలఁ బదంబులఁ ద్రొక్కుచు-వాలి, మహాకృత్య మనుజవల్లభుఁ జేరెన్. 104

ఆ. ఆప్రకార మెఱిఁగి, హరి విశ్వరూపుఁడు-"వెఱ్ఱితపసి సేయువేడబంబుఁ
జక్కఁబెట్టు" మనుచుఁ జక్రంబుఁ బంచిన-వచ్చెనదియుఁ బ్రళయవహ్నిపగిది.

వ. వచ్చి, మునిపంచినకృత్యను దహించి, తనివి సనక మునివెంటం బడిన, ముని
యును మేరుగుహఁ సొచ్చిన, నదియు [3]వ్యాళంబు వెనుకొను దవానలంబుచం
దంబునఁదోన చొచ్చి, మఱియును. 106

మ. భువిఁ దూఱన్ భువిఁ దూఱు; నబ్ధిఁ జొర నబ్ధుల్ సొచ్చు; నుద్వేగి యై
దివిఁ బ్రాఁకన్ దివిఁ బ్రాఁకు; దిక్కులకుఁ బో దిగ్వీథులం బోవుఁ; జి
క్కి వెసం గ్రుంగినఁ గ్రుంగు; నిల్వ నిలుచుం; గ్రేడింపఁ గ్రేడించు; నొ
క్కవడిన్ దాపసువెంట నంటి, హరిచక్రం బన్యదుర్వక్రమై. 107

---

1. ముందుగనే. 2. చెక్కిళ్లు. 3. సర్పము.

శా. ఏలోకంబున కైన వెంటఁ బడి, తో నేతెంచు చక్రానల
జ్వాలల్ మానుపువారు లేమిఁ, జని [1]దేవజ్యేష్ఠు, లోకేశు, వాఁ
డాలోకించి "విధాత! విశ్వజననవ్యాపారపారీణ రే
ఖాలీలేక్షణ! చూడవే కరుణఁ; జక్రంబున్ నివారింపవే!" 108

వ. అనిన బ్రహ్మ యి ట్లనియె. 109

మ. "కర మర్థిన్ ద్విపరార్ధసంజ్ఞ గల యీ కాలంబుఁ, గాలాత్ముఁడై
సొరిదిన్ నిండఁగఁ జేసి, లోకములు, నా చోటున్, విభుం డెవ్వఁడో
పరిపూర్తిన్ గనుఁగ్రేవఁ గెంపు గదురన్ భస్మంబు గాఁ జేయు, నా
హరి చక్రానలకీల కన్యుఁ డొకరుం డడ్డంబు గా నేర్చునే? 110

ఆ. ఏను భవుఁడు, దక్షుఁ, డింద్రాదులును, బ్రజాపతులు, భృగుఁడు, భూతపతులు శిరము
లందుఁ దాల్తుమతనియాజ్ఞ జగద్ధితం-బంచు, భూరికార్య మతుల మనుచు.

వ. కావున సుదర్శనానలనివారణంబునకు నోప" నని విరించి పలికిన, దుర్వా
సుండు కైలాసంబునకుఁ జనుదెంచి, శర్వు నాలోకించి, చక్రానలంబు తెఱం
గెఱింగించిన నమ్మహాదేవుం డి ట్లనియె. 112

సీ. "వినవయ్య! తండ్రి! యే విశ్వేశ్వరునియందుఁ [2]జతురాస్యజీవకోశములు పెక్కు-
వేలసంఖ్యలు గూడి, వేళతో నిబ్బంగి నగుచుండుఁ; జనుచుండు; నదియుఁ గాక
యెవ్వానిచే భ్రాంతి నే మందు చున్నార; మేను, దేవలుఁ, డసురేంద్రసుతుఁడు,
నారదుఁ, డజుఁడు, సనత్కుమారుఁడు, ధర్ముఁ, డా కపిలుఁడు, మరీచ్యాదు, లఖిల

ఆ. పారవిదులు, సిద్ధపతులు, నెవ్వనిమాయ-నెఱుఁగ లేము; మూలమిట్టిదనుచు
నట్టి నిఖిలనాథునాయుధశ్రేష్ఠంబుఁ, దొలఁగఁ జేయ మాకు దుర్లభంబు. 113

వ. మునీంద్రా! నీవు నమ్మహాత్మునిశరణంబు వేఁడు; మతండు మేలు సేయం
గలవాఁ" డని పలికిన, నీశ్వరునివలన నిరాశుండై, దుర్వాసుండు వైకుంఠ
నగరంబునకుం జని, 114

శా. ఆ వైకుంఠములోని [3]భర్మమణిసౌధాగ్రంబుపై లచ్చి దా
గ్రేవన్ మెల్లన [4]నర్మభాషణములం గ్రీడించుపుణ్యున్, హరిన్,
దేవాధీశ్వరుఁ గాంచి, "యో వరద! యో దేవేశ! యో భక్తర
క్షావిద్యాపరతంత్ర! మానుపఁగదే చక్రానలజ్వాలలన్. 115

ఉ. నీమహిమార్ణవంబుతుది నిక్కముగా నెఱుఁగంగ లేక, నీ
ప్రేమకు వచ్చుదాసులకుఁ [5]గ్రించతనంబున నెగ్గు సేసితిన్;

1. బ్రహ్మదేవుఁడు. 2. బ్రహ్మాండములు. 3. బంగారుచేతను మణులచేతను గట్టఁబడిన మేడ పైభాగమున. 4. ప్రియములను మాటలు. 5. నీచబుద్ధి.

నామఱపున్ సహింపు; మఱి నారకుఁ డైన మనంబులో భవ
న్నామము చింత సేసిన, ననంతసుఖస్థితి నొందకుండునే?'' 116

వ. అని పలికి పాదకమలంబులకు మ్రొక్కి, లేవకయున్న దుర్వాసునిం గని, హరి
యి ట్లనియె. 117

చ. ''చలమున బుద్ధిమంతులగు సాధులు నాహృదయంబు లీల డొం
గిలి కొని పోవుచుండుదురు; రకిల్బిషభక్తిలతాచయంబులన్
నిలువఁగఁ బట్టి కట్టుదురు నేఱుపుతో మదకుంభికైవడిన్;
వలలకుఁ జిక్కి, భక్తజనవత్సలతం జన కుందుఁ దాపసా! 118

ఆ. నాకు మేలు గోరనాభక్తులక కాని-భక్తజనుల కేన పరమగతియు;
భక్తుఁ డెందు జనినఁ బఱతెంతు, వెనువెంట-గోవు వెంటఁ దగులు కోడెభంగి.

వ. అదియునుం గాక. 120

ఆ. తనువు మనువు విడిచి, తనయులఁ జుట్టాల-నాలి విడిచి, సంపదాలి విడిచి,
నన్నకాని యన్య మెన్నఁడు నెఱుఁగని, వారి విడువ, నెట్టివారి నైన. 121

క. [1]పంచేంద్రియముల తెరువుల-వంచించి, మనంబునందు వరమతులు ప్రతి
ష్ఠించి, వహింతురు నన్నును-మంచివరుం బుణ్యసతులు మరగినభంగిన్. 122

క. సాధులహృదయము నాయది-సాధులహృదయంబు నేను; జగముల నెల్లన్
సాధుల నేన యెఱుంగుదు;-సాధు లెఱుంగుదురు నాదుచరితము విప్రా! 123

ఆ. ధారుణీసురులకుఁ దపము విద్యయు రెండు-ముక్తి సేయుచుండుముదముతోడ;
దుర్వినీతు లగుచు దుర్జను లగువారి-కివియెఁ గీడు సేయ కేల యుండు? 124

క. నా తేజము సాధులలో-నాతత మై యుండు; వారి నలఁచుజనులకున్
హేతిక్రియ భీతి నిచ్చుం-జేతోమోదంబుఁ జెఱుచు; సిద్ధము సుమ్మీ! 125

క. అదె! పో; బ్రాహ్మణ! నీకును-సదయుఁడు, నాభాగసుతుఁడు, జనవినుతగుణా
స్పదుఁ డిచ్చు నభయ; మాతని-మది సంతసపఱచి వేఁడుమా! శరణంబున్.''

మ. అని శ్రీవల్లభుఁ డానతిచ్చిన మహోద్యచ్చక్రకీలావళీ
జనితాయాసుఁడు, నిర్వికాసుఁ, డుదితశ్వాసుండు, దుర్వాసుఁ, డ
ల్లన యేతెంచి, సుభక్తిఁ గాంచెఁ గరుణాలావణ్యవేషున్, విదో
షు నయోదారమనీషు, మంజుమితభాషు న్నంబరీషున్ వెసన్. 127

వ. కని, దుఃఖితుం డయి, యమ్మహీవల్లభుపాదంబులు పట్టి, విడువ కున్న, నాన
రేంద్రచంద్రుండు చరణస్పర్శనంబునకు నోడుచుఁ, గరుణారసభరితహృదయుం
డయి హరిచక్రంబు నిట్లని స్తుతియించె. 128

1. త్వక్చక్షుః శ్రోత్రజిహ్వాఘ్రాణములు.

సీ. "నీవ పావకుఁడవు; నీవ సూర్యుండవు; నీవ చంద్రుండవు; నీవ జలము;
నీవ నేలయు; నింగి నీవ; సమీరంబు నీవ; భూతేంద్రియనికర మీవ;
నీవ బ్రహ్మంబును; నీవ సత్యంబును; నీవ యజ్ఞంబును;నీవ ఫలము;
నీవ లోకేశులు; నీవ సర్వాత్మయు; నీవ కాలంబును: నీవ జగము;
తే. నీవ బహుయజ్ఞభోజివి; నీవ నిత్య-మూలతేజంబు; నీకు నే మ్రొక్కువాఁడ;
నీరజాక్షుండు చాల మన్నించునట్టి-శస్త్రముఖ్యమ! కావవే? చాలు మునిని.

మ. హరిచే నీవు విసృష్టమై చనఁగ మున్నాలించి, నీధారలన్
ధరణిన్ వ్రాలుట నిక్క మంచు మునుపే దైత్యేశ్వరవ్రాతముల్,
శిరముల్, బాదములున్, భుజాయుగళముల్ ఛేదిల్లి, యంగంబు ల
స్థిరగం బ్రాణసమీరముల్ వదలు నీ యుద్ధంబులం; జక్రమా! 130

ఆ. కలఁగి నిద్రవోవఁ, గలలోన వచ్చిన-నిన్నుఁ జూచి, దీర్ఘనిద్రవోదు
రసురవరులు శయ్యలం దున్న సతులు ప్ర-భాతమందు లేచి పలవరింప. 131

ఉ. చీఁకటిఁ బాపుచున్, వెలుఁగు సేయుచు, సజ్జనకోటి నెల్ల స
చ్ఛ్రీకులఁ జేయు నీరుచులు, చెల్వుగ ధర్మసమేతలై, నినున్
వాకున నిట్టి దట్టి దని వర్ణన సేయ, విధాత నేరఁ; డ
స్తోకము *నీదురూపు; గలదుం; దుది లేదు, పరాత్పరాద్యమై. 132

ఆ. కమలలోచనుండు ఖలుల శిక్షింపంగఁ-బాలు సేయ, నీవు పాలుపడితి;
నైన నింకఁ జాలు; నా పన్నుఁడై యున్న-తపసిఁ గావు మీవు ధర్మవృత్తి."

వ. అని వినుతించి, కేలుఁదమ్మిదోయి నొసలం బొసంగించి, యి ట్లనియె. 134

ఆ. "ఏ నమస్కరింతు [1]నింద్రశాత్రవధూమ-కేతువునకు, ధర్మసేతువునకు,
విమలరూపమునకు, విశ్వదీపమునకుఁ-జక్రమునకు, గుప్తశక్రమునకు." 135

వ. అని మఱియు ని ట్లనియె. 136

ఆ. విహితధర్మమందు విహరింతు నేనియు-నిష్టమైనద్రవ్య మిత్తు నేని;
ధరణిసురుఁడు మాకు దైవతం బగు నేని, విప్రునకు శుభంబు వెలయుఁగాక!

క. అఖిలగుణాశ్రయుఁ డగు హరి-సుఖమై నాకొలువువలనఁ జొక్కెడి నేనిన్;
నిఖిలాత్మమయుం డగుటకు-సుఖ మందుం గాక! భూమిసురుఁ డీద్వేషిన్."

వ. అని యివ్విధంబునం బొగడుపుడమిఱేనివలన మన్నించి, తపసిని దాహంబు
నొందింపక రక్కసులగొంగచక్రంబు తిరిగి చనియె; నంత దుర్వాసుండు
శాంతింబొంది, మెల్లనిమాటల నారాజున్ దీవించి, యి ట్లనియె. 139

* మహామహిమ దోషనివారి పరాపరాద్యమై-పాఠాంతరము. 1. ఇంద్రునకు శత్రువులగు రాక్షసులను తోఁకచుక్కవంటివాఁడు.

మ. నరనాథోత్తమ! మేలు సేసితి కదా! నాతప్పు మన్నించి, శ్రీ
హరిపాదాబ్జము లింత ముట్టఁ గొలుతే? యాశ్చర్య మా నెన్నుచో;
నరుదం ద్రే నినుబోఁటిసాధులకుఁ దా నైన యిచ్చుటల్, గాచుటల్
సొరిదిన్ నైజగుణంబులై సరస వచ్చుం గాదె? మిత్రాకృతిన్. 140

వ. అదియునుంగాక. 141

మ. ఒకమా రెవ్వని పేరు కర్ణములలో నొయ్యార మై సోఁకినన్,
సకలాఘంబులుఁ బల్లటిల్లి, తొలఁగున్; సంభ్రాంతితో నట్టి స
త్సుకరున్, మంగళతీర్థపాదు, హరి, విష్ణున్, దేవదేవేశు ని
న్నకలంకస్థితిఁ గొల్చుభక్తులకు లే దడ్డంబు; రాజాగ్రణీ! 142

మత్తకోకిలము. తప్పు లోఁగొని చక్రపావకదాహముం బెడఁబాపి తో;
నొప్పు నొప్పు; భవద్దయారస మోనరేశ్వర! ప్రాణముల్
చెప్ప ము[1]న్నను వోయి, క్రమ్మఱఁ జేరె; ధన్యుఁడ నైతి; నీ
కెప్పుడున్ శుభ మేను గోరెద; నింకఁ బోయెద; భూవరా!'' 143

క. అనిన విని, రాజముఖ్యుఁడు-మునివల్లభుపాదములకు మ్రొక్కి, కడున్ మ
న్నన సేసి, యిష్టభోజన-మనువుగఁ బెట్టించెఁ; దృప్తుఁ డయ్యె; నతండున్. 144

వ. మఱియు నమ్మునీంద్రుం డి ట్లనియె. 145

శా. ''కంటిన్ నేఁటికి నిన్ను; నీవచనముల్ కర్ణద్వయిం బ్రీతిగా
వింటిన్; నన్నముఁ గొంటి; నీగృహమునన్ వేడ్కన్ ఫలం బబ్బె; నే
మంటిం: బోయెద; నీచరిత్ర మమరుల్, మర్త్యుల్, సుఖాసీనులై
మింటన్, మేదిని సన్నుతింపఁగల రీమీఁదన్; నరేంద్రాగ్రణీ!'' 146

వ. అని చెప్పి, దుర్వాసుం డంబరీషుని దీవించి, కీర్తించి, [2]మింటితెరువున బ్రహ్మలో
కంబునకుం జనియె; మునీశ్వరుండు వచ్చి, మగుడం జనువేళకు నొక్కవత్స
రంబు నిండి, వ్రతంబు పరిపూర్ణం బైన. 147

ఆ. అవనిసురుఁడు గుడువ నతిపవిత్రం బైన-వంటకంబు భూమివరుఁడు గుడిచెఁ;
దపసినెగులుమాన్పఁ, దా నెంతవాఁ డను-హరికృపామహత్త్వ మనుచుఁ దలఁచి.

వ. మఱియును. 149

క. 'హరిఁ గొల్చుచుండువారికిఁ – బరమేష్ఠిపదంబు మొదలు, పదభోగంబుల్
నరకసమము', లను తలఁపున-ధరణీరాజ్యంబు తోడి[3]తగులము మానెన్. 150

వ. ఇట్లు విరక్తుండై. 151

---

1. ముందుగనే పోయి. 2. ఆకాశమార్గము, 3. సంబంధము.

ఆ. తనకు సదృశులైన తనయుల రావించి-ధరణిభరము వారిఁ దాల్పఁ బంచి,
కాననంబు సొచ్చెఁ, గామాదివిజయుఁడై-నరవిభుండు హరిసనాథుఁ డగుచు.

క. ఈయంబరీషుచరితముఁ-దీయంబున విన్నఁ, జదువ, ధీసంపన్నుం
డై యుండును; భోగపరుం-డై యుండును నరుఁడు; పుణ్యుఁడై యుండు నృపా."

వ. విను మయ్యంబరీషునకు విరూపుండును, గేతుమంతుండును, శంభుండును నను
వారు మువ్వురు గొడుకు; లందుఁ గేతుమంతుండును, శంభుండును హరింగూర్చి
తపంబు సేయువారై, వనంబునకుఁ జనిరి; విరూపునికిఁ బృషదశ్వుండును, బృష
దశ్వునకు రథీతరుండును గలిగి; రమ్మహాత్మునికి సంతతి లేకున్న నంగిరసుఁ డను
మునీంద్రుం డతనిభార్యయందు బ్రహ్మతేజోనిధు లయిన కొడుకులం గలిగించె;
వారలు రథీతరగోత్రులు నాంగిరసు లను బ్రాహ్మణులునై, యితరులందు ముఖ్యు
లయి ప్రవర్తిల్లి;"రని చెప్పి శుకుం డిట్లనియె. 154

ఇక్ష్వాకువంశానుక్రమము

క. "ఒకనాఁడు మనువు దుమ్మిన-వికలుఁడుగా, కతనిఘ్రాణవివరము వెంటం
బ్రకటయశుం, డిక్ష్వాకుం-డకలంకుఁడు పుట్టె రవికులాధీశుం డై. 155

సీ. ఇక్ష్వాకునకుఁ బుత్రు లెలమిఁ బుట్టిరి నూర్వు; రమర వికుక్షియు, నిమియు, దండ
కుండు, నాతనిపెద్దకొడుకులు మువ్వు రార్యావర్తమందు హిమాచలంబు
వింధ్యాద్రిమధ్య ముర్వీమండలము గొంత యేలిరి; యిరువదియేవు రొక్క
పొందున నాతూర్పుభూమి పాలించిరి; యంతటఁ బడమటి కధిపులైరి;
తే. యున్న నలువదియేడ్వురు నుత్తరోర్వి,
దక్షిణోర్వియుఁ గాచిరి; తండ్రి యంత
'నష్టకాశ్రాద్ధ మొనరింతు' ననుచు నగ్ర
సుతు వికుక్షి నిరీక్షించి, శుద్ధమైన-మాంసఖండంబు దెమ్మనె మహితయశుఁడు.

మ. 'అగుఁ గా' కంచు, వికుక్షి వేఁట సని, ఘోరారణ్యభూమిం దగఁ
మృగసంఘంబులఁ జంపి, [1]బిట్టడవి తా మే నొల్లఁ బో, నాఁకటం
బగ మై, యొక్క శశంబుఁ బట్టి తిని, శేషం బైన మాంసంబు శీ
ఘ్రగతిం దండ్రికిఁ దెచ్చి యిచ్చె నకలంకస్ఫూర్తి వర్ధిల్లఁగాన్. 157

తరలము. కులగురుండు వసిష్ఠుఁ డంత వికుక్షి [2]కుందెలు దింట, లో
పల నెఱింగి "యనర్హ; మెంగిలి పైతృకం బొనరింపఁగా
వలదు; వీఁడు దురాత్మకుం;" డన వానితండ్రియు వానిఁ జెం
తలను జేరఁగ నీక, దేశము దాఁటి, పో నడిచెం బడిన్. 158

1. భయంకర మయిన యరణ్యము. 2. కుందేలు-రూపాంతరము.

ఆ. కొడుకు వెడలఁగొట్టి, గుణవంతుఁ డిక్ష్వాకుఁ-డా వసిష్ఠుఁ డేమి యానతిచ్చె
నదియుఁ జేసి, యోగియై వనంబునఁ గళే-బరము విడిచి, ముక్తిపదము నొందె.

చ. జనకుఁడు ముక్తి కేఁగ, నయశాలి వికుక్షి "[1]శశాదుఁ"డంచు భూ
జనులు నుతింప, నీధరణిచక్ర మశేషము నేలి, యాగముల్
గొనకొని చేసెఁ బ్రీతి హరిఁ గూర్చి; పురంజయుఁ బుత్త్రుఁ గాంచెఁ; జే
ర్కొనె "సమరేంద్రవాహుఁడుఁ [2]గకుత్స్థుఁడు" నంచును వాని లోకముల్. 160

సీ. కృతయుగాంతంబున దితిసుతామరులకు రణమయ్యె; నందు నా రాక్షసులకు
నమరవల్లభుఁ డోడి, హరితోడఁ జెప్పిన జలజనేత్రుఁడు "పురంజయునియందు
వచ్చి నే నుండెద; వాసవ! వృషభంబవై మోవు"మని పల్క, నమరవిభుఁడు
గోరాజమూర్తిఁ [3]గకుత్ప్రదేశంబున నాపురంజయు మోచె; నంత నతఁడు
తే. విష్ణుతేజంబు దనయందు విస్తరిల్ల-దివ్యచాపంబు చేఁ బట్టి, దీర్ఘనిశిత
బాణములఁ బూని, వేల్పులు ప్రస్తుతింప-నంతఁ గాలాగ్ని చాడ్పున ననికి నడచె.

చ. నడచి, శరావళిన్ దనుజనాథులమేనులు చించి, కంఠముల్
దోడిఁదోడిఁ ద్రుంచి, కాలుపురిత్రోవకుఁ గొందఱఁ బుచ్చి, కొందఱన్
వడి నురగాలయంబున నివాసము సేయఁగ దోలి, యంత నూ
ఱడక నిశాచరేంద్రులపురంబులు గూల్చెఁ బురంజయాఖ్యతన్. 162

వ. ఇవ్విధంబున శశాదపుత్త్రుండు రాక్షసులపురంబులు జయించినకతనం బురంజ
యుండును, వృషభరూపుం డైన యింద్రుండు వాహనం బగుటం జేసి, యింద్రవా
హనుండును, నతనిమూఁపురం బెక్కి రణంబు సేసినకారణంబునఁ గకుత్స్థుం
డును, నన నీ మూఁడునామంబులం బ్రసిద్ధి కెక్కి, దైత్యులధనంబుల నింద్రున
కిచ్చె; నప్పురంజయునిపుత్త్రుం డనేనసుం; డతనిపుత్త్రుండు పృథుండు; వాని
కొడుకు విశ్వగంధుండు; విశ్వగంధునకు నందనుండు చంద్రుండు; చంద్రసుతుండు
యవనాశ్వుండు; యవనాశ్వతనూభవుండు శవస్తుం; డతండు శావస్తినామ
నగరంబు నిర్మించె; శవస్తతనయుండు బృహదశ్వుండు, బృహదశ్వతనూజుండు
కువలయాశ్వుం, డానరేంద్రచంద్రుండు. 163

క. లావు మెఱసి యిరువదియొక-వేవురు నందనులుఁ దాను, వీరుఁ డతఁడు భూ
దేవుఁ డుదంకుఁడు పనుప దు-ర్వావహుఁ డై, చంపె ధుంధు నమరాబంధున్.

వ. అది కారణంబుగా ధుంధుమారుం డన నెగడె; నయ్యసురముఖానలంబునఁ గువ
లయాశ్వకుమారు లందఱు భస్మంబై; రందు దృఢాశ్వుండును, గపిలా
శ్వుండును, భద్రాశ్వుండును ననువారలు ముగ్గురు చిక్కి; రందు దృఢాశ్వునకు

1. కుందేటిని దిన్నవాఁడు. 2. ఎద్దుమూపునందుఁ గూర్చున్నవాఁడు. 3. మూపురపు భాగము.

హర్యశ్వుండును, హర్యశ్వునకు నికుంభుండును, నికుంభునకు బర్హిణాశ్వుండును, బర్హిణాశ్వునకుఁ గృతాశ్వుండును, గృతాశ్వునకు సేనజిత్తును, సేనజిత్తునకు యువనాశ్వుండును జనించి; రయ్యువనాశ్వుండు గొడుకులు లేక, నూర్వురు భార్యలుం దానును నిర్వేదపడి యుండ, నా రాజునకు మునులు గృప చేసి, యింద్రునిఁగూర్చి సంతతికొఱకు నైంద్రయాగంబు సేయించి; రందు. 165

సీ. భూమీశుభార్యకుఁ బుత్రలాభమునకై పోయుతలంపున భూమిసురులు
జలములు మంత్రించి, జలకలశము దాఁచి, నియమంబుతోఁ గూడి నిద్ర వోవ,
ధరణీశ్వరుఁడు పేరుదప్పితో నారాత్రి ధృతి లేక యజ్ఞమందిరముఁ జొచ్చి,
యానీరు ద్రావిన, నంత మేల్కని వార, "లెవ్వఁడు ద్రావె? నీ రెందుఁ బోయె?"
ఆ. ననుచు రాజు ద్రావు టంతయు భావించి-యెఱిఁగి, చోద్యమంది, "యీశ్వరాజ్ఞ
యెవ్వఁ డోపుఁ గడవ? నీశ్వరునకు నమస్కార" మనుచు "నేది కార్య?" మనుచు.

వ. వారలు దుఃఖించుచుండ నంతఁ గొంతదడవునకు యువనాశ్వునికడుపు వ్రక్కలించుకొని, చక్రవర్తిచిహ్నంబులు గలకుమారుండు జన్మించి, తల్లి లేనికతంబున గడుపునకు లేక యేడ్చుచుండ, నింద్రుండు వచ్చి, శిశువునకు నాఁకలి దీఱుకొఱకు వానినోటం దన [1]దేశిని నిడినం, ద్రావినకతంబున వాని పేరు "మాంధాత" యని నిర్దేశించి చనియె; నివ్విధంబున. 167

ఆ. కడుపు పగుల ముద్దుకొడుకు జన్మించినఁ-[2]దీఱఁ డయ్యెఁ దండ్రి; దేవవిప్ర
కరుణ నట్లకాదె? కడిఁది దైవములావు-గలుగువాఁడు బ్రదుకుఁగాక చెడునె?

వ. ఇట్లు బ్రదికి యున్న యువనాశ్వుండు గొంతకాలమునకుఁ దపంబు సేసి, సిద్ధిం బొందె; నంత. 169

సీ. పడమటఁ బొడమెడుబాలచంద్రునిమాడ్కిఁ బూటపూటకువృద్ధిఁ బొందె బాలుఁ;
డల్లన పరిపూర్ణయౌవనారూఢుఁ డై, రావణాదిరిపుల రాజవరుల
దండించి, తనుఁ "ద్రసదస్యుఁ" డంచు సురేంద్రుఁ డంకింప, శూరుఁ డై యఖిలదేవ
మయు, నతీంద్రియు, విష్ణు, మాధవు, ధర్మాత్ము, నజుని, యజ్ఞాధీశు నాత్మఁ గూర్చి
తే. చేసెఁ గ్రతువులు భూరిదక్షిణల నిచ్చి-ద్రవ్యయజమానవిధిమంత్రధర్మ యజ్ఞ
కాలఋత్విక్ప్రదేశముఖ్యంబు లెల్ల-విష్ణురూపంబు" లనుచు భావించి, యతఁడు.

క. బలిమి నడంచుచు, నరులం-జలివెలుఁగుగన్ వేఁడివెలుఁగుఁ జనుచోటెల్లన్,
జలరుహనయనునికరుణను-జెలువుగ మాంధాత యేలె సిరి నిండారన్. 171

వ. అంత నా రాజునకు శశబిందునికూఁతు రగు బిందుమతియందుఁ బురుకుత్సుండు, నంబరీషుండును, ముచుకుందుండును ననువారు ముగ్గురు గొడుకులు, నేఁబండ్రు గూఁతులును జనియించి, పెరుఁగుచున్న యెడ. 172

1. చూపుడువ్రేలు. 2. నశింపఁడయ్యెను.

సీ. యమునాజలములోన నధికుఁడు సౌభరి తపము సేయుచు, జలస్థలమునందుఁ
బిల్లలుఁ, దనప్రాణవల్లభయును గూడి మెలఁగ, నానందించు మీనరాజుఁ
గనుఁగొని, సంసారకాంక్షి యై మాంధాత నొకకన్య నడుగ, నృపోత్తముండు
"దరుణి నిత్తును స్వయంవరమునఁ జేకొను" మనవుడు "ననుఁజూచి యౌవనాంగి
ఆ. యేల ముసలిఁ గోరు? నిట్టట్టు వడఁకెడి-వాఁడఁ; జాల నరసినాఁడ; నొడల
[1]జిగియు బిగియు లేని శిథిలుండఁ; గరఁగింప-బాలఁ [2]దిగిచికొనునుపాయ మెట్లు?

వ. అదియునుం గాక. 174

ఆ. బాల పువ్వుఁబోఁడి; ప్రాయంపువానిని-జెన్నువాని, ధనముఁ జేర్చువాని,
మరగెనేనిఁ గొంత మరగుఁగా; కెదిరిఁ ద-న్నెఱిఁగి, ముసలితపసి నేల మరగు?"

వ. అని విచారించి, సౌభరి దనతపోబలంబునం జేసి, ముసలితనంబు విడిచి, యెలప్రా
యంపుఁగొమరుం డయి, యలంకరించుకొని, ముందట నిలువంబడిన, మాంధాత
యుఁ, గన్నియలనగరు గాచికొని యున్నవారికి సెలవు సేసిన, వా రమ్మునీంద్రుని
నారాజపుత్త్రిక లున్న యెడకుం గొనిపోయి, చూపిన. 176

ఉ. "కోమలులార! వీఁడు నలకూబరుఁడో? మరుఁడో? జయంతుఁడో?
యేమటి వచ్చె; వీనిఁ దడ వేల? వరింతుము నేమ; యేమ;" యం
చా మునినాథుఁ జూచి చలితాత్మిక లై, సొరిదిన్, వరించి, రా
భామిను లందఱుం; గుసుమబాణుఁడు "గీ" యని [3]ఘంట వ్రేయఁగన్. 177

వ. ఇట్లు రాజకన్యకల నందఱం జేకొని, సౌభరి నిజతపఃప్రభావంబున ననేకలీలా
వినోదంబులఁ గల్పించి. 178

సీ. గృహరాజములయందుఁ, [4]గృతకాచలములందుఁ, గలువలు విలసిల్లుకొలఁకులందుఁ,
గలకంఠశుకమధుకరనినాదములచే వర్ణనీయము లైన వనములందు,
మణివేదికలయందు, మహనీయపర్యంకపీఠలీలాశైలబిలములందు,
శృంగారవతు లగు చెలువలు పలువురు తనపంపు సేయ సుస్థలములందు,
తే. వస్త్రమాల్యానులేపసువర్ణహార-భూరిసంపద నిష్టాన్నభోజి యగుచుఁ,
బూఁటపూఁటకు నొకవింతపొలుపుఁ దాల్చి-రాజకన్యల నందఱ రతులఁ దేల్చె.

క. పెక్కండ్రు రాజముఖులకు-నొక్కఁడు మగఁడయ్యుఁ, దనియకుండె మునీంద్రుం;
డెక్కుడుఘృతధారలచే-నక్కజమై తృప్తిలేని యనలునిభంగిన్. 180

వ. ఇవ్విధంబున. 181

1. కాంతియును, పటుత్వమును. 2. లోఁబఱచుకొనునట్టి. 3. చాటింపఁగా - ప్రకటింపఁగా.
4. కల్పితపర్వతములు.

క. ఆరామంబున మునివరుఁ-డా రామలతోడ బహువిహారమయుండై,
గారాములఁ దనకిట్టటు-పోరాములు సేసి, కొన్ని ప్రొద్దులు పుచ్చెన్. 182

వ. అంత నొక్కనాఁడు మాంధాతృ మేదినీవల్లభుండు, మునీశ్వరుం డెందుఁ బోయెఁ? గూఁతు లెక్కడ నలజడిఁ బడుచున్నవారలో?'' యని తలంచి, వెదక వచ్చి, యొక్క మహాగహనంబున మణిమయసౌధంబులం జక్రవర్తి యుం బోలెఁ గ్రీడించుచున్న తాపసరాజుం గని, సంతసించి వెఱఁగుపడి, మన్ననలం బొంది, మెల్లన కూఁతులం బొడగని, సత్కరించి, యిట్లనియె. 183

క. నాతోడులార! మీపతి-మీతోడే? పనులయెడల మేలే?'' యనుడున్
''నాతోడిదె; నాతోడిదె-తాతా! మే'' లనుచు ననిరి తరుణులు వరుసన్.

వ. అంతఁ గొంతకాలంబునకు గృహగతచర్యుం డగు సౌభరి, యేకాంతంబునఁ దన్నుఁ దాన చింతించుకొని, మీనమిథునసంగదోషంబునం గాఁపురంబు దనకు నగపడుట యెఱింగి, పశ్చాత్తాపంబున ని ట్లనియె. 185

మ. ''ఉపవాసంబుల డయ్యుటో? విషయసంయోగంబు వర్జించుటో?
తపముం బూని చరించుటో? హరిపదధ్యానంబునన్ నిల్చుటో?
[1]యపలాపంబున నేల పొందితి; హతం బయ్యెం దపం బెల్ల? నీ
కపటస్త్రీపరిరంభముల్ మునులకుం గైవల్యసంసిద్ధులే? 186

చ. ముని నఁట? తత్త్వవేది నఁట? మోక్షమ కాని, సుఖంబు లెవ్వియుం
జన వఁట? కాంత లేఁబదఁట? సౌధచయం బఁట? వాసదేశముం
దనయులు నైదువే లఁట? నిదానము మీనకుటుంబి సౌఖ్యముం
గను టఁట? చెల్లరే? నగవు గాక! మహాత్ములు నూఁచి మెత్తురే? 187

ఆ. తపముసేయువాఁడు, దత్త్వజ్ఞుఁడగువాఁడు-నెలమిమోక్ష మిచ్చగించువాఁడు,
నేకతంబు విడిచి, యేర్పడ నేరఁడు-కాపురంబు సేయుఁ [2]గఱటితపసి. 188

వ. అని దుఃఖించి, తన్నుం దాన నిందించుకొని, తనవేడబంబు వివేకించుచు, నిహపర సాధకుం డై కాఁపురంబు విడిచి, సతులుం దానును వానప్రస్థ ధర్మంబున నడవికిం జని, ఘోరతపంబు సేసి, శరీరంబు గుదియించి, యగ్ని సహితుండై పరబ్రహ్మంబుసొచ్చె; నంత. 189

క. మునిపతి వనమున కరిగిన-వనితలుఁ దో నరిగి, ప్రాణవల్లభుగతికిం
జనిరి; వెనుతవిలి విడువక-యనలునితో శిఖలు నిలువ కరిగినభంగిన్. 190

వ. అంత మాంధాత పెద్దకొడు కగు నంబరీషునిం, దత్పితామహుం డగుటం జేసి యువనాశ్వుండు ''దనకు బుత్త్రుండు గావలయు'' నని కోరి పుచ్చుకొనియె;

1. మోసముతోఁగూడిన సంభాషణము. 2. మూర్ఖుఁడగు, అజ్ఞానియగు ముని.

నయ్యంబరీషునకు యౌవనాశ్వుం; డతనికి హారీతుండు జనియించి; రది కార
ణంబుగా నంబరీషయౌవనాశ్వహారీతులు మాంధాతృగోత్రంబునకుఁ బ్రవరు
లైరి; మాంధాత రెండవకొడుకు పురుకుత్సుం; డతని నురగలోకంబునకుఁ
గొనిపోయి, భుజంగకుమారులు దమచెల్లెలి నర్మద యను కన్యకను వివా
హంబు చేసిరి; పురుకుత్సుం డక్కడ ననేకగంధర్వనాథుల వధించి, తన
నాగలోకసంచరణంబు దలంచువారికి నురగభయంబు లేకుండ వరంబు
వడసి, తిరిగి వచ్చె; నా పురుకుత్సునకుఁ ద్రసదస్యుండుఁ, ద్రసదస్యునకు ననర
ణ్యుండు, నాయనరణ్యునకు హర్యశ్వుండు, హర్యశ్వునకు నరణుండు, నర
ణునకుఁ ద్రిబంధనుండుఁ, ద్రిబంధనునకు సత్యవ్రతుండును జన్మించి; రాసత్య
వ్రతుండ త్రిశంకుఁ డనం బరఁగె; నతండు. 191

గురుశాపవశమునఁ గూలి, చండాలుఁ డై, యనఘాత్ముఁ గౌశికు నాశ్రయించి,
యతనిలావున దివిజాలయంబున కేఁగ, మన్నింప కమరులు మరలఁ ద్రోయఁ,
దలక్రిందుగాఁ బడి, దైన్యంబుతోఁ రాఁగఁ, గౌశికుఁ డెప్పటిఘనత మెఱసి,
నిలిపె నాకసమున; నేఁడు నున్నాఁడు; త్రిశంకుఁ డాతఁడు హరిశ్చంద్రుఁ గనియెఁ;
నా హరిశ్చంద్రుఁ గౌశికుఁ డర్థిఁ జేరి–[1]యాగదక్షిణామిషమున నఖిలధనముఁ
గొల్లగొని,మీఁదఁగులహీనుఁగొలువఁబెట్టె–బొంకకలజడిఁబొందెనాభూవరుండు.

ఇట్లు విశ్వామిత్రుండు హరిశ్చంద్రు నెగులుపఱచుట విని, వసిష్ఠుండు విశ్వా
మిత్రుని “గృధ్రమ్మవు గ” మ్మని శపించె; విశ్వామిత్రుండును వసిష్ఠుని “బకం
బవు గ” మ్మని శపించెఁ; బక్షిరూపు లయ్యును, వైరంబు మానక యయ్యిరు
వురును యుద్ధంబు సేసి; రంత హరిశ్చంద్రుండు పుత్రులు లేక, నారదు నుప
దేశంబున వరుణోపాసనంబు నతిభక్తితోఁ జేయ, నా వరుణుండు ప్రత్యక్షం
బైన, నతనికి మ్రొక్కి యి ట్లనియె. 193

“వరుణదేవ! నాకు వరవీరగుణముల–కొడుకు పుట్టెనేని, గొడుకుఁ బట్టి
పశువుఁ జేసి, నీవు[2]పరిణమింపఁగ వేల్తుఁ–గొడుకు నీఁ గదయ్య! కొసరు లేక. 194

అని పలికినం “గుమారుండు గలిగెడు”మని వరం బిచ్చి, వరుణుండు సనియె;
నంత హరిశ్చంద్రునకు వరుణప్రసాదంబున రోహితుం డనుకుమారుండు జన్మించె;
వరుణుండును హరిశ్చంద్రకుమారు నుద్దేశించి. [దనియెఁ;

పురిటిలోపల వచ్చి, “పుత్త్రు వేలుపు”మన్నఁ, “బురుడు వోయినఁగాని పొసఁగ”
బలురాకమును వచ్చి“ బాలు వేలుపు”మన్నఁ“బండ్లు లేకుంటనభావ్యుఁ”డనియెఁ
బండ్లు రాఁజూచి“డింభకుని వేలుపు”మన్నఁ“బడిపండ్లురామి నభావ్యుఁ”డనియెఁ
బడిపండ్లు వొడమినఁ“గొడుకు వేలుపు”మన్నఁ“బోరుల కొదవక పోల”దనియెఁ

1. యజ్ఞదక్షిణము యొక్క నెపముతో. 2. తృప్తినందఁగా.

ఆ. దొడరి యిట్లు, కొడుకుతోడి మోహంబునఁ-బ్రొద్దు గడపుచుండె భూవరుండు;
దండ్రితలఁపుకొలఁదిఁ దనలోనఁ జింతించి-యింట నుండ, కడవి కేఁగెఁ గొడుకు.

వ. ఇట్లు వనంబునకు జని, [1]శరశరాసనధరుం డయి రోహితుండు దిరుగుచుండి, [2]వరుణగ్రస్తుండై హరిశ్చంద్రుండు మహోదరవ్యాధిచేఁ బీడితుండుగా నుండుట విని, పురంబునకుం దిరిగి రా గమకింప, నింద్రుండు ముసలితపసి యై వచ్చి యిట్లనియె. 197

ఆ. ''పుణ్యభూము లరుగు; పుణ్యతీర్థంబులఁ-గ్రుంకు; పుణ్యజనులఁ గోరి చూడు;
పుణ్యకథలు వినుము; భూపాలపుత్రక-మేలు గలుగునట్టిమేర గలదు.'' 198

వ. అనియిట్లు మగిడించినం దిరిగి, చని రోహితుఁ డొక్కయేఁ డవ్వనంబునం దిరిగి, క్రమ్మఱఁ జనుదేర, నింద్రుండు వచ్చి, తొంటియట్ల నివారించె; నివ్విధంబున.

సీ. ఐదేండ్లు మరలించె; నమరేంద్రుఁ డా బాలు; నాఱవయేటఁ దా నడవినుండి
యింటికి వచ్చుచు, నెలమి నజీగర్తు, మధ్యమపుత్త్రు, సన్మాన్యచరితు,
ఘను శునశ్శేఫునిఁ గొని, యాగపశువుగ నాహరిశ్చంద్రున కాతఁ డిచ్చెఁ;
బురుషమేధము సేసి, భూపాలవర్యుఁడు వరుణాదినిఖిలదేవతలఁ దనిపె;

తే. హోత కౌశికుఁ; డధ్వర్యుఁ డౌనరభృగువు; బ్రహ్మ జమదగ్ని; సామంబు పాడువాఁడు
ముని వసిష్ఠుఁ; డా మఖమున ముదముఁ బొంది, కనకరథ మిచ్చె నింద్రుఁ డా మనుజపతికి.

వ. శునశ్శేఫుని ప్రభావంబు వెనుక వివరించెద; నంత భార్యాసహితుం డైన హరిశ్చంద్రువలన నత్యంత ప్రీతుం డై విశ్వామిత్రుం డతనికి ముఖ్యజ్ఞానంబు గృపసేసిన, మనం బన్నమయంబు గావున, మనంబున నన్నరూపి యైన పృథివి నెఱింగి, పృథివిని జలంబువలన నడంచి, జలంబుఁ దేజంబువలన నింకించి, తేజంబు వాయువువలనం జేరిచి, వాయువు నాకాశంబునం గలిపి, యాకసంబు దామసాహంకారంబునందు లయంబు సేసి, యహంకారత్రయంబు మహత్తత్త్వంబునందు డిందించి పరతత్త్వంబునకు లోకంబులు సృజించెద నను తలంపైన మహత్తత్త్వంబునందు విషయాకాశంబు నివర్తించి, [3]విషయవివర్జితుండై, పరతత్త్వంబు నెఱుంగుచు, నయ్యెఱుకవలన సంసారహేతువైన ప్రకృతిని భస్మంబు సేసి, యయ్యెఱుకను నిర్వాణసుఖపారవశ్యంబునం బరిహరించి, సకలబంధవిముక్తుండై, హరిశ్చంద్రుం డవాఙ్మనసగోచరం బయిన నిజరూపంబుతో వెలుంగుచుండె; నతనికుమారునకు హరితుండు పుట్టె; హరితునకుఁ జంపనామధేయుండు జనియించె; నతండు దన పేరఁ జంపానగరంబు నిర్మించె; నా చంపునికి సుదేవుండు, సుదేవునికి విజయుండు, విజయునకు రురుకుండు, రురుకునకు వృకుండు, వృకునకు బాహుకుండు జనియించి; రందు బాహుకుండు. 201

1. బాణము, ధనుస్సు ధరించినవాఁడై. 2. వరుణునిచేతఁ బట్టుకొనఁబడినవాఁడు.
3. లోకసుఖములను వదలిపెట్టినవాఁడై.

సగరచక్రవర్తికథాప్రారంభము

సీ. దండిఁ బగవారు దనభూమిఁ జేకొన్న, నంగనలును దాను నడవి కేఁగి,
యడవిలో ముసలి యై, యాతఁడు సచ్చిన, నాతనిభార్య దా ననుగమింపఁ
గదియుచోఁ, నా స్త్రీకి గర్భంబు గలుగుట, యౌర్వమునీశ్వరుఁ డాత్మ నెఱిఁగి,
వారించె; నంత నవ్వనజాక్షి సవతులు చూలు నిం డారినఁ జూడఁజాల,
తే. కర్థి నన్నంబు గుడుచుచో నందుఁ గలిపి
విషము వెట్టిరి; పెట్టిన విరిసి సడక
గరముతోఁ గూడ [1]సగరుండు ఘనుఁడు పుట్టి,
వరయశస్స్ఫూర్తితోఁ జక్రవర్తి యయ్యె. 202

శా. చండస్ఫూర్తి నతండు తండ్రిపగకై సంగ్రామరంగంబులం
జెండెన్ హైహయబర్బరాదుల; వధించెం దాళజంఘాదులన్;
ముండీభూతులుగా, నిరంబరులుగా, మూర్తుల్ సబీభత్సులై
యుండం జేసె నిజారులన్; సగరనామోర్వీవిభుం డల్పుఁడే? 203

క. ఖగరాజరుచులు గలయిల-పగరాజుల నడఁచి, యేలె బాహాశక్తిన్;
నగరాజధీరు శూరున్-సగరున్, హతవిమతనగరుఁ, జను వినుతింపన్. 204

సీ. ఔర్వుండు చెప్పంగ నమర వేదాత్మకు హరి నీశు నమృతు ననంతుఁ గూర్చి
వాజిమేధంబులు వసుధేశ్వరుఁడు సేసె; నం దొక్క మఖమున హయము విడువ
నగభేది గొనిపోయి, నాగలోకంబునఁ గపిలునిచేరువఁ గట్టి తొలఁగె;
నంత గుఱ్ఱముఁ గాన కా రాజు దనపుత్రనివహంబు దిశలకు నెమకఁ బంప,
తే. వారు నిలయేడుదీవుల వరుస వెదకి-మఖతురంగంబు లేకున్న, మగుడి రాక
ప్రాభవంబున దోర్దండబలము మెఱసి-గ్రొచ్చి, కోరాడి, త్రవ్విరి [2]కులత మెల్ల. 205

వ. ఇట్లు సుమతికొడుకులు నేలం ద్రవ్వి, పాతాళంబునం దూర్పు ముట్టియున్న
యుత్తర భాగంబునం గపిలమునిపొంత నున్న తురంగంబుఁ గని. 206

చ. "ఎఱిఁగితి; మద్దిరయ్య! తడ వేటికి? గుఱ్ఱపుదొంగ వీఁడె; యీ
జఱభినిఁ బట్టి చంపుఁ; డతిసాధుమునీంద్రుఁడువోలె, నేత్రము
ల్దెఱవక, వాకినోరు మొదలింపక; బై సుకపట్టె;" నంచు న
య్యఱువది వేవురున్ నిజకరాయుధముల్ జళిపించి, డాయుచోన్. 207

చ. కపిలుఁడు నేత్రముల్ దెఱవఁగాఁ దమ మేనుల మంట పుట్టి, తా
రపగతధైర్యులై పడి, యహంకరణంబున మూఢచిత్తులై,

1. విషముతోఁగూడినవాఁడు. 2. భూమి.

నృపసుతు లంతఱుఁగ ధరణి నీఱయి రాక్షణమందు; సాధులం
దపసులఁ గాసిఁబెట్టెడిమదస్ఫురితాత్ములు నిల్వ నేర్తురే? 208

సీ. కొందఱు "కపిలునికోపానలంబున మ్రందిరి సగరకుమారు"లనుచు
నందు; రాముని శాంతుఁ, జ్ఞానందమయమూర్తి, తోడరి కోపించునే? దువ్వ నేలఁ
గాన జన్మించునే గగనస్థలంబున? నేసాంఖ్యమతమున సిద్ధమతులు
భవసముద్రము మృత్యుభయమును లంఘింతు రాబుద్ధిఁ జేయుపరాత్మభూతుఁ
తే. డఖిలబోధకుఁ; డతనికి నరసిచూడ-సఖులు[1] మిత్రులు, నెవ్వరు? సగరసుతులు
దాము దమచేయునేరమిఁ, దనువులందు. ననలకీలలు వుట్టి, నీ ఱైరిగాక! 209

వ. మఱియు సగరుండు కేశినియందుఁ గన్న పుత్త్రుం డసమంజసుం డనువాఁడు, సమం జసగుణంబులు లేక పూర్వజన్మంబున యోగీశ్వరుం డై యుండి, సంగదోషంబు వలన యోగభ్రష్టుం డయి, సగరునకు జన్మించి, జాతిస్మరజ్ఞానంబుగలిగి, లోకం బువారలకుఁ దమవారలకు నప్రియంబగు వర్తనంబునం దిరుగుచు, నొక్క- నాఁడు. 210

చ. వరుస నయోధ్యలోనఁ గలవారల నాడెడుపిన్నవాండ్ర నా
సరయువులోన వైచి, జనసంఘముఁ దండ్రియుఁ దిట్టుచుండ, వాఁ
డురుమతిఁ [2]గొన్నిప్రొద్దులకు యోగబలంబునఁ జేసి, బాలురం
దిరిగి పురంబులోపలికిఁ దెచ్చిన, [3]నివ్వెఱఁగంది రందఱున్. 211

వ. అయ్యసమంజసునికొడు కంశుమంతుం డనువాఁడు వినీతుం డయి, తనయొద్దఁ బనులు సేయుచుండు నంత, సగరుం డమ్మనుమని నంశుమంతు "నశ్వంబు వెదకి తె"మ్మని పంచిన, నతండు తనతండ్రులచొప్పునం జని, వారలు ద్రవ్విన మహాఖాతంబు సొచ్చి, యందు భస్మరాసులపొంత నున్నహయంబుఁ గని, హయసమీపంబునం దున్నకపిలాఖ్యుం డయినవిష్ణునికి దండప్రణామంబు సేసి, యి ట్లని స్తుతియించె. 212

సీ. "మతి [4]చిక్కఁబట్టి సమాధిగౌరవమున వ్రాలియుఁ దనకు నవ్వల వెలుంగు
నినుఁ గానఁ డొకనాఁడు; నిన్నెఱుంగునె బ్రహ్మ? యజునిమనంబున, నవయవముల
బుద్ధి జన్మించిన భూరిజంతువులందు, హీనులమైనమా కెఱుఁగ వశమె?
తమలోన నీ వుండఁ. దా మెఱుంగరు నిన్ను; గుణములఁ జూతురు; గుణములైన
తే. గాన; రొక వేళఁ జీకటిఁ గందు;రాత్మ-లందుఁ దెలియరు; వెలుపలనమరుబొందు
లరయుదురు దేహధారులత్యంధులగుచుఁ;-గడఁదినీమాయ నెన్నఁడుఁ గడవలేక".

1. శత్రులు, 2. కొన్నిదినములకు. 8. ఆశ్చర్యముసుపొందిరి. 4. నియమించి.

వ. అని వినుతి సేయుచు "హయంబు విడువు"మని చెప్పక తనతండ్రులు నీఱగు
టం దడవక మ్రొక్కి, నిలుచున్న యంశుమతునికిఁ గరుణావిపులుం డగు కపిలుం
డిట్లనియె. 214

క. "గుఱ్ఱముఁ గొనిపో; బుద్ధుల-కుఱ్ఱఁడ! మీతాతయొద్దకుఁ; నీతండ్రుల్
వెఱ్ఱులు; నీఱై రదె, యీ-మిఱ్ఱున గంగాజలంబు మెలఁగ శుభ మగున్."

వ. అని పల్కిన నమస్కరించి, తురంగంబుఁ గొనివచ్చి, యా సగరుని కిచ్చిన,
సగరుం డా పశువువలన జన్నంబు కడమ నిండించి, యంశుమంతునకు రాజ్యం
బిచ్చి, ముక్తబంధనుండై, యౌర్వుండు చెప్పిన మార్గంబున నుత్తమగతికిం
జనియె; నంత. 216

క. "జనకులు మ్రగ్గినచోటికి-ననిమిషనదిఁ దెత్తు" ననుచు నటవీస్థలికిం
జని, తపము సేయఁజాలక-మనమున వగలొలయ, నంశుమంతుఁడు దీఱెన్.

క. అతనికొడుకు దిలీపుఁడు-భూతలమున గంగఁ దెచ్చి, పొందించుటకై
ప్రీతిం దపంబు సేయుచు-భాతిగఁ దేలేక కాలపరవశుఁ డయ్యెన్. 218

క. అతనిసుతుండు భగీరథుఁ-డతితప మొనరించి, కనియె నమృతాపాంగన్
సుతరంగన్, ముఖవనరుహ-రతభృంగన్, శివజటాగ్రరంగన్, గంగన్. 219

వ. కని నమస్కరించిన, గంగ కృపసేసి, "వరంబు వేఁడు" మనిన నారాచపట్టి
యిట్లనియె. 220

క. "మావారిభస్మరాసుల-నీవారిం గలపికొనుము; నేఁటి మావారల్
నీవారిఁ గలయ, నాకము-మావారికిఁ గలుగు; నిది ప్రమాణము తల్లీ! 221

ఇంద్ర. చెల్లన్ మదిన్ నిన్ను భజింతు గంగన్-ఫుల్లాంతరంగన్ బహుపుణ్యసంగం,
గల్లోలలక్ష్మీజిత కాశమల్లిం-దల్లిన్ సుధీకల్పలతామతల్లిన్. 222

వ. అని వినుతి సేయుచున్న రాజకుమారునకు లోకపావని యిట్లనియె. 223

మ. "వినువీథిం బఱతెంచి నేలఁ బడ, నావేగంబునున్ నిల్పనో
పినవాఁ డెవ్వఁడు? మేదినీతలము నే భేదించి, పాతాళముం
జనుదున్; వచ్చితినేని నాజలములన్ సంస్నాతులై మానవుల్
ననుఁ బొందించు నఘవ్రజం బెచట నే నాశంబుఁ బొందించెదన్? 224

వ. అది కారణంబుగా విచారించెద" నని పలుకుచున్న లోకమాతకు రాజన్య
వర్యుం డగు భగీరథుం డిట్లనియె. 225

1. ఉన్నతస్థలమున, 2. నీజలమునందు.

మ. "పరతత్త్వజ్ఞులు, శాంతచిత్తులు, తపఃపారీణు, లార్యుల్, ఘనుల్,
పురుషశ్రేష్ఠులు వచ్చి, తల్లి! [1]భవదంభోగాహముల్ సేయఁగా
నరసంఘాఘము నిన్నుఁ బొందునే! జగన్నాథుండు నానాఘసం
హరుఁడౌ విష్ణుఁడు వారిచిత్తములఁ దానై యుండు మందాకినీ! 226

మ. తనలో నిన్నిజగంబులుం గలుగుటం, దా నిన్నిటం గల్గుటన్
జననీ! [2]తంతువులందుఁ జీర గల యాచందంబునన్ విశ్వభా
వనుఁడై యొప్పు శివుండు గాక; మఱి నీవారిన్ నివారింప, నే
ర్చినవారెవ్వరు? నిన్ ధరించుకొఱకై శ్రీకంఠునిం గొల్చెదన్. 227

వ. అని యెఱింగించి, వీడ్కొని చని, భగీరథుండు మహేశ్వరునుద్దేశించి, [3]గ్రద్దనఁ దపంబు సేసిన. 228

ఆ. భక్తవత్సలుండు ఫాలాక్షుఁడా భగీ-రథుని మెచ్చి, నిజశిరంబునందు
శౌరిపాదపూత సలిలమై, దివినుండి-ధరకు వచ్చుగంగఁ దాల్చె నపుడు. 229

శ్రీపరమేశ్వరజటానిర్గతగంగాప్రవాహమహిమాభివర్ణనము

వ. ఇట్లమ్మహానది పురారాతిజటాజూటరంధ్రంబువలన దిగంబడి, నిరర్గళప్రవాహంబై నేలకు జల్లించి, నెఱసి, నిండి [4]వెల్లువెల్లిగొని, పెచ్చుపెరిగి, విచ్చలవిడిం గ్రేపువెంబడి నుఱుకఁ గ్రేళ్లుఱుకు మఱక ప్రాయంపుఁగామధేనువుచందంబున ముందఱికి నిగుడుచు, ముద్దుఁజందురుతోడి నెయ్యంబున గ్రయ్యనడరి, చొప్పుదప్పక సాఁగి చనుదెంచు సుధార్ణవంబుకైవడిఁ బెంపు గలిగి, మహేశ్వరువదనగహ్వరంబువలన నోంకారంబు పిఱుంద వెలువడు శబ్దబ్రహ్మంబుభంగి నదభ్రవిభ్రమంబై, యమ్మహీపాలతిలకంబు తెరువువెంట నంటి వచ్చు వెలియేనుఁగుతొండంబుల ననుకరించి పఱచు వఱదమొగంబులును, [5]వఱదమొగంబులపిఱుంద నందంద క్రందుకొని పొడచూపి తొలంగు బాలశారదాకుచకుంభంబులకు నగ్గలంబైన బుగ్గలును, బుగ్గలసంగడంబునం బారిజాతకుసుమస్తబకంబుల చెలువంబులం దెగడు వెలినురువులును, వెలినురువులచెంగట వర్ధోస్ఫాలితకహ్లారతరుకిసలయంబులం గేలిగొను సుళ్లును, సుళ్లకెలంకుల ధవళజలధరరేఖాకారంబుల బాగు మెచ్చని నిడుదయేఱులును, యేఱులం గలసి వాయువశంబున నొండొంటిం దాఁకి బిట్టు మిట్టించి మీఁదికెగయు దురితభంగంబులైన భంగంబులును, భంగంబుల కొనల ఛిన్నభిన్నంబులై కుప్పించి, యుప్పరంబెగసి, ముత్తియంపుసరులవడువున మల్లికాదామంబుల తెఱంగునఁ, గర్పూరఖండకదంబంబుల చెలువంబున, నిందుశకలంబుల తేజంబునఁ, దారకానికరంబులపోలుపున మెఱయుచు ము-

1. నీటియందు మునుకలు (స్నానము) 2. దారములు, 3. వెంటనే, 4. గొప్ప ప్రవాహము
6. ప్రవాహములయొక్క ముందటి భాగముల వెంట.

కన్యావశీకరంబులై నవశీకరంబులునుం గలిగి, మధ్యమలోకశ్రీకరంబై, శ్రీక
రంబు తెఱంగున విష్ణుపదంబు ముట్టి విష్ణుపదంబుభాతి నుల్లసితహంసరుచిరంబై,
రుచిరపక్షంబు రీతి నతిశోభితకువలయంబై, కువలయంబు చెన్నున బహుజీవనంబై,
జీవనంబులాగున సుమనోవికాసప్రధానంబై, ప్రధానపర్వంబుపోలుపున నేక
చక్ర బకభీమ మహాభంగసుభద్రార్జునచరిత్రాభిరామంబై, రామచిత్తంబు
మెలంపునం దనవారిలోఁ జొచ్చినదోషాచరులకభయప్రదానచరణంబై, ప్రదాన
చణవర్తనంబుభాతిసముపాసితమృత్యుంజయంబై. మృత్యుంజయురూపంబుపోలిక
విభూతిసుకుమారంబై, కుమారచరిత్రంబు తెవను క్రౌంచప్రముఖవిజయంబై,
విజయరథంబుభాతి [1]హరిదయామంథరంబై, మంథరవిచారంబు గ్రద్దన మహా
రామగిరివనప్రవేశకామంబై, కామకేతనంబు పెల్లున నుద్దీపితమకరంబై, మకర
కేతనుబాణంబుకై వడి విలీనపరవాహినీకలితశంబరంబై, శంబరారాతి[2]చిగురు
గొంతంబుసూటి నధ్వగవేదనాశమనంబై, శమనదండంబుజాడ నిమ్నోన్నత
సమవృత్తంబై, వృత్తశాస్త్రంబు విధంబున వడి గలిగి, సదాగురులఘువాక్య
చ్ఛటాపరిగణితంబై, గణితశాస్త్రంబుకొలఁదిని ఘనఘనమూల వర్గమూల
సంకలితభిన్న మిశ్రప్రకీర్ణ ఖాతభీష్మంబై, భీష్మపర్వంబు పెంపున ననేకభగవద్గీ
తంబై, గీతశాస్త్రంబు నిలుకడను [3]మహాసుషిరతనుఘననానాశబ్దంబై, శబ్ద
శాస్త్రంబుమర్యాద నచ్చునడి హల్లు గలిగి, మహాభాష్యరూపావతారవృత్తివృద్ధి
గుణసమర్థంబై, యర్థశాస్త్రంబుమహిమను బహుప్రయోజనప్రమాణదృష్టాం
తంబై, దృష్టాంతంబు తెఱంగున సర్వసామాన్యగుణవిశేషంబై, శేషవ్యాపా
రంబుకరణిని సుస్థిరోద్ధరణ తత్పరంబై, పరబ్రహ్మంబుగరిమ నతిక్రాంతానేక
నిగమంబు నడవడిని బ్రహ్మవర్ణపదక్రమసంగ్రహంబై, గ్రహశాస్త్రంబు పరి
పాటిని గర్కట మీన మిథున మకరరాశిసుందరంబై, సుందరిముఖంబుపోఁడి
మిని నిర్మలచంద్రకాంతంబై, కాంతాధరంబురుచిని శోణచ్ఛాయావిలాసంబై,
విలాసవతికొప్పు నొప్పునఁ గృష్ణనాగాధికంబై, యధికమతిశాస్త్రసంవాదంబు
సొంపున నపారసరస్వతీ విజయవిభ్రమంబై, విభ్రమవతిచనుదోయిపగిది
నిరంతరపయోవ్యాప్తాఖిలలోకజీవనప్రదతుంగభద్రాతిరేఖాసలలితంబై, [4]లలిత
వతినగవుమించున నపహసితచంద్రభాగధేయంబై, భాగధేయవంతునివివా
హంబులీల మహామేఖలకన్యకా విస్తారంబై, తారకెంగేలియొడికంబున
నాక్రాంతసూర్యతనయంబై, సూర్యతనయు శరవర్షంబుపోలిక భీమరథ్యాటోప
వారణంబై, వారణంబుపరుసునం బుష్కరోన్నతసంరంభంబై, రంభనెమ్మో
ముడాలున సురసాతిశయదశంబై, దశరథతనయుబొమముడి చాడ్పున సింధు

1. రీతి. 2. చిగురాకు ఖడ్గము. 3. గొప్ప రంధ్రము, విలాసవతియొక్క నవ్వువలె.

గర్వప్రభంజనంబై, ప్రభంజనతయు గదపెట్టుమాడ్కిని సమీపగతదుశ్శాసన దుర్మదనివారకంబై, †వారకన్యకముం జేతి గతిని ముహుర్ముహురుచ్చలితకంకణాలంకృతంబై, కృతయుగంబునోజ నపంకంబై, పంకజాసనముఖంబునోజఁ బునఃప్రభూతముఖ్యవర్ణంబై, వర్ణగుణితంబు తెఱఁగువను బహుదీర్ఘబిందువిసర్గంబై, సర్గబంధకావ్యంబువిన్ననువున గంభీరభావ మధురంబై, మధురాపురంబుసొబగున మహానందనందనంబై, నందనవనంబు పొందున విహరమాణకౌశికంబై, కౌశికహయంబురీతి సుదర్శనధ్రువంబై, ధ్రువుతలంపుక్రియం గ్రియాపరిశీలితవిశ్వంభరంబై, విశ్వంభరునిశంఖంబురూపున దక్షిణావర్తోత్తరంబై, యుత్తరావివాహంబుచందంబునఁ బ్రముదితనరంబై, నరసింహునఖరంబులభాతి నాశ్రితప్రహ్లాదగురువిభవప్రదానంబై, దానకాండంబు సిరిం గామధేనుకల్పలతాద్యభినవంబై, [1]నవసూతికాకుచంబుపేర్మిని నిరంతర పయోవర్ధనంబై, ధనదునిలయంబు తూనికను సంభృతమకరపద్మమహాపద్మకచ్ఛపంబై, కచ్ఛపకర్పరంబుబలిమిని బరితశైలసముద్ధరణంబై, ధరణీధరంబు సాటి నుత్తుంగతటముఖ్యంబై, ముఖ్యవరాహంబుగరిమ నున్నతక్షమంబై, క్షమాసురహస్తంబుగరగరికను సత్పవిత్రమనోభిరామంబై, రామచంద్రు బాణంబుకడింది నభ్యాగతఖరదూషణమదాపహరణముఖరంబై, ముఖర రామకుఠారంబు రీతిని భూభృన్మూలచ్ఛేదనప్రబలంబై, బలరామహలంబు భాతిని బ్రతికూలసన్నికర్షణప్రబుద్ధంబై, బుద్ధదేవునిమేనియొఱపున [2]నభియాతి రక్షోదారమనోహరంబై, హరతాండవంబుమేర నుల్లసితానిమిషంబై, [3]యనిమిషావతారంబుకీర్తిని శ్రుతిమంగళప్రదంబై, ప్రదాతయాగిసూటి నర్థపరంపరావామనంబై, వామనచరణరేఖను బలివంశవ్యపనయంబై, నయశాస్త్రంబుమార్గంబున సామభేదమాయోపాయచతురంబై, చతురాననాండంబుభావంబున నపరిమితభువనజంతుజాలసేవ్యమానంబై, మానిని యన లోఁతు సూపక, గరిత యన నడిచప్పుడు సేయక, ముగుద యన బయలు పడక, ప్రమద యన గ్రయ్యంబాఱుచుఁ, బతివ్రత యన నిట్టట్టు చనక, తల్లి యన నెవ్వియైన లోఁగొనుచు, దైవంబన భక్తమనోరథంబు లిచ్చుచు నంతకంతకు గుటిగడచి, యవాఙ్మానసగోచరంబై ప్రవహించి. 230

మ. జగతీనాథురథంబుపజ్జ బహుదేశంబుల్ వడిఁ దాఁటి, త
త్సగరక్ష్మాపకుమారభస్మములమీఁదన్ ముంచి, పాఱన్, మరు
న్నగరావాసము వారు వొందిరి నవీనశ్రీలతోఁ; గంగనీ
రుగతిం గాక మహాదురంతసుజనద్రోహానలం బాఱునే? 231

† భోగముపడుచు. 1. క్రొత్తగా బిడ్డనుగనిన స్త్రీ. 2. శత్రువు. 3. మత్స్యావతారము.

మ. హరు మెప్పించి, మహాతపోనియతుఁడై, యాకాశగంగానదిన్
ధరకుం దెచ్చి, నితాంతకీర్తిలతికాస్తంభంబుగా నవ్యసు
స్థిరలీలం బితృకృత్యమంతయు నొనర్చెన్; వారితానేకదు
ష్కరవంశవ్యథుఁ డా భగీరథుఁడు నిత్యశ్రీకరుం డల్పుఁడే? 232

క. హరిఁ దమమనములలో నిడి-హరిపాదాంభోజజనిత మైన నదిన్ సు
స్థిరులై క్రుంకి, మునీంద్రులు-హరిఁ గలిసిరి, త్రిగుణరహితులై యవ్వేళన్.

వ. అంత నా భగీరథునకు శ్రుతుండును, శ్రుతునకు నాభావరుండును, నాభావరునకు సింధుద్వీపుండును, సింధుద్వీపునికి నయుతాయువును, నయుతాయువునకు ఋతుపర్ణుండును జనియించె; నతండు. 234

ఆ. నయవిశాలబుద్ధి నలచక్రవర్తితో-[1]సంగడీనితనము సాలఁ జేసి
యక్షహృదయ మతని కవ్యస్తముగ నిచ్చి-యశ్వవిద్య నేర్చె నతనివలన. 235

వ. ఆ ఋతుపర్ణునకు సర్వకాముండును, సర్వకామునకు మదయంతీవల్లభుం డైన సుదాసుండును బుట్టె; నారాజశేఖరుని మిత్రసహుండును గల్మాషపాదుండు నని చెప్పుదు; రా భూవరుండు వసిష్ఠునిశాపంబున రాక్షసుం డయి, తనకర్మంబున [2]ననపత్యుం డయ్యె;" ననిన విని పరీక్షిన్నరేంద్రుం "డేమికారణంబున సుదాసునకు గురుశాపంబు ప్రాప్తం బయ్యె" నని యడిగిన శుకుం డి ట్లనియె.

సీ. "ఆసుదాసుఁడు వేట కై వనంబున కేఁగి, గర్వించి యొక్కరక్కసునిఁ జంపి,
వానితోఁ బుట్టినవానిఁ బోవిడిచిన, వాఁడును దనతోడివానిచావు
కో నీక కపటియై, భూపాలుగృహమున నడబాలతనమున నర్థిఁ గొలిచి
యుండ, వసిష్ఠున కుర్వీశుఁ డొక్కనాఁ డన్నంబు సేయంగ నతనిఁ బనుప,

తే. వాఁడు మానవమాంసంబు వండి తెచ్చి
మునికి వడ్డింపఁ, గోపించి ముని నరేంద్రుఁ
బిలిచి "మనుజామిషంబును బెట్టి;" తనుచు
నలుకతో "రాక్షసుఁడవు గ"మ్మని శపించె. 237

వ. ఇట్లు శపియించి పదంపడి రాక్షసుండు వండి తెచ్చుటయు, సుదాసుం డెఱుంగమియుఁ, దన మనంబున నెఱింగి వసిష్ఠుండు "పండ్రెండేండ్లు రక్కసుండ వయి యుండు" మని నియమించె; నయ్యవసరంబున. 238

మ. "గురువున్ మాఱు శపింతు" నంచు జలముల్ గోపంబుతో దోయిటన్
నరనాథుండు ధరింపఁ, దత్సతి పతి న్వారింప, మిన్నుం దిశల్

---

1. చెలికాని భావము (మైత్రి) 2. సంతానము లేనివాఁడు. 3. మనుష్యమాంసము.

ధరయుఁ జీవమయంబ కా, నిఖిలముం దాఁ జూచి, చల్లెన్ ధరా
వరుఁ డాత్మీయపదంబులం [1]గరపుటీవారిపూరముం బొక్కుచున్. 239

వ. ఇట్లు మిత్రసహుండు గావునఁ, గళత్రానుకూలుండై శపియింప నొల్లక, సుదాసుండు రాక్షసభావంబు నొంది, కల్మాషవర్ణంబు లయినపాదంబులతో నడవులం దిరుగుచు. 240

క. ఆఁకట మలమల మాఁడుచు-నేకత మతం డడవి నున్న విప్రమిథునముం
దాఁకి, తటాలున విప్రునిఁ-గూఁకటిచేఁ బట్టి మ్రింగఁ గొనిపోవుతఱిన్. 241

వ. అంత నా బ్రాహ్మణునిభార్య మోఁదికొనుచుం బెగ్గడిల్లి, డగ్గుత్తికతోఁ బతికి నడ్డంబు వచ్చి, యేడ్చుచు రాచరక్కసున కి ట్లనియె. 242

క. "మానుషదేహము గలుగుట-భూనాయక! దుర్లభంబు; పుట్టినమీఁదన్
దానముఁ, బరోపకారము-భూనుతకీర్తియును వలదె పురుషున కెందున్? 243

మ. రవివంశాగ్రణివై, సమస్తధరణీరాజ్యానుసంధాయివై,
భువనస్తుత్యుఁడవై, పరార్థరతివై, పుణ్యానుకూలుండవై,
వివరం బేమియు లేక, నాపెనిమిటిన్ విప్రుం, దపశ్శీలు, స
త్ప్రవరున్, బ్రహ్మవిదున్, జగన్నుతగుణున్ భక్షింపఁగాఁ బాడియే? 244

శా. తండ్రీ! మీకు దినేశవంశజులకున్ దైవం బగున్ బ్రాహ్మణుం
డం; డ్రామాటలు లేవె? భూమిసురగోహత్యాభిలాషంబు గ్రా
కొండ్రే మీయట్టివంటిసాధువులు? రక్షోభావ మిచ్చేల? మీ
తండ్రిం దాతలఁ బూర్వులం దలఁపవే? ధర్మంబునం బోఁగదే? 245

శా. అన్నా! చెల్లెల నయ్యెదన్; విడువు; నీకన్నంబు వెట్టింతు; నా
ప్రాణనాథున్ ద్విజు; గంగిగుజ్జి నకటా! హింసింప నే లయ్య? నీ
వెన్నం డింతులతోడఁ బుట్టవె? నిజం బెట్టైన, మున్ముట్ట నా
పన్నున్ నన్ను, శిరంబు ద్రుంచి మఱి మత్ప్రాణేశు భక్షింపవే?" 246

క. అని కరుణ పుట్ట నాడుచు, వనితామణి పలవరింప, వసుధాదేవుం
దినియె నతఁడు పులి పశువుం-దిను క్రియ; శాపంబుకతన ధీరహితుండై.

వ. అంత నా బ్రాహ్మణి కోపించి, "కామార్తనయిన నాదుపెనిమిటి భక్షించితివి; గావున నీవు నెలంతలం బొందఁ జేరినవేళ మరణంబుఁ బొందు" మని కల్మాషపాదుని శపించి, పతిశల్యంబులతో నగ్నిప్రవేశంబు సేసి, సుగతికిం జనియె; నంతఁ బండ్రెండేండ్లు సనిన నారాజు మునిశాపనిర్ముక్తుండై. 248

1. దోసిటియందలి నీటిప్రవాహము.

ఆ. రతులకొఱకు నాలి రావింప, నడియుచు-బెదరి, విప్రసతి శపించు టెఱిఁగి,
మగని నడ్డపెట్టి మైథునకర్మంబు, మాన్చె; సతులగోష్ఠి మానె నతఁడు. 249

క. అది కారణముగఁ బుత్రా, భ్యుదయములే దా సుదాసభూపాలునకుం;
దదనుమతి నవ్వసిష్ఠుఁడు, మదయంతికిఁ గడుపు సేసె మదనక్రీడన్. 250

వ. ఇట్లు సుదాసునిభార్య యగు మదయంతి వసిష్ఠువలన గర్భిణియై, యేడేండ్లు గర్భంబు ధరించి, [1]సిశ్శాడ సంకటపడుచున్న, వసిష్ఠుండు వాఁడి యగున శ్మంబున నా గర్భంబుఁ జీరిన, న శ్మకుం డను కుమారుండు పుట్టె; నతనికి మూలకుండు పుట్టె; నతండు.

క. వీరుఁ డగుపరశురాముఁడు, ఘోరకుఠారమున నృపులఁ గూలుచువేళన్
నారీజనములు దాఁచిన, [2]"నారీకవచుం" డనంగ నలి నుతికెక్కెన్. 252

వ. ఆనారీకవచుండు నిర్మూలం బయినరవివంశంబునకు మూలం బగుటం జేసి "మూలకుం డనం బరఁగె; నామూలకునకు విశ్వసహుండు పుట్టె; విశ్వసహునకు ఖట్వాంగుండు పుట్టి, చక్రవర్తి యయ్యె; నతండు. 253

సీ. అమరులు వేఁడిన నసురనాథులఁ జంపి, త్రిదశులతోఁ "దన బ్రదుకుకాల
మెం?" తని యడిగిన "నిదె నిండుచున్నది; తడవులే; దేమైవ నడుగు" మనిన
వరములు గోరక, వరవిమానం బెక్కి తనపురి కేతెంచి, తత్త్వబుద్ధిఁ
బరమేశ్వరునియంద భావంబుఁ [3]గీలించి "కులదైవతద్విజకులముకంటె

తే. నంగనాప్రాణరాజ్యపుత్రాదు లెల్లఁ
గావు ప్రియములు; ధర్మంబు గడచి, నాదు
మతి ప్రవర్తింప దెన్నఁడు; మది నెఱుంగ
నన్య మా యీశ్వరునిఁ దక్క" ననుచు మఱియు. 254

ము. "ఇలమీఁదన్ బ్రదుకేల? వేల్పులవరం బేలా? ధనం బేల? చం
చలగంధర్వపురీవిడంబనము లైశ్వర్యంబు లేలా? జగం
బులఁ బుట్టించు తలంపునం బ్రకృతితోఁ బొత్తై, తుదిం బాసి, ని
ర్మలమై [4]వాఙ్మనసామితం బగు పరబ్రహ్మంబు నేఁ జెందెదన్." 255

వ. అని నిశ్చయించి. 256

మ. కలసెన్ సంగము లెల్లఁ బాసి, నియతిన్ ఖట్వాంగు; డశ్రాంత మై
కల దయ్యున్, మఱి మీఁదలే దనెడిదై కల్యాణ మై, యాత్మలోఁ
దలఁపం బల్కఁగ రానిదై, పరమ మై తత్త్వజ్ఞులూహించి హృ
జ్జలజాతంబుల "వాసుదేవుఁ" డని సంస్థాపించు నాబ్రహ్మమున్. 257

---

1. ప్రసవించుటకు, 2. స్త్రీలు రక్షణముగాఁ గలవాఁడు, 3. నిలిపి, సంబంధింపఁజేసి.
4. వాక్కునకును, మనస్సునకు అధికమయినది.

వ. అట్టి ఖట్వాంగునకుఁ దీర్ఘబాహుండును, దీర్ఘబాహునకు రఘువు, రఘువునకుఁ బృథుశ్రవుండుఁ, బృథుశ్రవునకు నజుండు, నజునకు దశరథుండును బుట్టె; నా దశరథునకు సురప్రార్థితుండై పరబ్రహ్మమయుండైన హరి నాల్గువిధంబులై, శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్న నామంబుల నిజాంశసంభూతుండై జన్మించెఁ; దచ్చరిత్రంబు వాల్మీకి ప్రముఖులైన మునులచేత వర్ణితం బైనది; యైనను జెప్పెద; సావధాన మనస్కుండవై యాకర్ణింపుము. 258

## శ్రీ రా మ చ రి త్ర ము

మ. "అమరేంద్రాశకుఁ బూర్ణచంద్రుఁ డుదితుం డైనట్లు, నారాయణాం
శమునం బుట్టె మదాంధరావణశిరస్సంఘాతసంఛేదన
క్రమణోద్దాముఁడు రాముఁ డాగరికకుం గౌసల్యకున్, సన్నుతా
సమనైర్మల్య. కతుల్య కంచిత[1]జనుస్సంసారసాఫల్యకున్. 259

మ. [2]సవరక్షార్థము దండ్రి పంపఁ జని, విశ్వామిత్రుఁడుం దోడ రా,
నవలీలం దునుమాడె రాముఁ డదయుం డై, బాలుఁ డై, కుంతల
చ్ఛవిసంపజ్జితపాటకం, గపటభాషావిస్ఫురన్నాటకన్,
జనభిన్నార్యమఘోటకం, గరవిరాజత్ఖేటకం దాటకన్. 260

క. గారామునఁ గౌశికమఖ-మా రాముఁడు గాచి, దైత్యు, నధికు, సుబాహున్
ఘోరాజిఁ ద్రుంచి, తోలెను-మారీచున్, నీచుఁ, గపటమంజులరోచున్. 261

మ. ఒకమున్నాఁడు గదల్చి తెచ్చిన లలాటోగ్రాక్షుచాపంబు, బా
లకరీంద్రంబు సలీలమైఁ జెఱకుఁగోలం ద్రుంచుచందంబునన్
సకలోర్వీశులుఁ జూడఁగా విఱిచె [3]దోశ్శక్తిన్ విదేహక్షమా
పకగేహంబున సీతకై, గుణమణి ప్రస్ఫీతకై లీలతోన్. 262

క. భూతలనాథుఁడు రాముఁడు-ప్రీతుండై పెండ్లి యాడెఁ బృథుగుణమణిసం
ఘాతన్, భాగ్యోపేతన్, సీతన్-ముఖకాంతివిజితసితఖద్యోతన్. 263

క. రాముఁడు నిజబాహుబల-స్థేమంబున భంగపఱిచె దీర్ఘకుఠారో
ద్దామున్, విదళీకృతనృప-భామున్, రణరంగభీము భార్గవరామున్. 264

క. దశరథుఁడు మున్ను గైకకు-వశుఁడై, తా నిచ్చినట్టివరముకతన, వా
గ్దశ సెడక, యడవి కనిచెను-దశముఖముఖకమలతుహినధామున్ రామున్.

క. జనకుఁడు పనిచిన మే లని-జనకజయును, లక్ష్మణుండు, సంసేవింపన్
జనపతి రాముఁడు విడిచెను-జనపాలారాధ్య, [4]ద్విషదసాధ్య, నయోధ్యన్. 266

---

1. పుట్టుక, 2. యజ్ఞమును రక్షించుటకు. 3. భుజబలముచే. 4. శత్రువుల కసాధ్యమయినది.

క. భరతుఁ, నిజపదసేవా-నిరతుఁ రాజ్యమున నునిచి, నృపమణి యెక్కెఁ
సురుచిరరుచిపరిభావిత-గురుగోత్రాచలముఁ జిత్రకూటాచలమున్. 267

ఉ. పుణ్యుఁడు రామచంద్రుఁ డట వోయి, ముదంబునఁ గాంచె దండకా
రణ్యము, దాపసోత్తమశరణ్యము, నుద్ధతబర్హిబర్హలా
వణ్యము, గౌతమీవిమలవారికణపర్యటనప్రభూతసా
ద్గుణ్యము, నుల్లసత్తరునికుంజవరేణ్యము నగ్రగణ్యమున్. 268

సీ. అవనంబున రాముఁ డనుజసమేతుఁ డై, సతితోడ నాకపర్ణశాల నుండ,
రావణుచెల్లెలు రతిఁ గోరి వచ్చిన, మొగి లక్ష్మణుఁడు దానిముక్కుఁ గోయ,
నది విని, ఖరదూషణాదులు పదునాల్గువేలు వచ్చిన, రామవిభుఁడు గలన
బాణానలంబున భస్మంబు గావింప, జనకనందనమేనిచక్కఁదనము

తే. విని దశగ్రీవుఁ డంగజవివశుఁ డగుచు-నర్థిఁ బంచినఁ [1]బసిఁడిఱ్ఱి యై నటించు
నీచు, మారీచు రాముఁడు నెఱి వధించె;-నంతలో సీతఁ గొనిపోయె నసురవిభుఁడు.

ఉ. ఆయసురేశ్వరుండు వడి నంబరవీథి నిలాతనూజ న
న్యాయము సేసి, నిష్ఠురుఁ డై కొనిపోవఁగ, నడ్డ మైన ఘో
రాయతహేతిఁ ద్రుంచె, నసహాయత రామనరేంద్రకార్యద
త్తాయువుఁ, బక్షవేగపరిహాసితవాయువు నజ్జటాయువున్. 270

వ. అంత నా రామచంద్రుండు లక్ష్మణసహితుం డై, సీత వెదక నరుదెంచి, నిజకార్యనిహతుం డైన జటాయువునకుఁ బరలోకక్రియలు గావించి, ఋశ్యమూకంబునకుం జని. 271

క. "[2]నిగ్రహము నీకు వల; దిఁక-నగ్రజు వాలిఁ వధింతు" నని నియమముతో
నగ్రేసరుఁ గా నేలెను-సుగ్రీవుం జరణఘాతచూర్ణగ్రావున్. 272

క. లీలన్, రామవిభుం డొక-కోలం గూలంగ నేసె గురునయశాలిన్,
శీలిన్, సేవితశూలిన్-మాలిన్, వాలిన్ దశాస్యమానోన్మూలిన్. 273

క. ఇలమీఁద సీత వెదకఁగ-నలఘుఁడు రాఘవుఁడు పనిచె హనుమంతు, నతి
చ్ఛలవంతున్, మతిమంతున్-బలవంతున్, శౌర్యవంతుఁ, బ్రాభవవంతున్. 274

క. అలవాటుకలిమి మారుతి-లలితామితలాఘవమున లంఘించెను "[3]శై
వలినీగణసంబంధిన్-జలపూరితధరణిగగనసంధిం, గంధిన్. 275

వ. అట్లు సముద్రంబు దాఁటి, సీతం గని, హనుమంతుండు దిరిగి చనుదెంచుచు, నక్షకుమారాదుల వధియించి. 276

1. బంగారుజింక. 2. శిక్షణము. 3. నదులయొక్క సముదాయముయొక్క సంబంధము కలది.

క. సముదగ్రత ననిలసుతుం-డమరాహితదత్తవాలహవ్యాశనుల, భ
స్మము సేసె [1]నిరాతంకన్-సమదాసురసుభటవిగతశంకన్, లంకన్. 277

వ. ఇట్లు లంకాదహనంబు సేసి వచ్చి, వాయుజుండు సీతాకథనంబు సెప్పిన, విని, రామచంద్రుఁడు వనచరనాథయూథంబులుం దానును జని చని. 278

శా. ఆరాజేంద్రుఁడు గాంచె. భూరివిధరత్నాగారమున్, మీనకుం
భీరగ్రాహకఠోరమున్, విపులగంభీరంబు, నభ్రభ్రమ
ద్ఘోరాన్యోన్యవిభిన్నభంగభవనిర్ఘోషచ్ఛటాంభఃకణ
ప్రారుద్ధాంబరపారమున్ లవణపారావారముం, జేరువన్. 279

వ. కని, తనకుఁ "ద్రోవ యి"మ్మని వేఁడిన, నదియు మార్గంబు సూపక, మిన్నందిన నా రాచపట్టి రెట్టించినకోపంబున. 280

క. మెల్లనినగవున నయనము-లల్లార్చి, శరంబు విల్లు నందినమాత్రన్,
గుల్లలు, నాఁచులుఁ, జిప్పలుఁ-బెల్లలు నై, జలధి పెద్దబీ డై యుండెన్. 281

వ. ఇట్లు విపన్నుం డగు సముద్రుండు నదులతోఁ గూడి, మూర్తిమంతుం డయి చనుదెంచి, రామచంద్రునిచరణంబులు శరణంబుఁ జొచ్చి, యిట్లని స్తుతియించె. 282

శా. "ఓ కాకుత్స్థకులేశ! యోగుణనిధీ! యోదీనమందార! నే
నీకోపంబున కెంతవాఁడ? [2]జడధిన్; నీ వేమి భూరాజవే?
లోకాధీశుఁడ; వాదినాయకుఁడ; వీ లోకంబు లెల్లప్పుడున్
నీకుక్షిం బ్రభవించు; నుండు; నడఁగున్, నిక్కంబు సర్వాత్మకా! 283

క. ధాతల రజమున, దేవ-వ్రాతము సత్త్వమున, భూతరాశిఁ దమమునన్,
జాతులఁగా నొనరించు గు-ణాతీతుఁడ వీవు; గుణగణాలంకారా! 284

క. కట్టుము సేతువు; లంకం-జుట్టుము, నీబాణవహ్ని సురవైరితలల్
గొట్టుము నేలం బడఁ; జే-పట్టుము నీయబల, నధికభాగ్యప్రబలన్. 285

ఆ. హరికి మామ నగుదు; నటమీఁద శ్రీదేవి-తండ్రి; నూర కేల? తా గడింపఁ
గట్టఁ గట్టి, దాఁటు; కమలాప్తకులనాథ!-నీయశోలతలకు నెలవుగాఁగ." 286

వ. అని విన్నవించిన, రామచంద్రుండు సముద్రునిం "బూర్వప్రకారంబున నుండు పొ"మ్మని వీడుకొల్పె; నంత. 287

క. ఘనశైలంబులుఁ దరువులు, ఘనజవమునఁ బెఱికి తెచ్చి, కపికులనాథుల్
ఘనజలరాశిం గట్టిరి-ఘనవాహప్రముఖదివిజగణము నుతింపన్. 288

---

1. భయములేనిది. 2. మందబుద్ధిగలవానివి, జలస్వరూపముకలవానిని. 3. ఇంద్రుఁడు.

వ. ఇట్లు సముద్రంబు దాఁటి, రామచంద్రుండు రావణానుజన్ముండైన విభీషణుండు శరణంబు వేఁడిన, నభయం బిచ్చి, కూడుకొని లంకకుఁ జని, విడిసి, వేడెపెట్టించి, లగ్గలు పట్టించిన. 289

సీ. ప్రాకారములు ద్రవ్వి, పరిఖలు పూడిచి, కోటకొమ్మలు నేలఁ గూలఁద్రోచి,
[1]వప్రంబు లగలించి, వాకిళ్లు వెకలించి, తలుపులు విఱిచి, యంత్రములు చెఱిచి,
ఘనవిటంకంబులు ఖండించి పడవైచి, గోపురంబులు నేలఁ గూలఁ దన్ని,
మకరతోరణములు మహిఁ గూల్చి, కేతనంబులు చించి, సోపానములు గదల్చి,
ఆ. గృహములెల్ల వ్రచ్చి, గృహరాజముల [2]గ్రొచ్చి-[3]భర్మకుంభచయము పాఱవైచి,
కరులు కొలను సొచ్చి, కలఁచినక్రైవడిఁ-గపులు లంకఁజొచ్చి కలఁచి; రపుడు.

వ. అంత నయ్యసురేంద్రుండు పంచినఁ గుంభ నికుంభ ధూమ్రాక్ష విరూపాక్ష సురాంతక నరాంతక దుర్ముఖ ప్రహస్త మహాకాయ ప్రముఖులగుదనుజవీరులు శరశరాసనతోమరగదాఖడ్గశూలభిందిపాలపరశుపట్టిసప్రాసముసలాది సాధనంబులు ధరియించి, మాతంగతురంగస్యందనసందోహంబుతో బవరంబు సేయ, సుగ్రీవ పవనతనయ పనస గజ గవయ గంధమాదన నీలాంగద కుముద జాంబవదాదు లారక్కసుల నెక్కటికయ్యంబులందుఁ దరుల గిరులఁ గరాఘాతంబుల నుక్కడంచి, త్రుంచి; రంత. 291

క. ఆయెడ లక్ష్మణుఁ డుజ్జ్వల-సాయకములఁ ద్రుంచె శైలసమకాయు, సురా
జేయు, ననర్గళమాయో-పాయున్, నయగుణవిధేయు నయ్యతికాయున్. 292

ఆ. రామచంద్రవిభుఁడు రణమున ఖండించె-మేటికడిమి నీలమేఘవర్ణు,
బాహుశక్తిపూర్ణుఁ, బటుసింహనాదసం-కుచితదిగిభకర్ణుఁ గుంభకర్ణు. 293

క. అలవున లక్ష్మణుఁడాజి-స్థలిఁ గూల్చెన్ మేఘనాదుఁ, జటులాహ్లాదున్,
బలభేదిజయవినోదున్-బలజనిత[4]సుపర్వసుభటభావవిషాదున్. 294

వ. అంత. 295

క. తనవారందఱు మ్రగ్గిన-ననిమిషపతివైరి పుష్పకారూఢుండై
యనికి నడచి, రామునితో-ఘనరౌద్రముతోడ నంపకయ్యము సేసెన్. 296

వ. అయ్యవసరంబున. 297

క. సురపతిపంపున మాతలి-గురుతర మగుదివ్యరథముఁ గొని వచ్చిన, నా
ధరణీవల్లభుఁ డెక్కెను-ఖరకరుఁ డుదయాద్రి నెక్కుకైవడి దోఁపన్. 298

వ. ఇట్లు దివ్యరథారూఢుండయి, రామచంద్రుండు రావణున కిట్లనియె. 299

1. కోటలు. 2. త్రవ్వి. 3. బంగారు కలశముల సముదాయము. 4. దేవతలు.

మ. "చపలత్వంబున డాఁగి, హేమమృగమున్ సంప్రీతిఁ బుత్తెంచుటో?
కపటబ్రాహ్మణమూర్తివై, యబల నా కాంతారమధ్యంబునం
దపలాపించుటయో? మదీయశితదివ్యామోఘబాణాగ్నిసం
తపనం బేగతి నోర్చువాఁడవు? దురంతం బెంతయున్ రావణా! 300

క. నీచేసినపాపములకు-నీచాత్మక! యముఁడు వలదు; నేఁ డిట నా నా
రాచములఁ ద్రుంచి వైచెద-ఖేచరభూచరులు గూడి క్రీడం జూడన్." 301

వ. అని పలికి. 302

మ. బలువింటన్ ¹గుణటంకృతంబు నిగుడన్, బ్రహ్మాండభీమంబుగాఁ
బ్రళయోగ్రానలసన్నిభంబగు మహాబాణంబు సంధించి, రా
జలలాముం డగు రాముఁ డేసె, ఖరభాసాశ్రావణున్, దేవతా
బలవిద్రావణు, వైరిదారజనగర్భస్రావణున్, రావణున్. 303

క. దశరథసూనుం డేసిన-విశిఖము హృదయంబుఁ దూఱ, వినశుండగుచున్
దశకంధరుండు గూలెను-దశవదనంబులను రక్తధారలు దొరఁగన్. 304

వ. అంత నా రావణుండు దెగుట విని. 305

సీ. కొప్పులు బిగి వీడి, కుసుమమాలికలతో నంసభాగంబుల నావరింప,
సేసముత్యంబులు సెదరఁ, ²గర్ణికలూడఁ, గంఠహారంబులు గ్రందుకొనఁగ,
వదనపంకజములు వాడి, వాతెఱ లెండఁ. గన్నీళ్ళ నఱుక లంగములు దడుప,
సన్నపునడుములు జవ్వాడఁ, జాలిండ్లబరువులు నడుములఁ బ్రబ్బికొనఁగ,
ఆ. నెత్తి మోఁదికొనుచు నెఱిఁ బయ్యెదలు జాఱ-నట్టు నిట్టుఁ దప్పటడుగులిడుచు,
నసురసతులు వచ్చిరట భూతవేతాళ-సదనమునకు, ఘోరకదనమునకు. 306

వ. ఇట్లు వచ్చి, తమతమనాథులం గని, శోకించి; రందు మందోదరి రావణుం
జూచి యి ట్లనియె. 307

ఉ. "హా దనుజేంద్ర! హా సురగణాంతక! హా హృదయేశ! నిర్జరేం
ద్రాదుల గెల్చి, నీవు కుసుమాస్త్రునికోలల కోర్వలేక, సో
న్మాదమునన్ రఘుప్రవరుమానిని నేటికిఁ దెచ్చి? తప్పు డేఁ
"గా"దని చెప్పినన్ వినక కాలవశంబును బొంది; తక్కటా! 308

ఆ. ఎండఁ గాయ వెఱచు నినుఁడు; వెన్నెలగాయ-వెఱచు విధుఁడు; గాలివీవ వెఱచు
లంకమీఁద; నిట్టి లంకాపురికి, మాకు-నధిప! విధవభావ మడరె నేఁడు. 309

క. దురితముఁ దలఁపరు; గానరు;-జరుగుదు రెట్లైన నిమిషసౌఖ్యంబులకై;
పరవనితాసక్తులకును-బరధనరక్తులకు నిహముఁ బరముం గలదే?" 310

---

1. అల్లెత్రాటియొక్క ధ్వని. 2. చెవులకుఁ బెట్టుకొన్న సొమ్ములు.

వ. అని విలపింప, నంత విభీషణుండు రామచంద్రునిపంపు వడసి, రావణునకు దహనాదిక్రియలు గావించె; నంత రాఘవేంద్రుండు నశోకవనంబున కేఁగి, శింశుపా తరుసమీపంబునందు. 311

శా. దైతేయప్రమదాపరీత, నతిభీత, గ్రంథిబంధాలక
వ్రాతన్, నిశ్శ్వసనానిలాశ్రుకణజీవంజీవదారామభూ
జాతన్, శుష్కకపోలకీలితకరాబ్జాతం, బ్రభూతం, గృశీ
భూతం, బ్రాణసమేత, సీతఁ గనియెన్ భూమీశుఁ డామ్ముందటన్. 312

వ. కని రామచంద్రుండును దాపంబు నొంది, భార్యవలన దోషంబు లేకుండుట వహ్నిముఖంబునం బ్రకటంబు సేసి, దేవతలపంపున దేవిం జేకొని. 313

ఉ. శోషితదానవుండు నృపసోముఁడు రాముఁడు, "రాక్షసేంద్రతా
శేషవిభూతిఁ [1]కల్పసమజీవివి గమ్మ"ని నిల్పె నర్థిసం
తోషణుఁ, బాపశోషణు నదూషణు, శశ్వదరోషణున్, మితా
భాషణు, నార్యపోషణుఁ, గృపాగుణభూషణు నవ్విభీషణున్. 314

వ. ఇట్లు విభీషణసంస్థాపనుండై, రామచంద్రుండు సీతాలక్ష్మణసమేతుండై, సుగ్రీవ హనుమదాదులం గూడికొని, పుష్పకారూఢుండై, వేల్పులు గురియుపువ్వుల [2]సోనలం దడియుచుఁ, దొల్లి వచ్చిన తెరువుజాడలు సీతకు నెఱిఁగించుచు, మరలి నందిగ్రామంబునకు వచ్చె; నయ్యవసరంబున. 315

ఆ. రామచంద్రవిభునిరాక వీనుల విని-భరతుఁ డుత్సహించి, పాదుకలను
మోచికొనుచు వచ్చి, ముదముతోఁ బురజను-లెల్లఁ గొలువ నన్న కెదురువచ్చె.

వ. వచ్చి, పాదుకల ముందట నిడికొని, యెడ నెడ సాష్టాంగదండప్రణామంబులు సేయుచు, మెల్లన డాసి, రామచంద్రునిపాదంబులు దన నొసలం గదియించి, తచ్చరణ రేణువులు దుడిచి, శిరంబునం జల్లికొని, తనివి సనక, మఱియు నప్పదకమలంబు లక్కున మోపికొనుచు, సంతసపుఁగన్నీటం గడిగి, సేమంబు లరయుచుండె; నంత సీతాలక్ష్మణసహితుండై విభుండును దనకెదురు వచ్చిన బ్రాహ్మణజనంబులకు నమస్కరించి, తక్కినవారలచేత మన్ననలు వొంది, వారల మన్నించె; నయ్యవసరంబున. 317

చ. "నృపవర! పెక్కునాళ్లగొలె నిన్ గన కుండినయట్టినేఁడు మా
తపములు పండె; నిండఱము ధన్యుల మైతి" మటంచుఁ బుట్టముల్
చపలతఁ ద్రిప్పి, పువ్వులవసంతము లాడుచుఁ, బాడుచున్, గత
త్రపు లయి యాడుచుం, బ్రజలు దద్దయుఁ బండుగు సేసి రెల్లెడన్. 318

1. ప్రళయకాలమువఱకును జీవించునట్టి వాఁడవు. 2. వాన.

సీ. కవ గూడి యిరుదెసఁ గపిరాజు రాక్షసరాజు, నొక్కటఁ జామరములు వీవ,
హనుమంతుఁ డతిధవళాతపత్త్రముఁ బట్టఁ, బాదుకల్ భరతుండు భక్తిఁ దేర,
శత్రుఘ్నుఁ డమ్ములుఁజాపంబుఁ గొనిరాఁగ, సౌమిత్రి భృత్యుఁడై చనవుసూప,
జలపాత్రచేఁబట్టి జనకజ గూడిరాఁ, గాంచనఖడ్గ మంగదుఁడు మోవఁ,
ఆ. [1]బసిఁడికేడె మర్థి భల్లూకపతి మోచి
కొలువఁ, బుష్పకంబు వెలయ నెక్కి-
గ్రహము లెల్లఁ గొలువఁ, గడు నొప్పు సంపూర్ణ
చంద్రుపగిది రామచంద్రుఁ డొప్పె. 319

వ. ఇట్లు పుష్పకారూఢుం డై కపిబలంబులు సేరి కొలువ, శ్రీరాముం డయోధ్యకుం జనియె; నంతకు మున్న యప్పురంబునందు. 320

సీ. వీథులు సక్కఁగ గావించి, తోయంబులు సల్లి, [2]రంభాస్తంభచయము నిలివి,
పట్టుఁజీరలు సుట్టి, బహుతోరణంబులుఁ [3]గలువడంబులుఁ మేలుకట్లుఁ గట్టి,
వేదిక లలికించి, వివిధరత్నంబుల ముగ్గులు పలుచందములుగఁ బెట్టి,
కలయ గోడల రామకథ లెల్ల వ్రాయించి, ప్రాసాదముల దేవభవనములను
తే. గోపురంబుల బంగారుకుండ లెత్తి-యెల్లవాకిండ్లఁ గానిక లేర్పరించి,
జనులుగై సేసి,తూర్యఘోషములతోడ-నెదురునడ తెంచి, రాఘవేంద్రుకడకు.

క. సమదగజదానధారల-[4]దుమదుమలై యున్న పెద్దత్రోవలతోడన్
రమణీయ మయ్యె, నప్పురి-రమణుఁడు వచ్చినఁ గరంగురమణియపోలెన్. 322

ఆ. రామభూవరేంద్రురాకఁ దూర్యములతో-రథగజాశ్వసుభటరాజితోడ,
నమరెఁ బురము, చంద్రుఁ డరుదేర ఘూర్ణిల్లు-జంతుభంగమిళితజలధిభంగి.

వ. ఇట్లొప్పుచున్న యుప్పురంబు ప్రవేశించి, రాజమార్గంబున రామచంద్రుం డరుగుచున్నసమయంబున. 324

మ. "ఇతఁడే రామనరేంద్రుఁ; డీయబల కా యింద్రారి ఖండించె; న
ల్లతఁడే లక్ష్మణుఁ; డాతఁడే కపివరుం; డాపొంతవాఁడే మరు
త్సుతుఁ; డా చెంగట నా విభీషణుఁ" డటంచుం జేతులం జూపుచున్
సతు లెల్లం బరికించి, చూచిరి పురీసౌధాగ్రభాగంబులన్. 325

వ. ఇట్లు సమస్తజనంబుఁ జూచుచుండ, రామచంద్రుండు రాజమార్గంబునం జని చని. 326

సీ. పటికంపుగోడలుఁ, బవడంపువాకిండ్లు, నీలంపుటరుఁగులు, నెఱయఁ గలిగి
కమనీయవైడూర్యక స్తంభచయముల మకరతోరణముల మహితమగుచుఁ,

1. బంగారుడాలు. 2. అరఁటిస్తంభముల సముదాయము. 3. కలువపూలదండలు. 4. బురదగలిగి.

బడగల మాణిక్యబద్ధచేలంబులఁ, జిగురుఁదోరణములఁ జెలువు మీఱి,
పుష్పదామకముల, భూరివాసనలను, బహుతరధూపదీపముల మెఱసి,
తే. మాఱువేల్పులభంగిని మలయుచున్న-సతులఁ బురుషులు నెప్పుడు సందడింప,
గుఱుతు లిడరాని ధనములకుప్పలున్న-రాజసదనంబునకు వచ్చె రామవిభుఁడు.

వ. ఇట్లు వచ్చి. 328

ఉ. తల్లుల కెల్ల మ్రొక్కి, తనతల్లికి వందన మాచరించి, య
ల్లల్లబుధాళికిన్ వినతుఁడై, చెలికాండ్రను దమ్ములం [1]బ్రసం
పుల్లతఁ గౌఁగిలించుకొని, భూవరుఁ డోలిఁ గృపారసంబు రం
జిల్లఁగఁ, జాల మన్ననలు సేసె సమాత్యులఁ బూర్వభృత్యులన్. 329

వ. తత్సమయంబునఁ దల్లులు. 330

చ. కొడుకులఁ, బెద్దకోడలును, గొబ్బున మ్రొక్కిన నెత్తి, చేతులం
బుడుకుచు, మోములుం, దలలు బోరన ముద్దులుగొంచు, నవ్వుచుం
దొడలకు వారి రాఁ దిగిచి, తోఁగఁగఁ జేసిరి "నేత్రధారలన్
వెడలినప్రాణముల్ దగఁ బ్రవిష్టము లయ్యె" నటంచు నుబ్బుచున్. 331

వ. అంత వసిష్ఠుం డరుగుదెంచి, శ్రీరామచంద్రునిజటాబంధంబు విడిపించి, కుల
వృద్ధులుం దానును, [2]సమంత్రకంబుగ దేవేంద్రుని మంగళస్నానంబు సేయించు
బృహస్పతి చందంబున, సముద్రనదీజలంబుల నభిషేకంబు సేయించె; రఘు
వరుండును సీతాసమేతుం డై, జలకంబు లాడి, మంచిపుట్టంబులు గట్టికొని,
కమ్మనిపువ్వులు దుఱిమి, సుగంధంబు లలందికొని, తొడవులు దొడిగికొని, తనకు
భరతుండు సమర్పించిన రాజసింహాసనంబునం గూర్చుండి, యతని మన్నించి,
కౌసల్యకుఁ బ్రియంబు సేయుచు జగత్పూజ్యంబుగ రాజ్యంబు సేయుచుండె;
నప్పుడు. 332

సీ. కలఁగు టెల్లను మానెఁ గంధులేడింటికిఁ; జలనంబు మానె భూచక్రమునకు;
జాగరూకత మానె జలజలోచనునకు; దీనభావము మానె దిక్పతులకు;
మాసియుండుట మానె మార్తాండవిధులకుఁ; గావిరి మానెఁ దిగ్గగనములకు;
నుడిగి పోవుట మానె నుర్వీరుహంబుల; కడఁగుట మానెఁ [3]ద్రేతాగ్నులకును;
ఆ. [4]గడిఁదివ్రేఁగు మానెఁ గరిగిరికిటినాగ-కమఠములకుఁ; బ్రజలకలఁక మానె;
రామచంద్రవిభుఁడు రాజేంద్రరత్నంబు-ధరణిభరణరేఖఁ దాల్చునపుడు. 333

వ. మఱియును. 334

---

1. మిక్కిలి వికసించినభావముతో. 2. మంత్రములతోఁగూడ. 3. ఆహవనీయము - గార్హ
పత్యము, దక్షిణాగ్ని. 4. అధికమయిన బరువు.

సీ. పొలఁతులవాలుచూపులయంద చాంచల్య; మబలలనడుములయంద లేమి;
కాంతాలకములంద కౌటిల్యసంచార; మతివలనడకలయంద జడిమ;
ముగుదలపరిరంభములయంద పీడన; మంగనాకుచములయంద పోరు;
పడఁతులరతులంద బంధసద్భావంబు; సతులఁ బాయుటలంద సంజ్వరంబు;
తే. ప్రియులు ప్రియురాండ్ర మనముల బెరసి ¹కూర్పు
లంద చౌర్యంబు; వల్లభు లాత్మసతుల
నాఁగి క్రొమ్ముళ్లు వట్టులం దక్రమంబు;
రామచంద్రుఁడు పాలించు రాజ్యమందు. 335

క. తండ్రిక్రియ రామచంద్రుఁడు-దండ్రుల మఱపించి, ప్రజలఁ దా రక్షింపం
దండ్రుల నందఱు మఱచిరి-"దండ్రి గదా! రామచంద్రధరణిపుఁ" డనుచున్.

వ. మఱియు నారామచంద్రుఁడు, రాజర్షిచరితుండును, నిజధర్మనిరతుండును, నేక
పత్నీవ్రతుండును, సర్వలోకసమ్మతుండును నగుచు ధర్మవిరోధంబు గాకుండఁ
గోరిక లనుభవించుచుఁ, ద్రేతాయుగం బైనఁ గృతయుగధర్మంబుఁ గావిం
చుచు, బాలమరణంబు మొదలగు నరిష్టంబులు ప్రజలకుఁ గలుగకుండ
రాజ్యంబు సేయుచుండె; నయ్యెడ. 337

ఆ. సిగ్గు వడుట గల్గి, సింగారమును గల్గి,-భక్తి గల్గి, చాల భయముఁ గల్గి,
నయముఁ బ్రియముఁ గల్గి, నరనాథుచిత్తంబు-సీత దనకు వశము సేసికొనియె."

వ. అనిన విని పరీక్షిన్నరేంద్రుం డి ట్లనియె. 339

ఆ. "భ్రాతృజనులయందు, బంధువులందును-బ్రజలయందు, రాజభావ మొంది
యెట్లు మెలఁగె? రాఘవేశ్వరుం డెవ్వనిఁ-గూర్చి క్రతువు లెట్లు గోరి చేసె?"

వ. అనిన శుకుం డి ట్లనియె. 341

సీ. "భగవంతుఁ డగురామభద్రుండు ప్రీతితో దేవోత్తముని సర్వదేవమయునిఁ
దనుఁ దాన కూర్చి, యధ్వరములు సేసెను; హోతకుఁ దూరుపు, నుత్తరంబు
సామగాయకునికి; శమనదిగ్భాగంబు బ్రహ్మకుఁ, గ్రమమునఁ బడమ రెల్ల
నధ్వర్యునకు, శేష మాచార్యునకు నిచ్చి, సొమ్ములఁ బంచి, భూసురుల కొసఁగి
తే. తనదు రెండు ²పుట్టంబులుఁ, దనకు నయిన-మేలఁతమంగళసూత్రంబు మినుకుఁ దక్క-
వినతుఁడై యుండె; నా రాము వితరణంబు-పాండవోత్తమ! యేమని పలుకవచ్చు?

వ. అంత నా రామచంద్రునిదానశీలత్వంబునకు మెచ్చి, విప్రవరులు దమతమభూ
ములు మరల నిచ్చి, యి ట్లనిరి. 343

1. కూర్చుటలు. 2. వస్త్రము.

ఆ. "ధరణి వలదు; మాకుఁ దపసుల కేల? స-కలలోకగురుఁడ వైన నీవు;
మామనంబులందు ¹మలయుచీఁకటిఁ బాపు-భవముదారకుచులఁ బార్థివేంద్ర!"

వ. అని పలికి, బ్రహ్మణ్యదేవుం డైన రామచంద్రుని వినయోక్తులం బూజించి, మునులు సని; రిట్లు పెద్దకాలంబు రాజ్యంబు సేసి, రాఘవేంద్రుం డొక్కదినంబున.

సీ. వసుధపైఁ బుట్టెడు వార్త లాకర్ణించుకొఱకు నై, రాముండు గూఢవృత్తి
నడురేయి దిరుగుచో, నాగరజనులలో నొక్కఁడు దనసతి నొప్పకున్న,
"నొరునింటఁ గాపురం బున్న చంచలురాలిఁ బాయంగ లేక, చేపట్ట నేమిఁ?
తా వెఱ్ఱి యగురామధరణీశ్వరుండనే? బేల! పో" మ్మనుమాట బిట్టు వలుక,

ఆ. నాలకించి, మఱియు నామాట చారుల-వలన జగములోనఁ గలుగఁ దెలిసి,
సీత నిద్రపోవఁ, జెప్పక వాల్మీకి-పర్ణశాలఁ బెట్టఁ బనిచె రాత్రి. 346

వ. అంత సీతయు గర్భిణి గావునఁ గుశలవు లనియెడి కొడుకులం గనియె; వారికి వాల్మీకి జాతకర్మంబు లొనరించె; లక్ష్మణునకు నంగదుండును, జంద్రకేతుండును; భరతునకు దక్షుండును, బుష్కలుండును, శత్రుఘ్ననకు సుబాహుండును, శ్రుతసేనుండును సంభవించి; రయ్యెడ. 347

క. ²బంధురబలుఁ డగు భరతుఁడు-గంధర్వచయంబుఁ ద్రుంచి కనకాదుల స
ద్బంధుఁ డగు నన్న కిచ్చెను-బంధువులును మాతృజనులుఁ బ్రజలుఁ మెచ్చన్.

ఆ. మధువనంబులోన మధునందనుండగు-లవణుఁ జంపి, భుజబలంబు మెఱసి,
మధుపురంబు సేసె ³మధుభాషి శత్రుఘ్నుఁ-డన్న రామచంద్రుఁ "డౌ" ననంగ.

వ. అంతఁ గొంతకాలంబునకు రామచంద్రుని కొమారు లయిన కుశలవు లిద్దఱును, వాల్మీకివలన వేదాదివిద్యలయందు నేర్పరు లై, పెక్కుసభల సుతానంబుగా రామకథాశ్లోకంబులు పాడుచు, నొక్కనాఁడు రాఘవేంద్రుని యజ్ఞశాలకుం జని. 350

మత్తకోకిలము. వట్టిమ్రాకులు పల్లవింప, నవారి యై మధుధార దా
నుట్టఁ బాడిన, వారిపాటకు నుర్వరాధిపుఁడుం బ్రజల్
బిట్టు సంతస మంది; రయ్యెడఁ బ్రీతిఁ గన్నులబాష్పముల్
దొట్ట, నొదల లూఁచి, వారలతోడమక్కువ పుట్టఁగాన్. 351

వ. అంత నా రామచంద్రుండు కుమారుల కి ట్లనియె. 352

ఆ. "చిన్నియన్నలార! శీతాంశుముఖులార!-నళినదళవిశాలనయనులార!
మధురభాషులార! మహిమీఁద నెవ్వరు-దల్లి!, దండ్రి మీకుఁ ధన్యులార! 353

1. వ్యాపించు. 2. అధికమయిన బలముగలవాఁడు. 3. మధురముగ మాటలాడువాఁడు.

వ. అనిన వార "లేము వాల్మీకిపౌత్రులము; రాఘువేశ్వరుని యాగంబు సూడ వచ్చితి" మనవుడు మెల్లన నగి, "యెల్లిప్రొద్దున మీ తండ్రి నెఱింగెద; రుండుం"డని యొక్క నివాసంబునకు సత్కరించి, పనిచె; మఱునాఁడు సీతం దోడ్కొని, కుశలవుల ముందట నిడుకొని, వాల్మీకి వచ్చి రఘుపుంగవునిం గని, యనేక ప్రకారంబుల వినుతించి యి ట్లనియె. 354

ఆ. "సీత [1]ముద్దరాలు; చిత్తవాక్కర్మంబు-లందు సత్యమూర్తి; యమలచరిత;
పుణ్య సాధ్వి విడువఁబోలదు; చేకొను-రవికులాబ్ధిచంద్ర! రామచంద్ర!" 355

వ. అని వాల్మీకి వలుక, రామచంద్రుండు పుత్రార్థియై విచారింపఁ గుశలవులను వాల్మీకికి నొప్పగించి, రామచంద్రచరణధ్యానంబు సేయుచు నిరాశయై సీత భూవివరంబు సొచ్చె; నయ్యెడ. 356

మ. "ముదితా! యేటికిఁ గ్రుంకి తీవు? మనలో మోహంబు చింతింపవే?
వదనాంభోజము సూపవే? మృదువు నీవాక్యంబు విన్పింపవే?
తుది సేయందగ దంచు నీశ్వరుఁడు నై దుఃఖించె భూపాలుఁ;డా
పద గాదే? ప్రియురాలిఁ బాసినయెడన్ భావింప నెవ్వారికిన్? 357

వ. అని వగచి రామచంద్రుండు బ్రహ్మచర్యంబు ధరియించి, పదుమూఁడువేల యేం డ్లెడ తెగకుండ నగ్నిహోత్రంబులు సెల్లించి, తా నీశ్వరుండు గావునఁ దన [2]మొదలినెలవునకుం జనియె; నివ్విధంబున. 358

ఆ. ఆదిదేవుఁ డైన యారామచంద్రుని-కబ్ధి గట్టు టెంత? యసురకోటిఁ
జంపు టెంత? కపులసాహాయ్యమది యెంత?,సురలకొఱకుఁ గ్రీడ సూపెఁగాక;

చ. వశుఁడుగ మ్రొక్కెదన్, లవణవార్ధివిజృంభణతానివర్తికిన్,
దశదిగధీశమౌళిమణిదర్పణమండితదివ్యకీర్తికిన్,
దశశతభానుమూర్తికి, సుధారుచిభాషికి, సాధుపోషికిన్,
దశరథరాజుపట్టికిని, దైత్యపతిం బొరిగొన్న జెట్టికిన్. 360

ఉ. నల్లనివాఁడు, పద్మనయనంబులవాఁడు, [3]మహాశుగంబులున్
విల్లును దాల్చువాఁడు, గడు విప్పగువక్షమువాఁడు, మేలు పైఁ
జల్లెడువాఁడు నిక్కిన భుజంబులవాఁడు, యశంబు దిక్కులం
జల్లెడువాఁడు నైన రఘునత్తముఁ డిచ్చుత మా కభీష్టముల్. 361

ఆ. రామచంద్రుఁగూడి, రాకలఁ బోకలఁ-గదిసి తిరుగువారుఁ గన్నవారు,
నంటికొన్నవారు, నా కోసలప్రజ-లరిగి రాదియోగు లరుగుగతికి. 362

---

1. ఏమియు తెలియనిస్త్రీ, 2. మొదటిస్థానము-పరమపదము 3. గొప్పబాణములు.

క. మంతనములు సద్గతులకుఁ;-బొంతనములు ఘనము లైనపుణ్యములఁ; కిదా
నీంతనపూర్వమహాఘ[1]ని-కృంతనములు; రామనామకృతచింతనముల్. 363

వ. ఆరామచంద్రునకుఁ గుశుండును, గుశునకు నతిథియు, నతిథికి నిషధుండును, నిషధునకు నభుండును, నభునికిఁ బుండరీకుండును, బుండరీకునకు క్షేమధన్వుం డును, క్షేమధన్వునకు దేవానీకుండును, దేవానీకునకు నహీనుండును, నహీను నకుఁ బారియాత్రుండును, బారియాత్రునకు బలుండును, బలునకుఁ జలుండును, జలునకు నర్కసంభవుం డగు వజ్రనాభుండును, వజ్రనాభునకు శంఖణుండును, శంఖణునకు విధృతియు,విధృతికి హిరణ్యనాభుండును జనియించి; రతండు జైమిని శిష్యుండైన యాజ్ఞవల్క్యమునివలన నధ్యాత్మయోగంబు నేర్చి, హృదయ కలుషంబులం బాసి, యోగచర్యుం డయ్యె; నా హిరణ్యనాభునకుఁ బుష్యుండును, బుష్యునకు ధ్రువసంధియు, ధ్రువసంధికి సుదర్శనుండును, సుదర్శనునకు నగ్నివర్ణుం డును, నగ్నివర్ణునకు శీఘ్రుండును, శీఘ్రునకు మరు వనురాజశ్రేష్ఠుండును బుట్టి; రా రాజయోగి సిద్ధుం డయి కలాపగ్రామంబున నున్నవాఁడు; కలియుగాంతం బున నష్టంబయ్యెడు సూర్యవంశంబుఁ గ్రమ్మఱఁ బుట్టింపం గలవాఁ; డామరువు నకుఁ బ్రశుశ్రుకుండును, నా ప్రశుశ్రుకునకు సంధియు, నతనికి నమర్షణుం డును, నా యమర్షణునికి మహస్వంతుండును, నా మహస్వంతునకు విశ్వసాహ్వుండును, నా విశ్వసాహ్వునకు బృహద్బలుండును జనియించి; రా రాబృహద్బలుఁడు భారతయుద్ధంబున మీతండ్రి యగు నభిమన్యునిచేత హతుం డయ్యె; వినుము. 364

## భ వి ష్య ద్రా జే తి హా స ము

తే. "పరఁగ నిక్ష్వాకుఁడును బృహద్బలుఁడు మొదలుఁ
దుదయుఁ గాఁ గలరాజులఁ దోడుతోడ
నెఱుఁగఁ జెప్పితి నీవారి; నింక మీఁదఁ
బుట్టఁగలవారిఁ జెప్పెద; భూవరేంద్ర! 365

వ. అబృహద్బలునకు బృహద్రణుండును, బృహద్రణునకు నురుక్షతుండును, నాతనికి వత్సప్రీతుండును, వత్సప్రీతునకు బ్రతివ్యోముండును, బ్రతివ్యోము నకు భానుండును, భానునకు సహదేవుండును, సహదేవునకు బృహదశ్వుం డును, బృహదశ్వునకు భానుమంతుండును, భానుమంతునకుఁ బ్రతీకాశ్వుం డును, బ్రతీకాశ్వునకు సుప్రతీకుండును, సుప్రతీకునకు మేరుదేవుండును, మేరు దేవునకు సుతక్షత్రుండును, సుతక్షత్రునకు ఋక్షకుండును, ఋక్షకునకు నంత రిక్షుండును, నంతరిక్షునకు సుతపుండును, సుతపునకు నమిత్రజిత్తును, నతనికి

1. నాశనము చేయునవి. తెంచునవి.

బృహద్వాజియు, నతనికి బర్హియు, బర్హికి ధనంజయుండు, ధనంజయునకు రణం జయుండును, నతనికి సృంజయుండును, సృంజయునకు శాక్యుండును, శాక్యునకు శుద్ధాదుండును, శుద్ధాదునకు లాంగలుండును, లాంగలునకుఁ బ్రసేనజిత్తును, నతనికి క్షుద్రకుండును, క్షుద్రకునకు ఋణకుండును, ఋణకునకు సురథుండును, సురథునకు సుమిత్రుండును బుట్టుదురు; సుమిత్రునియనంతరకాలంబున సూర్య వంశంబు నశింపఁగలదు; వీరలు బృహద్బలునినుండి క్రమంబునం బుట్టంగల వార; లని చెప్పి శుకుం డి ట్లనియె. 366

సీ. ధన్యుఁడాయిక్ష్వాకుతనయుఁడౌ నిమి, యాగమాచరింపఁగఁ గోరి, యావసిష్ఠు [1]నార్త్విజ్యమునకుఁ దా నర్థింపఁ, గని యాతఁ డింద్రునిమఖము సేయింపనియ్యకొనినాఁడ; మఱి వత్తుఁ; గొదవ లేదన, వచ్చి "సంసార మెంతయుఁ జంచలంబు కాలయాపన మేల? క్రతువు సేసెద" నని యన్యఋత్విక్కుల నతఁడుగూర్చి

తే. చేయ, నింద్రునియాగంబు సెల్లఁజేసి, గురుఁడు సనుదెంచి, శిష్యుపైఁగోపమెత్తి, "యోరి! నావచ్చునందాఁక నుండవనుచు-నతని దేహంబువడుఁగాతమనిశపించె.

వ. ఇట్లు వసిష్ఠుండు శపించిన నిమియును, "వసిష్ఠుని దేహంబు వడుఁగాక" యని మరల శపియింప నవ్వసిష్ఠుండు మిత్రావరుణులవలనఁ గడపట నూర్వశికి జన్మించె; గురుశాపంబున బ్రహ్మజ్ఞాని యైన నిమి, విగతదేహుండై న, నతని దేహంబు మునీశ్వరులు గంధవస్తువులం బొదివి, దాఁచి, దొరఁకొన్న సత్త్రియాగంబు సెల్లించిరి; కడపట దేవగణంబులు మెచ్చి, వచ్చిన, వారలకు నిమిదేహంబు సూపి, "బ్రదుకం జేయుం"డనవుడు వారలు "నిమిప్రాణంబు వచ్చుంగాక!" యని పలికిన నిమి దన దేహంబు సొరనొల్లక, యి ట్లనియె. 368

మ. "అతిమోహాకులితంబు, సాంద్రమమతాహంకారమూలంబు, సం
తతనానా సుఖదుఃఖపీడిత, మనిత్యం, బిట్టిదేహంబుసం
కృతి నా కేటికి? "మీన దేహమునభంగిన్ భీతిబాహుళ్య;" మం
చితరుల్ పెద్దలు దీనిఁ జేకొనరు; సర్వేశున్ హరింగొల్చుచున్. 369

వ. అని పలికిన, నిమిమాటలు క్రమ్మఱింపనేర కశరీరులు గన్నులు దెఱచినప్పుడును మూసినప్పుడును నిమి గానవచ్చుం గాక!" యని పల్కి దేవతలు చని; రంత.

ఆ. పెద్ద లైనమునులు పృథివీస్థలికి రాజు-లేమిఁ జూచి, నిమికళేబరంబు [2]దరువ, నొకఁడుపుట్టెఁ దనయుండు; వానిని-"జనకుఁ"డనుచుఁ బలికెజగములెల్ల.

వ. మఱియు నతండు విదేహుండు గావున, వైదేహుం డనియు, మథనజాతుండు గావున మిథిలుం డనియు ననం బరఁగె; నిమ్మిథిలునిచేత నిర్మితం బయినది,

---

1. యజ్ఞమును జేయించుకార్యమునకు, 2. చిలుకఁగా.

మిథిలా నగరంబు నాఁ బరఁగె; నా జనకునకు నుదావసుండును, నుదావసునకు నందివర్ధనుండును, నందివర్ధనునకు సుకేతుండును, సుకేతునకు దేవరాతుం డును, దేవరాతునకు బృహద్రథుండును బుట్టి; రాతనికి మహావీర్యుండును, నతనికి సుధృతియు, నతనికి ధృష్టకేతుండును, నతనికిఁ హర్యశ్వుండును, నత నికి మరువును, నతనికిఁ బ్రతింధకుండును, నతనికిఁ గృతరయుండును, నతనికిఁ దేవమీఢుండును, నతనికి విధృతుండును, నతనికి మహాధృతియు, నతనికిఁ గీర్తి రాతుండును, నతనికి మహారోముండును, నతనికి స్వర్ణరోముండును, నతనికి హ్రస్వరోముండును, నతనికి సీరధ్వజుండును బుట్టిరి. 372

౩. అతఁడు మఖము సేయ నవని, దున్నింపంగ-[1]లాంగలంబుకొనను లక్షణాంగి సీత, జాత యయ్యె, [2]సీరధ్వజుం డనఁ, దానఁ జెప్పఁబడియె; ధన్యుఁ డతడు.

౫. ఆసీరధ్వజునకుఁ గుశధ్వజుండును, గుశధ్వజునకు ధర్మధ్వజుండును, ధర్మధ్వజునకు గృతధ్వజ మితధ్వజు లను రిద్దఱుఁ బుట్టి; రందుఁ గృతధ్వజునకుఁ గేశిధ్వజుం డుదయించె; నతండు తన్నుఁ దా నెఱింగెడివిద్యయందు నేర్పరియయ్యెఁ; మిత ధ్వజునకు ఖాండిక్యుం డనువాఁడు జన్మించి, తండ్రివలన [3]నెఱుక గలవాఁడై కర్మతంత్రంబు నేర్చి, కేశిధ్వజునివలన భీతుం డై యేఁగె; ఖాండిక్యునకు భాను మంతుండును, భానుమంతునకు శతద్యుమ్నుండును, శతద్యుమ్నునికి శుచియు, శుచికి సనద్వాజుండు, సనద్వాజునకు నూర్ధ్వకేతుండును, నూర్ధ్వకేతునకు నజుండును, నజునకుఁ బురుజిత్తును, గుఁరుజిత్తునకు నరిష్టనేమియు, నరిష్టనేమికి శ్రుతాయువును, శ్రుతాయువునకుఁ బార్శ్వకుండును, బార్శ్వకునకుఁ జిత్ర రథుండును, జిత్రరథునకు క్షేమాపియు, క్షేమాపికి హేమరథుండును, హేమ రథునకు సత్యరథుండును, సత్యరథునకు నుపగురుండును, నుపగురునకు నగ్ని దేవుప్రసాదంబున నుపగుర్వుండును, నుపగుర్వునకు సావనుండును, సావనునకు సువర్చసుండును గల్గి; రతండె సుభూషణుం డని వినంబడు; నాసుభూషణునకు జయుండును, జయునకు విజయుండును, విజయునకు ధృతుండును; ధృతునకు ననఘుండును, ననఘునకు వీతిహవ్యుండును, వీతిహవ్యునకు ధృతియు, ధృతికి బహుళాశ్వుండును, బహుళాశ్వునకుఁ గృతియుఁ, గృతికి మహావశియును జన్మించిరి; వీరలు "మైథిలులగు రాజు" లని చెప్పంబడుదురు; యోగీశ్వర ప్రసాదంబున గృహస్థు లై యుండియు, బంధనిర్ముక్తులై యాత్మజ్ఞానంబు గలిగి నిరంతర బ్రహ్మానుసంధానంబు సేయుచు నుండుదు" రని పలికి శుక యోగీంద్రుం డిట్లనియె. 374

1. నాఁగలి 2. నాఁగలి జెండా గలవాఁడు. 3. జ్ఞానము.

## చంద్రవంశ్య లగు రాజుల యితిహాసము

ఆ. "చంద్రగౌర మైనచంద్రవంశమునందుఁ-జంద్రకీర్తితోడ జనిత మైన
యట్టి పుణ్యమతుల నైళాదిరాజుల-నింక వినుము; మానవేంద్రచంద్ర! 375

సీ. ఒకవేయితలలతో నుండు జగన్నాథు[1]బొడ్డుఁదమ్మిని బ్రహ్మపుట్టె మొదల;
నతనికి గుణముల నతనిఁ బోలినదక్షుఁ డగునత్రి సంజాతుఁ డయ్యె; నత్రి
కడగంటిచూడ్కులఁ [2]గలువలసంగడీఁ డుదయించి, విప్రుల కోషధులకు,
నమరఁ దారాతతి, కజునిపంపున నాథుఁ డై యుండి, రాజసూయంబు చేసి,

తే. మూఁడులోకములను గెల్చి, [3]మోఁటకమునఁ
జని, బృహస్పతి పెండ్లాముఁ జారుమూర్తిఁ
దార, నిలు సొచ్చి కొనిపోయి, తన్ను గురుఁడు
వేఁడునందాఁక నయ్యింతి విడువఁడయ్యె. 376

వ. అంత వేల్పులతోడ రక్కసులకుఁ గయ్యం బయ్యె; బృహస్పతితోడి వైరంబునం జేసి, రాక్షసులుం దానును శుక్రుండు చంద్రునిం జేపట్టె, సురాచార్యునిం బోఁదోలిన, హరుండు భూతగణసమేతుం డై తన గురుపుత్త్రుం డైన బృహస్పతిం జేపట్టె; దేవేంద్రుండు సురగణంబులుం దానును, బృహస్పతికి నడ్డంబు వచ్చె; నయ్యవసరంబున బృహస్పతిభార్యానిమిత్తంబున రణంబు సురాసుర వినాశకరంబయ్యె; నాలోన బృహస్పతితండ్రి యగు నంగిరసుండు సెప్పిన విని బ్రహ్మదేవుండు వచ్చి, చంద్రునిం గోపించి, గర్భిణియైన తారను మరల నొప్పించినం జూచి, బృహస్పతి దాని కిట్లనియె. 377

ఉ. "సిగ్గొకయింత లేక, [4]వెలచేడియకైవడి ధర్మకీర్తులన్
బొగ్గులు సేసి, జారు శశిఁ బొంది, కటా! కడుపేల తెచ్చుకొం?
ఎగ్గు దలంపఁగా వలదె? యిప్పుడు గర్భము దించుకొమ్ము; నిన్
మ్రగ్గఁగఁ జేసెదం; [5]జెనఁటి! మానవతుల్ నినుఁ జూచి మెత్తురే?" 378

వ. అని కోపించుచుండ, నాచెలువకుఁ బసండిచాయమేను గల కుఱ్ఱండు పుట్టె; వానింజూచి మోహంబు సేసి, బృహస్పతి దనకొడు కనియునుం, జంద్రుండు దనకన్న వాఁ డనియుం జగడించి; రప్పుడు. 379

ఆ. వారివాదు సూచి వారింపఁగా వచ్చి, యేర్పరింప లేక, యెల్లమునులు
నమరవరుల నడుగ "నావేడుకలకత్తె-యెఱుఁగుఁగాని, యితరు లెఱుఁగ" రనిరి.

వ. ఆ పలుకులు విని, సిగ్గుపడి యున్న తారకుఁ, జిన్నికొమరుం డి ట్లనియె. 381

---

1. నాభికమలము, 2. కలువపువ్వులకుఁ జెలికాఁడు చంద్రుడు, 3. మూర్ఖబుద్ధితో, 4. బోగముదెలది. 5. దుష్టురాలు.

క. "[1]ఇలువరుస చెడఁగ, బంధులు-వల వంపఁగ, మగఁడు రోయఁ, దల్లీ! కట్టా!
వెలి నేల నన్నుఁ గంటివి? కలిగించినవాఁడు శీతకరుఁడో? గురుఁడో?" 382

వ. అని పలుకుచున్న కొడుకునకు మఱుమాట లాడనేరక, యూరక యున్న తార నేకాంతంబునకుం జీరి, మంతనంబున బ్రహ్మ యిట్లనియె. 383

మ. "చెలువా! నీ[2]వెలసిగ్గు వాసి, గురుఁడో? శీతాంశుఁడో? యెవ్వఁ డీ
లలితాకారుఁ గుమారుఁ గన్నయతఁ? డేలా దాఁప? నీపాటు నీ
తలనే పుట్టెనె? వెచ్చ నూర్పకుము; కాంతల్ గాముకల్ గారె? మా
టల నిం దేమియుఁ బోదు పో; యొరులతోడం జెప్పి విన్పింపవే!" 384

వ. అని పలికిన బ్రహ్మకు నెదురుమాటాడ వెఱచి, మంతనంబున నయ్యింతి "చంద్రునికిం గన్నదాన" ననవుడు నా బాలకునకుం బుధుం డని పేరువెట్టి చంద్రున కిచ్చి బ్రహ్మ సనియె; నంత. 385

ఆ. బుద్ధిమంతుఁ డయిన బుధుఁడు పుత్త్రుండైన-[3]మేను పెంచి రాజు, మిన్నుముట్టె;
బుద్ధిగల సుతుండు పుట్టినచోఁ దండ్రి-మిన్నుముట్ట కేల మిన్నకుండు? 386

వ. ఆ బుధునకుఁ దొల్లి చెప్పిన యిళాకన్యక వలనఁ బురూరవుండు పుట్టె; నా పురూరవునకుం గల శౌర్యసౌందర్యగాంభీర్యాదిగుణంబులు నారదునివలన నింద్రసభ లోన నూర్వశి విని, మిత్త్రావరుణశాపంబున మనుష్యస్త్రీరూపంబు దాల్చి, భూలోకంబునకు వచ్చి ముందట నిలువంబడి. 387

తరలము. సరసిజాక్షు మృగేంద్రమధ్యు విశాలవక్షు, మహాభుజున్
సురుచిరాననచంద్రమండలశోభితున్, సుకుమారు, నా
పురుషవర్యుఁ, బురూరవుం గని, [4]పువ్వుటంపఱజోదుచేఁ
దొరఁగు క్రొవ్విరితూపులన్ మది దూలిపోవఁగ భ్రాంతయై. 388

వ. ఊర్వశి నిలిచి యున్నంత. 389

ఉ. "భావజదీపమో? మొగులుఁ బాసి వెలుంగు మెఱుంగో? మోహినీ
దేవతయో? నభోరమయొ? దీనికరగ్రహణంబు లేనిచో
జీవన మేటి?" కంచు మరుచేఁ జిరురా[5]కడిదమ్ముజిమ్ములం
దా వడఁకెం బురూరవుఁడు దామరపాకుజలంబుకైవడిన్. 390

వ. ఇట్లా రాచపట్టి చెఱకువింటివానిదాడికి నోడి, యెట్టకేలకు సైరణ సేసి, నిలుకడఁ దెచ్చుకొని, యచ్చెలువ కిట్లనియె. 391

1. ఇంటిమర్యాద. 2. వేఁతసిగ్గు. 3. ఉప్పొంగి. 4. పూలుబాణములుగాఁ గల యోధుఁడు. - మన్మథుఁడు 5. ఖడ్గము.

ఉ. "ఎక్కడనుండి రాక? మన కిద్దఱకుం దగు; నీకు దక్కితిన్;
మ్రుక్కడి వచ్చెనే [1]యలరుముల్కులవాఁ డడిదంబుఁ ద్రిప్పి; నే
దిక్కు నెఱుంగఁ; జూడు నను; దేహము దేహము, గేలుఁ గేల, నీ
చెక్కునఁ జెక్కు మోపి, తగుచెయ్వుల నన్ను విపన్నుఁ గావవే! 392

వ. అనినఁ బ్రోడచేడియ యి ట్లనియె. 393

మ. "ఇవె నాకూర్పు[2]తగళ్లు రెండు; దగ నీ వెల్లప్పుడుం గాఁచె దే
ని, వివస్త్రుండవు గాక నాకడఁ దగన్ నీ వుండు దేనిన్, విశే
షవిలాసాధిక! నీకు నాఘృతము భక్ష్యం బయ్యె నేనిన్, మనో
జవినోదంబుల నిన్నుఁ దేల్తు; నగునే? చంద్రాన్వయగ్రామణీ!" 394

వ. అని పలికిన, వేల్పులవెలయాలి ప్రతినమాట కియ్యకొని, తనమనంబున. 395

క. మంచి దఁట రూపు! సంతతి – నంచిత యా దేవగణిక యఁట! మరుచేతన్
సంచలితచిత్తనై కా – మించిన దఁట! యింతకంటె మేలుం గలదే? 396

వ. అని నిశ్చయించుకొని. 397

ఆ. రాజు రాజముఖిని రతిఁ దేల్చె, బంగారు – మేడలందుఁ, దరులనీడలందుఁ,
దోఁటలందు, రత్నకూటంబులందును – గొలఁకులందు, గిరులకెలఁకులందు.

వ. అంత నయ్యిద్దఱకుం దగులంబు నెలకొని. 399

క. ఒకదిక్కు కాని చనఁబో – రొకచోటన కాని నిలిచి యుండరు; దమలో
నొకటియ కాని తలంపరు – నొకనిమిషముఁ బాయలేరు నువిదయు ఱేఁడున్.

క. దయ్యె మెఱుంగున్ వారల – నెయ్యంబులు, మక్కువలును, నిజమరితనముల్,
వియ్యములును, నెడసందిని – బయ్యెదకొం గడ్డ మైనఁ బ్రాణము వెడలున్.

వ. ఇట్లూర్వశియుం బురూరవుండు నొండొరువులవలన మక్కువలు చెక్కులొత్తం
బగళ్లు, రేలు నెల్లెడల విహరింప నొక్కనాఁడు దేవలోకంబున దేవేంద్రుండు
గొలువుండుతఱిఁ గొలువున నూర్వశి లేకుండుటం జూచి. 402

క. "ఇన్నిదినంబులకును మన–మున్నసభామధ్యవేది యూర్వశి లేమిన్
విన్నఁదనంబున నున్నది–వన్నె దఱిఁగి యున్నపసిఁడివడువున" ననుచున్.

వ. ఇంద్రుండు గంధర్వులం బనిచిన, వారు నడురేయిం జని, చీఁకటి నూర్వశి
పెంచుచున్న [3]యేడకంబులం బట్టిన, నవి రెండును మొఱ వెట్టిన, వాని మొఱ
విని, రతిఖిన్నుండై మేను మఱచి, కూరుకుచున్న పురూరవుకౌఁగిటనుండి
యూర్వశి యి ట్లనియె. 404

1. మన్మథుడు 2. పొట్టేళ్ళు. 3. పొట్టేళ్లు.

మ. "అదె నాబిడ్డలఁ బట్టి దొంగలు మహాహంకారులై కొంచు, ను
న్మదులై పోయెద; రడ్డపాటునకు సామర్థ్యంబునన్ హీనుఁడై
కదలం, డీమగపంద కూరుకుగతిం గన్మూసి, గు ర్వెట్టుచున్;
వదలంజాలఁడు, నాదుకౌఁగిలియుఁ దా వంధ్యాత్ముఁడై; చెల్లరే! 405

క. పగతుర దొంగల రేఁపగ-మగఁటిమి వాటింపలేక, మగతన మెల్లన్
మగువలకౌఁగిటఁ జూపెడు-మగవాఁడగుకంటె, మగఁడు మగువగు టొప్పున్,

ఆ. అధముఁడైనవాని కాలగుకంటె న-త్యధికునింట దాసి యగుట మేలు;
హీనుఁ బొంది యోని హింసింపఁగా నేల?-యువతిజనుల కూర కుంట లెస్స.

క. ఏటికి నీరాచఱికం?-బోటది మొఱవెట్టఁ, బశువు లాతురపడ, నో
యూఁట దని, లేచి దొంగల-[1]గీఁటవు వెడలంగ; శవము క్రియ నుండె దిదే!*

క. వినియు వినవు; [2]రణభీరువు-మనుజాధము, నిదురపోతు, మందుని, నకటా!
నినుఁ జక్రవర్తిఁ జేసిన-వనజాసనుకంటె వెఱ్ఱివాఁడును గలఁడే?" 409

వ. అని పెక్కుభంగుల నయ్యింతి పరుసనిపలుకు లను కఱకువాలమ్ములు సెవులఁ జొనుప, నారాజశేఖరుం డంకుశంబుపోట్ల నడరు మదగజంబుచందంబునఁ జీర మఱచి, దిగంబరుండై లేచి, వాలు కేల నంకించి, యా నడురేయి దొంగల నఱికి వైచి, మేషంబుల విడిపించుకొని, తిరిగి వచ్చునెడ. 410

ఆ. చీర లేని మగనిఁ జెలువ దా నీక్షించి-కన్ను మొఱఁగిపోయెఁ; గడఁక నతఁడు
వెఱ్ఱివానిభంగి వివశుఁడై, వడి లేచి-పొరల, తెరలిస్రుక్కి, సొక్కిపడియె. 411

వ. మఱియుఁ బురూరవుండును మదనాతురుండై వెదకుచు, సరస్వతీనదీతీరంబునం జెలికత్తెలతోఁ గూడియున్న యూర్వశిం గని, వికసితముఖకమలుండై యిట్లనియె. 412

మ. "[3]తనుమధ్యా! యిది యేల వచ్చి? తకటా! ధర్మంబె? శర్మంబె? మున్
మనలో నుంకువలాడికొన్న పలుకుల్ మర్యాదలుం దప్పెనే?
నిను నేఁ బాసినయంతనుండి తనువు న్నేలం బడం బాఱె; నన్
దిను నుగ్రంపుమృగాళి; దీనుఁ గరుణాదృష్టిన్ విలోకింపవే!" 413

వ. అనిన నూర్వశి యి ట్లనియె. 414

క. "మగువలకు నింత లొంగెదు-మగవాఁడవె నీవు? పశువుమాడ్కిన్ వగవం
దగవే? మానుషపశువును-మృగములుఁ గని, రోయుఁ గాక; మే లని తినునే?

---

*'ఏటికి నీరాచరికము-బోటులు మొఱవెట్టఁ బశువు ఘోరని యఱుపన్
వేఁటల నీడ్చెడు దొంగలఁ-గీటణఁపవు వెడల శవము క్రియనుండెడిదే'

1. నశింపఁజేయక. 2. యుద్ధమునకుఁ బిఱికియైనవాఁడు. 3. సన్నని నడుము గలవాఁడు.

వ. అదియునుంగాక. 416

మ. తలఁపుల్ చిచ్చులు, మాటలుజ్జ్వలసుధాధారల్, విభుం డైనపు
వ్విలుతుర్ మెచ్చర; యన్యులన్ వలతురే? విశ్వాసముల్ లేదు; క్రూ
రలు; [1]తోడుం బతినైన నంపుదురు; రధర్మల్; నిర్దయల్; చంచలల్;
వెలయాం డ్రెక్కడ? వారివేడబము లావేదాంతసూక్తంబులే? 417

ఉ. ఇంకొకయేఁడు వోయిన, నరేశ్వర! యాతలి రేయి నీవు నా
లంకెకు వచ్చి, యాత్మజుల లక్షణవంతులఁ గాంచె; దేమియుం
గొంకక పొమ్ము; నీ’’ వనుడుఁ గొమ్మను గర్భిణిఁ గాఁ దలంచుచున్
శంక యొకింత లేక, నృపసత్తముఁ డల్లన పోయె వీటికిన్. 418

వ. ఇట్లు మరలి చని, తన పురంబున నొక్కయేఁ డుండి, పిదప నూర్వశికడ
కేఁగి, యొక్కరేయి పురూరవుం డయ్యింతికడ నున్న, నావెలందియు “గంధ
ర్వవరుల వేఁడుకొనుము; న న్నిచ్చెద;’’ రనవుడు నతండు గంధర్వవరులం
బ్రార్థించిన, వార లతండు వొగడుటకు మెచ్చి, యగ్నిస్థాలి నిచ్చిన, నయ్యగ్ని
స్థాలి నూర్వశింగాఁ దలంచుచు, దానితో నడవిం దిరుగుచుండి, యొక్కనాఁ
“డది యూర్వశిగా; దగ్నిస్థాలి’’ యని యెఱింగి, వనంబునం దిగవిడిచి,
యింటికిఁ జనుదెంచి; నిత్యంబు రాత్రి దానిన చింతించుచుండఁ, ద్రేతాయుగంబు
సొచ్చిన, నారాజుచిత్తంబునఁ గర్మబోధంబు లయి, వేదంబులు మూఁడు
మార్గంబులం దోఁచిన, నా భూవరుండు స్థాలికడకుం జని, యందు శమీగర్భ
జాతం బైన యశ్వత్థంబుఁ జూచి, యా యశ్వత్థంబుచేత నరణులు రెండు
గావించి, ముందటియరణి దానును, వెనుకటియరణి యూర్వశియును, రెంటి
నడుమ నున్న [2]కాష్ఠంబు పుత్త్రుండు, నని మంత్రంబు సెప్పుచుం ద్రచ్చుచుండ,
జాతవేదుం డను నగ్ని సంభవించి, విహితారాధన సంస్కారంబునం జేసి,
యాహవనీయాదిరూపి యై నెగడి, పురూరవునిపుత్త్రుండని కల్పింపంబడియె;
నాయగ్ని పురూరవునిఁ బుణ్యలోకంబునకుఁ బనుపం గారణం బగుటం జేసి.

క. ఆ యగ్నిచేఁ బురూరవుఁ-డా యజ్ఞేశ్వరుఁ, ననంతు, హరి, వేదమయున్,
శ్రీయుతుఁ గూర్చి [3]యజించె, గుణాయుతుఁ డూర్వశిఁ గనంగ నరిగెడుకొఱకై.

ఉ. ఒక్కఁడ వహ్ని; వేల్పు; పురుషోత్తముఁ డొక్కఁడ; సర్వవాఙ్మయం
బొక్కఁడ వేద; మా[4]ప్రణవ మొక్కఁడ వర్ణము; దొల్లి త్రేతయం
దెక్కటి మాన్చి, మూఁడుగను నేర్పఱిచెం, దనబుద్ధిపెంపుచేఁ
జిక్కఁగ నా పురూరవుఁ డశక్తులకున్ సులభంబు లౌ గతిన్. 421

1. తోడఁబుట్టువు. 2. కట్టె. 3. యజ్ఞముచేసె. 4. ఓంకారము.

వ. ఇట్లు వేదవిభాగంబు గల్పించి, యాగంబు సేసి, పురూరవుం డూర్వశి యున్న గంధర్వలోకంబునకుం జనియె; నతనికి నూర్వశిగర్భంబున నాయువు, శ్రుతాయువు, సత్యాయువు, రయుండు, జయుండు, విజయుం డన నార్గురు పుత్రులు గలిగి; రందు శ్రుతాయువునకు వసుమంతుండును, సత్యాయువునకు శ్రుతం జయుండును, రయునకు శ్రుతుండు, నేకుం డన నిరువురును, జయునకు నమితుం డును, విజయునకు భీముండును జనించి; రాభీమునకుఁ గాంచనుండు, కాంచను నకు హోత్రకుండు, హోత్రకునకు గంగాప్రవాహంబు పుక్కిటం బెట్టిన జహ్నుండు, జహ్నునకుఁ బూరుండు, పూరునకు బాలకుండు, బాలకునకు నజ కుం, డజకునకుఁ గుశుండు, గుశునకుఁ గుశాంబుండు, ధూర్తయుండు, వసువు, కుశనాభుం డన నలువురును సంభవించి; రందుఁ గుశాంబునకు గాధి యను వాఁడు గలిగె; నా గాధి రాజ్యంబు సేయుచుండ. 422

సీ. సత్యవతిని గాధిజాతను గన్యను విప్రుఁడు ఋచికుండు వేఁడికొనిన,
గాధియు "సుత కీడు గాఁ;" డని "తెల్లని[1] నవకంపు మేనులు, నల్ల చెవులు
గల గుఱ్ఱములు వేయి, కన్యకు నీ వుంకు విచ్చినఁ గూఁతు నే నిత్తు;" ననిన
వసుధామరుండును వరుణునికడ కేఁగి, హరులఁ దెచ్చినఁ, గూఁతు నాతఁ డిచ్చె;

ఆ. నామహాత్మసతియు నత్తయుఁ, గొడుకులఁ—గోరి యడుగ, నియ్యకొని యతండు
విప్రరాజమంత్రవితతుల వేల్పించి—చరువు సేసి, క్రుంకఁ జనియె నదికి. 423

వ. అయ్యెడం దల్లి యడిగిన, సత్యవతి బ్రహ్మమంత్రంబుల వేల్పించిన చరువు, దల్లి కిచ్చి, క్షాత్త్రమంత్రంబులం దల్లికి వేల్పించినచరువు దా నందుకొని యుండ, నా ముని ననుదెంచి, చరువు వీడ్వడుట యెఱింగి, భార్య కి ట్లనియె. 424

ఆ. "తల్లి చరువు నీవు దాల్చి, నీచరు వేల—తల్లి పాల నిడితి? తరళనేత్ర!
కొమ్మ! యింక నీకుఁ గ్రూరుండు వుట్టు; మీ—యమ్మ బ్రహ్మవిదుని ననఘుఁగాంచు."

వ. అనిన నయ్యింతి వెఱచి, మ్రొక్కి, వినయంబు లాడినం, బ్రసన్నుం డై, "నీ కొడుకు సాధు వై, నీమనుమండు క్రూరుం డగుఁ గాక!" యని ఋచికుం డను గ్రహించిన, నా సత్యవతికి జమదగ్ని సంభవించె; సత్యవతియుం గౌశికీనదియై, లోకపావని యై, ప్రవహించె; నా జమదగ్నియు రేణువుకూఁతు రయిన రేణు కను వివాహం బై వసుమనాదికుమారులం గనియె; నందు. 426

క. పురుషోత్తమునంశంబున—ధర జమదగ్నికి జనించి, ధన్యుఁడు రాముం
డిరువదియొక మరి నృపతుల—శిరములఁ [2]జక్కడిచెఁ దనదు చేగొడ్డంటన్."

వ. అనిన విని, భూవరుండు శుకున కి ట్లనియె. 428

1. మృదువులయినశరీరములు. 2. చంపెను.

## పరశురామునిచరిత్రము

ఉ. "ఏటికిఁ జంపె రాముఁ డవనీశులఁ బల్వుర? వారియందుఁ ద
ప్పేటికిఁ గల్గె? విప్రుఁ డతఁ డేటికి రాజసతామసంబులన్
[1]వాటముఁ బొందె? భూభరము వారిత మౌ టది యేవిధంబు? నా
మాటకు మానిచంద్ర! మఱుమాట ప్రకాశము గాఁగఁ జెప్పవే." 429

వ. అనిన విని శుకుం డి ట్లనియె. 430

సీ. "హైహయాధీశ్వరుం డర్జునుం డనువాఁడు ధరణీశ్వరులలోనఁ దగినవాఁడు;
పురుషోత్తమాంశాంశుఁ, బుణ్యు దత్తాత్రేయు నారాధనముసేసి, యతనివలనఁ
[2]బరిపంథిజయమును, బాహుసహస్రంబు, నణిమాదిగుణములు, యశము, బలము,
యోగీశ్వరత్వంబు, [3]నోజయుఁ దేజంబుఁ జెడనియింద్రియములు, సిరియుఁ బడసి,

తే. గాలికైవడి సకలలోకంబులందుఁ-దనకుఁ బోరాని రారాని తావు లేక,
యెట్టిచోనైనఁ దనయాజ్ఞ యేపుమిగుల-ధరణి వెలుఁగొందె వినువీథిఁ దరణిమాడ్కిఁ.

మ. ఒకనాఁ డామనుజేంద్రుఁ డంగనలతో నుద్దాముఁడై, వీట నుం
డక [4]రేవానది కేఁగి, యందుఁ దెలినీటం జల్లుపోరాడి, దీ
ర్ఘకరాబ్జంబుల నానదీజలములం గట్టెన్, వడిన్ నీరు మ్రో
లకుఁ బెల్లుబ్బి, రణాగతుం డయిన యా లంకేశుపైఁ దొట్టఁగన్. 432

వ. ఇట్లు దిగ్విజయార్థంబు వచ్చిన రావణుం డారాజు చేకట్టం దొట్టినయేటినీటికి స
హింపక, రోషంబునం బోటరియుంబోలె, నమ్మేటిమగనితోడి పోరాటకుం దొడ
రినఁ, బాటింపక దనబాహుపాటవంబున. 433

క. వీఁకమెయి నతఁడు రావణుఁ-గూఁకటులు లగలించి పట్టికొని, మోఁకాళ్లం
దాఁకించి, కోఁతికైవడి-నాఁకం బెట్టించెఁ గింకరావళిచేతన్. 434

వ. అంత నర్జునుండు మాహిష్మతీపురంబున కేతెంచి. 435

క. ఆరాజేంద్రుఁడు రావణు-"నోరీ! యిటమీఁద నూరకుండుము, జగతిన్
వీరుఁడ ననకుము; కాచితిఁ-బోరా" యని సిగ్గుపఱిచి పుచ్చెన్ మరలన్. 436

వ. అంత. 437

సీ. ధరణీశుఁ డొకనాఁడు దైవయోగంబున వేఁటకై కాంతారవీథి కేఁగి,
తిరిగి యాఁకట శ్రాంతదేహుఁడై జమదగ్నిమునియాశ్రముఁ జేరి మ్రొక్కి నిలువ,
నా మునీంద్రుఁడు రాజు నర్థితోఁ బూజించి, యారాజునకు రాజనుచరులకుఁ
దనహోమధేనువుఁ దడయక రప్పించి, యిష్టాన్నములు గురియింప నతఁడు

---

1. పొందికను. 2. శత్రువిజయము. 3. తేజస్సు. 4. నర్మదానది.

తే. గుడిచి కూర్చుండి, మొదవుపైఁ గోర్కెఁ జేసి,
"సంపద యదేల? యీయావు చాలుఁగాక;
యిట్టిగోవుల నెన్నండు నెఱుఁగ;" మనుచుఁ
"బట్టి తెం" డని తనయొద్దిభటులఁ బనిచె. 438

వ. పంచిన వారలు దర్పంబునం జని. 439

క. "[1]క్రేపుం బాపకుఁ," డంచును-"హా!పీడంబడితి"ననుచు, "నంబే" యనుచుం,
"జూ పోపరు నృపు;" లంచున్-వాపోవన్, మొదవుఁ గొనుచు వచ్చిరి పురికిన్.

వ. అంత నర్జునుండు [2]మాహిష్మతీపురంబునకు వచ్చునెడ, రాముం డాశ్రమంబున
కేతెంచి, తద్వృత్తాంతం బంతయు విని. 441

ఆ. "అద్దిరయ్య! యింట నశనంబు గుడిచి,మా-యయ్య"వల"దనంగ నాక్రమించి,
కోరి మొదవు రాజు గొనిపోయినాఁడఁట? యేను రాముఁ డౌట యెఱుఁగఁడొ [క్కొ?"

వ. అని పలికి.

మ. ప్రళయాగ్నిచ్ఛటభంగిఁ గుంభి విదలింపం బోవు సింహాకృతిం
బెలుచన్ రాముఁ డిలేశు వెంట నడచెం, బృథ్వీతలం బెల్ల నా
కులమై క్రుంగఁ. [3]గుఠారి యై, కవచి యై, కోదండి యై, [4]కాండి యై,
ఛలి యై, సాహసి యై, మృగాజినమనోజ్ఞశ్రోణి యై, తూణి యై. 444

వ. చని మాహిష్మతీపురంబుఁ జేరి నిలుచున్నసమయంబున. 445

మ. కనియెన్ ముందటఁ గార్తవీర్యుఁడు, సమిత్కాముం, బ్రకామున్, శరా
సనతూణీరకుఠారభీము, నతికోపప్రోచ్ఛలద్భ్రూయుగా
ననేత్రాంచలసీము, నైణపటనానామాలికోద్దాము, నూ
తన సంరంభనరేంద్రదారశుభసూత్రక్షౌమునిన్, రామునిన్. 446

వ. కని కోపించి. 447

ఉ. "బాలుఁడు, వెఱ్ఱిబ్రాహ్మణుఁడు బ్రాహ్మణుకైవడి [5]నుంటమాని, భూ
పాలురతోడ భూరిబలభవ్యులతోడ భయంబు దక్కి, క
య్యాలకు వచ్చినాఁడు; మనయం దిఁకఁ బాపములేదు; లెండు లెం;
డేల సహింప భూసురుని? నేయుఁడు, వ్రేయుఁడు, గూల్పుఁ డిమ్మహిన్." 448

వ. అని కదలించి, దండనాయకులం బురికొల్పిన, వారు రథగజతురగపదాతిసమూ
హంబులతో లెక్కకుం బదియే డక్షౌహిణులతో నెదురునడచి, శరచక్రగదా

---

1. దూడను. 2. ప్రకృతము జబ్బల్‌పురము. 3. గండ్రగొడ్డలికలవాఁడు. 4. బాణములు
గలవాఁడు. 5. ఉండుట.

ఖడ్గభిండివాలశూలప్రముఖసాధనంబుల నొప్పించిన, నవ్విప్రుఁడు గన్నుల కొలుకుల నిప్పులు గుప్పలుగొన, రెట్టించిన[1]కట్టల్కఁ మిట్టిపడి, యజ్ఞోపవీతంబు సక్కఁ నిడికొని, కరాళించి, బిట్టు దట్టించి, కఠోరం బగు కుఠారంబు సారించి, మూఁకలపైఁ గుఱికి, తొలకరి మొగంబునం గ్రొచ్చెలికపట్టునం జెట్టులు గొట్టు కృషీవలుని తెఱంగునఁ, బదంబులు ద్రెంచుచు, ననఁటికంబంబులఁ దెగనడుచు నారామకారునిపగిది మధ్యంబులఁ ద్రుంచుచుఁ, దాళఫలంబులు రాల్చువృక్షారోహకునికైవడి, శిరంబులు ద్రుంచుచు, మృగంబుల వండం దండించుసూపకారునిభంగి, నవయవంబులం జెక్కుచు, నంతటం దనవి సనక విలయకాలకీలికీలిని మంట లుమియుచు, విల్లంది, యెల్లెడం బిడుగులసోనలు గురియు బలుమొగిల్ల వడువున, నప్రమాణంబు లగు బాణంబులఁ బఱపి, సుభటసైన్యంబుల దైన్యంబు నొందించుచు నడ్డంబు లేని యార్భటంబులు గలబాణవర్షఘృతంబులతో రాహుతులం గోపానలంబున కాహుతులు సేయుచు, తురంగంబుల నిరంగంబులఁ గావించుచు, రథంబుల విశ్లథంబులఁగా నొనర్చుచు, ద్విరదంబుల నరదంబులపైఁ బఱవందోలుచు నివ్విధంబున సేనల నంపవానల ముంచి, రూపుమాపిన. 449

క. మత్తిల్లి భూతజాలము-చిత్తంబులఁ జొక్కి, వేడ్కఁ జిందులువాఱన్
జొత్తిల్లి సమిత్తలమున-నెత్తురు మేదంబు పలలనికరం బయ్యెన్. 450

వ. అయ్యవసరంబున. 451

క. "మేలీబ్రాహ్మణుఁ డొక్కఁడు-నేలం బడఁ గూల్చె సైన్యనిచయము నెల్లన్;
బాలార్ప నేల? యీతని దూలించెదఁగాక! నాదుదోర్బలమువడిన్." 452

వ. అని పలికి. 453

మ. ఒకయేనూఱుకరంబులన్ ధనువు లత్యుల్లాసియై తాల్చి, వే
ఱొకయేనూట గుణధ్వనుల్ నిగుడ, శాతోగ్రాస్త్రముల్ గూర్చి "వి
ప్ర! కుఠారంబును, నిన్నుఁ గూల్తు" ననుచున్ భర్జించి, పుంఖానుపుం
ఖకఠోరంబుగ నేసి, యార్చె రయరేఖాధామునిన్ రామునిన్. 454

క. వడిఁ దూపు లెగయ గుడుసులు-పడి[2] కార్ముకపంచశతము పరఁగ, విభుఁడు సొం
పడరెఁ, బరివేషమండలి-నడుమఁ గరద్యుతుల వెలయు నలినాప్తుక్రియన్. 455

వ. ఇట్లర్జునుండు బాణవిలాసంబు సూపిన. 456

మ. ధరణీదేవుఁడు రాముఁ డాఢ్యుఁడు జగద్ధానుష్కరత్నంబు దు
ష్కరచాపం బొక టెక్కు వెట్టి, శరముల్ సంధించి. పెల్లేసి, భూ

1. అధికకోపముతో. 2. ఏనూఱు ధనుస్సులు.

వరుకోదండము నొక్కి చూడ్కి మునిమోల; వాఁ డంతటం బోక, వే
తరువుల్ బువ్వఁ గుఠారధార నడుకెల దద్బాహుసందోహమున్. 457

క. కరములు దునిసిన, నతనికి-శిర మొక్కటి చిక్కి శైలశిఖరముభంగిం
బరశువున నదియుఁ ద్రుంచెను-[1]పరసూదనుఁ డైన ఘనుఁడు భార్గవుఁడు వడిన్.

ఆ. తండ్రి వడిన, నతనితనయులు పదివేలు-దలఁగిపోయి రతని దాఁక లేక;
పరభయంకరుండు భార్గవుం డంత నా-గోవుఁ గ్రేపుతోడఁ గొనుచుఁ జనియె.

వ. ఇట్లు హోమధేనువు మరలం దెచ్చి యిచ్చి, తనపరాక్రమంబు దండ్రికిం దోఁ
బుట్టువులకుం దెలియం జెప్పిన, జమదగ్ని రామున కిట్లనియె. 460

క. "కల వేల్పు లెల్లఁ దమతమ-చెలువంబులు దెచ్చి రాజుఁ జేయుదు; రకటా!
బలువేల్పు రాజు; వానిం- జలమున ని ట్లేల పోయి చంపితి? పుత్రా! 461

క. తాలిమి మనకును ధర్మము-తాలిమి మూలంబు మనకు; "ధన్యత్వమునం
దాలిమి గల"దని యీశుం-డేలించును బ్రహ్మపదము నెల్లల మనలన్. 462

క. క్షమ గలిగిన సిరి గలుగును-క్షమ గలిగిన వాణి గలుగు; [2]సౌరప్రభయుల్
క్షమ గలుగఁ దోన గలుగును-క్షమ గలిగిన మెచ్చు శౌరి సదయుఁడు దండ్రీ!

క. పట్టపురాజును జంపుట - గట్టలుకల విప్రుఁ జంపుకంటెను బాపం;
బట్టిట్టనకుము; నీ వీ - చెట్ట సెడం, దీర్థసేవ సేయుము దనయా!" 464

క. అని తన్నుఁ దండ్రి పనిచినఁ-బని పూని, "ప్రసాద" మనుచు, భార్గవుఁడురయం
బున నొకయేఁడు ప్రయాణము-సని, తీర్థము లెల్ల నాడి చనుదెంచె నృపా."

ఉ. ఆయెడ నొక్కనాఁడు సలిలార్థము రేణుక గంగలోనికిం
బోయి, ప్రవాహమధ్యమునఁ బొల్పుగ నచ్చరలేమపింఁడుతోఁ
దోయవిహారముల్ సలుపు దుర్లభుఁ జిత్రరథుల, సరోజమా
లాయుతుఁ జూచుచుండెఁ, బతియాజ్ఞదలంపక కొంతప్రేమతోన్. 466

వ. ఇట్లు గంధర్వవల్లభునిం జూచుకారణంబునం దడసి. 467

ఉ. "అక్కట! వచ్చి పెద్దతడ వయ్యెను; హోమము వేళ దప్పె; నే
నిక్కడ నేల యుంటి? ముని యే మనునో?" యని భీతచిత్తయై
గ్రక్కునఁ దోయకుంభము శిరస్థలమం దిడి, యిచ్చి తెచ్చి, వే
మ్రొక్కి, కరంబు మోడ్చి, పతిముందట నల్లన నిల్చె నల్కుచున్. 468

వ. అప్పుడు. 469

1. శత్రువులను నశింపఁజేయువాఁడు 2. సూర్యకాంతియును.

క. చిత్తమున భార్య దడసిన-వృత్తాంతం బెఱిఁగి, తపసి వే కని, సుతులన్
"మత్తం దీనిం జావఁగ-మొత్తుం" డన మొత్తరెరి మునుకుచు వారల్. 470

క. *కొడుకులు పెండ్లముఁజంపమిఁ-గొడుకులఁ బెండ్లాముఁ జంప, గురుఁ డానతి యీ,
నడుగులకు నెఱిఁగి, రాముం-డడు గిడకుండంగఁ ద్రుంచె నన్నలఁ దల్లిన్.

శా. "తల్లిన్ భ్రాతల నెల్లఁ జంపు మనుచోఁ, దాఁ జంపి రాకున్నఁ బెం
పెల్లం బోవ శపించుఁ దండ్రి; తనపం పేఁ జేయుదున్ మెచ్చి, నా
తల్లిన్ భ్రాతల నిచ్చు నిక్కము తపోధన్యాత్మకుం;" డంచు వే
తల్లిన్ భ్రాతలఁ జంపె భార్గవుఁడు; లేదా చంపఁ జేయాడునే? 472

వ. ఇవ్విధంబున. 473

క. అడ్డము సెప్పక, కడపటి-బిడ్డఁడు రాముండు సుతులఁ బెండ్లము నచటన్
గొడ్డంటం దెగ నడిచిన-జడ్డనఁ దల యూఁచి, మెచ్చె జమదగ్ని మదిన్. 474

క. మెచ్చినతండ్రిని గనుఁగొని-చెచ్చెర "నీపడినవారిజీవంబులు నీ
విచ్చితి" నను మని మ్రొక్కిన-నిచ్చెన్; వారలును లేచి రెప్పటిభంగిన్. 475

ఆ. "పడినవారి మరల బ్రతికింప నోపును-జనకుఁ" డనుచుఁ జంపె జామదగ్న్యుఁ;
డతఁడు సంపె ననుచు, నన్నలఁ, దల్లిని-జనకునాజ్ఞ నైనఁ జంపఁదగదు. 476

సీ. పరశురాముని [1]కోడి పరుగులు వెట్టిన యర్జునపుత్రకు లాత్మయందు
దండ్రి మ్రగ్గుటకు సంతప్తులై పొగులుచు, నింతట నంతట [2]నెడరు వేచి,
తిరిగి యాడుచు, నొక్కదివసమం దారాముఁ డడవి కన్నలతోడ నరుగఁ, బిదప
బగఁదీర్పఁ దఱి యని పఱతెంచి, హోమాలయంబున సర్వేశు నాత్మ నిలిపి,
తే. నిరుపమధ్యానసుఖవృత్తి నిలిచియున్న-పుణ్యు, జమదగ్ని నందఱుఁ బొదివిపట్టి
కదులకుండంగఁదలఁద్రెంచికొనుచుఁ జనిరి-యడ్డ మేతెంచి రేణుక యడచికొనఁగ.

వ. మఱియును. 478

మ. "జనకుం జంపినవైరముం దలఁచి, రాజన్యాత్మజుల్ నేఁడు మీ
జనకుం జంపిరి; రామ! రామ! రిపులన్ శాసింతు ర;"మ్మంచు న
మ్మునిపై వ్రాలి, లతాంగి మోఁదికొనియెన్ [3]ముయ్యేడుమాఱుల్, రయం
బున రాముం డరుదెంచి యెన్నికొన నాపూర్ణాపదాక్రాంత యై. 479

వ. అప్పుడు దల్లి మొఱ విని, జమదగ్నికుమారులు వచ్చి, యి ట్లని విలపించిరి. 480

క. వాకిలి వెడలవు కొడుకులు-రాకుండఁగ; నట్టినీవు రాజసుతులచేఁ
జీకాకు నొంది, పోవఁగ-నీకా లెట్లాడెఁ దండ్రి! నిర్జరపురికిన్?" 481

---

* కడుకొని పెండ్లముఁ జంపని, కొడుకుల - పాఠాంతరము. 1. భయపడి. 2. సమయము.
3. ఇర్వదియొక్కపర్యాయములు.

వ. అని విలపించుచున్న యన్నలం జూచి, రాముం డిట్లనియె. 482

ఉ. "ఏడువ నేల? తండ్రితను వేమఱకుండుఁడు; తోఁడులార! నే
నూడిచె తీర్తు;" నంచుఁ బరశుద్యుతిభీముఁడు రాముఁ డుగ్రుఁడై
యోడక యర్జునాత్మభవు లున్నపురంబున కేఁగి, చొచ్చి, గో
డాడఁగఁ బట్టి చంపె వడి [1]నర్జునజాతుల బ్రహ్మఘాతులన్. 483

క. ఖండించి రిపులశిరములు-గొండలు గాఁ బ్రోగులిడియె; గురురక్తనదుల్
నిండికొని పాఱ నుబ్బుచు-భండనమున విప్రరిపులు భయ మంద నృపా! 484

వ. మఱియు నంతటఁ బోక. 485

ఆ. అయ్యపగకు రాముఁ డలయక రాజుల-నిరువదొక్కమాఱు నరసి చంపె;
జగతిమీఁద రాజశబ్దంబు లేకుండ-[2]నూడు దీర్ప లేనిసుతుఁడు సుతుఁడె? 486

వ. మఱియు నా రాముండు శమంతపంచకంబున, రాజరక్తంబులం దొమ్మిదిమడుఁగులు గావించి, తండ్రిశిరంబు దెచ్చి, శరీరంబుతో సంధించి, సర్వదేవమయుండగు దేవుండు దాన కావునఁ, దన్ను నుద్దేశించి యాగంబు సేసి, హోతకుం దూర్పును, బ్రహ్మకు దక్షిణభాగంబును, నధ్వర్యునకుఁ బడమటిదిక్కును, నుద్గాతకు నుత్తరదిశయు, నున్న వారల కవాంతరదిశలును, గశ్యపునకు మధ్యదేశంబును, నుపద్రష్టకు నార్యావర్తంబును, సదస్యులకుం దక్కినయెడలును గలయ నిచ్చి, బ్రహ్మనదియైన సరస్వతియం దవభృథస్నానంబు సేసి, కల్మషంబులం బాసి, మేఘ విముక్తుం డయిన సూర్యుండునుంబోలె నొప్పుచుండె; నంత. 487

క. ఆప్పుఁ డగుపుత్త్రువలనను-బ్రాప్తతనుం డగుచుఁ, దపముబలిమిని మింటన్
సప్తర్షి మండలంబున-సప్తముఁడై, వెలుఁగుచుండె జమదగ్ని; నృపా! 488

క. ఆ జమదగ్నితనూజుఁడు-రాజీవాక్షుండు ఘనుఁడు రాముఁ డధికుఁడై
యోజను సప్తర్షులలో-రాజిల్లెడు మీఁదిమనువు రా నవ్వేళన్. 489

ఆ. శాంతచిత్తుఁడగుచు సంగవిముక్తుఁడై-భవ్యుఁడై మహేంద్రపర్వతమున
నున్నవాఁడు రాముఁ డోజతో గంధర్వ-సిద్ధవరులు నుతులు సేయుచుండ.

క. భగవంతుఁడు హరి యీక్రియ-భృగుకులమునఁ బుట్టి యెల్లపృథివీపతులన్
జగతీభారము వాయఁగఁ-బగ గొని, పలుమాఱుఁ జంపె బవరమున నృపా!

వ. అంత గాధికి నగ్నితేజుండగు విశ్వామిత్త్రుండు జన్మించి, తపోబలంబున రాజధర్మంబును మాని, బ్రహ్మర్షియై యేకశతసంఖ్యాగణితు లగు కొడుకులం గనియె;

1. కార్తవీర్యార్జునునిపుత్త్రులను. 2. పగ.

నయ్యెడ భృగుకులజాతుం డయిన యజీగర్తునికొడుకు శునశ్శేఫుండు దల్లిదండ్రు
లచేత హరిశ్చంద్రుని యాగపశుత్వంబునకు [1]నమ్ముడువడి, బ్రహ్మాదుల వినుతి
సేయుచు, మెప్పించి, దేవతలచేత బంధవిముక్తుం డయిన, వానియందుఁ గృప
గలిగి విశ్వామిత్రుండు పుత్రుల కిట్లనియె. 492

క. "కన్నులఁ గంటిని వీనిని-మన్నన కొమరుండు నాకు; మక్కువ మీరో
యన్నన్న! యనుచు సేతని, మన్నింపుం"డనినఁ జూచి మదసంయుతులై,

క. "ఇతఁ డన్నఁటవో మాకును? గృతకృత్యులమయితి"మనుచు గేలియొనర్పన్
సుతులన్ మ్లేచ్ఛులు గండని-ధృతి లేక శపించెఁ దపసి తిరుగుడుపడఁగన్.

వ. అయ్యెడ నతనిశాపంబునకును వెఱచి, యానూర్వురయందు మధ్యముండయిన
మధుచ్ఛందుం డేఁబండ్రు దమ్ములుం దానును నమస్కరించి, "తండ్రీ! నీచెప్పిన
క్రమంబున శునశ్శేఫుండు మా కన్న." యని మన్నింపంగలవార; మనవుడు
సంతసించి, మంత్రదర్శియైనశునశ్శేఫుని వారలయందుఁ బెద్దఁజేసి, మధుచ్ఛందున
కిట్లనియె. 495

ఆ. "పాడి సెడక వీఁడు నేఁడు మీ కతమునఁ-గొడుకు గలిగె నాకుఁ గొడుకులార!
కడుపు లార మీరు గొడుకులఁ గనుఁడింకఁ, బ్రీతితోడ దేవరాతుఁగూడి.

వ. అని పలికె; నట్లు శునశ్శేఫుండు దేవతలచేత విడినడుటం జేసి, [2]దేవరాతుం
డయ్యె; మధుచ్ఛందుండు మొద లయిన యేఁబండ్రు నా దేవరాతునకుఁ దమ్ము
లైరి; పెద్దలయిన యష్టకహారీతజయంతసుమదాదు లేఁబండ్రును, వేఱై చని;
రీక్రమంబున విశ్వామిత్రుకొడుకులు రెండువిధంబు లయినం బ్రవరాంతరంబు
గలిగె" నని చెప్పి శుకుం డిట్లనియె; నా పురూరవుకొడుకగు నాయువునకు నహు
షుండును, క్షత్రవృద్ధుండును, రజియును, రంభుండును, ననేనసుండును నను వారు
పుట్టి; రందు క్షత్రవృద్ధునకుఁ గుమారుఁ డగు సుహోత్రునకుఁ గాశ్యుండుఁ,
గుశుఁడు, గృత్స్నమదుండు నన ముగ్గురు గలిగి; రా గృత్స్నమదునకు శున
కుండును, శునకునకు శౌనకుండును, నమ్మహాత్మునికి బహ్వృచప్రవరుండు జన్మించి;
రా బహ్వృచప్రవరుండు దపోనియతుండై చనియెఁ గాశ్యునకుఁ గాశియుఁ,
గాశికి రాష్ట్రుండును, రాష్ట్రునకు దీర్ఘతపుండును జనియించిరి. 497

క. ఆ దీర్ఘతపుని కధికుఁడు-శ్రీ[3]దయితాంశమునఁ బుట్టె సేవ్యుం; డాయు
ర్వేదజ్ఞుఁడు ధన్వంతరి-ఖేదంబులు వాయు, నతనిఁ గీర్తన సేయన్. 498

వ. వాసుదేవాంశసంభూతుం డగు నా ధన్వంతరి యజ్ఞభాగంబున కర్హుం; డతనికిఁ
గేతుమంతుండుఁ, గేతుమంతునకు భీమరథుండు, నతనికి దివోదాసుం డనం

1. విక్రయింపఁబడి 2. దేవతలచేత విడువంబడినవాఁడు 3. విష్ణువునంశముచేత

బరఁగు ద్యుమంతుండు నుదయించి; రాద్యుమంతునకుఁ బ్రతర్దనుండు జన్మించె; నా ప్రతర్దనుండు శత్రుజిత్తనియు, ఋతధ్వజుం డనియుఁ జెప్పంబడె; నాతనికిఁ గువలయాశ్వుండు సంభవించె. 499

ఆ. వసుమతీశ! విను; కువలయాశ్వభూభర్త-లలితపుణ్యు ఘను నలర్కుఁ గనియె;
నాతఁ డేలె నేల నఱువదియాఱువే-లేండ్లు; వానిభంగి నేల రెవరు. 500

వ. అయ్యలర్కునకు సన్నతియును, నతనికి సునీథుండును, నతనికి సుకేతనుండును, నతనికి ధర్మకేతువును, నతనికి సత్యకేతువును, నాతనికి ధృష్టకేతువును, నాధృష్టకేతువునకు సుకుమారుండును, సుకుమారునకు వీతిహోత్రుండును, వీతిహోత్రునకు భర్గుండును, భర్గునకు భార్గభూమియు జనియించిరి. 501

ఆ. వారు తుదయుఁ గాఁగ వరుస నా కాశ్యాది-యైనవారు కాశు లనఁగ నెగడి
రవనిమీఁద; వార లా క్షత్రవృద్ధుని-వంశజాతు లగుచు వంశవర్య! 502

వ. మఱియు క్షత్రవృద్ధునికి రెండవకొడుకగు కుశునికిఁ బ్రీతియును, వానికి సంజయుండును, సంజయునికి జయుండును, జయునికిఁ గృతుండును, గృతునికి హర్యధ్వనుండును, హర్యధ్వనునకు సహదేవుండును, సహదేవునికి భీముండును, భీమునకు జయత్సేనుండును, జయత్సేనునకు సంకృతియు, సంకృతికి జయుండును, జయునికి క్షత్రధర్ముండును బుట్టిరి; వీరలు క్షత్రవృద్ధునివంశంబునం గల రాజులు; రంభునికి రభసుండును, రభసునికి గంభీరుండును, గంభీరునికిఁ గృతుండును, గల్గి; రా కృతునికి బ్రహ్మకులంబు పుట్టె; నయ్యనేనునకు శుద్ధుండును, శుద్ధునకు శుచియు, శుచికి బ్రహ్మసారథియైన త్రికకుత్తును జనించి; రతనికి శాంతరజుండు పుట్టె; నతండు విజ్ఞానవంతుండుఁ గృతకృత్యుండు విరక్తుండు నయ్యె.

సీ. రజియనువానికి రాజేంద్ర! యేనూఱుకొడుకులు గలిగిరి ఘోరబలులు;
వేల్పు లెల్లను వచ్చి వేఁడిన, నా రజి దైత్యులఁ బెక్కండ్ర ధరణిఁగూల్చి,
నాకంబు దేవేంద్రునకు నిచ్చె; నిచ్చిన రజికాళ్ల కెఱఁగి, సురప్రభుండు
వెండియు నతనికి విబుధగేహము నిచ్చి, సంతోషబుద్ధి నర్చన మొనర్చె;

ఆ. నంత నా రజి మృతుఁడైనఁ నతనిపుత్త్రు-లమరవిభుఁడు తమ్ము నడిగికొనిన
నీక, యింద్రలోక మేలిరి; యాగభా-గములు పుచ్చుకొనిరి గర్వ మంది. 504

క. వేలుపులఱేఁడు గురుచే-[1]వేలిమి వేల్పించి, బలిమి వెలయఁగ నిజదం
భోళిని రజిసుతులను ని-ర్మూలము గావించి, నాకముం గైకొనియెన్. 505

వ. అది యట్లుండె; నహుషునకు యతియు, యయాతియు, సంయాతియు, నాయాతియు, వియతియుఁ, గృతియు నన నార్గురు గొడుకులు, దేహికి నింద్రియంబుల

1. హోమము చేయించి.

చందంబున సంభవించి; రందుఁ బెద్దకొడుకగు యతికి రాజ్యం బిచ్చిన నతండు
విరక్తుండై. 506

క. "రాజ్యంబు పాపమూలము-రాజ్యముతో నొడ లెఱుంగ రాదు; సుమతియుఁ దా
రాజ్యమునఁ బూజ్యు నెఱుఁగఁడు-రాజ్యము గీజ్యమ్ము ముక్తిరతునకు నేలా?"

వ. అని పలికి, వాఁడు రాజ్యమునకుం బాసి చనియె. 508

క. ఆ నహుషుఁడు మఖశతమును-మానుగఁ గావించి *యింద్రమానినిఁ గవయం
బూని, మునీంద్రులు మోచిన-¹యానముపై నుండి కూలె, నహియై నేలన్.

ఉ. అన్నయుఁ దండ్రియుం జన, యయాతి మహీపతి యై, చతుర్దిశల్
పన్నుగఁ గావఁ, దమ్ములకుఁ బాలిడి, శుక్రునికూఁతురున్, సుసం
పన్నగుణాభిరామ వృషపర్వునికూఁతుర ²నోలి నాండ్రు గా
సన్నయశాలి యీ ధరణిచక్రధురంధరుఁ డయ్యెఁ బేర్మితోన్." 510

వ. అనిన విని పరీక్షిన్నరేంద్రుం డి ట్లనియె. 511

యయాతిచరిత్రము

ఆ. "పార్థివుఁడు యయాతి; బ్రహ్మర్షి భార్గవుఁ;-డల్లుఁ డగుట, మామ యగుట యెట్లు?
రాజు రాచకూఁతు రతి సేయఁదగుఁగాక-విప్రకన్య నొంద విహితమగునె?"

వ. అనిన శుకుం డి ట్లనియె. 513

సీ. దనుజేంద్రుకూఁతురు తరళాక్షి శర్మిష్ఠ, పురములో నొకనాఁడు ప్రొద్దు వోక,
వేవురు బోటులు వెంట రా, గురుసుత యగు దేవయానితో నాట మరగి,
పూఁచినయెలదోఁటపొంత జొంపముగొన్న క్రొమ్మావిచేరువకొలఁకుఁ జేరి
యందుఁదమ్ముల తేనె లాని చొక్కుచుమ్రోయు నళులఝుంకృతులకు నదరిపడుచు,
ఆ. వలువ లూడ్చి, కొలఁకు వడిఁ జొచ్చి, తమలోనఁ-బెల్లురేఁగి, నీటఁ జల్లులాడ,
నందినెక్కి మాళి నిందురోచులు పర్వ-శూలి వచ్చెఁ, ³గొండచూలితోడ.

చ. మలహరుఁ జూచి సిగ్గుపడి, మానిను లందఱు సంభ్రమంబునన్
వలువలు గట్టుచో, దనుజవల్లభుకూఁతురు దేవయానిదు
వ్వలువ ధరించి, వేగమున వచ్చినఁజూచి, "యెఱిం గెఱింగి, నా
వలు విది యెట్లు కట్టికొన వచ్చును దానికి?" నంచుఁ దిట్టుచున్. 515

వ. దేవయాని యి ట్లనియె. 516

శా. "ఆ లోకేశుముఖంబునం గలిగె ⁴బ్రాహ్మణ్యంబు; బ్రహ్మంబు నా
మేలై వైదికమార్గముల్ దెలుపుచున్ మి న్నంది, యందున్ మహా

* శచీదేవిని. 1. వాహనము-పల్లకి. 2. క్రమముగా. 3. పార్వతి. 4. బ్రాహ్మణవృత్తి ధర్మము.

శీలుఁ భార్గవు; లందు శుక్రుఁడు సుధీసేవ్యుండు; నే వానికిం
జూలన్: నావలు వెట్లు గట్టితివి రక్షోజాత వై? చేటికా! 517

క. మహిమవతు లైనభూసుర-మహిళల విత్తములు వెఱమగువల కగునే?
మహిఁ బసిఁడిగొలుసు లిడినన్-విహితములే కుక్కలకు హవిర్భాగంబుల్? 518

క. మీతండ్రి మాకు శిష్యుఁడు-మాతండ్రి గురుండు; గొంతమాత్రం బైనం
బ్రీతిం గావింపక, పరి-భూతం జేయుదువె? తులువపోఁడిమిఁ జెనఁటీ!" 519

వ. అని భర్జించుచున్న దేవయానిపలుకులు విని, కరాళించి మ్రోగుచున్న భుజంగి
చందంబున నిట్టూర్పులు నిగిడించి, పెదవులు గొఱుకుచు శర్మిష్ఠ యిట్లనియె. 520

శా. "భిక్షుం డై తమతండ్రి మాజనకునిన్ భిక్షించినం, దన్ను సం
రక్షింపం, దుది నింత యై మఱపుతో రాజప్రసూనాకృతి
న్రక్షోరాజతనూజతో, సుగుణతో, నాతో సమం బాడెడిం;
[1]గుక్షిస్ఫోటము గాఁగ దీనిఁ జెలు లీకూపంబునం ద్రోవరే!" 521

వ. అని పలికి. 522

ఆ. [2]బోటిపిండుచేతఁ బొదువంగఁ బట్టించి-రాజసమున దైత్యరాజతనయ
దొడరి, దేవయానిఁ ద్రోపించె, వలువీక-కుంకినూతిలోనఁ గుతిలకొనఁగ. 523

వ. ఇట్లు సేసి, శర్మిష్ఠ వోయిన వెనుక, యయాతిభూపాలుండు వేఁటమార్గంబు
న నడవిం దిరుగుచు, దైవయోగంబున నాదేవయాని యున్ననూయి సేరం
జనుదెంచి యందు. 524

క. బంధువుల నెల్లఁ జీరుచు-నంధుజలామగ్నమధ్య యై వగచుచు, ని
ర్బంధమునఁ జిక్కి, పీడా-సింధువున మునింగి యున్న చేడియఁ గనియెన్. 525

వ. కనుంగొని. 526

దేవయాని యయాతిని వరించుట

శా. సప్తాంభోనిధి[3]మేఖలావృతమహాసర్వంసహాకన్యకా
ప్రాప్తోద్యద్వరదక్షుదక్షిణకరప్రాలంబముంజేసి, ప్రో
త్క్షిప్తం జేసె యయాతి, గట్టుకొనఁ బై చేలంబు మన్నిచ్చి, ప
ర్యాప్తస్వేదజలాంగి, నాళీసముదాయస్వర్గవిన్, భార్గవిన్. 527

వ. ఇట్లు నూయి వెడలించిన రాజునకు రాజవదన యిట్లనియె. 528

మ. "ననుఁ బాణిగ్రహణం బొనర్చితి కదా? నాథ ర్తవున్ నీవ; దై
వనియోగం బిది; తప్పు; దప్పురుషతావాక్యంబు సిద్ధంబు; సౌ (*)

---

1. కడుపు బ్రద్దలగునట్లు. 2. చెలులసమూహము. 3. ఒడ్డాణము.

* అన్ని ముద్రణములలోను ఇదేపాఠము. అర్థము చింత్యము.
'ఏవ ఈశకృతో వీర సంబంధో నౌ నపౌరుషః' అని మూ. (౯.౧౮.౨౧)

ఖ్యనివాసుఁ నిను మాని, యొండువరునిం గాంక్షింప నే నేర్తునే?
వనజం బానెడి తేంటి; యన్యకుసుమావాసం బపేక్షించునే? 529

వ. అదియునుం గాక. 530

సీ. సుగుణాఢ్య! విను; నేను శుక్రునికూఁతుర దేవయానిని; బొల్లి దేవమంత్రి
తనయుండు కచుఁడు, మాతండ్రిచేత మృతసంజీవనిఁ దా నభ్యసించువేళ
నతనిఁ గామించిన నతఁ "డొల్ల" ననవుడు, నతఁడు నేర్చినవిద్య యడఁగి పోవ
నతని శపించిన, నతఁడు నాభర్త "బ్రాహ్మణుఁడు గాకుండెడు" మని శపించె;

తే. నది నిమిత్తంబు నాకు బ్రాహ్మణుఁడు గాఁడు;
ప్రాణనాథుఁడ వీ" వని పడఁతి వలుకఁ
దనమహ్హృదయంబు నెలఁతపైఁ దగులువడినఁ
దమక మొకయింతయును లేక తలఁచి చూచి. 531

మత్తకోకిలము. "దైవయోగము గాక; విప్రసుతన్ వరించునె నామనం
బేవిధంబున? నీశ్వరాజ్ఞయు నిట్టి"దంచు వరించె ధా
త్రీవరుండును దేవయానిని; ధీరబుద్ధులకుఁ, మనో
భావ మొక్కటియే ప్రమాణ మభావ్యభావపరీక్షకున్. 532

వ. ఇట్లు వరించి, యయాతి సనినవెనుక, దేవయాని శుక్రునికడకుం జని, శర్మిష్ఠ
సేసిన వృత్తాంతం బంతయుం జెప్పి, కన్నీరు మున్నీరుగా వగచిన. 533

క. "క్రూరాత్ములమందిరములఁ-[1]బౌరోహిత్యంబు కంటె! పాపం; బీసం
సారముకంటె శిలల్ దిని-యూరక [2]కాపోతవృత్తి నుండుట యొప్పున్." 534

వ. అని వృషపర్వుకడ నుండుట నిందించుచు, శుక్రుం డా కూఁతుం దోడ్కొని,
పురంబు వెడలిచన, నయ్యసురవల్లభుండెఱింగి, శుక్రునివలన దేవతల గెలువఁ
దలంచి, తెరువున కడ్డంబువచ్చి, పాదంబులపైఁబడి, ప్రార్థించి, ప్రసన్నుం జేసిన
నా కోపంబు మాని, శుక్రుండు శిష్యున కిట్లనియె. 535

తరలము. "చెలులు వేవురుఁ దాను, నీసుత చేటికై వడి నాసుతం
గొలుచుచుండినఁ దీఱుఁ గోపము; గొల్వఁ బెట్టవ వేని నీ
వెలఁదిఁ దోడ్కొనివత్తు" నావుడు "వేగ రమ్మ"ని భార్గవిం
గొలువఁ బెట్టె సురారివర్యుఁడు కూఁతు నెచ్చెలిపిండుతోన్. 536

మ. "చల మింకేల?" లని తన్నుఁ దండ్రి వనుపన్, శర్మిష్ఠ సన్నిష్ఠతో
జలజాతాస్యలు [3]సద్వయస్యలు, సహస్రంబు న్ననుజస్రంబుఁ ద

1. పురోహితుని ధర్మము .2 పావురము జీవనమువంటి జీవనము. 3. మంచి చెలులు.

న్నులమఁగ, దాసి సుదాసి యయ్యెఁ బగ వాయఁగ భూరికోపానలా
కలితగ్లానికి, దేవయానికి, మహాగర్వోద్యమస్థానికిన్. 537

వ. అంత. 538

ఉ. ఆతత మైన వేడ్కఁ దనుజాధిపమంత్రి సురారినందనో
పేతఁ దనూభవం బిలిచి పెండ్లి యొనర్చె మహావిభూతికిం
బ్రీతి మహోగ్రజాతికి, నభీతికి, సాధువినీతికిన్ సిత
ఖ్యాతికి, భిన్నదుఃఖబహుకార్యభియాతికి నయ్యయాతికిన్. 539

వ. ఇట్లు యయాతికి దేవయాని నిచ్చి, శుక్రుండు "శర్మిష్ఠాసంగమంబు సేయకు" మని యతని నియమించి, పనిచె; పిదప దేవయానియు నయ్యయాతివలన యదుతుర్వసు లను కుమారులం గనియె; నొక్కరేయి సెలంగు మాసి, దేవయాని వెలుపల నున్నయెడ శర్మిష్ఠ యెడరువేచి. యేకాంతంబున యయాతి కడకుం జని, చెఱకువింటిజోదుపువ్వుటంపఱ కోహటించి, తనతలంపు సెప్పిన.

### శుక్రాచార్యులు యయాతికి శాపం బొసంగుట

ఉ. ఆ జవరాలిఁ జూచి, మన మాఁపఁగ లేక, మనోభవార్తుఁడై
యా జనభర్త మున్ను కవి యాడినమాట దలంచి యైనఁ, [1]జే
తోజసుఖంబులం దనిపెఁ; ద్రోవఁగ వచ్చునె దైవయోగముల్?
రాజఁట! సద్రహస్య మఁట! రాజకుమారుని మాన నేర్చునే? 541

వ. ఇట్లు యయాతివలన శర్మిష్ఠ గర్భం బై క్రమంబున ద్రుహ్యుండు, ననువుఁ, బూరువు నను మువ్వురు తనయులం గాంచె; నంత దేవయాని తద్వృత్తాంతం బంతయు నెఱింగి, కోపించి, శుక్రుకడకుం జని, క్రోధమూర్ఛిత యై యున్న సమయంబున, యయాతి వెంటం జని యిట్లనియె. 542

ఆ. "మామ కేల చెప్ప? మాను సరోజాక్షి; దనుజతనయఁ బొంది తప్పు వడితిఁ;
గామి నయిన నన్నుఁ గరుణింపు; పతిమాట-తండ్రిమాటకంటెఁ దగును సతికి."

వ. అని పలికి, పాదంబుల కెఱఁగిన నయ్యింతి యొడంబడక యుండె; నంత నది యెఱింగి శుక్రుం డిట్లనియె. 544

క. "నామాట ద్రోచి, దానవ-భామను బొందితివి; ధరణిపాలక! తగవే?
యేమాట? యేది రూపము-కాముకులకు? లోలుపులకుఁ గలవే నిజముల్?"

వ. అని పలికి "నిన్ను వనితాజనహేయం బయిన [2]ముదిమి వొందెదు" మని శపియించిన యయాతి యిట్లనియె. 546

---

1. మన్మథసుఖములు. 2. ముసలితనము.

క. ''మామా! నాపైఁ గోపమ? - మామా! నీపుత్రియందు మానవు నాకుం
గామోపభోగవాంఛలు - ప్రేమన్ రమియించి ముదిమిఁ బిదపం దాల్తున్.

వ. అని పలికి, యనుజ్ఞగొని, దేవయానిం దోడ్కొని పురంబునకుం జని, పెద్ద
కొడుకగు యదువుం బిలిచి, యయాతి యిట్లనియె. 548

శా. నీతల్లిం గనినట్టి శుక్రువలనన్ నేఁ డీ జరం బొందితిన్;
నాతండ్రీ! యదునామధేయ! తనయా! నా*వృద్ధతం దాల్పవే;
నీతారుణ్యము నాకు నీవె? తనివో నిండారఁ గొన్నాళ్లు నేఁ
జేతోజాతసుఖంబులం దిరిగెదన్ శృంగారినై పుత్రకా!'' 549

వ. అనిన విని తండ్రికి యదుం డిట్లనియె. 550

శా. ''కాంతాహేయము, దుర్వికారము, దురా[1]కండూతిమిశ్రంబు, హృ
చ్చింతామూలము, పీనసాన్వితము, ప్రస్వేదప్రణాకంపన
శ్రాంతిస్ఫోటకయుక్త, మీ ముదిమి వాంఛం దాల్చి, నానాసుఖో
పాంతం బైన వయోనిధాన, మిది యయ్యా! తేర యీవచ్చునే?'' 551

వ. అని యదుం డొడంబడ కున్న, యయాతి తుర్వసుద్రుహ్యాదుల నడిగిన, వారును
యదువు పలికినట్ల పలికినఁ గడగొట్టు కొమారుం డైన పూరువున కి ట్లనియె.

ఉ. ''పిన్నవు గాని, నీవు కడుఁ బెద్దవు బుద్ధులయందు; రమ్ము; నా
యన్న! మదాజ్ఞ దాఁటవుగదన్న! వినీతుఁడ వన్న! నీవు నీ
యన్నలు సెప్పినట్లు పరిహారము సెప్పకుమన్న! నా[2]జరన్
మన్ననఁ దాల్చి, నీ[3]తరుణిమం బొనఁగూర్పుము నాకుఁ; బుత్రకా!'' 553

వ. అనిన విని, గురుభక్తిగుణాధారుం డయిన పూరుం డి ట్లనియె. 554

శా. ''అయ్యా! న న్నిటు వేఁడ నేల? భవదీయాజ్ఞానముల్లంఘనం
బయ్యుండం, బరిహారమున్ నొడువ నే నయ్యాయినే? నీజరన్
నెయ్యం బొప్పఁగఁ దాల్చి, నాతరుణిమన్ నీ కిచ్చెదం బంపినం;
గయ్యంబాడెడి పుత్రకుండు [4]క్రిమిసంకాశుండు గాకుండునే? 555

వ. అదియునుం గాక. 556

క. మునివృత్తి డయ్య నేటికి?-జనపాలక! సుగతిఁ గోరు సత్పురుషులకుం
దనుఁ గన్నతండ్రి సెప్పిన-పని సేసిన, సుగతి గొంగుపసిఁడియ కాదే? 557

క. పనుపక చేయుదు రధికులు;-పనిచిన మధ్యములు వొందుపఱుతురు; తండ్రుల్
పని చెప్పి, కోరి పనిచిన-ననిశము మాటాడుపుత్రు లధములు; తండ్రీ!'' 558

* ముదుసలితనము. 1. దురద 2. వృద్ధత్వమును 3. యౌవనము. 4. పురుగుతో సమానుఁడు.

వ. అని పలికి, పూరుండు ముదిమి సేకొని, తన లేఁతప్రాయంబు యయాతి కిచ్చె; నయ్యయాతియుం దరుణుండై. 559

శా. ఏడౌ దీవపము, [1]లేడువాడలుగ, సర్వోలాతలంబెల్లఁ బె
న్వోడై, పోఁడిగ నేలుచుం, బ్రజల నన్వేషించి రక్షించుచుం,
దోడ్కన్ భార్గవి రా, మనోజసుఖసంతోషంబులం దేలుచుం,
గ్రీడించెన్ నియతేంద్రియుండగుచు, నాక్రీడాతిరేకంబులన్. 560

క. మర్మంబుల, నతిసాధ్వీ-ధర్మంబుల, దేవయాని దనప్రాణేశున్
నర్మముల, మనోవాక్తను-కర్మంబుల నొందు లేక కడు మెప్పించెన్. 561

శా. ఆకాశంబున మేఘబృందము ఘనంబై, సన్నమై, దీర్ఘమై,
యేకంబై, బహురూపమై, యడఁగున ట్లైదేవుగర్భంబులో
[2]లోకశ్రేణి జనించుచున్, మెలఁగుచున్, లోపించు నాదేవు సు
శ్రీకాంతున్ హరిఁగూర్చి యాగములు సేసెన్ నాహుషుం డిమ్ములన్. 562

వ. మఱియు. 563

మ. చెలికాంద్రం, గరులన్, రథమ్ముల, భటశ్రేణిం, దురంగంబులం,
గలలోఁ గన్నధనావళిన్, సమములం గాఁ జూచుచున్, భార్యతోఁ
బలు వేలేండ్లు మనోజభోగలహరీపర్యాప్తుఁడై తేలియున్,
బలుతృష్ణం గడఁగాన, కెంతయు మహాబంధంబులన్ స్రుక్కుచున్. 564

వ. ఒక్కదినంబున నాత్మజ్ఞానంబునం జేసి, కాంతానిమిత్తంబున మోసపోవుట యెఱింగి, యయాతి యతివిషాదంబు నొంది, దేవయాని కిట్లనియె. 565

యయాతి దేవయానికి బస్తోపాఖ్యాన మనెడి వ్యాజంబున స్వవృత్తాంతంబు దెలుపుట

క. "మనచారిత్రమువంటిది, విను; మితిహాసంబు గలదు; వృద్ధజనములున్
మునులును మెత్తురు; నీవును-మనమున నంగీకరింపు; మంజులవాణీ!" 566

వ. అది యెట్టిదనిన. 567

సీ. "అజ మొకం డడవిలో నరుగుచుఁ దాఁ గర్మఫలమున నూతిలోపలికి జాఱి,
లోఁగెడిఛాగి నాలోకించి, కామియై కొమ్మున దరిఁ గొంత గూలఁ ద్రోచి,
వెడలింప, నచ్ఛాగి "విభునిఁ గాఁగోరిన నగుఁ గాక!" యని తాను నదియుఁ దిరుగ
నెన్నియేనియుఁ దన్ను నెంత కామించిన, నన్నిటికిని భర్తయై తనర్చి,
తే. వాని నేప్రొద్దు రతులకు వశలఁ జేసి-సొరిది గ్రీడించి, క్రీడించి, చొక్కి చొక్కి,
కాముఁ డనియెడుదుస్సహగ్రహముక తనఁ-జిత్తమే మఱి, మత్తిల్లి చెల్లఁ జిక్కి.

1. ఏడు వీథులుగా, 2. లోకముల వరుసలు.

క. వెడవిలుతు కేళిఁ జిగురా-[1]కడిదపు వ్రేటునకు లోఁగి, యతిమోహితుఁ డై
విడువక, సతులం దగిలెడు-జడునకు నెక్కడివి బుద్ధిచాతుర్యంబుల్? 569

వ. అంత నచ్ఛాగంబు దనపిదపం దగిలిన ఛాగీనివహంబులోపలం జూడనొప్పెడి ఛాగియందుఁ దగిలి, క్రీడింపం గని, నూతిలోపలం బడి వెలువడినఛాగి తనపతి వలనినెయ్యంబులేకుండుటకు ఖిన్నయై తనమనంబున. 570

క. "పలికిన పలుకులు వలుకఁడు;-కలయఁగ నవకాంతఁ జూచి, కడుసంచలుఁ డై
నిలిచినచోటఁగ నిలువఁడు;-[2]నిలువెల్లను గల్ల; కామి నిజమరి గలఁడే?" 571

వ. అని పలికి, విడిచి చనిన నయ్యజవల్లభుండు సురతపరతంత్రుం డై 'మిసి మిసి' యను శబ్దంబు సేయుచుఁ, దచ్ఛాగివెంటం జని, యొడంబఱుపం జాలకుండె; నంత దానికిఁ గర్త యైన బ్రాహ్మణుండు, రోషంబున రతిసమర్థంబు గాకుండ, నల్లాడుచుండ, ఛాగవృషణంబులు ద్రెంచివేసిన, నచ్ఛాగంబు గ్రిందఁబడి, వేఁడుకొనినఁ, బ్రయోజనంబు వాఁడగని యోగవిదుండుగావున బ్రాహ్మణోత్తముండు గ్రమ్మఱ నయ్యజ వృషణంబులు సంధించిన. 572

క. వృషణములు మరలఁ గలిగిన-సుషముం డై, ఛాగవిభుండు సుందరితోడఁగ
విషయసుఖంబులఁ బొందుచుఁ-[4]దృష తుదిఁ గనఁడయ్యెఁ బెక్కుదివసము లయ్యున్."

వ. అని యివ్విధంబున యయాతి దేవయానికి నిజవృత్తాంతంబు గథారూపంబున నెఱింగించి, యి ట్లనియె. 574

మ. అబలా! నీనిబిడాతిదుర్జయసలజ్జాపాంగభల్లంబులం
బ్రబలం బైన మనంబు భగ్నముగ, నాప్రావీణ్యముం గోలుపో
యి, బలిష్ఠుం డగు కాము బారిఁ బడి, నే నెట్లోర్తునే? బందిక
త్తెబడిం బాపపుఁదృష్ణ యిప్పుడకటా! దీర్ఘాకృతిఁగ రొప్పెడిన్. 575

క. అదలదు ప్రాణము; లదలినఁ-గదలదు; సర్వాంగకములుఁ గదలుచు నుండఁగ
వదలదు; బిగువులు వదలిన-ముదిలేఁదీతృష్ణ; దీనిఁ ద్రుంపఁగ వలయున్. 576

క. వెయ్యేండ్లయ్యెను; నీతోఁ-గ్రయ్యంబడి యున్నవాఁడఁ గామసుఖములం;
గ్రొయ్య దొలకయించు కైన;-న్డయ్యద; కొన లిడియెఁ దృష్ణ; నవపద్మముఖీ!

క. ముదిసెను దంతావళియును;-ముదిసెను గేశములు; దనువు ముదిసెం; దనకుఁగ
ముదియ నివి రెండు సిక్కెను;-బ్రదికెడితీపియును, విషయపక్షస్పృహయున్.

క. కడ లేదాశాలతకుం;-గడఁ జూడఁగఁ గాన రాదు; కడఁ గని రేనిఁగ?
గడుముదమున సంసారము-గడఁగందురు తత్త్వవిదులు గమలదళాక్షీ! 579

---

1. బాణము యొక్క దెబ్బకు. 2. శరీరమంతయును. 3. అందుమేఁక. 4. ఆశ.

క. మండసహాటకపశువే-దండాశ్వవధూదుకూలధాన్యాదులు పె
క్కుండియు, నాశాపాశము-ఖండింపఁగ లేవు; మఱియుఁ గడమయ చుమ్మీ!

క. కామోపభోగసుఖములు-వేమాఱును బురుషుఁ డనుభవించుచు నున్నం,
గామంబు శాంతిఁ బొందదు-[1]ధూమధ్వజుఁ డాజ్యవృష్టిఁ ద్రుంగుడువడునే?

ఆ. అక్క, తల్లి, చెల్లె, లాత్మజ, యెక్కన-పాను పెక్కఁ జనదు; పద్మనయన!
పరమయోగి కైన, బలిమిని [2]నింద్రియ-గ్రామ మధికపీడఁ గలుగఁజేయు.

క. వెంగలివిత్తయి తిరుగుచుఁ-గంగారై చెడక, ముక్తిఁ గాంక్షించునతం
డంగనలతోడ విడువని-సంగడములు వదలవలయు, జలజాతముఖీ! 583

వ. అది గావున, నేఁడు మొదలు తృష్ణాఖండనంబు సేసి, నిర్విషయుండ నయి యహంకారంబు విడిచి, మృగంబులం గలసి, వనంబున సంచరించెదఁ; బర బ్రహ్మంబునందుఁ జిత్తంబు చేర్చెద; బ్రహ్మనిష్ఠ మనుష్యులకు నాశానివారిణి యగుటం జేసి, యే నందుఁ దత్పరుండ నై, యాహారనిద్రాదిభోగంబులం బరిహరించెద; దాత్మవిదుండై సంసారనాశంబుఁ దలంచినవాఁడె విద్వాంసుం;" డని పలికి పూరునియౌవనం బతని కిచ్చి, ముదిమి దాను గైకొని, విగత లోభుండై, నిజ భుజశక్తిపాలితంబగు భూమండలంబు విభాగించి, ద్రుహ్యున కుఁ బూర్వభాగంబును, యదువునకు దక్షిణభాగంబును, దుర్వసునకుఁ బశ్చిమ దిగ్భాగంబును, ననువునకు నుత్తరదిగ్భాగంబును సంరక్షింపుం డని యిచ్చి, వారల సమక్షంబున. 584

క. నాలుగుచెఱఁగులనేలయుఁ-బాలింపుం" డనుచు నగ్రభవులను బంచెన్;
భూలోక మేలు మనుచును-బాలార్కోదారుఁ బూరుఁ బట్టము గట్టెన్. 585

వ. ఇట్లు పూరునికి రాజ్యం బిచ్చి, పెక్కువర్షంబులందు ననుభూతంబు లయిన యింద్రియసుఖంబులు విసర్జించి. 586

క. మిక్కిలి సుజ్ఞానంబునఁ-జక్కఁగఁ దెగనడిచి, వైరిషడ్వర్గంబున్
ఱెక్కలు వచ్చిన విహగము-గ్రక్కున నీడంబు విడుచుకరణి నుదితుఁడై. 587

క. కారుణికోత్తముఁ డగు హరి-కారుణ్యముకతన నతఁడు ఘనుఁడై గెలిచెం;
గ్రూరము లగువిషయంబుల-నూరక గెలువంగ శక్తుఁ డొక్కఁడు గలఁడే? 588

వ. మఱియు నిర్మూలితసంగుండై సత్త్వరజస్తమోగుణంబుల దిగనాడి, నిర్మలం బయి పరమం బయిన వాసుదేవాభిధాన బ్రహ్మంబునందు యయాతిభూపాలుండు స్వతస్సిద్ధ యయిన భాగవతగతిం జెందె; నంత. 589

---

1. అగ్ని. 2. ఇంద్రియముల యొక్క సముదాయము. 3. ప్రేమలు సంబంధములు.

సీ. ప్రాణేశుఁ డాడిన పలుకులు నగవులు గాఁ జూడ, కంతరంగమున నిలిపి,
"పథికు లై పోవుచుఁ బాసీయశాలలఁ జల్లగా నుండెడి జనులయట్ల.
సంసారమునఁ గర్మసంబంధులై వచ్చి, యాలుబిడ్డలు మగం డనుచుఁ గూడి
యుండుట గాని, సంయోగంబు నిత్యంబు గా; దీశమాయాప్రకల్పితంబు;
తే. దీని విడుచుట దగ" వని తెగువ మెఱసి-నిద్ర చాలించి మేల్కాన్న నేర్పుచాలఁ
గలిగి [1]భార్గవి సర్వసంగముల విడిచి-హరిపరాధీన యై ముక్తి కరిగె నధిప!

వ. అని యిట్లు యయాతిచరితంబు సెప్పి, "భగవంతుండును సర్వభూతనివాసుండును, శాంతుండును, వేదమయుండును నైన వాసుదేవునికి నమస్కరించె" నని శుకుం డి ట్లనియె. 591

క. "భారత! నీవు జనించిన-పూరునివంశంబునందుఁ బుట్టినవారిం,
జారుయశోఽలంకారుల-ధీరుల వినిపింతు నధిక తేజోధనులన్. 592

వ. పూరునకు జనమేజయుండు, జనమేజయునకుఁ బ్రాచిన్వాంసుండు, నాప్రాచిన్వాంసునకుఁ బ్రవిరోధనమన్యువు, తననికిఁ జారువుఁ బుట్టె; నాచారువునకు సుద్యువు, సుద్యువునకు బహుగతుండును, బహుగతునకు శర్యాతియు; శర్యాతికి సంయాతియు, సంయాతికి రౌద్రాశ్వుండును, రౌద్రాశ్వునకు ఘృతాచి యను నచ్చరలేమయందు ఋతేపువుఁ, *గక్షేపువు, స్థలేపువుఁ, గృతేపువు, జలేపువు, సన్నతేపువు, ధర్మేపువు, సత్యేపువు, ప్రతేపువు, వనేపువు ననువారు జగదాత్మభూతుండైన ప్రాణునకు నింద్రియంబులచందంబునఁ బదుగురు గొడుకులు జన్మించి; రందు ఋతేపువునకు నంతిసారుండును, నంతిసారునకు సుమతియు, ధ్రువుండు, నప్రతిరథుండు నన మువ్వురు పుట్టి; రందు నప్రతిరథునికిఁ గణ్వుండును, గణ్వునికి మేధాతిథియు, నతనికిఁ బ్రస్కందుండు మొదలగు బ్రాహ్మణులును జన్మించి; రా సుమతికి రైభ్యుండు పుట్టె; రైభ్యునకు దుష్యంతుండు పుట్టె. 593

క. పారావారపరీతో-దారధరాభారదక్షదక్షిణహస్త
శ్రీ రాజిల్లఁగ నొకనాఁ-డారాజేంద్రుండు వేఁటయం దభిరతుఁడై. 594

క. గండకకంఠీరవభే-రుండశశవ్యాళకోలరోహిషరురువే
దండవ్యాఘ్రమృగాదన-చండశరభశల్యభల్లచమరాటవులన్. 595

క. చప్పుడు సేయుచు, మృగముల-[2]రొప్పుచు నీరములయందు రోయుచు, వలలం
ద్రిప్పుకొని పడఁగఁ జోపుచు-దప్పక వ్రేయుచును వేఁటతమకం బొప్పన్. 596

క. మృగయూథంబుల వెంటను-మృగలాంఛనసన్నిభుండు మృగయాతురుఁడై
మృగయులు గొందఱు గొలువఁగ-మృగరాజపరాక్రమంబు మెఱయఁగ వచ్చెన్

1. లక్ష్మీదేవి. * మూలమందు ఋతేయు, కక్షేయు-ఇట్లు ఈ పదుగురి నామములన్నియు యువర్ణాంతములై యున్నవి. 2. అదలించుచు.

వ. ఇట్లు వచ్చివచ్చి, దైవయోగంబునఁ గణ్వమహామునితపోవనంబు సేరం జని.
సీ. ఉరుతరశ్రాంతాహియుగళంబులకుఁ బింఛములు విసరెడికేకిముఖ్యములను,
గరుణతో మదయుక్తకలభంబులకు మేఁత లిడుచు ముద్దాడు మృగేంద్రములను,
ఘన[1]మృగాదనములు గాపుగా లేళ్లతో రతులు సాగించుసారంగములను,
నునుపుగా హోమధేనువులకంఠంబులు దువ్వఁచు నాడుశార్దూలములను,
తే. దార కలహించు నుందురు దంపతులకు-మైత్రి నంకించుమార్జాలమల్లములను,
మతిని జాతివైరంబులు మాని, యిట్లు-గలసిక్రీడించు మృగములఁగాంచెనతఁడు.
క. ఇత్తెఱఁగున మృగజాతుల-[2]పొత్తులు మేమెఱుఁగ మనుచు, భూవల్లభుఁడుం
జిత్తములోపల నామునిసత్తము సద్వృత్తమునకు సంతసపడుచున్. 600
క. హల్లకబిసరుహసరసీ-కల్లోలోత్ఫుల్లయూథికాగిరిమల్లీ
మల్లీమరువకకురవక-సల్లలితానిలమువలన సంతుష్టుండై. 601
వ. దుష్యంతుండు వచ్చునవసరంబున. 602
క. ''ఇందిందిరాతి సుందరి-[3]యిందిందిరచికుర యున్న; దిందింద శుభం;
బిం దిందువంశ!'' యనుక్రియ,నిందీవరవీథి మ్రోసె నిందిందిరముల్. 603
క. ''మాకందర్పునిశరములు-మాకందము లగుటఁ జేసి, మాకందంబుల్
మాకందము''లనుకైవడి - మాకందాగ్రములఁ బికసమాజము లులిసెన్. 604
వ. అంత. 605
క. ''ఇం దున్న కణ్వమునికిని-వందన మొనరించి, తిరిగివచ్చెద;'' ననుచుం
బొందుగ ననుచరులను దా - నందఱ నందంద నిలిపి, యటఁ జని మ్రోలన్.
శా. ఆకణ్వాశ్రమమందు నీరజనివాసాంతప్రదేశంబులన్,
మాకందంబులనీడఁ గల్పలతికామధ్యంబులన్, మంజురం
భాకాండాంచితశాలలోఁ, గుసుమసంపన్నస్థలిం జూచె, నా
భూకాంతుండు శకుంతలన్ నవనటద్భ్రూపర్యటత్కుంతలన్. 607
క. [4]దట్టపుఁదుఱుమును, మీఁదికి-మిట్టించినచన్నుఁగవయు, మిఱుమిఱుచూడ్కుల్
నట్టాడు నడుముఁ, దేనియ-లుట్టెడు మోవియును, మనము నూరింపంగన్. 608
వ. అంత నారాజకుమారుం డలరుటమ్ముల విలుకానివెడవింట ఘుణఘుణాయమాన
లయి మ్రోయు ఘుంటలకుం బంటించి, తన మనంబున. 609
శా. వన్యాహారములన్ జితేంద్రియత [5]నావాసించు నా కణ్వుఁ డీ
కన్యారత్నము నేగతిం గనియెడిం? గా దీకురంగాక్షి, రా[6]

1. మృగములను తినునట్టివి. 2. సంబంధము, స్నేహము. 3. తుమ్మెదలవంటి ముంగురులుకలది
4. నిండుకొప్పు 5. నివసించు 6. రాజసంతానము.

జన్యాపత్యము గాఁగ నోపు; నభిలాషం బయ్యెఁ; గాదేని, నే
*యన్యాయక్రియలందుఁ బౌరవుల కెం దాశించునే చిత్తముల్? 610

క. అడిగిన "నృపసుతఁ గా నని—నొడివెడినో; యిది మనంబు నొవ్వ"నని విభుం
డుడురాజవదన నడుగక—తడుమన యొకకొంత ప్రొద్దు దడఁబడఁ జొచ్చెన్.

వ. మఱియు నెట్టకేలకుఁ దనచిత్తసంచారంబు సత్యంబు గాఁదలంచి, యిట్లనియె.

క. "భూపాలకకన్యక వని—నీపయిఁ జిత్తంబు నాఁటెఁ; నీవారేరీ?
నీపేరెవ్వరు? నిర్జన, భూపర్యటనంబు దగవె; పూర్ణేందుముఖీ!" 613

వ. అని పలుకుచున్న రాజకుమారునివదనచంద్రికారసంబు నేత్రచకోరంబులవలనం
ద్రావుచు, నయ్యువిద విభ్రాంత యయి యున్న సమయంబున. 614

క. కంతేకాలునిచేతం—గుంతితుఁ డగు టెట్లు? మరుఁడు కుసుమాస్త్రంబుల్
లుంఠించి, గుణనినాదము—"శంఠ"మ్మన బాలనేసె దవదవ గదురన్. 615

వ. ఇట్లు వలరాచవాని క్రొవ్విరికోలలవేఁడిమిఁ దాలిమిపోఁడిమి సెడి, యావాలుఁ
గంటి యి ట్లనియె. 616

మ. "అనివార్యప్రభ మున్ను మేనకయు, విశ్వామిత్రభూభర్తయుం,
గని; రామేనక డించి పోయె నడవిం; గణ్వుండు నన్నింతగా
మనిచెన్; సర్వము నా మునీంద్రుఁ డెఱుఁగున్; [1]మద్భాగధేయంబునన్
నినుఁ గంటిం బిదపం గృతార్థ నగుచున్, నేఁ డీ వనాంతంబునన్. 617

క. నీవారము; ప్రజ లేమును—నీవారము పూజగొనుము; నిలువుము; నీవున్,
నీవారును మాయింటను—నీవారాన్నంబు గొనుఁడు నేఁడు నరేంద్రా!" 618

వ. అని పలికిన దుష్యంతుండు మెచ్చి, మచ్చెకంటియిచ్చ యెఱింగి యిట్లనియె.

ఆ. "రాజతనయ వగుదు; రాజీవదళనేత్ర! మాట నిజము; లోని మాట లేదు;
తనకు సదృశుఁ డయిన తరుణునిఁ గైకొంట—రాజసుతకుఁ దగవు రాజవదన!"

వ. అని మఱియుఁ దియ్యనినెయ్యంపుంబలుకులవలన నయ్యువిద నియ్యకొలిపి. 621

క. బంధురయశుఁడు, జగన్నుత—సంధుఁడు, దుష్యంతుఁ, [2]డుచితసమయజ్ఞుండై
గంధగజగమన నప్పుడు, గాంధర్వవిధిన్ వరించె గహనాంతమునన్. 622

భ ర తు ని చ రి త్ర ము

వ. ఇవ్విధంబున నమోఘవీర్యుం డగు నా రాచపట్టి దపసిరాచూలికిఁ జూలు నిలిపి,
మఱునాఁడు తనవీటికిం జనియె; నయ్యింతియుం గొంతకాలంబునకుఁ గొడుకుం

*. అన్యాయ త్తములందుఁ బౌరవుల కిట్లాశించునో చిత్తముల్ – అని పాఠాంతరము.

1. నాభాగ్యము–అదృష్టము 2. తగినకాలము తెలిసినవాఁడు.

గనినఁ గణ్వమునీంద్రుం డారాచపట్టికి జాతకర్మాది మంగళాచారంబు లొనర్చె;
నా డింభకుండును దినదినంబునకు బాలచంద్రుండునుం బోలె నెదుగుచు. 623

క. కుంఠితుఁడు గాక వాఁ డు-త్కంఠం దనపిన్ననాఁడె కణ్వవనచర
త్కంఠీరవముఖ్యంబుల-కంఠములఁ బట్టి, యడుచుఁ; గట్టున్; విడుచున్. 624

వ. అంత నా కణ్వమునీంద్రుండు బాలకుంజూచి శకుంతల కిట్లనియె. 625

ఉ. ''పట్టపురాజు నీమగఁడు; పాపఁడు నన్నిట నెక్కు డంతకుం;
బట్టపుదేవి వై గఱువబాగున నుండక [1]పాఱువారితో
గట్టువనంబులోఁ నవయఁగాఁ బనిలే దిటఁ; దర్లి పోఁగదే;
పుట్టినయిండ్ల మానినులు పోరచి గా నవిశంబు నుందురే?'' 626

వ. అనిన నియ్యకొని. 627

క. ''ఆపిన్నవాని, నతుల-వ్యాపారు, నుదారు, వైష్ణవాంశోద్భవునిం,
జూపెద''నంచు శకుంతల-భూపాలునికడకు వచ్చెఁ బుత్రునిఁ గొనుచున్. 628

వ. వచ్చి, దుష్యంతుం డున్న సభామండపంబునకుం జని, నిలిచి యున్నయెడ. 629

మ. వలకేలన్ గురుచక్రరేఖయుఁ, బదద్వంద్వంబునం బద్మరే
ఖలు నొప్పారఁగ నందు వచ్చిన రమాకాంతుండునాఁ, గాంతి న
గ్గలమై యున్నకుమారు, మారసదృశాకారున్ విలోకించి, తాఁ
బలుకం డయ్యె విభుం డెఱింగి, సతి విభ్రాంతాత్మ యై వందురన్. 630

వ. ఆ సమయంబున. 631

మ. ''అదె? నీవల్లభ; వాఁడు నీసుతుఁడు; భార్యాపుత్రులం బాత్రులన్
వదలం గా; దలనాఁటి కణ్వవనికావైవాహికారంభముల్
మది నూహింపు; శకుంతలావచనముల్ మాన్యంబుగా, భూవరేం
ద్ర! దయం జేకొను'' మంచు మ్రోసెను వియద్వాణీవధూవాక్యముల్. 632

వ. ఇట్లశరీరవాణి సర్వభూతంబునకుఁ దేటపడ ''భరింపు''మని పలికిన, నా కుమా
రుండు భరతుం డయ్యెఁ; నంత నా రాజు రాజవదన నంగీకరించి, తనూభవుం
జేకొని, కొంతకాలంబు రాజ్యంబు సేసి, పరలోకంబునకుం జనియెఁ; దద
నంతరంబ. 633

క. రెండవహరిక్రియ ధరణీ-మండలభారంబు నిజసమంచితబాహా
దండమున నిలిపి, తనకును-[3]భండనమున నెదురు లేక భరతుం డొప్పెన్. 634

వ. మఱియు నాదౌష్యంతి, యమునాతటంబున దీర్ఘతపుండు పురోహితుండు గా
డెబ్బదియెనిమిదియును, గంగాతీరంబున నేఁబదియయిదును నిట్లు నూట

1. బ్రాహ్మణులు, 2. కుడిచేతియందు. 3. యుద్ధము.

ముప్పదిమూఁడశ్వమేధయాగంబులు [1]సదక్షిణంబులుగా నొనర్చి, దేవేంద్రవిభ
వంబున నతిశయించి, పదుమూఁడు వేలు నెనుబదినాలుఁగు కదుపు ధేనువులు గల
యది ద్వంద్వం బనం బరఁగునట్టి వేయిద్వంద్వంబులఁ బాఁడి మొదవులఁ గ్రేపుల
తోడ నలంకారసహితలం జేసి, వేవురు బ్రాహ్మణుల కిచ్చి, మష్కారతీర్థకూలం
బున విప్రముఖ్యులకుఁ గనకభూషణశోభితంబులయి, ధవళదంతంబులు గల
నల్లని యేనుంగులం బదునాలుగు లక్షల నొసంగె; దిగ్విజయకాలంబున శకశబర
బర్బరకశకిరాతకహూణమ్లేచ్ఛదేశంబులరాజులఁ బీఁచంబడంచి, రసాతలంబున
రాక్షసకారాగృహంబులందున్న వేల్పులగరితలం బెక్కండ్ర విడిపించి, తెచ్చి
వారలవల్లభులం గూర్చెఁ; ద్రిపురదానవుల జయించి, నిర్జరుల నిజమందిరంబుల
నునిచె; నతనిరాజ్యంబున గగనధరణీతలంబులు ప్రజలు గోరినకోరికలిచ్చు
చుండె; నివ్విధంబున. 635

ఆ. సత్యచరితమందుఁ, జలమందు, బలమందు-భాగ్యమందు, లోకపతులకంటె
నెక్కుడైన పేర్మి నిరువదియేడువే-లేండ్లు, ధరణి భరతుఁ డేలె నధిప! 636

క. [2]అర్థపతికంటెఁ గలిమిఁ గృ-తార్థుండై, యతులశౌర్యమలవడియు, నతం
డర్థములను బ్రాణములను-వ్యర్థములని తలఁచి, శాంతుఁడయ్యె నరేంద్రా!

క. భరతునిభార్యలు మువ్వురు-వరుసం బుత్రకులఁగాంచి, "వల్లభుతోడఁ
సరి గా"రని [3]తోడ్తోడను-శిరములు దునుమాడి, రాత్మశిశువుల నధిపా! 638

వ. ఇట్లు విదర్భరాజపుత్రికలు శిశువులం జంపిన, భరతుం డపుత్రకుం డై మరుత్
స్తోమంబను యాగంబు పుత్రార్థి యై చేసి, దేవతల మెప్పించె; నయ్యవస
రంబున. 639

సీ. అన్న యిల్లాలిఁ [4]జూలాలిని మమతాఖ్యఁ జూచి, బృహస్పతి సురతమునకుఁ
దొరఁకొని, పైపడ్డఁ దొల్లి గర్భంబున నున్న బాలుఁడు భయం బొదవి, "వలదు;
తగ"దని మొఱసేయఁ, దమకంబుతో వాని "నంధుండవగు"మన్న నలిగి, వాఁడు
యోనిలోపలివీర్య మూడఁ దన్నిన, నేలఁ బడి, బిడ్డఁడై యున్నఁ బాయలేక

ఆ. "యితని పెంపుకొడుకు లిరువురు జన్మించి-"రనుచు "వెలయఁ జేయు"మనిన మమతఁ
'బెంపఁ జాల; నీవ పెంపు భరింపు; మీ-ద్వాజు' ననుచుఁ జనియె, దాని విడిచి.

వ. ఇట్లు చథ్యునిభార్య యగు మమతయు బృహస్పతియు శిశువుం గని, "ద్వాజుం
డైన వీని నీవ నీవ భరింపు;" మని వదినె మఱందులు దమలో నొండొరువులం
బలికిన కారణంబున వాఁడు భరద్వాజుండయ్యె; గర్భస్థుండైనవాఁడు బృహ
స్పతిశాపంబున దీర్ఘతముం డయ్యె; నంత నాబృహస్పతియు మమతయు నుద
యించినవాని విడిచి, నిజేచ్ఛం జనిన, మరుత్తులు వానిం బోషించి, పుత్రార్థి

1. దక్షిణలతోఁ గూడినవి. 2. కుబేరుఁడు. 3. వెంటవెంటనే. 4. గర్భవతి.

యయిన భరతున కిచ్చిరి; భరతుండు వానిం జేకొనియె; వితథంబైన భరతవంశం
బునకు నా భరద్వాజుండు వంశకర్త యగుటం జేసి, వితథుం డనం బరఁగె;
నా వితథునికి మన్యువు, మన్యువునకు బృహత్క్షత్త్ర, జయ, మహావీర్య, నర,
గర్గ లనువా రేవురు సంభవించి; రందు నరునికి సంకృతి, సంకృతికి గురుండు,
రంతిదేవుం డన నిరువురు జన్మించి; రందు. 641

## రంతిదేవుని చరిత్రము

సీ. రాజవంశోత్తమ! రంతిదేవునికీర్తి యేల చెప్పఁగ? విను; మెందు నందు
నా రాజు దన[1]సంచితార్థంబులన్నియు నెడపక దీనుల కిచ్చి యిచ్చి,
సకుటుంబుఁడై, ధైర్యసంయుతుం డై, పేదయై, కూడు నీరు లే కధమవృత్తి
నెందేని నలువదియెనిమిదిదివసముల్ చరియింప, నొక దివసంబు రేపు
ఆ. నెయ్యి, పాయసంబు, నీరును గలిగిన-బహుకుటుంబభారభయముతోడ
నలసి, నీరువట్టు నాఁకలియును మిక్కి-లొదవఁ జూచి కుడువ నుత్సహించె.

వ. అయ్యవసరంబున. 643

సీ. అతిథి భూసురుఁ డొక్కఁ డాహార మడిగినఁ, గడపక ప్రియముతో గారవించి,
'హరిసమర్పణ' మంచు, నన్నంబులో సగ మిచ్చిన, భుజియించి యేఁగె నాతఁ;
డంతలో నొకశూద్రుఁ డశనార్థి యై వచ్చి, పొడసూప, 'లే' దనఁ బోక, తనకు
నున్న యన్నములోన నొకభాగ మిచ్చిన, సంతుష్టుఁడై వాఁడు సనిన, వెనుక
ఆ. [2]కుక్కగమియుఁ దాను నొక్కఁడే తేర నా-యన్నశేష మిచ్చి, సన్నయంబు
లాడి, మ్రొక్కి, పంప, నోడక చండాలుఁ-డొక్కఁ డరుగుదెంచి, చక్క నిలిచి.

క. "హీనుఁడఁ, జండాలుండను-మానవకులనాథ! దప్పి మానద; యవలం
బో నేర; నీకుఁ జిక్కిన-పానీయము నాకుఁ బోసి, బ్రదికింపఁగదే!" 645

వ. అనిన వానిదీనాలాపంబులకుఁ గరుణించి రా జిట్లనియె. 646

ఉ. "అన్నము లేదు; కొన్ని మధురాంబువు లున్నవి; త్రావుమన్న! రా
వన్న! శరీరధారులకు నాపద వచ్చిన, వారియాపదల్
[3]గ్రన్నన మాన్చి, వారికి సుఖంబులు సేయుటకన్న, నొండు మే
లున్నదె? నాకు దిక్కు పురుషోత్తముఁ డొక్కఁడ చుమ్ము; పుల్కసా! 647

వ. అని పలికె. 648

మ. "బలవంతం బగు[4]నీరుపట్టున నిజప్రాణాంత మై యున్నచో,
నలయం డేమియు; వీని[5]హృజ్జ్వరము, నాయాసంబు, ఖేదంబు, నా

1. కూడఁబెట్టిన ధనములు. 2. కుక్కలగుంపు. 3. వెంటనే. 4. దప్పి, 5. హృదయమునందలిబాధ.

జలదానంబున నేఁడు మాను" మనుచుఁ గ సర్వేశ్వరాధీనుఁడై
జలమును బోసెను, రంతిదేవుఁడు దయం జండాలపాత్రంబునన్. 649

వ. తదనంతరంబ బ్రహ్మాదిదేవతలు సంతోషించి, రంతిదేవునికి మేలు సేయం దలంచి, నిజాకారంబులతో ముందట నిలువంబడి, యారాజధైర్యపరీక్షార్థంబు దమ చేసినవృషలాదిరూపంబు లగు విష్ణుమాయల నెఱింగించిన, నా నరేంద్రుం డండజకు నమస్కరించి. 650

క. వారల నేమియు నడుగక-నారాయణభక్తి దనమనంబున వెలుఁగఁగ,
ధీరుం డాతఁడు మాయా-పారజ్ఞుం డగుచుఁ బరమపదముం బొందెన్. 651

క. ఆరాజర్షి ని గొలిచిన-వారెల్లఁ దదీయయోగవైభవమున శ్రీ
నారాయణచింతనులై -చేరిరి యోగీశులగుచు సిద్ధపదంబున్. 652

వ. ఇట్లు రంతిదేవుండు విజ్ఞానగర్భిణి యగు భక్తివలనఁ బరమపదంబునకుం జనియె; నంత గర్గునకు శిని జన్మించె; శినికి గార్గ్యుండు గలిగె; నాతనినుండి బ్రాహ్మణ కులం బయ్యె. మహావీర్యునికి నురుక్షయుండును, నురుక్షయునకుఁ ద్రయ్యారుణి యుఁ, గవియుఁ బుష్కరారుణియు నను ముగ్వురు సంభవించిరి; వారును బ్రాహ్మణు లయి చనిరి; బ్రహ్మక్షత్త్రునికి సుహోత్రుండు, సుహోత్రునకు హస్తియు జన్మించి; రా హస్తి దన పేర హస్తినాపురంబు నిర్మించె; నాహస్తికి నజమీఢుం డును, ద్విమీఢుండును, బురుమీఢుండును నన ముగ్వురు జనియించి; రం దజమీఢునివంశంబునం బ్రియమేధాదులు గొందఱు పుట్టి, బ్రాహ్మణు లయిచని; రయ్యజమీఢునికి బృహదిషుఁడు, నతనిపుత్త్రుండు బృహద్ధనువు, నతనికి బృహ త్కాయుండు, నతనికి జయద్రథుండు, నతనికి విశ్వజిత్తు, విశ్వజిత్తునకు సేనజిత్తు, సేనజిత్తునకు రుచిరాశ్వుండు, దృఢహనుండుఁ, గాశ్యుండు, వత్సుండు నన నలుగురు జనించి; రందు రుచిరాశ్వునకుఁ బ్రాజ్ఞుండును, నతనికిఁ బృథుసేనుం డును, బృథుసేనునికిఁ బారుండును, వానికి నీపుండును, నీపునికి నూర్వురుగొడు కులును బుట్టిరి; మఱియును. 653

ఆ. శుకునికూఁతు రైన సుందరి సత్కృతిఁ-బొంది, వేడ్క నీపభూవిభుండు
విమలయోగవిత్తు[1] విజ్ఞానదీపితో-దారచిత్తు బ్రహ్మదత్తుఁ గనియె. 654

వ. ఆబ్రహ్మదత్తుండు జైగిషవ్యోపదేశంబున యోగతంత్రంబునం జేసి, గోదేవి యను భార్యవలన విష్వక్సేనుండను కుమారునిం గనియె; విష్వక్సేనునకు నుదక్సేనుండు, నుదక్సేనునకు భల్లాదుండు గల్గి, వీరలు బార్హద్రిషవు లను రాజులైరి; ద్విమీఢునకు యమీనరుండు, యమీనరునికిఁ గృతిమంతుండు,

1. నిర్మలమయిన యోగమును దెలిసినవాఁడు.

కృతమంతునికి సత్యధృతి, సత్యధృతికి ధృఢనేమి, దృఢనేమికి సుపార్శ్వకృత్తు; సుపార్శ్వకృత్తునకు సుపార్శ్వుండు, సుపార్శ్వునకు సుమతి, సుమతికి సన్నతిమంతుండు పుట్టిరి; సన్నతిమంతు కొడుకు కృతియనువాఁడు హిరణ్యనాభునివలన యోగమార్గంబెఱింగి, శోకమోహంబులు విడిచి, తూర్పుదేశంబున సామసంహిత పఠియించె; నతనికి నుగ్రాయుధుండు, నుగ్రాయుధునకు క్షేమ్యుండు, క్షేమ్యునకు సువీరుండు, సువీరునకుఁ బురంజయుండును, బురంజయునకు బహురథుండును జన్మించిరి; హస్తికొడుకు పురుమీఢునికి సంతతి లేదయ్యె; నయ్యజమీఢునికి నళిని యనుభార్యయందు నీలుండు, నీలునికి శాంతియు, శాంతికి సుశాంతియు, సుశాంతికిఁ బురుజుండుఁ, బురుజునికి నర్కుఁడు, నర్కునికి భర్మ్యాశ్వుండు, భర్మ్యాశ్వునకు ముద్గల, యవీనర, బృహదిషు, కాంపిల్య, సృంజయు లనువారేవురుం బుట్టిరి. 655

క. మించినభర్మ్యాశ్వుఁడు సుత-పంచకమును జూచి, [1]విషయపంచకమును వ
ర్జించితిఁ, ''దల'' మని పల్కినఁ బాంచాలురు నాఁగ సుతులు పరఁగిరి ధరణిన్.

వ. అంత ముద్గలునినుండి బ్రాహ్మణకుం బై ముద్గలగోత్త్రంబు నా నెగడె; భర్మ్యాశ్వపుత్త్రుం డైన యా ముద్గలునికి దివోదాసుండు, నహల్య యనుకన్యకయునుం బుట్టె; నాయహల్యయందు గౌతమునికి శతానందుండు పుట్టె; శతానందునికి ధనుర్వేదవిశారదుం డయిన సత్యధృతి పుట్టె; నతం డొకనాఁడు వనంబున నూర్వశిం గనిన, నతనికి రేతఃపాతం బై తద్వీర్యంబు [2]శరస్తంబంబునం బడి, [3]మిథునం బయ్యె; నాసమయంబున. 657

క. చపలరతి శంతనుం డను-నృపవరుఁ డడవికిని వేఁటనెపమునఁ జనుచుం
గృపతో శిశుయుగముం గని-కృపియుఁ గృపుండనుచుఁ దెచ్చి గృహమునఁ బెంచెన్.

వ. ఆకృపి ద్రోణునకు భార్య యయ్యె; దివోదాసునకు మిత్త్రాయువు, మిత్త్రాయువునకుఁ జ్యవనుండుఁ, జ్యవనునకు సుదాసుండు, సుదాసునకు సహదేవుండు, సహదేవునకు సోమకుండు, సోమకునకు సుజన్మకృత్తు, సుజన్మకృత్తునకు నూర్వురు గొడుకులుం గలిగిరి; వారిలో జంతు వనువాఁడు జ్యేష్ఠుఁడు; కడచూలు పృషతుండు; పృషతునకు ద్రుపదుండు, ద్రుపదునకు ధృష్టద్యుమ్నాదు లయిన కొడుకులును, ద్రౌపది యనుకూఁతురుం గలిగిరి; ధృష్టద్యుమ్నునకు ధృష్టకేతువు పుట్టె; వీరలు పాంచాలరాజు లని యెఱుఁగుము; మఱియు నయ్యజమీఢునికొడుకు ఋక్షుండు, ఋక్షునకు సంవరణుం; డాసంవరణుండు తపతి యనియెడి సూర్యకన్యయందుఁ గురువుం గనియె; నా కురువుపేరం గురుక్షేత్త్రంబయ్యె; నా కురువునకుఁ బరీక్షిత్తు సుధనువు, జహ్నువు, నిషధుఁడు ననువారు నలువురు పుట్టె;

---

1. లోకసుఖములైదును. 2. రెల్లుకొడ. 3. జట.

రందుఁ బరీక్షిత్తు కొడుకులు లేక చనియె; సుధనువునకు సుహోత్రుం, డతనికిఁ జ్యవనుండు, చ్యవనునకుఁ గృతి, గృతికి వసువు, వసువునకు బృహద్రథ,కుసుంభ, మత్స్య, ప్రత్యగ్ర,చేదిపాదులు పుట్టి; రందు బృహద్రథునకుఁ గుశాగ్రుండుఁ, గుశాగ్రునికి ఋషభుండు, ఋషభునికి సత్యహితుండు, సత్యహితునికిఁ బుష్పవంతుండు,పుష్పవంతునకు జహ్ను వనువాఁడు, మఱియును. 659

సీ. ఆబృహద్రథునకు నన్యభార్యాగర్భమున రెండు తనుఖండములు జనించె; [1]దునుకలు గని తల్లి త్రోలఁగంగ వైచిన సంధించె, నొకటిగా, జర యనంగ నొకదైత్యకాంత; వాఁ డొప్పె జరాసంధుఁ డన; గిరివ్రజపుర మాతఁ డేలె; నతనికి సహదేవుఁ, డతనికి సోమాపి తనయుఁ; డాతనికి శ్రుతశ్రవుండు,

తే. జహ్నుపుత్త్రుండు సురథుండు; జనవరేణ్య!-యతనికొడుకు విదూరథుఁ; డతనిపట్టి సార్వభౌముండు; వానికి సంభవుండు-విను; జయత్సేనుఁ డనువాఁడు విమలకీర్తి.

వ. ఆజయత్సేనునికి రథికుండు, రథికునకు నయుతాయువు, నయుతాయువునకుఁ గ్రోధనుండుఁ, గ్రోధనునకు దేవాతిథియు, దేవాతిథికి ఋక్షుండు, ఋక్షునికి భీమసేనుండును, వానికిఁ బ్రతీపుండుఁ, బ్రతీపునకు దేవాపి, శంతను, బాహ్లికు లన ముగ్వురు గొడుకులు పుట్టి; రందు. 661

సీ. దేవాపి రాజ్యంబు దీర్ప నొల్లక వనంబున కేఁగెఁ; దమ్ముండు పూర్వజన్మ మందు మహాభిషుఁ డనియెడువాఁడు శంతనుఁ డయ్యె ; వాఁడె యీధాత్రి నెల్ల నేలుచుఁ గరముల నేవృద్ధు ముట్టిన, వాఁ డెల్ల నిండుజవ్వనము నొందు; నతఁడు శాంతిప్రాప్తుఁడై యున్నదానఁ, బండ్రెండ్లేండు [2]వజ్రి వర్షింపకున్న,

ఆ. వృష్టి లేనిచొప్పు విప్రులనడిగిన-"నన్న యుండఁ, దమ్ముఁ డగ్నిహోత్ర దారసంగ్రహంబు దాల్చినఁ 'బరివేత్త'-యండ్రు; గాన నీవ యతఁడ వైతి.

వ. అది కారణంబుగా నన్న యుండ దమ్ముండు రాజ్యార్హుండు గాఁడు; నీవు పరివేత్తవు, మీయన్నకు రాజ్యం బిచ్చిన, ననావృష్టి దోషంబు నెడు" నని బ్రాహ్మణులు పల్కిన, శంతనుండు వనంబునకుం జని, దేవాపికిఁ బ్రియంబు సెప్పి, "రాజ్యంబు నేకొ"మ్మని పల్కె; నంతకుమున్న వానితండ్రి దేవాపిని రాజ్యంబున కర్హుం జేయం దలంచి, విప్రులం బిలిచిన, నావిప్రులు పాషండమతవాక్యంబులు దేవాపికి నుపదేశించిన, దేవాపి వేదంబుల నిందించిన, పాషండుండును, దేవదూషకుండును నయ్యెం; గావున దేవాపికి రాజ్యంబు లే" దని బ్రాహ్మణులు సెప్పిన, శంతనుండు మగిడి వచ్చి, రాజ్యంబుఁ జేకొనియె; నంత వర్షంబును గురిసె; నివ్విధంబున. 663

---

1. ముక్కలు. 2. ఇంద్రుఁడు.

క. దేవాపి కలాపపురం-బావాసము గాఁగ యోగి యై యున్నాఁడు; ర్వీవర! కలి నష్టం బగు-[1]జై వాత్మకకులము మీఁద సంస్థాపించున్. 664

వ. బాహ్లికుం డనువానికి సోమదత్తుండు పుట్టె; సోమదత్తునకు భూరియు, భూరి శ్రవసుఁడును, శలుండు ననువారు మువ్వురు పుట్టిరి. 665

క. ధాత్రిఁగ శంతనునకు, గం-గాతటినికి వైష్ణవాగ్రగణ్యుఁడు, ఘోరా రాతినయనకలోత్పల-భీతికరగ్రీష్ముఁ డైన భీష్ముఁడు పుట్టెన్. 666

ఆ. పరశురాముతోడఁ బ్రతిఘటించి జయింప-నన్యు నొకనిఁ గాన మతనిఁ దక్క; వీరయూథపతి వివేకధర్మజ్ఞుండు-దివిజనదిసుతుండు దేవసముఁడు. 667

వ. ఆ శంతనునకు [2]దాశకన్యక యైన సత్యవతియందుఁ జిత్రాంగదవిచిత్రవీర్యులు పుట్టి; రందుఁ జిత్రాంగదుండు గంధర్వులచే నిహతుం డయ్యె; మఱియును. 668

ఉ. సత్యవతీవధూటి మును శంతను పెండ్లము గానినాఁడు, సాం
గత్యమునం బరాశరుఁడు గర్భము సేసిన, బాదరాయణుం
డత్యధికుండు, శ్రీహరికళాంశజుఁ డై ప్రభవించె నిత్యముల్
సత్యము లైన వేదముల సాంగములన్ విభజింపఁ దక్షుఁ డై. 669

ఆ. బాదరాయణుండు భగవంతుఁ డనఘుండు-[4]పరమగుహ్య మైన భాగవతము నందనుండ నయిన నాకుఁ జెప్పెను; శిష్య-జనుల మొఱఁగి యేను జదువుకొంటి.

వ. ఆ విచిత్రవీర్యునికిఁ గాశిరాజుల కూఁతుల నంబికాంబాలికల భీష్ముండు బలాత్కారంబునఁ దెచ్చి, వివాహంబు సేసిన, విచిత్రవీర్యుండు వారలం దగిలి, మనోజరాగమత్తుం డై, చిరకాలంబు నానావిధక్రీడల విహరించుచు, [5]రాజయక్ష్మపీడితుం డై మృతుం డయ్యె; నంత. 671

క. "అతనిసతులవలన, సుతుల-సుత! కను" మని తల్లి పనుప సొరిదిం గనియెన్ ధృతరాష్ట్రపాండువిదురుల-నుతచరితుఁడు బాదరాయణుండు నరేంద్రా! 672

వ. అందు ధృతరాష్ట్రునికి గాంధారియందు దుర్యోధనాదు లగుకొడుకులు నూర్వురును, దుశ్శల యను కన్యయును జన్మించిరి. మృగశాపభయంబునం జేసి, భార్యం బొందఁ వెఱచిన పాండునకుఁ గుంతిదేవియందు ధర్మానిలేంద్రుల ప్రసాదంబున యుధిష్ఠిరభీమార్జును లనుమువ్వురును, మాద్రిదేవివలన నాసత్యప్రసాదంబున నకులసహదేవు లనువా రిద్దఱునుగా, నేవురు పుట్టి; రయ్యేవురకును ద్రుపదరాజపుత్త్రి యైన ద్రౌపదియందుఁ గ్రమంబునం బ్రతివింధ్యుండును, శ్రుత

1. చంద్రవంశము. 2. జెస్తరాజుకూఁతురు. 3. మిగుల రహస్యమయినది. 4. క్షయరోగముచే బాధింపబడినవాఁడు.

సేనుండును, శ్రుతకీర్తియు, శతానీకుండును, శ్రుతకర్ముండును, నన నేవురు పుట్టిరి; మఱియు యుధిష్ఠిరునకుఁ బౌరవతియందు దేవకుండును, భీమసేనునికి హిడింబయందు ఘటోత్కచుండును, గాళియందు సర్వగతుండును, సహదేవునికి విజయయందు సుహోత్రుండును, నకులునకు రేణుమతియందు నిరమిత్రుండును, నర్జునునకు నులూపి యనునాగకన్యయందు నిలావంతుండును, మణలూరుపతిపుత్రియయిన చిత్రాంగదయందు బభ్రువాహనుండును, సుభద్రయందు శౌర్యధైర్యతేజోవిభవంబుల నఖిలరాజనికరంబునం బ్రఖ్యాతుం డైన యభిమన్యుండును జన్మించి; రందు బభ్రువాహనుం డర్జుననియోగంబున మాతామహునిగోత్రంబునకు వంశకర్త యయ్యె. 673

ఉ. అన్యసుపూజ్య! నీజనకుఁ డై యభిమన్యుఁడు భూవరేంద్రమూ
ర్ధన్యుఁడు, ధన్యమార్గణకదంబవిదారితవైరివీరరా
జన్యుఁడు, జన్యభీతగురుసైన్యుఁడు, సైన్యసమూహనాథధృ
ష్టాన్యుఁడు, మాన్యకీర్తిమహిమం దనరెం గురువంశకర్త యై. 674

వ. ఆయభిమన్యునకు నుత్తరయందు నీవు జన్మించితివి. 675

క. [1]ద్రోణసుతుతూపువేఁడిమిఁ–బ్రాణంబులఁ బాసి, హరికృపాదర్శన[2]సం
త్రాణంబున బ్రదికితె కా!–క్షోణీశ్వర! మున్ను నీశిశుత్వము వేళన్. 676

వ. నీ కుమారులు జనమేజయశ్రుతసేనభీమసేనోగ్రసేనులను నల్వురు; వీరలయందు.

ఆ. నీవు 'తక్షకాహినిహతుండ'వని విని–సకలసర్పలోకసంహృతముగ
సర్పయాగమింక జనమేజయుఁడు సేయఁ–గలఁడు పూర్వరోషకలితుఁడగుచు.

వ. మఱియు నతండు సర్వధరణీమండలంబును జయించి, కావషేయుండు, పురోహితుండు గా, నశ్వమేధంబు సేయంగలవాఁడు; వానికి శతానీకుండు జనియించి, యాజ్ఞవల్క్యునితోడ వేదంబులు పఠించి, కృపాచార్యునివలన విలువిద్య నేర్చి, శౌనకునివలన నాత్మజ్ఞానంబుఁ బడయంగలవాఁ; డా శతానీకునికి సహస్రానీకుండు, వానికి నశ్వమేధజుం, డశ్వమేధజునికి నాసీమకృష్ణుం, డాసీమకృష్ణునకు నిచకుం, (డా నిచకుండు గజాహ్వయంబు నదిచే హృతంబుగాఁ గౌశాంబియందు వసియించు) నాతనికి నుష్ణుం, డుష్ణునికిఁ జిత్రరథుండు, చిత్రరథునకు శుచిరథుండు, శుచిరథునికి వృష్టిమంతుండు, వృష్టిమంతునికి సుషేణుండు, సుషేణునికి సునీతుండు, సునీతునికి నృచక్షువు, నృచక్షువునకు సుఖానిలుండు, సుఖానిలునికిఁ బరిప్లవుండు, పరిప్లవునకు మేధావి, మేధావికి సునయుండు, సునయునికి నృపంజయుండు, నృపంజయునికి దూర్వుండు, దూర్వునికి

1. అశ్వత్థామయొక్క బాణముల తాపముచే. 2. రక్షణము.

నిమి, నిమికి బృహద్రథుండు. బృహద్రథునకు సుదాసుండు. సుదాసునికి శతానీకుండు, శతానీకునకు దుర్దమనుండు, దుర్దమనునికి విహీనరుండు, విహీనరునికి దండపాణి, దండపాణికి మితుండు, మితునకు క్షేమకుండు, క్షేమకునకు బ్రహ్మక్షత్త్రుండు; వాఁడు నిర్వంశుండై దేవర్షిసత్కృతుండై కలియుగంబునందుఁ జనంగలవాఁడు. 679

క. జగతి నిటమీఁదఁ బుట్టెదు–మగధాధీశ్వరుల, నిఖిలమనుజేశ్వరులన్
[1]నిగమాంతవిదులఁ, జెప్పెద–సుగుణాలంకార! ధీర! సుభగవిచారా! 680

వ. జరాసంధపుత్త్రుండై నసహదేవునికి మార్జాలి, మార్జాలికి శ్రుతశ్రవుండు, శ్రుతశ్రవునకు నయుతాయువు, నయుతాయువునకు నిరమిత్త్రుండు, నిరమిత్త్రునకు సునక్షత్త్రుఁడు. సునక్షత్త్రునికి బృహత్సేనుండు, బృహత్సేనునికిఁ గర్మజిత్తు, గర్మజిత్తునకు శ్రుతంజయుండు, శ్రుతంజయునకు విప్రుండు. విప్రునకు శుచి, శుచికి క్షేముండు, క్షేమునికి సువ్రతుండు, సువ్రతునకు ధర్మనేత్త్రుఁడు, ధర్మనేత్త్రునకు శ్రుతుండు, శ్రుతునకు దృఢసేనుండు. దృఢసేనునికి సుమతి. సుమతికి సుబలుండు, సుబలునకు సునీతుండు, సునీతునకు సత్యజిత్తు, సత్యజిత్తునకు విశ్వజిత్తు, విశ్వజిత్తునకుఁ బురంజయుండును జన్మించెద'' రని చెప్పి మఱియు ని ట్లనియె. 681

ఆ. ''వినుము మగధదేశవిభులు జరాసంధ ప్రముఖధరణిపతులు, ప్రబలయశులు;
వీరు కలియుగమున వేయేండ్లలోపలఁ బుట్టి గిట్టఁగలరు భూవరేంద్ర! 682

వ. యయాతికొడుకనువునకు సభానరుండుఁ, జక్షువుఁ, బరోక్షుండు ననువారు ముగ్గురు పుట్టి; రందు సభానరునికిఁ గాలనాథుండు, గాలనాథునకు సృంజయుండు, సృంజయునకుఁ బురంజయుండు, పురంజయునకు జనమేజయుండు, జనమేజయునకు మహాశాలుండు, మహాశాలునికి మహామనసుండు, మహామనసునకు నుశీనరుండు, తితిక్షు వన నిరువురు జన్మించి; రందు నుశీనరునకు శిబి, వన, క్రిమి, దర్పులన నలువురు జన్మించి; రందు శిబికి వృషదర్భ, సువీర, మద్ర, కేకయులు నలువురు పుట్టిరి; తితిక్షునకు రుశద్రథుండు, రుశద్రథునకు హేముండు, హేమునకు సుతపుండు, సుతపునకు బలియుఁ బుట్టె;నా బలివలన నంగవంగకళింగసింహపుండ్రాంధ్రు లను పేళ్లు గలవా రార్వురు కుమారులు పుట్టిరి; వారలు దూర్పుదేశంబునకు రాజులయి, దేశంబులకుఁ దమతమనామధేయంబు లిడి యేలిరి; సువీరునకు సత్యరథుండు, సత్యరథునికి దివిరథుండు, దివిరథునికి ధర్మరథుండు, ధర్మరథునకుఁ జిత్రరథుండుఁ బుట్టె; నా చిత్రరథుండు రోమపాదుండు నాఁబరఁగె. 683

---

1. వేదాంతము నెఱిఁగినవారు.

క. సంతతి లేనికతంబునఁ-జింతించుచునుండ నతనిచెలికాఁ డగు ధీ
మంతుఁడు దశరథుఁ డతనికి-[1]సంతతి గా నిచ్చె; నాత్మజను శాంతాఖ్యన్.

వ. అంత రోమపాదుండు దనకూఁతురు శాంత యని గైకొని మెలంగుచుండు; నారాజు రాజ్యంబునఁ గొంతకాలంబు వర్షంబు లేమికిం జింతించి, "విభాండక సుతుండైన ఋశ్యశృంగుండు వచ్చిన, వర్షంబు గురియు"నని పెద్దలవలన నెఱింగి. 685

క. ఆరాజు ఋష్యశృంగుని-ఘోరతపోనియముఁ దెచ్చుకొఱకై పనిచెన్
వారసతుల, నేర్పరుల, ను-దార స్తనభారభీరుతరమధ్యగలన్. 686

వ. వారలుఁ జని. 687

ఆ. "కాంతలార! [2]మెకము గన్నది మొదలుగా-నాఁడువారి నెఱుఁగఁ డడవిలోన;
గోఁచి బిగియఁగట్టుకొనిన యా వడు"గని-మత్తికాని రతికి మరపవలయు. 688

వ. అని పలుకుచు. 689

క. ఆడుచుఁ జెవులకు నింపుగఁ-బాడుచు, నాలోకనిశితబాణౌఘముల
వీడుచు, డగ్గఱ [3]నోడుచుఁ-జేడియ లాతపసికడకుఁ జేరిరి కలఁపన్. 690

వ. అయ్యవసరంబున వారలంజూచి. 691

సీ. మిళితాళినీల[4]ధమ్మిల్లభారంబులు చారుజటావిశేషంబులనియు,
భర్మాంచలోజ్జ్వలప్రభదుకూలంబులు తతచర్మవస్త్రభేదంబు లనియు,
బహురత్నకీలితభాసురహారంబు లధికరుద్రాక్షమాలాదులనియు,
మలయజమృగనాభిమహితలేపంబులు బహువిధభూతిలేపంబు లనియు,
తే. మధురగానంబుశ్రుతియుక్తమంత్రజాతు-లనియు, వీణెలుదండంబులనియు, సతుల
మూర్తులెన్నఁడు నెఱుఁగనిముగుదతపసి-వారిఁ దాపసులనిడాయవచ్చిమ్రొక్కె.

వ. ఇట్లు వచ్చి, మ్రొక్కినఋశ్యశృంగుం జూచి, నగుచు డగ్గఱి. 693

సీ. "సేమమే?" యని సతుల్ సేతులగ్గుచ్చి,కర్కశకుచంబులు మోవఁగౌఁగిలించి,
"చిరతపోనియతి డస్సితిగదా" యని మోముఁ గంఠంబునాభియుఁ గలయఁబుడికి,
"క్రొత్తదీవన లివి గొను', మని వీనుల పొంత నాలుకలఁ జప్పుళ్లుచేసి,
"మావనంబుల పండ్లు మంచివి తిను" మని పెక్కుభక్ష్యంబులు ప్రీతినొసఁగి,
ఆ. "నూతనాజినంబు, నునుపిది, మే;" లని-గోఁచి విడిచి మృదుదుకూల మిచ్చి,
మౌని మరగఁ జేసి, "మా పర్ణశాలకుఁ-బోద"మనుచుఁ గొంచుఁ బోయిరతని.

1. సంతానము. 2. మృగము. 3. భయపడుచు. 4. కొప్పుయొక్క బరువు. 5. ఏమియుఁ దెలియని ముని.

వ. ఇట్లు హరిణీసుతుండు కాంతాకటాక్షపాశబద్ధుండై, వారలవెంటం జని, రోమపాదుకడకుం బోయిన, నతండు దనప్రియనందనయైన శాంత నిచ్చి, పురంబున నునిచికొనియె; నమ్మునీశ్వరుండు వచ్చిన వర్షప్రతిబంధదోషంబుచెడి, వర్షంబు గురిసె; నంత. 695

ఆ. ఆ నృపాలచంద్రుఁ డనపత్యుఁ డై యుండ-నెఱిఁగి మునికులేంద్రుఁ డింద్రుఁ గూర్చి
[1]యిష్టి సేసి, సుతుల నిచ్చె; నాతనికృపఁ-[2]బంక్తిరథుఁడు పడసె సుతుల.

వ. ఆ రోమపాదునకుఁ జతురంగుండును, జతురంగునకుఁ బృథులాక్షుండును, బృథులాక్షునికి బృహద్రథుండు, బృహత్కర్ముండు, బృహద్భానుండు. ననువారు మువ్వురు పుట్టిరి; రందు బృహద్రథునకు బృహన్మనసుఁడు, బృహన్మనసునకు జయద్రథుండు, జయద్రథునకు విజయుండు, విజయునకు సంభూతి యనుభార్య యందు ధృతియు, నాధృతికి ధృతవ్రతుండు, ధృతవ్రతునకు సత్యకర్ముండు, సత్యకర్మునకు నతిరథుండును జన్మించిరి. 697

ఆ. కుంతి పిన్ననాఁడు గోరి సూర్యుని, బొంద-బిడ్డఁ డుదితుఁ డైనఁ, బెట్టెఁ బెట్టి,
గంగనీట విడువఁ, గని యతిరథుఁ డంతఁ-గర్ణుఁ డనుచుఁ గొడుకు గారవించె.

వ. ఇట్లతిరథునకుఁ గానీనుం డైన కర్ణుఁడు కొడుకయ్యెఁ; గర్ణునకు వృషసేనుండు పుట్టె; నయ్యయాతికొడుకైన ద్రుహ్యునకు బభ్రుసేతువు, బభ్రుసేతువునకు నారబ్ధుండు, నారబ్ధునకు గాంధారుఁడు, గాంధారునకు ఘుర్ముఁడు, ఘుర్మునకు ఘృతుండు, ఘృతునకు దుర్మదుండు, దుర్మదునకుఁ బ్రచేతసుండుఁ, బ్రచేతసునకు నూర్గురు పుట్టి, మ్లేచ్ఛాధిపతు లయి, యుదగ్దిశ నాశ్రయించిరి; తుర్వసునకు వహ్ని, వహ్నికి భర్గుండు, భర్గునకు భానుమంతుండు, భానుమంతునకుఁ ద్రిసానువుఁ, ద్రిసానువునకుఁ గరంధముండును, గరంధమునకు మరుత్తుండు, నతనికి యయాతిశాపంబున సంతతి లే దయ్యెఁ; వినుము. 699

## యదువంశచరిత్రము

చ. అనఘ! యయాతిపెద్దకొడు కైన యదుక్షితిపాలువంశముల్
వినినఁ, బఠించినన్, నరుఁడు [3]వెండియుఁ బుట్టఁడు; ముక్తిఁ బొందు; న
య్యనుపమమూర్తి విష్ణుఁడు నరాకృతిఁ బొంది జనించెఁ; గావునన్
వినుము నరేంద్ర! నాపలుకు వీనులపండువు గాఁగఁ జెప్పెదన్. 700

వ. యదువునకు సహస్రజిత్తుఁ, గ్రోష్టువు, నలుండు, రిపుండు, ననువారు నలువురు సంభవించి; రందుఁ బెద్దకొడు కైన సహస్రజిత్తునకు శతజిత్తు గలిగె; నా శతజిత్తునకు మహాహయ, వేణుహయ, హేహయులనువారు మువ్వురు జనించి;

1. యజ్ఞము. 2. దశరథుఁడు. 3. మరల.

రందు హేహయునకు ధర్ముండు, ధర్మునకు నేత్రుండు, నేత్రునకుఁ గుంతి, గుంతికి
మహిష్మంతుండు, మహిష్మంతునికి భద్రసేనుండు, భద్రసేనునకు దుర్మదుండు,
దుర్మదునికి ధనికుండు, ధనికునికిఁ గృతవీర్య, కృతాగ్ని, కృతకర్మ, కృతౌజు
లను నలుగురు సంభవించి; రందుఁ గృతవీర్యునికి నర్జునుండు జనియించె; నతండు.

సీ. హరికళాసంజాతుఁ డైన దత్తాత్రేయు సేవించి, సద్యోగసిద్ధిఁ బొంది,
బహుయజ్ఞదానతపంబులు గావించి, సకలదిక్కులు గెల్చి, జయముతోడ
సతతంబు హరినామసంకీర్తనము సేసి, ధనములనొంది, యుదారవృత్తి
నెనుబదియైదువేలేండ్లు భూచక్రంబు, ఘనకీర్తిఁ దనపేరు గాఁగ నేలె;

ఆ. ముదిమి లేక, [1]తరుణమూర్తియై, యురుకీర్తి
నమరెఁ; గార్తవీర్యుఁ డనఁగ విభుఁడు;
నిజము; వానిభంగి నేల యేలినయట్టి
రాజు నెఱుఁగ మెందు; రాజముఖ్య! 702

వ. అయ్యర్జునునకుం గలపుత్రసహస్రంబునం బరశురాముని బారికిం దప్పి, జయధ్వ
జుండు, శూరసేనుండు, వృషణుండు, మధువు, నూర్జితుండు, ననువా రేవురు
బ్రదికిరి; జయధ్వజునకుఁ దాళజంఘుండును, దాళజంఘునకు నౌర్వముని తేజం
బున నూర్వురు గొడుకులును గలిగి; రందుఁ బ్రథముండు వీతిహోత్రుండు,
మధువునకు వృష్ణుండు, వృష్ణునకుఁ బుత్రశతంబు పుట్టె; నందుఁ బ్రథముండు
వృష్ణి; మఱియు మధు వృష్ణి యదువుల యావంశంబులవారు మాధవులు;
వృష్ణులు, యాదవులు ననం బరఁగిరి; యదుపుత్త్రుం డైన క్రోష్టువునకు వృజిన
వంతుండు, వృజినవంతునకు శ్వాహితుఁడు, శ్వాహితునకు భేరుశేకుండు,
భేరుశేకునకు జిత్రరథుండు, చిత్రరథునకు శశిబిందుండుఁ బుట్టిరి. 703

మ. [2]కృశమధ్యల్ పదివేవురంగనలతోఁ గ్రీడం బ్రమోదింప, స
త్కుశలుం డై, పదివేలలక్షలు సుపుత్రుల్ భక్తి సేయం, జతు
ర్దశరత్నుండును, యోగిఁ, నాఁ బరఁగి, సప్తద్వీపరాజేంద్రుఁ డై
శశిబిందుం డురునీతిమంతుఁ డమరెన్ సత్కాంతిపూర్ణేందుఁ డై. 704

వ. అతనికొడుకులమొత్తంబునకు ముఖ్యు లయినయార్వురలోఁ బృథుశ్రవుం డను
వానికి ధర్ముండు పుట్టె; ధర్మునకు నుశనుండు పుట్టి,నూ ఱశ్వమేధంబులు సేసె;
నయ్యుశనునకు రుచకుండు పుట్టె; నారుచకునకుఁ బురుజిత్తు, రుక్మండు, రుక్మే
షువు, పృథువు, జ్యామఘుండు ననువా రేవురు పుట్టి; రందు జ్యామఘుండు.

సీ. తొట్రుగొల్పెడు శైబ్యతోడి ప్రేమంబున ననపత్యుఁ డయ్యును, సన్యభార్యఁ
గైకొన, కొకకొంతకాలంబునకుఁ బోయి, పగవారియింటను బలిమిఁ బట్టి

1. పిన్నవయస్సుగలవాఁడు. 2. చిక్కిన నడుముగలవారు.

మొకకన్యఁ దేరిపై నునిచి తోడ్తేరంగ, జననాథుఁ గన్యను శైబ్య చూచి,
కోపించి, ''మా[1]నవకుహక ! యీపడుచును దెచ్చియు, నేనుండఁ దేరిమీఁదఁ

ఆ. బెట్టినాఁడ;'' వనుచు బిఱుసులు వలుకంగ-నతఁడు పలికె నంత నతివతోడ
''నాకుఁ గోడ; లింత నమ్ము; మీలలితాంగి-సవతిగాదు నీకు; సత్య'' మనుచు.

వ. అయ్యవసరంబున శైబ్య కొడుకుం గాంచు నని మెఱింగి, విశ్వేదేవతలును, బితృదేవతలును సంతసించిరి; వారలప్రసాదంబున. 707

క. తనసవతి మొఱఁగి పెనిమిటి-తనుఁ బొందిన, శైబ్య మఱి విదర్భునిఁ గనియెం;
దనయుం గని జ్యామఘుఁడును-తన తెచ్చినకన్యఁ దెచ్చి, తనయున కిచ్చెన్. 708

వ. ఆకన్యక యందు విదర్భునకుఁ గుశుండును, క్రథుండును, రోమపాదుండునుం బుట్టి; రా రోమపాదునకు బభ్రువు, బభ్రువునకు విభువు, విభువునకుఁ గృతి, గృతికి నుశికుం, డుశికునకుం జేది, చేదికిఁ జైద్యాదులు పుట్టిరి; క్రథునకుఁ గుంతి, గుంతికి ధృష్టి, ధృష్టికి నిర్వృతి, నిర్వృతికి దశార్హుండు, దశార్హునకు వ్యోముండు, వ్యోమునకు జీమూతుండు, జీమూతునకు వికృతి, వికృతికి భీమరథుండు, భీమరథునకు నవరథుండు, నవరథునకు దశరథుండు, దశరథునకు శకుని, శకునికిఁ గుంతి, గుంతికి దేవరాతుండు, దేవరాతునకు దేవక్షత్త్రుండు, దేవక్షత్త్రునకు మధువు, మధువునకుఁ గురువశుండు, గురువశునకు వను, వనువునకుఁ బురుహోత్రుఁ, డతనికి నంశు, వతనికి సాత్వతుండు, సాత్వతునకు భజమానుండును, భజియును, దివ్యుండును, వృష్ణియు, దేవాపృథుండును, నంధకుండును, మహాభోజుండును, నన నేడ్గురు పుట్టి; రందు భజమానునకుఁ బ్రథమభార్యయందు నిమ్రోచి కంకణవృష్ణులు మువ్వురును, రెండవభార్యయందు శతజిత్తు సహస్రజిత్తు నయుత జిత్తు నన మువ్వురును బుట్టి; రందు దేవాపృథునికి బభ్రువు, వీర లిరువుర ప్రభావంబులఁ బెద్దలు శ్లోకరూపంబునఁ బఠియింతు; రట్టిశ్లోకార్థం బెట్టి దనిన. 709

తే. వినుము దూరంబునం దేమి వినుచు నుందు;
మదియ చూతుము డగ్గఱ నరుగు దేర;
నరులలో బభ్రుకంటె నున్నతుఁడు లేఁడు;
యోజ దేవాపృథున కెన యొరుఁడు గలఁడె? 710

క. పదునాలుగువేవుర నఱు-నదియేవుర నరులు ముక్తిఁ బడసిరి; బభ్రుం
డుదితుఁడు దేవాపృథుఁడును-బదపడి యోగంబుఁ దెలియఁ బలికినకతనన్.

వ. మహాభోజుం డతిధార్మికుండు; వానివంశంబువారు భోజు లని పలుకం బడిరి; వృష్ణికి సుమిత్త్రుండు, యుధాజిత్తును జన్మించి; రందు యుధాజిత్తునకు శినియు,

1. కపటమానవుఁడా! 2. మోసపుచ్చి.

ననమిత్రుండుచు జనించి; రనమిత్రునికి నిమ్నుండు, నిమ్నునికి సత్రాజితుండుఁ, బ్రసేనుండు నన నిరువురు పుట్టిరి; మఱియు ననమిత్రునికి శిని యనువాఁడు వేఱొకండు గలఁ; డతనిపుత్రుండు సత్యకుండును, నతనికి యుయుధానుం డనం బరఁగిన సాత్యకియు, నాసాత్యకికి జయుండును, జయునకుఁ గుణియు, నా గుణికి యుగంధరుండునుం బుట్టిరి; మఱియు ననమిత్రునకుఁ బృశ్ని యను వేఱొకకొడుకు గలఁడు; వానికి శ్వఫల్క-చిత్రకులు గలిగి; రందు శ్వఫల్కునకు గాందినియం దక్రూరుండును, నసంగుండును, సారమేయుండును, మృదుకుం డును, మృదుపచ్ఛివుండును, వర్మదృక్కును, ధృష్టవర్మండును, క్షత్త్రోపేక్షుండు, నరిమర్దనుండును, శత్రుఘ్నుండును, గంధమాదనుండును, బ్రతిబాహువును ననువారు పన్నిద్దఱు గొడుకులును, సుచారు వనుకన్యకయు జనించిరి; వారియం దక్రూరునికి దేవలుండును, ననుపదేవుండునుం బుట్టిరి; మఱియుఁ జిత్రునకుఁ బృథుండును, విడూరథుండును. మొదలుగాఁగలవారు పెక్కండ్రు వృష్ణివంశ జాతులైరి; భజమానుండు, కుకురుఁడు, శుచి, కంబళబర్హిషుండు నన నలువు రంధకునకుఁ బుట్టిరి; కుకురునికి వృష్ణి, వృష్ణికి విలోమ తనయుండు, విలోమతన యునికిఁ గపోతరోముండు, గపోతరోమునికిఁ దుంబురుసఖుం డైన యనువును, ననువునకు దుందుభి, దుందుభికి దవిద్యోతుండు, దవిద్యోతునకుఁ బునర్వసువు, నతనికి నాహుకుం డనుకుమారుండు, నాహుకికి యనుకన్యయుం గలిగి; రాయా హుకునికి దేవకుం, డుగ్రసేనుండు నన నిరువురు జనించి; రందు దేవకునికి దేవలుం, డనుపదేవుండు, సుదేవుండు, దేవవర్ధనుం డన నలుగురు గలిగిరి; వారలకు ధృతదేవయు, శాంతిదేవయు నుపదేవయు, శ్రీదేవయు, దేవరక్షితయు, సహ దేవయు, దేవకియు ననఁ దోఁబుట్టువు లేడ్వురు గలిగిరి; వినుము. 712

క. అసదృశలలితాకారలఁ - [1]కిసలయకరతలల, దేవకీముఖ్యల, నా
[2]బిసరుహనయనల, నందఱ - వసుదేవుఁడు పెండ్లియాడె వసుధాధీశా! 713

వ. ఉగ్రసేనునకుఁ గంసుండును, న్యగ్రోధుండును, సునామకుండును, గహ్వుండును, శంకుండును, సుభువును, రాష్ట్రపాలుండును, విసృష్టుండును, దుష్టిమంతుండును, నను కొడుకులును, గంసయుఁ, గంసవతియు, సురాభువును, రాష్ట్రపాలికయు నను కూఁతులుం బుట్టిరి; వారు వసుదేవానుజభార్యలైరి; భజమానునికి విడూర థుండును, విడూరథునికి శినియు, నతనికి భోజుండు, భోజునికి హృదికుండునుం, గలిగి; రందు హృదికునికి దేవమీఢుండు, శతధనువు, కృతవర్మయు నను కొడు కులు గలిగి; రా దేవమీఢుండు శూరుండు ననంబడు; శూరునికి మారిష యను భార్యయందు వసుదేవుడును, దేవభాగుండును, దేవశ్రవుండును, నానకుండును,

1. చిగురుటాకులవంటి చేతులుగలవారు. 2. తామర(కమలము)లవంటి కన్నులుగలవారు.

సృంజయుండును, శ్యామకుండును, కంకుండును శమీకుండును, వత్సకుండును, వృకుండును ననువారు పదుగురు గొడుకులును, పృథయు, శ్రుతదేవయు, శ్రుతకీర్తియు, శ్రుతశ్రవసయు, రాజాధిదేవియు ననుకూఁతు లేవురును బుట్టి; రందు.

వసుదేవుని వంశక్రమానువర్ణనము

ఉ. ధీనయశాలి యైన వసుదేవుఁడు పుట్టినవెంట, మింటిపై
నాన[1]కదుందుభుల్ మొరసె; "నచ్యుతుఁ డీతనికిం దనూజుఁ డై
మానుగఁ బుట్టు" నంచు గరిమంబున దేవత[2]లుబ్బ, రాజపం
చానన! తన్నిమిత్తమున నానకదుందుభి యయ్యె వాఁ డిలన్. 715

క. తన చెలికాఁ డగు కుంతికిఁ-దనయులు లే కున్నఁ జూచి, తనతనయఁ బృథం
దనయఁగ నిమ్మన, శూరుఁడు-దనయం దలిమైత్రి నిచ్చె ధరణీనాథా! 716

వ. ఆయ్యింతి కుంతిభోజునింటం బెరుఁగుచుండ, నొకనాఁడు దుర్వాసుం డరుగుదెంచిన, నమ్మహాత్మునకుఁ గొన్నిదినంబులు పరిచర్యలు సేసి, వేల్పులం జేరం జీరు విద్యం బడసి, యా విద్యలా వెఱుంగ, నొకనాఁ డేకాంతంబున వెలుంగుతేని నాకర్షించిన, నా దేవుండు వచ్చినం జూచి, వెఱఁగుపడి, యి ట్లనియె.

క. "మంత్రపరీక్షార్థం బభి-మంత్రించితిఁ; గాని, దేవ! మదనక్రీడా
తంత్రంబుఁ గోరి చీరను;-మంత్రించినతప్పు సైఁచి మరలు దినేశా!" 718

వ. అనిన నయ్యువిదకుఁ బద్మినీవల్లభుం డి ట్లనియె. 719

మ. "తెఱవా! నీపలు కట్ల యౌ; నసదు లే దేవోత్తమాహ్వానముల్?
మొఱఁగం బోలునె వేల్పులం బడయుటల్? మోఘంబు లే? నీకు నీ
తఱి గర్భం బగుఁ; బుత్త్రుఁడుం గలుగు నీ[3]తారుణ్యముం బూజ్య మౌ;
వెఱవం గార్యము లేదు; సిగ్గు దగునే? వ్రీడావినమ్రాననా!" 720

చ. అని తగ నియ్యకొల్పి, లలితాంగికి గర్భము సేసి, మింటికిం
జనియె దినేశ్వరుం; డపుడు సక్కని రెండవసూర్యుఁడో యనం
దనరెడుపుత్త్రుఁ గాంచి, కృప దప్పి, జగజ్జనవాదభీత యై,
తనయుని నీటఁ బో విడిచి, తా నరిగెం [4]బృథ దండ్రియింటికిన్. 721

వ. అయ్యువిదను నీప్రపితామహుఁ డైనపాండురాజు వివాహం బయ్యె; నయ్యంగనకుఁ బాండురాజువలన ధర్మజభీమార్జునులు పుట్టి; రమ్మగువచెల్లె లగుశ్రుతదేవను గారూషకుం డైనవృద్ధశర్మ పెండ్లి యాడె; నయ్యిద్దఱకు మునిశాపంబున దంతవక్త్రుఁ డను దానవుండు జన్మించె; దానితోడంబుట్టు వగుశ్రుతికీర్తిని గేకయరాజయినధృష్టకేతుండు పెండ్లియాడె, నా దంపతులకుఁ బ్రతర్దనాదు లేవురు

1. దేవలోకమునందలి భేరులు 2. ఉప్పొంగఁగా 3. యౌవనము 4. కుంతి

పుట్టిరి; దానిభగిని యైన రాజాధిదేవిని జయత్సేనుండు పరిణయం బయ్యె; నామిథునంబునకు విందానువిందులు సంభవించిరి; చేదిదేశాధిపతి యైన దమఘోషుండు శ్రుతశ్రవసను పరిగ్రహించె; వారలకు శిశుపాలుం డుదయించె; వసుదేవుని తమ్ముఁడైన దేవభాగునికిఁ గంసయందుఁ జిత్రకేతు, బృహద్బలు లిరువురు జనించిరి; వాని భ్రాత యగు దేవశ్రవుం డనువానికిఁ గంసవతియందు వీరుండును, నిషుమంతుండును నుప్పతిల్లిరి; వానిసోదరుం డయినకంకునికిఁ గంక యనుదానికి బకుండు, సత్యజిత్తుఁ, బురుజిత్తు ననువా రుద్భవిల్లిరి; వానిసహజుం డయినసృంజయునికి రాష్ట్రపాలియందు వృషదుర్మర్షణాదు లావిర్భవించిరి; వాని యనుజాతుం డయిన శ్యామకునకు సురభూమియందు హరికేశిహిరణ్యాక్షులు ప్రభవించిరి; వాని తమ్ముం డైన వత్సుండు మిశ్రకేశి యనునప్సరసయందు వృకాదిసుతులం గనియె; వానియనుజుం డైనవృకుండు, దూర్వాక్షియందుఁ దక్షపుష్కరసాళ్వాదుల నుత్పాదించె; వానిజఘన్యజుం డయిన యనీకుండు సుదామని యనుదానియందు సుమిత్రానీకబాణాదు లయినకొడుకులం బడసె; వానియనుజుం డైన యానకుండు గర్ణికయందు ఋతధామజయులంగాంచె; వసుదేవునివలన రోహిణియందు బలుండును, గదుండును, సారణుండును, దుర్మదుండును, విపులుండును, ధ్రువుండును, కృతాదులును, బౌరవియందు సుభద్రుండును, భద్రబాహుండును, దుర్మదుండును, భద్రుండును, భూతాదులుం గూడఁ బన్నిద్దఱును, మదిరయందు నందోపనందకృతకశ్రుతశూరాదులును, కౌసల్యయందుఁ గేశియు, రోచనయందు హస్తహేమాంగాదులును, నిళయందు యదుముఖ్యు లయిన యురువల్కలాదులును, ధృతదేవయందుఁ ద్రిపృష్ఠుండును, శాంతిదేవయందుఁ బ్రశ్రమప్రశ్రితాదులును, నుపదేవయందుఁ గల్పవృష్ట్యాదులు పదుండ్రును, శ్రీదేవయందు వసుహంస, సుధన్వాదు లార్గురును, దేవరక్షితయందు గదాదులు దొమ్మండ్రును, సహదేవయందుఁ బురూథశ్రుతముఖ్యు లెనమండ్రును, దేవకియందుఁ గీర్తిమంతుండును, సుషేణుండును, భద్రసేనుండును, ఋజువును, సమదనుండును, భద్రుండును, సంకర్షణుండును ననువా రేడ్వురును బుట్టిరి; మఱియు. 722

క. దుష్టజననిగ్రహంబును-శిష్టజనానుగ్రహంబు సేయుటకొఱకై,
యష్టమగర్భమున, గుణో-త్కృష్టుఁడు దేవకికి విష్ణుదేవుఁడు పుట్టెన్. 723

ఆ. విష్ణుఁ డుదితుఁ డైనవెనుక నా దేవకి-భద్రమూర్తి యగు సుభద్రఁ గనియె;
నాగుణాఢ్య ముత్త వగు నీకు; నర్జును-దయిత యగుటఁ జేసి ధరణినాథ! 724

క. ఎప్పుడు ధర్మక్షయ మగు-నెప్పుడు పాపంబు వొడము నీలోకములో
నప్పుడు విశ్వేశుఁడు హరి-దప్పక విభుఁ డయ్యుఁ, దన్నుఁ దా సృజియించున్.

క. తనమాయ లేక వరునకు-ఘనునకు నీశ్వరున, కాత్మకర్తకు, హరికిన్,
జనములకుఁ, గర్మములకును మనుజేశ్వర! కారణంబు మఱియును గలదే? 726

క. తలఁపఁగ నెవ్వనిమాయా-విలసనములు జననవృద్ధివిలయంబులకుం
గలిమి, కనుగ్రహమోక్షం-బులకును, జీవునికి, మూలములు నా నెగడున్. 727

సీ. అట్టిసర్వేశుని కరయంగ జన్మాదిపరతంత్రభావ [1]మెప్పాటఁ గలదు?
రాజలాంఛనముల రాక్షసవల్లభు లక్షౌహిణీశులై యవనిఁ బుట్టి,
జనులను బాధింప, శాసించుకొఱకునై [2]సంకర్షణునితోడ జనన మంది,
యమరులమనముల కైన లెక్కింపంగ రాకుండునట్టికర్మములఁ జేసి,
తే. కలియుగంబున జన్మింపఁ గలుగు నరుల
దుఃఖశోకతమంబులఁ దొలఁగ జడిసి,
[3]నేలవ్రేఁ గెల్ల వారించి, నిఖిలదిశల
విమలకీర్తులు వెదచల్లి వెలసె శౌరి. 728

క. మంగళహరికీర్తిమహా-గంగామృత మించు కైనఁ గర్ణాంజలులన్
సంగతము సేసి త్రావఁ, దో-లంగును గర్మంబు లావిలం బగుచు నృపా! 729

క. వనజాక్షుని మందస్మిత-ఘనకుండలదీప్తిగండకలితాననమున్
వనితలుఁ బురుషులుఁ జూచుచు-ననిమిషభావంబు లేమి కలయుదు రధిపా! 730

సీ. జనకునిగృహమున జన్మించి, మందలోఁ బెరిగి, శత్రుల నెల్లఁ బీఁచ మడఁచి,
పెక్కండ్రుభార్యలఁ బెండ్లియై, సుతశతంబులఁ గాంచి, తను నాదిపురుషుఁగూర్చి,
క్రతువులు పెక్కులు గావించి, పాండవకౌరవులకునంతఁ గలహ మయిన
నందఱ సమయించి, యర్జును గెలిపించి, యుద్ధవునకుఁ దత్త్వ మొప్పఁ జెప్పి,
తే. మగధపాండవసృంజయమధుదశార్హ-భోజవృష్ణ్యంధకాదిసంపూజ్యుఁ డగుచు
నుర్వీభరమునివారించి,యుండనొల్ల-కామహామూర్తినిజమూర్తియందుఁబొందె.

చ. నగుమొగమున్, సుమధ్యమును, నల్లనిదేహము, లచ్చి [4]కాటప
ట్టగు నురమున్, మహాభుజము, లంచితకుండలకర్ణముల్, మదే
భగతియు, నీలవేణియుఁ, గృపారసదృష్టియుఁ గల్గువెన్నుఁ డి
మ్ముగఁ బొడసూపుఁ గాతఁ! గను మూసినయప్పుడు, విచ్చునప్పుడున్. 732

వ. అని చెప్పి. 733

క. జనకసుతాహృచ్చోరా!-జనకవచోలబ్ధవిపినశైలవిహారా!
జనకామితమందారా!-జనకాదిమహీశ్వరాతిశయసంచారా! 734

1. ఏవిధమున. 2. బలరాముఁడు. 3. భూమిభారము. 4. విహారస్థలము.

మాలిని. జగదవనవిహారీ! శత్రులోకప్రహారీ!
సుగుణవనవిహారీ! సుందరీమానహారీ!
విగతకలుషపోషీ! వీరవిద్యాభిలాషీ!
స్వగురుహృదయతోషీ! సర్వదా సత్యభాషీ! 735

## గద్యము

ఇది శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర, సహజపాండిత్య, పోతనామాత్య ప్రణీతం బయిన శ్రీమహాభాగవతం బను మహాపురాణంబు నందు, సూర్య వంశారంభంబును, వైవస్వతమనువుజన్మంబును, హైమచంద్ర కథనంబును, సుద్యుమ్నాదిమనుసూనులచరిత్రంబును, మరుత్త తృణబిందుశర్యాతి కకుద్మి సగర నాభాగ ప్రముఖుల చరిత్రంబులును, నంబరీషునియందుఁ బ్రయోగింపంబడిన దుర్వాసునికృత్య నిరర్థక యగుటయు, నిక్ష్వాకువికుక్షిమాంధాతృ పురుకుత్సహరిశ్చంద్ర సగర భగీరథ ప్రముఖులచరిత్రంబులును, భాగీరథీప్రవాహవర్ణనంబును, కల్మాషపాద ఖట్వాంగ ప్రముఖులవృత్తాంతంబును, శ్రీరామచంద్రకథనంబును, తదీయవంశపరంపరాగణనంబును, నిమికథయును, చంద్రవంశారంభంబును, బుధపురూరవులకథయును, జమదగ్నిపరశురాములవృత్తాంతంబును, విశ్వామిత్ర నహుష యయాతి పూరు దుష్యంత భరత రంతిదేవ పాంచాలబృహద్రథ శంతను భీష్మ పాండవకౌరవప్రముఖుల వృత్తాంతంబును, ఋశ్యశృంగ వ్రతభంగంబును, ద్రుహ్యానుతుర్వసులవంశంబును, యదు కార్తవీర్య శశిబిందు జామదగ్న్యాదులచరిత్రంబును, శ్రీకృష్ణావతారకథాసూచనంబును నను కథలు గల నవమస్కంధము.





మౌళిపింఛముఁ గంధదామమును మెఱయ, విలసితగ్రామముగ నొక్క వేణువందు
[illegible]ధర్వగీతంబు పరగఁజేసెఁ - జతురనటమూర్తి గోపాలచక్రవర్తి.

శ్రీరస్తు

శ్రీకృష్ణాయ నమః

# శ్రీమదాంధ్రభాగవతము

## దశమస్కంధము, పూర్వభాగము

శ్రీకంఠచాపఖండన!
పాకారిప్రముఖవినుతభండన! విలస
త్కాకుత్స్థవంశమండన!
రాకేందుయశోవిశాల! రామనృపాలా! 1

వ. మహనీయగుణగరిష్ఠు లగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీ
సమేతుం డయిన సూతుం డిట్లనియె; నట్లు పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం
గనుంగొని. 2

### శ్రీకృష్ణకథాప్రారంభము

క. "తెలిపితివి సోమసూర్యుల-కులవిస్తారంబు, వారికులము, ధరిత్రీ
శులనడవళ్లును; వింటిమి-కలరూపము లెల్ల మాకుఁ గడు వెఱఁగులుగన్. 3

క. శీలము గల[1] యదుకులమున-నేలా పుట్టెను మహాత్ముఁ డీశుఁడు? విష్ణుం
డేలీల మెలఁగె? నేయే-వేళల నేమేమి సేసె? వివరింపు తగన్. 4

క. [2]భవములకు మందు, చిత్త-శ్రవణానందము, ముముక్షుజనపదము, హరి
స్తవము పశుఘ్నుఁడు దక్కను-"జెవులకుఁ దనివయ్యె" ననెడి చెనఁటియుఁ గలఁడే?

క. మా పెద్దలు, మును వేల్పులు-నోపని భీష్మాదికురుకులోత్తమ[3] సేనా
కూపారము, నేకోలము-ప్రాపున లంఘించి రొక్క బాలపదముగాన్. 6

క. మాయమ్మకుక్షి గురుసుత-సాయకపీడితుఁడ నైన నను, నన్నును, గౌం
తేయకురుకులము నిలుపఁగ-నాయుత్తముఁ డాత్తచక్రుఁడై రక్షించెన్. 7

ఆ. కలసి పురుషమూర్తి కాలరూపములను-లోకజనుల వెలిని, లోన నుండి,
జన్మమృత్యువులను సంసారముక్తుల-నిచ్చు; నతనిచరిత మెల్లఁ జెపుము. 8

---

1. యయాతివంశము. 2. సంసారము, పుట్టుక. 3. సేనయను సముద్రము.

సీ. ఊహించి రాముఁడు రోహిణీకొడు కంచు, నప్పాడు యోగీంద్ర! చెప్పి తీవు;
దేవకికడుపున నేవెరపున నాతఁ డుండెను దేహంబు నొండు లేక?
తనతండ్రియిలు వాసి, వనజాక్షుఁ డేరీతి మందకుఁ బోయెను? నే మందిరమున
నుండి? యెయ్యది సేయుచుండెను? దనమేనమామ కంసుని నేల నామ మడఁచె?
ఆ. నెన్నియేండ్లు మనియె నిలమీఁద మనుజుఁడై?-యెందఱైరి భార్య? లెట్లు మెలఁగె?
మఱియు నేమి సేసె? మాధవుచారిత్ర-మెంత గలదు? నాకు నేర్పరింపు." 9

వ. అని మఱియు ని ట్లనియె. 10

ఆ. "నీముఖాంబుజాతనిర్ముక్తహరికథా-మృతముఁ ద్రావఁ ద్రావ, మేను వొదలె;
వంతమానె; నీరుపట్టు, నాఁకలియును-దూర మయ్యె, మనము దొంగలించె."

వ. అని పలుకుచున్న రాజుమాటలు విని, [1]వైయాసి యి ట్లనియె. 12

క. "విష్ణుకథారతుఁ డగునరు,-విష్ణుకథల్ సెప్పునరుని, వినుచుండునరున్,
విష్ణుకథాసంప్రశ్నము-విష్ణుపదీజలముభంగి విమలులఁ జేయున్. 13

సీ. రాజేంద్ర! విను తొల్లి రాజలాంఛనముల, వేలసంఖ్యలదైత్యవిభులు దన్ను
నాక్రమించిన, భార మాఁగఁ జాలక, భూమి గోరూప యై, బ్రహ్మఁ జేరఁ బోయి,
కన్నీరు మున్నీరుగా శోకనము సేయఁ, గరుణతో భావించి, కమలభవుఁడు
ధరణి నూఱడఁ బల్కి, ధాత్రియు వేల్పులుఁ గదలి రా, విష్ణుని గాన నేఁగి,
తే. పురుషసూక్తంబుఁ జదివి, యద్భుతసమాధి
నుండి, యొకమాట విని, వారిజోద్భవుండు
"వినుఁడు [2]వేల్పులు! ధరయు, నే విన్నయట్టి
పలుకు వివరింతు" నని ప్రీతిఁ బలికెఁ దెలియ. 14

క. "యాదవకులమున నమరులు-మేదినిపైఁ బుట్టఁజనుఁడు మీయంశములన్;
శ్రీదయితుఁడు వసుదేవున-కాదరమునఁ బుట్టి, భార మంతయుఁ బాపున్. 15

క. హరిపూజార్థము పుట్టుఁడు-సురకన్యలు భూమియందు సుందరతను లై;
హరి కగ్రజుఁ డై శేషుఁడు-హరికళతోఁ బుట్టు, దత్ప్రియారంభుం డై. 16

ఆ. ఈప్రపంచ మెల్ల నే మాయచే మోహి-తాత్మ మగుచు నుండు; నట్టిమాయ
కమలనాభునాజ్ఞఁ గార్యార్థ మై, నిజాం-శంబుతోడఁ బుట్టు జగతియందు." 17

వ. అని యిట్లు వేల్పుల నియ్యకొలిపి, పుడమిముద్దియ నోడంబఱిచి, [3]తమ్మిచూలి
దన మొదలినెలవునకుం జనియె; నంత యదువిభుం డయిన శూరసేనుం డను
వాఁడు మథురాపురంబు దనకు రాజధానిగా, [4]మాథురంబులు శూరసేనంబు
లనియెడు దేశంబు లేలెఁ; బూర్వకాలంబున. 18

1. వ్యాసపుత్త్రుఁడు-శుకయోగి. 2. దేవతలారా! 3. బ్రహ్మదేవుఁడు. 4. మధురకు సంబంధించిన దేశములు.

క. ఏ మథురయందు నిత్యము-శ్రీమన్నారాయణుండు సెలఁగుఁ బ్రియముమై;
నా మథుర సకలయాదవ-భూమీశుల కెల్ల మొదలిపురి యయ్యె; నృపా! 19

సీ. ఆశూరసేనున కాత్మజుం డగు వసుదేవుఁ డాపురి నొక్కదినమునందు
దేవకిఁ బెండ్లియై, దేవకియును దానుఁ గడువేడ్క రథ మెక్కి కదలువేళ,
నుగ్రసేనునిపుత్త్రుఁ డుల్లాసి, కంసుండు, చెల్లెలు మఱఁదియు నుల్లసిల్ల,
హరులపగ్గములఁ జే నంది, రొప్పుచుఁ దోడంగె; ముందట భేరులు మురజములును
ఆ. శంఖపటహములును జడిగొని మ్రోయంగఁ-గూఁతుతోడివేడ్క గొనలుసాఁగ,
దేవకుండు సుతకు దేవకీదేవికి - [1]నరణ మీఁ దలంచి, యాదరించి. 20

వ. నార్థంబు లయిన రథంబుల వేయునేనమన్నూటిని, కనకదామసముత్తుంగంబు లయిన మాతంగంబుల నన్నూటిని, బదివేలతురంగంబులను, విలాసవతు లయిన దాసీజనంబుల నిన్నూటిని నిచ్చి, యనిచినం గదలే, వరవధూయుగళంబు దెరువునం జను సమయంబున. 21

క. పగ్గములు వదలి వేగిర-మగ్గలముగ రథముఁ గడపునా కంసుఁడు, లో
[2]జగ్గిలి, యెగ్గని తలఁపఁగ, దగ్గఱ నశరీరవాణి దివి నిట్లనియెన్. 22

క. "తుష్ట యగుభగిని మెచ్చఁగ-నిష్టుండ వై, రథము గడపె; దెఱుఁగవుమీఁదట్
శిష్ట యగు నీతలోదరి-యష్టమగర్భంబు నిన్ను హరియించుఁ జుమీ!" 23

వ. అని యిట్లాకాశవాణి పలికిన, నులికిపడి, భోజకులపాంసనుం డైన కంసుండు సంచలదంసుండై, యడిదంబు బెడిదంబు గాఁ బెఱికి, జళిపించి, దెప్పరంబుగ ననుజకొప్పుఁ బట్టి, కప్పరపాటున నెప్పఱం దిగిచి, యొడిసిపట్టి తోఁబుట్టు వని తలంపక, తెంపు సేసి తెగ వ్రేయ గమకించుసమయంబున వసుదేవుండు డగ్గఱి.

క. ఆపాపచిత్తు, మత్తుం - గోపాగ్నిశిఖానువృత్తుఁ, గొడకొని తన స
ల్లాపామృతధారావి - క్షేపంబునఁ గొంతశాంతుఁ జేయుచుఁ బలికెన్. 25

ఉ. "అన్నవు నీవు; చెల్లెలికి నక్కట! మాడలు చీర లిచ్చుటో?
మన్నన సేయుటో? మధురమంజులభాషల నాదరించుటో?
మిన్నులమ్రోఁతలే నిజము, మే లని చంపకుమన్న! మాని రా
వన్న! సహింపుమన్న; తగదన్న; వధింపకుమన్న; వేఁడెదన్. 26

వ. అదియుం గాక. 27

మ. చెలియల్, గన్నియ, ముద్దరా, లబల, నీసేమంబ చింతించు ని
ర్మల, దీనన్ బయ లాడుమాటలకు నై, మర్యాదఁ బోఁదట్టి, స

1. కట్నము 2. భయపడి, కలఁతఁజెంది.

త్కులజాతుండవు, పుణ్యమూర్తి, వకటా! గోపంబు పాపంబు; నె
చ్చెలి నోహో! తెగవ్రేయఁ బాడి యగునే? చింతింపు భోజేశ్వరా! 28

సీ. మేనితోడన పుట్టు మృత్యువు జనులకు; నెల్లి, నేఁడైన, నూఱేండ్ల కైనఁ
దెల్లంబు మృత్యువు; దేహంబు పంచత నందఁ, గర్మానుగుఁడై శరీరి
మాఱు దేహమునూఁది, మఱితొంటి దేహంబుఁ బాయును; దనపూర్వభాగ మెత్తి
వేఱొంటిపైఁ బెట్టి, వెనుకభాగఁ బెత్తి గమనించుతృణజలూకయును బోలె;

ఆ. వెంటవచ్చుకర్మవిసరంబు మును మేలు-గన్నవేళ, నరుఁడు గన్న విన్న,
తలఁపఁబడినకార్యతంత్రంబు. కలలోనఁ-బాడితోడఁ గానఁబడినయట్లు. 29

క. తనతోఁటి కర్మరాశికి-ననుచర మై, బహువికార మై, మనసు వడిం
జను, నింద్రియముల తెరువులఁ-దనువులు పెక్కైనఁ జెడవు తనకర్మంబుల్.

ఆ. జలఘటాదులందుఁ జంద్రసూర్యాదులు-గానఁబడుచు, గాలిఁ గదలుభంగి
నాత్మకర్మనిర్మితాంగంబులును బ్రాణి-గదలుచుండు, రాగకలితుఁ డగుచు. 31

క. కర్మములు మేలునిచ్చును-గర్మంబులు కీడునిచ్చుఁ గర్తలు దనకుం
గర్మములు బ్రహ్మకైనను-[1]గర్మగుఁడై పరులఁ దడవఁగా నేమిటికిన్? 32

క. కావునఁ బరులకు హింసలు-గావింపఁగ వలదు; తనకుఁ గల్యాణముగా
భావించి, పరుల నొంచినఁ-బోవునె తత్ఫలము? పిదపఁ బొందక యున్నే? 33

మత్తకోకిలము. వావిఁ జెల్లెలు గాని, పుత్రికవంటి; దుత్తమురాలు, సం
భావనీయచరిత్ర, భీరువు, బాల, నూత్నవివాహ సు
శ్రీవలాసిని, దీన, కంపితచిత్త; నీ కిదె మ్రొక్కెదం;
గావవే! కరుణామయాత్మక! కంస! మానవవల్లభా!" 34

వ. అని మఱియు సామరూపంబులగు పలుకులు పలికిన, వినియు వాఁడు, వేఁడి చూపుల రాలునిప్పులు గుప్పలుగొన ననుకంప లేక, తెంపుసేసి, చంపకగంధిం జంపఁజూచుట యెఱింగి, మొఱంగెడి తెఱంగు విచారించి, తనలో ని ట్లనియె.

క. "ఎందును గాలము నిజమని - [2]పందతనంబునను, బుద్ధిఁ బాయక, ఘనులై
యెందాఁక బుద్ధి నెగడెడి - సందాఁకఁ జరింపవలయు, నాత్మబలమునన్.' 36

వ. అని నిశ్చయించి. 37

సీ. ఆపన్నరా లైవయంగన రక్షించి, సుతుల నిచ్చెద నంట శుభము నేఁడు;
మీఁదెవ్వఁ డెఱుఁగును? మెలఁత ప్రాణంబుతో నిలిచిన మఱునాఁడు నేరరాదె?
సుతులు పుట్టిరయేని, సుతులకు మృత్యువు వాలాయ మై వెంట వచ్చెనేని,
బ్రహ్మచేతను వీఁడు పాటేమియును లేక యుండునే? సదుపాయ మొకటి లేదె?

1. కర్మమును పొందినవాఁడు, 2. అవివేకము.

తే. పొంతఁ బ్రాకులఁ గాల్పక పోయి, వహ్ని-యెగసి, దవ్వులవాని దహించుభంగిఁ
గర్మవశమున భవమ్మునకారణములు-మారగతిఁ బొందు; నిఁక యేలతొట్రుపడఁగ?

క. "కొడుకుల నిచ్చెద" నని, సతి- విడిపించుట నీతి; వీఁడు విడిచినమీఁదం
గొడుకులు పుట్టినఁ, గార్యము-[1]దడఁబడదే? నాఁటి కొక్క దైవము లేదే? 39

క. ఎనిమిదవ చూలు, వీనిం-దునుమాడెడి నంచు మింటఁ దోరపుఁ బలుకుల్
వినఁబడియె; నేల తప్పును? వనితను విడిపించు టొప్పు వైశం" బనుచున్. 40

క. తిన్ననిపలుకులు వలుకుచుఁ-గ్రన్నన తగఁ బూజ చేసి, కంసు నృశంసుం
మన్నించి, చిత్తమెరియఁ బ్ర-సన్నాననునఁ డగుచు, బలికె శౌరి నయమునన్.

క. "లలనకుఁ బుట్టినకొమరుని-వలనం దెగ" దనుచు గగనవాణి వలికె నం
చలిగెదవేని, మృగాక్షికిఁ, గలకొడుకులఁ జంపనిత్తుఁ గ్రమమున నీకున్." 42

వ. అని, యిట్లు పలికిన విని, కంసుండు కంపితావతంసుండై సంతసించి, గుణగ్రాహి
త్వంబు గైకొని, కొందల మందు చెలియలి ముందల విడిచి, చనియె; వసుదేవుం
డును "బ్రదుకుమందలఁ గంటి" ననుచు, సుందరియుం దానును మందిరంబునకుం
బోయి, డెందంబున నానందంబునొంది యుండె; నంతఁ గొంతకాలంబు సనిన
సమయంబున. 43

క. విడువక కంసునియొగ్గులఁ-బడి, దేవకి నిఖిలదేవభావము దనకే
ర్పడ, నేఁట నొకనిలెక్కను-గొడుకుల నెనమండ్ర నొక్కకూఁతుం గనియెన్.

వ. అందు. 45

ఆ. సుదతి మున్ను గన్న సుతుఁ గీర్తిమంతునిఁ-బుట్టుతడవ కంసభూవరునకుఁ
దెచ్చి యిచ్చెఁ, జాల ధృతి గల్గి, వసుదేవుఁ-డాసపడక, సత్యమందు నిలిచి. 46

క. పలికినపలుకులు దిరుగక-[3]సొలయక, వంచనము లేక, సుతుల రిపునకుం
గలఁగక, యిచ్చినధీరుం-డిల వసుదేవుండు దక్క నితరుఁడు గలఁడే? 47

ఆ. మానవేంద్ర! సత్యమతికి దుష్కర మెయ్య?-దెఱుక గలుగువాని కిష్ట మెయ్య?
దీశభక్తిరతునికి కీ రాని దెయ్యది?-యెఱుక లేనివాని కేది కీడు? 48

వ. ఇట్లు సత్యంబు దప్పక కొడుకు నొప్పించిన వసుదేవునిపలుకు నిలుకడకు మెచ్చి,
కంసుం డి ట్లనియె. 49

ఆ. "కొడుకు నీవు మరలఁ గొనిపొమ్ము; వసుదేవ!-వెఱపు లేదు నాకు వీనివలన;
నల్ల వీనికి; భవదష్టమపుత్త్రుండు-మృత్యు వఁట? వధింతు మీఁద నతని." 50

---

1. తాఱుమాఱుకాదా? 2. మండఁగా 3. ఆలస్యముచేయక.

వ. అనిన నానకదుందుభి నందనుం గొని చనియు, నానందంబు నొందక, దుష్ట
స్వభావుం డగు బావపలుకులు వినియు, నులుకుచుండె; నంత. 51

సీ. ఒకనాఁడు నారదుం డొయ్యన కంసునియింటికిఁ జనుదెంచి, [1]యేకతమున
"మందలోపల నున్ననందాదులును, వారిభార్యలుఁ, బుత్త్రులు, బాంధవులును,
దేవకి మొదలగు తెఱవలు, వసుదేవుఁ డాదిగాఁ గల సర్వయాదవులును,
సురలు గాని, నిజంబు నరులు గా"రని చెప్పి, "కంసుండ! నీవు రక్కసుఁడ;" వనియు

ఆ. "దేవమయుఁడు చక్రి, దేవకీదేవకిఁ బుత్త్రుఁ డై జనించి, భూతలంబు
నెఱపఁ బుట్టినట్టి చెనఁటిదైత్యుల నెల్లఁ జంపు" ననుచుఁ జెప్పి చనియె దివికి.

క. నారదుమాటలు విని, [2]పెల్లారాటముఁ బొంది, "యదువు లనిమిషు లనియున్,
నారాయణకరఖడ్గవిదారితుఁ డగు కాలనేమి దా" ననియు మదిన్. 53

మ. కలఁగం బాఱి, మఱందిఁ జెల్లెలి నుదగ్రక్రోధుఁ డై పట్టి, బ
ద్ధులఁ గావించి, హరిం దలంచి, వెసఁ దోడ్తో వారు గన్నట్టిపు
త్త్రులఁ జంపెన్; గురు నుగ్రసేను యదుఁ దద్భోజాంధకాధీశు, ని
ర్మలుఁ బట్టెం; గడు వాలి, యేలెఁ జలమారన్ శూరసేనంబులన్. 54

ఆ. తల్లిఁ, దండ్రి నైనఁ దమ్ముల నన్నల, సఖుల నైన, బంధుజనుల నైన,
రాజ్యకాంక్ష జేసి, రాజులు చంపుదు రవనిఁ దఱచు జీవితార్థు లగుచు. 55

వ. మఱియు బాణ, భౌమ, మాగధ, మహాశన, కేశి, ధేనుక, బక, ప్రలంబ,
తృణావర్త, చాణూర, ముష్టి, కారిష్ట, ద్వివిద, పూతనాదిసహాయసమేతుండై,
కంసుండు గదనంబున మదంబు లడంచిన, వదనంబులు వంచికొని, సదనంబులు
విడిచి, యదవ లై, యదువులు పదవులు వదలి, నిషధకురుకోసలవిదేహవిదర్భ
కేకయపాంచాలసాల్వదేశంబులు సొచ్చిరి. మచ్చరంబులు విడిచి, కొందఱు
కంసునిం గొలిచి నిలిచి; రంత. 56

క. [4]తోడఁ దోడఁ గంసుఁడు దేవకికొడుకుల నార్వుర వధింప, గురుశేషాఖ్యం
దోడ వగు హరిరుచి, యాసతి, కడుపున నేడవది యైనగర్భం బయ్యెన్. 57

వ. అయ్యవసరంబున విశ్వరూపుం డగుహరి, "దన్ను నమ్మినయదువులకుఁ గంసుని
వలన భయంబు గలుగు" నని యెఱింగి, యోగమాయాదేవి కిట్లనియె. 58

సీ. గోపికాజనములు గోపాలకులు నున్నపసులమందకుఁ బొమ్ము; భద్ర! నీవు
వసుదేవుభార్యలు వరుసఁ గంసునిచేత [5]నాఁకలఁ బడి యుండ, నందుఁ జొరక,
తలఁగి, రోహిణి యను తరళాక్షి నందగోకులమందు నున్నది; గుణగణాఢ్య!
దేవకికడుపున దీపించు శేషాఖ్య మైన నా తేజ, మీ వమరఁ బుచ్చి,

---

1. ఒంటరిగ. 2. దుర్మార్గులయిన. 3. అధికతాపము. 4. వెంటవెంట. 5. కారాగృహమునందు.

ఆ. నేర్పు మెఱసి, రోహిణీదేవికడుపునఁ-జొనుపు; దేవకికిని సుతుఁడ నగుదు,
నంశభాగయుతుఁడ నై; యశోదకు నందు-పొలఁతి కంత మీఁదఁ బుట్టె దీవు.

క. నానావిధసంపదలకుఁ-దానక మై, సర్వకామదాయిని వగు నిన్
మానవులు భక్తిఁ గొలుతురు-కానికలును బలులు నిచ్చి, కల్యాణమయీ! 60

వ. మఱియు నిన్ను, మానవులు "దుర్గ, భద్రకాళి, విజయ, వైష్ణవి, కుముద, చండిక, కృష్ణ, మాధవి, కన్యక, మాయ, నారాయణి, యీశాన, శారద, యంబిక, యను పదునాలుగునామంబులం గొనియాడుదు రయ్యైస్థానంబుల యం;"దని యెఱింగించి, సర్వేశ్వరుం డగు హరి పొమ్మని, యాన తిచ్చిన మహాప్రసాదం బని, యయ్యోగనిద్ర యియ్యకొని, మ్రొక్కి, చయ్యన నియ్యెల కయ్యెడ వాసి, వచ్చి. 61

తే. వకీదేవికడుపులోఁ దేజరిల్లు-దీప్తగర్భంబు మెల్లన [1]తిగిచి, యోగ
నిద్ర రోహిణికడుపున నిలిపి చనియెఁ-"గడుపు దిగె" నంచుఁ బౌరులు గలఁగఁ బడఁగ.

వ. అంత. 63

ఆ. బలము మిగులఁ గలుగ బలభద్రుఁడన, లోక-రమణుఁడగుటఁ జేసి రాముఁడనఁగ
సతికిఁ బుట్టె, [2]గర్భసంకర్షణమున సం-కర్షణుం డనంగ ఘనుఁడు సుతుఁడు. 64

వ. తదనంతరంబ. 65

క. ఆనకదుందుభి మనమునఁ-(శ్రీ)నాథుం డంశభాగశిష్టతఁ జొరఁగన్
భానురుచి నతఁడు వెలిఁగినఁ-గానఁగఁ బట్టయ్యె భూతగణములకు నృపా! 66

ఉ. ఆవసుదేవుఁ డంతఁ దనయం దఖిలాత్మక, మాత్మభూతముం,
బావనరేఖముం, భువనభద్రము నై వెలుఁగొందుచున్న ల
క్ష్మీవిభుతేజ మచ్చుపడఁ, జేర్చినఁ, దాల్చి, నవీనకాంతితో
దేవకి యొప్పెఁ బూర్వ యగుదిక్సతి చంద్రునిఁ దాల్చుకై వడిన్." 67

వ. అనిన విని "తరువాతివృత్తాంతం బెట్లయ్యె?"నని రాజడిగిన, శుకుం డిట్లనియె.

క. గురుతరముగఁ దనకడుపున-సరసిజగర్భాండభాండచయములు గలయా
హరి, దేవకికడుపున భూ-భరణార్థము వృద్ధిఁ బొందె బాలార్కు క్రియన్. 69

వ. అంత. 70

సీ. విమతులమోములు వెలవెలఁ బాఱంగ, విమలాస్యమోము వెల్వెలుకఁ బాఱె;
మలయువైరులకీర్తి మాసి నల్లన గాఁగ, నాతిచూచుకములు నల్ల నయ్యె;

1. ఆకర్షించి. 2. గర్భమునుండి లాగుటవలన.

దుష్టాలయంబుల ధూమరేఖలు పుట్ట లేమయాఱున రోమలేఖ మెఱసె;
నరిమానసముల కాహారవాంఛలు దప్ప; వనజాక్షి కాహారవాంఛ దప్పె;
తే. శ్రమము సంధిల్లె రిపులకు శ్రమము గదుర;
జడత వాటిల్లె శత్రులు జడనుపడఁగ;
మన్ను రుచి యయ్యెఁ జగతుఱ [1]మన్ను సొరఁగ
వెలఁదియుదరంబులో హరి వృద్ధిఁ బొంద. 71

వ. మఱియును. 72

సీ. సలిల మావెలనాఁగ జఠరార్భకునిఁ గానఁ జనిసకై వడి ఘర్మసలిల మొప్పె;
నొగిఁ దేజమాయింతియుదరడింభకుఁ గొల్వఁ గదిసిన క్రియ దేహకాంతి మెఱసెఁ;
బవనుఁ డాకొమ్మ గర్భస్థుని సేవింప నొలసె నా మిక్కిలియూర్పు లమరెఁ;
గుంభిని యాలేమ కుక్షిగు నర్చింపఁ జొచ్చుభంగిని [2]మంటిచోరవ దనరె;
ఆ. గగన మిందువదనకడుపులో బాలు సే-వలకు రూపు మెఱసి వచ్చినట్లు,
బయలువంటినడుము బహుళమయ్యెను, బంచ-భూతమయుఁడులోనఁబొదలసతికి.

వ. తదనంతరంబ. 74

సీ. అతివకాంచీగుణం బల్లన బిగియంగ, వైరివధూ[3]గుణవ్రజము వదలె;
మెల్లన తన్వంగి మెయిదీవ మెఱుఁ గెక్క, దుష్టాంగనాతనుద్యుతు లడంగె;
నాతి కల్లన భూషణములు పల్వలనగాఁ, బరసతీభూషణపంక్తు లెడలెఁ;
గలకంఠి కొయ్యన గర్భంబు దొడ్డు గాఁ, బరిపంథిదారగర్భములు పగిలెఁ;
తే. బొలఁతి కల్లన నీళ్లాడు ప్రొద్దు లెదుగ-నహితవల్లభ లైదువ లై తనర్చు
ప్రొద్దులన్నియుఁ గ్రమమునఁబోవఁదొడఁగె-నువిదకడుపున నసురారి యుంటఁ జేసి.

వ. ఇవ్విధంబున. 76

ఆ. జ్ఞానఖలునిలోని శారదయునుబోలె-ఘటములోని దీపకళికవోలె,
భ్రాతయింట నాఁకఁ బడి యుండె, దేవకీ-కాంత విశ్వగర్భగర్భ యగుచు. 77

వ. అంత నక్కాంతాతిలకంబు నెమ్మొగంబు తెలివియును, మేనిమెఱుంగును, మెలంగెడి సొబగునుం జూచి, వెఱఁగుపడి, తఱచు వెఱచుచుఁ గంసుండు దనలోని ట్లనియె. 78

క. "కన్నులకుఁ జూడ బరువై-యున్నది యెలనాఁగగర్భ ముల్లము గలఁగన్;
మున్నెన్నఁడు ని ట్లుండదు-వెన్నుఁడు సొరఁ బోలు గర్భవివరములోనన్. 79

ఉ. ఏమి దలంచువాఁడ? నిఁక నెయ్యది కార్యము? నాఁడునాఁటికిం
గామినిమోలు పెం పెసఁగె; గర్భిణిఁ, జెల్లెలి, నాఁడుపేద, నే

1. భూమిలోనికి యణఁగునట్లు. 2. మన్నుపైకోరిక. 3. మంగళసూత్రముల సముదాయము.

నే మని చంపువాఁడ? దగ వే లని చంపితి నేని శ్రీయు న
ద్దామయశంబు నాయువును ధర్మమునుం జెడిపోవకుండు నే? 80

క. వావి యెఱుంగనిక్రూరుని–"జీవన్మృతుఁ"డనుచు నింద సేయుదు; రతఁడుం
బోవును నరకమునకు; దు–ర్భావముతో బ్రదుకు టొక్క బ్రదుకే తలఁపన్?"

వ. అని నిశ్చయించి, క్రౌర్యంబు విడిచి, ధైర్యంబు నొంది, గాంభీర్యంబు వాటించి, శౌర్యంబు ప్రకటించికొనుచు "దిగ్గనం జెలియలిం జంపునగ్గలిక యె" గ్గని యుగ్గడించి, మాని, మానియుంబోలె నూరకుండియు. 82

ఆ. "[1]పాపరాని దొడ్డపగ పుట్టె నీక నెట్టు;–లిందుముఖికిఁ జక్రి యెపుడు పుట్టుఁ?
బుట్టునపుడె పట్టి పురిటింటిలోఁ దెగఁ–జూతు"ననుచు నెదురు సూచుచుండె.

వ. మఱియు వైరానుబంధంబున నన్యానుసంధానంబు మఱచి, యతండు. 84

క. తిరుగుచుఁ,గుడుచుచుఁ,ద్రాగుచు–నరుగుచుఁ, గూర్చుండి లేచు, చనవరతంబున్
హరిఁ దలఁచితలఁచి'జగమా–హరిమయ'మనిచూచెఁ గంసుఁడాఱనియలుకన్.

వ. వెండియు. 86

సీ. శ్రవణరంధ్రముల నేశబ్దంబు వినఁబడు, నది హరిరవ మని యాలకించు;
నక్షిమార్గమున నెయ్యది సూడఁబడు,నది హరిమూర్తి గానోపు నంచుఁ జూచుఁ;
దిరుగుచో దేహంబు తృణ మైన సోఁకిన, హరిక రాఘాత మో యనుచు నులుకు;
గంధంబు లేమైన ఘ్రాణంబు సోఁకిన, హరిమాలికాగంధ మనుచు నదరుఁ;

ఆ. బలుకు లెవ్వియైనఁబలుకుచో "హరి పేరు–పలుకఁబడియె"ననుచు బ్రమసిపలుకుఁ,
దలఁపు లెట్టివైనఁదలఁచి, యాతలఁపులు–'హరితలంపు' లనుచునలుగఁదలఁచు.

వ. అయ్యవసరంబున ననుచరసమేతు లైన దేవతలును, నారదాదిమునులునుం, గూడి నడువ నలువయును, ముక్కంటియు నక్కడకు వచ్చి, దేవకీదేవిగర్భం బున నర్భకుండై యున్న పురుషోత్తము ని ట్లని స్తుతియించిరి. 88

బ్రహ్మాదిదేవతలు దేవకీగర్భస్థుం డగు శ్రీకృష్ణుని స్తుతించుట

సీ. "సత్యవ్రతుని, నిత్యసంప్రాప్తిసాధనుఁ, గాలత్రయమునందుఁ గలుగువాని,
భూతంబు లైదును బుట్టుచో టగువాని, [2]నైదుభూతంబులం దమరువాని,
నైదుభూతంబులు నడఁగినపిమ్మటఁ బరఁగువానిని, సత్యభాషణంబు,
సమదర్శనంబును, జర పెడువానిని, నిన్నాశ్రయింతుము; నీయధీన

తే. మాయచేత నెఱుక మాలినవారలు–పెక్కుగతుల నిన్నుఁ బేరుకొందు;
రెఱుఁగ నేర్చు విబుధు లేకచిత్తంబున–నిఖిలమూర్తు లెల్ల నీవ యండ్రు. 89

1. తొలఁగించుటకు వీలులేని. 2. పృథివ్యాపస్తేజోవాయురాకాశములు.

వ. అదియునుం గాక. 90

సీ. ప్రకృతియొక్కటిపాదుఫలములుసుఖదుఃఖములు రెండు[1]గుణములు మూఁడువేళ్లు;
తగురసంబులు నాల్గు; [2]ధర్మార్థముఖరంబు లెఱిఁగెడివిధము లై [3]దింద్రియంబు;
[4]లాఱు స్వభావంబు: లాశోకమోహాదు; లూర్ములు ; [5]ధాతువు లొక్కయేడు;
పైపొర లెనిమిది ప్రంగలు; భూతంబులైదు బుద్ధియు మనోహంకృతులును;
తే. [6]రంధ్రములుదొమ్మిదియుఁగోటరములు-[†]ప్రాణ, పత్త్రదశకంబు; జీవేశపక్షియుగముఁ
గలుగు సంసారవృక్షంబుగలుగఁ జేయఁ-గావ, నడఁగింప, రాజవొక్కరుఁడ వీవ!

క. నీదెసఁ దమచిత్తము లిడి-యే దెసలకుఁ బోక, కడతు రెఱుక గలుగువా,
రా దూడయడుగుక్రియ నీ-పాదం బను నావకతన భవసాగరమున్. 92

ఆ. మంచివారికెల్ల మంగళప్రదలయ్యుఁ-గల్లరులకు మేలు గానియట్టి
తనువు, లెన్ని యైనఁ దాల్చి-లోకములకు, సేమమెల్లఁబ్రొద్దుఁ జేయు దీవు. 93

క. ఎఱిఁగినవారలమనుచును-గొఱమాలినయెఱుక లెఱిఁగి, కొందఱు నీపై
రెఱిఁగియుఁ, దలఁపగఁ నొల్లరు;-పఱతు రధోగతులజాడఁ బద్మదళాక్షా! 94

క. నీవారై, నీదెసఁ దమ-భావంబులు నిలిపి, ఘనులు భయవిరహితులై,
యేవిఘ్నంబులఁ జెందక-నీవఱలెడిమేటిచోట నెగడుదు రీశా! 95

క. నిను నాలుగాశ్రమంబుల-జనములు సేవింప నఖిలజగముల సత్త్వం
బును, శుద్ధంబును, శ్రేయం-బును నగు గాత్రంబు నీవు వొందుదువు హరీ! 96

సీ. నలినాక్ష! సత్త్వగుణంబు నీగాత్రంబుగాదేని, విజ్ఞానకలితమగుచు
నజ్ఞానభేదకం బగు టెట్లు? గుణములయందును వెలుఁగ, నీ వనుమతింపఁ
బడుదువు; సత్త్వరూపంబు సేవింపంగ సాక్షాత్కరింతువు సాక్షి వగుచు;
వాఙ్మనసముల కవ్వలిదైనమార్గంబు గలుగునీగుణజన్మకర్మరహిత
తే. మైన రూపును, బేరు, నత్యనఘబుద్ధు
లెఱుఁగుదురు; నిన్నుఁ గొల్వ నూహించుకొనుచు,
వినుచుఁ, దలఁచుచుఁ, బొగడుచు, వెలయువాఁడు
భవము నొందఁడు నీపాదభక్తుఁ డగును. 97

క. ధరణీభారము వాసెను-బురుషోత్తమ! యీశ! నీదుపుట్టువున; భవ
చ్చరణాంబుజములప్రాపున-ధరణియు, నాకసముఁ గాంచెదము నీకరుణన్. 98

ఉ. పుట్టువు లేనినీ కభవ! పుట్టుట క్రీడయ; కాక పుట్టుటే?
యెట్టనుడున్ భవాదిదశ లెల్లను జీవులయం దవిద్య దాఁ

---

1. సత్త్వరజస్తమములు. 2. ధర్మార్థకామమోక్షములు. 3. త్వక్చక్షుఃశ్రోత్ర జిహ్వాఘ్రాణములు.
4. శోకము, మోహము మొదలగునవి. 5. సప్తధాతువులు 6. నవరంధ్రములు † ప్రాణాపానాదులు.

బుట్టుచు నుండుఁ; గాని, నినుఁ బుట్టినదిం బలెఁ బొంతనుండియుం
బుట్టఁగ లేమిఁ, దత్క్రియలఁ జొక్కనియెక్కటివాఁడ వీశ్వరా! 99

మ. గురుపాఠీనమ వై, జలగ్రహమ వై, కోలంబ వై, శ్రీనృకే
సరి వై, భిక్షుఁడ వై, హయాననుఁడ వై, క్ష్మాదేవతాభర్త వై,
ధరణీనాథుఁడ వై, దయాగుణగణోదారుండ వై, లోకముల్
పరిరక్షించిన నీకు మ్రొక్కెద మిలాభారంబు వారింపవే! 100

క. ముచ్చిరి యున్నది లోకము-నిచ్చలుఁ గంసాదిఖలులు నిర్దయులేఁచన్
మచ్చిగఁ గావఁగవలయును-విచ్చేయుము తల్లికడుపు వెడలి, ముకుందా!'' 101

వ. అని మఱియు దేవకీదేవిం గనుంగొని. 102

మత్తకోకిలము. ''తల్లి! నీ యుదరంబులోనఁ బ్రధానపూరుషుఁ డున్నవాఁ;
డెల్లి పుట్టెడిఁ; గంసుచే భయ మింత లేదు; నిజంబు, మా
కెల్లవారికి భద్ర మయ్యెడు నింక; నీకడు పెప్పుడుం
జల్లగా వలె యాదవావళి సంతసంబునఁ బొంగఁగన్.'' 103

వ. అని యివ్విధంబున హరిం బొగడి, దేవకీదేవిని దీవించి, దేవత లీశానబ్రహ్మల
ము న్నిడుకొని చని; రంత. 104

### శ్రీకృష్ణావతారఘట్టము

క. పంకజముఖి నీ ళ్లాడను-సంకటపడ ఖలులమానసంబుల నెల్లన్
సంకటము దోఁచె; మెల్లన-సంకటములు లేమి దోఁచె సత్పురుషులకున్ . 15

సీ. స్వచ్ఛంబు లై పొంగె జలరాసు లేడును; గలఘోషణముల మేఘంబు లుఱిమె;
గ్రహతారకలతోడ గగనంబు రాజిల్లె; దిక్కులు మిక్కిలి తెలివిఁ దాల్చెఁ;
గమ్మనిచల్లనిగాలి మెల్లన వీచె; హోమానలంబు చె న్నొంది వెలిఁగెఁ;
గొలఁకులు కమలాళికులము లై సిరి నొప్పెఁ; బ్రవిమలతోయ లై పాఱె నదులు;
తే. వరపురగ్రామఘోషయై వసుధయొప్పె;విహగరవపుష్పఫలముల వెలసె వనము;
లలరుసోనలు గురిసి రయ్యమరవరులు, దేవదేవుని దేవకీదేవి గనఁగ. 106

క. పాడిరి గంధర్వోత్తము;-లాడిరి రంభాదికాంత; లానందమునం
గూడిరి సిద్ధులు; భయముల-వీడిరి చారణులు; మొరసె వేల్పులభేరుల్. 107

వ. అయ్యవసరంబున. 108

క. సుతుఁ గనె దేవకి, నడురే-యతిశుభగతిఁ దారలును, గ్రహంబులు, నుండన్
దితిసుతనిరాకరిష్ణున్-శ్రితవదనాలంకరిష్ణు, జిష్ణున్, విష్ణున్. 109

క. వెన్నుని నతిప్రసన్నునిఁ, గ్రన్ననఁగని [1]మెఱుఁగుఁబోఁడి గడు నొప్పారెం;
బున్నమనాఁడు కళానిధిఁ, గన్న [2]మహేంద్రాశ చెలువు గలిగి నరేంద్రా! 110

వ. అప్పుడు. 111

సీ. జలధరదేహు, నాజానుచతుర్బాహు, సరసీరుహాక్షు విశాలవక్షుఁ,
జారుగదాశంఖచక్రపద్మవిలాసుఁ, గంఠకౌస్తుభమణికాంతిభాసుఁ
గమనీయకటిసూత్రకంకణకేయూరు, శ్రీవత్సలాంఛనాంచితవిహారు,
నురుకుండలప్రభాయుతకుంతలలలాటు, వైదూర్యమణిగణవరకిరీటు,
తే. బాలుఁ బూర్ణేందురుచిజాలు, భక్తలోక-పాలు, సుగుణాలవాలుఁ, గృపావిశాలుఁ,
జూచి, తిలకించి, పులకించి, చోద్యమంది-యుబ్బి చెలరేఁగి వసుదేవుఁ డుత్సహించె.

క. స్నానము [3]సేయఁగ రామిని-నానందరసాబ్ధిమగ్నుఁ డై విప్రులకున్
ధేనువులం బదివేలను-మానసమున ధారవోసె, మఱి యిచ్చుటకున్. 113

వ. మఱియు వసుదేవుండు. 114

క. "ఈపురిటియింటి కుడ్య-ద్దీపంబును బోలెఁ జాల దీపించె; నిజం
బీపాపఁడు [4]నలుమొగముల-యాపాపనిఁ గనినమేటి యగు" నని భక్తిన్.

ఆ. చాఁగి మ్రొక్కి, లేచి, సరగున నొసలిపైఁ-గేలుఁదమ్మిదోయిఁ గీలుకొలిపి,
పాపఁ డనక, వెఱక, పాపని మొదలింటి-పోక లెల్లఁ దలఁచి, పొగడఁదొడఁగె.

క. ఏ నిన్ను నఖిలదర్శను-జ్ఞానానందస్వరూపు, సంతతు, నపరా
ధీనుని, మాయాదూరుని-సూనునిఁ గాఁ గంటి; నిట్టిచోద్యము గలదే? 117

క. అచ్చుగ నీమాయను, మును-చెచ్చెరఁ ద్రిగుణాత్మకముగఁ జేసిన జగముం
జొచ్చినక్రియఁ జొరకుండువు-చొచ్చుటయును లేదు; లేదు చొరకుండుటయున్.

సీ. అదియు నెట్లన-మహదాదులఁ బోలెడి దై, వేఱువేఱ యై, యన్నివిధము
లగుసూక్ష్మభూతంబు లమర, షోడశవికారములతోఁ గూడి, విరాట్టనంగఁ,
బరమాత్మునకు నీకుఁ బఱపైన మేను సంపాదించి, యందులోఁ బడియుఁ బడక,
యుండు సృష్టికి మున్న యున్నకారణమున, వానికిలోనిభవంబు గలుగ;
ఆ. దట్లు బుద్ధి నెఱుఁగ ననువైన లాగున-గలుగు నింద్రియముల [5]కడల నుండి,
వాని [6]పట్టు లేక వరుస జగంబులఁ-గలసి యుండితైనఁ గలయ; వెపుడు. 119

క. సర్వము నీలోనిది గా-సర్వాత్ముఁడ వాత్మవస్తుసంపన్నుఁడ వై;
సర్వమయుఁడ వగునీకును-సర్వేశ్వర! లేవు లోను, సంధులు వెలియున్. 120

1. మెఱుపువంటి శరీరముగలది. 2. తూర్పుదిక్కు యొక్క సొగసు. 3. చేయుటకు వీలు లేకుండుటవలన. 4. చతుర్ముఖబ్రహ్మను. 5. కడపట. 6. ఆధారము

ఆ. ఆత్మవలనఁ గలిగి, యమరు దేహాదుల-నాత్మకంటె వేఱు లవి, యటంచుఁ
దలఁచువాఁడు మూఢతముఁడు; గావున నీశ!-విశ్వమెల్ల నీవ! వేఱు లేదు. 121

వ. అదియునుం గాక. 122

సీ. గుణము వికారంబుఁ గోరికయును లేని నీవలన జగంబు నెఱి జనించుఁ;
బ్రబ్బు; లే దగు; నంచుఁ బలుకుట దప్పుగా; డీశుండ వై, బ్రహ్మమీవ వైన
నినుఁ, గొల్చుగుణములు నీయానతులు సేయ, భటులశౌర్యంబులు పతికి వచ్చు
పగిది, నీగుణములభాగులు నీ వని తోఁచును; నీమాయతోడఁ గూడి

ఆ. నీవు రక్తధవళనీలవర్ణంబుల-జగము సేయఁ, గావ, సమయఁ జూడ,
దనరు; దట్లు నేఁడు దైత్యుల దండింపఁ-బృథివిఁ గావ నవతరించి; తీశ! 123

శా. మింటన్ మ్రోసినమ్రోఁత, దాలిమిని లో మేంద్రింప, మున్ నీవు నా
యింటం బుట్టెద; వంచుఁ గంసుఁడు దొడిన్ హింసించె నీ యన్నలం;
గంటం గూరుకుఁ డేఁడు; నీయుదయ మా[1]కారాజనుల్ సెప్పఁగా,
బంటింపం; డెదు రేఁగుదెంచు వడి; నీపై నేఁడు సన్నద్ధుఁ డై." 124

దేవకీదేవి స్వామిని స్తుతించుట.

వ. అనుచుండ, దేవకీదేవి మహాపురుషలక్షణుండును, విచక్షణుండును, సుకుమారుండును, నైన కుమారునిం గని, కంసునివలని వెఱపున శుచిస్మిత యై, యి ట్లనియె.

సీ. "అట్టిట్టి దనరాని దై, మొదలై, నిండుకొన్న దై, వెలుఁగుచు, గుణము లేని
దై, యొక్కచందంబు దై, కలదై, నిర్విశేష మై, క్రియ లేక, చెప్ప రాని;
దేరూప?"మని [2]శ్రుతు లెప్పుడు నొడివెడి నారూప మగుచు, నధ్యాత్మదీప
మై, బ్రహ్మ రెండవయర్థంబుతుది, జగంబులు నశింపఁగఁ, బెద్దభూతగణము

ఆ. సూక్ష్మభూతమందుఁ జొరఁగ, నాభూతంబు
ప్రకృతిలోనఁ జొరఁగ, బ్రకృతి పోయి
వ్యక్తమందుఁ జొరఁగ, వ్యక్త మడంగను
శేషసంజ్ఞ నీవు సెలువ మగుదు. 126

ఉ. విశ్వము లీలఁ ద్రిప్పుచు, నవిద్యకుఁ జుట్టమ వై ననీకుఁ, దా
శాశ్వత మైనకాల; మిది సర్వము వేడబ మందు; రట్టి వి
శ్వేశ్వర! మేలుకుప్ప! నిను నెవ్వఁడు గోరి భజించు, వాఁడ పో
శాశ్వతలక్ష్మిమృత్యుజయసౌఖ్యయుతుం; డభయుండు; మాధవా! 127

మత్తకోకిలము. ఒంటినిల్చి పురాణయోగులు యోగమార్గనిరూఢు లై
"కంటి" మందురు; కాని, నిక్కమ కాన; రీభవదాకృతిం . . .

1. చెఱసాలకావలివారు. 2. వేదములు.

గంటి; భద్రముఁ గంటి; మాంసపుఁగన్నులం గనఁ బోల; దీ
తొంటిరూపుఁ దొలంగఁబెట్టుము; తోయజేక్షణ! మ్రొక్కెదన్. 128

ఆ. విలయకాలమందు విశ్వంబు, నీపెద్ద-కడుపులోన దాఁచు [1]కడిమిమేటి
నటుఁడ వీవు; నేఁడు నాగర్భజుఁడ వౌట-పరమపురుష! వేడబంబు గాదె? 129

తరలము. నలినలోచన! నీవు నిక్కము నాకుఁ బుట్టెద; వంచు నీ
ఖలుఁడు గంసుఁడు పెద్దకాలము [2]కారయింట నడంచె; దు
ర్మలినచిత్తుని నాజ్ఞ సేయుము; మమ్ముఁ గావుము భీతులన్;
నలుసు లేక ఫలించె నోఁచిననోము లెల్లను నీవ నై.” 130

దేవకీవసుదేవుల పూర్వజన్మముల వృత్తాంతము

వ. అని యిట్లు దేవకీదేవి విన్నవించిన, నీశ్వరుం డిట్లనియె “నవ్వా! నీవు దొల్లి స్వాయంభువమన్వంతరంబునఁ బృశ్ని యను పరమపతివ్రతవు; వసుదేవుండును సుతపుం డను ప్రజాపతి; మీ రిరువురును సృష్టికాలంబున, బ్రహ్మపంపునం బెంపున నింద్రియంబుల జయించి, తెంపున వానగాలియెండమంచులకు సైరించి, యేకలము లయి యాకలములు దిని, యేకలంకంబును లేక వేండ్రంబునఁ బండ్రెండు వేల దివ్యవర్షంబులు దపంబులు సేసిననెపంబున, మీరూపంబులు మెఱయ నోజ నాజపంబులు సేసి, డాసి, పేర్చి యర్చింప, మీకు నాకుం గలరూపుఁ జూపి, యేను “దిరంబు లగువరంబులు వేఁడుం” డనిన, మీరు నా మాయం బాయని మోహంబున, బిడ్డలు లేని [3]దొడ్డయడ్డంబున దుర్దమంబగు [4]నపవర్గంబు గోరక, నా యీడుకొడుకు నడిగిన, మెచ్చి, యట్ల వరం బిచ్చి, మీ కేను “బృశ్నిగర్భుం” డన నర్భకుండ నయితి; మఱియును. 131

క. అదితియుఁ గశ్యపుఁడును నన-విదితుల రగు మీకుఁ గుఱుచవేషంబున, నే
నుదయించితి, వామనుఁ డనఁ-ద్రిదశేంద్రానుజుఁడ నై [5]ద్వితీయభవమునన్. 132

క. ఇప్పుడు, [6]మూఁడవబామునఁ-దప్పక మీకిరువురకును దనయుఁడ నైతిం;
జెప్పితిఁ బూర్వము మీయం-దెప్పటికిని లేదు జన్మ మిటపై నాకున్. 133

క. నందనుఁ డనియుం, బరమా-నందం బగుబ్రహ్మ మనియు, ననుఁ దలఁచుచు,నా
పెందెరువు నొందెదరు; నా-యందలి ప్రేమమున భవము నందరు మీరల్.”

వ. అని యిట్లు పలికి, యీశ్వరుం డా రూపంబు విడిచి. 135

క. చెప్ప లిడక తలిదండ్రులు-దప్పక తనుఁ జూడ, మాయఁ దనరి, లలితుఁ డై
యప్పు డటు గన్నపాపని-యొప్పున, వేడుకలు సేసె నొకకొన్ని నృపా! 136

1. బలవంతులలో శ్రేష్ఠుఁడవు. 2. చెఱసాలయందు. 3. గొప్పలోపము. 4. మోక్షము. 5. రెండవజన్మము. 6. మూఁడవ జన్మము.

వ. అంత వసుదేవుండు దనకుం జేయవలసినపను, లీశ్వరుం డైన హరివలన నెఱింగినవాఁడు గావున. 137

క. "ఆపురిటియిల్లు వెలువడి-పాపనిఁ దరలించుకొనుచుఁ బఱచెద" ననుచున్
రూపింప, నందుభార్యకుఁ-బాప యగుచు యోగమాయ ప్రభవించె నృపా!

వ. అయ్యవసరంబున. 139

క. బిడ్డనిఁ గరముల, నొమ్మున-నడ్డంబుగఁ బట్టి, పదము లల్లన యిడుచున్,
జడ్డనఁ గావలివారల-యొడ్డు గడచి పురిటిసాల యొయ్యన వెడలెన్. 140

వ. అంత నట. 141

క. నందునిసతికి యశోదకుఁ-బొందుగ హరియోగమాయ పుట్టిన, మాయా
స్పందమున నొక్క యెఱుఁగమి-క్రందుకొనియె నూరివారిఁ, గావలివారిన్. 142

వ. అప్పుడు చప్పుడు గాకుండఁ, దప్పటడుగు లిడుచు, నినుపగొలుసుల మెలుసుల వీడినఁ దాలంబులు మహోత్తాలుం డయిన బిడ్డనికి నడ్డంబు గాక కీలూడి వీడి పడ, నరళంబులు విరళంబు లయిన సరళంబు లగు మొగసాలలం గడచి, [1]పాప తేఁడు వాకిండ్లు మరల మూయుచుఁ, బడగ లెడ గలుగ విప్పి, కప్పి, యేచి, కాచి, కొని, వెంట నంటి రాఁగఁ, దూఁగి నడచునెడ. 143

క. ఆశౌరికిఁ దెరు వొసఁగెఁ బ్ర-కాశోద్ధతతుంగభంగకలితధరాశా
కాశ, యగు యమున మును సీ-తేశునకుఁ బయోధి త్రోవ యిచ్చినభంగిన్.

వ. ఇట్లు యమున దాఁటి, చూఁటి చని నందునిమందం జేరి, యం దమందనిద్రం బొంది, యొడ లెఱుంగని గొల్లలం దెలుప నొల్లక, నిత్యప్రసాద యగుయశోద శయ్య, నొయ్యన చిన్నినల్లనయ్య నునిచి; చయ్యన నయ్యవ్వకూఁతు నెత్తు కొని మరల నింటికిఁ [2]బంటేఁపక వచ్చి; యచ్చిఱుతపాపను దేవకిప్రక్కం జక్క నిడి. 145

క. పదముల సంకెల లిడుకొని-మదిఁ దలఁకుచు, శూరసుతుఁడు మందుఁడుఁబోలెన్
బెదరు గలరీతి, దేహము-గదలించుచు, నొదిఁగి యుండె గఱువతనమునన్. 146

క. వనజాక్షునిఁ దెచ్చుటయును-దనసుతఁ గొనిపోవుటయును, దా నెఱుఁగక మూఁ
గిననిద్రఁ జొక్కి యుండెను-వనజాక్షి యశోద రేయి వసుధాధీశా! 147

సీ. అంత బాలిక "యావు," రని యేడ్చుచిఱుచప్పు డాలించి, వేకన [3]నాఁకయింటి
కావలివారు మేల్కని, చూచి, తలుపులతాళముల్ తొంటివిధమున నుండఁ
దెలిసి, చక్కన వచ్చి "దేవకి నీళ్లాడె; రమ్మ"ని యాభోజరాజుతోడఁ
జెప్పిన, నాతఁడు సిడిముడిపాటుతోఁ దల్పంబుపై లేచి, తత్తఱమున

---

1. ఆదిశేషుఁడు. 2. సందేహింపక. 3. చెఱసాల కావలి గాచువారు.

తే. వెండ్రుకలు వీడఁ, బైఁ జీర వ్రేలి యాడఁ-దాల్మి కీలూడ, రోషాగ్ని దర్పమాడ,
భూరివైరంబుతోఁ గూడఁ, బురిటియింటి-జాడఁ జను దెంచి, యా పాపఁ జంపఁ గదియ.

వ. అంత దేవకీదేవి యడ్డంబు వచ్చి, యిట్లనియె. 159

ఉ. "అన్న! క్షమింపుమన్న! తగ దల్లుఁడు గాఁ; డిది మేనగోడ లౌ;
మన్నన సేయుమన్న! నిను; మానినిఁ జంపుట [1]రాచపాడిగా
దన్న! సుకీర్తివై మనఁగదన్న! మహాత్ములు వోవుత్రోవఁ బో
వన్న! భవత్సహోదరిఁ గదన్న! నినుం శరణంబు వేఁడెదన్. 150

క. కట్టా! యార్గురుగొడుకులఁ-బట్టి వధించితివి; యాఁడుఁబడుచు; యిది గోడల్;
నెట్టన చంపఁగ వలెనే?-కట్టిఁడిది గదన్న! యన్న! కరుణింపఁ గదే! 151

క. పుత్త్రుఁడు నీ బ్రతుకునకును, శత్త్రుం-డని వింటి; గాన సమయింపఁ దగుం;
బుత్త్రులకు నోఁచనైతిని-బుత్త్రీదానంబు సేసి, పుణ్యముఁ గనవే!" 152

వ. అని పయ్యెదఁ జక్క సవరించుకొనుచుఁ, బలవరించుచు, భ్రాంతిపడి కూఁతుఁ గ్రక్కున నక్కునం జక్క హత్తించుకొని, చెక్కుచెక్కున మోపి, చయ్యన నుత్తరీయాంచలంబున సంచలతం గప్పి, చప్పుడు గాఁ గుయ్యిడ, నయ్యెడం గ్రయ్యంబడి, వాఁడు పోఁడిమి సెడఁ, దోఁబుట్టువుం దిట్టి, [2]చిట్టిపట్టి నావురని వాపోవఁ, గావరంబున నడుగులొడిసి తిగిచి, వడిం బెడిసిపడం బుడమిపయిం బడవైచిన, నబ్బాలయు నేలం బడక, యవలీల నెగసి, నవ్యదివ్యమాలికాగంధబంధురమణిహారాంబరాద్యలంకారమనోహారిణియు, గదాచంఖచక్రపద్మశరచాపాసిశూలధారిణియు నై, యెనిమిదికరంబులఁ గరం బొప్పుచు, సిద్ధచారణకిన్నరగరుడగంధర్వాదివైమానికనికాయంబు, గానికలిచ్చి, పొగడ, నెగడుచు, నచ్చరల యాటపాటలకు మెచ్చుచు, మింటనుండి కంటఁబడి, కంటువడఁ గంసున కిట్లనియె. 153

ఉ. "తెంపరివై పొరిం బొరిని, దేవకిబిడ్డలఁ, జిన్నికుఱ్ఱలం
జంపితి; వంతనైన నుపశాంతి వహింపక ఱాలమీఁద నొ
ప్పింపఁగ, నిస్సిరో! యిదియు బీరమె? నా సరసన్ జనించి నిన్
జంపెడి వీరుఁ డొక్కెడ సత్కృతి నొందెడువాఁడు; దుర్మతీ!" 154

వ. అని పలికి. 155

క. మహనీయగుణాస్పద యై, మహిలో నాదేవి జనము మన్నింపఁగా,
బహునామనివాసంబుల, బహునామములం జరించె [3]భద్రాత్మిక యై. 156

1. రాజధర్మము. 2. చిన్నపిల్ల. 3. మంగళస్వరూపురాలు.

వ. అంత నాఁబోటి వలికిన కలికిపలుకులు ములుకులై, చెవులఁ జిలికిన, నులికిపడి, ఝళుకు గదిరిన మనంబున, ఘనంబుగ వెఱఁగంది, కంది, కుందెడు దేవకీవసుదేవుల రావించి, యాదరంబున సంభావించి, చేరి, వారితో ని ట్లనియె. 157

ఉ. "పాపుఁడ; బాలఘాతుకుఁడ; బంధువిరక్తుఁడ; దుష్టచిత్తుఁడం;
గోపనుఁడం; జరన్మృతుఁడ; క్రూరుఁడ; బ్రాహ్మణహంతభంగి మీ
పాపలఁ జంపితిం; బయలిపల్కుల నమ్మితి; సాధులార! నా
పాపము లుగ్గడింపక, కృపాపరులై కనరే! శమింపరే! 158

ఉ. ఒక్కెడఁ బ్రాణు లందరు నిజోచితకర్మము లోలిఁ ద్రిప్పఁగా,
నొక్కొకమేనితోఁ బొడమి, యొక్కొకత్రోవను రాకపోకలం
జిక్కులఁ బొందుచుందురు; చెల్మిని [1]సంసృతితోడఁ బాయ; రే
నెక్కడిహంత? మీశిశువులెక్కడి హన్యులు? దూఱ నేటికిన్? 159

క. పగతురఁ జెఱిచితి ననియును-జగతురచేఁ జెడితి ననియు, బాలుఁడు దలఁచుం;
బగ చెలుములు లే వాత్మకుఁ-బగచెలుములకీలు కర్మబంధము సుండీ! 160

వ. అని పలికి, కన్నీరు నించి, వగచి, వెఱచుచు దేవకీవసుదేవుల పాదంబులఁ బట్టుకొని, సంకెలలు విప్పించి, మిక్కిలి యక్కఱగల వాక్యంబుల నైక్యంబులు నెఱపిన, వారును బరితప్తుం డైన కంసునిం జూచి, రోషంబును బాసి; రంత నా వసుదేవుండు బావ కి ట్లనియె. 161

శా. "బావా! నీ వచనంబు నిక్కము సుమీ; ప్రాణుల్ గతజ్ఞానులై,
"నీవే" నంచును, లోభమోహమదభీనిర్మిత్రతామోదశో
కావేశంబుల నొండొరుం బొడుతు; రేకాకారుఁడై, సర్వరూ
పావిష్టుం డగు నీశ్వరుం దెలియ లే; రన్యోన్యవిభ్రాంతులై." 162

వ. అని యిట్లు ప్రసన్నులైన దేవకీవసుదేవులయనుజ్ఞ వడసి, కంసుం డింటికిం జని, యా రేయి గడపి, మఱునాడు ప్రొద్దున [2]గ్రద్దనం దనకుఁ బరతంత్రు లగుమంత్రుల రావించి, యోగనిద్రవలనం దా వినినవృత్తాంతం బంతయు [3]మంతనంబున నెఱింగించిన, నపుడు వార లతని కిట్లనిరి. 163

క. "ఇట్టయినఁ దడయ నేటికిఁ?-బట్టణముల, మందలందుఁ, బల్లెల, నెల్లం
బుట్టెడి పెరిగెడి శిశువులఁ-బట్టి వధించెదము; మమ్ముఁ బంపు మధీశా! 164

మ. భవదీయోజ్జ్వలబాహుచాపవిలసద్బాణావళీభగ్నులై,
దివిజాధీశ్వరు లేక్రియం జనిరొ? యే దేశంబులన్ డాఁగిరో?

---

1. సంసారము. 2. వెంటనే. 3. రహస్యము.

శివునిం జొచ్చిరో? బ్రహ్మఁ జెందిరో? హరిన్ సేవించిరో? మానివృ
త్తి వనాంతంబుల నిల్చిరో? మనకు శోధింపం దగున్ వల్లభా! 165

క. నొచ్చిరి శాత్రవు లనుచును-విచ్చలవిడిఁ దిరుగ వలదు; వివిధాకృతులన్
ముచ్చిలి వత్తురు; వారలు-సచ్చినయందాఁక మఱవఁ జన దధిపునకున్. 166

క. ఒత్తికొనుచు రాఁజన-దెత్తినరోగముల, రిపుల, నింద్రియముల, ను
త్పత్తిసమయములఁ జెఱుపక, మెత్తన గారాదు; రాదు మీఁద జయింపన్.

మ. అమరశ్రేణికినెల్ల జక్రి ముఖరుం; డాచక్రియే ధర్మమం
దమరున్, గోవులు, భూమిదేవులు, దితిక్షామ్నాయకారుణ్యస
త్యములున్, యాగతపోధమంబులును, శ్రద్ధాశాంతులున్, విష్ణుదే
హము; లిన్నింటిని సంహరించిన నతం డంతంబునుం బొందెడిన్. 168

వ. కావున. 169

ఉ. చంపుదుమే నిలింపులను? జంకెల అంకెలఁ దాపసావలిం
బంపుదుమే కృతాంతకునిపాలికిఁ? గ్రేపులతోడ గోవులం
ద్రుంపుదుమే? ధరామరులఁ దోలుదుమే? [1]నిగమంబులన్ విదా
రింపుదుమే? వసుంధర హరింపుదుమే? జననాథ! పంపుమా." 170

వ. అని పలుకు మంత్రులమంత్రంబుల నిమంత్రితుం డై, బ్రాహ్మణనిరోధంబు నిషిద్ధంబని తలంపక, కాలపాశబద్ధుం డై, విప్రాదిసాధుమానవులఁ జంప దానవులం బంపి, యంతిపురంబునకు జనియె; ననంతరంబ యా రక్కసులు, వెక్కసంబులగు [1]మొక్కలంబుల సజ్జనులపజ్జలం బడి, తర్జనగర్జనభర్జనాదిదౌర్జన్యంబులఁ జేసి, నిర్జించి పాపంబు లార్జించిరి. 171

ఆ. వెదకి వెదకి, దైత్యవీరులు సాధుల-నడఁప, వారిబలము లడఁగి పోయె;
యశము, సిరియు, ధర్మ, మాయువు, భద్రంబు-నార్యహింస సేయ నడఁగుఁగాదె?

వ. అంత మందలో నందుండు నందనుండు పుట్టుట యెఱింగి, మహానందంబున నెఱవాదులగు వేదవిదులం బిలిపించి, ఝలకంబులాడి, శుచియై, శృంగారించుకొని, స్వస్తిపుణ్యాహవాచనంబులు సదివించి, జాతకర్మంబులు సేయించి, పితృదేవతల నర్చించి, క్రేపులతోడం గూడఁ గై సేసినపాఁడిమొదవుల రెండులక్షలను, గనకకలశ మణివసనవిశాలంబులైన [3]తిలశైలంబు లేడింటిని భూదేవతల కిచ్చిన. 173

క. "ఈయాభీరకుమారుఁడు-శ్రీయుతుఁ డై, వీరవైరిజేతయునై, దీ
ర్ఘాయుష్మంతుం డగు"నని-పాయక దీవించి రపుడు బ్రాహ్మణజనముల్. 174

1. వేదములు. 2. పరాక్రమము. 3. నూవులపర్వతములు.

క. దుందుభులు మొరసె; గాయక-సందోహము వాడె; సూతసముదాయముతో
వందిజనులు గీర్తించిరి;-క్రందుగ వీతెంచె భద్రకాహళరవముల్. 175

క. పల్లవతోరణసురుచిర-వల్లీధ్వజరాజిధూపవాసనములతో,
సల్లలితము లై యొప్పెను-[1]వల్లవవల్లభులయిండ్ల వాకిండ్లెల్లన్. 176

క. పసుపులు నూనెలు నలదినఁ-బసఁ దనరి, సువర్ణబర్హిబర్హప్రభతోఁ
బసిమి గలిగి, వెలుఁగొందుచుఁ-బసులన్నియు మందలందుఁ బ్రసరించె, నృపా!

క. క్రేళ్లుతికి నుసలె లేఁగలు;-మల్లడిగొని అంకె లిడియె మదవృషభంబుల్;
పెల్లుగ మొదవులపొదుఁగుల-జల్లించెం బాలు, బాలుసంభవవేళన్. 178

క. ఆరఁగఁ జదివెడి, పొగడెడి-వారికి, విద్యలను బ్రదుకువారికి, లేమిం,
జేరినవారికి నెల్లను-గోరకమును నందుఁ డిచ్చె గోధనచయముల్. 179

వ. ఆసమయంబున. 180

క. కంచుకములుఁ,[2] దలచుట్లును-గాంచనభూషాంబరములుఁ, గడు మెఱయఁగ నే
తెంచిరి, గోపకు లందఱు-మంచిపదార్థములు గొనుచు మాధవుఁ జూడన్. 181

క. ఏతెంచి, చూచి చెలఁగుచు-నేతులఁ, బెరుఁగులను, బాల, నీళ్లను, వెన్నం,
బ్రీతి వసంతము లాడిరి-[3]యేతరు లై, సరసభాష లెసఁగఁ గొల్లల్. 182

వ. తదనంతరంబు. 183

ఆ. "ఏమినోముఫలమొ? యింతప్రొద్దొకవార్త-వింటె మబలలార! వీను లలర;
మనయశోద, చిన్నమగవానిఁ గనెనఁట-చూచి వత్త మమ్మ! సుదతులార!"184

వ. అని యొండొరులు లేపికొని, గోపిక లోపికలు లేని చిత్తంబుల నెత్తినతత్తఱంబు
లొత్తుకొన, నుదారంబు లగు శృంగారంబులతో నిండ్లు వెలువడి. 185

క. జడగతులును, బలుపిఱుఁదులుఁ-బిడికెడునడుములును, వలుఁదబిగిచనుఁగవలున్,
[4]వెడఁదనయనములు, సిరిదడఁ-బడుమోములు, భ్రమరచికురభరములు, నమరన్.

ఉ. వేడుకతోడఁ గ్రొమ్ముడులు వీడఁ, గుచోపరిహారరేఖ ల
ల్లాడఁ, గపోలపాలికల హాటకపత్త్రరుచుల్ వినోదనం
బాడఁ, బటాంచలంబు లసియాడఁగఁ, జేరి, యశోదయింటికిం
జేడియ లేఁగి, చూచి రొగి జిష్ణుని విష్ణునిఁ జిన్నికృష్ణునిన్. 187

వ. చూచి సంతసించి, తెచ్చినకానిక లిచ్చి. 188

తే. పాపనికి నూనెఁ దల యంటి, పసుపుఁ బూసి,
[5]బోరుకాడించి, "హరిరక్ష పో" మ్మటంచు

1. గొల్లలు 2. తలపాగాలు. 3. ఉత్సాహవంతులు. 4. విశాలములయిన కన్నులు.
5. స్నానము చేయించి.

జలము లొకకొన్ని చుట్టి రాఁ జల్లి, తొట్ల
నునిచి, దీవించి, పాడి రయ్యువిద లెల్ల. 189

క. “జోజో! కమలదళేక్షణ! - జోజో! మృగరాజమధ్య! జోజో! కృష్ణా!
జోజో! పల్లవకరపద! - జోజో! పూర్ణేందువదన! జోజో!” యనుచున్. 190

వ. ఇవ్విధంబున. 191

క. పలు[1]తోయంబుల జగముల-బలు[2]తోయములందు ముంచి, భాసిల్లెడి యా
పలుఁతోయగాఁడు, వల్లవ-లలనాకరతోయములఁ జెలంగుచుఁ దడియన్. 192

క. లోకములు నిదుర వోవఁగ-జోకొట్టుచు, నిదురవోని సుభగుఁడు, రమణుల్
జోకొట్టి పాడ, నిదురం-గైకొను క్రియ సూరకుండెఁ గను దెఱవక యున్. 193

సీ. ఏ బాము లెఱుఁగక యేపారు మేటికిఁ బసులకాపరి యింట బాము గలిగె;
నే కర్మములు లేక యెనయు నెక్కటికిని, జాతకర్మంబులు సంభవించె;
నే తల్లి చనుఁబాలు నెఱుఁగని ప్రోడ, యశోదచన్నులపాలచొరవ నెఱిఁగె;
నే హానివృద్ధులు నెఱుఁగని బ్రహ్మంబు, పొడఁగిటిలో వృద్ధిఁ బొందఁ జొచ్చె;
ఆ. నే తపములనైన నెలమిఁ బండనిపంట-వల్లవీజనముల వాడఁ బండె;
నే చదువులనైన నిట్టట్టి దనరాని-యర్థ మవయవముల నంద మొందె. 194

మ. [3]చెయువుల్ సేయుతఱిన్ విధాతకరణిం జెన్నొందు; సంతోషదృ
ష్టియుతుండై నగుచున్ జనార్దనునిమాడ్కిం బొల్చు; రోషించి యు
న్నయెడన్ రుద్రునిభంగి నొప్పును; సుఖానందంబునం బొంది త
న్మయుఁడై బ్రహ్మముభాతి బాలుఁ డమరున్ బాహుళ్యబాల్యంబునన్. 195

వ. అయ్యవసరంబున. 196

ఆ. కొడుకుఁ గన్నవేడ్కఁ-గొనసాగ రోహిణిఁ-[4]జీరఁ బంచి, చిత్రచేలములను
[5]మండనముల నిచ్చి, మన్నించె, నందుఁ డా-యంబుజాక్షి ప్రీత యై చరింప. 197

వ. అది మొదలు మొదవులకడుపులు బొదువులు గలిగి యుండె; నంత నందుండు గోపకుల ననేకుల గోకులరక్షకు దక్షు లైనవారిని నియమించి, మధురకుం జని, కంసునికి నేఁటేఁటం బెట్టెడి[6]యరిం బెట్టి, వీడ్కొని, వసుదేవునికడకుం జని, యథోచితంబుగ దర్శించిన. 198

క. నందునిఁ గనుఁగొని ప్రాణము-పొందినబొందియును బోలెఁ బొలుపారుచు, నా
నందాశ్రులు గడకన్నులఁ-గ్రందుకొనం, గేలు సాఁచి కౌఁగిటఁ జేర్చెన్. 199

1. అనేకవిధములు, ఆకారములు. 2. జలములు. 3. పనులు. 4. పిలిపించి. 5. ఆభరణము. 6. కప్పము.

వ. మఱియుఁ గౌఁగిలించుకొని, సుఖాసీనునిఁ జేసి, వసుదేవుండు దనకొడుకులవలని మోహంబు దీపింప నందున కి ట్లనియె. 200

క. "సంతతి లే" దని, మును ఘన-చింతనముల మునిఁగి, ముదిసి చిక్కినపిమ్మటన్
సంతతి గలిగెను; భాగ్యము!-సంతతిహీనునికి సౌఖ్యసంతతి గలదే? 201

క. పొడగంటి నిన్నుఁ; బ్రదికితిఁ;-గడచితి నాపదల; నింకఁ గార్యంబుల నే
యెడమడుగు లేనినెచ్చెలిఁ-బొడగాంచుట, చచ్చి మరలఁ బుట్టుట గాదే? 202

క. పలుపాటులఁ బడు జనులకు-నిల నొకచో నుండఁ గలదె? యేఱుల వెంటం
గలిగి, చను మ్రాఁకు లన్నియుఁ-[1]బలువెంటలఁ బోవుఁ గాక; పాయక యున్నే? 203

మ. పలురోగంబుల నొంద కున్న వె పసుల్? పాలిచ్చునే ధేనువుల్?
గొలఁకుల్ వాఁగులు వారిపూరితము లే? గోష్ఠప్రదేశంబులం
బులులున్ దుష్టులు సంచరింపవు గదా? పొ ల్పారునే ఘోషముల్?
కలవే పచ్చనిపూరిజొంపములు, తత్కాంతారభాగంబులన్? 204

క. తనపుత్త్రమిత్త్రముఖరులఁ-దనుపక, చూడకయు, వారు దఱిఁగి నశింపన్
మనుచు గృహమేధియాశ్రమ-మున నుండెడివాని, కొక్కమోదముఁ గలదే?

క. నీకాంతయొద్ద నీవును-నీకాంతయు గారవింప, నినుఁ దండ్రిఁ గ, నా
లోకించుచు నీమందను-నాకొడుకున్నాఁడె? నందనందాన్వితుఁడై?" 206

వ. అనిన నందుం డిట్లనియె. 207

శా. "నీకున్ దేవకికిన్ జనించినసుతానీకంబుఁ, దోడ్తోడ ము
న్నీకంసుండు వధించె; మీసుతఁ దుది న్హింసింపఁ, జేదప్పి, తా
నాకాశంబున కేఁగె; బాల యది; దైవాధీన; మాపద్దశన్
శోకంబందునె [2]తజ్జ్ఞుఁ? డూఱడుము నానూనుండు *నీనూనుఁడే!" 208

వ. అనిన వసుదేవుండు నందునికి మఱియు నిట్లనియె. 209

క. "జనపతి కరి యిడితివి; మముఁ-గనుఁగొంటివి; మేము నిన్నుఁ గంటిమి; మేల
య్యెను; బొమ్మింకను; గోకుల-మున నుత్పాతములుదోఁచె; మునుకొనవలయున్."

కంసునిపంపునఁ బూతన యను రాక్షసి వ్రేపల్లెకుఁ జనుదెంచుట.

వ. అని పలికి వసుదేవుండు నందాదులయిన వల్లవుల వీడ్కొలిపిన, వారలు గొబ్బున వడి గల గిబ్బలంబూనినశకటంబులు ప్రకటంబులుగ నెక్కి, తమతమ

1. అనేకమార్గములుగా. 2. తెలిసినవాఁడు, బుద్ధిమంతుఁడు.
* నీ నూనుఁడే యని వాడుటలో అర్థద్వయము స్ఫురించుచున్నది.

పల్లెలత్రోవలు వట్టి, చని; రా నందమందు ప్రతీతంబు లైనయుత్పాతంబులు ముందటం బొడగని, శౌరి దనతోం బలికిన పలుకులు దప్పు; వచునుం, దలంచుచుం జనియె; నంత. 211

సీ. కంసుపంపున బాలఘాతిని పూతన, పల్లెల, మందలం, బట్టణముల
నిల నెల్లచో, బాలహింసం గావించుచుం జనుచు, నెవ్వని పేరు శ్రవణవీథిం
బడినయంతన సర్వభయనివారణ మగు, నట్టి దైత్యాంతకుం డవతరించి
యున్న నందునిపల్లె కొకనాఁడు ఖేచరి యై వచ్చి, యందు మాయాప్రయుక్తిం
తే. గామరూపిణి యై చొచ్చి, కానకుండ-నరిగి, యిల్లిల్లుం దప్పక యరసికొనుచు,
నందగృహమున బాలునినాదమొకటి-విని ప్రమోదించి సుందరీవేష యగుచు.

మత్తకోకిలము. క్రాలుకన్నులు, గుబ్బచన్నులుం, గందు వొందనిచందురుం
బోలు మోమును, గల్గు లే దనుబుద్ధిం దూఱని[1]కొను, నే
రాళ మైన పిఱుందుం, బల్లవరాగపాదకరంబులుం
జాల దొడ్డగుకొప్పు, నొప్పంగ సర్వమోహనమూర్తితోన్. 213

మానిని. కాంచనకుండల కాంతులు, గండయుగంబునం గ్రేళ్లుఱుకన్, జడపై
మించిన మల్లెలమేలిమితావులు మెచ్చి, మదాళులు మింటను రా,
నంచితకంకణహారరుచుల్ సెలువారంగం, బైవలు వంచల మిం
చించుక జాఱంగ, నిందునిభానన యేఁగెం గుమారునియింటికి నై. 214

వ. ఆసమయంబున. 215

మ. 'సిరి మమ్ముం బ్రదుకంగం జూచుకొఱకై, శృంగారవేషంబుతో
నరుదే నోపు' నటంచు గోపికలు జిహ్వల్ రాక మోహించి త
త్పర లై చూడ, లతాంగి వోయి కనియెం, బర్యంకమధ్యంబునం
బరు, భస్మానలతేజు, దుర్జనవధప్రారంభకుం డింభకున్. 216

వ. కని కదియ వచ్చుసమయంబున. 217

శా. ఆలోకేశ్వరుం, డాచరాచరవిభుం, డాబాలగోపాలుం, డా
బాలధ్వంసిని గొంటు గం టిడి, వెసన్ బాలెంతచందంబునం
బాలిండ్లన్ విస మూని, వచ్చుట, మదిన్ భావించి, లో నవ్వుచున్
గాలుం గేలు నెఱుంగ కున్న కరణిం గన్మోడ్చి, గుర్పెట్టంగన్. 218

క. ఆపాపజాతి సుందరి-యాపాపనిపాన్పుం జేర నరిగి, కరములన్
లేపి, చనుంగవ శిశువున్-మోపుచు ముద్దాడి, శిరము మూర్కొని పలికెన్.

1. నడుము.

క. "చను నీకుఁ గుడుపఁ జాలెడి-చనువారలు లేరు; నీవు చన వలెః ననుచుం
జను గుడిపి, మీఁద నిలుకడఁ, జనుదాన, ననంగ వేడ్కఁ, జనుఁ జను గుడుపన్.

క. నా చనుఁబా లొక గ్రుక్కెఁడు-నోచిన్నికుమార! త్రావు మొయ్యన; పిదపన్
నీ¹చెలువ మెఱుఁగ వచ్చును?-నా చెలువము సఫల మగును నళినదళాక్షా!"

వ. అని బాలు నుద్దేశించి, ముద్దాడెడిభంగి మాట లాడెడిచేడియం జూచి. 222

మ. "వనితా! ముట్టకు మమ్ము; చన్నుఁ గుడుపన్ వల్దమ్మ; నీచన్ను మా
తనయుం డొల్లఁడు; వాసి పొ"మ్మని యశోదారోహిణుల్ సీరఁ, గై
కొన, కీక్షించుచు మాయఁ బన్ని, వెలుచం ²గోశంబులో వాలు వె
ల్వున రాజిల్లుచు, మాటమెత్తఁదనముల్ లోవాఁడియు, న్నేర్పడన్. 223

వ. కదిసి, కలికిపలుకులు పలుకుచు, నులుకు సెడి జళుకు సొరక, యెదుర నిదుర గదిరిన ఫణిని, ఫణి యని యెఱుంగక, గుణమతిం దిగుచు జడమతిబెడంగునఁ, గఱటి జలధి తెఱవ వెరవునం జనుదెంచి, పఱపునడుమ నొఱపు గలిగి, మెఱయుచుఁ, గన్ను దెఱవక, వెఱపు మఱపు నెఱుంగక, కొమరు మిగులు చిఱుతకొమరునిం దిగిచి, తొడలనడుమ నిడుకొని, యొడలు నివురుచు, నెడనెడ మమతం గడలుకొలుపుచు, "నాఁకొన్న చిన్నియన్న! చన్నుఁ గుడువు"మని చన్నిచ్చు సమయంబున. 224

సీ. మేల్కొన్న తెఱఁగున మెల్లన కను విచ్చి, క్రేఁగంటఁ జూచుచుఁ గిదికి నీల్గి,
యావులించుచుఁ జేతు లాదరంబునఁ జూచి, యొదిగిలియాఁకొన్న యోజ నూఁది,
బిగిచన్నుఁ గవఁ గేలఁ బీడించి, కబళించి, గ్రుక్క గ్రుక్కకు 'గుటుగుటుకు' మనుచు,
నొక రెండు గ్రుక్కల నువిదప్రాణంబులు సైతము, మేనిలో సత్త్వ మెల్లఁ
తే. ద్రావె; నదియును గుండెలు దల్లడిల్లఁ-జిమ్ముఁ దిరుగుచు నిలువక, శిరము వ్రాల
"నితర బాలురక్రియ వాఁడ వీవు గావు;-చన్ను విడువుము; విడువుము; చాలు" ననుచు.

క. నిబ్బరపు దప్పి మంటలు – ప్రబ్బిన, ధృతి లేక, నేత్రపదహస్తంబుల్
గొబ్బున వివృతములుగ, నా-గుబ్బగుచున్నట్టికూఁతఁ గూలెన్ నేలన్. 226

మ. అదరెం గొండలతోడ భూమి; గ్రహతారానీకముల్ మింటిపై
బెదరెన్; దిక్కులమాఱుమ్రోఁత లెసఁగెన్; భీతిల్లి లోకంబులుం
గదలం బాఱెను; వజ్రభిన్నగిరిరేఖం బూర్వదేహంబుతోఁ
ద్రిదశధ్వంసిని గూలి, కుయ్యిడినఁ దద్దీర్ఘోరుఘోషంబునన్. 227

క. అప్పుడు దెప్పరమగునా, చప్పుడు హృదయములఁ జొచ్చి, సందడి వెట్టన్,
ముప్పిరిగొని, పడిరెఱుకలు, దప్పి, ధరన్ గొల్లలెల్ల, దల్లడపడుచున్. 228

1. సౌందర్యము, అందము. 2. ఒఱలోనుండు ఖడ్గమువలె.

క. ఆజఙఖిరండ రక్కసి-నైజశరీరంబు నేల నలియంబడినన్
యోజనమున్నరమేర ధ-రాజంబులు నుగ్గులయ్యె; రాజవరేణ్యా! 229

సీ. దారుణలాంగలదండదంతంబులు, నగగహ్వరముఁ బోలు నాసికయును,
గండశైలాకృతి గలకుచయుగమును, విరిసి తూలెడి పల్లవెండ్రుకలును,
జీఁకటినూతులఁ బెనయునేత్రంబులుఁ, [1]బెనుదిబ్బఁ బోలెడి పెద్దపిఱుఁదుఁ,
జాఁగుకట్టలఁ బోలుచరణోరుహస్తంబు, లింకినమడుపుతో నెనయుకడుపుఁ,
తే. కలిగి [2]షట్క్రోశదీర్ఘమై, కదిసి, చూడ, భయద మగుదానిఘనకళేబరముఁ జూచి,
గోపగోపీజనంబులు గుంపు గూడి, బెగడుచుండిరి మనముల బెదరు గదిరి. 230

వ. ఇవ్విధంబున. 231

క. ఆతఱిఁ గుఱువఁగ నడచెన్-నూతనఫుల్లాబ్జలోచనుఁడు, హరి, మత్యు
ద్యోతనఁ, గృతమునిసముదయ-యాతనఁ, బూతనఁ నెఱింగి యాతనలీలన్. 232

క. [3]విషధరరిపుగమనునికిని-[4]విషగళసఖునికిని, విమలవిషశయనునికిన్,
[5]విషభవభవజనకునికిని-విషకుచ చనువిషముఁ గొనుట,విషమే తలఁపన్ ? 233

వ. అంత నా గోపగోపీజనంబులు తెలిసి, రోహిణీయశోదలం గూడుకొని, బెగ్గడిలక డగ్గఱి. 234

శా. నేలం గూలినదాని పెన్నురముపై నిర్భీతిఁ గ్రీడింప, "నో
బాలా! ర"మ్మని, మూఁపుఁ జేర్చుకొని, సంస్పర్శించి, యారార్చుచున్
గోలాంగూలముఁ ద్రిప్పి, గోవురజమున్ గోమూత్రముం జల్లి, త
ద్బాలాంగంబుల గోమయం బలఁది రా పండ్రెండునామంబులన్. 235

వ. మఱియు నంతటం దనియక, గోపిక లాచమనంబు సేసి, దక్షు లయి మునుపుగాఁ, దమకు రక్షాకరం బగు బీజన్యాసంబు సేసి, "చిన్నియన్న! నీయడుఁగు లజుండును, జానువు లనిలుండును, దొడలు యజ్ఞుండును, గటితలం బచ్యుతుండును, గడుపు హయాస్యుండును, హృదయంబు గేశవుండును, నుర మీశుండును, గంఠం బినుండును, భుజంబులు చతుర్భుజుండును, ముఖంబు త్రివిక్రముండును, శిరం బీశ్వరుండును రక్షింతురు; ముందు చక్రియు, వెనుక గదాధరుం డైన హరియుఁ, బార్శ్వంబుల ధనుర్ధరుం డైనమధువైరియు, నసిధరుం డగు నజనుండును, గోణంబుల శంఖచక్రగదాధరుం డైన యురుగాయుండును, మీఁదు నుపేంద్రుండును, గ్రిందు తార్క్ష్యుండును, నంతటను హలధరుం డగు పురుషుండును, గాతురు; నీ యింద్రియంబుల హృషీకేశుండును, బ్రాణంబుల నారాయణుం

---

1. గొప్పకొండ. 2. ఆఱుపర్వులదూరము; క్రోశమనఁగ రెండు మైళ్లని యందురు. 3. గరుడవాహనుఁడు. 4. ఈశ్వరుఁడు. 5. బ్రహ్మదేవునకుఁ దండ్రియగువాఁడు.

డును, జిత్తంబును శ్వేతద్వీపపతియును, మనంబును యోగీశ్వరుండైన కపిలుండును, బుద్ధిని పృశ్నిగర్భుండును, నహంకారంబును భగవంతుండైన పరుండును, బాలనంబు సేయుదురు; నీవు క్రీడించునెడ గోవిందుండును, శయనించుతఱి మాధవుండును, నడచువేళ వైకుంఠుండును, గూర్చున్నసమయంబున శ్రీపతియును, గుడుచుకాలంబున సర్వభక్షకుండైన యజ్ఞభుజుండును, నేమఱకుండుదురు; నిన్నుఁ జేర్కొనిన దుస్స్వప్నవృద్ధబాలగ్రహంబులు, గూశ్మాండ డాకినీయాతుధానులును, భూత ప్రేత యక్ష రాక్షస పిశాచ వినాయకులును, గోటరా రేవతులును, జ్యేష్ఠాపూతనలును, మాతృకాదిగణంబులు నశియింతురు; నీయందుఁ బ్రాణేంద్రియశరీరనిరోధంబు లయిన యున్మాదంబులును, నపస్మారంబులును, మహోత్పాతంబులును, బొందకుండును గావుత!'' మని రక్ష సేసి దీవించి; రంత. 236

క. ఆపెద్దవేడబంబుల-పాపనికిని జన్ను గుడిపి, పానుపుపై సం
స్థాపించి, కప్పి, ''[1]కూరుకు-మోపాపఁడ!''యని యశోద యొయ్యన పాడెన్.

వ. అంత నందుండు మొదలయిన గోపకులు మథురనుండి వచ్చి, రక్కసిమేను గని, వెఱఁగుపడి, మున్ను వసుదేవుం డుత్పాతంబు లెఱింగి చెప్పె, నతండు మహాయోగి, యని పొగడి, కఠోరంబగు పూతనయొడలు కుఠారంబుల నఱికి తమ కుటీరంబులకుం దవ్వగు ప్రదేశంబునఁ బటీరంబుల దహనంబు సంగ్రహించి, దహించి రంత. 238

ఆ. పొగిలి పొగిలి, కాలు మగువదేహంబున-నగురు పరిమళములపొగలు వెడలె;
దేహకల్మషములు శ్రీహరిముఖమునఁ-ద్రావఁబడుటఁ జేసి, భూవరేణ్య! 239

క. హరి దనమీఁదం బదములుఁ-గరములు నిడి, చన్ను గుడిచి, కదిసినమాత్రన్
హరిజననిపగిదిఁ బరగతి, కరిగెను-దురితములఁ [2]బాసి యసురాంగనయున్. 240

క. వెన్నుని కొకమఱి విషమగు-చన్నిచ్చినబాలహంత్రి చనెనఁట దివికిన్?
వెన్నునిఁ గని, పెంచుచుఁ దన-చన్నిచ్చినసతికి మఱియు జన్మము గలదే?

క. హరిఁ గని, చన్నులు గుడిపెడి-తరుణులు ప్రాప్తించుపదము దలఁపఁగ వశమే?
హరి యారగించుటకుఁ జాల్గురిసినధేనువులు ముక్తికొనలఁ జరించున్. 242

క. ఆపూతనమెయిగంధము-గోపాలు రెఱింగి, ''యిట్టి[2]కువనితయొడలం
[3]దీపాటిస్వాదుగంధము-ప్రాపించునె?'' యనుచుఁ జనిరి పల్లెల కధిపా. 243

వ. అంత నందుండు పరమానందంబున నింటికిం జని, [4]ప్రేతలచేత, రక్కసిచేఁత లన్నియు నెఱింగి, వెఱంగుపడి, పాపని లేపి, శిరంబు మూర్కొని, ముద్దాడి, ముదంబున నుండెనని చెప్పిన విని, పరీక్షిన్నరేంద్రుం డిట్లనియె. 244

1. నిద్రింపుము. 2 దుష్టురాలయిన స్త్రీ. 3. ఇంతటిమనోహరమయిన సువాసన. 4. గొల్లలు.

క. "ప్రమేయవతారంబుల-నేమేకర్మమును సేసె నీశుఁడు హరి; భ
ద్రాయతనము లన్నియు వినఁ-బాయదు చిత్తంబు; సెవులపండువు లయ్యెన్.

క. ఉరుసంసారపయోనిధి - [1]తరణంబులుఁ, బాపపుంజతరణంబులు, శ్రీ
కరణంబులు, ముక్తిసమా-చరణంబులు, బాలకృష్ణుసంస్మరణంబుల్." 246

వ. అని "తరువాత బాలకృష్ణుం డేమి సేసె? నాయందుఁ గృప గల దేనిం జెప్పవే?" యని యడిగిన, రాజునకు శుకుం డిట్లనియె. 247

బాలకృష్ణుండు శకటముం దనపాదమునఁ గూలఁ దన్నుట

సీ. 'బాలకుం డొ్దిఁగిలఁ బడ నేర్చె'నని జన్మనక్షత్రమం దొకనాఁడు, నందు
పొలఁతి వేడుక బోర్కుఁ బోయ ప్రేతలఁ జీరి, వాదిత్రగీతారవంబు సెలఁగ,
విప్రులతోఁ గూడ వేదమంత్రంబుల నభిషేచనాదిక మాచరించి,
వారిదీవన లొంది, వారికి మొదవుల నన్నంబుఁ, జీరల, నడిగినట్టు
ఆ. లిచ్చి, బాలుఁ [2]దియ్య మెసఁగఁ బానుపు సేర్చి-నిదురపుచ్చి, గోపనివహమునకు
గోపికలకుఁ బూజఁ గొమరారఁ జేయుచు-జనని గొడుకు మఱచి, సంభ్రమమున.

వ. ఆసమయంబున. 249

క. నిదురించినశిశు వాఁకొని-కిదుకుచుఁ, జను గోరి, కెరలి, కిసలయవిలస
న్మృదుచక్రచాపరేఖా-స్పదపదమునఁ దన్నె, నొక్కబండిన్, దండిన్. 250

క. శకటము హరి దన్నిన, దివిఁ-బ్రకటంబై యెగసి, యిరుసు భరమునఁ గండ్లున్
వికటంబుగ నేలంబడె- నకటా! యని, గోపబృంద మాశ్చర్యపడన్. 251

వ. అప్పు డందున్న సరసపదార్థంబులు వ్యర్థంబులై, నేలం గూలుడం జూచి, యశోదానందముఖ్యులైనగోపగోపికాజనంబులు, పనులు మఱచి, పబ్బంబులు మాని, యుబ్బు సెడి, వెఱపులు ఘనంబులుగ మనంబులందు. 252

క. "మిన్నున కూరక యెగయదు-తన్న సమర్థుండు గాఁడు; [3]తల్పగతుం డీ
చిన్నికుమారుఁడు; దేరే-విన్నువున నెగసె? దీనివిధ మెట్టిదియో?" 253

వ. అని వితర్కించుసమయంబున. 254

క. "బాలకుఁ డాఁకొని యేడ్చుచుఁ-గా లెత్తినఁ, దాఁకి, యెగసెఁ; గాని శకట మే
మూలమున నెగయ;" దని య-బ్బాలునికడ నాడుచుండి, పలికిరి శిశువుల్.

వ. ఇట్లు శిశువులు వలికినపలుకులు విని. 256

శా. "బాలుం డెక్కడ? బండి యెక్కడ? నభోభాగంబుపైఁ జేప్పడం
గాలం దన్నుట యెక్క? డేల పడుచుల్ గల్లాడి? రీజడ్డుఁబ

1. దాటించునవి. 2. ప్రియముతో. 3. పడకయందున్నవాఁడు.

ల్కే లోకంబున నైనఁ జెప్పఁబడునే? యేచందమో కాక?'' యం
చాలాపించుచు వ్రేలు, వ్రేతలుఁ, బ్రభూతాశ్చర్యులై రందఱున్. 257

వ. అప్పుడా బాలునిరోదనంబు విని, యశోద పఱతెంచి. 258

ఆ. ''అలసితివిగదన్న! యాఁకొంటివిగదన్న!-మంచియన్న! యేడ్పు మానుమన్న!
చన్నుగుడువుమన్న! సంతసపడుమన్న!''-యనుచుఁ, జన్నుగుడిపె నర్భకునకు.

వ. అంత 'నబ్బాలునిమేన బాలగ్రహంబు సోఁకునుగదా' యని శంకించి, గోపకు లనేకు లనేకబలివిధానంబులు సేసిరి; బ్రాహ్మణులు దధికుశాక్షతంబుల హోమంబు లాచరించిరి; ఋగ్యజుస్సామమంత్రంబుల నభిషేచనంబులు సేయించి, స్వస్తిపుణ్యాహవాచనంబులు సదివించి, కొడుకున కభ్యుదయార్థంబు నందుం డలంకరించిన పాఁడిమొదవుల విద్వజ్జనంబుల కిచ్చి, వారల యాశీర్వాదంబులు గైకొని, ప్రమోదించె; నని చెప్పి శుకుం డిట్లనియె. 260

క. ''కొడుకు నొకనాఁడు దొడపై-నిడుకొని, ముద్దాడి, తల్లి యెలమి నివురుచోఁ,
గడుదొడ్డకొండశిఖరము-వడువున, [1]వ్రేఁ గయ్యె నతఁడు; వసుధాధీశా! 261

తృణావర్తుఁ డను రాక్షసుఁడు సుడిగాలి యై కృష్ణు నెత్తికొని పోవుట

క. బరువైనకొడుకు మోవను, వెరవేఁడి. యిలమీఁదఁ బెట్టి, వెఱచి, జనని దా
''ధరఁ గావఁ బుట్టినమహా-పురుషుఁడు గాఁ బోలు!''ననుచు బుద్ధిఁ దలంచెన్.

వ. అప్పుడు. 263

క. ఖరుఁ డగు కంసునిపంపున-నరిగి, తృణావర్తుఁ డవని కవచాటముగా
[2]సురకరువలి యై, బిసబిస-నరు! దరు! దన ముసరి, విసరి, హరిఁ గొనిపోయెన్.

క. సుడి యెఱుఁగని హరి సుడివడ-సుడిగాలి తెఱంగురక్కసుఁడు విసరెడి యా
సుడిగాలి ధూళి, గన్నుల-[3]సుడిసిన, గోపకులు బెగడి, సుడివడి రధిపా! 265

వ. మఱియు నవ్వాలయపవనదనుజుండు, విలయపవనుని తెఱంగునం గసిమసంగి, ముసరి, మసరు [3]గవిసి విసరెడిసురకరువలిం బొడమినపుడమిరజంబు, వడి నెగసి, గగనమున మెఱసి, తరణికిరణములకు మఱుఁగునడిన, నిబిడ మగు బెడిదంపుఁ దిమిరమున దశ దిశ లెఱుంగఁబడక, గోకులం బాకులత నొంద, నొండొరుల నెఱుంగక, బెండుపడుచున్న జనంబులమనంబుల ఘనం బగుభయంబు, రయంబునం జెంద, నదభ్రపరిభ్రమణశబ్దంబున దిగంతంబులు నెవ్వుడుపడి, పరిభ్రాంతంబులుగ నొక్క ముహూర్తమాత్రంబున భువనభయంకరత్వంబు దోఁచె; నా సమయంబున. 266

ఉ. పాపనిఁ జూడఁ గానక, విపద్దశ నొంది, కలంగి, తల్లి ''యో
పాపఁడ! బాలసూర్యనిభ! బాలశిరోమణి! నేఁడు గాలికిం

---

1. భారము, బరువు. 2. సుడిగాలి. 3. ఆక్రమించి.

జేపడి పోయితే?" యనుచుఁ జీరుచుఁ, దైవముఁ జాల దూఱుచుం,
దాపము నొంది, సెన్నగల దయ్యుచుఁ, గ్రుయ్యుచు, [1]బిట్టు గూయుచున్. 267

క. సుడిగాలి వచ్చి నిన్నుం-సుడిగొని కొనిపోవ, మింట సుడిసుడి గొనుచున్,
జెడఁ గడ రెడి నాముద్దుల-కొడుకా! యేమంటి? వనుచు, ఘోరం బనుచున్. 268

ఉ. ఇక్కడఁ బెట్టితిం; దనయుఁ డిక్కడ నాడుచు నుండె; గాలి దా
నెక్కడనుండి వచ్చె? శిశు వెక్కడిమార్గము వట్టి పోయె? నే
నెక్కడఁ జొత్తు?" నంచుఁ గమలేక్షణ గ్రేపుఁ దొలంగి ఖిన్న యై
పొక్కుచు వ్రాలు గోవుక్రియ, భూస్థలి వ్రాలె దురంతచింతయై. 269

క. పాపనికై యిటు వాఁగిలెడి-యాపాపనితల్లిఁ జూచి, [2]యారటపడుచున్
గోపాలసతులు బాష్పజ-లాపూరితనయన లైరి యార్తిం బడుచున్. 270

శా. ఆలోఁ జక్రసమీరదైత్యుఁడు మహాహంకారుఁ డై, మింటికిన్
బాలుం దాఁ గొనిపోయి, పోయి, తుదిఁ దద్భారంబు మోవన్ బల
శ్రీ లేమిం, బరిశాంతవేగుఁ డగుచుం, జేష్టింపఁగా లేక, "ము
న్నీలా గర్భకుఁ జూడ" నంచు "నిటమీఁ దె?" ట్లంచుఁ జింతించుచున్. 271

వ. అట్లు దనుజుండు చింతించుచున్నసమయంబున. 172

క. బాల[3]ద్విరదకరంబులఁ-బోలెడికరములను, దనుజు బొండుగ బిగియం
గీలింప, వ్రేలఁ బడియెను-బాలకుఁ డొకకొండభంగి బరు వై యధిపా! 273

క. మెడబిగియఁ బట్టుకొని, డిగఁ-బడియెడిబాలకుని చేతఁ, బర్వతనిభుచే,
విడివడఁ జాలక, వాఁ డురిఁ-బడి వెగడెడు ఖగముభంగి, భయముం బొందెన్. 274

క. హరికరతలపీడనమునఁ-బరవశుఁ డై, ఱాలమీఁద భగ్నాంగకుఁ డై,
సురవైరిభటుఁడు గూలెను-[4]బురభంజనుకోలఁ గూలు పురముం బోలెన్. 275

వ. అంత గోపకాంత లంతయుఁ గని, రోదనంబులు మాని, సమ్మోదంబున విక్క-విరిసి, రక్కసునియురంబున మురువు గలిగి, బరువు లేక వ్రేలుబాలుం గొనివచ్చి, ముచ్చిరుచున్న తల్లి కిచ్చి; రప్పుడు గోపగోపికాజనంబు లందఱుఁ దమలోని ట్లనిరి. 276

క. "రక్షణము లేక సాధుఁడు-రక్షితుఁ డగు సమతఁ జేసి రాయిడులందున్;
రక్షణములు వెయి గలిగిన-శిక్షితుఁ డగు ఖలుఁడు, పాపచిత్తుం డగుటన్. 277

సు. గతజన్మంబుల నేమి నోఁచితిమొ! యాగశ్రేణు లే మేమి సే
సితిమో? యెవ్వరి కేమి వెట్టితిమొ? యేచింతారతిం బ్రొద్దు వు

1. అధికముగా రోదనము చేయుచు. 2. ఆరటము, ఆరాటము, సంతాపము. 3. ఏనుఁగుపిల్ల. 4. ఈశ్వరుఁడు.

చ్చితిమో? సత్యము లేమి వల్కితిమొ? యేసిద్ధప్రదేశంబుఁ ద్రొ
క్కితిమో? యిప్పుడు సూడఁ గంటి, మిచటం గృష్ణార్భకుణ్ణ నిర్భయున్."

వ. అని పలికి; రంత నందుండు మున్ను దనకు వసుదేవుండు సెప్పినమాటలకు
వెఱఁగుపడుచుండె; మఱియును. 279

సీ. జననాథ! యొకనాఁడు చన్ను సేఁపినఁ, దల్లి చిన్నిముద్దులకృష్ణుఁ జేరఁ దిగిచి,
యెత్తి పెందొడలపై నిడికొని, ముద్దాడి, చన్నిచ్చి. నెమ్మోము సక్క నివిరి,
యల్లనినగవుతో నావులించిన బాలువదనగహ్వరమున వారినిధులు,
దిశలు, భూమియు, వనద్వీపశైలంబులు, నేఱులు, గాలియు, నినుఁడు, శశియు,

ఆ. దహనుఁ, డాకసంబుఁ, దారలు, గ్రహములు-నఖిలలోకములుఁ, జరాచరంబు
లైనభూతగణము, లన్నియు నుండుటఁ-జూచి, కన్ను మోడ్చి, చోద్యపడియె.

వ. అంత నొక్కనాఁడు వసుదేవుపంపున యాదవపురోహితుం డైన గర్గుండు మం
దకుం జనుదెంచిన, నందుం డతనిం గనుంగొని, లేచి, నిలిచి, కృతాంజలి యై.

క. కోరి భజించెను నందుఁడు-సారగుణాచారమార్గు, సత్సంసర్గు,
న్నారాధితభర్గుణ్ణ, మతి - దూరితషడ్వర్గుఁ, కుజనదుర్గుణ్ణ, గర్గున్. 282

వ. మఱియుఁ దగినసత్కారంబులు సేసి, యి ట్లనియె. 283

క. "ఊరక రారు మహాత్ములు;-వా రధములయిండ్లకడకు వచ్చుట లెల్లం
గారణము మంగళములకు-నీరాక శుభంబు మాకు; నిజము; మహాత్మా! 284

శా. జ్యోతిశ్శాస్త్రుల కెల్ల మేటరివి; తేజోమూర్తి; వాశాంతవి
ఖ్యాతస్ఫూర్తివి; బ్రహ్మబోధనుఁడ; వాకర్ణింపు నాపల్కు; ని
ర్ణీతుం డైనగురుండు మానవులకు న్విప్రోత్తముం డండ్రు; నీ
చాతుర్యంబున నీకుమారులకు సంస్కారంబు గావింపవే." 285

వ. అని రామకృష్ణులం జూపి, గర్గుండు "మున్ను కంసునిచేత వ్రేటువడి, దివి కెగసి
పోయిన తెఱవ సెప్పిన తెఱంగు దేటపఱిచి, దేవకీదేవికొడు కని, కృష్ణునిఁ
గంసుండు దలంచుం; గావున రహస్యంబున సంస్కారంబు చేయుట కార్యం"
బని నందానుమతంబున రోహిణీకుమారు నుద్దేశించి. 286

క. 'జనులు ²రమియింపఁ దిరిగెడి-యనువుకలిమి రాముఁ' డనియు 'యదుసంకర్షం
బున సంకర్షణుఁ' డనియును-'ఘనబలమున బలుఁడు' వనియు గణుతించె నృపా!

వ. మఱియుం గృష్ణు నుద్దేశించి "తొల్లి యీశిశువు ధవళారుణపీతవర్ణుం డై,
యిప్పుడు నల్లనై నకతంబునఁ గృష్ణుం డయ్యె; వసుదేవునకు నొక్కెడ జన్మిం

1. దుష్టులకు సమీపింపసాధ్యముగానివాఁడు. 2. సంతోషింపఁగా.

చిన కారణంబున వాసుదేవుం డయ్యె; నీపాపనికి గుణరూపకర్మంబు లనేకంబులు గలుగుటంజేసి, నామంబు లనేకంబులు గలవు; నీ[1]బాలకునివలన మీరు దుఃఖంబులఁ దరియింతురు; నీయర్భకునిచేత దుర్జనశిక్షణంబును సజ్జనరక్షణంబును నగు; నీకుమారుండు నారాయణసమానుం;'డని చెప్పి, తనగృహమ్మున కమ్మునీశ్వరుండు సనియె; నందుండును బరమానందంబున నుండె; నంత. 288

## శ్రీకృష్ణబలరాముల బాలక్రీడాభివర్ణనము

సీ. జానుభాగముల హస్తమ్ములు వీడ్వడ, నిడుచు దిగ్గనఁ బోదు రింత నంత;
నవ్వులపయ్యెద లంది, జవ్వాడుదు; రాలక్రేపులతోఁక లలమి పట్టి
విడువ నేరక వానివెనువెంట జరగుదు; [2]రప్పంకముల దుడు కడరఁజొత్తు;
రెత్తి చన్నిచ్చుచో, నిరుదెసఁ బాలిండ్లు చేతులఁ బుడుకుచుఁ, జేఁపు గలుగ

తే. దూఁటుదురు; గ్రుక్కగ్రుక్కకుఁ దోర మగుచు
నాడుదురు; ముద్దుపలుకు లవ్యక్తములుగఁ
గరము లంఘ్రులు నల్లార్చి, కదలుపుదురు;
రామకృష్ణులు శైశవరతులఁ దగిలి. 289

క. తడ వాడిరి బలకృష్ణులు-దడ వాడిరి వారిఁ జూచి తగ రంభాదుల్;
దడనాడి రరులు భయమునఁ-[3]దడ వాడిరి మంతనములఁ దపసులు వేడ్కన్.

సీ. తలలెత్తి మెల్లన తడవి యాడెడువేళఁ, బన్నగాధీశులపగిదిఁ దాల్తు;
రంగసమ్మృష్టపంకాంగరాగంబుల, నేనుఁగుగున్నలయెత్తు వత్తు;
రసమంబు లైన జవాతిరేకమ్ముల, సింగపుఁగొదమలసిరి వహింతు;
రాననంబులఁ గాంతు లంత కంతకు నెక్క బాలార్కచంద్రులపగిదిఁ దోఁతు;

తే. రెలమిఁ దల్లులచన్నుఁబా లెల్లఁ ద్రావి,-పరమయోగోద్భవామృతపానలీల
బోలి, యెఱుఁగనియోగులసొంపు గందు,-రాకుమారులు జనమనోహరులగుచు.

క. చూడనివారల నెప్పుడుఁ-జూడక, లోకములు మూఁడు చూపులఁ, దిరుగం
జూడఁగ నేర్చిన బాలక,-చూడామణి, జనుల నెఱిఁగి చూడఁగ నేర్చెన్. 292

క. నగవుల నవిద్యపోఁడిమి,-నగుబాటుగఁ జేయ, నేర్చు[4]నగవరి యంతన్,
నగుమొగముతోడ మెల్లన,-నగుమొగములసతులఁ జూచి, నగ నేర్చె నృపా!

క. అవ్వల నెఱుఁగక, [5]మువ్వురి-కవ్వల వెలుఁగొందు పరముఁ, డర్భకుఁడై, యా
యవ్వలకు సంతసంబుగ,-నవ్వా! యవ్వా! యనంగ నల్లన నేర్చెన్. 294

1. బాలుఁడు. 2. బురదగల భాగము. 3. పరిహాసము. 4. నవ్వుగలవాఁడు.
5. త్రిమూర్తులు - బ్రహ్మ, విష్ణు, శివులు.

క. అడుగులు వే గలిగియు, రెం-డడుగులనే మన్ను, మిన్ను, నలిమిన బాలుం,
డడుగిడఁదొడఁగెను శాత్రవు-లడుగులు, నడుగులును, వదలి, యడఁగవనిఁబడన్.

వ. మఱియును. 296

సీ. తనువున నంటినధరణీపరాగంబు, పూసిన నెఱిభూతిపూఁత గాఁగ;
ముందట వెలుఁగొందు ముక్తాలలామంబు, తొగలసంగడికానితునుక గాఁగ;
ఫాలభాగంబుపైఁ బరఁగు కావిరిబొట్టు, కాముని గెల్చినకన్ను గాఁగఁ;
గంఠమాలికలోనిఘననీలరత్నంబు, కమనీయ మగుమెడకప్పు గాఁగ,

ఆ. హారవల్లు, లురగహారవల్లులు గాఁగ,-బాలలీలఁ బ్రౌఢబాలకుండు
శివునపగిది నొప్పె, శివునికిఁ దనకును,-వేఱు లేమిఁ దెల్ప వెలయునట్లు. 297

క. ఆపాపలవిహరణములు,-దీపులు పుట్టింప, మరగి తేఁకువ లే కా
గోపాలసతులు, మక్కువ-నేపనులును మఱచి యుండి, రీక్షణపరలై. 298

వ. ఆసమయంబున బాలకులతల్లులు గోరుగోఱుగొమ్ములు గల జంతువులవలన నేమఱక, జలదహనకంటకాదులయెడ మోసపోక, బాలసంరక్షణంబు సేయుచు, నుల్లంబుల నుల్లంబు లైనప్రేమంబు, లభిరామంబులుగా విహరించుచుండి; రంత. 299

క. తనయీడుగోపబాలురు,-దనుఁ గొలువఁగ, రాముఁ గూడి, తనువు గలుగుచుం
దనుగమనంబులఁ గృష్ణుఁడు,-తనుమధ్యలు మెచ్చ, నీల తనురుచి మెఱసెన్. 300

వ. మఱియు నాకుమారుండు దినదినంబునకు సంచారసంభాషణదక్షుండై. 301

చ. చప్పుడు సేయకుండు మని జంకె యొనర్చిన, నల్గి పోవఁగా
నప్పుడు బార సాఁచి, "తనయర్థిలివిందులు వచ్చె"; రంచు న
వ్వొప్పఁగఁ జీరు తల్లిదెస కొత్తిలి కృష్ణుఁడు రంతు సేయుచు
న్నెప్పటి వచ్చి, చన్గుడుచు, నింపొలయఁగ మొలగంట మ్రోయఁగన్. 302

క. వల్లవగృహనవనీతము,-లెల్లను భక్షించి, వచ్చి, యెఱుఁగనిభంగిం
దల్లి గదిసి, చిట్టాడుచు-నల్లన చను; "బువ్వఁ బెట్టు మవ్వా!" యనుచున్. 303

వ. మఱియు గోపకుమారులం గూడికొని; కృష్ణుండు. 304

సీ. "గోవల్లభుఁడ నేను; గోవులు మీరు" రని వడి ఱంకె వైచుచు వంగి యాడు;
"రాజ నే;భటులు మీరలు; రండు రం"డని ప్రాభవంబునఁ బెక్కుపనులు పనుచు;
"నేఁ దస్కరుండ; మీరింటివా" రని నిద్ర పుచ్చి, సొమ్ములు గొనిపోయి డాఁగు;
"నే[1]సూత్రధారి; మీ రిందఱు బహురూపు"లని చెలంగుచు నాటలాడఁ బెట్టు;

1. నాటకము నాడించువాఁడు.

తే. మాలలుఱుకును; డాఁగిలిమూఁతలాడు ;
నుయ్యేలలనూఁగుఁ; జేబంతులొనరవైచు ;
జారచోరులజాడలఁ జాల నిగుడు,
శౌరి బాలురతో నాడుసమయమందు. 305

వ. మఱియు నా కుమారశేఖరుండు గపటశైశవంబున, దొంగజాడలం గ్రీడింప,
గోపిక లోపికలు లేక యశోకడకు వచ్చి, యి ట్లనిరి. 306

గోపికలు శ్రీకృష్ణుని దుడుకుఁజేఁతల యశోదాదేవితోఁ జెప్పుట

క. "బాలురకుఁ బాలు లే, వని,-బాలెంతలు మొఱలు వెట్టఁ, బకపక నగి, యీ
బాలుం [1]డాలము సేయుచు,-నాలకుఁ గ్రేపులను విడిచె నంభోజాక్షీ! 307

క. పడఁతీ! నీబిడ్డఁడు మా-కడవలలో నున్నమంచికాఁగినపా లా
పడుచులకుఁ బోసి, చిక్కిన-కడవలఁ బోనడిచె; నాజ్ఞ గలదో లేదో? 308

క. మీపాపఁడు మాగృహముల,-నాపోవఁగఁ బాలు ద్రావ, నగపడకున్నం
గోపించి, పిన్నపడుచుల,-వాపోవఁగఁ జిమ్ముకొనుచు, వచ్చెం; దల్లీ! 309

మత్తకోకిలము. పుట్టి పుట్టఁడు; నేఁడు దొంగిలఁ బోయి, మాయిలు సొచ్చి, తా
నుట్టి యందక, ఱోళ్లఁ బీఁటలు నొక్క [2]ప్రోవిడి, యెక్కి, చే
వెట్టఁజాలక, కుండ క్రిం దొకపెద్దతూఁ టొనరించి, మీ
పట్టి మీఁగడ పాలుఁ జేరలఁ బట్టి, త్రావెఁ; దలోదరీ! 310

క. ఆడం జని, వీరలపెరుఁ,-[3]గోడక, నీసుతుఁడు ద్రావి, యొకయించుక తాఁ
గోడలిమూఁతిం జరిమినఁ-గోడలు మ్రుచ్చనుచు, నత్త గొట్టె; లతాంగీ! 311

క. వారిల్లు సొచ్చి, కడవలఁ-దోరం బగునెయ్యి ద్రావి, తుది నాకడవల్
వీరింట నీసుతుం డిడ-వారికి వీరికిని దొడ్డవా దయ్యె సతీ! 312

క. "వేలుపులకె నాకంబెను?-వేలుపు మఱి యెవ్వఁ?" డనుచు, వికవిక నగి, మా
వేలుపులగోడపై నో,-హేలావతి! నీతనూజుఁ డెంగిలిఁ జేసెన్. 313

క. వెన్నఁ దినఁగఁ బొడగని, మా-పిన్నది యడ్డంబు వచ్చి, పిఱిఁదికిఁ దివియం,
జన్నొడిసి పట్టి, చీరెను-జిన్నికుమారుండె యితఁడు? శీతాంశుముఖీ! 314

క. ఇమ్మగువ దన్ను వాకిటఁ-గ్రుమ్మరుచోఁ, జీరి, నిలిపికొని, పే రడుగం
గెమ్మోవిఁ గఱచి, వడిఁ జనె-నమ్మా! యీముద్దుఁగుఱ్ఱఁ డల్పుఁడె చెపుమా?

క. "చేబంతి దప్పి పడె" నని-ప్రాబల్యముతోడ వచ్చి, భవనము వెనుకన్
మాబిడ్డ జలక మాడఁగ-నీబిడ్డఁడు వలువ దెచ్చె; నెలఁతుక తగునే? 316

1. ఎగతాళి. 2. రాశిగానుంచి. 3. జంకక.

క. ఇచ్చెలువఁ జూచి, ముచ్చిలి-యచ్చుగ నుతికించుకొనుచు "నరిగెద; నాతో
వచ్చెదవా?" యని యన్నాఁ-డిచ్చిఱుతఁడు; సుదతి! చిత్ర మిట్టిది గలదే?

క. కొడుకులు లేరని, యొకసతి-గడు వగవఁగఁ, "దన్ను మగనిఁ గాఁ గైకొనినం
గొడుకులు గలిగెద;" రని పైఁ-బడినాఁ; డిది వినుము; శిశువుపను లే? తల్లీ!

క. "తలఁగినదానం దల;" మనఁ-దలఁగక యాచెలికి నాన తల యెత్తఁగ, "నీ
తలఁగినచో నెయ్యది?" యని-తల యూచెఁ నీసుతుండు; దగవె? మృగాక్షీ!

క. వ్రాలఁగ వచ్చిన, నీసతి-"[1]చూలాలం దలఁగు;" మనుడుఁ "జూ లగుటకు నే
మూలంబు? సెప్పు"మనె నీ-బాలుఁడు; సెప్పుదురె సతులు? పర్వేందుముఖీ!

క. మగువా! నీకొమరుఁడు మా-మగవా రటు వోవఁ జూచి, మంతనమునకుం
దగఁ జీరి, పొంద నడిగెను;-జగముల ము న్నిట్టిశిశువు సదువంబడెనే? 321

ఆ. నమ్మి నిదురవోవ, నాపట్టిమంచు మా-లేఁగతోఁకతోడ లీలఁ గట్టి,
వీథులందుఁ దోలె వెలఁది నీకొమరుండు;-రాచబిడ్డఁ డైన ఱవ్వ మేలె? 322

క. నాపట్టిపొట్ట నిండఁగఁ-బైపడి, నీపట్టి వెన్న బానెం డిడినాఁ;
డూపిరి వెడలదు; వానిం-జూపెద; నే మైన నీవ చుమ్ము! లతాంగీ! 323

క. [2]తెఱవ యొకతె నిద్రింపఁగ-నెఱిఁ గట్టినవలువ వీడ్చి, నే టగు తేలుం
గఱపించి, నీకుమారుఁడు-వెఱచుచు నది పఱవ, నగియె; విహితమె? సాధ్వీ!

క. నాకొడుకును, నాకోడలు-నేకతమునఁ బెనఁగఁ, బాము నీతఁడు వైవం,
గోక లెఱుంగక పాఱినఁ-గూఁక లిడెఁ నీసుతుండు; గుణమె? గుణాఢ్యా!

ఆ. తరుణి యొకతె పెరుఁగు ద్రచ్చుచోఁ దుదివంగి-వెన్న దీయ, నొదిఁగి వెనుకఁ గదిసి,
మగువ నీసుతుండు మగపోఁడుములు సేయ-సాగినాఁడు; తగదె చక్కఁజేయ?

సీ. కలకంఠి [3]మావాడగరితల మెల్ల, నీపట్టి రాఁ గలఁ, డని, పాలు పెరుఁగు
లిండ్లలోపల నిడి యే మెల్లఁ దనత్రోవఁ జూచుచో, నెప్పుడు సొచ్చినాఁడొ?
తలుపులముద్రలుఁ దాళంబులును బెట్టి యున్నచందంబున నున్న వరయ;
నొకయింటిలోనాడు; నొకయింటిలోఁ బాడు; నొకయింటిలో నవ్వు; నొకటఁ దిట్టు;
ఆ. నొకట వెక్కిరించు; నొక్కొకచో మృగ-పక్షిఘోషణములు పరఁగఁ జేయు;
నిట్లు సేసి, వెనుక నెక్కడఁ బోవునో?-కానరాడు; రిత్తకడవ లుండు. 327

క. [4]కడు లచ్చి గలిగె నేనిం-గుడుతురు; గట్టుదురు గాక! కొడుకుల నగుచుం
బడుగులవాడల పైఁ బడ-విడుతురె రాకాంత లెందు? విమలేందుముఖీ! 328

క. ఓయమ్మ! నీకుమారుఁడు-మాయిండ్లను బాలుఁ బెరుఁగు మననీఁడమ్మా!
పోయెద మెక్కడి కైనను-మాయన్నల [5]సురభులాన! మంజులవాణీ!" 329

1. గర్భవతి. 2. ఆఁడుది. 3. మావీథి యాఁడువారము. 4. అధికసంపద. 5. ఆవులసాక్షిగా.

వ. అని మఱియు ననేకవిధంబుల బాలకృష్ణుండు సేయు వినోదంబులు దమయందుఁ
జేయు మహాప్రసాదంబు లని యెఱుంగక, దూఱుచున్నగోపికలకు యశోద
యి ట్లనియె. 330

క. "చన్ను విడిచి, చనఁ డిట్టటు:-నెన్నఁడుఁ బొరుగిండ్లత్రోవ నెఱుఁగఁడు; నేఁడుం
గన్నులు దెఱవని మాయీ-చిన్నికుమారకుని [1]అవ్వ సేయందగునే! 331

తే. అన్య మెఱుఁగఁడు; తనయంతనాడుచుండు;-మంచివాఁ డీతఁ; డెగ్గులుమానరమ్మ!
రామలార! త్రిలోకాభిరామలార!-తల్లులార! గుణవతీమతల్లులార!" 332

వ. అని యశోద వారల నొడంబఱిచి పంపి, కొడుకుం గోపింపజాలకయుండె; నిట్లు.

మృద్భక్షణవిశ్వరూపప్రదర్శనాద్యభివర్ణనము

ఉ. కాంతలు దల్లితోఁ దనవికారము లెల్ల గణింప, భీతుఁ డై
శాంతునిసొంపునం, బరమసాధునిపెంపున, [2]గోలమాడ్కి, వి
భ్రాంతునికైవడిన్, జడునిభంగిఁ, గుమారకుఁ డూరకుండె నే
వింతయు లేక, తల్లికుచవేదికపై దల మోపి యాడుచున్. 334

వ. అంత నొకనాఁడు బలభద్రప్రముఖు లైన గోపకుమారులు, "వెన్నుండు
మన్ను దినె" నని చెప్పిన యశోద బాలుని కేలు పట్టికొని, యి ట్లనియె. 335

క. మన్నేటికి భక్షించెదు?-[3]మన్నియమము లేల నీవు మన్నింపవు? మీ
యన్నయు, సఖులును జెప్పెద;-రన్నా! మ న్నేల? మఱి పదార్థము లేదే?"

వ. అని పలికిన ముగుదతల్లికి, నెఱదంట యైన కొడు కిట్లనియె. 337

శా. "అమ్మా! మన్నుదినంగ నే శిశువనో? యాఁకొంటినో? వెఱ్ఱినో?
నమ్మంజూడకు వీరిమాటలు మదిన్; న న్నీవు గొట్టంగ వీ
రిమ్మార్గంబు ఘటించి, చెప్పెదరు; కాదేనిన్, మదీయాస్యగం
ధమ్మాఘ్రాణము సేసి, నావచనముల్ దప్పైన దండింపవే." 338

వ. అని పలికి నెయ్యంబున నయ్యవ్వ నియ్యకొలిపి, క్రీడామనుజబాలకుం డైన
యీశ్వరుండు తననోరు దెఱచి, ముఖంబుఁ జూపిన. 339

క. ఆలలితాంగి గనుంగొనె-బాలునిముఖమందు జలధిపర్వతవనభూ
గోళశిఖితరణిశశిది-క్పాలాది కరండ మైన బ్రహ్మాండంబున్. 340

వ. కనుంగొని. 341

1. నింద, అగుడు. 2. ఏమియును తెలియనివాఁడు. 3. నాయేర్పాటులు.

మ. "కలయో? వైష్ణవమాయయో ? యితరసంకల్పార్థమో? సత్యమో ?
తలఁపఁగ నేరక యున్నదాననో? యశోదాదేవిఁ గానో? పర
స్థలమో? బాలకుఁ డెంత? యీతనిముఖస్థం బై [1]యజాండంబు ప్ర
జ్వల మై యుండుట కేమి హేతువొ? మహాశ్చర్యంబు చింతింపఁగన్. 342

ఆ. బాలమాత్రుఁ డగు సలీలునిముఖమందు-విశ్వ మెల్ల నెట్లు వెలసి యుండు ?
బాలుభంగి నితఁడు భాసిల్లుఁ; గాని స-ర్వాత్ముఁ డాదివిష్ణుఁ డగుట నిజము."

వ. అని నిశ్చయించి. 344

ఆ. "ఏమహాత్మువలన నీవిశ్వరూపంబు-గానఁబడిన బుద్ధికంపమయ్యె;
నామహాత్ము విష్ణు నఖిలలోకాధారు-నార్తులెల్లఁ బాయ నాశ్రయింతు. 345

క. నామగఁడు, నేను, గోవులు-నీమందయు, గోపజనులు, నిబ్బాలునినె
మ్మోమున నున్నవిధముఁ గని-యేమఱితిమి; గాని, యీశుఁడీతఁడు మాకున్."

వ. అని తన్నుఁ బరమేశ్వరుండని తలంచుచున్న యశోదయందు, నా కృష్ణుండు వైష్ణవమాయం బొందించిన. 347

క. [2]జడనుపడి,యెఱుక సెడి,యా-పడఁతుక "సర్వాత్ముఁ"డనుచుఁ బలుకక,యతనిం
గొడుకని, యొడపై నిడుకొని-కడువేడుకతోడ మమత గావించె, నృపా!" 348

వ. అనిన విని, రాజి ట్లనియె. 349

ఆ. "జగదధీశ్వరునకుఁ జన్నిచ్చుతల్లి గా-నేమి నోము నోఁచె నీయశోద ?
"పుత్రుఁ" డనుచు నవనిఁ బోషించుతండ్రి గా-నందుఁ డేమి సేసె? నందితాత్మ !

క. [3]ప్రబ్బినభక్తిని హరిపైఁ-గబ్బంబులు సెప్పి, కవులు కైవల్యశ్రీ
కబ్బుదు రఁట? హరిపోషణ-మబ్బినతలిదండ్రులెచటి కబ్బుదురొతుదిన్?" 351

వ. అనిన విని రాజయోగికి శుకయోగి యిట్లనియె 352

యశోదానందుల పూర్వజన్మవృత్తాంతము

సీ. "అవనీశ! విను; ద్రోణుఁడనువాఁడు వసువులయందు ముఖ్యుఁడు; ధర యతనిభార్య;
వారి నిద్దఱ బ్రహ్మ "వసుధపై జన్మింపుఁ" డంచుఁ బంచిన, వారలతనిఁ జూచి,
"విశ్వేశ్వరుం డైనవిష్ణుసేవారతి మా కిచ్చి తేనియు, మహి జనింతు"
మనవుడు, నట్లకాకనియె వేల్పులపెద్ద; యాద్రోణుఁ డీనందుఁ డై జనించె;

ఆ. ధర యశోద యయ్యె; దనుజేంద్రవైరియుఁ-గమలగర్భుమాట గారవించి,
"తల్లిదండ్రు"లనుచుఁ దగ వారి మన్నించె; నధికభక్తితోడ నలరి రిట్లు. 353

1. బ్రహ్మాండము. 2. మొద్దుబాఱి. 3. అధికముగానుండిన.

వ. అంత నొక్కనాఁడు తనయింటికడ పాపలందఱు సయ్యోపనుల వెంటఁ బంపువడి పోయిన, [1]నందసుందరి సంరంభంబునం [2]దరికంబంబుకడఁ, గుదురున, నొక్క దధి కుంభంబు వెట్టి, మిసిమి గల మీఁగడ పెరుఁగు గూడం బోసి, వీఁక నాఁక త్రాడు కవ్వంబున నలవరించి. 354

యశోద దధిభాండవికలనాదులు సేసిన కృష్ణునిఁ బట్టుకొనుట

సీ. కరకమలారుణకాంతిఁ గవ్వపుఁద్రాడు పవడంపునునుఁదీవపగిది మెఱయఁ,
గ్రమముతో రజ్జు వాకర్షింపఁ బాలిండ్లు వీడ్వడి యొండొంటి వీఁక నొత్తఁ,
గుచకుంభములమీఁదికొంగు జాఱఁగఁ జిక్కువడుచు హారావళుల్వ్రయలుపడఁగఁ,
బొడమిన చెమటతోఁ బొల్పారు నెమ్మోము మంచుఁ పైపడిన పద్మంబుఁ దెగడఁ,
తే. గాను సలియంగఁ, గంగణక్వణన మెసఁగఁ,
దుఱుముబిగి వీడఁ, గర్ణికాద్యుతులు మెఱయ,
బాలు నంకించి పాడెడిపాటవలనఁ
దరువులిగురొత్తఁ, బెరుఁగింతి దరువఁజొచ్చె. 355

వ. ఆసమయంబున. 356

క. సుడియుచు, వ్రాలుచుఁ, గిదుకుచు-నడి గొట్టుచు, "నమ్మ! రమ్మ, చ"న్నిమ్మనుచున్
వెడవెడగంతులు వైచుచుఁ-గడవఁ గదిసి, బాలకుండు గవ్వముఁ బట్టెన్. 357

క. కవ్వముఁ బట్టిన ప్రియసుతు-నవ్వనరుహనేత్ర దిగిచి, యంకతలమునన్
నవ్వుచు నిడుకొని, కూఁకటి-దువ్వుచుఁ జన్నిచ్చె; నతఁడు దూఁటుచుఁ గుడిచెన్.

మ. కడుపారం జనుఁబాలు ద్రావనిసుతుం, గంజాక్షి పీఠంబుపై
నిడి, పొంగారెడిపాలు డించుటకునై, యేఁగంగఁ, దద్బాలుఁడె
క్కుడుకోపంబున వాఁడిఱాత [3]దధిమత్కుంభంబు వోఁ గొట్టి, తెం
పడరం గుంభములోనివెన్నఁ దినె మిథ్యాసంకులద్బాష్పుఁడై. 359

వ. అంత నాలోలలోచన పాలు డించి వచ్చి, వికలంబు లయిన దధికుంభశకలంబులఁ బొడగని, తుంటకొడుకు వెన్నదింట యెఱింగి, నగుచు నాకలభగామిని యతనిం గానక, చని చని. 360

ఆ. వికచకమలనయన వే ఱొక యింటిలో,-వెలయ ఱోలు దిరుగ వేసి, యెక్కి,
యుట్టిమీఁది వెన్న నులుకుచు నొకకోఁతి,-పాలు సేయుచున్న బాలుఁ గనియె.

మ. కని, చేతన్ సెలగోల వట్టికొనుచుం, "గానిమ్ము! గానిమ్ము రా;
తనయా! యెవ్వరియందుఁ జిక్కువడ; నేదండంబునుం గాన; నే

1. నందునిభార్య యశోద. 2. పెరుగుచిలుకుటకు ఆధారముగానుంచిన స్తంభము.
3. పెరుగుల కుండను.

వినివారంబును బొంద; నేవెఱపు నేవిభ్రాంతియుం జెంద; ము
న్ననియో? నీ విటు నన్నుఁ గైకొనమి; నేఁ డాకీతి సిద్ధించునే?'' 362

వ. అని యదలించుచుఁ, గొడుకునడవడిం దలంచి తనుమధ్య దనమనంబున. 363

సీ. ''బాలుఁడీతండని భావింతు నందునా? యే పెద్దలును నేరరీక్రమంబు;
నెఱ వెఱుంగుటకున్నై వెఱపింతునందునా? కలిగి లే కొక్కఁడు గాని లేఁడు;
వెఱపుతో నాబుద్ధి వినిపింతు నందునా? తనుఁ దానయై బుద్ధిఁ దప్పకుండు;
నొండెఱుంగక యింట నుండెడి నందునా? చొచ్చి చూడని దొకచోటు లేదు;

ఆ. తన్ను నెవ్వరైనఁ దలపోయఁ, బాఱెడి-[1]యోజ లేదు; భీతి యొకటి యెఱుఁగఁ;
జెలిమి నూరకుండఁ; డెక్కసక్కెము లాడుఁ-బట్టి శాస్తి సేయుభంగి యెట్లు?''

వ. అని వితర్కించి. 365

క. ''లాలనమున బహుదోషము-లోలిం బ్రాపించుఁ; [2]దాడనోపాయములం
జాల గుణంబులు గలుగును-బాలురకును దాడనంబ [3]పథ్యం బరయన్.'' 366

వ. అని నిశ్చయించి, కేల నున్నకోల జళిపించి, ''బాలా! నిలు నిలు''మని బగ్గు
బగ్గున నదల్చుచుఁ, దల్లి డగ్గఱిన, బెగ్గడిలినచందంబున నగ్గలిక సెడి, ఱోలు
డిగ్గ నుఱికి. 367

క. గజ్జెలు గల్లని మ్రోయఁగ-[4]నజ్జలు ద్రొక్కుటలు మాని, యతిజవమున యో
షిజ్జనములు నగఁ, దల్లియుఁ-బజ్జం జనుదేర, నతఁడు పఱచె నధిపా! 368

వ. అప్పుడు. 369

మ. స్తనభారంబున డస్సి, క్రుస్సి, యసదై, జవ్వాడు మధ్యంబుతోఁ,
జనితస్వేదముతోఁ, జలత్కబరితోఁ, స్రస్తోత్తరీయంబుతోఁ,
వనజాక్షుఁ గూడఁబాఱి తిరిగెన్, వారించుచున్ వాకిటన్
ఘనయోగీంద్రమనంబులున్ వెనుకొనంగా లేని లీలారతున్. 370

వ. ఇట్లు గూడం జని. 371

సీ. స్తంభాదికంబులు దనకు నడ్డంబైన, నిట్టట్టు సని పట్టనీనివాని,
'నీతప్పు సైరింపు; మింక దొంగిలఁ బోవ నే;' నని మునుముట్ట నేడ్చువానిఁ,
గాటుక నెఱయంగఁ గన్నులు నులుముచు, వెడలుకన్నీటితో వెగచువాని,
'నేదెస వచ్చునో? యిది'యని పలుమాఱు నురుఁగుచుఁ గ్రేగంటఁ జూచువానిఁ,

ఆ. గూడఁ బాఱి, పట్టుకొని, వెఱపించుచుఁ-'జిన్నివెన్నదొంగ సిక్కె'ననుచు
నలిగి కొట్టఁ జేతు లాడక, పూఁబోఁడి-కరుణతోడ బాలుఁ గట్టఁ దలఁచి. 372

---

1. శక్తి. 2. దెబ్బలుకొట్టుట. 3. తగినది. 4. అడుగులు.

వ. ఇట్లనియె. 373

క. 'ఏ రెవ్వరు శ్రీకృష్ణులు-గారా? యెన్నఁడును వెన్నఁ గానరఁట కదా?
చోరత్వం బించుకయును-నేర రఁట! ధరిత్రి నిట్టినియతులు గలరే? 374

క. పట్టినఁ బట్టువడని, నినుఁ-బట్టెద; నని చలముఁగొనినఁ బట్టుట పెట్టే?
పట్టువడ వండ్రు; పట్టీ!-పట్టుకొనన్ నాకుఁగాక పరులకు వశమే? 375

క. ఎక్కడ నైనను దిరిగెద-వొక్కయెడన్ గుణము కలిగి యుండవు; నియమం
బెక్కడిది నీకు? మఱచినఁ-జక్కఁగఁ బోయెదవు పెక్కుజాడలఁ బుత్రా! 376

సీ. తోయంబు లివి యని తొలఁగక చొచ్చెదు; తలఁచెదు గట్టైనఁ దరల నెత్త;
మంటితో నాటలు మానవు కోరాడె; దున్నత స్తంభంబు లూఁపఁ బోయె;
దన్యుల నల్పంబు లడుగంగఁ బాఱెదు; రాచవేఁటలఁ జాల నవ్వ దెచ్చె;
దలయవు నీళ్లకు; నడ్డంబు గట్టెదు; ముసలివై హరివృత్తి మొనయఁ జూచె;
ఆ. దంబరంబు మొలకు నడుగవు; తిరిగెద;-వింకఁ గల్కిచేఁత లేల పుత్ర?
నిన్ను వంప, వ్రాల్ప, నే నేర ననియొ? నీ-విట్టు క్రిందు మీఁదు నెఱుఁగకునికి.*

ఉలూఖలబంధన యమళార్జున భంజనాద్యభివర్ణనము

వ. అని మర్మంబు లెత్తి, పలికి. 378

క. ఆలలన గట్టె ఱోలన్-లీలన్ నవనీతచౌర్యలీలుం, బ్రియవా
గ్జాలుం, బరివిస్మితగో-పాలున్, ముక్తాలలామఫాలున్, బాలున్. 379

క. ఱోలను గట్టువడియు న-బ్బాలుఁడు విలసిల్లె, భక్తపరతంత్రుం డై,
యాలానసన్నిబద్ధ వి-శాలమదేభేంద్రకలభసమరుచి నధిపా! 380

క. వెలి,లోను, మొదలు దుది, నడు-ములు లేక జగంబుతుదియు, మొదలున్, నడుమున్
వెలియును లో నగునీశ్వరు-నలవడునే కట్టఁ బ్రణతురాల్ గాకున్నన్? 381

ఆ. పట్టి యెల్లబోఁటి పట్టి యీతం డని-గట్టితలఁపుతోడఁ గట్టెఁ గాక!
పట్టికడుపు పెక్కు బ్రహ్మాండములు పట్టు-టెఱిఁగెనేనిఁ, దల్లి యేల కట్టు? 382

క. చిక్కఁడు సిరికౌఁగిటిలోఁ-జిక్కఁడు సనకాదియోగిచిత్తాబ్జములం;
జిక్కఁడు శ్రుతిలతికావలిఁ-జిక్కెనతఁడు లీలఁ దల్లిచేతన్ ఱోలన్. 383

వ. ఇట్లు గ్రద్దన నాముద్దియ, ముద్దులపట్టియుదరంబు గట్ట నడరుచుఁ, జతురంబుగఁ జిక్కనొక్కత్రాడు సుట్టిన, నది రెం డంగుళంబులు గడమపడియె; మఱియు నొక్కబంధనంబు సంధించి, వలగొనిన, నంతియ కొఱంత యయ్యె; వెండియు నొక్కపాశంబు గూర్చి పరివేష్టించిన వెల్తి సూపె; నిట్లు. 384

* 377 వ పద్యమున దశావతారములు వర్ణింపఁబడినవి.- (మత్స్యకూర్మాదులు.)

క. తజ్జనని లోఁగిటం గల-[1]రజ్జుపరంపరలఁ గ్రమ్మఱన్ సుతుఁ గట్టన్,
బొజ్జ దిరిగి రా దయ్యె; జ-గజ్జాలము లున్న బొజ్జ గట్టన్ వశమే? 385

వ. అప్పు డాయవ్వయు గోపికలును వెఱఁగుపడిరి; తదనంతరంబ. 386

ఆ. ఒడలఁ జెమట దొరగ నుత్తరీయము జాఱ-వీడి యున్న తుఱుమువిరులు రాలఁ,
'గట్టరాని తన్నుఁ గట్టెద;' నని చింతఁ-గట్టుకొనినతల్లిఁ గరుణఁ జూచి. 387

క. బంధవిమోచనుఁ డీశుఁడు-బంధింపఁ బెనంగు జననిపాటోర్చి, సుహృ
ద్బంధుఁడు గావున, జననీ-బంధంబునఁ గట్టువడియెఁ బాటించి నృపా! 388

క. [2]సంగడిఁ దిరిగెడుశంభుఁడు-నంగాశ్రయ యైన సిరియు, నాత్మజుఁ డై యు
ప్పొంగెడి పద్మజుఁడును, గో-పాంగనక్రియఁ గరుణ వడయ రక్షితేశ్వరుచేన్.

క. జ్ఞానులచే, మానులచే, దానులచే, యోగసంవిధానులచేతం,
బూని నిబద్ధుం డగునే? శ్రీనాథుఁడు భక్తియుతులచేతం బోలెన్. 390

వ. అంత నయ్యశోద యింటికడం బనులవెంటం దిరుగఁ, గృష్ణుండు దొల్లి నారదు
శాపంబున నిరుమద్దు లై యున్న నలకూబరమణిగ్రీవు లను గుహ్యకుల నిద్దఱం గని,
ఱో లీడ్చుకొని చనియె;' నని చెప్పిన శుకయోగివరునకు భూవరుం డిట్లనియె.

క. 'నారదుఁ డేల శపించెను?-వా రావృక్షత్వమునకు వచ్చినపనికిం
గారణ మెయ్యది? యోగికు-లారాధ్య! యెఱుంగఁ జెప్పుమయ్య! వినియెదన్.'

వ. అనిన శుకుం డిట్లనియె; మున్ను కుబేరునికొడుకు లిరువురు శంకరకింకరు లై
యహంకరించి, వెండికొండమీఁద [3]విరులతోఁటలం బాడెడిచేడియలం గూడి
కొని, కరేణుసంగతంబు లైన యేనుంగులభంగి, సురంగంబు లైన మందాకి
నీతరంగంబులం గ్రీడింప, నారదుండు వచ్చిన, నచ్చెలువలు సెచ్చెర వలువలు
ధరియించిరి; మదిరాపానపరవశులు గావున వార లిరువురు వివస్త్రులై, మెలంగు
చున్న నా మునీశ్వరుండు సూచి, శపియించువాఁ డై ప్రతీతం బగు గీతంబు
పాడె; వినుము. 393

శా. సంపన్నుం డొరుఁ గాన లేఁడు; తనువున్ సంసారమున్ నమ్మి, హిం
సింపంజూచు; దరిద్రుఁ డెత్తువడి శుష్కీభూతుఁ డై చిక్కి, హిం
సింపం; డన్యుల నాత్మకున్ సములుగాఁ జింతించు; నట్టాటఁ ద
త్సంపన్నాంధున కంజనంబు వినుమీ దారిద్ర్య మూహింపఁగన్!" 394

వ. అని గీతంబు వాడి, తన మనంబున. 395

---

1. త్రాళ్లయొక్క సముదాయములచేత. 2. సహవాసముతోదగ్గఱ. 3. పూలతోఁటలు.

క. కలవానిసుతుల మనుచును-గలకంఠులతోడఁ గూడి, గానరు పరులం
గలలోనైనను; వీరికిఁ-గలక్రొవ్వడఁగించి, బుధులఁ గలుపుట యొప్పున్.

వ. అని చింతించి, విజ్ఞానవిశారదుం డగు నారదుండు, నలకూబరమణిగ్రీవులం జూచి, "మీరలు శ్రీమదాంధులరు; గావున భూలోకంబున [2]నర్జునతరువు లై, నూఱుదివ్యవర్షంబు లుండుం; డంట మీఁద గోవిందచరణారవిందపరిస్పందంబున.

క. ముక్తుల రై, నారాయణ-భక్తుల రై, పరమసాధుభావశ్రీసం
సక్తుల రై, సురలోక-వ్యక్తుల రయ్యెదరు, నాదువాక్యముకతనన్." 398

వ. అని యిట్లు పలికి, నారదుండు నారాయణాశ్రమంబునకుం జనియె; వారిరువురును సంగడిమద్దు లైరి; పరమభాగవతుం డైన నారదుమాటలు వీటింబుచ్చక, పాటించి. 399

క. ముద్దులతక్కరిబిడ్డఁడు-మద్దులఁ గూల్పంగఁదలఁచి, మసలక తా నా
మద్దికవ యున్న చోటికి-గ్రద్దన ఱోలీడ్చుకొనుచుఁ గడఁకం జనియెన్. 400

వ. చని, యాయూర్జితమహాబలుండు నిజోదరదామసమాకృష్యమాణతిర్యగ్భవదులూఖలుం డై, యారెండు మ్రాఁకులనడుమం జొచ్చి, ముందటికి నిగుడుచు.

క. బాలుఁడు ఱోలడ్డము దివ-మూలంబులు వెకలి, విటపములు విఱిగి, మహా
భీలధ్వనిఁ గూలెను శా-పాలస్యవివర్జనములు యమళార్జునముల్. 402

వ. ఇట్లు నిర్మూలంబు లయి, పడినసాలంబులలోనుండి [3]కీలికీలలు వెల్వడుపోలిక, నెక్కుడు తేజంబున దిక్కులు పిక్కటిల్లం, బ్రసిద్ధు లైన సిద్ధు లిద్దఱు వెడలి వచ్చి, ప్రబుద్ధు లై భక్తలోకపాలకుం డైన బాలకునకు మ్రొక్కి, లేచి, కరకమలంబులు మొగిచి, యి ట్లనిరి. 403

క. "బాలుఁడవె? నీవు; పరుఁడ, వ-నాలంబుఁడ, వధికయోగి, వాద్యుఁడవు, తను
స్థూలాకృతి యగు విశ్వము-నీలీలారూప మండ్రు, నిపుణులు, కృష్ణా! 404

సీ. ఎల్లభూతంబుల, కింద్రియాహంకృతి ప్రాణంబులకు, నధిపతివి నీవ;
ప్రకృతియుఁ, బ్రకృతిసంభవమహాత్మను నీవ; వీని కన్నిటికిని విభుఁడ వీవ;
ప్రాకృతగుణవికారములఁ బొందక, పూర్వసిద్ధుండ వగునిన్నుఁ జింత సేయ,
గుణవృతుం డోపునే? గుణహీన! నీయంద కలగుణంబుల నీవ కప్పఁబడుదు;

తే. మొదల నెవ్వనియవతారములు శరీరు-లందు, సరిదొడ్డు లేనివీర్యములఁ, దనువు
లడర జన్మించి, వారలయందుఁ జిక్క-వట్టి పరమేశ! మ్రొక్కెదమయ్య! నీకు.

క. భువనములు సేయఁ, గావఁగ-నవతీర్ణుఁడ వైతి కాదె? యఖిలేశ్వర! యో
గివరేణ్య! విశ్వమంగళ! కవిసన్నుత! వాసుదేవ! కల్యాణనిధీ! 406

1. సంపదచేఁ గన్నుగానని వాఁడు. 2. మద్దిచెట్లు. 3. అగ్నియొక్క జ్వాలలు, మంటలు.

ఉపేంద్రవజ్రము. తపస్వివాక్యంబులు దప్ప వయ్యెన్;
నెపంబునం గంటిమి నిన్నుఁ జూడం;
దపంబు లొప్పెన్; మముఁ దావకీయ
ప్రపన్నులం జేయుము; భక్తమిత్రా! 407

శా. నీపద్యావళు లాలకించు చెవులున్, నిన్నాడు వాక్యంబులున్,
నీపేరం బనిసేయు హస్తయుగముల్, నీమూర్తిపైఁ జూపులున్,
నీపాదంబులపొంత మ్రొక్కు శిరముల్, నీసేవపైఁ జిత్తముల్,
నీపై బుద్ధులు, మాకు నిమ్ము కరుణన్ నీరేజపత్రేక్షణా! 408

వ. అని 'యిట్లు' కీర్తించిన గుహ్యకులం జూచి, నగుచు, నులూఖలబద్ధుండైన హరి యిట్లనియె. 409

క. "తమతమధర్మము దప్పక-సములై నను, నమ్మి తిరుగు సభ్యులకును, బం
ధము నన్నుఁ జూడ[1] విరియును;-గమలాప్తుఁడు వొడమ విరియు ఘనతమము క్రియన్.

క. కారుణ్యమానసుఁ డగు-నారదు వచనమునఁ జేసి, ననుఁ బొడగనుటన్
మీరు ప్రబుద్ధుల రైతిరి;-చేరెన్ నామీఁదితలఁపు; సిద్ధము మీకున్." 411

వ. అని యీశ్వరుండు 'మీరు మీ నెలవులకుం బొం'డని యానతిచ్చిన, మహాప్రసాదం బని, వలగొని పెక్కుమ్రొక్కు లిడి, వీడుకొని, నలకూబరమణిగ్రీవు లుత్తర భాగంబున కరిగి; రంత నందాదు లయినగోపాలకులు నిర్మూలంబు లయి, పడిన సాలంబులచప్పుడు పిడుగుచప్పు డని శంకించి, వచ్చి, చూచి. 412

క. "ఈపాదపములు గూలఁగ-నీపాపఁ డులూఖలమున నిటు బద్ధుం డై,
యేపగిది బ్రదికెఁ? గంటిరె-వాపోవఁడు, వెఱవఁ డెట్టివాఁడో యితఁడున్?

ఆ. పిడుగువడదు గాక! పెనుగాలి విసరదు-ఖండితంబు లగుట గానరాదు;
బాలుఁ డితఁడు; పట్టి పడఁద్రోయఁ జాలఁడు-తరువు లేల కూలె ధరణిమీఁద?"

వ. అని పెక్కండ్రు పెక్కువిధంబుల నుత్పాతంబులు గావలయు నని శంకింప, నక్కడ నున్న బాలకు లిట్లనిరి. 415

క. "నందునికొమరుఁడు వినుఁ; డీ-సందున మును దూఱి, ఱోలు సరి యడ్డముగా
ముందటి కీడ్చిన, మద్దులు-గ్రందుకొనం గూలె; జనులఁ గంటి మిరువురన్."

వ. అని యిట్లు పలికిన, బాలకాలాపంబులు విని, కొందఱు [2]మిథ్యారూపంబు లనిరి; కొందఱు నానావిధంబుల సందేహించి; రంత నందుండు వికసితవదనారవిందుండగుచుఁ, బట్టి కట్టు విడిచె; నట్టియెడఁ "దన తెఱం గెవ్వరు నెఱుంగ కుండవలె"నని కపటకుమారుండు. 417

1. విచ్చిపోవును. 2. అబద్ధములు.

శా. పాడుఙ్ మందునిభంగి, గోపవనితల్ ¹పాణిధ్వనుల్ సేయఁగా;
నాడుఙ్ జంత్రముక్రైవడిం, బరవశుం డై హ స్తముల్ ద్రిప్పుచుం;
జూడ న్నేరనివానిభంగి, జనులం జూచుఙ్; నగుఙ్; బాలురం
గూడుం; బెద్దలపంపు సేయఁ జను; డాఁగుఙ్ మట్టిఁ జట్టాడుచున్. 418

క. “చుంచెదుఁగుఁ; బాలు ద్రావు; ము-దంచితముగ,” ననుడుఁ బాలుద్రావి, జననితోఁ
‘జుం చెదగ’ దనుచు లీలా-చుంచుం డై, యతఁడు చుంచుఁ జూపు నరేంద్రా!

క. సెలగోల వట్టుకొని, జల-కలశములో నీడఁ జూచి కలశయుతుం డై
‘సెలగోలఁ బాపఁ డొకఁ డిదె-తలఁచెఙ్ ననుఁగొట్ట’ ననుచుఁ దల్లికిఁ జెప్పెన్.

క. ‘భిక్షులు వచ్చెద రేడ్చిన;-భిక్షాపాత్రమున వైచి, బెగడించి నినుఙ్
శిక్షించెద’ రని చెప్పిన-భిక్షులఁ గని, తల్లిఁ గనియు, భీతిల్లు నృపా! 421

నందాదులు బృందావనంబునకు నరుగుదెంచుట.

వ. ఇట్లు కృష్ణుండు బహువిధంబులఁ గపటబాలలీలల వినోదింప, బృహద్వనంబున నందాదు లైనగోపవృద్ధులు, మహోత్పాతంబు లగుటయు, వానివలన బాలుం డుత్తరించుటయుఁ జూచి, యేకాంతంబున నొక్కనాఁడు విచారింప నుపనందుం డను వృద్ధగోపకుండు దనయెఱుక మెఱసి, యి ట్లనియె. 422

ఉ. ‘ఇక్కడ నుంద రే మనుజు? లీమనకృష్ణున కెగ్గు సేయఁ గా
రక్కసురాలు చ న్నొసఁగె? ఱాలపయిఙ్ సుడిగాలి వీచెఁ; బైఁ
గ్రిక్కిఱిపడం దరుల్ వడియెఁ; గేశవుసత్కృపఁ దప్పెఁ, జాలు; నేఁ
డెక్కడ కైనఁ బోవలయు నిం; కిట గోపకులార ! వింటిరే? 423

క. కసవు గల; దిరవు పసులకు-లసదద్రినదీమహీజలతికావలి పెం
పెసఁగును; గాఁపురమునకును-బొసఁగును; బృందావనంబు;పోద మచ్చటికిన్.’

వ. అని పలుకు నుపనందునిపలుకుల కార్యులైన గోపకు, ‘లిదియ కార్యంబు మందల’యని, కొండల మందక, యాలమందల నమందగమనంబున ముందర నడవం బనిచి, పిఱుందం గ్రందుకొనకుండ, బాలవృద్ధనారు లెక్కిన తేరులు సాగించి, తారు ²తనుత్రాణ³తూణీరబాణధరులై, ⁴విండ్లఁ బట్టుకొని, నడవ, బండ్లవెనుకం గొమ్ములు బూరించుచు, సవార్యంబు లగుతూర్యరవంబులు సెలంగ, నార్యపురోహితసమేతులై, వేడుకలు కొనలు నిగుడ, మొన లేర్పఱచుకొని, పావనం బగు బృందావనంబునకుం జని; రప్పుడు. 425

తరలము. పసుపులాడి. యురోజకుంకుమపంకశోభితలై, లస
ద్వసనలై, కచభారచంపకదామలై, సులలామ లై,

1. చేతులు తట్టుచుండఁగా. 2. కవచము. 3. అంబులపొదులు. 4. ధనుస్సులు.

పసిఁడిమాడలకాంతు [1]లఱ్ఱులఁ బర్వఁ, దేరులమీఁదఁ బెం
పెసఁగఁ బాడిరి వ్రేత లాహరిహేల లింపగు నేలలన్. 426

వ. అప్పుడు రోహిణీయశోదలేకరథంబునఁ బరిపూర్ణమనోరథలై, రామకృష్ణుల ముందట నిడుకొని, వారలవినోదంబులకుఁ బ్రమోదంబు నొందుచుం జని; రిట్లు గోపకులు బృందావనంబు సొచ్చి, యం దర్ధచంద్రాకారంబుగ శకటసందోహంబు నిలిపి, మందల విడియించి, వసియించిరి. 427

క. చెందిరి బలమాధవు లభి-నందించుచుఁ బరమపావనము, నంచితకా
ళిందీసంజీవనముం-బృందావనముం, మునీంద్రబృందావనమున్. 428

వ. ఇట్లు బృందావనంబుఁ జెంది, యందుఁ గొంతకాలంబునకు రామకృష్ణులు సమానవయస్కులైన గోపబాలకులంగూడికొని, వేడుకలాడుకొన దూడలఁ గాచుచు. 429

సీ. వేణువు లూఁదుచు, వివిధరూపములతో గంతులు వైతురు కౌతుకమున;
గురుకంబళాదుల గోవృషంబులఁ బన్ని, పరవృషభము లని ప్రతిఘటింతు;
రల్లులు దట్టించి, యంఘ్రులఁ గజ్జెలు మొరయఁ, దన్నుదు రోలి ముమ్మరముగఁ;
బన్నిదంబులు వైచి, ఫలమంజరులు గూర్చి వ్రేటు లాడుదురు ప్రావీణ్య మొప్ప;
తే. వన్యజంతుచయంబుల వాని వాని-పదురు నదురుచు, వంచించి పట్టఁబోదు;
రంబుజాకరములం జల్లులాడఁ జనుదు;-రా కుమారులు బాల్యవిహారు లగుచు.

క. పోరుదురు గికురు వొడుచుచుఁ;-దూఱుదురు భయంబు లేక తోరపుటిరువుల్;
జాఱుదురు ఘనశిలాతటి;-మీఱుదు రెన్నంగరాని మెలఁకువల నృపా! 431

వత్సాసుర బకాసురులవధ

వ. అంత నొక్కనాఁడు, యమునాతీరంబున నా కుమారులు గోపకుమారులుం దారును, గ్రేపుల మేప, నొక్కరక్కసుండు క్రేపురూపున వచ్చి, వారల హింసింపందలంచి. 432

క. క్రేపులయఱ్ఱులు నాకుచు-గ్రేపులలో నిదియె మంచిక్రే, పనఁగఁ గడుం
జూపట్టి, భక్తసంగతిఁ-గ్రేపై చనువానిమ్రోలఁ గ్రేపై తిరిగెన్. 433

వ. వాని నెఱింగి కృష్ణుండు రామునకుం జెప్పి. 434

చ. "ఇది యొకమంచిలేఁగ; వినుఁ; డెంతయు నొప్పెడి;" నంచు డాసి, త
త్పదములుఁ దోఁకయుం బిగియఁ బట్టి, చెలంగి, కెలంగమ్రానితోఁ

1. కంఠములయందు - మెడలయందు.

జడియఁగ నొక్కపెట్టుగొని చంపెఁ, గుమారుఁడు లేఁగరక్కసుం
గుదులుకొనంగ, బాలకులు "గో" యని యార్వ నఖర్వలీలతోన్. 435

వ. ఇట్లు రక్కసుండు ప్రేఁటువడి, విశాలం బగు సాలంబుతో నేలం గూలె; నప్పుడు.

క. గొంగడు లెగురఁగ వైచుచుఁ-జంగున దాఁటుచును, జెలఁగి, చప్పట లిడుచుం
బొంగుచుఁ, గృష్ణునిఁ బొగడుచుఁ-ద్రుంగినరక్కసునిఁ జూచి, త్రుళ్లిరి కొమరుల్.

వ. ఆ సమయంబున వేలుపులు విరులవానలు గురియించి; రివ్విధంబున. 438

క. వత్సములపగిది జగముల-వత్సలతన్ మనుపఁ జూచువాఁడై, యుంటన్
వత్సముల మేపుచుండియు-వత్సాసురుఁ జంపె, భక్తవత్సలుఁ డధిపా! 439

వ. మఱియు నొక్కనాఁడు [1]రేపకడ గోపకుమారులు క్రేపులం గొంచు నడవికిం జని, యెండం బడి, యెండకొనినదప్పిని [2]బెండువడినతమతమ లేఁగకదుపుల నేర్పరించి, నిలువరించుకొని, కలంకంబు లేని యొక్కకొలంకున నీరు ద్రావించి, తారును జలపానంబు సేసి, వచ్చు నెడ, నందు. 440

క. అకలంకులు బాలురు గని-రకుటిలదంభోళిహతసితాద్రిశిఖరరూ
పకమున్, [3]హరిహింసారం-భకమున్, బకమున్, విశాలభయదాంబకమున్.

వ. కని, దానిమొదలిపోడుపునకు వెఱఁగుపడి, చూచుచుండ. 442

ఆ. ఎల్లపనులు మాని, యేకాగ్రచిత్తుఁడై-మౌనివృత్తి నితరమమత విడిచి,
వనములోన నిలిచి, వనజాక్షుపై దృష్టిఁ-జేర్చి, బకుఁడు దపసిచెలువుఁ దాల్చె.

వ. ఇవ్విధంబున నొడుఁగు వెట్టుకొనియుండి. 444

ఉ. చంచువు దీటి పక్షములు జల్లున విచ్చి, పదంబు లెత్తి, కు
ప్పించి నభంబుపై కెగసి, భీమఘనఘోషణవక్త్రుఁడై, విజృం
భించి, గరుత్సమీరమున భిన్నములై తరు లోలిఁ గూలఁ గా,
మించి, బకాసురుం డొడిసి మ్రింగె సహిష్ణునిఁ, జిన్నకృష్ణునిన్. 445

క. సంగడి లోకములన్నియు-మ్రింగుచుఁ, గ్రక్కుచును, బయల మెలఁగించుచు ను
ప్పొంగెడి వేడుకకాఁడటు-మ్రింగుడువడె బకునిచేత, మీఁదెఱిఁగి నృపా!

క. దనుజుఁడు మ్రింగినఁ గృష్ణునిఁ-గనలేక, బలాది బాలకప్రముఖు లచే
తనులై, వెఱఁగందిరి, చ-య్యనఁ బ్రాణము లేనియింద్రియంబులభంగిన్. 447

వ. ఇట్లు మ్రింగుడువడి, లోనికిం జనక. 448

శా. కంఠోపాంతము, దాడలున్, మెఱుముచుం, గాలాగ్ని చందంబునం
గుంఠీభూతుఁడు గాక, "వేండ్రమగునాగోపాలబాలున్, జయో

1. ఉదయము. 2. అలసిన. 3. కృష్ణుని జంపునట్టి ప్రయత్నముగలది.

త్కంఠున్, బ్రహ్మగురున్, మహామహిముఁ, జక్కన్ మ్రింగ రాఁడంచు ను
ల్లంఠంబాడుచు వాఁడు గ్రక్కె వెడలన్, లోకం బశోకంబు గన్. 449

క. క్రక్కి, మహాఘోషముతోఁ-జక్కఁగఁ దనుఁ, బొడువ రాఁగఁ, జంచులు రెండున్
బ్రక్కఁగ బట్టి, తృణము క్రియ-గ్రక్కున హరి[1]చీఱె బకునిఁ గలహోత్సుకునిన్.

వ. అప్పుడానందనందనునిమీఁద వేలుపులు సాలుపులుగా నందనమల్లికాదికుసుమ
వర్షంబులు హర్షంబునం గురియించిరి; దేవవాద్యంబులు మొరసె; రామాది
గోపకుమారులు ప్రాణంబులతోఁ గూడినయింద్రియంబులునుంబోలె, గ్రమ్మఱఁ
గృష్ణునిం గని, రమ్మని కౌఁగిలించుకొని, కృష్ణసహితులయి లేఁగ దాఁటుల మరల
దాఁటించుకొని, మందగమనంబున మందకరిగిరి; వారలచేత నావృత్తాంతంబం
తయు విని, వెఱఁగుపడి గోపగోపికాజనంబులు. 451

క. "అపకలమీఁద నాపద-లీపాపనిఁ జెంది తొలఁగె; నీయర్భకుపై
వేపడినఖలులు దహనుని-వైపున [2]శలభములపగిదిఁ బడిరి ధరిత్రిన్." 452

వ. అని పలికిరి; మఱియు నారామకృష్ణులు [3]క్రేపులంగాచుతఱి. 453

సీ. "కపులమై జలరాశిఁ గట్టుదమా" యని, కట్టుదురడ్డంబు గాలువలకు;
"మునులమై తపములు మొనయుదమా" యని, మౌనులై యుందురు మాటలేక;
"గంధర్వవరులమై గానవిద్యలు మీఱఁ బాడుదమా" యని, పాడఁ జొత్తు;
"రప్సరోజనులమై యాడుదమా" యని, యాఁడురూపులఁ దాల్చి యాడఁజనుదు;

ఆ. "రమరదైత్యవరులమై యబ్ధిఁ ద్రత్తమా-"యని, సరోవరములయందు హస్త
దండచయముఁ ద్రిప్పి, త్వరతురు, తమయీడు-కొమరు లనుచరింపఁ గొమరుమిగుల.

శ్రీకృష్ణుఁడు గోపకులతో బంతిచల్దులు గుడువ వనమున కేఁగుట

వ. అంత నొక్కనాఁడు రామకృష్ణులు గాంతారంబున బంతిచలుదులు గుడువ
నుద్యోగించి, ప్రొద్దున లేచి, గ్రద్దనం దమయింటి లేఁగకదుపులఁ గదలించి, సురం
గంబులగు శృంగంబులు పూరించిన, విని, మేలుకని, సంరంభంబున గోపడింభ
కులు చలిదికావడులు మూపుల వహించి, సజ్జంబులగు[4]కజ్జంబులు గట్టికొని,
పదత్రాణ వేత్రదండధరులై, లెక్కలకు వెక్కసంబైనతమతమక్రేపు[5]కదుపులం
జప్పుడించి, రొప్పుకొనుచుఁ గాననంబు సొచ్చి, కాంచనమణిపుంజగుంజాది
భూషణభూషితులయ్యును ఫలకుసుమకోరకపల్లవవల్లరులు దొడవులుగా నిడి
కొని, కొమ్ములిమ్ముగఁ బూరించుచు, వేణువులూఁదుచుఁ, దుమ్మెదలం గూడి
పాడుచు, మయూరంబులతోడం గూడి యాడుచుఁ, బికంబులం గలసి
కూయుచు, శుకంబులం జేరి రొదలు సేయుచుఁ; బులుఁగులనీడలం బాఱుచుఁ,

1. చీల్చివేసెను. 2. మిడుతలు. 3. దూడలు. 4. ఉపాహారములు. 5. మందలు.

బొదరిండ్లదూఱుచు, సరాళంబు లగువాఁగులు గడచుచు, మరాళంబులచెంత నడచుచు, జలమ్ములంగని నిలుచుచు, సారసంబులంజోపి యలంచుచు, నదీజలంబులం దోఁగుచుఁ, దీవ యుయ్యేలల నూఁగుచుఁ, బల్లంబులఁ డాఁగుచు, దూరంబుల కేఁగుచు, గపులసంగడిఁ దరువులెక్కుచు, ఫలంబులమెక్కుచు, రసంబులకుం జొక్కుచు, నింగికి నిక్కుచు, నీడలు సూచి నవ్వుచుఁ, గయ్యంబులకుం గాలు ద్రవ్వుచుఁ, జెలంగుచు, మెలంగుచు, వ్రాలుచు, సోలుచు, బహుప్రకారంబుల శరీరవికారంబులు సేయుచు, మఱియును. 455

క. ఒకనొకనిచల్దికావడి-నొకఁడొకఁ డడకించి దాఁచు; నొకఁడొకఁ డది వే
ఱొకఁ డొకని [1]మొఱఁగికొని, చన-నొకఁడొకఁ డది దెచ్చి యిచ్చు; నుర్వీనాథా!

క. ఒక్కఁడు మున్నేమఱి చన-నొక్కఁడు బలుబొబ్బ వెట్టు నులికిపడఁగ; వే
ఱొక్కఁడు మిట్టి తటాలున-నొక్కనికనుదోయిమూయు; నొక్కఁడు నగఁగన్.

క. తీపు గల కజ్జమన్యుఁడు-గోపింపఁగ నొడిసి పుచ్చుకొని, త్రోపాడం
బై పడి, యది గొని, యొక్కఁడు-క్రేపులలో నిట్టు నట్టుఁ గికురించు నృపా!

క. వనజాక్షుఁడు మున్నరిగిన-"[2]మునుపడఁగా నతని నేనె ముట్టెద";ననుచుం
జని, మును ముట్టనివానిఁ-మును ముట్టినవాఁడు నవ్వు; మొనసి నరేంద్రా!

వ. ఇవ్విధంబున. 460

ఉ. ఎన్నఁడునైన యోగివిభు లెవ్వనిపాదపరాగ మింతయుం
గన్నులఁ గాన; రట్టిహరిఁ గౌఁగిటఁ జేర్చుచుఁ, జెట్టఁ బట్టుచుం,
దన్నుచుఁ, గ్రుద్దుచుఁ, నగుచుఁ, దద్దయుఁ బైపడి కూడి యాడుచుఁ,
మన్నన సేయు వల్లవకుమారులభాగ్యములింత యొప్పునే? 461

క. విందులకును బ్రహ్మసుఖా-నందంబై, భక్తగణమునకు దైవతమై,
మందులకు బాలుఁ డగుహరి-పొందుఁ గనిరి గొల్ల; లిట్టిపుణ్యులు గలరే!"

వ. అని పలికి శుకయోగీంద్రుండు మఱియు నిట్లనియె. 463

క. "అమరు లమృతపానంబున-నమరినవారయ్యు, నేనిశాటుని[3]పంచ
త్వమునకు నెదుళ్లు సూతురు-తమ నమ్మక యట్టి యఘుఁడు దర్పోద్ధతుఁ డై.

క. బకునికిఁ దమ్ముఁడు గావున-బకమరణము దెలిసి, కంసుపంపున "గోపా
లకబాలురతోఁ గూడను-బకవైరిని ద్రుంతు" ననుచుఁ బటురోషమునన్. 465

క. బాలుర ప్రాణంబులు గో-పాలురకు మదగ్రజాతుప్రాణముమాఁ; దీ
బాలురఁ జంపిన నంతియ-చాలును; గోపాలురెల్ల సమసినవారల్." 466

1. మోసగించి 2. ముందుగా. 3. మరణము.

వ. అని నిశ్చయించి, యోజనంబునిడుపును, మహాపర్వతంబుపొడవును, గొండ తుదల మీఱినకోఱలును, మిన్ను దన్ని పన్నినల్లమొగిళ్లపెల్లు గలపెదవులును, బిలంబులకు నగ్గలంబైన[1]యిగుళ్లసందులును, నంధకారబంధురంబైన వదనాంతరాళంబును, దావానలజ్వాలాభీలంబైన దృష్టిజాలంబును, వేఁడిమికి నివాసంబులైన యుచ్ఛ్వాసనిశ్వాసంబులును, మెఱయ, నేల నాలుకలు పఱచుకొని ఘోరం బగు నజగరాకారంబున. 467

క. "[2]జాపిరము లేక యిప్పుడు-గ్రేపుల, గోపాలసుతులఁ, గృష్ణునితోడన్
గీపెట్టఁగ మ్రింగెద"నని-పాపపురక్కసుఁడు త్రోవఁ బడి యుండె నృపా! 468

వ. ఆసమయంబున. 469

మ. "ఒకవన్యాజగరేంద్ర మల్లదె! గిరీంద్రోత్సేధమై దావపా
వకకీలాపరుషప్రచండతరనిశ్వాసంబుతో, ఘోరవ
హ్నికరాళాతతజిహ్వతోడ, మనలన్ హింసింప నీక్షించుచున్
వికటంబై పడి సాఁగి యున్నది; పురోవీథిం గనుంగొంటిరే!" 470

వ. అని యొండొరులకుం జూపుచు. 471

మ. "బకునిం జంపిన కృష్ణుఁ డుండ, మనకుం "జా" మంచుఁ జింతింప నే
టికిఁ? రా పోదము దాఁటి; కాక యది కౌటిల్యంబుతో మ్రింగుడున్,
బకువెంటం జనుఁ గృష్ణుచేత;" ననుచుం బద్మాక్షు నీక్షించి, యు
త్సుకులై చేతులు వేసికొంచు, నగుచున్, దుర్వారులై పోవఁగన్. 472

వ. వారలం జూచి, హరి దనమనంబున. 473

ఉ. "అర్భకు లెల్లఁ బాము దివిజాంతకుఁ డౌట యెఱుంగ; రక్కటా!
నిర్భయులై యెదుర్కొనిరి; "నేఁ గల" నంచు "విమూఢు" లంచు, నా
విర్భవదాగ్రహాత్వమున వెన్తగులం దమలేఁగపిండుతో
దుర్భరఘోరసర్పఘన[3]తుండబిలాంతముఁ జొచ్చి రందఱున్. 474

వ. అయ్యవసరంబున. 475

శా. వేల్పుల్ సూచి, భయంబు నొంద, గ్రసనావేశంబుతో, నుజ్జ్వల
త్కల్పాంతోజ్జ్వలమానజిహ్వాదహనాకారంబుతో మ్రింగె న
స్వల్పాహీంద్రము మాధవార్పితమనోవ్యాపారసంచారులన్,
స్వల్పాకారుల, శిక్యభారులఁ, గుమారాభీరులన్, ధీరులన్. 476

వ. ఇట్లు పెనుఁబాముచేత మ్రింగుడుపడు సంగడికాఱగమిం జూచి, కృష్ణుండు. 477

1. పంటి-చిగుళ్లమధ్యభాగము. 2. ఆలస్యము. 3. ముఖబిలములోపలి భాగము.

చ. "పసులును, లేఁగలుం గలసి, పైకొని వత్తురు; తొల్లి; 'కృష్ణ! మా
కొడుకు ల దేల రా?' రనుచు గోపిక లెల్లను బల్క, నేక్రియన్
నొడివెద; నేఁడు పన్నగమునోరికి వీరికి నొక్కలంకె గా
నొడఁబడ నేల చేసె విధి? యోడక సేయఁగదయ్య కార్యముల్." 478

వ. అని తలపోసి, యఖిలలోచనుండును నిజాశ్రితనిగ్రహమోచనుండును,
నైన తమ్మికంటి మింటితెరువరులు మొఱ లిడ, రక్కసు లుక్కు మిగుల
వెక్కసం బగు నజగరంబయి యున్న యన్నరభోజనుకుత్తుకకుఁ బొత్తుగొని,
మొత్తంబు వెంట నంటం జని, తమ్ము నందఱం జిందఱవందఱ సేసి, గ్రద్దన మిద్దె
సఱచినట్లుండ. 479

క. ఊపిరి వెడలక, కడుపున-వాపొదవినఁ, బాము[1] ప్రాణవాతంబులు సం
తాపించి, శిరము ప్రక్కలు-వాపికొనుచు, వెడలి చనియెఁ బటుఘోషముతోన్.

శా. క్రూరవ్యాళవిశాలకుక్షిగతులన్, గోవత్ససంఘంబుతోఁ,
గారుణ్యామృతవృష్టిచేత బ్రదుకం గాఁ జూచి, వత్సంబులన్,
వారిం, దాను, దదాస్యవీథి వెడలన్ వచ్చెన్, ఘనోన్ముక్తుఁడై.
తారానీకముతోడ నొప్పెసఁగు నా తారేశుచందంబునన్. 481

ఆ. అమరవరులకొఱకుఁ గమలజాండం బెల్ల-బలి దిరస్కరించి, బలియువడుగు,
గోపసుతులకొఱకుఁ బాపుఁబెనుఁబాము-గళము దూఁటుగట్ట బలియకున్నె?

ఉ. ఆ పెనుఁబాము మేన నొకయద్భుత మైన వెలుంగు దిక్తటో
ద్దీపక మై, వడిన్ వెడలి, [2]దేవపథంబునఁ దేజరిల్లుచుం,
గ్రేపులు, బాలురన్ బెదరఁ, గృష్ణుని దేహము వచ్చి చొచ్చె నా
పాపఁడు సొచ్చి ప్రాణములఁ బాపినయంతన శుద్ధసత్త్వమై. 483

క. తనరూ పొకమాత్రైనను-మనమున నిడికొనినఁ, బాపమయు నైనను లోఁ
గొని, చను హరి, దను మ్రింగిన-దనుజునిఁ గొనిపోవకున్నె తనలోపలికిన్? 484

వ. తదవసరంబున సురలు గుసుమవర్షంబులు గురియించిరి; రంభాదు లాడిరి; గంధ
ర్వాదులు పాడిరి; మేఘంబులు మృదంగంబులభంగి ఘోషించె; సిద్ధగణంబులు
జయజయభాషణంబు భాషించి; రంత. 485

శా. ఆవాద్యంబులు నామహాజయరవం, బాపాట, లాయాటలుం,
[3]దేవజ్యేష్ఠుఁడు పద్మజుండు విని, ప్రీతిన్ భూమి కేతెంచి, "నేఁ
డీవత్సార్భకులన్ భుజంగపతి హింసింపంగ, నీబాలకుం
డే వెంటన్ బ్రదికించె? మే;"లనుచు నూహించెం గడున్ [4]నివ్వెఱన్. 486

1. ప్రాణవాయువులు. 2. ఆకాశమార్గము. 3. బ్రహ్మదేవుఁడు. 4. ఆశ్చర్యములో.

వ. అంత నయ్యజగరచర్మంబు గొన్నిదివసంబుల కెండి, పెద్దకాలంబు గోపాలబా
లురకుం గేళిబిలంబై యుండె; నిట్లు కౌమారవిహారంబున నైదవయేఁట గృష్ణుం
డఘాసురునిం దెగఁజూచుటయుఁ, దమ్ముం గాచుటయు, నాఱవయేఁటి దైన పౌ
గండవృత్తాంతం; బని చిత్తంబుల గోపకుమారులు దలంచుచుండు;" రని చెప్పిన
నప్పుడమితేఁ డప్పరమయోగీంద్రున కిట్లనియె. 487

సీ. "అయిదేండ్లు కౌమార, మటమీఁద నైదేండ్లు పౌగండ, మనియెడుప్రాయమందు,
నయిదేండ్లవాఁడైన యఘబాధుచరితంబు 'పౌగండ' మని గోపబాలు రెల్లఁ
దలఁతు; రంటివి? యెట్లు దలఁతురు వారలు నిరుడు సేసినపని నేఁటి దనఁగ
వచ్చునే? యిది నాకు వరుసతో నెఱిఁగింపు," మనవుడు యతిచంద్రుఁ డైనశుకుఁడు

ఆ. యోగదృష్టిఁ జూచి, యొక్కింత భావించి-"వినుము రాజవర్య! వినయధుర్య!
'పరమగుహ్య' మనుచుఁ బలుకుదు రార్యులు-శిష్యజనుల కీవు సేయుతలఁపు.

క. ప్రియురాలివలనివార్తలు-ప్రియజనులకు నెల్లప్రొద్దుఁ బ్రియ మగు భంగిం,
బ్రియుఁ డగు హరిచరితంబులు, ప్రియభక్తుల కెల్లయెడలఁ బ్రియములు గావే?"

వ. అని పలికి, యోగీంద్రుండు రాజేంద్రున కిట్లనియె; న ట్లఘాసురు మొగంబువలనం
గడచనినవేఁగల, గోపకుమారులఁ బ్రదికించి, వారును దానునుం జని చని.

మ. కనియెం గృష్ణుఁడు సాధునీరము, మహాగంభీరముం, బద్మకో
కనదాస్వాదవినోదమోదమదభృంగద్వంద్వఝుంకారమున్,
ఘనకల్లోలలతావితానవిహరత్కాదంబకోలాహల
స్వనవిస్ఫారము, మందవాయుజకణాసారంబుఁ, గాసారమున్. 491

గోపాలబాలురు కృష్ణునితోఁగూడ చల్ది లారగించుట

వ. కని, తమ్మికంటి తమ్ములయింటిసొబగునకు నిచ్చ మెచ్చుచుఁ, జెచ్చెర గాలి
నోలింగదలెడుకరళ్లతుంపురుల జల్లుపెల్లున నొడళ్లుగగుర్పొడువఁ, గొలంకుఁ
గెలంకులఁ గాయపండుల గొలలవ్రేఁగున వీఁగి, పట్టు గల చెట్టుఁదుటుముసీడల
నొప్పుచున్న యిసుకతిప్పలవిప్పు సూచి, వేడుక పిచ్చలింప, నెచ్చెలుల
కిట్లనియె. 492

శా. "ఎండన్ మ్రగ్గితి; రాఁకటం బడితి; రిం కేలా విలంబింపఁగా?
రం డో బాలకులార! చల్ది గుడువన్; రమ్యస్థలం బిక్క; డీ
దండన్ లేఁగలు నీరు ద్రావి, యిర వందం బచ్చికల్ మేయుచుం
దండం బై విహరించుచుండఁగ, నమందప్రీతి భక్షింత మే?" 493

వ. అనిన "నగుఁ గాక!"యని వత్సంబుల నుత్సాహంబున నిర్మలంబు లగు జలం
బులు ద్రావించి, పచ్చికలమొల్లంబులు గల పల్లంబుల నిలిపి, చొక్కంబు
లగు చల్దుల చిక్కంబులు సక్క డించి. 494

మ. జలజాంతస్స్థితకర్ణికం దిరిగి రా, సంఘంబు లై యున్న తే
కులచందంబునఁ, గృష్ణునిం దిరిగి రాఁ, గూర్చుండి, వీక్షించుచున్
శిలలుం, బల్లవముల్, దృణంబులు, లతల్, చిక్కంబులుం, బువ్వు, లా
కులు, కంచంబులు గాఁ భుజించి రచటన్ గోపార్భకుల్ భూవరా! 495

సీ. మాటిమాటికి వ్రేలు మడిచి యూరించుచు,
నూరుఁగాయలు దినుచుండు నొక్కఁ;
డొకనికంచములోని దొడిసి చయ్యన మ్రింగి,
చూడు లే దని నోరు చూపు నొక్కఁ;
డేగు రార్గురచల్దు లెలమిఁ బన్నిద మాడి,
కూర్కొని, కూర్కొని, కుడుచు నొక్కఁ;
"డిన్ని యుండఁగఁ బంచి యిడుట నెచ్చెలితన"
మనుచు, బంతెనగుండు లాడు నొక్కఁడు *
ఆ. "కృష్ణుఁ జూడు" మనుచుఁ గికురించి, పరు మ్రోల
మేలిభక్ష్యరాశి మెసఁగు నొక్కఁడు;
నవ్వు నొక్కఁడు: సఖుల నవ్వించు నొక్కఁడు;
ముచ్చటాడు నొక్కఁడు; మురియు నొక్కఁడు. 496

వ. అయ్యవసరంబున. 497

సీ. కడుపున దిండుగాఁ గట్టినవలువలో లాలితవంశనాళంబుఁ జొనిపి,
విమలశృంగంబును వేత్రదండంబును జాఱి రానీక డాచంక నిఱికి,
మీఁగడపెరుఁగుతో మేళవించినచల్దిముద్ద డాపలిచేత మొనయ నునిచి,
చెలరేఁగి కొసరి తెచ్చినయూరుఁగాయలు వ్రేళ్లసందులయందు వెలయ నిఱికి,
ఆ. సంగడీలనడుమఁ జక్కఁగఁ గూర్చుండి-నర్మభాషణముల నగవు నెఱపి,
యాగభోక్త కృష్ణుఁ డమరులు వెఱఁ గంద-శైశవంబు మెఱసి, చల్ది గుడిచె.

వ. ఇట్లు కృష్ణసహితు లయిన గోపకుమారులు చల్దులు గుడుచునెడఁ, గ్రేపులు మేపులకుం జొచ్చి, పచ్చనిగఱికిజొంపంబులగుంపుల కుఱికి, లంపులు మేయుచు, ఘోరంబగు నరణ్యంబునడుమఁ దోరం బగు దూరంబు సనిన, వానిం గానక వెఱచుచున్న గోపడింభకులకు నంభోజనయనుం డి ట్లనియె. 499

మ. "వినుఁ డో బాలకులార! క్రేపు లటవీవీథిన్ మహాదూరముం
జనియెం; గోమలఘాసఖాదనరతోత్సాహంబులో, నెందుఁ బో

* 'ఇన్ని యుఁ బోరుచులిడుచు నెచ్చెలితనమనుచు బంతినగుండ్లు నాడునొక్కఁడు' అని పూ. ము. పాఠము. 'బంతెనగూళ్ళనందు నొక్కఁడు' అని ఆనందవారి ముద్రణము.

యెనో? యేమయ్యెనో? క్రూరదంతువ్రలచే నేయాపదం బొందెనో?
కని కెత్తుం; గుడువుండు చల్దిఁ, గొఱఁతల్ గా కుండ మీ రంజఱున్." 500

వ. అని చెప్పి. 501

### బ్రహ్మ గోవత్సములను గోపబాలికులను నంతర్ధానంబు సేయుట

శా. కర్ణాలంబితకాకపక్షములతోఁ, గ్రైవేయహారాళితోఁ,
స్వర్ణాభాసితవేత్రదండకముతోఁ, సత్పింఛదామంబుతోఁ,
బూర్ణోత్సాహముతోఁ, ధృతాన్నకబళోత్ఫుల్లాబ్జహస్తంబుతోఁ,
దూర్ణత్వంబున నేఁగె లేఁగలకు నై దూరాటవీవీథికిన్. 502

వ. ఇ ట్లేఁగుచు. 503

క. "ఇచ్చోఁ బచ్చిక మేసిన;-విచ్చోఁ ద్రావినవి తోయ; మేఁగిన విచ్చోఁ;
నిచ్చోట మంద గొన్నవి;-యిచ్చోఁ బాసినవి జాడ; యిదె యిదె"యనుచున్.

క. కంజదళాక్షుఁడు వెదకెను-గొంజక, లేఁగల నపారగురుతృణవనికా
పుంజంబుల, భీకరమృగ-కుంజంబులఁ, దరుల, గిరులఁ, గొలఁకుల, నదులన్.

వ. అంత. 506

శా. "బాలుం డయ్యు నితం, డఘాసురుఁడు ద్రుంపన్, బాలురం గ్రేపులన్
ఏలీలన్ బ్రదికించె నొక్కొ? భువి నూహింపం గడుం జోద్య;" మం
చాలో నంబుజసంభవుండు చని, మాయాబాలు శుంభద్బలం
బాలోకింపఁ దలంచి, డాఁచె నొకచో నా లేఁగలన్, బాలురన్.

వ. ఆ సమయంబున దూడలువోయినజాడ యెఱుంగక, తప్పి, యప్పద్మలోచనుం డప్పటి కొలంకుకడకు వచ్చి, యచ్చోట నెచ్చెలులం గానక, వారిం జేరి. లే కుండుట నిశ్చయించి, గోవిందుండు విశ్వవిదుండు గావున "నిది విరించి మొఱం"గని యెఱింగి తిరిగి పోవుచు. 508

శా. వంచింపం బని లేదు బ్రహ్మకిచటన్; వత్సంబులన్, బాలురన్
వంచించెం [1]గనుఁబ్రామి; తన్ను మరలన్ వంచించు టాశ్చర్యమే?
వంచింపన్ మన కేల? తెచ్చుటకు నై వల్దం"చు, బ్రహ్మాండము
ల్వంచింపన్ మరలింప నేర్చుహరి లీలన్ మందహాసాస్యుఁ డై. 509

క. "గోపాలసుతులు లే"రని-గోపికలకుఁ జెప్ప నేల? "గోపాలకులన్,
గోపికలు నలర, బాలుర-క్రేపులరూపముల నేఁ జరించెద" ననుచున్. 510

1. మోసగించి.

మ. కరముల్, పాదములున్, శిరంబు, లవలగ్నాంబుల్, ముఖంబుల్, భుజాం
తరముల్, ముక్కులుఁ, గన్నులున్, శ్రవణముల్, దంతాదులున్, దండకాం
బర స్రగ్వేణువిషాణభూషణవయోభాషాగుణాఖ్యానత
త్పరతల్, పిడ్వడకుండఁ దాల్చి, విభుఁ డా వత్సార్భకాకారముల్. 511

క. రూపంబు లెల్ల నగు బహు-రూపకుఁ, డిటు బాలవత్సరూపంబులతో
నేపారు టేమి చోద్యము?-రూపింపఁగ నతని కితరరూపము గలదే? 512

క. "మరలుపు" మనియెడు కర్తయు; మరలించుకుమారకులును, మరలెడిక్రేపుల్,
పరికింప దాన యై, హరి-మరలం జనె లీలతోడ మందకు నధిపా! 513

వ. ఇట్లు బాలవత్సరూపంబులతో విహరించుచు మందకు వచ్చి, వారివారిదొడ్ల
నయ్యై వత్సరంబుల [1]ముందటికందువల నిలిపి, తత్తద్బాలరూపంబున, నందటి
గృహంబులం బ్రవేశించి, వేణునాదంబులు సేసిన. 514

చ. కొడుకులవేణునాదములు గొబ్బున వీనులకుం బ్రియంబు లై
ముడివడ, లేచి యెత్తికొని, మూర్కొని, తల్లులు గౌఁగిలించుచుం,
జడిగొనఁ జేఁపు వచ్చి తమచన్నులయందు సుధాసమంబు లై
వెడలెడి పాలు, నిండుకొను వేడుక నిచ్చిరి తత్సుతాళికిన్. 515

వ. మఱియుఁ దల్లు లుల్లంబులఁ బెల్లుగ [2]వెల్లిగొను వేడుకలం, దమనందనులకు
నలుంగు లిడి, మజ్జనంబులు గావించి, గందంబు లలంది, తొడవులు దొడిగి,
నిటల తటంబుల రక్షాతిలకంబులు పెట్టి, సకలపదార్థసంపన్నంబు లయిన
యన్నంబు లొసంగి, సన్నములు గాని మన్ననలు సేసిరి. 516

క. ఏతల్లుల కేబాలకు-లే తెఱఁగునఁ దిరిగి, ప్రీతి నెసఁగింతురు ము,
న్నాతల్లుల కాబాలకు-లా తెఱఁగునఁ బ్రీతిఁ జేసి; రవనీనాథా! 517

వ. ఆసమయంబున. 518

ఉ. పాయనివేడ్కతో, నునికిపట్టులకుం జని, గోవు లెల్ల 'నం
బే' యని చీరి, హుమ్మనుచుఁ బేరిచి, మూర్కొని, పంచితిల్లి, పె
ల్లై, యతిరేక మై, పొదుగులం దెడలేక స్రవించుచున్న పా
లా యెడ నాకుచున్, సుముఖ లై యొసఁగెన్ నిజవత్సకోటికిన్. 519

క. క్రేతలకును, గోవులకును-[3]మాతృత్వము సాలఁ గలిగె; మఱి మాధవు పై
మాత లని, హరియు నిర్మల-కౌతూహల మొప్పఁ దిరిగెఁ, గడుబాల్యమునన్.

ఆ. ఘోషజనుల కెల్లఁ గుఱ్ఱలపై వేడ్క-పూఁటపూఁట కెలమిఁ బొటకరించె;
నిచ్చ క్రొత్త యగుచు నీరజాక్షునిమీఁద-వేడ్క దమకుఁ దొల్లి వెలసినట్లు.

1. పూర్వపుస్థానములయందు. 2. ఉప్పొంగునట్టి. 3. తల్లిభావము.

వ. ఇట్లు కృష్ణుండు బాలవత్సరూపంబులు దాల్చి, తన్నుఁ దాన రక్షించుకొనుచు, మందను వనంబున సమందమహిమంబున నొక్కయేఁడు క్రీడించె; నాయేటికి నై దాఱుదినంబులు [1]కడమపడియుండ, నం దొక్కనాఁడు బలభద్రుండును, దానును వనంబునకుం జని, మందచేరువ లేఁగల మేప, నతిదూరంబునం గోవర్ధనశైలశిఖరంబున ఘాసంబులు గ్రాసంబులు గొనుచున్న గోవు, లాలేఁగలం గని. 522

చ. ముదమున హుంకరించుచును, మూఁపులపై మెడ లెత్తి చాఁచుచుం,
బదములు నాల్గు రెం డయిన బాగుగఁ గూడఁగఁ బెట్టి దాఁటుచున్,
వదనములన్ విశాలతరవాలములన్ వడి నెత్తి పాఱి, యా
మొదవులు చన్నులం గుడిపె, మూతుల గ్రింగెడి భంగి నాకుచున్. 523

వ. అంత గోపకులు గోవుల వారింప నలవి గాక, దిగ్గన నలుకతోడిసిగ్గు లగ్గలంబుగ, దుర్గమమార్గంబున వానివెంట నంటి, వచ్చి, లేఁగల మేపుచున్న కొడుకులం గని. 524

ఉ. "అయ్యలఁ గంటి" మంచుఁ బులకాంకురముల్ వెలయంగఁ, గుఱ్ఱలం
జయ్యన డాసి, యెత్తుకొని, సంతస మందుచుఁ గౌఁగిలించి, తా
రయ్యెడ నొడలల్ మనములారఁగ మూర్కొని, ముద్దు సేయుచున్
దయ్య మెఱుంగు! గోపకులు దద్దయు నుబ్బిరి నిబ్బరంబుగన్. 525

వ. ఇట్లు బాలకాలింగనంబుల నానందబాష్పపూరితనయనులై, గోపకులు గోవుల మరలించుకొని తలంగి చన, వారలం జూచి, బలభద్రుండు దనలో నిట్లని తలంచె. 526

సీ. "చన్ను మానినయట్టి[2]శాబకశ్రేణిపై గోగణంబులకును, గోపకులకు,
నిబ్బంగి వాత్సల్య మెబ్బంగి నుదయించె? హరిఁ దొల్లి మన్నించునట్లు వీరు
మన్నించుచున్నారు మమతఁ జేయుచుఁ; బ్రీతి నంబుజాక్షునిఁ గన్నయట్లునాకుఁ
బ్రేమ మయ్యెడి; [3]డింభబృందంబుఁ గనుఁగొన్న, నిది మహాద్భుత మెందు; నెఱుఁగ [రాదు.
తే. మనుజదైవతదానవమాయయొక్కొ?
కాక నాథ ర్త యగుచున్న కమలనయను
మాయయో? కాక యితరులమాయ నన్నుఁ
గలఁప నోపదు; విభుమాయ గాఁగనోపు?" 527

క. అని మున్ను ముగ్ధుఁడయ్యును- దనయందులదివ్యదృష్టి దప్పక బుద్ధిం
దన చెలికాండ్రను గ్రేపుల-"వనజాక్షుం"డనుచుఁ జూచె వసుధాధీశా! 528

---

1. తక్కువపడి. 2. దూడలయొక్క సముదాయముమీఁద. 3. బాలకులయొక్క సముదాయము.

వ. ఇట్లు విజ్ఞానదృష్టిం జూచి, యెఱింగియు నప్పుడ, బలదేవుండు గొందలంపడుచుఁ గృష్ణుం జూచి, "మహాత్మా! తొల్లి యెల్లక్రేపులును ఋషులయంశంబనియును, గోపాలకులు వేల్పులయంశంబనియును, దోఁచుచుండు; నిపుడు వత్సబాలకసందోహంబు సందేహంబు లేక, నీవ యని తోఁచుచున్న; "దిదియేమి?" యని యడిగిన నన్నకు నున్నతూపు వెన్నుండు మన్నన సేసి, క్రన్నన యెఱింగించె; నతండు నెఱింగె; నివ్విధంబున హరి బాలవత్సంబులు దానయై సంచరించిన యేఁడు విరించికిఁ [1]దనమానంబున నొక్కత్రుటిమాత్రంబయిన, విరించి చనుదెంచి, వత్సబాలకాకారుం డైన కృష్ణబాలకుం జూచి, వెఱంగుపడి యిట్లని వితర్కించె. 529

శా. "మందం గల్గిన వత్సబాలకులు, నా మాయాగుహాసుప్తులై
యెందుం బోవరు; లేవ రిప్పుడును; వేఱే చేయ నాకన్యులొం
డెందున్ లేరు విధాతలుం; బరులు వీ; రెవ్వార? లెక్కైరొకో?
యెందే తెంచిరొ కృష్ణుతో మెలఁగువా? రేఁడయ్యెడిన్, నేఁటికిన్. 530

మత్తకోకిలము. బ్రహ్మపంపునఁ గాని, పుట్టదు ప్రాణిసంతతి యెప్పుడున్;
బ్రహ్మ నొక్కఁడఁగాని, వేఱొక బ్రహ్మ లేఁడు సృజింపఁగా;
బ్రహ్మ నేను సృజింప, నొండొక బాలవత్సకదంబమే
బ్రహ్మమందు జనించె? నొక్కట బ్రహ్మమా నది చూడఁగాన్." 531

వ. అని యిట్లు సకలంబును సుకరంబున నెఱింగెడి నెఱవాదిముదుక, [2]యెఱుక గలప్రోడ, వెఱంగుపడి గ్రద్దనఁ బెద్దప్రొద్దు దద్దయుం దలపోసి, కర్జంబు మందల యెఱుంగక, కొందలంపడుచు నాందోళనంబున. 532

క. "మోహము లేక జగంబుల-మోహింపఁగఁ జేయ నేర్చి, మొనసిన విష్ణున్
మోహింపించెద" ననియెడు-మోహమున విధాత దాన మోహితుఁడయ్యెన్.

తే. పగలు ఖద్యోతరుచి చెడుపగిది, రాత్రి-మంచు చీఁకటి లీనమై మాయుమాడ్కి,
విష్ణుపై నన్యమాయలు విశదమగునె?-చెడి నిజేశులగరిమంబుఁ జెఱుచుఁగాక!

వ. మఱియును. 535

క. పుట్టితి; బుద్ధి యెఱింగితిఁ;-బుట్టించితి జగము; సగము వోయెను బ్రాయం;
బిట్టివి నూతనసృష్టులు-పుట్టుట లే; దార! యిట్టి[3]బూమెలు భూమిన్." 536

వ. అని, యిట్లు దలవాకిట [4]వాణి గల పోఁడిమిచే వాఁడిమి కెక్కిన నలుమొగంబుల తక్కరిగొంటు, పెనుదంట పలువెంటలం దనమనంబున వితర్కించి, విచారిం

1. తన ఆయుఃపరిమితి, ప్రమాణము. 2. జ్ఞానముగల నేర్పరి. 3. చిత్రములు.
4. సరస్వతి.

చునెడ, నతండు గనుంగొనుచుండ, నబ్బాలకులు మేఘశ్యాములును, హార
కుండల కిరీటవనమాలికాభిరాములును, శ్రీవత్స మంగళాంగద నూపుర కనక
కటక కంకణ కటిఘటితకాంచీగుణోద్దాములును, నాపాదమస్తకతులసీదళ
దాములును, విలస దంగుళీయక స్తోములును, శంఖచక్రగదాకమలహస్తులును,
గరుణాకటాక్షవీక్షణ విలాసులును, రవికోటిభాసులును, ననంతసచ్చిదానంద
రూపమహితులును, నణిమాదిగుణోపేతులును, విజాతీయభేదరహితులును,
శ్రీమన్నారాయణప్రతిమాన విగ్రహస్వరూపులును నయి, తమకుం బరతంత్రు
లగుచు, నృత్తగీతాదిసేవా విశేషంబులకుం జొచ్చి, మెలంగుచు మూర్తి
మంతంబులయిన బ్రహ్మాదిచరాచరంబులు, నణిమాదిసిద్ధులును, మాయాప్రము
ఖంబులైన శక్తులును, [1]మహదాది చతుర్వింశతితత్త్వంబులును, గుణక్షోభ
కాలపరిణామ హేతుసంస్కారకామకర్మ గుణంబులు సేవింప, వేదాంతవిదుల
కైన నెఱుంగరాని తెఱంగున మెఱయుచుం గానంబడిన, వారలం గనుంగొని.

ఉ. "బాలురఁ గంటి; నాచెయిదిఁ బాసినవారిని, మున్ను వారి నేఁ
బోలఁగఁ జూచునంతటన, భూరినిరర్గళదుర్గమప్రభా
జాలముతోడఁ జూపులకుఁ జాలమిఁ దెచ్చుచు నున్నవార; లే
మూలమొ! మార్గమెయ్యదియొ? మోసము వచ్చెఁ గదే విధాతకున్?" 538

వ. అని సకలేంద్రియంబులకు వెక్కసంబయిన స్రుక్కి. 539

ఉ. ఏపరమేశు తేజమున నీసచరాచరమైన లోకము
దీపితమయ్యె; నట్టివిభు తేజముఁ గన్నులఁ జక్కఁ జూడఁగా
నోపక, పారవశ్యమును నొందుచు సంస్తిమితాఖిలేంద్రియుం
డై, పరమేష్ఠి మైమఱచె నప్పుడు చిత్రపురూపుకైవడిన్. 540

వ. ఇట్లు మాయాతీతుండును, వేదాంతవిజ్ఞానదుర్లభుండును, స్వప్రకాశానందుం
డును, నైన తనబాహుళ్యంబుఁ జూచి, నివ్వెఱపడిన బ్రహ్మం గని
యీశ్వరుండు. 541

శా. "బాలుండై, చతురాననుండు తన యీబ్రహ్మాభిమానంబునన్
లోలుండై, మతి దప్పి, నామహిమ యాలోకింప నేతెంచెఁ; దా
నాలోకింపఁగ నెంతవాఁ?" డనుచు మాయాజాలమున్ విప్పి, త
ల్లీలారూపము లెల్ల డాఁచె, నటఁ గేళీచాతురీధుర్యుఁడై. 542

వ. అంతలోన నజీవుండు సజీవుండైన తెఱంగున, నెనిమిది కన్నులు గలవేలుపు
గమికాఁడు లేచి [2]తెప్పిరి, కాలుఁ గేలుఁ గదలించి, చెచ్చెరం గన్నులు

1. మహత్తు మొదలగు ఇరువదినాలుగు తత్త్వములు. 2. మెలఁకువను బొంది.

వచ్చి, చూడ సమర్థుం డై ముందటఁ గని, వెనుకఁ జూచి, దివి విలోకించి, దిక్కులు వీక్షించి, యెల్లయెడలం గలయ దర్శించి, తనపురోభాగంబున హరి సంచరించుటం జేసి, జాతివైరంబులు లేని నరపశుమృగాదులకు నాటపట్టయి, సిరి గలిగి, కామక్రోధాది రహితులకు జీవనం బైన బృందావనంబుం బొడ గాంచి, యందు. 543

సీ. తన కన్యములు లేక తనరారి ముమ్మూలవిభుఁ డయ్యుఁ గ్రేపుల వెదకువాని, నఖిలజ్ఞుఁ డై యొక్కఁ డయ్యు [1]నజ్ఞాకృతిఁ జెలికాండ్రఁ బెక్కండ్రఁ జీరువాని, బహిరంతరాద్యంతభావశూన్యుం డయ్యు నంతంత నడుగుచూ ప్వరయువాని, గురుగభీరుం డయ్యు గురువులు వాఱుచు నట్టిట్టుఁ బాతరలాడువాని,
ఆ. జాతిరహితుఁ డయ్యు జతురగోపార్భక-భావ మెల్ల నచ్చువడిన మేని చెలువువాని, [2]హ స్తశీతాన్నకబళంబు-వానిఁ, గాంచె నపుడు వాణిమగఁడు.

వ. కని, సంభ్రమించి, విరించి, రాయంచ డిగ్గ నుఱికి, కనకదండసుకుమారం బైన శరీరంబుతోడ నేలం జాఁగిలంబడి, మణిగణసుప్రకాశంబు లైన తన కిరీటశిఖర ప్రదేశంబు లా కుమారునిపాదపద్మంబులు మోవ మ్రొక్కి, తోరంబు లగు నానంద బాష్పజలపూరంబుల నతనియడుగులు గడిగి, మఱియును. 545

క. అడుగులపైఁ బడు, లేచుం-బడుఁ గ్రమ్మఱ, లేచు, నిట్లు భక్తిన్, మును తాఁ బొడగనిన పెంపుఁ దలఁచుచు-నుడుకని మహిమాబ్ధి నజుఁడు నుడు కడిచె నృపా!

వ. అంత నల్లనల్లన లేచి, నిలుచుండి, నయనారవిందంబులు దెఱచి, గోవిందుని సందర్శించి, చతుర్ముఖుండు ముఖంబులు వంచి, కృతాంజలి యై దిగ్గన [3]డగ్గుత్తిక యిడుచు నేకచిత్తంబునఁ జతుర్ముఖంబుల ని ట్లని స్తుతియించె. 547

సీ. "శంపాలతికతోడిజలదంబు కై వడి మెఱుఁగుటొల్లియతోడి మేనివానిఁ, గమనీయమృదులాన్నకబళవేత్రవిషాణవేణుచిహ్నంబులు వెలయువానిఁ, గుంజావినిర్మితకుండలంబులవాని శిఖిపింఛవేష్టితశిరమువాని, వనపుష్పమాలికా వ్రాతకంఠమువాని నలినకోమలచరణములవానిఁ,
ఆ. గరుణ గడలుకొనినకడగంటివాని గో-పాలబాలుభంగిఁ బరఁగువానిఁ, నగుమొగంబువాని, ననుఁ గన్నతండ్రిని-నిను భజింతు మ్రొక్కి నీరజాక్ష!

మ. నను మన్నించి, భవజ్జనంబులకు నానందంబు నిండించు నీ తనురూపం, బిదె నామనంబున కచింత్యం బయ్యె; నీయుల్లస ద్ఘనవిశ్వాకృతి నెవ్వఁ డోపు నెఱుఁగం? గైవల్య మై యొప్పు, నా త్మనివేద్యం బగు నీమహైభవముచందం బెట్టిదో? యీశ్వరా! 549

1. ఏమియుఁదెలియనివానివలె. 2. చేతియందుండు చలిదియన్నపు ముద్దగలవానిని.
3. తడఁబడుచున్నధ్వని.

క. విజ్ఞానవిధము లెఱుఁగక-[1]తజ్జ్ఞులు నీవార్తఁ జెప్పఁ, దనువాఙ్మనముల్
యజ్ఞేశ! నీకు నిచ్చిన-యజ్ఞులు; నినుఁ బట్టి గెలుతు; రజితుండ వైనన్. 550

క. శ్రేయములు గురియు భక్తిని-జేయక, కేవలము బోధసిద్ధికిఁ దపముం
జేయుట విఫలము; పొల్లున-నాయము సేకుఱునె తలఁప నధికంబైనన్? 551

క. నిజముగ నిన్నెఱుఁగఁగ, మును-నిజవాంఛలు నిన్నుఁ జేర్చి, నీకథ వినుచున్,
నిజకర్మలబ్ధభక్తిన్-సుజనులు నీ మొదలిటెంకిఁ జొచ్చి; రధీశా! 552

సీ. విక్రియాశూన్యమై, విషయిత్వమును లేని దగుచు నాత్మాకార మై, తనర్చు
నంతఃకరణ మొక్క యధికసాక్షాత్కారవిజ్ఞానమునఁ బట్టి, వేఱొరులకు
నెఱుఁగంగరాని దై, యేపారి యుండుటఁ జేసి, నీనిర్గుణశ్రీవిభూతి
బహిరంగవీథులఁ బాఱక దిరము లై, యమలంబు లగు నింద్రియములచేత
ఆ. నెట్టకేలకైన నెఱుఁగంగ నగుఁ; గాని,-గుణవిలాసి వగుచుఁ గోమరుమిగులు
నీగుణవ్రజంబు నేరరా దెఱుఁగంగ;-నొక్కమితము లేక యుంట నీశ! 553

క. తారా[2]తుషారశీకర-భూరజముల కైన లెక్క బుధు లిడుదురు; భూ
భారావతీర్ణకరుఁ డగు-నీ రమ్యగుణాలి నెన్న నేర; రగణ్యా! 554

శా. "ఏవేళం గృపఁ జూచు? నెన్నఁడు హరిన్ వీక్షింతు?" నం చాఢ్యుఁ డై
నీవెంటం బడి, తొంటికర్మచయముల్ నిర్మూలముం జేయుచున్,
నీవాఁడై, తనువాఙ్మనోగతుల ని న్సేవించు విన్నాణి వో
కైవల్యాధిపలక్ష్మి నుద్దవడిఁ దాఁ గైకొన్నవాఁ; డీశ్వరా! 555

ఉ. మాయలఁ గల్గువారలను, మాయలఁ బెట్టెడిప్రోడ! నిన్ను నా
మాయఁ గలంచి, నీమహిమమానముఁ జూచెద; నంచు నేరమిం
జేయఁగఁ బూనితిం; గరుణ సేయుము; కావుము యోగిరాజవా
గ్గేయ! దవాగ్నిఁ దజ్జనితకీలము గెల్చి, వెలుంగ నేర్చునే? 556

సీ. సర్వేశ! నే రజోజనితుండ; మూఢుండఁ, బ్రభుఁడ, నేనని వెఱ్ఱి[3]ప్రల్లదమున
గర్వించినాఁడను; గర్వాంధకారాంధనయనుండఁ; గృపఁ జూడు ననుఁ; బ్రధాన
మహదహంకృతినభోమరుదగ్నిజలభూమిపరివేష్టితాండకుంభంబులోన
నేడుజేనలమేన నేనయునే నెక్కడ? నీదృగ్విధాండంబు లేరి కైన
తే. సంఖ్య సేయంగరానివి; సంతతంబు-నోలిఁ బరమాణువులభంగి నొడలిరోమ
వివరములయందె వర్తించు; విపులభాతి-నెనయుచున్న నీ వెక్కడ? నెంత కెంత?

తరలము. కడుపులోపల నున్న పాపఁడు గాలఁ దన్నినఁ గిన్కతో
నడువఁ బోలునె? క్రాఁగి తల్లికి నాథ! సన్నము దొడ్డు నై

1. తెలిసినవారు. 2. మంచుతుంపురులు. 3. గర్వము.

యడఁగి, కారణకార్యరూపము లైన యీ సకలంబు, నీ
కడుపులోనిది గాదె? పాపఁడఁ గాక! నే మఱి యెవ్వఁడన్? 558

క. భూరిలయజలధినిద్రిత-నారాయణనాభికమలనాళమున నజుం
డారయఁ బుట్టె ననుట నిజ; మో రాజీవాక్ష! పుట్టె నోటు తలంపన్. 559

సీ. నళినాక్ష! నీ వాదినారాయణుండవు; జలము నారము; జీవచయము నార;
మందు నీ వుంట, నీయందవి [1]యుంటను, నారాయణుం డను నామ మయ్యె;
సకలభూతములకు సాక్షి; వధీశుండ; వబ్ధి నిద్రించు నారాయణుండ!
నీమూర్తి యది; నీకు నిజమూర్తియనరాదు; నలిననాళము త్రోవ నడచి, మున్న
తే. కడఁగి, నూఱేండ్లు వెదకి, నేఁ గాన నయితి-నేక దేశస్థుఁడవు గా; వనేకరుచివి;
జగములో నుందు; నీలోన జగములుండు-నరుదు నీమాయ నెట్లైన నగుచునుండు.

మ. విను మో యీశ్వర! వెల్వలఁ వెలుఁగు నీవిశ్వంబు నీమాయ గా
క, నిజం బైన యశోద యెట్లు గనియెం? గన్నార నీకుక్షిలోఁ
గనెఁబో; క్రమ్మఱఁ గాంచెనే [2]భవదపాంగశ్రీఁ; బ్రపంచంబు చ
క్కన లోనా; వెలి యౌను; లోను వెలియుం గాదే దదన్యం బగున్. 561

మ. ఒకఁడై యుంటివి, బాలవత్సములలో నొప్పారితీ, వంతటన్
సకలోపాసితులై చతుర్భుజులు నై సంప్రీతితోఁ గొల్వఁగాఁ
బ్రకటశ్రీగలవాఁడ వైతి; వటపై బ్రహ్మాండముల్ సూపి, యొ
ల్లక యిట్లొక్కఁడ వైతి; నీవివిధలీలత్వంబుఁ గంటిం గదే! 562

క. ఎఱిఁగినవారికిఁ దోఁతువు-నెఱిఁ బ్రకృతిం జేరి జగము నిర్మింపఁగ, నా
తెఱఁగున రక్షింపఁగ, నీ-తెఱఁగునఁ బ్రహరింప రుద్రు తెఱఁగున నీశా! 563

క. జలచరమృగభూసురనర-కులముల జన్మించి తీవు; కుజనులఁ జెఱుపం
జెలిమిని సుజనుల [3]మనుపను-దలపోయఁగ రాదు నీవిధంబు; లనంతా! 564

ఆ. ప్రబ్బుగొలిపి, యోగమాయ నిద్రించిన-యో పరాత్మభూమ! యోగిరాజ!
యే తెఱంగు, లెన్ని, యెప్పు, డెచ్చోట నీ-హేల లెవ్వఁ డెఱుఁగు? నీశ్వరేశ!

సీ. అది గాన నిజరూప మనరాదు; కలవంటి దై, బహువిధదుఃఖ మై, విహీన
సంజ్ఞాన మై, యున్న జగము సత్సుఖబోధతనుఁడ వై, తుది లేక తనరు నీదు
మాయచేఁ బుట్టుచు, మనుచు, లే కుండుచు, నున్న చందంబున నుండుచుండు;
నొకఁడ; వాత్మఁడ; వితరోపాధిశూన్యుండ; వాద్యుండ; వమృతుండ; వక్షరుండ;
ఆ. వద్వయుండవును; స్వయంజ్యోతి; వాపూర్ణుఁ
డవు; పురాణపురుషుఁడవు; నితాంత

1. ఉండుటచేతను. 2. నీక్రఁగంటిచూపు అను సంపద. 3. రక్షింపఁగా.

సౌఖ్యనిధివి; నిత్యసత్యమూర్తివి; నిరం
జనుఁడ; వీవు దలఁపఁజనునె నిన్ను? 566

వ. దేవా! యిట్టి నీవు జీవాత్మస్వరూపుండవును, సకలాత్మలకు నాత్మయైన పరమాత్మ స్వరూపకుఁడవు, నని యెవ్వ రెఱుంగుదురు, వారు గదా గురు వని యెఱు జనకరునివలనఁ బ్రాప్తంబైన యుపనిషదర్థజ్ఞానం బను సునేత్రంబునం జేసి, సంసారమిథ్యా సాగరంబుఁ దరించినచందంబున నుండుదురు; రజ్జువందు రజ్జు వని యెఱింగెడి యెఱుక లేకుండ, నయ్యెఱుంగమి, నది సర్పరూపంబయి తోఁచినపిదప నెఱింగిన వారివలన [1]రజ్జువు రజ్జు వని యెఱుంగుచుండ, సర్పరూపంబు లేకుండుకైవడి, నాత్మ యప్పరమాత్మ యని, యెవ్వ రెఱుంగరు, వారి కయ్యెఱుంగమివలన సకలప్రపంచంబు గలిగి తోఁచు; నాత్మ యప్పరమాత్మ యని యెవ్వ రెఱుంగుదురు; వారి కయ్యెఱుకవలనఁ బ్రపంచంబు లేకుండు; నజ్ఞానసంభావితనామకంబులైన సంసార బంధమోక్షంబులు జ్ఞానవిజ్ఞానంబులలోనివి గావు; కావునఁ [2]గమలమిత్రున కహోరాత్రంబులు లేని తెఱంగునఁ, బరిపూర్ణజ్ఞానమూర్తి యగు నాత్మయందు నజ్ఞానంబు లేమిని బంధంబును, సుజ్ఞానంబు లేమిని మోక్షంబును లే; వాత్మవైన నిన్ను దేహాదికం బని తలంచియు, దేహాదికంబు నిన్నుఁగాఁ దలంచియు, నాత్మ వెలినుండు నంచు, మూఢులు మూఢత్వంబున వెదకుచుందురు; వారిమూఢత్వంబుఁ జెప్పనేల? బుద్ధిమంతులై పరతత్త్వంబుగాని జడంబును నిషేధించుచున్న సత్పురుషులు తమ శరీరంబులయందు నిన్నరయుచుందు; రది గావున. 567

శా. దేవా! నీచరణప్రసాదకణలబ్ధిం గాక లేకున్న నెం
డేవెంటం జను? నీమహామహిమ నూహింపంగ నెవ్వారికిన్?
నీవారై చనువారిలో నొకఁడనై, నిన్ గొల్చుభాగ్యంబు నా
కీవే; యిప్పటిజన్మమం దయిన నేం డెందైన; నో యీశ్వరా! 568

తరలము. క్రతుశతంబులఁ బూర్ణకుక్షివి కాని, నీవిటు క్రేపులున్
సుతులునై - చనుఁబాలు ద్రావుచుఁ, జొక్కియాడుచుఁ, గౌతుక
స్థితిఁ జరింపఁగఁ, దల్లులై విలసిల్లు గోవుల, గోపికా
సతులధన్యత, లెట్లు సెప్పఁగఁ జాలువాఁడఁ? గృపానిధీ! 569

క. పరిపూర్ణంబుఁ, బురాణముఁ-బరమానందంబునైన బ్రహ్మమె, చెలికాఁ
[3]డరు దరుదు! నందఘోష-స్థిరజనములభాగ్యరేఖ చింతింపంగన్. 570

సీ. ఏకాదశేంద్రియాధీశులు చంద్రాదు, లేను, ఫాలాక్షుండు, నిట్లు నూడఁ
బదుమువ్వురము, నెడపడక యింద్రియపాత్రముల నీపదాంభోజముల మరంద

1. త్రాడు. 2. సూర్యుఁడు. 3. ఆశ్చర్యమాశ్చర్యము.

మమృతంబుగాఁ ద్రావి, యమరనేకైకేంద్రియాభిమానులమయ్యు, నతికృతార్థ
భావుల మైతిమి; పరఁగ సర్వేంద్రియవ్యాప్తులు నీమీఁద వ్రాల్చి, తిరుగు

తే. గోపగోపికాజనముల గురువిశేష-భాగ్యసంపదఁ దలపోసి, ప్రస్తుతింప
నలవి గా దెవ్వరికి నైన; నంబుజాక్ష! భక్తవత్సల! సర్వేశ! పరమపురుష!

శా. ఏలా బ్రహ్మపదంబు? వేదములకున్ వీక్షింపఁగా రాని ని
న్నిలోకంబున, నేవనాంతరమునం, దీమందలోఁ, 'గృష్ణ' యం
చాలాపాదిసమస్తభావములు నీయందే సమర్పించు నీ
వ్రేలం, దొక్కనిపాదరేణువులు పై వేష్టించినం జాలదే? 572

మ. 'నిను హింసించినపూతనాదులకు, మున్ నీమేటిసంకేత మి
చ్చిన నీకుం, బురదారపుత్రగృహగో శ్రీప్రాణదేహాదులె
ల్లను వంచింపక, యిచ్చుగోపకులకున్, లక్షింప నేమిచ్చెదో?'
యని సందేహము దోఁచుచున్నది; ప్రపన్నానీకరక్షామణీ! 573

క. దేహము కారాగేహము-మోహము నిగళంబు; రాగముఖరములు రిపు
వ్యూహములు; భక్తితో ని-న్నూహింపనియంతతడవు; నో కమలాక్షా! 574

ఆ. ఆశ్రయించుజనులకానందసందోహ-మీఁదలంచి, వివిధ హేలతోడ
నప్రపంచకుండవయ్యుఁ, బ్రపంచంబు, వెలయఁజేయు దీవు; విశ్వమూర్తి! 575

క. ఎఱిఁగినవారికి యెఱుంగమి-యెఱుఁగమె? బహుభాష లేల? యీశ్వర! నీపెం
పెఱుఁగ మనోవాక్కులకున్-గుఱి సేయం గొలఁది గాదు; గుణరత్ననిధీ! 576

క. సర్వము నీవ యెఱుంగుదు-సర్వవిలోకనుఁడ వీవ; జగదధిపతివిన్;
సర్వాపరాధు నను నో-సర్వేశ! యనుగ్రహింపు; చనియెద నింకన్. 577

క. జిష్ణు, నిశాటవిపాటన-వృష్ణికులాంభోజసూర్య! విప్రామరగో
వైష్ణవసాగరహిమకర!-కృష్ణా! పాషండధర్మగృహదావాగ్నీ! 578

వ. దేవా! నీకుఁ గల్పపర్యంతంబు నమస్కరించెద"నని యివ్విధంబున సంస్తుతించి,
మూమ్మాఱు వలగొని, పాదంబులపైఁబడి, వీడ్కొని, బ్రహ్మ దననెలవునకుం
జనియె; నతని మన్నించి, భగవంతుండైన హరి తొల్లి చెడి తిరిగి వచ్చిన
వత్సబాలకులం గ్రమ్మఱం గైకొని, పులినంబుకడఁ జేర్చె; నిట్లు. 579

క. క్రించుతనంబున విధి దము-వంచించినయేఁడు గోపవరనందను లొ
క్కించుక కాలంబుగ నీ-క్షించిరి; రాజేంద్ర! బాలకృష్ణునిమాయన్. 580

ఆ. "ఏహోమత్మమాయ,నీ విశ్వమంతయు-మోహితాత్మకమయి, మునిఁగి యుండు;
నట్టి విష్ణుమాయ నర్భకు లొక్కయేఁ, డెఱుఁగకుండి రనుట యేమి వెఱఁగు?

వ. అప్పుడు. 582

మ. 'చెలికాండ్రా! యరుదెంచితే; యిచటికిన్, సేమంబునం గ్రేపులున్
నెలవుల్ సేరెఁ; నరణ్యభూమివలనన్ నీవచ్చునందాఁకఁ, జ
ల్దులు వీరించుక యెవ్వరుం గుడువ; రాలోకింపు; ర'మ్మంచు, నా
జలజాక్షుండు నగన్ భుజించి, రచటన్ సంభాషలన్ డింభకుల్. 583

వ. ఇట్లు బాలకులతోడఁ జల్ది గుడిచి, వారలకు నజగరచర్మంబు సూపుచు, వనంబున
నుండి తిరిగి. 584

పంచచామరము. ప్రసూనపింఛమాలికాప్రభావిచిత్రితాంగుఁడుం,
బ్రసిద్ధశృంగవేణునాదపాశబద్ధలోకుఁడుం,
బ్రసన్నగోపబాలగీతబాహువీర్యుఁడయ్యు, ను
ల్లసించి యేఁగె గోపకుల్ సెలంగి చూడ మందకున్. 585

వ. ఆసమయంబున. 586

క. 'పెనుఁబాము దమ్ము మ్రింగిన-మననందసుతుండు పాము మర్దించి, మమున్
మనిచె నరణ్యములోపల'-నని, ఘోషించిరి కుమారు లాఘోషములోన్." 587

వ. అనిన విని, నరేంద్రుండిట్లనియె. 588

క. "కని మనిచి, యెత్తి పెంచిన-తనుజన్ములకంటె నందతనయుం డా ఘో
షనివాసులకు మనోరం-జనుఁ డెట్లయ్యెను? బుధేంద్ర! చను నెఱిఁగింపన్."

వ. అనిన శుకుం డి ట్లనియె. 590

సీ. "అఖిలజంతువులకు నాత్మ వల్లభుఁ డైనభంగి, బిడ్డలు నిండ్లుఁ బసిఁడి మొదలు
వస్తువు లెవ్వియు వల్లభంబులు గావు; సకలాత్మకుండైన జలజనేత్రుఁ
డఖిలజంతువులకు నాత్మ; గావున ఘోషవాసులకెల్లను వల్లభత్వ
మునను మిక్కిలి యొప్పె; మూఁడులోకములకు హితము సేయఁగ జలజేక్షణుండు

ఆ. మాయతోడ మూర్తిమంతుఁడై యొప్పారుఁ;-గలఁడతండు నిఖిలగణములందు;
'భవతి' ధాతు వెట్లు, భావార్థమై, సర్వ-ధాతుగణమునందుఁ దనరు; నట్లు. 591

క. శ్రీపతిపద మను నావను-బ్రాపించి, భవాబ్ధి వత్సపదముగ ధీరుల్
రూపించి, దాఁటి చేరుదు-రాపత్పదరహితు లగుచు, నమృతపదంబున్. 592

ఆ. అఘునిఁ జంపి, కృష్ణుఁ డాప్తులుఁ దానును-జల్ది గుడిచి, జలజసంభవునకుఁ
జిద్విలాస మైన చెలువు సూపిన కథఁ-జదువ వినినఁ గోర్కి సంభవించు."

వ. అని చెప్పి, మఱియు వ్యాసనందనుం డిట్లనియె. 594

క. "రాగంబున బలకృష్ణులు-పౌగండవయస్కు లగుచుఁ, బశుపాలకతా
యోగంబున, బృందావన-భాగంబునఁ గాచి రంతఁ బశువుల నధిపా! 595

వ. అయ్యెడఁ గృష్ణుం డొక్కనాఁడు రేపకడ లేచి, వేణువు పూరించి, బలభద్రస
హితుండై, గోపకుమారులు దన్ను బహువారంబులు గైవారంబులు సేయ,
మ్రోల నాలకదుపుల నిడికొని, నిరంతరఫలకిసలయకుసుమంబులును, గుసుమమ
కరందనిష్యందపానానందదిందిందిరకదంబంబును, గదంబాదినానాతరులతా
గుల్మసంకులంబును, కులవిరోధరహితమృగపక్షిభరితంబును, భరితసరస్సరో
దహపరిమిళితపవనంబును, నయిన వనంబుఁ గని, యందు వేడుకం గ్రీడింప
నిశ్చయించి, వెన్నుం డన్నకిట్లనియె. 596

శా. "శాఖాపుష్పఫలప్రభారనతలై, చర్చించి "యో దేవ! మా
శాఖిత్వంబు హరింపు" మంచు శుకభాషన్ నీ కెఱింగించుచున్,
శాఖాహస్తములం బ్రసూనఫలముల్ సక్కన్ సమర్పించుచున్,
శాఖిశ్రేణులు నీపదాబ్జముల కోజన్ మ్రొక్కెడిం జూచితే? 597

సీ. నిఖిలపావన మైన నీకీర్తిఁ బాడుచు, నీతుమ్మెదలు వెంట నేఁగుదెంచె;
నడవిలో "గూఢుండ వై నయీశుఁడ" వని, [1]ముసరి కొల్వఁగ వచ్చె మునిగణంబు;
నీలాంబరములోడ "నీవు జీమూతమ" వని, నీలకంఠంబు లాడఁదొడఁగెఁ;
బ్రియముతోఁ జూచుగోపికలచందంబున నినుఁ జూచె నదె! హరిణీచయంబు;
ఆ. నీవు విందవనుచు, నిర్మలసూక్తులు-వలుకుచున్న విచటఁ బరభృతములు;
నేఁడు విపినచరులు నీవు విచ్చేసిన-ధన్యు లైరిగాదె తలఁచి చూడ? 598

సీ. నీపాదములు సోఁకి, నేఁడు వీరుత్తృణపుంజంబుతో భూమి పుణ్య యయ్యె;
నీనఖంబులు దాఁకి, నేఁడు నానాలతాతరుసంఘములు కృతార్థంబు లయ్యె;
నీకృపాదృష్టిచే, నేఁడు నదీశైలఖగమృగంబులు దివ్యకాంతిఁ జెందె;
నీపెన్నురము మోవ, నేఁడు గోపాంగనాజనముల[2]పుట్టువు సఫల మయ్యె;"
ఆ. నని యరణ్యభూమి నంకించి, పసులను-మిత్రజనులు దాను మేపుచుండి,
నలినలోచనుండు, నదులందు, గిరులందు-సంతసంబు మెఱయ సంచరించె. 599

వ. మఱియు నయ్యీశ్వరుండు. 600

సీ. ఒకచోట మత్తాళియూథంబు ఝుమ్మని మ్రోయంగ, ఝుమ్మని మ్రోయుచుండు;
నొకచోటఁ గలహంసయూథంబుగూడి కేంకృతులు సేయంగఁ, గేంకృతులు సేయు
నొకచోట [3]మదకేకియూథంబు లాడంగ, హస్తాబ్జములు ద్రిప్పి యాడఁదొడఁగు;
నొకచోట వనగజయూథంబు నడవంగ, నయముతో మెల్లన నడవఁజొచ్చు;
ఆ. క్రౌంచచక్రముఖరఖగము లొక్కొక్కచోటఁ-బలుక, వానియట్ల పలుకుఁ గదిసి,
పులులసింహములనుబొడగని,యొకచోటఁ-బఱచుమృగములందుఁదఱచుగూడి.

1. ఆక్రమించి. 2. జన్మము. 3. మదించిన నెమిళ్ల గుంపు.

వ. మఱియును. 602

సీ. "రా పూర్ణచంద్రిక! రా గౌతమీ గంగ! రమ్ము భగీరథరాజతనయ!
రా సుధాజలరాశి! రా మేఘబాలిక! రమ్ము చింతామణీ! రమ్ము సురభి!
రా మనోహారిణి! రా సర్వమంగళ! రా భారతీదేవి! రా ధరిత్రి!
రా శ్రీమహాలక్ష్మి! రా మందమారుతి! రమ్ము మందాకిని! రా శుభాంగి!"

ఆ. యనుచు మఱియుఁ గలుగునాఖ్యలు గల గోవు-లడవిలోన దూరమందు మేయ,
ఘనగభీరభాషఁ గడు నొప్పఁ జీరు, నా-భీరజనులు వొగడఁ బెంపు నెగడ. 603

క. కాంతారవిహారమ్ముల-శ్రాంతుం డై, గోపకాంకశయుఁ డగుచున్నన్
సంతుష్టిఁ బొందఁ జేయు, ని-రంతరకరచరణమర్దనాదుల నధిపా! 604

క. పాడుచు, నాడును, మందట-లాడుచు, నొండొరులఁ దాఁకు నాప్తులఁ గని, బి
ట్టాడుచుఁ, జేతుల వ్రేయుచుఁ-గ్రీడింతురు నగుచు, బలుఁడు గృష్ణుఁడు నొకచోన్.

వ. ఇవ్విధంబున. 606

సీ. వేదాంతవీథుల విహరించువిన్నాణి, విహరించుఁ గాంతారవీథులందు;
ఫణిరాజశయ్యపైఁ బవళించుసుఖభోగి, పల్లవశయ్యలఁ బవ్వళించు;
గురుయోగిమానసగుహలఁ గ్రుమ్మరుమేటి, గ్రుమ్మరు నద్రీంద్రగుహలలోనఁ;
గమలతోడఁ బెనంగి కడు [1]డయ్యుచతురుఁ, డాభీరజనులతోడఁ బెనఁగి డయ్యు;

ఆ. నఖిలలోకములకు నాశ్రయుం డగు ధీరుఁ-డలసి తరులనీడ నాశ్రయించు;
యాగభాగచయము లాహరించుమహాత్ముఁ-డడవిలోనిఫలము లాహరించు. 607

వ. ఆ సమయంబున. 608

సీ. అలసినచోఁ, గొంద ఱతిమోదమున వీఁపు లెక్కించుకొని పోదు రేపు మెఱసి;
సొలసి నిద్రించినచోఁ, నూరుతల్పంబు లిడుదురు కొందఱు హితవు గలిగి;
చెమరించి యున్నచోఁ, జిగురుటాకులఁ గొంద ఱొయ్యన విసరుదు రుత్సహించి;
దప్పేఁగి నిలుచుచోఁ, దడయక కొందఱు పదము లొత్తుదు రతిబాంధవమున;

ఆ. గోపవరులు మఱియుఁ గొందఱు ప్రియమున-మాధవునకుఁ బెక్కు-మార్గములను
బనులు సేసి; రెల్లభవములఁ జేసిన-పాపసంచయములు భస్మములుగ. 609

వ. అయ్యవసరంబున శ్రీదామనామధేయుం డైన గోపాలకుండు, రామకేశవులం
జూచి, యి ట్లనియె. 610

గార్దభాకారుం డైన ధేనుకాసురుని బలభద్రుఁడు వధించుట

క. "దూరంబునఁ దాలతరు-స్ఫారం బగు వనము గలదు; పతితానుపత
ద్భూరిఫలసహిత; మది యే-ధీరులు సొర వెఱతు, రందు ధేనుకుఁ డుంటన్.

1. అలసిపోవు.

వ. ఆ ధేనుకాసురుండు మహాశూరుండును, ఖరాకారుండునునై సమానసత్త్వసమేతులైన జ్ఞాతులుం, దానును, మనుష్యులం బట్టి, భక్షించుచుండు; నయ్యెడం బరిమళోపేతంబు లైననూతనఫలవ్రాతంబు లసంఖ్యాకంబులు గలవు; వినుఁడు.

క. ఫలగంధము నాసాపుట-ములఁ జొచ్చి, కలంచి, చిత్తములఁ గొనిపోయెఁ
ఫలముల నమిలింపుడు; మము-బలియురకును మీకు దైత్యభటు లడ్డంబే?"613

వ. అని పలికిన, చెలికానిపలుకు లాదరించి, విని, నగి, వారునుం దారును నుత్తాలంబగు తాలవనంబునకుం జని, యందు. 614

క. తత్తఱమున బలభద్రుఁడు-[1]తత్తాలానోకహములఁ దనభుజబలసం
పత్తిఁ గదల్చుచు, గ్రక్కున-మత్తేభముభంగిఁ బండ్లు మహిపై రాల్చెన్. 615

వ. అప్పుడు పండ్లు రాల్చినచప్పుడు సెవులకు [2]దెప్పరం బయిన, నదిరిపడి, రిపుమర్దన కుతుకంబున గార్దభాసురుండు. 616

మ. పదవిక్షేపములన్, సవృక్షధరణీభాగంబు గంపింపఁగా,
రదముల్ దీటుచుఁ, గత్తిరించిన చెవుల్ రాజిల్ల, వాలంబు భీ
తిద మై తూలఁగఁ, గావరంబున సముద్దీపించి, గోపాలకుల్
బెదరన్, రామునిఱొమ్ము దన్నె, వెను కై బీరంబు దోరంబుగన్. 617

క. మఱియును దనుజుఁడు రామునిఁ-గఱవఁగ గమకించి, తెఱపి గానక, యతనిం
జుఱచుఱఁ జూచుచు, శౌర్యము-[3]పఱివోవఁగ, నింత నంతఁ బదములఁ దన్నెన్.

వ. అంత బలభద్రుండు రౌద్రాకారంబున, గర్దభాసురుపదంబులు నాలుగు నొక్కకేల నంటంబట్టి, బెట్టు దట్టించి, త్రిప్పి, విగతజీవునిం జేసి. 619

మ. ఒక[4]తాలాగముఁ దాఁకి వైవ, నది కంపోద్రిక్తమై త్రుళ్లి, వే
ఱొకతాలాగముపైఁ బడ, న్నదియు నయ్యుగ్రాహతిన్ నిల్వ, కొం
డొకతాలాగముపైఁ బడన్, విఱిగి యిట్లొండొంటిపైఁ దాలవృ
క్షకముల్ గూలెఁ, బ్రచండమారుతము దాఁకం గూలుచందంబునన్. 620

ఉ. తంతువులందుఁ జేలమువిధంబున, నే పరమేశుమూర్తియం
దింతయుఁ బుట్టు, నట్టి జగదీశుఁ డనంతుఁడు, దైత్యమాత్రు ని
ట్లంతము సేయు టెంతపని? యద్భుతమే? విను; మంతలోన వాఁ
డంతముఁ బొందు టెల్లఁ గని, యాతనిబంధులు గార్దభంబులై. 621

క. బలకృష్ణులపైఁ [5]గవిసిన - బలియుర ఖరదైత్యభటులఁ, బశ్చిమపాదం
బులు పట్టి, తాలశిఖరం-బుల కెగురఁగ వైచి, వారు పోరిగొని రధిపా! 622

1. తాటిచెట్లను. 2. అధికము. 3. భిన్నమగునట్లు. 4. తాటిచెట్టు. 5. ఆక్రమింపఁగా.

వ. అప్పుడు. 623

క. ఆలమున నోలిఁ గూలిన-తాలద్రుమఖండ దైత్యతనుఖండములన్
గీలిత మై, ధర జలధర-మాలావృత మైన మింటిమాడ్కిన్ వెలిఁగెన్. 624

క. ధేనుకవనమున నమలిరి-మానవు లావేళఁ దాటిమ్రాఁకులఫలముల్;
ధేనువులు మేసెఁ గసవులు-ధేనుకహరభక్తకామధేనువు గలుగన్. 625

వ. ఆ సమయంబున సురలు విరులవానలు గురియించి, దుందుభులు మొరయించి; రంతఁ గమలలోచనుండు గోపజనజేగీయమానవర్తనుం డై, యన్నయుం, దానును, గోగణంబులం దోలుకొని, మందకుం జనియె; నయ్యెడ. 626

ఉ. గోపదరేణుసంకలితకుంతలబద్ధమయూరపింఛు, ను
ద్దీపితమందహాసశుభదృష్టిలసన్ముఖు, నవ్య(వన్య?) పుష్పమా
లాపరిపూర్ణు, గోపజనలాలితవేణురవాభిరాము, నా
గోపకుమారునిం గనిరి, గోపసతుల్ నయనోత్సవంబుగన్. 627

ఆ. కమలనయనువదనకమలమరందంబుఁ-దవిలి, [1]నయనషట్పదములవలనఁ
ద్రావి, దినవియోగతాపంబు మానిరి-గోపకాంత లెల్ల గోర్కు లలర. 628

వ. ఇట్లు గోపికలు సాదరంబుగం జూడ, వ్రీడాహాసవినయంబులం జూచుచుఁ, గ్రీడాగరిష్ఠుం డయిన ప్రోడ, గోష్ఠంబు ప్రవేశించె; నంత రోహిణీయశోదలు గుఱ్ఱల వలని మచ్చికలు [2]పిచ్చలింప, నిచ్చకు వచ్చిన ట్లయ్యె వేళల దీవించిరి; వారును మజ్జనోద్వర్తనాదు లంగీకరించి, సురభికుసుమగంధంబులు గైకొని, రుచిరచేలంబులు గట్టికొని, రసోపపన్నంబు లయిన యన్నంబులు గుడిచి, తృప్తులై మంజులశయ్యల సుప్తులయి యుండి; రందు. 629

శ్రీకృష్ణుఁడు కాళియమర్దనము గావించుట.

సీ. "ఒకనాఁడు బలభద్రుఁ డొక్కఁడు రాకుండ గోపాలకులు దానుఁ గూడి, కృష్ణుఁ
డడవికిఁ జని, యెండ నాగోవులును, గోపకులు, నీరువట్టునఁ గుంది, డస్సి,
కాళిందిలో విషకలితతోయముఁ ద్రావి, ప్రాణానిలంబులు వాసి, పడిన
యోగీశ్వరేశుండు యోగివంద్యుఁడు కృష్ణుఁ డీక్షణామృతధార లెలమిఁ గురిసి,

ఆ. పసుల, గోపకులను, బ్రదికించె మరలంగ;-వారు "దమకుఁ గృష్ణువలన మరల
బ్రదుకు గలిగె" నంచు భావించి సంతుష్ట-మానసములఁ జనిరి; మానవేంద్ర!

క. కాళియఫణిదూషిత యగు-గాళిందిఁ బవిత్రఁ జేయఁగా, నుత్సుకుఁ డై
కాళిందీజలవర్ణుఁడు-కాళియు వెడలంగ నడిచెఁ గారవముఖ్యా!" 631

1. నేత్రములను తుమ్మెదలచే. 2. అధికముకాఁగా.

వ. అనిన, నయ్యగాధజలంబువలన మాధవుం డెట్టినేర్పున సర్పంబుదర్పంబు మాపి, వెడలించె? నందుఁ బెద్దకాలం బా వ్యాళం బేల యుండె? నెఱింగింపుము. 632

క. [1]త్రొక్కులఁ గాచిన నందుని-కక్కనిచరితామృతంబు గ్రోలికొని చెవులన్
జుక్కంగఁ దనివి గల్గునె?-వెక్కుల కయినను దలంప, విప్రవరేణ్యా!" 633

వ. అనిన శుకుం డి ట్లనియె. 634

సీ. "మానవేశ్వర! యొక్కమడుఁగు కాళిందిలోఁ గల; దది యెప్పుడుఁ గాళియాహి
విషవహ్నిశిఖలచే వేఁచుచుండును; మీఁదఁ బఱతెంచినంతన పక్షులైనఁ
బడి మగ్గు; నందుఁ దద్భంగ[2]శీకరయుక్త పవనంబు సోఁకినఁ, బ్రాణు లెవ్వి
యైన, నప్పుడ చచ్చు; నట్టి యా మడుఁగులో నుదకంబు పొంగుచు,నుడుకుచుండఁ

తే. జూచి, వెఱఁగంది, కుజనుల స్రుక్కఁజేయ
నవతరించిన, బలువీరుఁ డాగ్రహించి,
"భుజగవిషవహ్నిదోషంబు వొలియఁజేసి,
సుజలఁ గావించి యానదిఁ జూతు" ననుచు. 635

వ. కృతనిశ్చయుం డై, పూర్వజన్మభాగ్యంబులం దన చరణసంస్పర్శంబునకు యోగ్యంబై, తత్సమీపంబున విశాలవిటపశాఖాకదంబంబుతో నున్న [3]కదంబ భూజంబు నెక్కి. 636

మ. కటి చేలంబు బిగించి, పింఛమునఁ జక్కం గొప్పు బంధించి, దో
స్తటసంస్ఫాలన మాచరించి, చరణద్వంద్వంబుఁ గీలించి, త
త్కటశాఖాగ్రముమీఁదనుండి యుఱికెన్, గోపాలసింహంబు ది
క్తటముల్ మ్రోయ, హ్రదంబులో గుభగుభధ్వానం బనూనంబుగన్. 637

ఉ. భూరిమహాప్రతాపపరిపూర్ణభయంకరగోపబాలకం
ఠీరవపాతవేగవికటీకృతదుర్విషభీమణోర్మిసం
పూరిత మై, వడిం గలఁగి, పొంగి, [4]ధనుశ్శతమాత్రభాగవి
స్తారము వొంగె, నమ్మడుఁగు తప్తపయఃకణబుద్బుదోగ్రమై. 638

శా. పాఠీనాకృతిఁ దోయరాశినడుమన్ భాసిల్లి ము, న్నాథ్యుఁడై
కాఠిన్యక్రియ సీదునేర్పు దనకుం గల్మిన్, భుజంగేంద్రహృ
త్పీఠాగ్రంబున రోషవహ్ని లెగయన్, భీమంబుగా నీఁదె, ను
ల్లోలోత్తుంగతరంగమై మడుఁగు [5]దుర్లోక్యంబుగా బాహులన్. 639

వ. ఆ సమయంబున. 640

---

1. పశువులు. 2. తుంపురులతోఁగూడినవాయువు. 3. కడిమిచెట్టు. 4. నూఱుధనుస్సులంత దూరము. 5. చూచుటకు సాధ్యము కానిది.

శా. ''బాలుం డొక్కఁడు, వీఁడు నామడుఁగు విభ్రాంత్రోచ్చలత్కర్ణక
ల్లోలం బై కలఁగం జరించె; నిట నేలో నుంటఁ జూడండు; మ
త్కీలాభీలవిశాలదుస్సహవిషాగ్ని జ్వాలలన్ భస్మ మై
కూలం జేసెద నేఁడు లోకులకు నా కోపంబు దీపింపఁగన్.'' 641

వ. అని తలంచి, విజృంభించి. 642

ఉ. ఘోరవిషానలప్రభలు గొబ్బునఁ గ్రమ్మఁగ, సర్పసైన్యవి
స్ఫారుఁడు, గాళియోరగుఁడు, పాఱి వడిం గఱచెం, బయోధరా
కారుఁ, బయోవిహారు, భయకంపవిదూరు, మహాగభీరు, నా
భీరకుమారు, వీరు, నవపీతశుభాంబరధారు, ధీరునిన్. 643

క. కఱచి, పిఱుతివక మఱియును,-వెఱవక, నిజవదనజనితవిషదహనశిఖల్
మెఱయఁ [1]దననిడుదయొడలిని, నెఱి హరిఁ బెనఁగొనియె, భుజగనివహపతివడిన్.

వ. ఇట్లు భోగిభోగపరివేష్టితుండై, చేష్టలు లేనివారి తెఱంగునఁ గానంబడుచున్న ప్రాణసఖునిం గనుంగొని, తత్ప్రభావంబు తెఱుంగక, తత్సమర్పితధనదార మనోరథ మానసులు గావున. 645

చ. ''అదె! మనకృష్ణునిం గఱచె; నంతటఁ బోక భుజంగ మందు దు
ర్మదమున మేనఁ జుట్టికొని, మానక యున్నది; యింక నేమి సే
యుద? మొఱఁ జొత్త? మేపురుషు లోపుదు రీయహి నడ్డపెట్ట? నె
య్యది సదుపాయ?'' మంచుఁ బడి, రార్తరవంబులఁ దూలి గోపకుల్. 646

క. గోపకుమారకశేఖరు,-నేపున సర్పంబు గఱచుటీక్షించి, వగన్
మేపులకుఁ దొలఁగి,-గోవులు, వాపోవుచు నుండె, వృషభవత్సంబులతోన్.

క. భూతలము వడఁకె; నుల్కా,-పాతంబులు మింటఁ గానఁబడె; ఘోషములో
వ్రేతలకును, గోపకసం, ఘాతముల,-కదరె [2]వలకడకన్ను లిలేశా! 648

వ. అంత నా దుర్నిమిత్తంబులు వొడగని, బెగడు గదిరినచిత్తంబుల నుత్తలపడుచు మంద నున్న నందయశోదాదు లైన గోపగోపికాజనంబులు, హరిదళసరి యెఱుంగక ''గోపాలగోగణపరివృతుం డైన కృష్ణుం డెక్కడ నైనఁ జిక్కనోపు'' నని పొక్కుచుం, బెక్కువ లయిన మక్కువలు చెక్కు లొత్త, నొక్కపెట్ట బాలవృద్ధసమేతు లై మహాఘోషంబున నాఘోషంబు వెలువడి.

క. వా రిబ్భంగి నెఱుంగని-వా రై, హరిఁజూడఁబోవ, వడిగొని నగుచున్
వారింపఁడయ్యె రాముఁడు వారిని-హరిలా వెఱుంగువాఁ డయ్యు నృపా! 650

1. దీర్ఘదేహము. 2. కుడికన్నులు.

వ. అంతలోన వారునుం దానును, గాంతారమార్గంబు వట్టి పోవుచు, నెడనెడ గోప గోష్పదంబులసందుల, నింత నంత, నక్కడక్కడ, యవాంకుశహల కమలకులిశ చక్రచాప కేతనాది రేఖాలంకృతంబై, మార్గాభరణంబులైన హరి చరణంబుల జాడఁగని, చొప్పుఁదప్పక చని, దుర్ఘటంబయిన యమునాతటంబు సేరి, వారిమధ్యంబున నితరుల కసాధ్యంబైన సర్పంబుచేతఁ గాటువడిఁ దర్పంబుసూపక, భోగిభోగపరివృతుండైన కృష్ణునిఁ 'గృష్ణకృ'ష్ణ తివిలాపంబులఁ దాపంబులం బొందుచుఁ, దత్కాలంబునం బ్రతికూలం బయ్యెఁ ననుచు దైవంబుఁ దిట్టు గోపకులను, గోపకులం గలసి మేఁత లుడిగి తెప్ప లిడక కృష్ణునిం దప్పక చూచుచు నొరలుచున్న గోవులం గని; రందు గోపికలు యశోదం బట్టుకొని, పిలపించుచుఁ గృష్ణు నుద్దేశించి యి ట్లనిరి. 651

సీ. "ఎదురువచ్చినఁ జాల నెదురుగాఁ జనుదెంతు; వెదురువచ్చిన నేఁ డదేల రావు?
చూచినఁ గృపతోడఁ జూచుచుందువు; నీవు సూచినఁ గనువిచ్చి చూడ వేల?
డాసినఁ నఱలేక డాయంగ వత్తువు; డాసిన నేటికి డాయ విచటఁ?
జీరిన నో యని చెలరేఁగి పలుకుదు; విదియేమి సీరిన నెఱుఁగ కుంట?
ఆ. తలఁపు సేయునంతఁ దలపోయుచుందువు;-తలఁపు సేయ నేఁడు దలఁప వకట!"
యనుచు భక్తివివశ లాడెడికైవడి, వ్రేత లెల్ల నాడి, వివశ లైరి. 652

వ. ఆ సమయంబున నందయశోదాదులు హరిం జూచి, యధికం బైన శోకంబున ని ట్లనిరి. 653

క. "విషకుచయుగ యగు రక్కసి,-విషకుచదుగ్ధంబు ద్రావి, విషవిభయుండ వై
విషరుహలోచన! యద్భుత,-విషయుం డగు నీకు సర్పవిష మెక్కెఁగదా? 654

క. కట్టా! క్రూరభుజంగము,-గట్టలుకన్ నిన్నుఁ గఱవఁ, గంపించితివో?
తిట్టితివో పాపపువిధిఁ,-బట్టి మముం దలఁచి కాఁకఁ బలవించితివో! 655

క. పన్నగము మమ్ముఁ గఱవక,-ని న్నేటికిఁ గఱచెఁ? గుట్ట! నెమ్మి గలిగి నీ
వున్నను, మము రక్షింతువు;-నిన్నున్ రక్షింప నేము నేరము తండ్రీ! 656

ఉ. చూడ వదేమి గౌరవపుఁజూపుల మమ్ము? సఖాలితోడ మా
టాడ వదేమి నర్మముగ? నందెలు పాదములందు మ్రోయ, నేఁ
డాడ వదేమి నర్తనము? లవ్వలమ్రోలను, గోపికావళిం
గూడ వదేమి నవ్వులకు? గోపకుమారవరేణ్య! చెప్పుమా! 657

సీ. శ్రవణరంధ్రంబులు సఫలతఁ బొందంగ, నెలమి భాషించువా రెవ్వ రింకఁ?
గరచరణాదులకలిమి ధన్యత నొంద, నెగిరి పైఁ బ్రాకువా రెవ్వ రింక?
నయనయుగ్మంబు లున్నతి గృతార్థములు గా, నవ్వులు సూపువా రెవ్వ రింక?
జిహ్వాలు గౌరవశ్రీఁ జేరఁ, బాటలయెడఁ బలికించువా రెవ్వ రింక?

ఆ. దండ్రి నీవు సర్పదష్టుండవై యున్న,-నిచట మాకుఁ బ్రభువు లెవ్వ రింక ?
మరగి పాయలేము ; మాకు నీతోడిది, లోక ; మీవు లేనిలోక మేల ?'' 658

వ. అని యొండొరులంబట్టుకొని, విలపించుచుం, ''కృష్ణునితోడన మడుఁగుఁజొత్తము ; చత్త''మనుచుఁ గృష్ణవిరహవేదనానలభారతప్తులై, మడుఁగుఁజొరఁ బాఱుచున్న వారలఁ గనుంగొని, భగవంతుం డైన బలభద్రుండు, ''మీరు మీఁ దెఱుంగరు; ధైర్యంబువిడుచుట కార్యంబు గాదు; సహించి చూడుం''డనుచు వారిని వారించె. 659

క. తనుఁ గూర్చి యివ్విధంబున-వనితలు, బిడ్డలును, దాదు, వాపోయెడి ఘో
షనివాసులఁ గని,కృష్ణుఁడు-మనుజునిక్రియనొకముహూర్తమాత్రము జరపెన్.

శా. అంతం గృష్ణుఁడు మేను పెంప, భుజగుం డావృత్తులం బాసి, తా
సంతప్తాయతభోగుఁడై కలఁచుటల్ సాలించి, నిట్టూర్పుతో
శ్రాంతుం డై, తల లెత్తి దుర్విషము నాసావీథులం గ్రమ్మ, దు
శ్చింతన్ దిక్కులు సూచుచుం దలఁగి నిల్చెన్, [1]ధూమకాష్ఠాకృతిన్. 661

చ. వెఱ మఱ లేనియట్టి బలువీరుఁడు కృష్ణకుమారుఁ, డొక్కచేఁ
జఱచి, ఖగేంద్రుచందమునఁ జక్కన డాడలు వట్టి, కన్నులం
జొఱచొఱ దుర్విషానలము జొబ్బిలుచుండఁగ నెత్తి, లీలతో
జిఱజిఱఁ ద్రిప్పి వైచెఁ, బరిశేషితదర్పముఁ గ్రూరసర్పమున్. 662

వ. ఇట్లు వేగంబుగ నాగంబు వీచి వైచి, జగజెట్టి యైన నందునిపట్టి రెట్టించిన సంభ్రమంబున. 663

సీ. ఘనయమునానదీకల్లోలఘోషంబు నరసమృదంగఘోషంబు గాఁగ,
సాధుబృందావనచరచంచరీకగానంబు గాయకసుగానంబు గాఁగ,
గలహంససారసకమనీయమంజుశబ్దంబులు దాళశబ్దములు గాఁగ,
దివినుండి వీక్షించు దివిజగంధర్వాదిజనులు సభాసీనజనులు గాఁగ
తే. బద్మరాగాదిరత్నప్రభాసమాన-మహితకాళియఫణిఫణామండపమున
నళినలోచనవిఖ్యాతనర్తకుండు-[2]నిత్యనైపుణ్యమునఁ బేర్చి నృత్య మాడె.

శా. కుక్షిన్ లోకము లున్న గౌరవముతో, గోపాకృతి న్నున్న యా
రక్షోహంత, వడిన్ మహాఫణిఫణారంగప్రదేశంబుపై
నక్షీణోద్ధతి నాడుఁ, బాడుఁ, జెలఁగున్, హాసంబుతోడం బద
ప్రక్షేపంబులు సేయుఁ, గేళిగతులం బ్రాణైకశేషంబుగన్. 665

క. ఘనతర[3]సుషిరానంద-స్వనములతో, సిద్ధసాధ్యచారణగంధ
ర్వనిలింపమునిసతులు, చ-య్యనఁ గురిసిరి విరులవాన, లాడెడుహరిపై. 666

1. పొగతోఁగూడిన కట్టెవలె. 2. శాశ్వతమగు నేర్పుతో. 3. రంధ్రము.

వ. ఇట్లు దుష్టజనదండధరావతారుం డైన హరి, వడి గలిగిన పడగలమీఁదఁ దాండవంబు సలుప, బెండువడి, యొండొండ ముఖంబుల రక్తమాంసంబు లుమియుచుఁ, గన్నుల విషంబు గ్రక్కుచు, నుక్కసెడి చిక్కి దిక్కులు సూచుచుం, గంఠగతప్రాణుం డై ఫణీంద్రుండు తనమనంబున. 667

ఉ. ''వేలుపులైన [1]లావు సెడి, వేదనఁ బొందుచు నా విషానల
జ్వాలలు సోఁకినంతటన చత్తురు; నేఁడిది యేమిచోద్య? మా
భీలవిషాగ్ని [2]హేతిచయపీడకు నోర్చియుఁ, గ్రమ్మఱంగ నీ
బాలుఁడు మత్ఫణాశతము భగ్నము గా, వెసఁ ద్రొక్కి యాడెడిన్. 668

క. ఈతఁడు సర్వచరాచర-భూతేశుం డైన పరమపురుషుఁడు, సేవా
ప్రీతుఁడు, శ్రీహరి, యగు'' నని-భీతిన్ శరణంబు నొందె, బిట్టలసి నృపా!

కాళియునిభార్యలైన నాగాంగనలు శ్రీకృష్ణుని నుతించుట

వ. ఇట్లు క్రూరంబు లైన హరిచరణప్రహారంబులం బడగ [3]లెడసి, నొచ్చి చచ్చిన క్రియం, బడి యున్న పతిం జూచి, నాగకాంతలు దురంతం బైన చింతాభరంబున నివ్వటిల్లెడు నెవ్వగల నొల్లంబోయి పల్లటిల్లిన యుల్లంబుల. 670

మ. కచబంధంబులు వీడ, భూషణము లాకంపింప, గౌఁదీవియల్
కుచయుగ్మంబుల వ్రేఁగునం జడియఁ, బైకొంగుల్ వడిన్ జాఱఁగాఁ,
బ్రచురభ్రాంతిఁ గలంగి ముందట [4]రుదద్బాలావలిం గొంచు, స్రు
క్కుచు భక్తిం జని, కాంచి, రా గుణమణిన్, గోపాలచూడామణిన్. 671

వ. కని, దండప్రణామంబు లాచరించి, నిటలతటఘటితకరకమలలై, యి ట్లనిరి.

క. క్రూరాత్ముల దండింపఁగ-ధారుణిపై నవతరించి, తనరెడి నీ కీ
క్రూరాత్ముని దండించుట-క్రూరత్వము గాదు; సాధుగుణము గుణాఢ్యా! 673

క. పగవారిసుతులయందును-బగ యించుక లేక, సమతఁ బరఁగెడి నీకుం
బగ గలదె? ఖలుల నడఁచుట-జగదవనముకొఱకుఁ గాక; జగదాధారా! 674

క. నిగ్రహమె? మము [5]విషాస్యుల-నుగ్రుల శిక్షించు టెల్ల, నూహింప మహా
నుగ్రహము గాక! మాకీ-నిగ్రహము విషాస్యభావనిర్గతిఁ జేసెన్. 675

ఉ. ఎట్టితపంబు సేసెనొకో? యెట్టిసుకర్మము లాచరించెనో?
యెట్టినిజంబు వల్కెనొకో? యీఫణి పూర్వభవంబునందు, ము
న్నెట్టి మహానుభావులకు నెన్నఁడుఁ జేరువ గాని నీవు, నేఁ
డిట్టి వినోదలీలఁ దల లెక్కి నటించెద వీఫణీంద్రుపై. 676

1. బలము. 2. మంటలయొక్క. 3. వీడిపోయి. 4. ఏడుచుచున్న బాలుర గుంపును. 5. విషము ముఖమున నుండువారు.

మ. బహుకాలంబు దపంబు సేసి, వ్రతముల్ వాటించి, కామించి, సీ
మహాసీయోజ్జ్వలపాదరేణుకణసంస్పర్శాధికారంబు శ్రీ
మహిళారత్నము దొల్లి కాంచె; నిదె నేమం బేమియుఁ లేక యీ
యహి నీపాదయుగాహతిం బడసె నే డత్యద్భుతం బీశ్వరా! 677

ఉ. ఒల్లరు నిర్జరేంద్రపద; మొల్లరు బ్రహ్మపదంబు నొందఁగా;
నొల్లరు చక్రవర్తిపద; మొల్లరు సర్వరసాధిపత్యము;
నొల్లరు యోగసిద్ధి; మఱి యొండుభవంబుల నొందసేని నీ
సల్లలితాంఘ్రిరేణువులసంగతి నొందినధన్యు లెప్పుడున్. 678

క. ఘనసంసారాహతు లగు-జను, లాకాంక్షింపఁ, గడు నశక్యం బగు శో
భనము సమక్షంబున నహి-గని యెం దామసుఁడు రోషకలితుం డయ్యున్.

వ. దేవా! సకలపురుషాంతర్యామిరూపత్వంబువలనఁ బరమపురుషుండ వయ్యును, [1]నపరిచ్ఛిన్నత్వంబువలన మహాత్ముండ వయ్యును, నాకాశాదిభూతసమాశ్రయత్వంబువలన భూతవాసుండ వయ్యును, భూతమయత్వంబువలన భూతశబ్దవాచ్యుండవయ్యును, గారణాతీతత్వంబువలనఁ బరమాత్ముండవయ్యును, జ్ఞానవిజ్ఞానపరిపూర్ణత్వంబు గలిగి నిర్గుణత్వనిర్వికారత్వంబులవలన బ్రహ్మంబవయ్యును, బ్రకృతిప్రవర్తకత్వంబువలన ననంతశక్తివై యప్రాకృతుండవయ్యును, గాలచక్రప్రవర్తకత్వంబు వలనఁగాలుండ వయ్యును, గాలశక్తిసమాశ్రయత్వంబువలనఁ గాలనాభుండ వయ్యును, సృష్టిజీవనసంహారాదిదర్శిత్వంబు వలనం గాలావయవసాక్షి వయ్యును నొప్పు నీకు నమస్కరించెదము; మఱియును. 680

సీ. విశ్వంబు నీవ యై, విశ్వంబుఁ జూచుచు, విశ్వంబు సేయుచు, విశ్వమునకు
హేతువవై, పంచభూతమాత్రేంద్రియములకు మనఃప్రాణబుద్ధి చిత్త
ముల కెల్ల నాత్మ వై మొనసి, [2]గుణంబుల నావృత మగుచు, నిజాంశభూత
మగు నాత్మచయమున కనుభూతి సేయుచు, మూఁడహంకృతులచే మునుఁగువడక

తే. నెఱి ననంతుఁడవై, దర్శనీయరుచివి-గాక, సూక్ష్ముఁడ వై నిర్వికారమహిమఁ
దనరి, కూటస్థుఁ డన, సమస్తంబు నెఱుఁగు-నీకు మ్రొక్కెద; మాలింపు, నిర్మలాత్మ!

వ. మఱియుఁ 'గలండు, లేఁడు, సర్వంబు నెఱుంగు, నించుక యెఱుంగు, బద్ధుండు, విముక్తుం, డొకం, డనేకుండు', నను నివి మొదలుగాఁ గలవాదంబులు మాయ వలన ననురోధింపుదురు; గావున నానావాదానురోధకుండ వయ్యును, నభిధానాభిధేయ శక్తిభేదంబులవలన, బహుప్రభావప్రతీతుండ వయ్యును, జక్షురాదిరూపంబులవలనఁ బ్రమాణరూపకుండ వయ్యును, నిరపేక్షజ్ఞానంబు

1. వేఱుచేయఁదగనివాఁడు. 2. సత్త్వరజస్తమస్సులు.

కలిమిం గవి వయ్యును, వేదమయనిశ్వాసత్వంబువలనఁ శాస్త్రయోని వయ్యును, [1]సంకర్షణవాసుదేవ ప్రద్యుమ్నానిరుద్ధరూపంబులవలనఁ జతుర్మూర్తి వయ్యును, భక్తజనపాలకుండ వయ్యును, నంతఃకరణ ప్రకాశకత్వంబు గలిగి సేవకజనఫలప్రదానంబుకొఱకు గుణాచ్ఛాదకుండ వయ్యును, చిత్తాదివర్తనంబులఁ గానంబడిన గుణంబులకు సాక్షివై యొరుల కెఱుంగరాని నగోచరుండ వయ్యును, దర్శింపరాని పెంపువలన నవ్యాహతవిహారుండ వయ్యును, సకల కార్యహేతువ వయ్యు, నంతఃకరణ ప్రవర్తకత్వంబువలన హృషీకేశుండ వయ్యును, సాధనవశంబు గాని యాత్మారామత్వంబువలన ముని వయ్యును, స్థూలసూక్ష్మగతుల నెఱుంగుచు, నెందుం జెందక, నీవు విశ్వంబు గాకయు, విశ్వంబు నీవ యయ్యును, విశ్వభావాభావసందర్శనంబు సేయుచు, విద్యావిద్యలకు హేతు వయిన నీకుం బ్రణామంబు లాచరించెద మవధరింపుము. 682

క. లోకజననిస్థితిలయములు-గైకొని, చేయుదువు త్రిగుణకలితుఁడవై శ్రీ
లాకారమున నమోఘ-శ్రీకలితుఁడ వగుచు, నిచ్చ నెందక యీశా! 683

క. ఈశాంతలు గానితనువు-లీశా! యీమూఢజాతు, లీసజ్జాతుల్,
నీశాంతతనువులందుఁ బ్ర-కాశింతువు ధర్మహితముగా సుజనులలోన్. 684

ఉ. నేరము లెన్న నెక్కడివి? నేము దలంచుతలంపులోపలన్
నేరపు లున్నవే? సుతుల [2]నేరమి-దండ్రులు త్రోచి పుచ్చరే?
నేరము సేయువారి ధరణీపతు లొక్కొకమాటు గావరే?
నేరము గల్గు మద్విభుని నేఁడిటఁ గావఁగదే! కృపానిధీ! 685

శా. బాలుం డీతఁడు; మంచివాఁ; డనునుఁ జెప్పన్ రాము; క్రూరుండు, దు
శ్శీలుం డో; నవు; నైన నేము సుభగశ్రీఁ బాసి వైధవ్యదు
ష్టాలంకారముఁ బొంద నోడెద; మనాథాలాప మాలింపవే!
చాలుం నీపదతాండవంబు; పతిభిక్షం బెట్టి రక్షింపవే! 686

ఉ. ఆకుల మయ్యె భోగ మిదె; యాఁదల లన్నియు వ్రస్సెఁ; బ్రాణముల్
రాకలఁ బోకలం బొలిసె; రాయిడి వెట్టక, మాని జేసుపై
నీకరుణాకటాక్షములు నిల్పఁగదే తగ, నో సమస్తలో
కైకశరణ్య! యో యభయకారణ! యో కమలామనోహరా! 687

ఆ. మమ్ముఁ బెండ్లి సేయు; మాప్రాణవల్లభు-ప్రాణ మిచ్చి కావు; భక్తవరద!
నీవు సేయుపెండ్లి నిత్యంబు, [3]భద్రంబుఁ;-బిన్ననాఁటిబెండ్లి పెండ్లి గాదు. 688

1. భగవంతుని చతుర్వ్యూహములు. 2. తెలియకుండుట. 3. శుభము.

ఇంద్ర. నీ యాన; యెవ్వారిని నిగ్రహింపం;-జాయుగ్రపాపాకృతి నండఁ; డింకన్;
నీయాజ్ఞలో నుండెడు నేఁటఁగోలెన్-మాయీశ ప్రాణంబులు మాకు నీవే!''

వ. అని యిట్లు తమపెనిమిటిఁ బ్రదుకఁ గోరెడి భుజగసతులయందు శరణాగతరక్షకుం డైన పుండరీకాక్షుండు గరుణించి, చరణఘట్టనంబు చాలించి, తలంగిన నెట్టకేలకు ఘ్రాణేంద్రియంబుల మరలం బడసి, చిదిసి నలఁగినతలలు సవరించుకొని, వగర్చుచు భుజగపతి జలజనయనునికి నంజలి సేసి, మెల్లన యిట్లనియె. 690

చ. ''[1]మలఁకలు మా ప్రచారములు; మాముఖముల్ విషవహ్ని ఘోరముల్;
ఖలులము; రోషజాతులము; గర్వుల; మే మొక మంచివారమే?
నళినదళాక్ష! ప్రాణులకు నైజగుణంబులు మాన నేర్చునే?
వెలయవె? మావికారములు వింతలె? మే లోనరించి తీశ్వరా! 691

సీ. వివిధభావాకారవీర్యబీజాశయజవయోనియుతముగా జగము లెల్ల
నీవ చేసితి మున్ను; నేమా జగంబులో [2]సహజకోపనులము, సర్పములము;
దుర్వార మైన నీతోరంపుమాయ నే మెట్టేఁగి దాఁటెడుపని కెంతవార?
మంతకుఁ గారణ మఖిలేశ్వరుండవు, సర్వజ్ఞుఁడవు నీవు; జలజనయన!
తే. మనిచె దేనియు మన్నించి మనుపు; నన్ను
నిగ్రహించెద వేనియు నిగ్రహింపు;
మింక సర్వేశ! మాయిమ్ము లెందుఁ గలవు?
చిత్తమందున్న క్రమమునఁ జేయఁదగును. 692

క. నాపుణ్య మేమి సెప్పుదు?-నీపాద[3]రజంబుఁ గంటి; నే సనకాదుల్
నీపాదరజము గోరుదు-రేపదమం దున్న నైన; నిఁక మేలు హరీ!'' 693

వ. అని విన్నవించినఁ, గాళియుపలుకులు విని నవధరించి, కారుణ్యమానసుం డయిన సర్వేశ్వరుం డతని కి ట్లనియె. 694

క. ''గోష్ఠమ్ముతో మనుజులు-ద్రావుదు రీమడుఁగునీరు; దగ దిం దుండన్;
నీవును, నీబాంధవులును-నీవనితలు, సుతులుఁ, జనుఁడు నేఁ డంబుధికిన్. 695

క. నిను నే శాసించినకథ-మనమునఁ జింతించి, రేపు మాపును గీర్తిం
చిన మనుజులు,నీభయమును-విను; మెన్నఁడుఁ బొంద రెందు విషవిజయముతోన్.

చ. ఇది మొద లెవ్వరైన నరు లీయమునాతటినీహ్రదంబులో
వదలక తోఁగి, నన్నుఁ నుపవాసముతోడఁ దలంచి, కొల్చుచుం
గదలక దేవతాదులకుఁగా జలతర్పణ మాచరించినన్,
సదమలచిత్తులై దురితసంఘముఁ బాయుదు రాక్షణంబునన్. 697

1. వంకరలు. 2. స్వభావముగాఁగోపము గలవారము. 3. ధూళి.

ఆ. గరుడభీతి రమణకద్వీప మెల్లఁ గీ—మడువుఁ జొచ్చి తీవు; మత్పదాబ్జ
[3]లాంఛనములు శిరలను నుంటఁజూచి, యా—పక్షిరాజు నిన్నుఁ బట్టఁ డింక.''

వ. అని యిట్లు విచిత్రవిహారుం డైన గోపాలకృష్ణకుమారుం డానతిచ్చిన, నియ్యకొని, చయ్యన నయ్యహీంద్రుండు దొయ్యలులుం దానును నెయ్యంబున నయ్యాశ్వరునకు నవ్యదివ్యాంబరాభరణరత్నమాలికానులేపనంబులు సమర్పించి, తేఁటితండంబులకు దండ యగు నీలోత్పలంబులదండ యిచ్చి, పుత్రమిత్రకళత్రసమేతుండై బహువారంబులు నైవారంబుసేసి, వలగొని మ్రొక్కి, లేచి వీడ్కొని రత్నాకరద్వీపంబునకుం జనియె; నిట్లు. 699

క. వారిజలోచనుఁ డెవ్వరు—వారింపఁగలేని ఫణినివాసత్వంబుల్
వారించిన, యమున [2]సుధా—వారిం బోలుపారె నెల్లవారికి బ్రియమై.'' 700

కాళియుని పూర్వకథ

వ. అనిన విని, ''మునీంద్రా! యేమికారణంబునఁ గాళియుండు భుజగనివాసం బయిన రమణకద్వీపంబు విడిచె; నతం డొక్కరుండును గరుడున కేమి తప్పదలంచె?'' నని నరవరుం డడిగిన మునివరుం డిట్లనియె. 701

సీ. ''సర్పభీరువు లైన జను లెల్ల, నెలనెల సరసభక్ష్యములు వృక్షముల మొదల
సర్పంబులకుఁ బెట్ట, సర్పంబులును మును సర్పాంతకుఁడు, దమ్ముఁ జంపకుండఁ
బ్రతిమాసమును దమభాగభక్ష్యంబు లాపక్షిరాజున కిచ్చి, బ్రదుకుచుండ
విషవీర్యదుర్మదావిష్టుఁడై కాళియుఁ డహికులాంతకునిపా లపహరించి,
తే. యీక తనపాలిబలిభాగ మెల్లఁ దినిన—విని, ఖగేంద్రుఁడు కోపించి, వీనితలలు
సీరి చెండాడి, భోగంబు చించివైచి—ప్రాణములఁబాపి, వచ్చెదఁ బట్టి'' యనుచు.

క. అక్షీణకనకసన్నిభ—పక్షయుగోద్ధూతఘోరపవమానమహా
విక్షేపకంపితానే—కక్షోణిధరేంద్రుఁ డగుచు గరుడుఁడు వచ్చెన్. 703

ఉ. వచ్చినసర్పవైరిఁ గని వ్రాలక లేచి, మహాఫణావళుల్
విచ్చి దృగంచలంబుల నవీనవిషాగ్నికణంబు లొల్కఁగా
నుచ్చలదుగ్రజిహ్వలు మహోద్ధతిఁ ద్రిప్పుచు, నూర్పులందుఁ గా
ర్చి చ్చెగయంగఁ, బాఱి కఱచెన్, విహగేంద్రు నహీంద్రుఁ డుగ్రతన్. 704

క. కఱచినభుజగముర దములు—విఱుగఁగ, వదనముల విషము వెడలఁగ, శిరముల్
[1]పఱియలుగ నడిచె గరుడుఁడు—తఱిమి కనకరుచులు గలుగుతనడాఱెక్కన్.

వ. ఇట్లహికులారాతిచేత వ్రేటువడి, వెఱచి, పఱతెంచి, కాళియుం డీ గభీరం బయిన మడుఁగుఁ జొచ్చె; మఱియు నొక్కవిశేషంబు గలదు. 706

1. గుర్తులు. 2. అమృతమయమయిన జలము. 3. సంధులు, పట్టె.

సీ. మున్ను సౌభరి యను ముని యీహ్రదంబునఁ దపము సేయుచు నుండ, ధరణిలోన
నాఁకలిగొని పన్నగాంతకుఁ డొకనాఁడు సనుదెంచి, యిందుల జలచరేంద్రు
నొడిసి భక్షించిన, నున్నమీనము లెల్ల ఖిన్నంబులై వగఁ గ్రిస్సి యున్నఁ
జూచి, యామునిరాజు శోకించి, కోపించి, "గరుడుఁడు నేఁడాదిగాఁగ నిందుఁ

తే. జొచ్చి, మీనంబులను మ్రింగఁ జూచెనేని,
జచ్చుఁ గావుత;" మని యుగ్రశాప మిచ్చెఁ;
గాళియుం డొక్కఁడా శాపకథ యెఱుంగు;
నితరభుజగంబు లెవ్వియు నెఱుఁగ వధిప! 707

వ. అది కారణంబుగాఁ, గాళియుం డీ మడుఁగుఁ జొచ్చియున్న గోమనుజరక్షణార్థంబు కృష్ణుం డతని వెడలించె; నిట్లు దివ్యగంధాంబరసువర్ణమణిగణమాలికాలంకృతుండై, మడుఁగు వెడలి వచ్చిన మాధవుంగని, ప్రాణలాభంబులం బొందినయింద్రియంబులం బోలె, యశోదారోహిణీసమేత లయిన గోపికలును, నందసునందాదులైన గోపకులును, మూర్ఛలం బాసి, తేఱి, తెప్పిఱి, లేచి, పరమానందంబునం బొందిరి; బలభద్రుండు తమ్ముని నాలింగనంబు సేసె; నవ్వుడు. 708

క. అంకెలు వైచె వృషభము ల-హంకారముతోడ; లేఁగ లట్టిట్టుఱికెం;
బొంకముల నొప్పె ధేనువు; లంకురితము లయ్యెఁ దరువు లాహరిరాకన్. 709

క. "నీసుతుఁ డహిచే విడివడె;-నీసురుచిరభాగ్యమహిమ నిశ్చల" మనుచున్
భూసురులు సతులు దారును-భాసురవచనముల నందుఁ బలికి రిలేశా! 710

శా. "నిన్నా యుగ్రభుజంగమంబు గఱవన్, నీవాపదం బొందుచున్
న న్నేమంటివి? తనూజ! [1]యోడవు గదా? నాకూన! నాతండ్రి! రా
వన్నా!" యంచు శిరంబు మూర్కొని, [2]నిజాంకాగ్రంబుపై నిల్పుచుం,
గన్నీ రొల్కఁగఁ గౌఁగిలించెఁ దనయున్ గారాముతోఁ దల్లి దాన్. 711

వ. ఇట్లు పరమసంతోషులై, ఘోషజను లారేయి కాళిందీతటంబున నాఁకలి నీరు వట్టుల డస్సి క్రస్సి, గోవులుం దారు నుండ, నగణ్యం బగు నయ్యరణ్యంబున నొక్క దవానలంబు పుట్టి, చుట్టు ముట్టికొని, నడురేయి నిద్రితం బైన వ్రజంబుమీఁద గదిసిన, నదిరిపడి లేచి, దందహ్యమానదేహు లయి సకల జనులును, మాయామనుజబాలకుం డైన హరికి శరణాగతులై యిట్లనిరి.

గోగోపగోపికాసంఘముఁ గార్చిచ్చు చుట్టుకొనుట

మ. "అదె వచ్చెన్ దవవహ్ని ధూమకణకీలాభీలదుర్వారమై;
యిదె కప్పెన్ మము నెల్లవారి; నిట మీఁ దేలాగు? రక్షింపు; నీ

1. భయపడవు. 2. తనతొడపైభాగమున.

పశుపక్షంబుల కాని, యొం డెఱుఁగ; మో పద్మాక్ష! యో కృష్ణ! మ్రొ
క్కెద; యో రామ! మహాపరాక్రమ! దవాగ్నిన్ వేగ వారింపవే. 713

క. నీపాదంబులు నమ్మిన, నాపద లెక్కడివి జనుల? కత్యుగ్రమహా
దీపితదావజ్వలనము, పైపడ కుండెడివిధంబు భావింపఁగదే!" 714

వ. అని ఘోషించు ఘోషజనులం గరుణించి, జగదీశ్వరుం డగు ననంతుం డనంతశక్తియుతుం డై, గహనంబు నిండిన దావదహనంబు పానంబు సేసిన, విజయగానంబు దశదిశల నిగిడె; నంతం గృష్ణుండు గోగణజ్ఞాతిసహితుం డై, మందయానంబున మందకుం జనియె; నిట్లు రామకేశవులు గోపాలబాలవేషంబులం గ్రీడించు సమయంబున. 715

## గ్రీష్మర్తువర్ణనము

సీ. దినము లంతంతకు దీర్ఘంబు లై యుండె; దిననాథుఁ డుత్తరదిశఁ జరించె;
నాఁడునాఁటికి నెండ నవ్యమై ఘన మయ్యె; వెచ్చనిగాడ్పులు విసరఁ జొచ్చె;
మేదినీరేణువుల్ మింట సంకుల మయ్యె; నేఱులుఁ గొలఁకులు నిగిరిపోయెఁ;
బానీయశాలలఁ [1]బథికసంఘము నిల్చెఁ; జప్పరంబుల భోగిచయము డాఁగెఁ;
ఆ. దరులఁ గుసుమచయము దళములతో వాడె; మిథునకోటికి రతి మెందు దోఁచె;
నఖిలజంతుభీష్మ మైన గ్రీష్మము రాకఁ, గీలి యడవులందుఁ గేలి సలిపె. 716

ఆ. వాఁడిరుచులు గలుగువానివేఁడిమి గ్రీష్మ-కాలమందు జగము గలయఁబడియె;
బ్రహ్మ జనులకొఱకు బ్రహ్మాండఘటమున-నుష్ణరసముఁ దెచ్చి యునిచె ననఁగ.

వ. ఇ[2]ట్లాభీలం బయిన నిదాఘకాలంబు, వర్తింప, బృందావనంబు రామగోవిందమందిరంబైనకతంబునఁ, నిదాఘకాలలక్షణంబులం బాసి, నిరంతరగిరినిపతితనిర్ఝరశీకర పరంపరాభాసితపల్లవిత కుసుమితతరులతం బయ్యును, దరులతాకుసుమపరిమళ మిళితమృదులపవనం బయ్యును, బవనచలితకమలకహ్లారసరోవరమహాగభీరనదీ హ్రదం బయ్యును, నదీహ్రదకల్లోలకంకణప్రభూతపంకం బయ్యును, బంకసంజనితహరితాయమానతృణనికుంజం బయ్యును, జనమనోరంజనం బై, వసంతకాల లక్షణంబులు గలిగి, లలితమృగపక్షిశోభితం బయి యొప్పుచుండె; మఱియు నందు. 718

క. పికములకోలాహలమును-శుకసంఘముకలకలంబు, [3]సుభగమయూర
ప్రకరము కేకారవ, మళి-నికరము రొదయును జెలంగె; నెఱి నయ్యడవిన్.

క. ఆతతయమునాసరసీ-జాతతరంగాభిషిక్తజలరుహగంధో
పేతానిల మడఁచెఁ నిదా-ఘాతతదావాగ్నిపీడ నవ్వనమందున్. 720

1. బాటసారుల సముదాయము. 2. భయంకరము. 3. అందములయిన నెమిళ్ళ సముదాయము.

వ. ఇట్లా మనికిం దమకుం దెఱంగు గల్గి, సుందరంబైన బృందావనంబునకు బలకృష్ణులు గోవుల రొప్పికొని చని, గోపకులుం దారును నొండొరులతో నగుచుం, దెగడుచుం, బెనంగుచుం, దలంగుచు, జీరజీరం దిరుగుచుం, దరులసందుల కఱుగుచు, దాఁగిలి మూఁత లాడుచు, గీతంబులు వాడుచు, వేణునాదంబులు ఘటియించుచు, నటియించుచు గతులు దప్పిన క్రియ నోఱఁగుచుం, గుప్పల కుఱుకుచుం, జప్పటలు గొట్టుచుం, గందుకంబులం దట్టుచు, నుప్పరం బెగసి దర్దురంబులచందంబున దాఁటుచు, నామలకబిల్వాదిఫలంబుల మీటుచుం, గుటవిటపంబులం గదల్చుచు, మృగంబుల నదల్చుచుం, బెరల రేఁపుచు మధుమక్షికలం జోపుచుం, దేనియలు ద్రావుచు, సొమ్ములు వోవుచు, గురుశిష్యకల్పనంబులం బనులు సేయుచుం, గాకపక్షధరులై ముష్టియుద్ధంబులకు డాయుచుం, బన్నిదంబులు సఱచుచుం, బులుఁగులభంగి నఱచుచు, బహురూపంబులు వన్నుచు, నెగిరి తన్నును, సేవ్యసేవక మిత్రామిత్రభావంబులు వహించుచు, నుత్సహించుచు, మఱియు ననేకవిధంబులం గ్రీడించి రందు. 721

క. మాపాలికి బలకృష్ణులు,-భూపాలకు లంచు నెగిరి బొబ్బ లిడుచు, న
గ్గోపాలురు మోతురు ప్రమ,-దాపాదకు లగుచు [1]వల్లికాందోళికలన్. 722

క. గోపకు లందఱు నాడుచు,-దీపింపఁగ రామవాసుదేవుల వెనుకం
బై పడి, పాఱత గాయక,-రూపంబులఁ బొగడుదురు నిరూఢాత్మకులై. 723

క. ప్రీతిన్ గోపకు లందఱు,-గీతంబులు వాడఁ దరులక్రిందను నగుచుం,
జేతులు ద్రిప్పుచు, వెడవెడ,-పాతర లాడును యశోదపాపం డడవిన్. 724

మ. జలజాక్షుండును, రాముఁడున్, నటనముల్ సల్పంగ, గోపాలమూ
ర్తులతో వారలఁ గొల్చి నిర్జరులు సంతోషించి, వేణుస్వనం
బులు గావించుచు, గొమ్ము లూఁదుచు, శిరంబుల్ ద్రిప్పుచుం, బాడుచున్
[2]వల నొప్పన్ వినుతించి, రప్పుడు నటుల్ వర్ణించుచందంబునన్. 725

బలభద్రుండు ప్రలంబాసురుని వధించుట

వ. ఇట్లు రామకృష్ణులు నదనదీతీరంబులఁ, గొలంకులసమీపంబుల, గిరులచఱుల సెలయేఱులపొంతల, మడుఁగులచెంతలఁ, బొదలక్రేవలఁ, బసిమి గల కసవు జొంపంబులఁ, బసుల మేపుచుండఁ, బ్రలంబుం డను రక్కసుం డుక్కు మిగిలి, గోపాలరూపంబున వచ్చి, వారల హింస సేయుం దలంచుచుండ, నయ్యఖిల దర్శనుం డగు సుదర్శనధరుం డెఱింగియు, నెఱుంగని తెఱంగున. 726

క. ఆరామునిసహజన్ముఁడు-"రా ర"మ్మని వానిఁ జేరి, రాకం బోకన్
గారాము సేసి, మెల్లన-పోరామి యొనర్చెఁ బిదపఁ [3]బొరిగొనుకొఱకున్. 727

1. తీఁగలనుపల్లకులయందు. 2. ఉపాయము. 3. సంహరించు.

వ. ఇట్లు ప్రబలంబునితోఁ జెలిమి సేయుచుఁ, గృష్ణుండు గోపాలకులకు నిట్లనియె.

ఆ. "మనకుఁ బ్రొద్దువోదు; మనమిందఱము రెండు-గములవార మగుచుఁ, గందుకముల
శిలల గుఱులు సేసి, చేరి క్రీడింతము;-రండు; వలయు జయపరాజయములు."

వ. అని యిట్లు పలికి, తానును బలభద్రుండును బెన్నుద్దులై, యితరవల్లవులెల్ల నుద్దించుకొని, పెజ్జుద్దులై వచ్చినసమయంబున విభజించికొని, రెండుగములవారై, మార్గంబులం దృణదారుశిలాకల్పితంబు లగుగుఱు లొడ్డి, కందుకశిలాది ప్రక్షేపణంబుల లక్ష్యంబులఁ దాఁకవైచి, జయపరాజయనిర్ణయంబులు గైకొని, వాహ్యవాహకలక్షణంబుల [1]నిర్జితులు జేతల వహించి, క్రీడించుచు బలరామునికి వానిచందంబు రహస్యంబున నెఱింగించి, పసుల వెల్చుచు, భాండీరకం బను వటంబు సేరి; రా సమయంబునఁ గ్రీడయందు శ్రీదామనామధేయుం డైనగోపకుండు శ్రీకృష్ణుని వహించె; భద్రసేనుండు వృషభు నెక్కించుకొనియె; బలభద్రుండు ప్రలంబు నారోహించె; నప్పుడు. 730

మ. "వనజాక్షుం బలిమిం బలాఢ్యుఁడు దృణావర్తుండు మున్ మింటికిం
గొని, పోఁజాలక చిక్కెనాఁ; డితని నాకుం మోవ రా;" దంచు నా
దనుజారిం గొనిపోఁ దలంపక, వడిన్ దైత్యేశుఁ డయ్యాటలోఁ
గొని పోయెన్ గిఱి దాఁటి, రాము నఖిలక్రూరక్షయోద్దామునిన్. 731

వ. ఇట్లు క్రీడాకల్పితవాహనుం డైనప్రలంబుండు బలభద్రునిం గొనిపోవుచు. 732

మ. గురుశైలేంద్రసమానభారుఁడగు నా గోపాలకున్ మోవ లే
క రయోద్రేకము మాని, దైత్యుఁడు నరాకారంబు చాలించి, భీ
కరదైత్యాకృతి నేఁగె, [2]హేమకటకాకల్పంబుతో, రాముతో
ముఱు" వొప్పంగఁ దటిల్లతేందుయుతజీమూతంబుచందంబునన్. 733

ఉ. మోసము లేక వానిపెనుమూఁపున నుండుచు నా హలాయుధుం
డా సమయంబునం గనియె, హాటకరత్నకిరీటకుండలో
ద్భాసితమస్తకున్, భ్రుకుటిభాసురదారుణనేత్రు, నుగ్రదం
ష్ట్రాసహితుం, బ్రలంబు, నురుశౌర్యవిలంబు, మదావలంబునిన్. 734

వ. కని, నక్తంచరుం డని యించుక శంకించి, వెఱవక. 735

క. కడువడిఁ దను దివికిం గొని-వడిఁ జనియెడు దనుజుశిరము వ్రయ్య, హలధరుం
డడరి పటుచటులతర మగు-పిడికిట వెస విసరి, పొడిచె బిఱుసున నలుకన్.

క. హలధరుబలుపిడికిటిహతిఁ-దల పగిలిన రుధిరజలము దనువివరములం
దొలఁక మొఱ యిడుచు దనుజుఁడు-బలరిపుపవినిహతనగముపగిదిం బడియెన్.

---

1. ఓడిపోయినవారు. 2. బంగారు కడియముల భూషణములతో.

మత్తకోకిలము. "మేలు మేలుగదయ్య! రాముఁడు మేటిరక్కసు నొక్కఁడున్
నేలఁ గూలిచె నొక్కపోటున; నేఁడు విస్మయ" మంచు గో
పాలకుల్ గని, చచ్చి వచ్చిన భాతిఁ గన్నవిధంబునం
జాల దీవన లిచ్చి, రాముని సత్కరించిరి వేడుకన్. 738

క. బలవంతుఁడగు ప్రలంబుఁడు-బలుముష్టిన్ నిహతుఁ డైన, "బ్రదికితి" మనుచున్
బలసూదనాదిదివిజులు-బలుపైఁ గుసుమములవానఁ బరఁగించి రొగిన్. 739

శ్రీకృష్ణుండు దావాగ్నిని మ్రింగి గోపకగోసంఘమును కాపాడుట

వ. ఇట్లు గోపకులు క్రీడింప, గోవు లంతంతఁ గాంతారంబున వింతకసవులు మేస
వుచు, మేఁతవడి నొం డడవికి దూరంబు సని, యందుఁ దవదహనపవనసంస్ప
ర్శంబు సైరింపక కంపించి, దప్పి నొప్పు సెడి, ఘోషించిన. 740

శా. ఆగోపాలకు లందఱుం బసులకు య్యాలించి, కౌమారకే
ళీగాఢత్వము మాని, [1]గోఖురరదాళిచ్ఛిన్నఘాసంబుతో
బాగై యున్నపథంబునం జని, దవాపన్నంబు గాకుండ వే
వేగన్ గోగణమున్ మరల్చి, రటవీవీథిన్ జవం బొప్పఁగన్. 741

క. జలధరభీకరరవమున-నలినదళాక్షుండు దమ్ము నామాంకములం
బిలిచిన విని, ప్రతిఘోషణ-ములు సేయుచుఁ బసులు దిరిగె ముదమున నధిపా!

వ. అంత నవ్వనంబున దైవయోగంబునం బుట్టినకార్చిచ్చు, బిట్టు విసరెడికరువలి
వలన మిన్నుముట్ట మిట్టిపడి, గట్టు చెట్టనక దరికొని, యట్టె క్రాలుచుఁ
జుట్టుకొని పఱవం గని, పల్లటిల్లిన యుల్లంబులతో వల్లవు లెల్లఁ దల్లడిల్లి,
సబలుం డైనహరికి మృత్యుభీతులరీతిం జక్క మ్రొక్కి యిట్లనిరి. 743

క. "అభ్రంకషధూమాయిత-విభ్రాంతమహాస్ఫులింగవిసరోగ్రశిఖా
విభ్రష్టదగ్ధలోకా-దభ్రం బై వచ్చెఁ; జూడు [2]దవశిఖ; కృష్ణా! 744

శా. నీచుట్టాలకు నాపదల్ గలుగునే? నే మెల్ల నీవార; మ
న్యాచారంబు లెఱుంగ; మీశుఁడవు; మా కాభీలదావాగ్ని నేఁ
డేచందంబున నింక దాఁటుదుము; మ మ్మీక్షించి రక్షింపవ
న్నా! చంద్రాభ! విపన్నులన్ [3]శిఖివితానచ్ఛన్నులన్ ఖిన్నులన్." 745

వ. అని విన్నవించి; రంత. 746

ఉ. బంధుజనంబుచేత నిటు ప్రార్థితుఁ డై, హరి విశ్వరూపుఁ "డో
బంధువులార! మీనయనపంకజముల్ ముకుళింపుఁ; డగ్ని నీ

1. ఆవుల గిట్టలసముదాయములచేత జీల్పఁబడిన గడ్డిపఱకలతో. 2. దావాగ్ని. 3. అగ్ని
మంటలచేఁ గప్పఁబడినవారిని.

సంధి నడంతు నే;[1] నవినఁ జక్కన వారలు నట్ల చేయుచున్,
బంధురదావపావకముఁ బట్టి ముఖంబునఁ ద్రావె లీలతోన్, 747

వ. ఇట్లు నిజయోగవైభవంబున దావదహనంబు పానంబు సేసి, నిమిషమాత్రం
బున గోపకుల నందఱ భాండీరకవటసమీపంబునకుం దెచ్చి, విడిచిన వారు వికసిత
నయనకమలు లయి, "కృష్ణునియోగమాయాప్రభావంబున నెరగలిచిచ్చు ప్రుగ్గె";
నని యగ్గించుచుఁ దమమనంబులందు. 748

క. కార్చిచ్చార్చు పటుత్వము-నేర్చునె నరుఁ డొకఁడు? శౌరి నేఁ డిదె కార్చి
చ్చార్చి, మనల రక్షింపఁగ-నేర్చె; నితం డజుఁడొ? హరియొ? నిటలాక్షుండో?

వ. అని వితర్కించి; రంతఁ గృష్ణుండు సాయాహ్నసమయంబున రామసహితుండై
వంశనాళంబు పూరించుచు గోపగణజేగీయమానుం డై గోష్ఠంబు ప్రవేశించె;
నప్పుడు. 750

క. కమలాక్షుఁ డొద్ద నుండని-నిమిషము యుగశతము గాఁగ నెగడిన, గోప
ప్రమదలు సంభ్రమమున నా-కమలాక్షునిఁ జూచి, ముదము గనిరి; మహీశా!

వ. ఆసమయంబున గోపకు లిండ్లకడ నున్నవృద్ధకాంతాజనంబులకు రామకృష్ణుల
చిత్రచరిత్రంబులు సెప్పిన, విని, వారు వారిని గార్యార్థులై వచ్చిన వియచ్చర
వరుల లని తలంచి; రంత. 752

వర్షర్తువర్ణనము

సీ. పూర్వవాయువులు ప్రభూతంబు లై వీచెఁ; బడమట నింద్రచాపంబు దోఁచెఁ;
బరివేషయుక్తమై భానుమండల మొప్పె; మెఱపు లుత్తరదిశ మెఱవఁదొడఁగె;
దక్షిణగాము లై తనరె మేఘంబులు; జలచరానీకంబు సంతసించెఁ;
జాతకంబుల పిపాసలు [2]కడపలఁ జేరెఁ; గాంతారవహ్నులగర్వ మడఁగె;
ఆ. నిజకరాళివలన నీరజబంధుండు-దొల్లి పుచ్చుకొన్నతోయ మెల్ల
మరల నిచ్చుచుండె, మహి కర్షకానంద-కంద మైనవానకందువ నొగి. 753

క. వర్షాకాలభుజంగుఁడు-హర్షముతో నిడిననవనఖాంకము లని, యు
త్కర్షింప, భూమిసతిపైఁ-గర్షకహలరేఖ లమరె గహనాంతమునన్. 754

క. చెలువుఁడు [3]ప్రావృట్కాలుఁడు-పొలసినఁ బులకించుభూమిపులకము లనఁగా
మొలచి, తల లెత్తి నిక్కుచు-సలలితగతి జాలువాఱె సస్యము లధిపా! 755

వ. మఱియుఁ జటులపవనచలితంబు లై పన్ని, మిన్ను దన్ని, లెక్కకు మిక్కిలి యై
తెక్కలు గల నీలగిరులసిరుల మీఱి, కాఱుకొని, తెఱపిపడక నిబిడంబు లై
శిశిర కిరణతరణిమండలంబులచొప్పు దప్పించి, [4]విప్పు గలిగి చదలు గప్పు

1. దవ్వులు. 2. అంతమొందెను. 3. వర్షాకాలము అనువాఁడు. 4. విస్తారము.

గొనినలీలం గ్రాలు నీలమేఘంబులును, మేఘవిముక్తంబు లయి జలదసమయ విటుండు సరసగతి ధరణీసతియురమ్మున దర్పించి, నేర్పున సమర్పించు కర్పూర ఖండంబులవడువునఁ బుడమిం బడు కరకలును, కరకానుగతంబు లై యసిత భోగిభోగంబులబాగున నీలమణిమాలికావిశేషంబులవిధంబున నెడపడక పడు సలిలధారలును, ధారాధరవిగళితవిమలసలిలంబులం దోఁగుచు మదజలాభిషిక్త మత్తమాతంగంబుల సొబగున నుండు కొండలును, కొండలతుదలనుండి గండశైలంబులపైఁబడి వికీర్యమాణంబు లగు గిరినిర్ఝరంబులశీకరంబులును, శీకరపరంపరలఁ జొదుగులు మడుగులుగొనినఁ బిదపిద నగుచుఁ జిదుకుచిదుకు మను రొంపులును, రొంపులు గ్రొచ్చి క్రచ్చఱ నుచ్చలితంబు లయి పఱచు వఱదలును, వఱదలవలన మెదలి కదలి పాటెడి యేఱులును, నేఱులవెంట గఱులు త్రిప్పుచు గములు గొని, క్రొన్నీటి కెదురునడచు మీనంబులును, మీననయనల మెఱుంగుసొంపు పెంపు సైరింపక కంపించి తిరిగి సుడిఁగి చనియెడికరణి మేఘమధ్యంబులం బొలసి, మలసి నిలువక మరలి చను క్రొమ్మె ఱుంగులును, మెఱుంగులతెఱంగున మగువలు పురుషులం దగిలి నిలువ రని, జనుల కెఱుంగ నలువ మొఱ యిడినతెఱంగున మొరయు నుఱుములును, నుఱుముల కులికిపడక కికురుపొడుచుచుఁ బింఛంబులు గొంచెంబులు సేయక విప్పి, దెప్పరంబుగ రొప్పుచు నర్తనంబులు సేయు మయూరంబులును, మయూరఘోషంబులు భీషణంబు లై చెవులు సోక నసూనంబులైన మానం బుల నాసలుసెడి, యొండొరులకుఁ గిందుపడి క్రందుకొనువిరహిజనులును, జనులకు రేపు మాపు నిరూపింప రాక, మాలతీకుసుమవిసరవికసనవిధితాన నంబు లగు దుర్దినంబులును, దినావసానసమయంబున మినుకుమినుకు మని మెఱయుచుం దిరుగు [1]ఖద్యోతంబులును, ఖద్యోతసందర్శనంబు గోరుచు నుడుగక విడువక కురియు జడిం బడి, వలిగొని వడఁకుచు నశనయత్నంబులు వర్జించి ఖర్జూరజంబూఫలభక్షణంబుల దేహసంరక్షణంబు లాచరించు వనచరు లును, వనచరానందకారిణు లయి, వారరమణులరుచి ననవరతభుజగసమేత లగు కేతకులును, కేతకికదంబయూథికాకుటజ కుసుమ పరిమళమిళితంబు లగు విపిన మార్గంబులును, మార్గనిరోధంబు లగుచుం జెరిఁగి, రసికంబు లై పసరు దొలంకుచు [2]హరిన్మణికిరణపుంజంబులభంగి రంజిల్లి, తొంగలించుచు జొంపం బులు గొనిన కసవులును, కసవులు మేసవి మిసమిసం దనువులు మెఱవ వలుఁదపొదుఁగుల బరువునం గదలక నిలిచి, నెమరు నమర నిడు ధేనువులును గలిగి, ధేనువ్రజంబుకై వడిఁ బయఃకణమనోహరంబై, హారకరంబుభంగిఁ బరిపూర్ణసారంగభాసురం బై, సురగిరిచెలువున హరిశరాసనవిభీషణంబై,

1. మిణుఁగురుపుర్వులు, సూర్యుఁడు. 2. ఇంద్రనీలమణులకిరణముల సముదాయములు.

విభీషణహృదయంబుపోలికం బ్రకటితహరిశబ్దవైభవం బై, భవపూజనంబు చందంబున [1]నింద్రగోపాదివిభవ జనకం బై, జనకయాగంబుభాతి సీతాప్రకరాలంకృతం బై, కృతయుగంబుసొంపున బహువర్షంబు నై వర్షాగమంబు చెలువొందె; నప్పుడు. 756

క. వాడక, ప్రాలక, తెవులుఁ—గూడక, తగ నల్ల గెఱలుకొని, నవకములై
చూడఁగ భద్రము లగుచును—పీడెన్ సస్యంబు; లిడుమ వీడెం బ్రజకున్. 757

క. జీవనము చాలఁ గలిగియుఁ—గావరమున మిట్టిపడని ఘనునిక్రియ, నదీ
జీవనములు సొర జలనిధి—ప్రావృట్కాలమున డిందుపడి యుండె నృపా! 758

శా. ఆ వర్షాగమమందు గోవుల నరణ్యాంతంబులన్ మేపుచున్
గోవిందుండు ప్రలంబవైరియుతుఁ డై, గోపాలవర్గంబుతోఁ
బ్రావీణ్యంబునఁ గందమూలఫలముల్ భక్షించుచున్ మంజుల
గ్రావాగ్రంబులఁ బ్రీతిఁ జల్ది గుడిచెం గాసారతీరంబులన్. 759

వ. ఆసమయంబున. 760

సీ. విశ్వమోహనమైన వేణునినాదంబు సరసగంభీరగర్జనము గాఁగ,
మహనీయనిర్మలమందహాసద్యుతి లలితసౌదామనీలతిక గాఁగ,
దలచుట్టు బాగుగఁ దనరు పింఛపుదండ శైలభేదనశరాసనము గాఁగ,
గరుణాకటాక్షవీక్షణసుధావర్షంబు సలిలధారాప్రవర్షంబు గాఁగ,
తే. జాడ నేతెంచుగోపాలజనమునీంద్ర—చాతకంబులదురవస్థ చక్కఁజేసి,
కృష్ణమేఘంబు బహుతరకీర్తినొప్పె,—విమలబృందావనాకాశవీథియందు. 761

క. గోవులవృషవత్సంబుల—వావిరిఁ బూజించి, పిదప వర్షాకాల
శ్రీవనితను బూజించెను—శ్రీవల్లభుఁ డయ్యె గోపశేఖరుఁ డధిపా! 762

వ. ఇట్లు కృష్ణుండు విహితవిహారంబుల వర్షాకాలంబు పుచ్చె; నంత. 763

### శరదృతు వర్ణనము.

క. జొంపములు గొనియె వనములు;—రొంపు లిగిరె; నెమిలిగములరొదలుడిగె; నదుల్
పెంపులకుఁ బాసె; నుఱుముల—శంపలసంపదలు మానె, శారదవేళన్. 764

వ. మఱియు జీవనంబులు విడిచి, విమలజ్ఞానవశంబున ముక్తు లగు పురుషరత్నంబుల చెన్నున, నన్ను వదలి మిన్ను విడిచి వాయువశంబులై వెల్లివిరిసి చను మేఘంబులును; మేఘపటలరహితంబును, గలశభవమునిసహితంబును నై విజ్ఞాన దీపవిలసితంబగు యోగిహృదయంబుచందంబున శుభ్రం బయినయభ్రంబును, నభ్రంబున నీలదుకూలవితాన సంయుక్తముక్తాఫలంబులవడువున నెగడు నుడు

1. ఆర్ద్రపురుగులు.

గణంబులును, నుడుగణమయూఖంబు క్రొవ్వు లువ్వెత్తుగాని నివ్వటిల్లుచు, బ్రహ్మాండకరండ కర్పూరఖండాయమానంబు లగు చంద్రకిరణంబులును, చంద్రకిరణసంస్పర్శనంబున సగర్భంబులై భూమికి దుర్భరంబు లగుచు నిండి, పండి, హాలికకరనిశితలవిత్రధారాసంరంభంబుఁ దలంచి తల్లడిల్లి, వెలువెలుకం బాఱుచుఁ దల్లి యగు విశ్వంభరకు మునుకొని, ప్రణతంబులై వడంకుచు నెఱిఁగ మొఱ యిడుచున్న పెంపున సంపన్నంబు లయిన యెన్నులవ్రేగున వ్రాలి, గాలిఁ దూలుచు, మర్మరధ్వనులసారస్యంబు లగు కలమాదిసస్యంబులును, సస్యకమంజరీపుంజంబులఁ గొంచక చంచువులఁ ద్రుంచి, కబళించి, పిల్లపెంటితండంబులం గూడి, కడుపులు నిండ మెక్కి విక్కవిరిసి, చొక్కుచుఁ, ద్రిక్కులు గొని, మహోత్తుంగ సమంచిత మంచప్రదేశంబు లెక్కి సంచరించుచు, వెన్నుల కావలియున్నయన్నులకెమ్మోవులు బింబఫలంబు లని తఱిచి, తత్కరాస్ఫాలనంబుల నులికిపడి, యెగసి చను శుకనికరంబులకలకలంబులును, గలహంసకోకసారసకోలాహలమండితంబులై నిండిన నిర్మలజలంబులు గల జలాశయంబులును, జలాశయంబులజలంబు లనుదినంబు నిగుర గృహంబుల బ్రదుకు దినంబులు సనుట యెఱుంగని మనుజులగమనికం దిరుగు జలచరంబులును, జలచరహృదయంబుల బెదరు గదుర డొంకి యింకిన నదులును, నదులందుఁ గర్పూరమండపంబుల తెఱంగున, మణికుట్టిమంబులమాడ్కిని, సౌధసోపానమార్గంబులజాడను, విలోకితంబు లగు నూతనసైకతంబులును, సైకతప్రదేశంబుల నుదయవేళల నిత్యకర్మానుష్ఠాననిరతు లగు మునులును, మునికన్యకాకరకలశ సలిలాభిషిక్తమూలంబు లగు తపోవనబాలరసాలసాలంబులును, సాలవిటపివాసంతికాకుంజపుంజంబులతఱచున నిముడుకొని దినకరకిరణంబులకుం గరువలికిం జొరవెరవుపడని వనమ్ములును, వనమ్ములం దరుల కొనల నాకలములు నేకలములై మెసంగి మసరుకవిసి క్రొవ్వి కొమ్ముకొనల నూటి, నేటిదరులు త్రవ్వి, చిమ్మి కుమ్మి కోరాడెడి వనగజంబులును, గజకుంభ కనకకుంభరుచిరకుచభారభీరుమధ్య సమంచిత లగు చెంచితలును, చెంచితల క్రూరమ్ములగు వాలమ్ములసారమ్ములు సెడి, ఖేదమ్మునఁ బాదమ్ములు దొట్రుపడఁ బెనుగాతమ్ములం బడు వరాహపుండరీకంబులును, బుండరీకకుముదకురంటకాది కుసుమమకరందంబులు గ్రోలి, తేలి, సోలి, వ్రాలి, మహాహంకృతుల ఝుంకృతులు సేయు [1]తేఁటికదుపులును, గదుపులం గలయక యెడ గలిగి, మదమున నడనుపడ నెఱింగి, మదనమార్గణప్రేరితంబులై పెంటితుటుముల వెంటంజని, యొండొంటి గెంటించుచుఁ దగుల నెక్కి గర్భంబులు నెక్కొలుపు మృగవృషభరాజంబులును గలిగి, రాజరాజగృహంబుపగిది విలసితకుందపద్మ

1. తుమ్మెదలగుంపులు.

సౌభాగ్యంబై, భాగ్యహీను కర్ణంబు రేఖ గతి నశ్రుతసలకంఠ శబ్దంబై,
శబ్దశాస్త్రవేదిహృదయంబు బాగున నైశ్వప్రకాశాభిరామంబై, రామసంగ్రా
మంబుకై వడి బాణాసనాలంకృతంబై, [1]కృతాంతహృదయంబుకరణి నపం
కంబై, పంకజాసను గేహంబుసొంపున రాజహంసవిరాజమానంబై, మాన
ధనునిచరిత్రంబుసొబగున నకల్మషజీవనంబై, వననిధిపొలుపున సమ్మిళిత
భూభృద్వాహినీసంకులంబై, కులవధూరత్నంబు చెలువున నదృష్టపయో
ధరంబై, ధరణికిం దొడ వగుచు శరత్కాలంబు వచ్చె; నంత. 765

క. వాజుల నీరాజనములు-రాజులజయగమనములును, రాజితలక్ష్మీ
పూజలు దేవోత్సవములు-రాజిల్లెను జగతియందు రాజకులేంద్రా! 766

క. [2]చేగ గల చెఱకువింటను-బాగుగ నలోత్పలంబు బాణంబుగ, సం
యోగంబు సేసి, మదనుఁడు-వేగంబున విరహిజనుల వేఁటాడె నొగిన్. 767

వ. ఇట్లు భాసురంబు లయిన శరద్వాసరంబుల, గోవిందుఁడు గోబృందసమేతుం డై
బృందావనంబునఁ బసులఁ బొసంగ మేపుచు. 768

సీ. కర్ణా[3]వతంసితకర్ణికారప్రభ గండభాగద్యుతిఁ గడలుకొలుప,
భువనమోహన మైన భ్రూవిలాసంబుతో వామభాగానతవదన మొప్ప,
నపసవ్యకరమృదులాంగుళిచాతురి షడ్జధ్వనికి మర్మసరణిఁ జూప,
డాకాలిమీఁద నడ్డము సాఁచి నిల్పిన పదనఖద్యుతి భూమిఁ బ్రబ్బికొనఁగ,
తే. మౌళిపింఛముఁగంఠదామమును మెఱయ, విలసితగ్రామముగ నొక్క వేణువందు
బ్రహ్మగాంధర్వగీతంబు పరఁగ జేసెఁ-జతురనటమూర్తి గోపాలచక్రవర్తి. 769

వ. ఇట్లు హరి వేణునాదంబు పూరించిన, మారవికారహేతు వగు తద్గీతం
బాలించి, సిగ్గులు సాలింప, మక్కువలు నెక్కొత్త, గోపిక లోపికలు లేక,
తమతమ పొత్తుకత్తెలుం, దారును, దత్తఱంబునఁ బసుగురు నే గుఱుఁ
దులుములు గట్టి, జిలిబిలిముచ్చటలకుం జొచ్చి, తమలోన. 770

మ. "శ్రవణోదంచిత[4]కర్ణికారకముతో, స్వర్ణాభచేలంబుతో,
నవతంసాయితకేకిపింఛకముతో, నంభోజదామంబుతో,
స్వవశుం డై, మధురాధరామృతముచే వంశంబుఁ బూరించుచు,
న్నవిదా! మాధవుఁ డాలవెంట వనమం దొప్పారెడిం; జూచితే. 771

శా. రావే సుందరి! యేమె బోటి! వినవే; రాజీవనేత్రుండు బృం
దావీథిం దగ వేణు వూఁదుచు, [5]లసత్సవ్యానతాస్యంబుతో,

---

1. యమధర్మరాజు మనస్సు. 2. చేవ. 3. భూషణముగాఁ జేయఁబడిన. 4. కొండగోఁగు పువ్వు. 5. ప్రకాశించుచున్నట్టి యెడమప్రక్కకు వంచిన ముఖముతో.

భూరివిన్యాసము లంగుళీక్రమములుం బొల్పార, షడ్జంబుగాఁ *
గావించెన్ నటుభంగి బ్రహ్మ మగు తద్గాంధర్వసంగీతమున్. 772

క. తలఁకెను గొబ్బునఁ జిత్తము, నలినాక్షునిమధురవేణునాదము నా వీ
నులు సోఁకినంతమాత్రన—చెలియా! యిఁక నేటివెఱపు చింతింపఁగదే? 773

క. నాతోడ వెఱవ వలదే;—నాతోడనె కొనుచుఁ బోయి నలినదళాక్షున్
నీతోడుతఁ బలికించెద;—నీతోడిజనంబు మెచ్చ నీతోడు సుమీ!" 774

వ. అని పెక్కుభంగుల నోర్తోర్తు నుద్దేశించి పలుకుచు, గోసుందరులు బృందా
వనంబునకు గోవిందున కెదురు చని, పరమానందంబున నతనిం దమమనంబులఁ
బ్రతిపదంబును నాలింగనంబు సేసినవారలగుచు, రామకృష్ణుల నుద్దేశించి.

మ. "[1]నవగోస్థానకరంగమందుఁ బరమానందంబుతోఁ జూతప
ల్లవనీలోత్పలపింఛపద్మదళమాలావస్త్రసంపన్ను లై
కవ లై వేణువు లూఁదుచున్, బహునటాకారంబులం, గేళితాం
డవముల్ సేసెద రీ కుమారకులు; వేడ్కం గామినుల్ గంటిరే! 776

క. ఓ చెలువలార! వినుఁడీ; వాచాశతకంబు లేల వర్ణింపంగా?
లోచనములకలిమికి ఫల,—మీ చెలువురఁ జూడఁగలుగు; టింతియ సుండీ!"

వ. అని పలికి; రందుఁ గొందఱు గోవిందు నుద్దేశించి. 778

మ. "ఒనరన్ వ్రేతల కించు కేని నట లే కుండంగ, గోపాలకృ
ష్ణునికెమ్మోవిసుధారసంబు గొనుచుం, జోద్యంబుగా మ్రోయుచుం,
దనపర్వంబులు నేత్రపర్వములుగా దర్పించెఁ; బూర్వంబునన్
వనితా! యెట్టితపంబు సేసెనొకొ యీ వంశంబు వంశంబులోన్? 779

మ. ముదితా! యే తటినీపయఃకణములన్ మున్ వేణు విం తయ్యె? నా
నది సత్పుత్త్రునిఁ గన్నతల్లిపగిది, న్నందంబుతో నేఁడు స
మ్మద హంసధ్వనిపాటగా వి[2]కచపద్మశ్రేణిరోమాంచ మై,
యొదవం దుంగతరంగహస్తనటనోద్యోగంబు గావింపదే? 780

క. నలినోదరుభక్తునిఁ గని,—కులజులు నందాశ్రుజలము గురియుపగిది, మ్రాఁ
కులు పూఁదేనియ లొలికెడు,—నలినాక్షుని చేతివంశనాళము మ్రోఁతన్. 781

శా. నా మోసంబున కెద్ది మేర? వినవే నాపూర్వజన్మంబులన్
లేమా! నోములు, నోఁచుచో, నకట! కాళిందీతటిన్ వేణు వై

* ఈ పద్యమందును 769 వ సీసమందును గల షడ్జశబ్దము ఏ సంగీత పద్ధతిని సూచించునో దురూహము. 1. క్రొత్తగోష్ఠమను రంగస్థలమున. 2. వికసించిన కమలముల గగుర్పాటుగా.

భూమిం బుట్టెడు నంచుఁ గోరఁ దగదే బోఁధిల్లి? యట్లైన నీ[1]
జామం దిప్పుడు మాధవాధరసుధాపానంబు గల్గుం గదే? 782

క. కాళిందీకూలంబున,-నాళీ! యీనందతనయునధరామృతముం
గ్రోలెడివేణువ నగు నో,-మేలాగున నోచఁవచ్చు? నెఱిఁగింపఁగదే! 783

క. వనితా! కృష్ణుఁడు నల్లని,-ఘన మనియున్, వేణురవము గర్జన మనియున్,
మనమునఁ దలంచి, రొప్పుచు,-ననవతరము నెమిలితుటుము లాడెడిఁ గంటే?

క. గిరిచరమిథునము లోలిం,-జరికింపఁగఁ, గృష్ణపాదపద్మాంకిత మై
సురరాజునగరికంటెను,-దరుణీ! బృందావనంబు దద్దయు నొప్పెన్. 785

మ. అమరేంద్రాంగన లాకసంబున విమానారూఢ లై పోవుచుం
గమలాక్షున్ శుభమూర్తిఁ గాంచి, మురళీగానంబు లం దంద క
ర్ణములన్ నిల్పుచు, మేఖలల్ వదలఁగా, నాథాంకమధ్యంబులం
బ్రమదా! వ్రాలిరి; చూచితే వివశ లై పంచాశుగభ్రాంత లై. 786

ఉ. కానల నుండుచున్, సరసగానవివేకవిహీనజాతు లై
పీనుల నేఁడు కృష్ణముఖవేణురవామృతధార సోఁకినన్,
మేనులు మేఁతలున్ మఱచి, మెత్తనిచూడ్కి మృగీమృగావళుల్
మానిని! చూడ వమ్మ! బహుమానము సేసెఁ గృతార్థచిత్త లై. 787

ఉ. తల్లుల చన్నుబాలు మును ద్రావుతఱిన్, దమకర్ణవీథులన్
వల్లభ మైన మాధవునివంశరవామృతధార సొచ్చినం,
దుల్లక పాలు రాఁ దివక, దూఁటక, మానక, కృష్ణుమీఁద [2]దృ
గ్వల్లులు సేర్పి, నిల్చె నదె వత్సము; లంగనలార! కంటిరే. 788

మ. మమతన్ మోములు మీఁది కెత్తుకొని [3]రోమంథంబు సాలించి, హృ
త్కమలాగ్రంబులఁ గృష్ణు నిల్చి, మురళీగానామృతశ్రేణి క
ర్ణములం గ్రోలుచు, మేఁతమాని గళితానందాశ్రు లై చిత్రితో
పమ లై గోవులు సూచుచున్న; వదిగో పద్మాక్షి! వీక్షించితే! 789

మ. జగతీజంబులశాఖ లెక్కి, మురళీశబ్దామృతస్యందమున్
మిగులన్ వీనులఁ ద్రావి, [4]ప్రేఁగువడి నెమ్మిం గృష్ణురూపంబు చి
త్తర మై యుండఁగ నడ్డపెట్టుక్రియ, నేత్రంబుల్ దగన్ మూసి, యీ
ఖగముల్ సొక్కెడిఁ జూచితే? మునిజనాకారంబులం గామినీ! 790

మ. క్రమ మొప్పన్ నదు లెల్ల వంశరవ మాకర్ణించి, సంజాతమో
హములన్ మన్మథసాయకక్షతవిశాలావర్త లై, హంసవా

1. ఈ జన్మమున. 2. తీగలవంటి చూపులు. 3. నెమరువేయుట. 4. భారమును పొంది.

క్యములం జేరి, తరంగహస్తముల నాకర్షించి; పద్మోపహా
రములం గృష్ణపదార్చనంబు సలిపెన్; రామా! విలోకించితే! 791

ఆ. వనిత! నేఁడు కృష్ణువంశనినాదంబు-విని, పయోధరంబు విరులు గురిసి,
తనశరీర మెల్ల ధవళాతపత్త్రంబుఁ-జేసి, మింట నీడఁ జేసెఁ గంటె? 792

క. మంచిఫలంబులు హరిచే-నించి, కరాలంబనముల నెగడుచు, నిదె క్రీ
డించెడు; రంగన! చూడుము-చెంచితలం బింఛపత్త్రచేలాంచితలన్. 793

క. ఉల్లసితకుచభరంబుల-నల్లాడెడి నడుముతోడ నలరులకండ్లన్
భిల్లి యొకతె హరి కిచ్చెను-హల్లోహలకలిత యగుచు, నంగన! కంటే! 794

క. గిరు లెల్ల జగము లయ్యెం-దరు లెల్లను [1]బల్లవించె ధరణిగగనభూ
చరు లెల్లను జొక్కిరి; హరి-మురళీరవామృతము సోఁక ముద్దియ! కంటే! 795

మ. బలకృష్ణాంఘ్రిసరోజసంగమముచే భాసిల్లుచున్, ధన్యమై
ఫలపుష్పంబులఁ గానికల్ గురిసి, సంభావించి, మిన్నందుచున్
జలఘాసంబుల గోవులం దనిపి, చంచద్వ్యాజరోమాంచమై
వెలసెం జూడఁగదమ్మ! యీ గిరి పురోవీథిన్ సరోజాననా!" 796

వ. అని యిట్లు బృందావనవిహారి యైన గోవిందుని సందర్శించి, పంచబాణభల్ల
భగ్నహృదయ లయి, వల్లవకాంత లేకాంతంబులఁ జింతించుచుఁ, దత్పరతంత్ర
లయి యుండి; రంత. 797

## హేమంతఋతువర్ణనము

క. శామంతికాస్రగంచిత-[2]సీమంతవతీకుచోష్మజితశీతభయ
శ్రీమంతం బయి, గొబ్బున-హేమంతము దోఁచె; మదనుఁ డేఁచె విరహులన్.

క. ఉత్తరపుగాలి విసరె; వి-యత్తలమున, దుహినకిరణుఁ డహితుం డయ్యెం;
బొత్తు జరిగె మిథునములకు-నెత్తమ్ములు దఱిఁగె; హిమము నెలకొనియె నృపా!

క. అహములు సన్నము లయ్యెను-దహనము హిత మయ్యె; దీర్ఘదశ లయ్యె నిశల్;
బహుశీతోపేతం బయి-'యుహుహుహూ!' యని వడఁకె లోక; ముర్వీనాథా! 800

క. అన్నులచన్నులకండ వి-పన్నులు గా కెల్లవారు బ్రదికిరి గా, కీ
చన్నులు మీఱిన వలి నా-పన్నులు గా కుండఁదరమె బ్రహ్మాదులకున్? 801

ఆ. [3]పొడుపుఁగొండమీఁదఁ బొడుచుట మొదలుగాఁ-బరువు వెట్టి యినుఁడు పశ్చిమాద్రి
మఱుఁగుఁ జొచ్చెఁగాక! మసలినఁ జలిచేతఁ-"జిక్కెఁ, జిక్కె" ననఁగ జిక్కకున్నె?

1. చిగిరించెను. 2. పాపటగలది. (స్త్రీ) 3. ఉదయపర్వతము.

క. చెంగల్వవిరులగంధము-మంగళముగఁ గ్రోలుచున్నమధుపము లొప్పె
న్నంగజవహ్నులపై నొ-ప్పొంగి విజృంభించు పొగలపోలిక నధిపా! 803

ఆ. శంభుకంట నొకటి, జలరాశి నొక్కటి-మఱియు నొకటి మనుజమందిరముల,
నొదిఁగెఁ గాక! మెఱసి యున్న [1]మూఁడగ్నులు-చలికి నులికి భక్తి సలుపకున్నె?

శా. ఈహేమంతము రాకఁ జూచి, రమణీహేలాపరీరంభస
త్సాహాయ్యంబునఁ గాని, దీని గెలువన్ శక్యంబు గా; దంచుఁ దా
రూహాపోహవిధిం ద్రిమూర్తులు సతీయుక్తాంగులై నారుగా;
కోహో! వార లదేమి సంతతవధూయోగంబు రాఁ గందురే? 805

క. ఈహేమంతము రాకకు - శ్రీహరి యొక్కింత వడఁకి, చింతింపంగా
'నోహో! వెఱవకు' మని తా-మాహరికిని శ్రీకుచంబు లభయం బిచ్చెన్. 806

వ. ఇట్లు నితాంతం బగు హేమంతంబున మొదలినెలతొలిదినంబునందు నందుని మందం గల గోపకుమారికలు రేపకడ లేచి చని, కాళిందీజలంబులం దోఁగి, జలతీరంబున నిసుమునం గాత్యాయనీరూపంబుఁ జేసి, సురభికుసుమగంధంబు లిడి, ధూపదీపంబు లిచ్చి, బహువిధోపహారంబులు సమర్పించి. 807

క. "ఓకాత్యాయని! భగవతి!-నీకున్ మ్రొక్కెదము; నేము; నేఁ డనుకంపన్
మా కిందఱకును వైశమ-శ్రీకృష్ణుఁడు మగఁడు గాఁగఁ జేయుము తల్లీ! 808

క. ఓతల్లి! మాకుఁ గృష్ణుఁడు-చేతోవిభుఁ డైననాఁడు చెలువల మెల్లన్
నేతివసంతము లాడుచు-జాతర సేసెదము భక్తిచాతురితోడన్." 809

వ. అని నమస్కరించి, హవిష్యంబులు గుడుచుచు నివ్విధంబున మాసవ్రతంబు సలిపి; రం దొక్కనాఁడు. 810

## గోపికావస్త్రాపహరణము

మ. రమణుల్ ప్రొద్దున మేలుకాంచి, సఖులన్ 'రం' డంచు నాత్మీయనా
మములం జీరి, కుచద్వయీభరములన్ మధ్యంబు లల్లాడఁగాఁ
బ్రమదోద్దామగజేంద్రయాన లగుచుం బద్మాక్షునిం బాడుచున్
యమునాతీరముఁ జేరఁబోయిరి, గృహీతాన్యోన్యహస్తాబ్జలై. 811

వ. ఇట్లు నదీతీరంబు సేరం జని, గజగమనలు విజనస్థలంబున వలువలు విడిచి, యిడి మది శంక లేక యకలంకలై క్రుంకు లిడఁ జలంబుల జలంబులు సొచ్చి.

క. వారిజలోచనుఁ బాడుచు-వారిజలోచనలు వారివారికి వేడ్కన్
[2]వారివిహారము సలిపిరి-వారివిహారములు జగతివారికిఁ గలవే? 813

1. ఆహవనీయము, గార్హపత్యము, దక్షిణాగ్ని. 2. వారి సంచారములు, జలక్రీడలు.

వ. ఆసమయంబున. 814

క. తోయజనయనలు యమునా-తోయములం దుండు వెఱఁగి, దూరగుఁడయ్యెం
దోయజనయనుఁడు హరి తన-తోయముఁ గోపకులు దానుఁ దోఁతెంచె నృపా!

తరలము. 'కదలకుం' డని తోడివారలఁ గన్నుసన్నల నిల్పుచుం,
బదము లొయ్యన నేలఁ బెట్టుచుఁ, బద్మనేత్రుఁడు మౌని యై,
పొదలమాటున నల్లనల్లన పొంచి పొంచి, నతాంగుఁ డై
యదను గోరుచు డాసి వ్రేతలయంబరంబులు దొంగిలెన్. 816

వ. ఇట్లు దొంగిలి. 817

శా. ఉద్యద్గంధగజేంద్రగౌరవముతో, యోషాంబరంబుల్ విభుం
డాద్యుం డర్భకుభంగి నర్భకులతో, హాసార్థియై కొంచుఁ ద
న్నద్యంభఃకణశీతవాతజనితానందంబుతో నెక్కెఁ దా
సద్యోముక్తదురంతపాదపజనుస్సంతాపమున్ [1]నీపమున్. 818

వ. అప్పు డయ్యింతు లి ట్లనిరి. 819

క. "మామావలువలు ముట్టకు;-మామా! కొనిపోకు; పోకు; మన్నింపు; తగన్
మామాన మేల కొనియెదు?-మామానసహరణ మేల? మానుము; కృష్ణా!

సీ. [2]బహుజీవనముతోడ భాసిల్లి యుండుటో? గోత్రంబు నిల్పుటో కూర్మితోడ?
మహినుద్ధరించుటో? మనుజసింహంబవై ప్రజలఁ గాచుటో? కాక బలిఁ దెరల్చి
పిన్నవై యుండియుఁ బెంపు వహించుటో? రాజుల గెల్చుటో రణములందు?
గురునాజ్ఞ సేయుటో? గుణనిధి వై బలప్రఖ్యాతిఁ జూపుటో? భద్రలీల

ఆ. బుధులు మెచ్చభువిఁ బ్రబుద్ధన మెఱయుటో?-కల్కితనము సేయ ఘనత గలదె?
వావి లేదు; వారువారు నావా రను-నెఱుక వలదె? వలువ లిమ్ము; కృష్ణ! 821

క. కొంటివి మాహృదయంబులు;-గొంటివి మానంబు; లజ్జఁ గొంటివి; వలువల్
గొంటె; విఁక నెట్లు సేసెదొ? కొంటెవు గద! నిన్ను నెఱిఁగికొంటిమి కృష్ణా!

సీ. రాజసంబున నీవు రంజిల్లు టెఱుఁగమే, చెలరేఁగి వింతలు సేయుచుండ?
సత్త్వసంపద గల్గి జరగుటఁ దలఁపమే, సిరి గల్గి యన్యులఁ జెనకుచుండ?
గురుతరశక్తియుక్తుఁడ వౌట యెఱుఁగమే, తామసంబున నెగ్గు దలఁచుచుండ?
నొకభంగితో నుండకుంటఁ జింతింపమే, మాయావి వై మాఱుమలయుచుండ?

ఆ. నేమిజాడవాఁడ; వేపాటి గలవాఁడ-వేగుణంబు నెఱుఁగ; వెల్లయెడల
నొదిఁగి యుండనేర; [3]వోరంతప్రొద్దును-బటము లీఁగదయ్య! పద్మనయన! 823

1. కదంబవృక్షము. 2. అధికమగు నీరు. 3. క్షణకాలమును

క. రాజుల నెఱుఁగవు; బలిమిని-రాజిల్లెదుచీర లీవు; రమణుల మింకన్
రాజునకెఱిఁగించెద; మో-రాజీవదళాక్ష! నీవు రాజవె ధరకున్?"

వ. అని పలికినకన్నియలపలుకు లాలించి, మందహాససుందరవదనారవిందుం డై గోపాల బాలకులకరంబులం గరంబులు వ్రేసి, యమ్ముద్దియల నుద్దేశించి, నెఱవాది చతురుం డి ట్లనియె. 825

శా. "రామల్ రాజులతోడ నీపనికి నారంభింతురే మీక్రియన్?
మోమో టేమియు లేక దూఱెదరు; మీమోసంబు చింతింప; రం
భోమధ్యంబుననుండి వెల్వడి వెసం బూర్ణేందుబింబాననల్
మీమీచీరలు వచ్చి పుచ్చుకొనుఁడా? మీ కిచ్చెదం జెచ్చెరన్." 826

వ. అనిన నమ్మానవతు లొండొరులమొగంబులు సూచి, నగుచు మర్మంబులు నాఁటు నమ్మాటలకు మఱుడం బలుక సిగ్గుపడుచు, నగ్గలం బయిన చలిని వలిగొని, కంఠప్రమాణజలంబులం దుండి డోలాయమానమానస లై యిట్లనిరి. 829

క. "మావలువ లాగడంబున-నీ వేటికిఁ బుచ్చుకొంటి? నీ వల్లుఁడవే?
నీవెఱుఁగని దే మున్నది?-నీ విందఱిలోన ధర్మనిరతుఁడవు గదే?

శా. ఇంతుల్ [1]తోయము లాడుచుండ మగవా రేతెంతురే? వచ్చిరా?
యింతల్ సేయుదురే కృపారహితులై యేలోకమం దైన? నీ
వింతల్ నీతలఁ బుట్టెఁ గాక; మఱి యేవీ? కృష్ణ! యోచెల్ల! నీ
చెంతన్ దాసులమై చరించెదము; మాచేలంబు లిప్పింపవే. 829

క. వచ్చెదము నీవు పిలిచిన-నిచ్చెద మే మైనఁగాని, యెటఁ జొర మనినం
జొచ్చెదము; నేఁడు వస్త్రము-లిచ్చి మముం గరుణతోడ నేలుము కృష్ణా! 830

వ. అనిన దరహాసితవదనుం డై హరి యి ట్లనియె. 831

క. ఏతరుణుఁడు మగఁ డౌటకు-మీతపములు సెప్పఁ; డింక మీయానలు సుం
డీ! తప్పిన నీకూరిమి-మీతలలనె పుట్టెనోటు; మేదిని లేదే! 832

క. ఎవ్వనిఁ గని మోహించితి-రెవ్వఁడు మీమానధనము లెల్ల హరించెన్;
నివ్వటిలె మీకుఁ గూరిమి-యెవ్వనిపైఁ బలుకరాదె? యే నన్యుఁడనే?" 833

వ. అనిన విని సుందరు లన్యోన్యసందర్శనంబులు సేయుచు, హృదయారవిందంబు లందుఁ గందర్పుండు సందడింప నగుచు, నిరుత్తర లయి యున్న లోకోత్తరుం డి ట్లనియె. 834

1. స్నానముచేయుచుండఁగా.

క. "నాయింటికి దాసుల రై-నాయాజ్ఞ వహించి మీరు నడచెద రేనిన్?
మీయంబరంబు లిచ్చెదఁ-దోయంబులు వెడలి రండు తోయ్యలులారా!" 835

వ. అనిన విని [1]హరిమధ్యలు చలికి వెఱచి, సలిలమధ్యంబున నిలువ నోపక. 836

క. కొండలు వెడలుద మందురు-కొండలు వెడలుటయు సిగ్గుఁ గొను గోవిందుం
డందురు; కొండలు దమలోఁ-గొండలమందుదురు వడఁకుగొని మనుజేంద్రా!

వ. మఱియు నెట్టకేలకుఁ జిత్తంబులు గట్టిపఱచుకొని, తనుమధ్యలు తోయమధ్యం
బు వెలువడి. 838

క. చంచత్పల్లవకోమల-కాంచననవరత్నఘటితకంకణరుచిరో
దంచితకరసంఛాదిత-పంచాయుధగేహ లగుచుఁ బడఁతులు వరుసన్. 839

వ. చని, ప్రౌఢ లైనసుందరుల ముందట నిడుకొని, మందగమనలు మందహాసంబు
తోడ నెదుర నిలిచిన, నరవిందనయనుం డి ట్లనియె. 840

సీ. శృంగారవతులార! సి గ్గేల మిముఁ గూడి పిన్ననాఁటను గోలెఁ బెరిఁగినాఁడ;
నెఱుఁగనే మీలోన నెవ్వఁడు నున్నాఁడ; నేను జూడనిమర్మ మెద్ది గలదు?
వ్రతనిష్ఠ లై యుండి వలువలు గట్టక నీరు సొత్తురె మీరు నియతి దప్పి?
కాత్యాయనీదేవిఁ గల్ల సేయుట గాక; యీరీతి నోఁచువా రెందుఁ గలరు?
ఆ. వ్రతఫలంబు మీరు వలచినఁ, జక్కఁగ-నింతు లెల్లఁ జేతు లెత్తి మ్రొక్కి,
చేరి పుచ్చుకొనుఁడు చీరలు; సిగ్గు వో-నాడ నేల? యెగ్గు లాడ నేల?" 841

వ. అనిన విని మానవతులు దమలోన. 842

మ. "వ్రతముల్ సేయుచు నొక్క మా టయిన నెవ్వానిన్ విచారించినన్,
వ్రతభంగంబులు మాను; నట్టి వరదున్, వామాక్షు లీక్షించియున్,
"గతచేలాప్లవనంబు నేఁడు వ్రతభంగం" బంచు శంకించి, ఫా
లతటన్యస్త కరాబ్జ లై, సరసలీలన్ మ్రొక్కి ర ట్లందఱున్. 843

క. బాలలకు, హస్తకీలిత-ఫాలలకు, నితాంతశీతపవనాగమనా
లోలలకు, నంబరములు గృ-పాళుఁడు హరి యిచ్చె, భక్తపాలకుఁ డగుటన్.

ఆ. చీర లపహరించి, సిగ్గులు విడిపించి,-పరిహసించి యైనఁ, బరఁగ మనకు
ఘనుఁడు నోముకొఱఁత గాకుండ మ్రొక్కించె;' ననుచు హరినుతించి రబల లెల్ల.

క. ఉల్లములు నొవ్వ నాడినఁ, గల్లలు సేసినను, నగినఁ, గలఁచిన నైనన్
వల్లభులు సేయుకృత్యము-వల్లభలకు నెగ్గు గాదు; వల్లభ మధిపా. 846

1. సింహమునడుమువంటి నడుముగలవారు.

వ. ఇట్లు హరి వలువ లిచ్చినం గట్టుకొని, సతు లతనియందు బద్ధానురాగ లయ్యు, జలింపక, తెప్పలిడక, తప్పక చూడ, నాప్రోడ మెచ్చెరిగి, చేరి వారి కిట్లనియె.

సీ. "లక్షణవతులార! లజ్జించి చెప్పరు; గాని, మీమర్మముల్ గానఁ బడియె;
నను గొల్వఁ జింతించినారు; నాచేతను సత్యంబు మీనోము సఫల మగును ;
గామితార్థంబులకలిమిఁ జెప్పఁగ నేల! ననుఁ గొల్వ ముక్తికి నడవ వచ్చుఁ;
గడమ కూడఁగ, నంబికాదేవి నోఁచంగ, నటమీఁద రాత్రులయందు మీకు

ఆ. నన్నుఁ బొందఁ, గల్గు; నమ్మి పొం;"డని హరి-పల్క, నింతు లెల్లభ్రాంతిఁ జనిరి;
'తపము పండె'ననుచుఁ దత్పదాంభోజముల్-మానసించుకొనుచు మందకడకు.

మునిభార్య లన్నముఁ దీసికొని వచ్చి శ్రీకృష్ణుని నారగింపఁజేయుట.

వ. ఇట్లు గోపకన్యకలందఱుఁ బ్రసన్నుం డై, గోవిందుండు బృందావనంబు దాఁటి, దూరంబున ధేనువుల మేపుచుండఁ, జండకిరణునియెండం బడి, దండిచెడి తరుల దండ నండగొనుచు, [1]నాతపత్రాకారంబులై నీడలు సేయుచున్న వృక్షంబుల నీక్షించి, కృష్ణబల శ్రీదామ దేవప్రస్థవిశాలార్జున ప్రముఖులకుం దక్కిన గోపకులి ట్లనిరి. 849

మ. "అపకారంబులు సేయ వెవ్వరికి? నేకాంతంబులం దుండు [2]నా
తపశీతానిలవర్ష వారణము లై, త్వగ్గంధనిర్యాసభ
స్మపలాశాగ్రమరందమూలకుసుమచ్ఛాయాఫలశ్రేణిచే
నుపకారంబులు సేయు నర్థులకు నీయుర్వీజముల్ గంటిరే?" 850

వ. అని చిగురాకు, పువ్వు, గాయ, పండు తండంబులవ్రేఁగున వీఁగినతరువులనడిమి తెరువునం బసుల దాఁటుల దాటించి, యమునకుం జని, వెడఁదమడుఁగుల మెల్లన చల్లనినీరు ద్రావించి, తత్సమీపంబున మేపుచు, వల్లవులెల్ల మూఁకలు గొని, 'యాఁకలిగొంటి'మని విన్నవించినఁ, దనకు భక్తురాండ్రగు విప్రభార్యలవలనం బ్రసన్నుఁడై, వారలం జూచి, రామసహితుం డై నహరి యి ట్లనియె. 851

సీ. "వల్లవులార! యీవనమునవిప్రులు, బ్రహ్మవాదులు దేవభవనమునకు
నరుగుట [3]కాంగిరసాహ్వయసత్త్రంబు సలుపుచు నున్నారు; సనుఁడు మీరు;
మానామములు సెప్పి, మైత్రితో నడిగిన, నన్నంబు వెట్టెద;" రనుచుఁ బలుక
వారలు చని, విప్రవరుల కెల్లను మ్రొక్కి, "పసుల మేపుచు బలభద్రకృష్ణు

తే. లలసి పుత్తెంచి, రిట మమ్ము నన్న మడుగ;-ధర్మవిదులార! యర్థిప్రదాతలార!
పెట్టుఁ డన్నంబు; శ్రాంతులఁ బిలిచి తెచ్చి-పెట్టుదురుగాదె మిముబోఁటి పెద్దలెల్ల?

1. గొడుగుయొక్క రూపముగలవి. 2. ఎండ, చలి, గాలి, వర్షము నను నిలుపునవి. 3. అంగిరసము అను పేరుగల యజ్ఞము.

క. ఘనదీక్షితునకు నైనం-జనుఁ గుడువంగఁ బశువధంబు, [1]సౌత్రామణియుం,
జనిన వెనుక దోషము లే;-దనఘాత్మకులార! పెట్టుఁ డన్నము మాకున్." 853

వ. అని గోపకులు పలికిన. 854

మ. క్రతువున్, మంత్రముఁ, దంత్రమున్, ధనములుం, గాలంబు, దేశంబు, దే
వతయున్, ధర్మము, నన్యముల్, దలఁప నెవ్వాఁ; డట్టి సర్వేశ్వరున్
మతి నూహింపక, గోపబాలుఁ డనుచున్, మందస్థితిం జూచి, దు
ర్మతులై "యన్నము లేదు లే"దనిరి [2]సమ్మానక్రియాశూన్యులై. 855

వ. అంత గోపకులు నిరాశులై వచ్చి, యెఱింగించిన, హరి లౌకికానుసారి యగుచు "మీ రయ్యార్యుల నడుగక, వారిభార్యలకు మా రాకం జెప్పుఁ; డన్నంబు పెట్టెద"రని పంచిన, వారలు నని, బ్రాహ్మణసతుల దర్శించి, నమస్కరించి, సంపూజితులై యి ట్లనిరి. 856

క. "గోవుల మేపుచు నాఁకొని-గోవిందుం 'డన్న మడిగికొని రం'డని మ
మ్మీవేళం బుత్తెంచెను-ధీవిలసితలార! రండు; తెం డన్నంబుల్." 857

వ. అనిన విని, గోవిందదర్శనకుతూహలలై ధరణీసురసుందరులు సంభ్రమానందంబులు డెందంబులం సందడింప, భక్ష్య భోజ్య లేహ్య చోష్య పానీయ భేదంబులుం గలిగి సంస్కారసంపన్నంబులైన యన్నంబులు కుంభంబుల నిడికొని, సంరంభంబుల సముద్రంబునకు నడచు నదుల తెఱంగున. 858

క. బిడ్డలు, మగలును, భ్రాతలు-నడ్డము చని, 'వల' దనంగ 'నటు దలఁ' డని మా
ఱొడ్డుచు, జగదీశ్వరునకు-జడ్డన నన్నంబు గొనుచుఁ జని రా సుదతుల్. 859

వ. చని యమునాసమీపంబున నవపల్లవాతిరేకంబును విగతవనచరశోకంబును నైన యశోకంబు క్రింద నిర్మలస్థలంబున. 860

సీ. ఒక చెలికానిపై నొక చేయి సాఁచి, వే ఱొక చేత లీలాబ్జ మూఁచువానిఁ,
గొప్పున కందనికొన్నికుంతలములు సెక్కుల నృత్యంబు సేయువానిఁ,
గుఱుచచుంగులు పుచ్చి, కొమరారఁ గట్టిన పసిఁడివన్నియ గల పటమువాని,
నొడలఁ దిరిగి రా నలవడఁ జుట్టిన దట్టంపుఁబించెపుదండవాని,
తే. రాజితోత్పల[3]కర్ణపూరములవాని-మహితపల్లవపుష్పదామములవాని,
భువనమోహననటవేషభూతివానిఁ-గనిరి కాంతలు కన్నులకఱవు దీఱ. 861

క. కనిలోచనరంధ్రంబుల-మును మిడి, హరిలలితరూపమును లోఁగొని, నె
మ్మనములఁ బరిరంభించిరి-తనుమధ్యలు హృదయజనితతాపము వాయన్. 862

---

1. ఒక యజ్ఞము. 2. సత్కారకార్యములేనివారు. 3. చెవులకుఁ బెట్టుకొను సొమ్ము కలవానిని.

వ. ఇవ్విధంబున. 863

క. వారితసర్వస్పృహలై - వారందఱుఁ దన్నుఁ జూడ వచ్చుట, మదిలో
వారిజనయనుఁడు వొడగని - వారికి ని ట్లనియె నగి, యవారితదృష్టిన్. 864

శా. "కాంతారత్నములార! మీగృహములం గల్యాణమే? యేమి గా
వింతుర్ మీకిటు రండు; మమ్ము నిచటన్ వీక్షింప నేతెంచినా
రెంతే వేడుకతో; నెఱుంగుదును; నిర్హేతుస్థితిన్ నన్ను ధీ
మంతుల్ మీ క్రియఁ జేరి కందురు గదా? మత్సేవలన్ సర్వమున్. 865

వ. కావున గృహస్థు లైన మీపతులు మిమ్ముం గూడి, క్రతువు నిర్విఘ్నంబుగా సమాప్తి సేసెదరు; మీరు యాగవాటంబునకుం జనుం; డనిన విప్రభార్య లిట్లనిరి. 866

మ. "తగునే? మాధవ! యిట్టివాఁడిపలుకుల్ ధర్మంబులే? మామొదల్
మగలున్, బిడ్డలు, సోదరుల్, జనకులున్, మమ్మున్ నివారింప, మ
చ్చిగ నీయంఘ్రులు సేరినార; మటఁ బోఁ జేకొందురే వార? లో
పగిదే మొల్లము; [1]కింకరీజనులఁ గా భావించి రక్షింపవే." 867

వ. అనిన జగదీశ్వరుఁడు. 868

సీ. "నాసమీపమున నున్నా రంచు నలుగరు; బంధులు, భ్రాతలు, పతులు,సుతులు;
మిమ్ము దేవత లైన మెత్తు; రంగనలార! నా దేహసంగంబు నరుల కెల్ల
సౌఖ్యానురాగసంజనకంబు గాదు; ముక్తిప్రదాయకము; నాకీర్తనమున,
దర్శనాకర్ణనధ్యానంబులును, గర్మబంధదేహంబునఁ బాసి, మీరు
తే. మానసంబులు నాయందు మరగఁ జేసి-నన్నుఁ జేరెద;రటమీఁద;నమ్ముఁ"డనుచుఁ
బలికి, వారలు దెచ్చినభక్షణాదు-లాప్తవర్గంబుతో హరి యారగించె. 869

క. పరమేశ్వరార్పణంబుగఁ-బరజనులకు భిక్ష యిడినఁ, బరమపదమునం
బరఁగెద రఁట తుది; సాక్షా-త్పరమేశుఁడు భిక్ష గొన్న ఫల మెట్టిదియో! 870

వ. ఇట్లు సర్వేశ్వరుం డయిన హరికి భిక్ష యిడి, తమభార్య లతనివలనం గృతార్థ లగుట యెఱింగి, భూసురవరులు తమలో ని ట్లనిరి. 871

చ. "కటకట! మోసపోయితిమి; కాంతలపాటియు బుద్ధి లేదు; నేఁ
డిట హరిఁ గానఁ బో నెఱుఁగ; మేము దురాత్ములు; మేము కల్మషో
ద్భటులము; విష్ణుదూరగుల[2]ప్రాజ్ఞత లేల? తపంబు లేల? ప
ర్యటనము లేల? శీలములు యాగములున్ మఱి యేల? కాల్పనే! 872

1. సేవకజనులు. 2. తెలివిగల్గియుండుటలు.

క. జపహోమాధ్యయనంబులుఁ-దపములు, వ్రతములును లేనితరుణులు, హరిస
త్కృపఁ బడసి; రన్నిఁ గలిగియుఁ-జపలతఁ బొందితిమి, భక్తిసలుపమి నకటా!

క. సురగురులగు యోగీంద్రుల-నరుదుగ మోహితులఁ జేయు హరిమాయ మముఁగా
నరగురుల మూఢవిప్రుల-నురవడి మోహితులఁ జేయ నోపక యున్నే? 874

మ. క్రతువుల్, ధర్మము, మంత్రతంత్రధనముల్, గాలంబు, దేశంబు, దే
వతయుఁ, వహ్నులు, మేదినీసురులు, నెవ్వాఁ; డట్టిసర్వేశుఁ, డీ
క్షితి రక్షింప జనించినాఁ; డెఱుఁగ, మాశ్రీభర్తకుం, గర్తకుం,
[1]గుతలోద్ధర్తకు, మేము మ్రొక్కెదము రక్షోనాథసంహర్తకున్.” 875

నందాదు లింద్రయాగముసేయ శ్రీకృష్ణునితో నాలోచించుట

వ. అని మఱియు ననేకవిధంబులఁ బశ్చాత్తాపంబులం బొంది, హరిం దలంచి, “శమింపు” మని మ్రొక్కి బ్రాహ్మణులు కంసభీతు లయి, బలకృష్ణసందర్శనంబు సేయంజనరై; రంత నక్కడ [2]నఖిలదర్శనుం డైన హరి యింద్రయాగంబు సేయం దలంచి, తన కడకు వచ్చిననందాదిగోపవృద్ధులం గని, నందున కిట్లనియె.

సీ. “యాగంబు సేయంగ నర్థించి వచ్చితి; రీయాగమున ఫల మేమి గలుగు?
నెవ్వాఁడు దీనికి నీశ్వరుం? డధికారి యెవ్వాఁడు? సాధన మెంత వలయు?
శాస్త్రీయమో? జనాచారమో? కార్యంబు వైరుల కెఱిఁగింపవలదు; గాని,
యెఱిఁగెడిమిత్రుల కెఱిఁగింపఁదగుఁ; జేరి యెఱిఁగి చేసినఁ గోర్కు లెల్లఁ గలుగుఁ;
ఆ. బగయుఁ జెలిమి లేక, పరఁగినమిముబోఁటి-మంచివారి కేల మంతనంబు?
తలఁపు లెల్ల మాకుఁ దగ నెఱిఁగింపవే-తాత! వాక్సుధాప్రదాత వగుచు.”877

వ. అని పలికిన ప్రౌఢకుమారునికిఁ దండ్రి యిట్లనియె. 878

సీ. “పర్జన్యుఁ డధికుండు, భగవంతుఁ డమరేంద్రుఁ, డతనికిఁ బ్రియమూర్తులగుచునున్న
మేఘబృందంబులు, మేదినీతలముపై నతనిపంపున భూతహర్షణముగ,
జలములు గురియుఁ; [3]దజ్జలపూరములఁ దోఁగి పండు సస్యంబు; లాపంట దమకు
ధర్మార్థకామప్రదాయకంబుగ, లోకు లెల్లను బ్రదుకుదు; రింత యెఱిఁగి
తే. మేఘవిభుఁ డైనయింద్రుండు మెచ్చుకొఱకు-నింద్రయాగము సేయుదు రెల్లనృపులు;
కామలోభభయద్వేషకలితు లగుచుఁ-జేయకుండిన నశుభంబు నెందుఁ బుత్ర!

వ. అదియునుం గాక. 880

ఆ. మఖము సేయ వజ్రి మది సంతసించును;-వజ్రి సంతసింప వాన గురియు;
వాన గురియఁ గసవు వసుమతిఁ బెరుఁగును;-గసవు మేసి ధేనుగణము బ్రదుకు.

1. భూమిని ఉద్ధరించినవానికి. 2. సమస్తమును జూచువాఁడు. 3. ఆ జలప్రవాహము.

క. ధేనువులు బ్రదికె నేనిన్-మానదు, ఘనమైన పాఁడి మంకలఁ గలుగున్;
మానుగను బాఁడి గలిగిన,-మానవులును సురలుఁ దనిసి మనుదురు పుత్త్రా!"

వ. అని యిట్లు నొడివిన నందునివచనంబులు విని, యింద్రునికిఁ గోపంబు దీపింప దనుజదమనుండు తండ్రి కిట్లనియె. 883

క. "కర్మమునఁ బుట్టు జంతువు;-కర్మముననె వృద్ధి బొందుఁ; గర్మమునఁ జెడుం;
గర్మమె జనులకు దేవత;-కర్మమె సుఖదుఃఖములకుఁ గారణ మధిపా! 884

క. కర్మములకుఁ దగుఫలములు,-కర్తలకు నిడఁగ రాజు; గాని, సదా [1]ని
ష్కర్ముఁ డగునీశ్వరుండును,-గర్మవిహీనునికి రాజు గాఁడు మహాత్మా! 885

వ. కావునఁ గర్మానుయాతంబు లయిన భూతంబులకుఁ బురుహూతునివలనభీతి యేటికి? పురాతనజన్మసంస్కారంబులు గుప్పలు గొని, కప్పినఁ గర్మంబులఁ దప్పింప, నెంపువడయ నప్పరమేశ్వరుండును నేరఁ; డితరులం జెప్ప నేల? సురాసురనరానీకంబులతోడి లోకంబు నిజసంస్కారవశంబై యుండ డింది యున్నది; సందేహంబు లేదు; దేహి కర్మవశంబున గురుతను దేహంబులం జొచ్చి, వెడలు; [2]నొజ్జ, వేలుపు, [3]నెచ్చెలి, [4]పగఱు, చుట్టంబు, జీవుండు కర్మంబుతోడన వర్తించు; నతనికిఁ గర్మంబు దైవతంబు; కర్మంబునం బ్రతుకుచు నితరసేవ సేయుట, సతి పతి విడచి జారుం జేరిన చందం బగు; విప్రుండు వైదికకర్మంబున మెలంగు; నృపతి ధరణీపాలనంబున సంచరించు; వైశ్యుండు వాణిజ్యకృషికుసీదగోరక్షణాదుల వర్తించు; శూద్రుం డగ్రజన్ముల సేవించి బ్రదుకు; సత్త్వరజస్తమోగుణంబు లుత్పత్తిస్థితిలయకారణంబు; లందు రజంబున జగంబు జన్మించు; రజోగుణప్రేరితంబు లయి మేఘంబులు వర్షించు; వర్షంబునం బ్రజావృద్ధి యగు; నింద్రుం డేమి సేయంగలవాఁ? డదియునుం గాక. 886

శా. కోపింపం బని లేదు శక్రునికిఁ; దాఁ గోపించుఁ గా కేమి? సం
క్షేపం బయ్యెడి దేమి? పట్టణములుం గేహంబులుం దేశముల్
వ్యాపారంబులు మీకుఁ బోయెడినె? శైలారణ్యభాగంబులన్
గోపత్వంబున నుండుచున్ మనకు సంకోచింపఁగా నేటికిన్? 887

సీ. పసులకుఁ, గొండకు, బ్రాహ్మణోత్తములకు, మఖము గావించుట మంచిబుద్ధి;
యింద్రయాగంబున కేమేమి దెప్పింతు రవి యెల్లఁ దెప్పింపు డరసి; మీరు
పాయసంబులు, [5]నపూపములు, సైఁదపుఁ బిండి వంటలుఁ, బప్పును, వలయునట్టి
ఫలశాకములు, వండఁబంపుఁడు; హోమంబు సేయుఁడు; ధేనుదక్షిణల నిచ్చి

---

1. కర్మములేనివాఁడు. 2. ఉపాధ్యాయుఁడు. 3. మిత్త్రుఁడు. 4. శత్త్రువులు. 5. భక్ష్యములు.

తే. బహురసాన్నంబు పెట్టుఁడు బ్రాహ్మణులకు;
నచలుఁడై పూజ లొనరింపుఁ డచలమునకు;
నధమచండాలశునకసంహతికిఁ దగిన
భక్ష్యములు నిండుఁ; గసవులు పసుల కిండు. 888

శా. గంధాలంకరణాంబరావళులచేఁ గైసేసి, యిష్టాన్నముల్
బంధుశ్రేణియు మీరలుం గుడిచి, నా భాషారతిన్ వేడుకల్
సంధిల్లన్, గిరిగోద్విజానలనమస్కారంబు గావింపుఁ డో
జం ధర్మం బని తోఁచెనేని, జనకా! జన్మంబు ధన్యం బగున్." 889

వ. అని మఱియు నిలింపపతిసొంపు దింపుతలంపున, [1]నిమ్మఖంబు దనకు సమ్మతం బని గోవిందుండు పలికిన, నందాదులు "మేలు మేల"ని తద్వచనప్రకారంబునం బుణ్యాహవాచనంబులు సదివించు ధరణిసురులకు భోజనంబు లిడి, పసులకుం గసవులొసంగి ; రప్పుడు. 890

మ. సకలాభీరులు వీఁడె కృష్ణుఁ డన నైజం బైన రూపంబుతోఁ,
నకలంకస్థితి నుండి "శైల మిదె ; మీ రర్చింప రం"డంచుఁ దా
నొకశైలాకృతిఁ దాల్చి, గోపకులతో నొండొండ పూజించి, గో
పకదత్తాన్నము లాహరించె విభుఁ డా ప్రత్యక్షశైలాకృతిన్. 891

మ. "వినుఁడీ శైలము కామరూపి; ఖలులన్ వేధించు; నాజ్యాన్నముల్
మన మొప్పించిన నాహరించె; మనలన్ మన్నించెఁ; జిత్తంబులో
[2]ననుకంపాతిశయంబు సేసె; మనపై" నంచున్ సగోపాలుఁడై
వనజాక్షుండు నమస్కరించె, గిరికిన్ వందారుమందారుఁడై. 892

వ. ఇట్లు గోపకులు హరిసమేతులై గిరికిం బూజనోపహారంబులు సమర్పించి, గోధనంబులఁ బురస్కరించుకొని, భూసురాశీర్వాదవచనంబులతో గిరికిం బ్రదక్షిణంబు సేసి; రా సమయంబున. 893

క. గుఱ్ఱముల పరువు మెచ్చని,-[3]నఱ్ఱులఁ గట్టిన రథంబు నందప్రముఖుల్
గుఱ్ఱలచూర్పులు సెలఁగఁగఁ,-దొఱ్ఱులగమి వెంట నంటఁ దోలి రిలేశా! 894

క. పాటించి గానవిద్యా-పాటవమునఁ దేరు లెక్కి, బహుతానములం
బాటలగంధులు కృష్ణునిఁ,-బాటలఁ బాడిరి, "విరోధిపాటనుఁ" డనుచున్.

క. కుండనిభాపీనంబులు,-మండితవర్ణములు, వివిధమహితాకృతులున్,
నిండినకడుపులుఁ గన్నుల - పండువులుగఁ బాఁడికుఱ్ఱిపదువులు నడచెన్. 896

1. ఈ యజ్ఞము. 2. ఎక్కువదయ. 3. ఎద్దులు.

క. పొగ రెక్కినమూఁపురములుఁ,- దెగఁగల వాలములుఁ, శైలదేహంబులు, భూ
గగనములు నిండుకొంకెలు,-మిగుల మెఱయువృషభగణము మెల్లన నడచెన్.

వ. ఇట్లు పర్వతప్రదక్షిణంబు సేసి, గోపకులు మాధవసమేతులై మందకుం జని; రంత మహేంద్రుం డంతయు నెఱింగి, మహాకోపంబునఁ బ్రళయప్రవర్తకంబు లగు సంవర్తకమేఘంబులం జీరి యిట్లనియె. 898

మ. "పెఱుఁగుల్ నేతులు ద్రావి, క్రొవ్వి, భువి [1]నాభీరుల్ మదాభీరులై
గిరిసంఘాతకఠోరపత్త్రదళనక్రీడాసమారంభదు
ర్భరదంభోళిధరుం బురందరు ననుం బాటించి, పూజింప క
గ్గిరికిం బూజలు సేసి పోయి; రిదె పో కృష్ణుండు ప్రేరేపఁగన్. 899

క. గురుదేవహీను, బాలుని-గిరిభూజప్రముఖవాసుఁ, గృష్ణు, ననీశుం
బరిణామశీలుఁ, గులగుణ-విరహితుఁ, జేపట్టి యింద్రు విడిచిరి గొల్లల్. 900

ఆ. విమలఘనతరాత్మవిజ్ఞానవిద్యచే-నిగుడలేక, యుడుపనిభములగుచుఁ
గర్మమయములైన క్రతువుల భవమహా-ర్ణవము [2]గడవఁ గోరినారు వీరు. 901

శా. ఉద్యత్సంపద నమ్మి, నందతనయోద్యోగంబునన్ వెఱ్ఱులై
మద్యాగంబు విసర్జనీయ మని రీ మర్త్యుల్; వడిన్ మీరు మీ
[3]విద్యుద్వల్లులఁ గప్పి, గర్జనములన్ వేధించి, గోవుల్ జనుల్
సద్యోమృత్యువుఁ జెంద జాల్ గురియుఁడీ! శౌర్యం బవార్యంబుగన్. 902

క. మీవెంట వత్తు నేనై-రావణనాగంబు నెక్కి; రయ మొప్పంగా
దేవగణంబులతోడను-గోవిందునిమంద లెల్లఁ గొందలపెట్టన్." 903

వ. అని యిట్లు వలికి, జంభవైరి సంరంభంబున దంభోళి జళిపించి, బింకంబున శంకింపక కింకతోడ సంకిలియ లూడ్చిన, మహానిలప్రేరితంబు లయి చని, నందుని మందమీఁద నమోఘంబులైన మేఘంబులు మహాఘంబులై పన్ని, ప్రచండగతిం జండమరీచిమండలంబుఁ గప్పి, దివి నిండి, దిశ లావరించి, రోదోంతరాళంబు నిరంతరనీరంధ్రనిబిడాంధకారబంధురంబుగ నిరోధించి, బలిభంజనద్వితీయపాద పల్లవభగ్నంబైన బ్రహ్మాండభాండంబుచిల్లుల జల్లించి, తొరఁగు బహిస్సముద్ర సలిలనిర్ఝరంబులవడువున నెడతెగక తోరంబులైన నీరధారలం గురియుచు శిలల వర్షించుచుఁ బిడుగుల నువ్వుచు నుండ, మిఱ్ఱు పల్లంబులు సమతలంబు లయి యేకార్ణవంబు రూపుసూపిన, నందు [4]దుడుకడుచుచు నీఁదుచు విలయశిఖిశిఖాసంరంభ విజృంభమాణవిద్యుల్లతావిలోకంబున రిమ్మలుగొని సొమ్మలు వోవుచున్న లేఁగలును, లేఁగలకు మాతు లడ్డంబు

1. గొల్లలు. 2. దాఁటుటకు. 3. మెఱుపుతీగలు. 4. చెడ్డతనము.

లిడి ప్రళయభైరవభేరీభాంకారభీషణంబు లగు గర్జన ఘోషణంబులం జెవుడు వడి, చిందఱవందఱ లైన డెందంబులం గుంది, కుంది ప్రాలు ధేనువులును, ధేనువుల వెనుక నిడుకొని, దురంతకృతాంతకాలకీలికరాళకాలకంఠకరవిశాలగదాఘాతప్రఘాతంబు లైన నిర్ఘాతపాతంబులకు భీతంబులై హరికి మ్రొక్కి-రక్షరక్షేతిశబ్దంబులు సేయుకైవడి విడువని జడిం బడి, నైరింపక శిరంబులు వంచుకొని, గద్గదకంఠంబున సంభారవంబులు సేయు వృషభంబులును, వృషభాదిగోరక్షణంబు సేయుచు, దుర్వారఘోరశిలాసారంబుల సారంబులు సెడి, శరీరంబులు భారంబు లైన మ్రానుపడు గోపకులును, గోపకులం బట్టుకొని, దట్టం బయిన [1]వానకొట్టునం జెట్టువడి బడుగునడుములు . నుసులువడ, వడవడ వడంకుచు గోవిందునిం జీరు గోపికలును, గోపికాజనకఠినకుచకలశయుగళంబుల మఱుంగునం దలలు వెట్టుకొని పరవశు లైన శిశువులునుం గలిగి, మహాఘోషంబుతోడ నష్టం బైన ఘోషంబుం జూచి, ప్రబుద్ధు లైన గోపవృద్ధులు గొందఱు దుర్జనశిక్షకుండును సజ్జనరక్షకుండును నైన పుండరీకాక్షునకు మ్రొక్కి, యి ట్లనిరి. 904

ఉ. "అక్కట! వానఁ దోఁగి, వ్రజ మాకుల మయ్యెఁ గదయ్య! కృష్ణ! నీ
వెక్కడ నుంటి? వింతదడ వేలసహించితి? నీపదాబ్జముల్
దిక్కుగ నున్నగోపకులు దీనత నొంద, భయాపహారివై
గ్రక్కునఁ గావ కిట్లునికి, కారుణికోత్తమ! నీకుఁ బాడియే? 905

క. ఈయుఱుములు, నీమెఱుపులు-నీయశనులఘోషణములు, నీజలధారల్,
నీయాన దొల్లి యెఱుఁగము-కూ యాలింపంగదయ్య! గుణరత్ననిధీ! 906

క. [2]వారి బరు వయ్యె [3]మందల-వారికి నిదె; పరులు లేరు వారింపంగాఁ;
వారిదపటలభయంబును-వారిరుహదళాక్ష! నేఁడు వారింపఁగదే!" 907

వ. అనిన విని, సర్వజ్ఞుం డైన కృష్ణుం డంతయు నెఱింగి. 908

ఉ. "త న్నొకయింత గైకొనరు; తప్పిరి; యాగము సేసి; రంచుఁ దా
మిన్ననుండి గోపకులమీఁద శిలల్ గురియించుచున్నవాఁ;
డున్నతనిర్జరేంద్రవిభవోత్థితగర్వనగాధిరూఢుఁ డై
కన్నులఁ గాన డింద్రుఁ; డిటు గర్వపరుం డొరుఁ గాన నేర్చునే? 909

క. దేవత లందఱు నన్నును-సేవింతురు; రాజ్యమదముఁ జెందరు; చెఱుపం
గా వలదు; మానభంగము-గావింపఁగ వలయు శాంతి గలిగెడుకొఱకై." 910

వ. అని చింతించి, "శిలావర్షహతులై శరణాగతు లైన ఘోషజనుల రక్షించుట తగ" వని సకలలోకరక్షకుం డయిన విచక్షణుండు. 911

1. వానయొక్కదెబ్బ. 2. నీరు. 3. గొల్లపల్లెలోనివారు.

చ. "కలఁగకుఁడీ వధూజనులు! కంపము నొందకుఁ డీ వ్రజేశ్వరుల్!
తలఁగకుఁడీ కుమారకులు! తక్కినవారలు జాలవానచే
నలఁగకుఁడీ! పశువ్రజము నక్కడ నక్కడ నిల్వనీకుఁడీ!
మెలఁపున మీకు నీశ్వరుఁడు మేలొసఁగుం గరుణార్ద్రచిత్తుఁడై." 912

వ. అని పలికి. 913

శ్రీకృష్ణుఁడు గోవర్ధనపర్వతము నెత్తుట

క. కిటియై ధర యెత్తినహరి-కరి సరసిజముకుళ మెత్తుగతిఁ, ద్రిభువనశం
కరకరుఁడై, గోవర్ధన-గిరి యెత్తెం జక్క నొక్క కేలన్ లీలన్. 914

క. దండిని బ్రహ్మాండంబులు-చెండులక్రియఁ బట్టి, యెగురఁ జిమ్మెడుహరికిన్
గొండఁ బెకలించి యెత్తుట-కొండొకపని గాక యెక్కుకొండా తలఁపన్? 915

వ. ఇట్లు గిరి యెత్తి. 916

శా. బాలుండాడుచు నాతపత్త్ర మని సంభావించి, పూగుత్తి కెం
గేలం దాల్చినలీల, లేనగవుతోఁ గృష్ణుండు దా నమ్మహా
శైలంబున్ [1]వలకేలఁ దాల్చి, విపులచ్ఛత్త్రంబుగాఁ బట్టె, [2]నా
భీలాభ్రచ్యుతదుశ్శిలాచకితగోపీగోపగోపంక్తికిన్. 917

వ. ఇట్లు గోత్త్రంబు ఛత్త్రంబుగాఁ బట్టి, గోపజనులకు గోపాలశేఖరుం డిట్లనియె.

క. "రా తల్లి! రమ్ము తండ్రీ!-వ్రేతలు! గోపకులు! రండు; వినుఁడీ [3]గర్త
స్థాతలమున నుండుఁడు, గో-వ్రాతముతో మీరు మీకు వలసినయెడలన్. 919

శా. 'బాలుం డీతఁడు; కొండ దొడ్డది; మహాభారంబు సైరింపఁగాఁ
జాలం డో' యని దీనిక్రింద నిలువన్ శంకింపఁగాఁ బోల; దీ
శైలాంభోనిధి జంతుసంయుతధరాచక్రంబు పై పడ్డ నా
కేలల్లాడదు; బంధులార! నిలుఁ డీక్రిందం బ్రమోదంబునన్." 920

వ. అని పలుకుచున్న హరిపలుకులు విని, నెమ్మనమ్ముల నమ్మి, కొండయడుగునం దమతమయిమ్ములం బుత్త్రమిత్త్రకళత్త్రాదిసమేతులై గోవులుం, దారును, గోపజనులు జనార్దనకరుణావిలోకనామృతవర్షంబున నాఁకలినీరువట్టులచొప్పెఱుంగక కృష్ణకథావినోదంబుల నుండి; రవ్విధంబున. 921

మ. హరిదోర్దండము [4]గామ, [5]గుబ్బ శిఖరం, బాలంబిముక్తావళుల్
పరఁగన్ జాలెడుతోయబిందువులు, గోపాలాంగనాపాంగహా

1. కుడిచేతియందు. 2. భయంకరమగు మేఘములనుండి వదలఁబడిన పెనుబండలచేత భయపడిన గోపికలయు, గోపకులయు గోవులయు వరుసకు. 3. గుంటగానుండు భూప్రదేశమునందు. 4. కాడ. 5. గొడుగుపైనుండుకొన.

నరుచుల్ రత్నచయంబు గాఁగ, [1]నచలచ్ఛత్రంబు శోభిల్లెఁ, ద
ద్గిరిభిద్దుర్మదభంజి యై జలధరాక్లిన్న ప్రజారంజియై. 922

క. రాజీవాక్షునిచే నొక-రాజీవముభంగి శైలరాజము మెఱసెన్;
రాజేంద్ర! మీఁద మధుకర-రాజిక్రియన్ మేఘరాజి రాజిల్లెఁ గడున్. 923

క. వడిగొని బలరిపుపనుపున-నుడుగక జడి గురిసె నేడహోరాత్రము; ల
య్యెడ గోపజనులు బ్రదికిరి-జడిఁ దడియక కొండగొడుగుచాటున నధిపా! 924

వ. ఇట్లు హరి యేడహోరాత్రంబులు గిరి ధరించిన గిరిభేది విసిగి, వేసరి, కృష్ణు చరితంబులు విని, వెఱఁగుపడి, విఫలమనోరథుండై మేఘంబుల మరలించుకొని, చనియె; నంత నభోమండలంబు విద్యోతమానఖద్యోతమండలం బగుట విని, గోవర్ధనధరుండు గోపాలకుల కిట్లనియె. 925

క. "ఉడిగెను వానయు, గాలియు-వడి సెడి నదు లెల్లఁ బొలిచె; పఱద లిగిరెఁ; గొం
డడుగున నుండక వెడలుఁడు,-కొడుకులుఁ గోడండ్రు, సతులు గోవులు మీరున్."

వ. అనిన విని, సకలగోపజనులు శకటాద్యుపకరణసమేతు లయి గోవులుం దారును గొండయడుగు విడిచి వచ్చి; రచ్యుతుండును జెచ్చెరఁ దొల్లింటియట్ల నిజ స్థానంబున గిరి నిలిపె; నంత వల్లవులెల్లం గృష్ణుం గౌఁగిలించుకొని, సముచిత ప్రకారంబుల సంభావించి, దీవించిరి; గోపికలు సేస లిడి, దధ్యన్నకబళంబు లొసంగుచు నాశీర్వదించిరి; నందబలభద్రరోహిణీయశోద లాలింగనంబు సేసి, భద్రవాక్యంబులు పలికిరి; సిద్ధసాధ్యగంధర్వవరులు విరులు గురియించిరి; సురలు శంఖదుందుభులు మ్రోయించిరి; తుంబురుప్రముఖు లయిన గంధర్వులు పాడి; రప్పుడు. 927

క. వల్లవకాంతలు దనకథ-లెల్లను బాడంగ, నీరజేక్షణుఁ డంతన్
వల్లవబలసంయుతుఁ డై-యొల్లన గోష్ఠంబు సేరె నుర్వీనాథా! 928

వ. అయ్యవసరంబునఁ గృష్ణుచరిత్రంబులు దలంచి వెఱఁగువడి, గోపజనులు నందున కిట్లనిరి. 929

సీ. "కన్నులు దెఱవనికడుఁ జిన్నిపాపఁ డై, దానవిచనుఁబాలు ద్రావి చంపె;
మూఁడవనెలనాఁడు ముద్దులబాలుఁ డై, కోపించి శకటంబుఁ గూలఁ దన్నె;
నేఁడాదికుఱ్ఱఁ డై యెగసి, తృణావర్తు మెడఁ బట్టుకొని కూల్చి మృతునిఁ జేసెఁ;
దల్లి వెన్నలకు నై తను ఱోలఁ గట్టినఁ, గొమరుఁ డై మద్దులు గూల నీడ్చెఁ;
తే. బసులఁ గ్రేపులఁ గాచుచు బకునిఁ జీరె;-వెలఁగతో వత్సదైత్యుని వ్రేసి గెడపె;
సబలుఁ డై ఖరదైత్యుని సంహరించె;-నితఁడు కేవలమనుజుఁడే యెంచి చూడ?

1. కొండయను గొడుగు.

క. తెంపరి యై రాముని చేఁ-జంపించెఁ బ్రలంబు; మ్రింగెఁ జటులదవాగ్నిన్;
సొంపు చెడఁ ద్రొక్కెఁ గాళియుఁ-ద్రుంపక, కాళింది వెడలఁ దోలెన్ లీలన్.

క. ఏడేండ్లబాలుఁ డెక్కడ?-క్రీడం గరి [1]తమ్మి యెత్తుక్రియ, నందఱముం
జూడ గిరి యెత్తు టెక్కడ?-వేడుక నొకచేత; నేఁడు వెఱఁగాఁగాదే! 932

క. ఓ నంద! గోపవల్లభ!-యీనందనుఁ డాచరించు నేర్పరితనముల్
మానవులకు శక్యంబులె?-మానవమాత్రుండె నీకుమారుఁడు దండ్రీ!” 933

వ. అనిన విని నందుండు వారలం జూచి, మున్ను తనకు గర్గమహాముని చెప్పిన సంకేతంబు దెలిసి “శంక లేదు; కృష్ణుండు లోకరక్షకుం డయిన పుండరీకాక్షుని నిజాంశంబ యనుచు నంతరంగంబునం జింతింతు;” నని పలికిన వెఱఁగుపడి, గోపకులు కృష్ణుం డనంతుం డని పూజించి; రంత. 934

మ. హరి కేలన్ గిరి యెత్తి, వర్షజలఖిన్నాభీరగోరాజికిన్
శరణం బైనఁ ద్రిలోకరాజ్యమదముం జాలించి, నిర్గర్వుఁడై,
[2]సురభిం గూడి, బలారి వచ్చి, కనియెన్ సొంపేది దుష్టప్రజే
శ్వరదుర్మాననిరాకరిష్ణుఁ, గరుణావర్ధిష్ణు, శ్రీకృష్ణునిన్. 935

క. కని యింద్రుఁడు పూజించెను-దినకరనిభనిజకిరీటదీధితిచేతన్,
మునిహృదలంకరణంబులు-సునతోద్ధరణములు నందసుతుచరణంబుల్. 936

వ. ఇట్లు నమస్కరించి, కరకమలంబులు ముకుళించి, హరికి హరిహయుం డిట్లనియె.

సీ. “పరమ! నీధామంబు భాసురసత్త్వంబు, శాంతంబు, హతరజస్తమము, నిత్య,
మధికతపోమయ, మట్లు గావున మాయ నెగడెడిగుణములు నీకు లేవు;
గుణహీనుఁడవు గాన, గుణముల నయ్యెడి లోభాదికములు నీలోనఁ జేర;
వైన దుర్జననిగ్రహము, శిష్టరక్షయుఁ దగిలి, చేయఁగ దండధారి వగుదు;
తే. జగముభర్తవు, గురుఁడవు, జనకుఁడవును-‘జగదధీశుల’ మను మూఢజనులు దలఁక
నిచ్చపుట్టినరూపంబు లీవు దాల్చి-హితము సేయుదు గాదె? లోకేశ్వరేశ! 938

క. నావంటి వెఱ్ఱివారిని-శ్రీవల్లభ! నీవు [3]శాస్తి సేసితి వేనిం,
గావరము మాని, పెద్దల-త్రోవన్ జరుగుదురు బుద్ధితోడుత నీశా! 939

క. ఒక్కొకలోకముఁ గాచుచు-నెక్కుడుగర్వమున, నేమె యీశుల మనుచుం
జొక్కి, ననుబోఁటివెఱ్ఱులు-నిక్కము నీమహిమఁ దెలియనేర రనంతా! 940

ఆ. వాసుదేవ! కృష్ణ! వరద! స్వతంత్ర! వి-జ్ఞానమయ! మహాత్మ! సర్వపుణ్య
పురుష! నిఖిలబీజభూతాత్మక! బ్రహ్మ!-నీకు వందనంబు నిష్కలంక. 941

1. కమలమును ఎత్తురీతిగా. 2. కామధేనువు. 3. శిక్షణము.

శా. నీసామర్థ్య మెఱుంగ, మేఘములచే నిర్ఘోషముల్ భీషణో
గ్రాసారంబున ముంచితిన్; మఖము నాకై వల్లవుల్ సేయ; రం
చోసర్వేశ! భవన్మహత్త్వమున నాయుద్యోగ మి ట్లయ్యె; నీ
దాసున్ నన్నుఁ గృతాపరాధుఁ గరుణన్ దండింపవే మాధవా! 942

మ. నినుఁ బ్రహ్మాదు లెఱుంగలేరు; జడతానిష్ఠుండ, లోకత్రయా
వనదుర్మానగరిష్ఠుఁడన్, [2]విపులదుర్వైదుష్యభూయిష్ఠుఁడన్,
వినయత్యాగవరిష్ఠుఁడం, గుజనగర్వశ్రేష్ఠుఁడన్, దేవ! నీ
ఘనలీలావిభవంబు పెంపుఁ దెలియంగా నెవ్వఁడన్? సర్వగా!'' 943

వ. అనిన విని, నగుచు జలధరగంభీరరవంబుల శక్రునకుం జక్రి యి ట్లనియె. 944

మ. ''అమరాధీశ్వర! లక్ష్మితోఁ దగిలి యి ట్లంధుండవై యున్న నీ
సమదోద్రేకము ద్రుంచివైచుటకు నీజన్నంబు దప్పించితిం;
బ్రమదశ్రీకులు దండధారి నగు నన్ భావింప రెవ్వాని; ని
క్కము రక్షింపఁదలంతు; వాని నధనుం గావింతు జంభాంతకా! 945

క. నాయాజ్ఞ సేయుచుండుము-నీయధికారంబునందు నిలువు; సురేంద్ర
శ్రీయుతుఁడవై, మదింపకు- శ్రేయంబులు గల్గుఁ; బొమ్ము; సితకరిగమనా!''

వ. అని యిట్లు జిష్ణునిం బలుకుచున్న కృష్ణునికి మ్రొక్కి, గోగణసమేత యయిన
కామధేనువు భక్తజనకామధేను వయిన యీశ్వరున కి ట్లనియె. 947

క. ''విశ్వేశ! విశ్వభావన !-విశ్వాకృతి! యోగివంద్య! విను నీచేతన్
శాశ్వతుల మైతి; మిప్పుడు-శాశ్వతముగఁ గంటి, మధికసౌఖ్యంబు హరీ! 948

వ. దేవా! మాకుం బరమదైవతంబ, వింద్రుండవు, ''భూసురగోసురసాధుసౌఖ్యంబుల
కొఱకు ని న్నింద్రునిం జేసి, పట్టంబు గట్టు'' మని విరించి నియమించి పుత్తెంచె;
''నీవు భూతలభూరిభారనివారణంబు సేయ నవతరించిన హరి''వని పలికి, యంత.

మ. సురభిక్షీరములన్, సురద్విపమహాశుండాలతానీతని
ర్జరగంగాంబువులున్, [3]నిలింపజననీ సన్మానిసంఘంబుతో
సురనాథుం డభిషిక్తుఁ జేసి పలికెన్, సొంపార గోవిందుఁ డం
చు రణాక్రాంతవిపక్షు, దోయజదళాక్షున్, సాధుసంరక్షణున్. 950

సీ. తుంబురునారదాదులు సిద్ధచారణగంధర్వులును హరికథలు పాడి;
రమరకాంతలు మింట నాడిరి; వేల్పులు గురియించి రంచితకుసుమవృష్టి;
జగములు మూఁడును సంతోషము బొందెఁ; గుఱ్ఱులచన్నులఁ గురిసెఁ బాలు;
నవజలంబులతోడ నదు లెల్లఁ బ్రవహించె; నిఖిలవృక్షములుఁ దేనియలువడసె;

1. గొల్లపల్లె. 2. అధికమయిన చెడ్డపాండిత్యముతో నిండినవాడను. 3. దేవతలతల్లి.

తే. సర్వలతికల ఫలపుష్పచయము లమరెఁ-బర్వతంబులు మణిగణప్రభల నొప్పెఁ;
బ్రాణులకు నెల్లఁ దమలోనిపగలు మానె-వాసుదేవునియభిషేకవాసరమున.

వ. ఇట్లు గోపగోగణపతిత్వంబునకు గోవిందు నభిషిక్తుం జేసి వీడ్కొని పురందరుండు దేవగణంబులతో దివంబున కరిగె; నంత. 952

శ్రీకృష్ణమూర్తి నందుని వరుణనగరమునుండి కొని తెచ్చుట

సీ. నందుఁ డేకాదశీనాఁ డుపవాసంబు సేసి, శ్రీహరిపూజ సేసి, దనుజ
వేళ యెఱుంగక వేకువ ముందర, ద్వాదశీస్నానంబు దగ నొనర్ప
యమునాజలము సొర, నప్డు వరుణుదూత నందుని వరుణునినగరమునకుఁ
గొనిపోవఁ, దక్కిన గోపకు లందఱు నందగోపకునిఁ గానక, కలంగి

తే. రామకృష్ణులఁ బేర్కొని, రవము సేయఁ,
గృష్ణుఁ డీశుండు తమతండ్రిఁ గికురువెట్టి
వరుణభృత్యుండు గొనిపోయి వరుణుఁ జేర్చు
టెఱిఁగి, రయమున నచ్చోటి కేఁగె నధిప! 953

వ. అప్పుడు. 954

క. వచ్చినమాధవుఁ గనుఁగొని-చెచ్చెర వరుణుండు పూజ సేసి, వినతుఁడై
యచ్చుగ ని ట్లని పలికెను-"విచ్చేసితి దేవ! నానివేశంబునకున్. 955

ఆ. ఏవిభుపాదపద్మరతు లెన్నఁడు నెవ్వరుఁ బొంద లేని పెం
ద్రోవఁ జరింతు; రట్టి బుధలోకప! నీ వరుదెంచుటం బ్రమో
దావృత మయ్యెఁ జిత్తము; కృతార్థత నొందె మనోరథంబు; నీ
సేవఁ బవిత్రభావమును జెందె శరీరము; నేఁడు మాధవా! 956

ఉ. ఏపరమేశ్వరున్, జగము లిన్నిటిఁ గప్పిన మాయ గప్పఁగా
నోపక పారతంత్ర్యమున నుండదు; మహాత్మక! యట్టినీకు ను
ద్దీపితభద్రమూర్తికి, సుధీజనరక్షణవర్తికిం, దనూ
తాపము వాయ మ్రొక్కెద, నుదారతపోధనచక్రవర్తికిన్. 957

చ. ఎఱుఁగఁడు వీఁడు నాభటుఁ; డొకించుకమైన మనంబులోపలం
దెలుకువ లేక నీజనకుఁ దెచ్చెఁ; దయం గొని పొమ్ము; ద్రోహముల్
మఱవుము; నన్ను నీభటుని మన్నన సేయుము; నీదుసైరణన్
వఱలుదుఁ గాదె యో జనకవత్సల! నిర్మల! భక్తవత్సలా!" 958

వ. అని యిట్లు పలుకుచున్నవరుణునిం గరుణించి, తండ్రిం దోడ్కొని, హరి దిరిగి వచ్చె; నంత నందుండు దన్ను వెన్నుండు వరుణనగరంబుననుండి విడిపించి తెచ్చిన వృత్తాంతం బంతయు బంధువుల కెఱింగించిన, వారలు కృష్ణుం

“దీశ్వరుం” డని తలంచి; యఖిలదర్శనుం డయిన యీశ్వరుండును, వారలతలం
పెఱింగి, వారికోరిక సఫలంబు సేయుదు నని వారి వంకజ బ్రహ్మహ్రదంబున
ముంచి యెత్తి. 959

ఆ. ప్రకృతి కామకర్మ పరవశులై యుచ్చ
నీచగతులఁ బొంది, [1]నెఱయ భ్రమసి,
తిరుగుచున్న జనము దెలియనేరదు నిజ
గతివిశేష మీజగంబునందు.” 960

మ. అని చింతించి, దయాళుఁ డైనహరి మాయాదూరమై, జ్యోతి యై,
యనిరూప్యం బయి, సత్యమై, యెఱుక యై, యానంద మై, బ్రహ్మ మై,
యనఘాత్ముల్ గుణనాశమందుఁ గను నిత్యాత్మీయలోకంబు గ్ర
క్కునఁ జూపెం గరుణార్ద్రచిత్తుఁ డగుచున్ గోపాలకశ్రేణికిన్. 961

వ. ఇట్లు హరి ము న్నక్రూరుండు వొందిన లోక మంతయుం జూపి, బ్రహ్మ
లోకంబు సూపినం జూచి, నందాదులు పరమానందంబునుం బొంది, వెఱఁగు
పడి, హంసస్వరూపకుం డైన కృష్ణునిం బొడగని, పొగడి పూజించి; రంత.

చ. కలువలమేలి[2]కందువలు, కాముని కయ్యపుఁబాళెముల్, విర
క్తులు దలడించువేళలు, చకోరకపంక్తుల భోగకాలముల్,
సెలువలు సైరణల్ విడిచి చిక్కుటలుల్, ఘనచంద్రచంద్రికా
జ్వలితదిశల్, శరన్నిశలు, జారకదుర్దశ లయ్యె నయ్యెడన్. 963

ఆ. కామతంత్రటీక, కలువలజోక, కం-దర్పుడాక, విటులతాల్మి పోక,
[3]చకితచక్రవాక, సంప్రీతజనలోక-రాక వచ్చె, మేలురాక యగుచు. 964

క. పతి దన కరములఁ గుంకుమ-సతిమొగమున నలఁదుభంగి, సముదయవేళాం
చితకరరాగమున నిశా-పతి రంజించెఁ; నరేంద్ర ప్రాక్సతిమొగమున్. 965

సీ. విటసేనపై దండు వెడలెడువలతేనిగొల్లెనపై హేమకుంభ మనఁగఁ
[4]గాముకధృతివల్లికలు ద్రెంప నెత్తిన శంబరాంతకుచేతి చక్ర మనఁగ
మారుండు పాంథులమానాటవులు గాల్పఁ గూర్చిననిప్పులకుప్ప యనఁగ
విరహిమృగమ్ముల వేఁటాడ మదనుండు దెచ్చినమోహనదీప మనఁగ
ఆ. వింతనునుపు గల్గి, వృత్తమై, యరుణమై, కాంతితోఁ జకోరగణము లుబ్బఁ
బొడుపుఁగొండచక్కిఁ బొడిచె, రాకాచంద్ర-మండలంబు గగనమండలమున.

---

1. సంపూర్ణముగా. 2. స్థానములు. 3. భయపెట్టఁబడిన చక్రవాకపుఁబక్షులు కలది.
4. కాముకులగు వారి ధైర్యము అను తీగలు.

## శరద్రాత్రిం గాన మొనర్ప కృష్ణసన్నిధికి గోపికలు వచ్చుట

వ. ఇట్లు వీక్షించి, నవకుంకుమాంకితరమాముఖమండలంబునుం బోలె నఖండం బైన చంద్రమండలంబుం బొడగని, పుండరీకనయనుండు యమునాతటవనంబున జగన్మోహనంబుగా నొక్కగీతంబుఁ బాడిన విని, పరాయత్తచిత్తలై తత్తఱంబున నేత్ర లేపనలకుం జేతు లాడకయు, గోవులకుం గ్రేపుల విడువకయు, విడిచి విడిచియీడకయు, ఈడి యీడి యీడినపాలు కాఁపకయుఁ, గాఁచి కాఁచియుఁ గాఁగినపాలు డింపకయు, డించి డించియు డించినపాలు బాలురకుం బోయకయుఁ బోసి పోసియుఁ బతులకుఁ బరిచర్యలు సేయకయుఁ, జేసి చేసియు నశనంబులు గుడువకయుఁ, గుడిచి కుడిచియుఁ గుసుమంబులు ముడువకయు, ముడిచి ముడిచియుఁ దొడవులు దొడుగకయుఁ, దొడిగి తొడిగియు గోష్ఠంబులపట్టుల నుండకయుఁ, బాయసంబు నెఱయ వండకయు, నయ్యోయెడల నిలువం బడకయుఁ, గాటుకలు సూటి నిడకయుఁ, గురులు సక్క నొత్తకయుఁ, గుచంబుల గంధంబులు గలయ మెత్తకయుఁ, బయ్యెదలు విప్పి కప్పకయు, సఖులకుం జెప్పకయు, సహోదరులు, మగలు, మామలు, మఱందులు, బిడ్డలు, నడ్డంబు చని నివారింపం దలారింపకయు, సంచలించి [1]పంచభల్లుని[2]భల్లంబుల మొల్లంపుజల్లుల పెల్లునం దల్లడిల్లి, డిల్లపడి, మొగిళ్ళగమి వెలువడి యుల్లసిల్లు తటిల్లతలపొందున, మంద గమన లమందగమనంబుల మంద వెలువడి, గోవిందసందర్శనంబునకుం జని ; రప్పుడు. 967

మ. తరుణుల్ కొందఱు మూలగేహముల నుద్దండించి, రారాక త
ద్విరహాగ్నిం బరితాప మొందుచు, మనోవీథిన్ విభున్ మాధవుం
బరిరంభంబులు సేసి, జారుఁ డనుచున్ భావించియుం, జొక్కి పొం
దిరి ముక్తిన్; గుణదేహమున్ విడిచి, ప్రీతిన్ బంధనిర్ముక్త లై." 968

వ. అనిన నరేంద్రుం డి ట్లనియె. 969

క. "జారుఁ డని కాని కృష్ణుఁడు-భూరిపరబ్రహ్మమనియు, బుద్ధిఁ దలంపన్
నేరరు ; గుణమయదేహము-లేరీతిన్ విడిచి రింతు? లెఱిఁగింపు శుకా!" 970

వ. అనిన శుకుం డిట్లనియె. 971

మ. "మును నేఁ జెప్పితిఁ; జక్రికిం బగతుఁడై, మూఢుండు చైద్యుండు పెం
పునఁ గైవల్యపదంబు నొందెఁ; బ్రియలై పొందంగ రా కున్న దే?
యనఘుం, డవ్యయుఁ, డప్రమేయుఁ, డగుణుం డై నట్టి గోవిందమూ
ర్తి నరశ్రేణికి ముక్తిదాయిని సుమీ; తెల్లంబు భూవల్లభా! 972

---

1. మన్మథునియొక్క. 2. బాణములయొక్క.

ఆ. బాంధవమున నైనఁ, బగనైన, [1]వగనైనఁ-బ్రీతినైనఁ, బ్రాణభీతినయిన
భక్తినైన, హరికిఁ బరతంత్రులై యుండు-జనులు మోక్షమునకుఁ జనుదు; రధిప!

వ. అటు గావునఁ బరమపురుషుండును, నజుండును, యోగీశ్వరుండు నైన హరిని సోఁకిన [2]స్థావరం బయిన ముక్తం బగు; వెఱఁగుపడ వలవ; దివ్విధంబున.

క. ఘనమధురగీతనినదము-విని, వచ్చినగోపికలను వీక్షించి, నయం
బున మేటి సుగుణి, నేర్పరి-తనవాగ్వైభవము మెఱయఁ దగ నిట్లనియెన్.

శా. "మేలా! మీకు? భయంబు పుట్టదు గదా మీమందకున్? సింహశా
ర్దూలానేకపముఖ్యముల్ దిరిగెడిన్; దూరంబు లే తెంతు రే?
యేలా వచ్చితి రీనిశాసమయమం? దిచ్చోట వర్తింతు రే?
చాలుం జాలు; లతాంగులార! చనుఁడీ సంప్రీతితో మందకున్. 976

శా. మీ రేతెంచినజాడఁ గానక, వగన్ మీతల్లులుం, దండ్రులున్,
మీ రాముల్, మఱఁదుల్, తనూజులు, గురుల్, మీసోదరుల్, బంధువుల్,
"మేరల్ మీఱిరి; లేరు; పోయి;"రనుచున్ మీఘోషభూభాగమం
దేరీతిం బరికించిరో? తగవులే యీ సాహసోద్యోగముల్? 976

చ. [3]ఇలువడి సున్నసేసి, హృదయేశుల సిగ్గులు పుచ్చి, యత్తమా
మల నెరియించి, సోదరులమానము [4]సూరలు పుచ్చి, తల్లిదం
డ్రులరుచి మాని, బంధులకు రోఁత యొనర్చుచు, జారవాంఛలన్
వలనఱి, సత్కులాంగనలు వత్తురె? లోకులు సూచి మెత్తురే? 977

సీ. ప్రాణేశుఁ డెఱిఁగినఁ బ్రాణంబునకుఁ దెగు; దండించు నెఱింగిన ధరణివిభుఁడు;
మామ యెఱింగిన మనువెల్లఁ జెడిపోవుఁ; దలపరి యెఱిఁగినఁ దగులు సేయుఁ;
దలిదండ్రు లెఱిఁగినఁ దలలెత్త కుందురు; [5]ఓరా లెఱింగిన నెత్తి పొడుచు;
నాత్మజు లెఱిఁగిన నాదరింపరు చూచి; బంధువు లెఱిఁగిన బహి రొనర్తు;
ఆ. రితరు లెఱిఁగి రేని నెంతయుఁ జుల్కఁగాఁ-జూతు; రిందు నందు సుఖము లేదు;
యశము లేదు; నిర్భయానందమును లేదు;-జారుఁ జేరఁ జనదు చారుముఖికి.

క. నడవడి గొఱ గాకున్నను,-బడుగైనఁ, గురూపి యైనఁ, బామరుఁ డైనన్,
జడుఁ డైన, రోగి యైనను,-విడుచుట మరియాద గాదు విభు నంగనకున్. 979

చ. ఇది యమునానదీజలసమేధితపాదపపల్లవప్రసూ
నదళవిరాజితం బగు వనంబు; మనంబుల మేర దప్పెనో?

1. దుఃఖముచేత. 2. పర్వతము, వృక్షమువంటి చలింపనిపదార్థము. 3. ఇంటిమర్యాద.
4. కొల్లపెట్టి. 5. తోడికోడలు.

పాదిఁగిట నేద్పుబిడ్డలకుఁ బోయుఁడు పాలు; విడుండు లేఁగలన్
మొదవులకున్; నిజేశ్వరుల, ముద్దియలార! భజింపుఁ డొప్పఁగన్, 980

చ. వనితలు నన్నుఁ గోరి, యిట వచ్చితి; రింతఁ గొఱంత లేదు; మే
లొనరె; సమస్తజంతువులు నోలిఁ బ్రియంబులు గావె నాకు? నై
నను నిలువంగఁ బోలదు; సనాతనధర్మము లాఁడువారికిం
జెనిమిటులన్ భజించుటలు; పెద్దలు నెవ్వుచు నుందు రెల్లెడన్. 981

క. ధ్యానాకర్ణనదర్శన,-గానంబుల నాతలంపు గలిగినఁ జాలుం;
బూనెదరు కృతార్థత్వము,-మానవతుల్! చనుఁడు మరలి మందిరములకున్."

వ. అని పలికిన విని. 983

సీ. విరహాగ్నిశిఖలతో వెడలునిట్టూర్పుల ముమ్మరంబులఁ దాఁకి మోము లెండ,
గన్నుల వెడలెడి[1] కజ్జలధారలు కుచకుంకుమంబులఁ గ్రోచ్చి పాఱఁ,
జెక్కులఁ జేర్చిన చేతుల వేఁడిమి మోముఁదమ్ముల మేలిమురువు డిందఁ,
బోరిఁబోరిఁ బుంఖానుపుంఖంబు లై తాఁకుమదనుకోలల ధైర్యమహిమ సెదరఁ
తే. దుఃఖభరమున మాటలు దొట్రుపడఁగఁ,-బ్రియము లాడని ప్రియుఁజూచి బెగ్గడిల్లి,
చరణముల నేలవ్రాయుచు, సంభ్రమమునఁ-గాంత లెల్లను వగల నాక్రాంతలగుచు.

వ. ఇట్లనిరి. 985

మ. "అకటా! నమ్మితి మేము *క్రూరుఁ డన ని న్నర్హంబె? మాయిండ్లలో
సకలవ్యాప్తుల డించి, నీపదసరోజాతంబు లర్చింపఁ జొ
క్కఁక యే తెంచితి; మీశుఁ డాఢ్యుఁడవు; మోహాంధసక్తులం గాచుపో
లిఁకఁ గావం దగుఁ; గావవే విడువ మేలే? కాంతలన్ భ్రాంతలన్. 986

మ. పతులన్, బిడ్డల, బంధులన్ సతులకుం బాటించు టే ధర్మప
ద్ధతి యా నంటివి; దేహధారిణులకున్ ధర్మజ్ఞ! చింతింపుమా;
పతిపుత్రాదికనామమూర్తి వగుచున్ భాసిల్లు నీయందుఁ ద
త్పతిపుత్రాదికవాంఛలన్ సలిపి, సంభావించు టన్యాయమే? 987

మత్తకోకిలము. నీపయిన్ రతి సేయుచుందురు నేర్పరుల్; సతతప్రియో
ద్దీపకుండవు గాన, నెవ్వఁగఁ దెచ్చు నాథసుతాదులం
జూప నేటికి? మన్మథాశలు సుట్టి నీకడ నుండఁగాఁ
బాప నేల? మదీయతాపముఁ బాపఁ బోలుఁ గృపానిధీ! 988

---

1. కాటుకయొక్క ధారలు.

* 'క్రూరుఁడవే నిన్నాశించి' 'క్రూరుఁడని నిన్నర్హంబె' అనియు పూ. ము. కాని ఈ పాఠము లేవియు 'మైవం విభోఽర్హసి భవాన్ గదితుం నృశంసం' అను (10-29-31) మూలపాఠమునకు సరికావు.

సీ. నీపాదకమలంబు నెమ్మి డగ్గఱఁ గాని, తరలి పోవంగఁ బాదములు రావు;
నీకరాబ్జంబులు నెఱి నంటి తివఁ గాని, తక్కినపనికి హస్తములు సారవు;
నీవాగమృతధార నిండఁ గ్రోలఁగఁ గాని, చెవు లన్యభాషలు చేరి వినవు;
నీసుందరాకృతి నియతిఁ జూడఁగఁ గాని, చూడ వన్యంబులఁ జూడ్కికవలు;
ఆ. నిన్న కాని పలుకనేరవు మాజిహ్వ; లొల్ల ననుచుఁ బలుకనోడ; నీవు
మామనంబు లెల్ల మరపించి-దొంగలి; తేమి సేయువార మింకఁ? గృష్ణ!

చ. సిరికి నుదారచిహ్నములు సేయుభవచ్చరణారవిందముల్
సరసిజనేత్ర! మా తపముసంపదఁ జేరితి మెట్టకేలకున్;
మరలఁగ లేము; మామగలమాటల నొల్లము; పద్మగంధముల్
మరగిన తేఁటు లన్యకుసుమంబులచెంతను జేర నేర్చునే? 990

ఆ. సవతులేక నీవిశాలవక్షస్థ్సలిఁ, దులసితోడఁ గూడఁ దోయజాక్ష!
మనువు మనుచు నెపుడు మా కాంత నీపాద-కమలరజముఁ గోరుగాదె? కృష్ణ!

ఉ. అత్తలు, మామలున్ వగవ, నాఱడి కోడక, నాథులన్ శుగా
యత్తులఁ జేసి, యిల్వరుస లాఱడి పోవఁగ, నీదునవ్వులన్
మెత్తనిమాటలన్ మరుఁడు మేకొని యేఁచిన వచ్చినార; మే
పొత్తుల నొల్ల; మో పురుషభూషణ! దాస్యము లిచ్చి కావవే! 992

మ. మగువల్ సిక్కరె తొల్లి వల్లభులకున్? మన్నించి తద్వల్లభుల్
మగపంతంబు దలంపరే? తగులముల్ మాపాలనే పుట్టెనే?
మగవా రాడెడుమాటలే? తగవు నీమాటల్; మనోజాగ్నిచేఁ
బొగులం జాలము; కౌఁగిలింపుము మముం; బుణ్యంబు పుణ్యాత్మకా! 993

ఉ. కుండలదీప్తగండమును, గుంచితకుంతలఫాలమున్, సుధా
మండితపల్లవాధరము, మంజులహాసవిలోకనంబు నై
యుండెడునీముఖంబుఁ గని, యుండఁగ వచ్చునె? మన్మథేషుకో
దండవిముక్తబాణముల దాసుల మయ్యెద; మాదరింపవే. 994

సీ. నీయధరామృతనిర్ఝరంబుల నేఁడు సేరి వా తెఱలపైఁ జిలుకకున్న,
నీవిశాలాంచితనిర్మలవక్షంబుఁ గుచకుట్మలంబులఁ గూర్పకున్న,
నీరమ్యతరహస్తనీరజాతంబులు చికురబంధంబులఁ జేర్పకున్న,
నీకృపాలోకననివహంబు మెల్లన నెమ్మొగంబులమీఁద నెఱప కున్న,
ఆ. నీనవీనమాననీయసల్లాపంబు-కర్ణరంధ్రదిశలఁ గప్పకున్న,
నెట్లు బ్రదుకువార? మెందుఁ జేరెడువార?-మధిప! వినఁగఁ దగదె యాఁడుకుయులు?

మ. భవదాలోకవహాసగీతజములై భాసిల్లు కామాగ్నులన్,
భవదీయాధరపల్లవామృతముచేఁ బాపం దగుం; బాపవే

నీ వియోగానలహేతిసంహతులచే నీ త్రై, భవచ్చింతలన్
భవదంఘ్రిద్వయవీథిఁ బొందెదము నీపాదంబులానం బ్రియా! 996

క. తరుమృగఖగగోగణములు-కర మొప్పెదునిన్నుఁ గన్న, గానము విన్నం,
గరఁగి పులకించు; నబలలు-గరఁగరె నినుఁ గన్న; నీదుగానము విన్నన్? 997

సీ. ఈపంచబాణాగ్ని నేమిట నార్తుము, నీమంజువాగ్వృష్టి నెగడ దేని?
నీమన్మథాంభోధి నేత్రోవఁ గడతుము, నీదృష్టి నావ యై నిలువ దేని?
నీచిత్తజధ్వాంత మేజాడఁ జెఱుతుము, నీహాసచంద్రిక నిగుడ దేని?
నీదర్పకజ్వర మేభంగి నడఁగు నీయధరామృతౌషధ మబ్బ దేని?*

ఆ. నెట్లు నిర్వహింతు? మేలాగు మాలాగు-కరుణ సేయవేనిఁ, గదియవేని?
మరుఁడు నిర్దయుండు; మన నిచ్చునే? యశో-దాకుమార! యువతిధైర్యహార!

క. అమరులఁ గాచిన హరిక్రియఁ-గమలేక్షణ! నీవు నేఁడు కరుణ నభయహ
స్తము మాయురముల,-శిరములఁ, బ్రమదంబున నిడుము మూర్ఛపాల్పడకుండన్.

క. కట్టా! తలమునుకలునై-దట్టపువిరహాబ్ధితెరలు తరుణుల నేఁచన్
నెట్లున్ దరిఁజేర్ప వయో!-కట్టేఁడిది గదా! కుమార! కరుణోదారా!’’ 1000

వ. అని యిట్లు కుసుమశరునిశరపరంపరాపరవశలై, యోపికలు లేక, పలికిన గోపికల దీనాలాపంబు విని, నవ్వి, యోగేశ్వరేశ్వరుం డయిన కృష్ణుం డాత్మారాముం డై వారలతో రమించె; నప్పుడు. 1001

మ. కరుణాలోకములం, బటాంచలకచాకర్షంబులన్, మేఖలా
కరబాహుస్తనమర్శనంబుల, నఖాంకవ్యాప్తులన్, నర్మవా
క్పరిరంభంబుల, మంజులాధరసుధాపానంబులం, గాంతలం
గరఁగించెన్ రతికేళిఁ, గృష్ణుఁడు గృపం గందర్పుఁ బాలార్చుచున్. 1002

క. మక్కువ వికసితవదనలు-సక్కఁగఁ దనుఁ గొల్వ, హాసచంద్రికతోడన్
మిక్కిలి మెఱసెను, గృష్ణుఁడు-చుక్కల[1]గమినడిమిపూర్ణసోమునిభంగిన్. 1003

ఆ. సతులు దన్నుఁ బాడ, సంప్రీతి నాడుచు-నఱుత నున్న వైజయంతితోడ
వనజలోచనుండు వనభూషణుం డయ్యె-యువతిజనశతంబు లోలిఁ గొలువ.

ఉ. చిక్కక, యీశుఁ డై యెదిరిఁ జిక్కుల బెట్టెడి[2]మాయలానికిం
జిక్కి, కృతార్థ లై మరునిచిక్కులఁ జొక్కి, లతాంగు లుండఁగా
మక్కువ శాంతి సేయుటకు మన్నన సేసి, ప్రసన్నుఁ డౌటకుం
జక్కన నావిభుండు గుణశాలి దిరోహితుఁ డయ్యె నయ్యెడన్. 1005

---

* ‘నడఁతుము నీనవాధరసుధ నింపవేని’ అని తరువాతి ముద్రణములు. ప్రక్రమభంగము ఎట్లును దప్పదు. 1. గుంపు. 2. మాయగలవాఁడు.

వ. ఇట్లు హరి గను మొఱంగి చనినతఱిం గానక, కరిం బాసి తిరుగు కరేణులపెల్లున నుల్లంబు దల్లడిల్ల వల్లవకాంతలు తదీయగమనహాసలీలావిలాసవీక్షణవిహారవచనరచనానురాగంబులం జిత్తంబులు గోల్పడి, వివిధచేష్టలకుం బాల్పడి, తదాత్మకత్వంబున "నేన నేన కృష్ణుండ" నని కృష్ణగుణావేశంబులం జరియించుచు. 1006

క. భూతములలోనఁ వెలిఁ బ్ర-ఖ్యాతుం డగునట్టివానిఁ, గాంతలు వాళిం
దీతీరవనాంతరముల-బ్రాఁతిగ వెదకంగఁ జనిరి పాడుచు నధిపా! 1007

సీ. "పున్నాగ! కానవే పున్నాగవందితుఁ; దిలకంబ! కానవే తిలకనిటలు;
ఘనసార! కానవే ఘనసారశోభితు; బంధూక! కానవే బంధుమిత్రు;
మన్మథ! కానవే మన్మథాకారుని; వంశంబ! కానవే [1]వంశధరునిఁ;
జందన! కానవే చందనశీతలుఁ; గుందంబ! కానవే కుందరదను;
తే. నింద్రభూజమ! కానవే యింద్రవిభవుఁ;
గువలవృక్షమ! కానవే కువలయేశుఁ;
బ్రియకపాదప! కానవే ప్రియవిహారు"
ననుచుఁ గృష్ణుని వెదకి రయ్యబ్జముఖులు. 1008

వ. మఱియును. 1009

ఉ. "నల్లనివాఁడు, పద్మనయనంబులవాఁడు, కృపారసంబు పైఁ
జల్లెడువాఁడు, మౌళి[2]పరిసర్పితపింఛమువాఁడు, నవ్వు రా
జిల్లెడుమోమువాఁ, డొకఁడు చెల్వలమానధనంబుఁ దెచ్చె నో
మల్లియలార! మీపొదలమాటున లేఁడు గదమ్మ? చెప్పరే? 1010

ఉ. అంగజు నైనఁ జూడ హృదయంగముఁ డై కరఁగించువాఁడు శ్రీ
రంగదురంబువాఁడు, మధురం బగు వేణురవంబువాఁడు, మ
మ్మంగజుపువ్వుఁదూపులకు నగ్గము సేసి, లవంగలుంగనా
రంగములార! మీకడకు రాఁడు గదా? కృప నున్నఁ జూపరే! 1011

సీ. మానినీమన్మథు మాధవుఁ గానరే, సలలితోదారవత్సకములార!
సలలితోదారవత్సకవైరిఁ గానరే, సుందరోన్నతలతార్జునములార!
సుందరోన్నతలతార్జునభంజుఁ గానరే, ఘనతరలసదశోకంబులార!
ఘనతరలసదశోకస్ఫూర్తిఁ గానరే, నవ్యరుచిరకాంచనంబులార!
ఆ. నవ్యరుచిరకాంచనకిరీటుఁ గానరే-గహనపదవికురవకంబులార!
గహనపదవికురవకనివాసిఁ గానరే-గణికలార! చారుగణికలార! 1012

1. వేణువును ధరించినవాఁడు. 2. వ్యాపింపఁబడిన.

సీ. అదె నందనందనుం డంతర్హితుం డయ్యెఁ; బాటలీతరులార! పట్టరమ్మ!
హేలావతులఁ గృష్ణుఁ డేల పాసితివని, మైరేయలతలార! యడుగరమ్మ!
వనజాక్షుఁ డిచటికి వచ్చి డాఁగఁడు గదా? చూతమంజరులార! చూడరమ్మ!
మానినీమదనుతో మారాక మెఱిఁగించి, మాధవీలతలార! మనుపరమ్మ!
ఆ. జాతిసతులఁ బాయ నీతియే హరి కని-జాతులార! దిశలఁ జాటరమ్మ!
కదళులార! పోయి కదలించి శిఖిపింఛ-జూటుఁ దెచ్చి కరుణఁ జూపరమ్మ! 1013

క. హరిచరణములకుఁ బ్రియవై-హరి నిను మన్నింప, భద్ర మందెదు తులసీ!
హరి నీదెస రాఁడు గదా-హరి నొప్పెఱిఁగించి శుభము లందింపఁగదే! 1014

తే. పొగడఁ దగువానిఁ గానరే? పొగడలార!-యీరెఱుంగనివిభుఁ జూపుఁ డీరెలార!
మొల్ల మగుకీర్తివాఁ డేడి? మొల్లలార!-[1]శుకనిగదితునిఁ జెపుడు కింశుకములార!

క. తరుణీకుచకుంకుమయుత-హరికంధరదామగంధ మడరెడుఁ జూడ్కుల్,
హరిఁ గనినపగిదిఁ దనరెడి-హరిణీ! హరిజాడఁ బుణ్య మయ్యెడిఁ జెప్పుమా! 1016

క. "[2]కిటి యై కౌఁగిటఁ జేర్చెను-వటుఁ డై వర్ధిల్లి కొలిచె; వడిఁ గృష్ణుం డై
యిటఁ బదచిహ్నము లిడెఁ; గ్రిం-దటిబామున నేమి నోఁచి తమ్మ! ధరిత్రీ!''

వ. అనుచు మదనోన్మాదచిత్తలై, తదాత్మకత్వంబునఁ గృష్ణులీలల ననుకరించుచు.

సీ. పూతన యై యొక్క-పొలఁతి చరింపఁగ, శౌరి యై యొక కాంత చన్ను గుడుచు;
బాలుఁ డై యొకభామ పాలకు నేడ్చుచో, బండి నే నను లేమఁ బాలుఁ దన్నుఁ;
సుడిగాలి నని యొక్క-సుందరి గొనిపోవ, హరి నని వర్తించు నబ్జముఖియు;
బకుఁడ నేనని యొక్క-పడఁతి సంరంభింప, పద్మాక్షుఁ డనుకొమ్మ పరిభవించు;
ఆ. నెలమి రామకృష్ణు లింతు లిద్దఱు గాఁగ-గోపవత్సగణము గొంద ఱగుదు;
రసురవైరి ననుచుఁ నబల యొక్కతె చీరుఁ-బసుల మనెడిసతుల భరతముఖ్య!

ఆ. లోక మెల్ల గుక్షిలోపల నున్నది-మాధవుండ నేను; మాత! వీవు;
'చూడు' మనుచు నొక్క-సుందరి యొకతెకు-ముఖముఁ దెఱచి చూపు; ముఖ్యచరిత!

క. 'వెన్నలు దొంగిలి తినియెడి-వెన్నుఁడ' నని యొకతె నుడువ, వేఱొక్కతె చే
సన్నల యశోద నంచును-గ్రన్నన కుసుమములదండఁ గట్టు; నిలేశా! 1021

క. 'కాళియఫణి యిది; వీరలు-కాళియఫణిసతులు; మ్రొక్కఁ గడఁగిరి; నే గో
పాలకుమారుఁడ' ననుచును-లీలాగతి నాడు నొక్కతె నరేంద్రా! 1022

క. తరుణులు గోపకు లందఱు-హరిహాయుఁ డిదె; వాన గురిసె; హరి నే; నని భా
సురచేలాంచల మొక్కతె-గిరి నెత్తెద; ననుచు నెత్తెఁ గెంగేల నృపా! 1023

1. శుకమహామునిచేఁ జెప్పఁబడిన (నుతింపఁబడినవాఁడు). 2. వరాహము.

క. "మీరలు గోపకు; లే నసు-రారిని; దావాగ్ని వచ్చె; నటు సూడకుఁడీ!
వారించెద" నని యొక్కతె-సేరి బయల్ కబళనంబు సేయు నరేంద్రా! 1024

వ. ఇట్లు తన్మయత్వంబున గోపసుందరులు బృందావనంబునం గల తరులతాదుల హరి నడుగుచు, దుర్గమంబు లయిన విపినమార్గంబుల సరోజాతకేతనహలకులిశ కలశాంకుశాదిశుభలక్షణలక్షితంబు లయి మనోహరంబు లయిన హరిచరణంబుల చొప్పుఁ గని, తప్పక చెప్పికొనుచుఁ దమలో నిట్లనిరి. 1025

సీ. కొమ్మకుఁ బువ్వులు గోసినాఁ డిక్కడ; మొనసి పాదాగ్రంబు మోపినాఁడు;
సతి నెత్తుకొని వేడ్క జరిగినాఁ డిక్కడఁ; దృణములోఁ దోఁపదు తెఱవ జాడ;
ప్రియకు [1]ధమ్మిల్లంబు వెట్టినాఁ డిక్కడఁ; గూర్చున్నచోటిదె కొమరుమిగులు;
నింతికిఁ గెమ్మోవి యిచ్చినాఁ డిక్కడ; వెలఁది నిక్కినగతి విశద మయ్యె;
ఆ. సుదతితోడ నీరు సొచ్చినాఁ డిక్కడఁ-జొచ్చి తా వెడలిన చోటు లమరెఁ;
దరుణిఁ గాముకేళిఁ దనిపినాఁ డిక్కడ-ననఁగి పెనఁగి యున్నయంద మొప్పె.

వ. మఱియును. 1027

సీ. ఒకమెలనాఁగచే యూఁదినాఁ డిక్కడ, సరస నున్నవి నాల్గుచరణములును;
నొకనీలవేణితో నొదిఁగినాఁ డిక్కడ, మగజాడలో నిదె మగువజాడ;
యొకలేమ మ్రొక్కిన నురివినాఁ డిక్కడ,రమణిమ్రొక్కినచొప్పు రమ్యమయ్యె;
నొకయింతి కెదురుగా నొలసినాఁ-డిక్కడ,ననోన్యముఖములై యంఘ్రులొప్పె;
ఆ. నొకతె వెంటఁ దగుల నుండక యేఁగినాఁ-డడుగుమీఁదఁ దరుణియడుగులమరెఁ;
నబల లిరుగెలంకులందు రాఁ దిరిగినాఁ-డాఱు పదము లున్నవమ్మ! యిచట.

సీ. ఈచరణంబులే యిందునిభానన! సనకాదిమునియోగసరణి నొప్పు;
నీపాదతలములే మెలనాఁగ! శ్రుతివధూసీమంతవీథులఁ జెన్నుమిగులు;
నీపదాబ్జంబులే యిభకులోత్తమయాన! [2]పాలేటిరాచూలిపట్టుఁగొమ్మ;
లీసుందరాంఘ్రులే యిందీవరేక్షణ? ముక్తికాంతామనోమోహనంబు;
ఆ. లీయడుగులరజమె యింతి! బ్రహ్మేశాది-దివిజవరులు మౌళిదిశలఁ దాల్తు;
రనుచుఁ గొంద ఱబల లబ్జాక్షుఁ డేఁగిన-క్రమముఁ గనియు నతనిఁ గానరైరి.

వ. అప్పుడు. 1030

సీ. పతులదైన్యంబును, భామలక్రౌర్యంబుఁ, జూపుచు విభుఁ డొక్కసుదతితోడ
విహరింప నది యెల్ల వెలఁదుల వర్జించి నాయొద్ద నున్నాఁడు నాథుఁ, డనుచు
గర్వించి, రాఁ జాలఁ; గమలాక్ష! మూపున నిడుకొను మనుఁడు నయ్యీశ్వరుండు
[3]మొఱఁగిపోయినఁ, దాపమును బొంది, యోకృష్ణ! యెక్కడఁ జనితి, ప్రాణేశ! రమణ!

---

1. కొప్పు, వెండ్రుకలముడి. 2. క్షీరసముద్రపు బిడ్డ, లక్ష్మి. 3. మోసపుచ్చిపోయిన.

తే. నీకు వరవుడ నయ్యెద నిలువు మనుచు-వగవఁ గొందఱు కాంత లా వనితఁ జూచి
వరుఁడు మన్నింప గర్వించి వనజనేత్ర-చిక్కఁ డని వెఱఁగును జెంది రపుడు.

వ. మఱియును. 1032

సీ. "ఈపొదరింటిలో నిందాఁకఁ గృష్ణుండు నాతోడ మన్మథనటన మాడె;
నిర్యోల మగుచోట నిందాఁకఁ జెలువుండు గాఢంబుగా నన్నుఁ గౌఁగిలించె;
నీమహీజమునీడ నిందాఁక సుభగుండు చిట్టంటుచేతల సిగ్గుగొనియె;
నీపుష్పలతపొంత నిందాఁక దయితుండు నను డాసి యధరపానంబు సేసె;

ఆ. నీప్రసూనవేది నిందాఁక రమణుండు-గుసుమదామములను గొప్పఁ దీర్చె;"
ననుచుఁ గొంద ఱతివ లంభోజనయనుని-పూర్వలీలఁ దలఁచి పొగడి; రధిప!

మ. అని యిబ్భంగి లతాంగు లందఱును బృందారణ్యమం దీశ్వరున్
వనజాక్షుం బరికించి, కానక విభున్ వర్ణించుచుం, బాడుచున్,
మనముల్, మాటలుఁ, జేష్టలుం, గ్రియలు, న¹మ్మానాథుపైఁ జేర్చి వే
చని రయ్యామునసైకతాగ్రహమునకున్ సంత్యక్తగేహేచ్ఛలై. 1034

వ. చని గోపికలు హరి నుద్దేశించి యి ట్లనిరి. 1035

గో పి కా గీ త లు

క. "నీవు జనించినకతమున-నోవల్లభ! లక్ష్మి మంద నొప్పె నధికమై;
నీవెంటనె ప్రాణము లిడి-నీవా రరసెదరు; చూపు నీరూపంబున్. 1036

క. శారదకమలోదరరుచి-చోరక మగు చూపువలన సుందర! మిమ్ముం
గోరి, వెల యీని దాసుల-ధీరత నొప్పించు టిది వధించుట గాదే! 1037

ఆ. విషజలంబువలన, విషధరదానవు-వలన, ఱాలవానవలన, వహ్ని
వలన, నున్నవానివలనను రక్షించి-కుసుమశరునిబారిఁ గూల్పఁదగునె? 1038

ఉ. "నీవు యశోదబిడ్డఁడవె నీరజనేత్ర! సమస్తజంతుచే
తోవిదితాత్మ; వీశుఁడవు; తొల్లి విరించి దలంచి, లోరక
తోవిధ మాచరింపు" మని సన్నుతి సేయఁగ సత్కులంబునన్
భూవలయంబుఁగావ నిటు పుట్టితి గాదె మనోహరాకృతిన్. 1039

ఆ. చరణసేవకులకు సంసారభయమును-బాపి, ²శ్రీకరంబు పట్టు గలిగి,
కామదాయి యైన కరసరోజంబు మా-మస్తకముల నునిచి, మనుపు మీశ!

ఉ. గోవులవెంటఁ ద్రిమ్మరుచుఁ గొల్చినవారలపాపసంఘముల్
ద్రోవఁగఁ జాలి, శ్రీఁ దవరి, దుష్టభుజంగఫణాలతాగ్రసం

1. పూలతోఁగూడిన యరుగు. 2. లక్ష్మీపతి.

భావితమైన నీచరణపద్మము చన్నులమీఁద మోపి, త
ద్భావజపుష్పభల్ల భవబాధ హరింపు; వరింపు మాధవా! 1041

క. [1]బుధరంజనియును, సూక్తయు-మధురయు, నగు నీదువాణి మరగించెను; నీ
యధరామృతసంసేవన-విధి నంగజతాప మెల్ల విడిపింపఁగదే! 1042

క. మగువలయెడ నీక్రౌర్యము-దగునే? నిజభక్తభీతిదమనుఁడ; వకటా!
తగదు భవద్దాసులకును-నగుమొగముం జూపి, కావు నళినదళాక్షా! 1043

మ. ఘనలక్ష్మీయుత మై, వినన్ శుభద మై కామాదివిధ్వంసి యై
సనకాదిస్తుత మై, నిరంతరతపస్సంతప్తపున్నాగజీ
వన మై యొప్పెడు నీకథామృతము ద్రావం గల్గునే, భూరిదా
ననిరూఢత్వము లేనివారలకు? మానారీమనోహారకా! 1044

క. నీనగవులు నీచూడ్కులు-నీనానావిహరణములు, నీధ్యానంబుల్
నీ[2]నర్మాలాపంబులు-మానసముల నాఁటి, నేఁడు మగుడవు కృష్ణా! 1045

ఆ. ఘోషభూమి వెడలి, గోవుల మేపంగ-నీరజాభమైన నీ పదములు
గసవు శిలలఁ దాఁకి, కడునొచ్చునో యని-కలఁగుమా మనములు కమలనయన!

ఉ. మాపటివేళ నీవు వనమధ్యము వెల్వడి వచ్చి, గోష్పద
ప్రాపితధూళిధూసరితభాసితకుంతల మై, సరోరుహో
ద్దీపిత మైన నీమొగము ధీరజనోత్తమ! మాకు వేడ్కతోఁ
జూపి, మనంబులన్ మరునిఁ జూపుదుగాదె క్రమక్రమంబునన్? 1047

ఆ. భక్తకామదంబు, బ్రహ్మసేవిత, మిలా-మండనంబు, దుఃఖమర్దనంబు,
భద్రకరము నైనభవదంఘ్రియుగము,మా-యురములందు రమణ!యునుపఁదగదె?

ఆ. సురతవర్ధనంబు, శోకాపహరణంబు-స్వరితవంశనాళసంగతంబు,
[3]నన్యరాగజయము నైననీమధురాధ-రామృతమునఁ దాప మార్పు మీశ!

ఉ. నీ వడవిం బగల్ దిరుగ, నీ కుటిలాలకలాలితాస్య మి
చ్ఛావిధిఁ జూడకున్న నిమిషంబులు మాకు యుగంబు లై చనుం;
గావున రాత్రు లైన నినుఁ గన్నుల నెప్పుడుఁ జూడ కుండ, ల
క్ష్మీవర! ఱెప్ప లడ్డముగఁ జేసె; నిదేల విధాత క్రూరుఁ డై? 1050

ఉ. అక్కట! బంధులున్, మగలు, నన్నలుఁ, దమ్ములుఁ, బుత్రకాదులున్,
నెక్కొని రాత్రిఁ "బోకుఁ" డన నీమృదుగీతరవంబు వీనులన్
వెక్కస మైన వచ్చితిమి; వేగమె మోహము నొంది, నాథ! నీ
వెక్కడఁ బోయితో? యెఱుఁగ; మీ క్రియ నిర్దయుఁ డెందుఁ గల్గునే? 1051

1. పెద్దలనుసంతోషపెట్టునది. 2. వేడుకమాటలు. 3. ఇతరప్రేమలను జయించునది.

తే. మదనుఁ డార్వంగ నీ వాడు¹ మంతనములు-నవరసాలోకనం బగు నగుమొగంబు,
కమల కిరవైన మహితవక్షస్థలంబు-మా మనంబుల లోఁగొని మరపెఁ గృష్ణ!

మ. అరవిందంబులకంటెఁ గోమలములై, యందంబులై యున్న నీ
చరణంబుల్, కఠినంబులై మొనయు మాచన్నుంగవల్ మోపఁగా
నెరియం బోలు నటంచుఁ బొక్కుదుము; నీ యీకర్కశారణ్యభూ
పరిసంచారము కృష్ణ! నీప్రియలకుం బ్రాణవ్యథం జేయదే? 1053

క. కట్టా! మన్మథుకోలలు-నెట్టన నో నాఁట బెగడి, నీపాదంబుల్
వట్టికొనఁగ వచ్చినమము-నట్టడవిని డించి పోవ నాయమె? కృష్ణా! 1054

క. హృదయేశ్వర! మాహృదయము-మృదుతరముగఁ జేసి, తొల్లి మిక్కిలి కద నీ
హృదయము కఠినము చేసెను-మదీయసౌభాగ్య; మిట్టిమందము గలదే? 1055

ఉ. క్రమ్మి నిశాచరుల్ సురనికాయములన్ వడిఁ దాఁకి, వీఁక ²వా
లమ్ముల తెట్టెముల్ వఱప, నడ్డము వచ్చి జయింతు వండ్రు; ని
న్నమ్మిన ముగ్ధలన్ రహితనాథల నక్కట! నేఁడు రెండుమూఁ
డమ్ములయేటుకాఁ డెగవ నడ్డము రాఁ దగదే! కృపానిధీ! 1056

క. తియ్యవిలుకాఁడు డీకొని-వ్రయ్యలుగాఁ దూఱనేసె వనితలమనముల్;
వియ్యాన నింక నయినం-గుయ్యాలింపం గదయ్య! గోవింద! హరీ!" 1057

మ. అని యిట్లంగన లంచితస్వరముతో నంకించుచుం, బాడుచుం
దను రావే యని చేరి యేడువ, జగత్త్రాణుండు ³త్రైలోక్యమో
హనుఁడై, మన్మథమన్మథుం డయి, మనోజ్ఞాకారియై, హారియై,
ఘనపీతాంబరధారియై, పొడమెఁ దత్కాంతాసమీపంబునన్. 1058

క. వచ్చినవల్లభుఁ గనుఁగొని-విచ్చేసె నటంచు సతులు వికసితముఖులై,
యచ్చుగ నిల్చిరి ప్రాణము-వచ్చిన నిలుచుండు నవయవంబులభంగిన్. 1059

సీ. అబల యొక్కతె భక్తి నంజలి గావించి, ప్రాణేశుకెంగేలు వట్టికొనియె;
నింతి యొక్కతె జీవితేశ్వరుబాహువు మూఁపున నిడికొని, ముదము నొందె;
వనిత యొక్కతె తనవల్లభుతాంబూలచర్వితమాత్మహస్తమునఁ దాల్చెఁ;
బడఁతి యొక్కతె ప్రియుపదములు విరహాగ్నితప్తకుచంబులఁ దాపుకొనియె;

ఆ. భామ యొకతె ¹భ్రుకుటిబంధంబు గావించి-ప్రణయభంగరోషభాషణమున
దష్టదశన యగుచు దండించుకైవడి-వాఁడిచూడ్కిగముల వరునిఁ జూచె. 1060

క. హరిముఖకమలముఁ జూచుచుఁ-దరుణి యొకతె ఱెప్పలిడక తనియక యుండెన్;
హరిపదకమలముఁ జూచుచు-మరగి తనివి లేని సుజనుమాడ్కి నరేంద్రా! 1061

1. రహస్యములు. 2. బాణముల సముదాయములు. 3. కనుబొమలముడి.

ఉ. ఒక్కలతాంగి మాధవునియుజ్జ్వలరూపము సూచి కీవలం
జిక్కఁగఁ బట్టి, హృద్గతముఁ జేసి, వెలిం జన కుండ నేత్రముల్
గ్రక్కున మూసి, మేనఁ బులకంబులు గ్రమ్మఁగఁ గౌఁగిలించుచుం
[1]జొక్కము లైనలోచనులఁ జొక్కుచు నుండెను యోగికైవడిన్. 1062

సీ. ''ఎలయించి ప్రాణేశ! యెందుఁ బోయితి'' వని తోరంపుటలుకతో దూరె నొకతె;
''జలజాక్ష! ననుఁ బాసి చనఁగ నీపాదంబు లెట్లాడె'' నని వగ నెయిదె నొకతె;
''నాథ! నీ వరిగిన నాప్రాణ మున్నది కూర్మి యే? యిది'' యని కుందె నొకతె;
'యీశ్వర! నను నిన్ను నిందాఁకఁ గాపెనే? పాపపువిధి' యని పలికె నొకతె;
ఆ. ''తలఁగి పోవునట్టి తప్పేమి సేసితి;-నధిప! పలుకు; ధర్మ''మనియె నొకతె;
'యేమినోముఫలమొ హృదయేశ! నీమోము-మరలఁ గంటి' ననుచు మసలె నొకతె.

క. పలికినఁ బ్రతిజ్ఞఁ దప్పెడిఁ-''బలికించినఁ గాని, రమణుఁ బలుక'' నటంచుం
గలకంఠి యొకతె చెలితోఁ-బలుకుల నమృతములు గురియుపగిదిం బలికెన్.

క. ''పట్టినఁ గాని, మనోవిభుఁ-బట్టఁ గదా!'' యంచు నొక్కబాలిక సఖిచే
పట్టుకొని చెప్పె ధైర్యము-పట్టెల్లను మరునిటెంకిపట్టుగ నధిపా! 1065

క. చెలువుఁడు సెప్పకపోయిన-సొలపున నొకముగ్ధ 'మున్నుచూడ' ననుచు నోఁ
దల వంచి, యుండఁజాలక-దల యెత్తెను లోన మరుఁడు దల యెత్త నృపా!

వ. ఇవ్విధంబున. 1067

క. హరిసురుచిరలలితాకృతిఁ-దరుణులు గని, ముక్తవిరహతాపజ్వర లై
పరమోత్సవంబు సలిపిరి-పరమేశ్వరుఁ గనిన ముక్తబంధులభంగిన్ 1068

వ. అంత నక్కాంతుండు గాంతాజనపరిక్రాంతుం డై, వనాంతరంబున శక్తినికరసంయుక్తుం డైనపరమపురుషుండునుం బోలె, వారలం దోడ్కొని, మందారకుందకుసుమపరిమళమిళిత పవమానమానితమధుకరనికరఝుంకారసుకుమారంబును, శరత్కాల చంద్రకిరణసందోహసందళితాంధకారంబును, యమునాతరంగసంగత కోమలవాలుకాస్తారంబును నై యమలినం బైన పులినంబు ప్రవేశించె; వారును జ్ఞానకాండంబున నీశ్వరుం గని, శ్రుతులు ప్రమోదంబునం గామానుబంధంబులు విడిచిన విధంబున హరిం గని, విరహవేదనలు విడిచి పరిపూర్ణమనోరథ లై. 1069

క. [1]పాఠీననయన లెల్లన-కాఠిన్యపటాంచలములఁ గౌతుకములు హృ
త్ప్రీతముల సందడింపఁగఁ-బీఠముఁ గల్పించి రంతఁ బ్రియునకు నధిపా! 1070

1. నిర్మలములు, స్వచ్ఛములు. 1. చేఁపలవంటి బెళుకుగల నేత్రములు గలవారు.

ఆ. పరమయోగిహృదయభద్రపీఠంబుల-నుండు మేటి, [1]వ్రజవధూత్తరీయ
పీఠమున వసించి, పెంపారెఁ ద్రిభువన-దేవలక్ష్మి మేనఁ దేజరిల్ల. 1071

మ. మదనోద్దీపకుఁ డై ననాథునికి సమ్మానంబు గావించుచున్,
ముదితల్ హాసవిలోకవిభ్రమములన్ మోదించుచుం జేరి, త
త్పదముల్ హస్తతలంబులం బిసుకుచుం, బై ముట్టుచున్, దూఱుచుం,
జదువుల్ వల్కుచుఁ గూర్మి ని ట్లనిరి యాపత్కోపదీప్తాస్యలై. [పతులం

క. "కొలిచినఁ గొలుతురు కొందఱు;-గొలుతురు దముఁ గొలువకున్నఁ గొందఱు;
గొలిచినను గొలువకున్నను-గొలువరు మఱి కొంద ఱెలమి గోపకుమారా!"

వ. అని తన్నుద్దేశించి రహస్యంబుగాఁ బలికిన సుందరుపలుకులు విని, గోపాల
సుందరుం డిట్లనియె. 1074

సీ. "కొలిచినఁ గొలుతురు కొందఱు పశువులభజనముభంగిని ఫలముకొఱకు
నై; సఖ్యధర్మములందు సిద్ధింపవు; కొందఱు తండ్రులగుణముఁ దాల్చి,
దయ గలవారలు తగినసుహృత్తులు గొలువనివారలఁ గొల్తు రెపుడు;
ధర్మకామంబులు దనరంగఁ; గొందఱు కొలువనివారిని గొలుచువారిఁ

ఆ. గొలుచుతలఁపు లేమిఁ గొలువ; రాత్మారాము-లాప్తకాము, లజ్ఞు, లతికఠినులు;
వారియందుఁ బిదప వానిఁగాఁ జింతించి-యే లతాంగులార! యిట్టు లనుట.

క. ఏనిం దెవ్వఁడ నయినం-గా; నంగనలార! పరమకారుణికుండన్
మానసబంధుఁడ, నిత్య-ధ్యానము మీ కొస గవలసి [2]తలఁగితిఁ జుండీ! 1076

మ. నను సేవించుచు నున్నవారలకు నే నారూపముం జూపఁ, జూ
చినఁ జాలించి, మదించి, వారు మఱి నన్ సేవింపరో? యంచు, ని
ర్ధనికుం డాత్మధనంబు సెడ్డ నెపుడుం దత్పారవశ్యంబుఁ దా
ల్చినభంగిన్, ననుఁ బాసి మత్ప్రియుఁడు దాఁ జింతించు నారూపమున్. 1077

తరలము. [3]తగవు ధర్మముఁ జూడకొల్లక, తల్లిదండ్రుల, బంధులన్,
మగల, బిడ్డలఁ బాసి వచ్చినమన్నిషక్తల, మిమ్ము నేఁ
దగదు; పాసితిఁ; దప్పు నైఁపుడు; తద్వియోగభరంబునన్
వగలఁ బొందుచు మీర లాడినవాక్యముల్ వినుచుండితిన్. 1078

ఉ. పాయని [4]గేహశృంఖలలఁ బాసి, నిరంతరమత్పరత్వముం
జేయుచునున్న మీకుఁ బ్రతి సేయ యుగంబుల నైన నేర; నన్

1. గోపికలయొక్క పైఁటయను పీఠమునందు. 2. తొలఁగితిని. 3. న్యాయము. 4. గృహము లను సంకెలలను.

బాయక కొల్చుమానసము ప్రత్యుపకారము గాఁ దలంచి, నా
పాయుటఁ దప్పుగాఁ గొనక, భామినులార! కృపన్ క్షమింపరే." 1079

క. చక్కఁగ హరి యిటు పలికిన-చక్కనివాక్యముల, నతనిసంగమమున, లో
నిక్కినవియోగతాపము-లొక్కట విడిచిరి లతాంగు లుర్వీనాథా! 1080

## రాసక్రీడాభివర్ణము

ఉ. ఆ సమయంబునన్ విభుఁ, డనంతుఁడు, గృష్ణుఁడు చిత్రమూర్తియై
చేసెను మండలభ్రమణశీలపరస్పరబద్ధబాహుకాం
తాసువిలాసమున్, బహువిధస్ఫురితాననహస్తపాదవి
న్యాసము, రాసమున్, గృతవియచ్చరనేత్రమనోవికాసమున్. 1081

వ. ఇట్లు బహుగతులం దిరుగ నేర్పరి యగుహరి, దర్పించి తనయిరుగెలంకుల నలంకృత లయి కళంకరహితచంద్రవదన లిద్దఱుముద్దియ[1]లుద్దికొని, వీణ లందుకొని, ప్రవీణలై సొంపు మెఱసి యింపుగ వాయించుచు, నానందలహరీనిధానం బగు గానంబు సేయ, నవిరళం బై తరళంబు గాని వేడుక సరళం బగుమురళంబు లీలం గేల నందుకొని, మధురం బగు నధరంబునం గదియించి, మించి కామినీజనకబరికాసౌగంధికగంధ బంధురకరాంగుళీకిసలయంబులు యతిలయంబులం గూడి వివరంబుగ మురళీవివరంబుల సారించి పూరించుచు, సరిలేని భంగిం ద్రిభంగి యై కమలకర్ణికాకారంబున నడుమ నిలిచి, మఱియు గోపసుందరులెందఱందఱకు నందఱయి, సుందరులకవలియెడలం దానును, దన కవలియెడల సుందరులను దేజరిల్ల, నృత్తవిద్యా[2]మహార్ణవవేలావలయవలయితం బై విస్మితాఖండలం బైన రాసమండలంబు గల్పించి, వేల్పులు హర్షంబునం గుసుమవర్షంబులు గురియ, నందఁ బ్రసూనమంజరీసహచరంబులైన చంచరీకంబులమించు ప్రకటించుచు, సువర్ణమణిమధ్యగంబులైన మహేంద్రనీలంబుల తెఱంగు నెఱపుచుఁ, గరిణీవిహారబంధురంబులై సింధురంబుల చెలువుఁ గైకొనుచుఁ, బల్లవితకుసుమితలతానుకూలంబులైన తమాలంబుల సొబగు నెగడించుచు, మెఱుపుఁదీవల నెడనెడం బెడంగడరు నల్లమొగిళ్ల పెల్లు సూపుచు, తరంగిణీసంగతంబు లయిన రోహణాచలశృంగంబుల బాగు లాగించుచు, జగన్మోహనుండై యుండి, రక్తకమలారుణంబులును, జంద్రశకలనిర్మలనఖరసంస్ఫురణంబులును, సనకసనందనాదియోగీంద్రమానసాభరణంబులును నయిన చరణంబులు గదియ నిడి, సమస్థితి నంజలిపుటంబులం బుష్పంబు లుల్లసిల్లఁ జల్లి, సల్లలితకమలప్రశస్తంబు లయిన హస్తంబులు వల్లవీజనులకంఠంబులపై నిడి, తాను గీతానుసారంబుగ విచిత్రపాదసంచారంబులు సలుపుచు, వర్తులాకారరాసబంధంబుల నర్తనంబునం బ్రవర్తించి, వెండియు

1. జతచేరి 2. సముద్రముయొక్కహద్దు.

వ్రేతలుం దానును శంఖ పద్మ వజ్ర కందుక చతుర్ముఖ చక్రవాళ చతుర్భద్ర
సౌభద్రనాగ నంద్యావర్త కుండలీకరణ ఖురరీబంధ ప్రముఖంబు లయిన విశేష
రాసబంధంబులకుం జొచ్చి, యేకపాద సమపాద వినివర్తిత గతాగతవలిత
వైశాఖమండలత్రిభంగిప్రముఖంబులైన తానకంబుల నిలుచుచుఁ, గనక
కింకిణీమంజులమంజీరశింజనంబులు జగజ్జనకర్ణరంజనంబు లై చెలంగ ఘటిత
మర్దితపార్శ్వగప్రముఖంబు లైన పాదకర్మభేదంబులు సేయుచు, సమపాదశకట
వదనమతల్లీశుక్తిప్రముఖంబు లైనపార్థివచారి విశేషంబులును నపక్రాంతడోలా
పాదసూచీప్రముఖంబు లైన వ్యోమచారి విశేషంబులనుం జూపుచు, సురేంద్ర
శాఖశాఖామనోహరంబులును నపహసితదిక్కరీంద్రకరంబులును త్రిలోకక్షే
మంకరంబులు నగు కరంబులం దిరంబు లగు రత్నకటకంబులమెఱుంగులు నింగి
చెఱంగులందఱచుకొన నర్ధచంద్ర కర్తరీముఖ కపిత్థ కటకాముఖ శుకతుండ
లాంగూల పద్మకోశ పతాక ప్రముఖంబు లైన స్వస్వభావసూచక నానావిధకర
భావంబు లాచరించుచుఁ గటినిబద్ధసువర్ణవర్ణచేలాంచలప్రభానికరంబులు సుక
రంబు లై దిశాంగనాముఖంబులకు హారిద్రాలేపనముద్రాలంకారంబు లొసం
గుచు నాస్కందితభ్రమరశకటాసనప్రముఖంబు లైన జానుమండలభేదంబులును
నలాత దండలాత లలిత విచిత్రప్రముఖంబు లైన దైవమండలంబులు నొనర్చు
చుఁ గమనీయకంబుకంఠాభిరామంబులునుద్దామతేజస్తోమంబులునైననీలమౌక్తిక
వజ్రవైడూర్యదామంబుల రుచు లిందిరాసుందరీమందిరంబు లయి సుందరంబు
లైనయురంబులం దిరుగుడువడి కలయం బడ నంగాంతరవాహ్యాలకు ఛత్రప్ర
ముఖంబు లైనభ్రమణవిశేషంబుల విలసించుచు, నిద్దంబు లగు చెక్కుటద్దంబుల
నుద్దవిడిం దద్దయుం బ్రభాసితచంద్రమండలంబు లగు కుండలంబులమెఱుంగు
మొత్తంబులు నృత్యంబు లొనరింపఁ గటిభ్రాంతదండరచితలలాటతిలకమయూర
లలితచక్రమండలనికుంచితగంగావతరణ ప్రముఖంబు లైన కరణంబు లెఱింగించు
చు వెలిదమ్మివిరులసిరులఁ జెన్నుమిగులుకన్నులవలన దీనజనదైన్యకర్కశంబులై
తనరుకటాక్షదర్శనజాలంబులు జాలంబులై కామినీజననయనమీనంబుల
నావరింప, లలితకుంచితవికాసముకుళప్రముఖంబు లయిన చూడ్కులం దేజ
రిల్లుచు, ననేకపరిపూర్ణచంద్రసౌభాగ్యసదనంబు లగు వదనంబులఁ బ్రసన్న
రాగంబులు ప్రకటించుచు, నుదంచితపింఛమాలికామయూఖంబు లకాలశక్ర
చాపంబులసొంపు సంపాదింప, నికుంచితాకుంచిత కంపితాకంపిత పరివాహిత
పరావృత్తప్రముఖంబులైన శిరోభావంబులు నెఱపుచు, మృగనాభితిలకంబులు
గల నిటలఫలకంబులఁ జికురంబులనికరంబులు గప్ప, నపరాజిత సూచికావిద్ధ
పరిచ్ఛిన్న విష్కంభ రేచిత ప్రముఖంబు లగు నంగహారంబుల విలసిల్లుచుఁ,
జరణకటికరకంఠరేచకంబు లాచరించుచు నొప్పె; నప్పుడా రాసంబు సంజనిత

సకలజనమానసోల్లాసకరంబై సుధార్ణవంబునుం బోలె నుజ్జ్వలరసాభిరామం బై,
రామరాజ్యంబునుంబోలె రాగపరిపూర్ణం బై, పూర్ణచంద్రమండలంబునుం
బోలె భ్రమరవిరాజమానంబై, మానధనుచిత్తంబునుంబోలెఁ బ్రధానవృత్తి
సమర్థం బై, సమర్థకవివిలసనంబునుంబోలె బహుప్రబంధభాసురం బై, సురలో
కంబునుంబోలె వసుదేవనందనవిశిష్టంబై, శిష్టచరితంబునుంబోలె ధరణీ
గగనమండలసుందరంబై, సుందరీరత్నంబునుంబోలె నంగహారమనోహరంబై,
హారవధూనిలయంబునుంబోలె ననేకచారిసుకుమారంబై, సుకుమారవృత్తంబు
నుంబోలె నుద్దీపితవంశం బై యుండె; నందు. 1082

చ. నడుములు వీఁగి యాడఁ, జిఱునవ్వులు నివ్వటిలంగ, హారముల్
సుడివడ, [1]మేఖలల్ వదలఁ, జొక్కి మెఱుంగులు పర్వ, ఘర్మముల్
వొడమఁ, గురుల్ చలింప, శ్రుతిభూషణముల్ మెఱయన్, సకృష్ణ లై
పడఁతుక లాడుచుం, జెలఁగి పాడిరి మేఘతటిల్లతాప్రభన్. 1083

క. అంకరహితేందువదనలు-పంకజలోచనునిఁ గూడి, పరఁగ నటింపం
[2]గింకిణుల నూపురంబుల-కంకణముల మ్రోఁత లెసఁగెఁ గర్ణోత్సవ మై. 1084

క. హరిణీనయనలతోడను-హరి రాసక్రీడ సేయ, నంబరవీథిన్
సురనాథులు భార్యలతో-సారిది విమానంబు లెక్కి చూచి రిలేశా! 1085

క. కురిసెం బువ్వులవానలు-మొరసెన్ దుందుభులు మింట; ముదితలు దారున్
సరసన్ గంధర్వపతుల్-వరుసన్ హరిఁ బాడి రపుడు వసుధాధీశా! 1086

క. రామలతోడను రాసము-రామానుజుఁ డాడఁ జూచి, రాగిల్లి, మనో
రాములమీఁద [3]వియచ్చర-రామలు మూర్ఛిల్లి పడిరి; రాజకులేంద్రా! 1087

క. తారాధిపనిభవదనలు-తారాధిపవంశ్యుఁ గూడి, తారు నటింపం
దారలతోడ సుధాంశుఁడు-దారున వీక్షింప రేయి దడవుగ జరగెన్. 1088

మ. యమునాకంకణచారి యై, వనజపుష్పామోదసంచారి యై,
రమణీఘర్మనివారి యై, మదవతీరాసశ్రమోత్తారి యై,
ప్రమదామానసనవ్యభవ్యసుఖసంపత్కారి యై, చేరి యా
కమలాక్షుం డలరంగ గాలి విసరెం గల్యాణభావంబునన్. 1089

వ. అప్పుడు. 1090

చ. ప్రమద యొకర్తు మాధవుఁడు పాడ, విపంచి ధరించి కేల సం
భ్రమమునఁ దంత్రి మీటుచుఁ దిరంబుగ రాయము సేసి, యొక్కరా

1. ఒడ్డాణములు, మొలనూలు. 2. చిన్నగజ్జెలు. 3. దేవతాకాంతలు.

గము దగ నాలపించి, సుభగస్వరజాతులు వేఱువేఱ కా
నమరఁగఁ బాడెఁ; దక్క రమణుఁ "డౌ" నన దాఱువ్ర లంకరింపఁగన్. 1091

క. ఆడుచుఁ బాడుచు నందొక, చేడియ మంజీరమంజుశింజిత మమరం
గూడి, హరికరము చనుఁగవ, పై డాయఁగ దిగిచె జఘనభారాలసయై. 1092

క. చందన లిప్తం బైయుర, వింద్యామోదమున నొప్పు విపులభుజము గో
విందుఁ డొకతరుణిమూఁపునఁ, బొందించిన, నది దెమల్చి, పులకించె నృపా!

సీ. చెలువయొక్కతె చెక్కుఁ జెక్కుతో మోపిన, విభుఁడు దాంబూలచర్వితము పెట్టె;
నాడుచు నొకలేమ యలసినఁ, బ్రాణేశుఁ డున్నతదోః స్తంభ మూఁత సేసెఁ;
జెమరించి యొకబాల సేరినఁ, గొనగోరఁ జతురుఁడు కుచ[1]ఘర్మజలము వాపె;
నలకంబు లొకయింతి కళిక చిత్రకరేఖ నంటినఁ, బ్రియుఁడు వాయంగ దువ్వెఁ;
ఆ. బడఁతి యొకతె పాట వాడి డస్సిన, నధ - రామృతమున నాథుఁ డాదరించె;
హరి యొక్కసతికి [2]నంసావృతం బైనఁ - గాంతుఁ డురముఁ జేర్చి కౌఁగిలించె.

క. హాసంబులఁ, గరతలవి - న్యాసంబుల, దర్శనముల, నాలాపములన్,
రాసశ్రాంతల, నా హరి - సేసెన్ మన్ననలు కరుణసేసి నరేంద్రా! 1095

క. హరి తనుసంగసుఖంబునఁ - బరవశ లై, వ్రేతలెల్లఁ, బయ్యెదలు నిజాం
బరములు నెఱుఁగమి చోద్యమె - సురసతు లీక్షించి కరఁగి చొక్కిరి మింటన్.

వ. ఇట్లు భగవంతుం డైన కృష్ణుం [3]డాత్మారాముం డయ్యును, గోపసతు లెందఱం దఱకు నందఱై, నిజప్రతిబింబంబులతోడం గ్రీడించు బాలుపోలిక రాసకేలి సలిపిన.

క. 'తగఁ గూడి యాడి మనముల - నగెఁ' జూచెం, బలికె నందనందనుఁ డనుచున్
మగువలు పెద్దఱికముతోఁ - బొగడిరి తమపూర్వజన్మపుణ్యశ్రేణిన్. 1098

## జలక్రీడాభివర్ణనము

వ. ఇట్లు హరి రాసకేళి సాలించి, కరకాంచిత లగు తటిల్లతల చెలువున ఘర్మసలిల కణాక్రాంత లగు కాంతలం గూడి, జలక్రీడాకుతూహలుం డై, యమునాజలంబులు సొర, నందు ముందర సుందరులు సొచ్చి, పదప్రమాణంబు, జానుదఘ్నంబు, కటిద్వయసంబు, మధ్యమాత్రంబు, కుచంబుల[4]బంటి యని పలుకుచుం గుచనయన నాభివివరకుంతలంబులు చక్రవాకజలచరావర్తశైవాలంబులనందంబున, నందంబుగ నీడు వొందిన యేఱు లని కళిందనందన గరంబులు సాఁచి, పరిరంభంబులకు నారంభించుకై వడి, నెదురు చనుదెంచి, తాఁకు తరంగంబులకు నులుకుచు,

1. చెమటనీరు, 2. భుజశిరములచేనావరింపఁబడిన, 3. మనస్సునందు విహరించువాఁడు, 4. లోఁతు.

సారసంబులకుం గరంబులు సాఁచుచు, మరాళంబులం జోపుచుఁ, జెన్నుమిగిలిన యన్నులచన్నులయొత్తువత్తుమను నెపంబులం దపంబుల నీటఁ గాహించు మాడ్కిని సంచరించుచక్రవాకంబులం దోలుచు, నితాంతకాంతిసదనంబులగు వదనంబులకు నోడి వ్రీడం జెంది, కంది, చందురుండు చలం బుడిగి జలంబునం బడి కంపించు కరణి, నిజకరచలితజలప్రతిబింబితుండై కదలు చంద్రునిం గని, మెచ్చి సోలుచు, సలిలావగాహసమయసముచ్చలితవారిశీకరపరంపరల వలన మకరందపానమత్తమధుకరపక్షవిక్షేపణసంజాతవాతసముద్ధూతకుముదాదిపరాగపటలంబులం జేరుచు, మోముఁదమ్ములకమ్మఁదనంమునకు మూఁగి జుమ్మురను తుమ్మెదలకు వెఱచుచుఁ, గరంబులనీరెగయంజఱచుచు, నీలనీరదనిపతితపయోబిందుసందోహంబులం దడియు పువ్వుఁదీవియలబాగునఁ గృష్ణుకరద్వయతోయంబులం బెక్కుతోయంబులం దడయుచుఁ, గ్రంపుకొని సుడియుచు, నసమబాణునిపులుగడిగినకుసుమబాణంబుల పగిది మేనులు మెఱయ సలిలావగాహనపరాయత్తచిత్త లగుచు, మొత్తంబులై సరసభాషణంబులం ద్రుళ్లుచుఁ, గరంబుల నీరు నించి హరిమీఁదం జల్లుచుఁ, జల్లునెడం దడఁబడక దాఁటుచు, దాఁటి చనక నిలువరించుచు, వినోదింప హరియుం గరేణుకరవికీర్ణనీరధారాభిషిక్తంబగు [1]శుండాలంబులీల నాభీరకామినీ కరసముజ్ఝితజలాసారంబులం దోఁగుచు, వ్రజవధూజనహస్తప్రయుక్తకల్హార కైరవపరాగపటలంబువలన భూతిభూషణుసిరి వహించుచు, గోపికాజనపాణికిసలయ సమున్ముక్తకమలదళంబులవలన సహస్రనయనునిరూపుఁ జూపుచు, గోపాలబాలికాకుచకలశకుంకుమపంకంబువలనఁ బ్రభాతబాలభానునిభంగి భాసిల్లుచు, ఘోషయోషాకటాక్షవిక్షేపణంబువలన మధుప[2]పరివృతహరిచందనసౌందర్యంబు నొందుచు, వల్లవీహాసరుచులవలనఁ జంద్రికాప్రభాభాసితనీలశైలంబుక్రియ నమరె; నంత.

మ. సతులుం దానును నీటిలో వెడలి భూషాగంధచేలాఢ్యులం
కృతులై కుంభి కరేణు[3]యూథములతోఁ గ్రీడించుచందంబునన్
లతలందుం దరులందుఁ బుష్పమయలీలాశయ్యలందున్, సుఖో
న్నతులై కృష్ణుఁడు క్రీడలం దనిపె నా నారీలలామంబులన్. 1100

వ. ఇట్లు శరత్కాలంబున, వెన్నుం డింద్రియస్ఖలనంబు సేయక గోపికలతోడ రమించె" నని చెప్పిన మునివరునకు భూవరుం డిట్లనియె. 1101

మత్తకోకిలము. "ధర్మకర్తయు, ధర్మభర్తయు, ధర్మమూర్తియు నైన స
త్కర్ముఁ, డీశుఁడు, ధర్మశిక్షయు ధర్మరక్షయుఁ జేయఁ గా
[4]నర్మిలిన్ ధరమీఁదఁ బుట్టి, పరాంగనాజనసంగ మే
ధర్మమంచుఁ దలంచి చేసె? సుదాత్తమానస! చెప్పుమా." 1102

---

1. ఏనుఁగు. 2. చుట్టుకొనఁబడిన. 3. ఆఁడేనుఁగులగుంపులు. 4. ప్రియముతో.

వ. అనిన శుకుం డిట్లనియె. 1103

ఆ. "[1]సర్వభక్షకుం డగ్ని సర్వంబు భక్షించి-దోషి గానిపగిది, దోష మైనఁ
జేసి, దోషపదముఁ జెందరు తేజస్వు-లగుటఁ జంద్రవాసవాదు లధిప. 1104

క. ఈశ్వరుఁడు గానివాఁడు న-రేశ్వర! పరకాంతఁ దలఁచి యెట్లు బ్రదుకు? గా
కీశ్వరుఁడు దక్క నన్యుఁడు-విశ్వభయదవిషము మ్రింగి వెలయంగలఁడే? 1105

క. సత్యము ప్రభువులవచనము-నిత్యముఁ; దద్వచనవీథి నిలుతురు పెద్దల్;
సత్యాసత్యము గావున-సత్య మనుచుఁ జనరు వారిచరితమున నృపా! 1106

మ. ఘనులై యెవ్వనిపాదపంకజపరాగధ్యానసంప్రాప్తయో
గనిరూఢత్వముచే మునీంద్రులు మహాకర్మంబులం బాసి, బం
ధనిరోధంబులు లేక, విచ్చలవిడిన్ దర్పింతు; రా దివ్యశో
భనుఁ డెట్లుండిన నుండెఁ గాక! కలవే బంధంబు? లుర్వీశ్వరా! 1107

ఆ. గోపజనములందు, గోపికలందును-సకలజంతులందు, సంచరించు
నా మహాత్మునకుఁ బరాంగన లెవ్వరు?-సర్వమయుఁడు లీల సలిపెఁ గాక!" 1108

వ. అని చెప్పి శుకుం డిట్లనియె; "నంత బ్రాహ్మముహూర్తంబునం గృష్ణు వీడ్కొని
గోపిక లిచ్చ లేకయు నిండ్లకడ కేఁగినం, గృష్ణమాయామోహితులై, గోప
కులు వారలం గోపింప నేరరై; రివ్విధంబున. 1109

ఇంద్ర. గోపాలకృష్ణుండును గోపకాంతల్-ప్రాపించి క్రీడించినభంగు లెల్లన్
రూపించి, వర్ణించి, నరుండు హృత్సం-తాపంబులన్ బాయును దత్ప్రసక్తిన్.

సర్పరూపి యగు సుదర్శనుం డను గంధర్వునిశాపవిమోచనము

వ. అంత నొక్కనాఁడు నందాదు లైన గోపకు లంబికావనంబునకు శకటంబు
లెక్కి జాతరకుం జని, సరస్వతీనదీజలంబుల స్నానంబులు సేసి, యుమా
మహేశ్వరుల నర్చించి, కానిక లిచ్చి, బ్రాహ్మణులకు గోహిరణ్యవస్త్రాన్నదా
నంబు లొసంగి, జలప్రాశనంబు సేసి, నియమంబున నుండ, దైవయోగంబున
నాఁకొని యొక్క మహోరగంబు నిదురవోయిన నందునిం గఱచి, మ్రింగ
నగ్గలింప, నతండు కృష్ణ కృష్ణేతివచనంబులం దన్ను విడిపింపు మని మొఱ
యిడిన విని. 1111

క. గోపకు లందఱు మేల్కని-కోపముతోఁ బెద్దగుదెలఁ గొఱవుల మొత్తం,
దాపము నొందియు వదలక-పాపపుఁబెనుబాము నందుఁ బట్టె నృపాలా! 1112

వ. అయ్యవసరంబునఁ గృష్ణుఁడు దర్పించి [2]పాదతాడనంబు సేసి, త్రొక్కిన సర్పంబు

1. సర్వమును భక్షించువాఁడు, అగ్ని. 2. కాలితన్ను, కాలితోఁదన్ని.

సర్పరూపంబు విడిచి, విద్యాధరేంద్రరూపంబుఁ దాల్చి, హరికి మ్రొక్కిన, నతనికి హరి యి ట్లనియె. 1113

ఉ. "మండితమూర్తితోఁ, గనకమాలికతో, శుభలక్షణుండవై
యుండెడు నీకుఁ గష్టపుమహోరగదేహ మి దేల వచ్చె? నె
వ్వండవు? నామ మెయ్యది? భవంబున కెద్ది మిషంబు? నాకు నొం
డొండ యెఱుంగఁ జెప్పుము; బుధోత్తమ! నీపని చోద్య మయ్యెడిన్." 1114

వ. అనిన వాఁ డిట్లనియె; దేవా! యేను సుదర్శనుం డను విద్యాధరుండ; విమానారూఢుండ నై రూపసంపద్గర్వంబులం జొక్కి, దిక్కులం జరించుచు, నొక్కయెడ నాంగిరసు లైన ఋషులం గురూపు లైనవారలం గని, నగిన, వారును "నీవు [1]రూపదర్పంబున మమ్ము నగితివి; గావున మహాసర్పంబ వై యుండు" మని శపించి, పిదప నే వేఁడుకొనిన నిట్లనిరి. 1115

చ. "యదుకులమందు భక్తులభయంబు హరించుటకున్, జనార్దనుం
డుదయము నొంది, యీ యడవి కొక్కదినంబున రాఁగలండు; త
త్పదమున నీవు దన్నఁబడి, పన్నగదేహము తోడఁ బాసి, నీ
మొదలిటిమేను గాంచెదవు; మూఢుఁడ! పొ"మ్మని రా దయానిధుల్. 1116

మ. నినుఁ జింతించిన, నిన్నుఁ బేరుకొనినన్, నిర్మూలమై క్రుస్సి పా
పనికాయంబు వినష్ట మౌనఁట? భవత్పాదంబు నామీఁదఁ బె
ట్టినఁ దద్బ్రాహ్మణశాపసంజనిత[2]కౌటిల్యంబు దా నిల్చునే?
వనజాతేక్షణ! నేఁడు వాసె నురగత్వం బెల్ల; నేఁ బోయెదన్." 1117

వ. అని విన్నవించి, హరికిఁ బ్రదక్షిణంబు వచ్చి, మ్రొక్కి, సుదర్శనుండు దివంబునకుం జనియె; సర్పంబువలన నందుండు విముక్తుం డయ్యెఁ; దద్ప్రకారంబు విని వెఱఁగుపడి, గోపకులు దేవతామహోత్సవంబు సమాప్తి నొందించి, కృష్ణకీర్తనంబు సేయుచు మరల మందకుం జని; రంత. 1118

కుబేరభటుం డగు శంఖచూడుం డను గుహ్యకుని సంహరించుట

చ. మఱి యొకనాఁటిరాత్రి బలమాధవు లుజ్జ్వలవస్త్రమాలికా
ధరులును, లేపనాభరణధారులు నై చని, మల్లికాదిపు
ష్పరసనిమగ్నమత్తమధుపంబులగీతము వించుఁ, దద్వనాం
తరమున వెన్నెలన్ వ్రజనితంబిను లుండఁగఁ బాడి రింపుగన్. 1119

క. ఆపాట చెవుల సోఁకిన, నేపాటియు దేహలతల నెఱుఁగక, [3]దృగ్వా
చాపాటవములు చెడి, పడి,-రా పాటలగంధులెల్ల నటవీవీథిన్. 1120

1. రూపముయొక్క గర్వముతో. 2. కుటిలస్వభావము. 3. నేత్రముల యొక్కయు వాక్కుల యొక్కయు దిట్టతనములు.

వ. ఇట్లు సకలభూతసమ్మోహనం బగు గానంబు సేయుచు; నిచ్ఛావర్తనంబులం
బ్రమత్తులచందంబున రామకృష్ణులు క్రీడింపఁ, గుబేరభటుండు శంఖచూడుం
డనువాఁడు, రామకృష్ణరక్షిత లగు గోపికలం దనయోగబలంబున నుత్తరపు
దిక్కునకుం గొనిపోవ, నయ్యోషిజ్జనంబులు రామకృష్ణేతిభాషణంబులం జీరి,
పులికి నగపడిన మొదవులక్రియ మొఱ లిడిన, విని. 1121

ఉ. గ్రద్దన సాలవృక్షములు గైకొని, బల్లిదు లన్నదమ్ము లా
యిద్దఱుఁ గాలమృత్యువులయేపున వే చని, 'యోడకుండుఁ డో
ముద్దియలార,' యంచుఁ దను ముట్టినఁ జూచి కలంగి గుహ్యకుం
డుద్దవడిం దగం బఱచె, నుత్తర మింతుల డించి, భీతుఁడై. 1122

వ. ఇట్లు గుహ్యకునిచేత విడివడిన గోపికల 'రక్షించుకొని యుండు'మని బలభద్రునిఁ
బలికి. 1123

శా. "ఓరీ గుహ్యక! పోకు పోకు"మని, రోషోక్తిన్ బకారాతి వాఁ
డేరూపంబున నెంపఁ జొచ్చెఁ; నెటఁ బోయెం, దోడఁ దా నేఁగి, దు
ర్వారోదంచితముష్టి వానితలఁ ద్రెవ్వం బట్టి, తద్వీరుకో
టీరభ్రాజితరత్నముం గొనియె దండిన్ గోపికల్ సూడఁగన్. 1124

వ. ఇట్లు శంఖచూడునిం జంపి, వానిశిరోరత్నంబు దెచ్చి బలబద్రుని కిచ్చి, మెప్పించె;
మఱియు నొక్కదినంబునం గృష్ణుండు వనంబునకుం జనిన, నతనిలీలలు పాడుచు
నిండ్లకడఁ దద్విరహవేదనానలభరంబు సహింపక, గోపికలు దమలో ని ట్లనిరి.

శా. "భ్రూవిక్షేపముతోడ [1]దాపలిభుజంబుం జెక్కుఁ గీలించి, కె
మ్మోవిన్ వేణువుఁ గూర్చి, సుస్వరముగా మ్రోయించుచు, న్నంగుళీ
ప్రావీణ్యంబు విభుండు సూపఁ గని, సప్రాణేశలై యుండియున్
నీవీబంధము లూడఁ, జొక్కుదురువో నింగిన్ నిలింపాంగనల్. 1126

మ. నవమాధుర్యము గల్గు కృష్ణమురళీనాదామృతస్యందముల్
సెవులం జొచ్చి, హృదంతరాళముల భాసిల్లన్, సవత్సంబులై
యువిదా! మేపులకుం దొఱంగి మృగగోయూథంబు లుత్కంఠతో
దివికిం గంఠము లెత్తి, లో వదలుఁబో, దేహేంద్రియవ్యాప్తులన్. 1127

శా. ఓకంజేక్షణ! కృష్ణుఁ డుజ్జ్వలితహారోద్దాముఁడై, గానవి
ద్యాకౌతూహలితన్ మనోజ్ఞమురళీధ్వానంబు గావింపఁగా,
నాకర్ణించి, సశంపమై మొరయు నీలాభ్రంబుగాఁ జూచుచుం,
గేకారావము లిచ్చుచున్, మురియుఁ బో, [2]కేకీంద్రసంఘాతముల్. 1128

---

1. ఎడమభుజము. 2. నెమిళ్లయొక్కగుంపు.

మ. లలనా! యేటికిఁ దెల్లవాఱె? రవి యేలా తోఁచెఁ బూర్వాద్రిపైఁ?
గలకాలంబు నహంబు గాక, నిసి గాఁ గల్పింపఁ డా బ్రహ్మ; దా
వలతేఁడుం గృపలేఁడు; కీరములు దుర్వారంబు; లెట్లో కదే?
కలదే మాపటివేళయుం? గలుగునే కంజాక్షుసంభోగముల్? 1129

ఉ. ఎప్పుడు ప్రొద్దు గ్రుంకు; హరి యెప్పుడు గోవుల మేపి వచ్చు; నా
కెప్పుడు తన్ముఖాంబుజసమీక్షణ మబ్బు; నతండు వచ్చి న
న్నెప్పుడు గారవించుఁ; దుది యెప్పుడు మద్విరహాగ్ని రాశికిం?
జెప్పఁ గదమ్మ! బోటి! మఱచేఁతల నుల్లము దల్లడిల్లెడిన్. 1130

మ. చెలియా! కృష్ణుఁడు నన్నుఁ బాసి వనముం జేరంగ, నయ్యాక్షణం
బులు నా కన్నియు నుండ నుండఁ గడు [1]నాపూర్ణంబు లై సాఁగి, లో
పలఁ దోఁచుం, [2]బ్రహరంబు లై, దినము లై, పక్షస్వరూపంబు లై,
నెల లై, యబ్దము లై, మహాయుగము లై, నిండారు కల్పంబు లై. 1131

వ. అని మఱియుఁ గృష్ణవిరహదుఃఖంబున బహువిధంబులఁ బశ్చాత్తాపంబు నొందుచు, గోపిక లోపికలు లేక, యెట్టకేలకు దినంబు గడపి, దినాంతసమయంబునందు. 1132

మ. "అదె! భానుం [3]డపరాద్రిఁ జేరె; నిదె సాయంకాల మేతెంచె; న
ల్లదె గోపాదపరాగ మొప్పెసఁగె బృందారణ్యమార్గంబునం;
దిదె వీతెంచె వృషేంద్రఘోషము; ప్రియుం డేతెంచె; రం" డంచుఁ దా
మెదు రేతెంతురు మాపు కృష్ణునికి నయ్యింతుల్ పరిభ్రాంత లై. 1133

వ. ఇట్లు దన కెదురు వచ్చిన, మచ్చిక నచ్చెలువల నచ్యుతుం డిచ్ఛానువర్తనంబుల గారవించె; నంత నొక్కనాఁడు. 1134

## వృషభాసురసంహారము

సీ. ఎవ్వనిమూఁపుర మీక్షించి, మేఘంబు లద్రిశృంగం బని యాశ్రయించు;
నెవ్వనిఱంకె కర్ణేంద్రియంబులు సోఁక, గర్భపాతం బగు గర్భిణులకు;
నెవ్వనిపదహతి నెగయుపరాగంబు, [4]లంధకారారాతి నావరించు;
నెవ్వఁడు గొమ్ముల నెదిరించి చిమ్మునఁ, బృథ్వీధరంబులు వెల్లగిల్లు;

తే. నట్టివృషభాసురేంద్రుఁ డహంకరించి-[5]వాలలత యెత్తి, పెనుఱంకె వైచి, నేలఁ
గాలు ద్రవ్వుచు, నిశితశృంగములుసాఁచి-మందబెగడంగఁ గవిసె నమందగతిని.

వ. ఇట్లు వృషభాకారంబున నరిష్టుఁడు హరికెకి నరిష్టంబు సేయం దలంచి, పైకురికిన.

---

1. మిక్కిలి సంపూర్ణము అయినది. 2. జాము. 3. పడమటికొండ. 4. ఈశ్వరుఁడు.
5. తీగవంటితోఁక.

ఉ. క్రేపులు వాఱె గోవులకుఁ, గ్రేపులు గోవులు గోవృషంబులం
బై పడె; వత్సధేనువృషభంబులు గోపకులందుఁ జొచ్చెఁ; నా
గోపకు లావృషేంద్రములు గోవులు లేఁగలు విచ్చి పాఱఁ గా,
గోపచమూవిభుండు గనె; గోవృషదైత్యుఁడు వెంట నంటఁగన్. 1137

వ. ఇట్లు భయభ్రాంతులై కాంతలుం దారును "కృష్ణ! కృష్ణ! రక్షింపు! రక్షింపు!"
మనియెడు గోపకులకు నడ్డంబు వచ్చి, దీనజనరక్షకుం డైన పుండరీకాక్షుం
డి ట్లనియె. 1138

ఉ. "బాలుర, నింతులం, బసులఁ బాఱఁగఁ దోలుట, బంటుపంతమే ?
చాలు; వృషాసురేంద్ర! బలసంపదఁ జూపఁగ నెల్లబోఁటిగో
పాలురమంద గాదు; చనఁ బై పడితేనిఁ బ్రచండకృష్ణశా
ర్దూలము నేఁడు నీగళముఁ ద్రుంపక చంపక పోవ నిచ్చునే? 1139

ఆ. అనుచు ధిక్కరించి, హస్తతలంబులఁ-జప్పుడించి నగుచుఁ జలము మీఱఁ
బన్నగేంద్రభయదబాహుదండము సాఁచి-దండి మెఱసి, దనుజుదండ నిలిచె.

వ. అప్పుడు. 1141

చ. [1]ఖురముల నేలఁ ద్రవ్వుచు నకుంఠితవాలసమీరణంబులన్
విరవిరఁ బోయి, మేఘములు విచ్చ, [2]విషాణము లొడ్డికొంచు, దు
స్తరతరమూర్తియై వృషభదైత్యుఁడు గన్నుల నిప్పు లుల్కఁగా
దురదుర వచ్చి, తాఁకె రిపుదుర్మదమోచనుఁ బద్మలోచనున్. 1142

ఉ. యాదవకుంజరుండు వృషభాసురకొమ్ములు రెండుఁ బట్టి, య
ష్టాదశపాదమాత్రము గజంబు గజంబును ద్రొబ్బుకై వడిన్,
భేదిల ద్రొబ్బ, నయ్యసుర [3]బిమ్మిటి నొంది, చెమర్చి, మ్రొగ్గి, దు
ర్మాదముతోడ డీకొనెఁ బ్రమత్తవిమర్దను నా జనార్దనున్. 1143

ఆ. అంత గోపసింహుఁ డసురకొమ్ములు పట్టి-ధరణిఁ ద్రొబ్బి, త్రొక్కి, దైత్యభటుల
కొమ్ము వీఁగ, సురలకొమ్ము వర్ధిల, వాని-కొమ్ము వెఱికి, మొత్తి కూల్చె నధిప!

క. ఉక్కసెడి, రోఁజి నెత్తురు-ముక్కున, వాతను, స్రవింప, మూత్రశకృత్తుల్
మిక్కిలి విడుచుచుఁ, బసరపు-రక్కసుఁ డని-సమసెఁ బ్రజకు రాగం బమరన్.

వ. ఇట్లు వృషభాసురుం జంపిన, నిలింపులు గుంపులుగొని, విరులు వర్షింప,
గోపకులు హర్షింప, గోపసతు లుత్కర్షింప, బలభద్రుండును దానును గోవిం
దుండు పరమానందంబున మందకుం జనియె; నంత. 1146

1. గిట్టలు 2. కొమ్ములు. 3. శక్తినశించి.

చ. ఘనుఁ డొకనాఁడు నారదుఁడు గంసునితోడ "యశోద కూఁతుఁ దాఁ
గనుటయుఁ, జక్రి దేవకికి గర్భజుఁ డౌటయు, మున్ను రోహిణీ
తనయుఁడు రాముఁ డౌటయును, దద్విభు లిద్దఱు మంద నున్నవా"
రని యెఱుఁగంగఁ జెప్పిన మహాద్భుత మంచుఁ జలించి కిన్కతోన్. 1147

చ. కొడుకుల మందలోన నిడి, గొంటుతనంబున మోసపుచ్చె; నీ
బుడుగును బట్టి చంపు టిది భావ్య; మటంచుఁ గృపాణపాణియై
వడి వసుదేవునిం దునుమ వచ్చిన కంసునిఁ జూచి, నారదుం
"డుడుగుము; చంపఁ బోల"దని యోడక మానిచి పోయె మింటికిన్. 1148

వ. మఱియు నలుక దీఱక కంసుండు దేవకీవసుదేవుల లోహపాశబద్ధులం జేసి, కేశి
యనువానిం బిలిచి, "రామకేశవులం జంపు"మని పంపి, మంత్రిభటగజారోహక
చాణూరముష్టిక సాల్వకోసలప్రముఖుల రావించి, యి ట్లనియె. 1149

శా. "ఎందుం గా న న్నెదిరించి పోరుటకు దేవేంద్రాదులుం జాల; రీ
బృందారణ్యముమంద నిప్పుడు మదాభీరార్భకుల్, రామగో
విందుల్, వర్ధిలుచున్నవా రఁట! రణోర్విం గంసునిం ద్రుంతు; మం
చున్ దర్పంబులు వల్కుచుందు రఁట! యీ చోద్యంబులన్ వింటిరే? 1150

క. పట్టణజనములు సూతురు-దట్టంబుగ మల్లరంగతలపార్శ్వములం
బెట్టింపుఁడు; తమకంబులు-పెట్టింపుఁడు పీట [1]మల్లుపో రనుమాటన్. 1151

శా. విన్నాణంబులఁ బోర నేర్తురు; మహావీర్యప్రతాపాదిసం
పన్నుల్ మీరలు; మేటిమల్లుగములం బ్రఖ్యాతులై పెంపుతో
మన్నా; రా బలకృష్ణులం బెనఁకువన్ మర్దించి, మత్ప్రీతి [2]కా
సన్నుల్ గండు, పురీజనుల్ వొగడ నో చాణూర! యో ముష్టికా! 1152

శా. రారా! హస్తిపకేంద్ర! గండమదధారాగంధలోభాంధగం
భీరాళివ్రజ మైన మత్కువలయాపీడద్విపేంద్రంబు, [3]మ
ద్ద్వారోదంచిత దేహళీపరిసర స్తంభంబు డాయంగ, నా
భీరుల్ రా నడలించి డీకొలుపు, నీ బీరంబు తోరంబుగన్. 1153

క. [4]పశువిశసనములు సేయుఁడు- పశుపతికిం బ్రియముగాఁగ భావించి, చతు
ర్దశినాఁడు ధనుర్యాగము-విశదంబుగఁ జేయవలయు, విజయముకొఱకున్."

వ. అని తనవారి నందఱ నయ్యైపనులకు నియమించి, యదుశ్రేష్ఠుం డగు
నక్రూరునిం బిలిపించి, చెట్ట వట్టికొని, యి ట్లనియె. 1155

1. మల్లయుద్ధము (కుస్తీ). 2. సమీపమయినవారు. 3. నా వాఁకిలి యందుఁ బ్రకాశించుచున్న గడపదగ్గఱనుండు స్తంభము. 4. పశువధలు.

శా. ''అక్రూరత్వముతోడ నీవు మనఁగా నక్రూరనామంబు ని
ర్వక్రత్వంబునఁ జెల్లె; మైత్రి సలుపన్ వచ్చున్ నినుం జేరి; నీ
వక్రోధుండవు; మందలోన బలకృష్ణాభీరు లస్మద్వినా
శక్రీడారతులై చరింతురఁట! యోజం దెచ్చి యొప్పింపవే! 1156

ఆ. నాకు వెఱచి సురలు, నారాయణుని వేఁడి-కొనిన, నతఁడు వచ్చి గోపకులము
నందుఁ గృష్ణమూర్తి [1]నానకదుందుభి-కుదితుఁ డయ్యె; నసఁగ నొకటి వింటి.

వ. కావున నీవు గోపకులచేత నరులుగాని, ''ధనుర్యాగంబుఁ జూడ రం''డని
వారలం దోడ్కొని రమ్ము; వచ్చిన. 1158

శా. కొండల్ గూలఁగ ద్రొబ్బుకొమ్ములతుదిం; గోపించి కోరాడుచో
దండిన్ దండి నధఃకరించు; నొక వేదండంబు నాయింట బ్ర
హ్మాండం బైనఁ గదల్ప నోపు; బలకృష్ణాభీరులం బోరిలో
ఖండింపం దడ వెంత దాని? కదియుం గాదేని యక్రూరకా! 1159

శా. చాణూరుండును, ముష్టికుండును సభాసంఖ్యాతమల్లుల్; జగ
త్ప్రాణుల్ మెచ్చరు సత్త్వసంపదల; బాహాబాహి సంగ్రామపా
రీణుల్ వారలు! రామకృష్ణులబలోద్రేకంబు సైరింతురే?
క్షీణప్రాణులఁ జేసి చంపుదురుసూ సిద్ధంబు యుద్ధంబునన్! 1160

సీ. ఆ రామకేశవు లంతరించిన, వసుదేవముఖ్యులఁ జంపి, తెగువ మెఱసి,
వృష్ణిభోజదశార్హవీరులఁ దెగటార్చి, ముదుకఁడు రాజ్యకాముకుఁడు ఖలుఁడు
నగు నుగ్రసేను మాయయ్య గీటడఁగించి, పినతండ్రి దేవకుఁ బిలుకుమార్చి,
మఱియు వైరుల నెల్ల మర్దించి, నే జరాసంధ నరక బాణ శంబరాది

ఆ. సఖులతోడ భూమిచక్ర మేలెదఁ; బొమ్ము-తెమ్ము వేగమ వసుదేవసుతుల
మఖముపేరు సెప్పి; మంత్రభేదము సేయ-వలయుఁ; బెంపఁ జనదు వైరిజనుల.''

వ. అనిన నక్రూరుం డి ట్లనియె. 1162

ఉ. ''పంపినఁ బోనివాఁడనె నృపాలక! మానవు లెన్నఁ దమ్ము నూ
హింపరు; దైవయోగముల నించుక గానరు; తోఁచినట్లు ని
ష్కంపగతిం జరిగింతు; రది గా దన వచ్చునె? యీశ్వరేచ్ఛఁ ద
ప్పింపఁగ రాదు; నీపగతుబిడ్డలఁ దెచ్చెదఁ; బోయి వచ్చెదన్.'' 1163

శ్రీకృష్ణుండు కేశివ్యోమాసురుల సంహరించుట

వ. అని పలికి, రథం బెక్కి, యక్రూరుండు సనిన సకలజనులను వీడుకొలిపి,
కంసుం డంతిపురంబునకుం జనియె; నంతఁ గంసప్రేరితుం డై. 1164

1. వసుదేవుఁడు.

సీ. ఖురపుటాహతిఁ దూలి, కుంభినీచక్రంబు [1]ఫణిరాజఫణములకు బరువు సేయ,
భీషణహేషావిభీషితులై, మింట నమృతాంధు లొండొరు నండఁ గోరఁగ,
జటులచంచలసటాచ్ఛటలగాడ్పులమేఘములువిమానములపై ముసుఁగుపడఁగ,
వివృతాస్యగహ్వరవిపులదంతంబులు ప్రళయాగ్నికీలల పగిది మెఱయఁ
ఆ. గాలపాశలీల గావాల మేపార-వాహ మగుచు, గంధవాహగతుల
విజితశక్రపాశి వీర్యపయోరాశి-కేశి వచ్చె నంద క్లేశ మంద. 1165

క. భీషణఘోటక దానవ-హేషానిర్ఘోషభిన్నహృదయనిఖిలగో
యోషాపురుషార్భక మై-ఘోషము హరి సూడ దైన్యఘోషం బయ్యెన్.

వ. అయ్యవసరంబున. 1167

ఉ. పేదల ఘోషగోపకుల బిట్టదలించుట వీరధర్మమా?
కాదు; "వ్రజంబులో దనుజఘస్మరుఁ డేఁ?" డని తన్ను రోయు క్ర
వ్యాదునిఁ జూచి, గోపకుల కడ్డము వచ్చి, "నిశాట! యింకఁ బో
రా;" దని శౌరి సీరె; మృగరాజుక్రియ న్నదిరించె దైత్యుఁడున్. 1168

ఆ. నిష్ఠురోగ్రసింహనినదంబుతో నింగి-మ్రింగుభంగి, నోరు మిగులఁ దెఱచి,
కఱవ రాఁగ, నతఁడు గాటు దప్పించినఁ-దన్నె నెగసి [2]తురగదానవుండు.

ఉ. తన్నినతన్నునం బడక, దానవహంత సమీకరంత యై
కన్నులఁ గెంపుపెంపెనయ గ్రక్కున ఘోటనిశాటుపాదముల్
వన్నె సెడంగఁ బట్టి, వడి వైచె ధనుశ్శతమాత్రదూరమున్,
[3]బన్నగడింభమున్ విసరి పాఱఁగ వైచు ఖగేంద్రుకైవడిన్. 1170

ఉ. వైచిన మ్రొగ్గి లేచి, వెస వాజినిశాటుఁడు హుంకరించి, సం
కోచము లేక పైపడిన, గోపకులేంద్రుఁడు దిగ్గజేంద్రశుం
డాచటులప్రభావబలవిడంబక మైన భుజార్గళంబు దో
షాచరునోటిలో నిడియెఁ జండఫణిన్ గుహ నుంచుకైవడిన్. 1171

శా. దంభోళిప్రతిమానకర్కశమహోద్యద్వామదోఃస్తంభమున్
శుంభల్లీల నఘారి వానిరదముల్ చూర్ణంబులై రాలఁగా,
గంభీరంబుగఁ గుక్షిలోఁ జొనిపి, వీఁకన్ వృద్ధిఁ బొందించుచున్
[4]గుంభించెం, బవనంబు పిక్కటిలఁ దత్కుక్షిన్ నరేంద్రోత్తమా! 1172

క. వాయువు వెడలక నిలిచినఁ-గాయంబు సెమర్పఁ, గన్నుఁగవ వెలి కుఱుకన్
మాయ సెడి తన్నుకొనుచును-గూయుచు, నశ్వాసురుండు గూలెన్ నేలన్.

---

1. ఆదిశేషుని పడగలకు. 2. గుఱ్ఱమువలెనుండు రాక్షసుఁడు. 3. పాముపిల్ల. 4. నిండించెను, బిగియఁబట్టెను.

ఆ. ఘోటకాసురేంద్రుకుక్షిలోఁ గృష్ణుని-బాహు వధిక మైనఁ, బట్టలేమిఁ
బగిలి దోసపండుపగిదిఁ, దద్దేహంబు-వసుమతీశ! రెండువ్రయ్య లయ్యె. 1174

క. నలినాక్షుఁడు లీలాగతి-విలయముఁ బొందించె; నిట్లు వీరావేశిం
బలలాశిన్, జగదభినవ-బలరాశిన్, [1]విజితశక్రపాశిం, గేశిన్. 1175

వ. ఆ సమయంబునఁ బుష్పవర్షంబులు గురియించి సురలు వినుతించి; రంత హరి
భక్తివిశారదుం డైన నారదుండు వచ్చి, గోవిందుని సందర్శించి, రహస్యంబున
నిట్లనియె. 1176

సీ. "జగదీశ! యోగీశ! సర్వభూతాధార! సకలసంపూర్ణ! యీశ్వర! మహాత్మ!
కాష్ఠగతజ్యోతికైవడి నిఖిలభూతములందు నొకఁడ వై తనరు దీవు;
సద్గూఢుఁడవు; గుహాశయుఁడవు; సాక్షివి; నీయంతవాఁడ వై నీవు మాయఁ
గూడి కల్పింతువు; గుణముల వానిచేఁ బుట్టించి, రక్షించి, పొలియఁజేయు;

ఆ. దీ ప్రపంచ మెల్ల; నిట్టినీ విప్పుడు-రాజమూర్తు లయిన రాక్షసులను
సంహరించి, భూమిచక్రంబు రక్షింప-నవతరించినాఁడ వయ్య! కృష్ణ! 1177

వ. దేవా! నీచేత నింకఁ జాణూర, ముష్టిక, గజ, కంస, శంఖ, యవన, ముర,
నరక, పౌండ్రక, శిశుపాల, దంతవక్త్ర, సాల్వప్రముఖులు మడిసెదరు; పారి
జాతం బపహృతం బయ్యెడిని; నృగుండు శాపవిముక్తుం డగు; శ్యమంతకమణి
సంగ్రహం బగు; మృత బ్రాహ్మణపుత్రప్రదానంబు సిద్ధించు; నర్జునసారథి వై
యనేకాక్షౌహిణీబలంబుల వధియించెదవు; మఱియును. 1178

శా. కృష్ణా! నీ వొనరించు కార్యములు లెక్కింపన్ సమర్థుండె వ
ర్ధిష్ణుం డైన విధాత? మూఁడు గుణముల్ దీపించు, లోపించు, రో
చిష్ణుత్వంబున నుండు నీవలన; [2]నిస్సీమంబు నీరూపు; నిన్
విష్ణున్, జిష్ణు, సహిష్ణు, నీశు, నమితున్, విశ్వేశ్వరున్ మ్రొక్కెదన్." 1179

వ. అని వినుతించి, వీడుకొని, నారదుం డరిగె; నంత నొక్కనాఁడు కృష్ణసహితు
లయి గోపకుమారు లడవికిం జని, పసుల మేపుచు, నొక్కకొండదండ నిలా
యనక్రీడ సేసి; రందు. 1180

క. కొందఱు గొఱియల మంచును-గొందఱు పాలకుల మంచుఁ, గుటిలత్వమునం
గొందఱు దొంగల మనుచును-జెంది, కుమారకులు గ్రీడసేసిరి తమలోన్.

శా. ఆలో, దొంగలలో, మయాసురసుతుం డాద్యుండు వ్యోముండు, గో
పాలుం డై చని, మేషకల్పనలతో భాసిల్లి, క్రీడించు త

1. ఇంద్రుని పాశమును గెలిచినవాఁడు, ఇంద్రుని వరుణుని గెలిచినవాఁడు. 2. హద్దులేనిది.

ద్బాలవ్రాతము నెల్ల మెల్లన [1]చతుఃపంచావశిష్టంబుగా
శైలాంతర్గుహలోనికిం గొని, చనెం జౌర్యం బవార్యంబుగన్. 1182

వ. ఇట్లు కొండగుహలోనఁ గ్రమక్రమంబున గోపకుమారుల నిడి, యొక్కరుండును జాతఁ దద్ద్వారంబు గప్పి యెప్పటియట్ల వచ్చిన. 1183

ఉ. వీరుఁడు, మాధవుం, డఖిలవేది, నిశాచరభేది నవ్వుతో
'నార! నిశాట! దొంగతన మచ్చుపడెన్; [2]నెఱదొంగ వౌదు; వా
భీరుల నెల్ల శైలగుహఁ బెట్టితి; చిక్కినవారిఁ బెట్ట రా!
రార!' యటంచుఁ బట్టె మృగరాజు వృకాఖ్యముఁ బట్టుకైవడిన్. 1184

ఉ. పంకజలోచనుం డొడిసి పట్టిన, శైలనిభాసురాకృతిన్
బింకముతోడఁ బొంగి, విడిపించుకొనంగ బలంబు లేమి, లో
శంకిలి, బిట్టు తన్నుకొనఁ, జక్కన యా రణభీము వ్యోమునిం
గొంకక కూల్చె నవ్విభుఁడు "గో!" యని మింట సుపర్వు లార్వఁగన్.

ఆ. ఘోరదనుజు నేలఁ గూల్చి, పర్వతగుహ-వాత నున్న ఱాయి వ్రయ్యఁ దన్ని,
గుహఁ జరించుచున్న గోపాలకులఁ గొంచు-బల్లిదుండు గొల్లపల్లె కరిగె. 1186

వ. అంత నా రాత్రి మధురానగరంబున నక్రూరుండు వసియించి, మఱునాఁడు [3]రేపకడ లేచి, నిత్యకృత్యంబు లాచరించి, రథం బెక్కి కదలి, నందగోప కులంబునకుం బోవుచుం దెరువునఁ దనలో నిట్లనియె. 1187

కంసునిపంపున నక్రూరుండు బృందావనంబునకుఁ బనుదెంచుట

ఉ. "ఎట్టితపంబు సేయఁబడె? నెట్టిచరిత్రము లబ్ధ మయ్యెనో?
యెట్టిధనంబు లర్హులకు నీఁబడెనో [4]తొలిబాముసందు? నా
యట్టి వివేకహీనునకు నాదిమునీంద్రులు యోగదృష్టులం
బట్టఁగ లేని యీశ్వరుని, బ్రహ్మమయున్, హరిఁ జూడఁ గల్గెడిన్. 1188

ఉ. సూరులు దొల్లి యేవిభునిశోభితపాదనఖప్రభావళిం
జేరి, భవాంధకారములఁ జిక్కక దాఁటుదు; రట్టిదేవునిన్
వైరముతోడ నైనఁ బిలువన్ ననుఁ బంచి, శుభంబు సేసె; ని
ష్కారణమైన ప్రేమ నిదె; కంసునిఁ బోలు సఖుండు గల్గునే? 1189

మ. 'ఇతఁ డా కంసునిచేతఁ బంపువడి, నన్ హింసింప నేతెంచినాఁ;
డతిదుష్టుం'' డని చూచునో? సకలభూతాంతర్బహిర్మధ్యసం

---

1. నలుగురైదుగురు మిగులునట్లు. 2. దొంగలలో నేర్పుగలవాఁడు. 3. ఉదయము.
4. పూర్వజన్మము.

గతుఁ జేటం దలపోసి, నన్ను సుజనుంగాఁ జూచునో? యెట్టి యు
న్నతిఁ గావించునో? యేక్రియం బలుకునో? నాభాగ్య మెట్లున్నదో?’’ 1190

వ. అని మఱియును. 1191

మ. ‘‘అలకభ్రాజితమై, సుధాంశునిభమై, [1]హాసప్రభోద్దామమై,
జలజాభం బయి, కర్ణకుండలవిరాజద్గండమై, యున్నయా
జలజాతాక్షుముఖంబు సూడఁ గలుగున్ సత్యంబు వో నాకు; నా
వలదిక్కేఁగుచు నున్న యీ వనమృగవ్రాతంబు లీ త్రోవలన్. 1192

ఉ. మాపటివేళ నేను జని, మాధవుపాదసమీపమందు దం
డాపతితుండనైన, నతఁ [2]డాశుగకాలభుజంగవేగ సం
తాపితభక్తలోకభయదారణమైన కరాబ్జ మాఁదలన్
మోపి, హసించి, నా కభయముం గృపతోడుత నీయకుండునే!’’ 1193

వ. అని మఱియు నక్రూరుం డనేకవిధంబుల గోవిందసందర్శనంబు గోరుచు నమంద
గమనంబున సుందరస్యందనారూఢుండై, చని చని. 1194

క. ముందటఁ గనె ఘనచందన,-కుంద [3]కుటజ తాలసాల [4]కురవక వట మా
కందన్, నందితబలగో, విందన్,-వికచారుణారవిందన్, బృందన్. 1195

వ. కని బృందావనంబు దఱియం జొచ్చి, యందు సాయంకాలంబున నడవికి నెఱి
గల మేఁతలవెంబడిం దిగంబడి రాక చిక్కిన కుఱ్ఱగోడె పడ్డతండంబులం
గానక, పొదయిఱుము మిఱ్ఱు పల్లం బనక తూఱి, పాఱి వెదకి కానక, చీరెడు
గోపకుల యాహ్వానశబ్దంబు లాకర్ణించుచుఁ, గోమలఘాసఖాదనకుతూహలం
బులం జిక్కి, మక్కువం గ్రేపులం దలంచి, తలారింపక తమకంబులం దమ తమ
యంత నంభారవంబులు సేయుచు నూధంబులు స్రవింపఁ బరువులిడు ధేనువులును;
ధేనువులకు నోసరించుచు సద్యోజాతంబు లగు తర్ణకంబుల వహించి, నవసూతి
కలు వెనుతగులుటవలన దామహస్తులై చను [5]వల్లవుల మెల్లన విలోకించుచు,
మంద యిరుగెలంకులం గలంకరహితులై, పులి చివంగి వేఁగి లోనగు వాలు
మెకంబుల మొత్తంబులవలన నప్రమత్తులయి, కుఠారకుంతశరాసనప్రముఖా
యుధంబులు ధరియించి, కావలి తిరుగువ్రేలం గడచి, నానావిధసరసతృణకబళ
ఖాదనగరిష్ఠలై గోష్ఠంబులు ప్రవేశించి, రోమంథలీలాలసలై యున్న ధేనువులును;
జన్నులు గుడిచి తల్లుల మ్రోలఁ బెల్లు రేఁగి, క్రేళ్లుఱుకు లేఁగలును, వెదలైన
మొదవులం బైకొని, పరస్పరవిరుద్ధంబులై ఢీకొని, కొమ్ములయుద్ధంబులు సలుపు
వృషభంబులును; నకుంఠితబలంబులం గంఠరజ్జువులం ద్రెంచుకొని, పొద లుఱికి

---

1. చిఱునవ్వుయొక్క కాంతిచే నధికమయినదై. 2. బాణము. 3. గిరిమల్లిక. 4. గోరింట.
5. గొల్లలు.

దాఁటి, తల్లులం దాఁటి కుడుచు తఱపిదూడల కట్టించి, పట్టనోపక గ్రద్దనం బెద్దలం జీరు గోపకుమారులను; గోడుకుల మగల మామల మఱందుల వంచించి, పంచాయుధభల్లభగ్నహృదయులై గృహకృత్యంబులు మఱచి, కంకేలిక సంకేతస్థంబులం గృష్ణాగమతత్పరలై యున్నగోపకామినులును; గోష్ఠప్రదేశం బుల గోవ్రులకుఁ గ్రేపుల విడిచి యొడ్డుచు, మరలం గట్టుచు నీడ్చుచుం, గ్రీడించు గోపకులును; గోఖురసముద్ధూత[1]కరీషపరాగపటలంబులవలన నుల్లాసి, దులదుల నైన ధేనుదోహనవేళావికీర్ణపయోబిందుసందోహ పరంపరాసంపాదిత పంకం బులును; దోహనసమయగోపకరాకృష్టగోస్తననిర్గతంబు లయి, కలశంబు లందుఁ బడియెడు క్షీరధారలచప్పుళ్లును; మహోత్సుకంఠసమ్మార్జనస్నిగ్ధంబు లైన మందిరద్వారదారుస్తంభంబుల పొంతల నుండి, యులికిపడి నలుదిక్కులు గనుంగొని, నూతన జనవిలోకన కుపితంబులై, కరాళించు సారమేయంబులుం గలిగి, బలకృష్ణబాహుదండప్రాకారరక్షావిశేషభూషం బైన ఘోషంబుఁ బ్రవేశించి, యందు. 1196

క. జలజాంకుశాదిరేఖలు,-గల హరిపాదములచొప్పుఁ గని, మోదముతోఁ బులకించి, రథము డిగి,యు-త్కలికన్ సంతోషబాష్పకలితాక్షుండై. 1197

మ. కనె నక్రూరుఁడు పద్మనేత్రులను, [2]రంగద్గాత్రులన్, ధేనుదో హనవాటీగతుల, న్నలంకృతుల, నుద్యద్భాసులం, బీతనీ లనవీనోజ్జ్వలవాసులం, గుసుమమాలాధారులన్, ధీరులన్, వనితాకాములఁ, గృష్ణరాముల, జగద్వంద్యక్రమోద్దాములన్. 1198

క. కని వారలపాదములకు-వినయంబున మ్రొక్కె భక్తివివశుం డగుచుం, దనువునఁ బులకాంకురములు-మొనయఁగ నానందబాష్పములు జడిగురియన్.

వ. తదనంతరంబ. 1200

క. అక్రూరు లైనజనుల [3]న,-వక్రగతిం గాచు భక్తవత్సలుఁ డంత న్నక్రూరుఁ గౌఁగిలించెను,-జక్రాంకితహస్తతలముఁ జాఁచి నరేంద్రా! 1201

వ. మఱియు నక్రూరుండు బలభద్రునికిం బ్రణతుండైన, నతండు గౌఁగిలించి, చెట్టపట్టుకొని, కృష్ణసహితుండై గృహంబునకుం గొనిపోయి, మే లడిగి, [4]గద్దియయిడి, పాదప్రక్షాళనంబు సేసి, మధుపర్కంబు సమర్పించి, గోవునిచ్చి, యాదరంబున రసవదన్నంబు పెట్టించి, తాంబూలగంధమాల్యంబు లొసంగె; నయ్యవసరంబున నందుం డుపవిష్టుం డైన యక్రూరుని సత్కరించి, యిట్లనియె.

క. "చెలియలు మొఱ యిడ,నల్లుర,-ఖలుఁడై పొరిగొనినయట్టికంసుఁడు బ్రదుకం గలదే మనికి దశార్హుల, కిలపై ? మీసేమ మింక నే మని యడుగన్?" 1203

1. ఎండిన పేడ. 2. ప్రకాశించుశరీరముగలవారు. 3. చక్కనిమార్గముతో. 4. ఆసనమునుంచి.

వ. అని పలికె; నంత నక్రూరుం డొకపర్యంకంబున సుఖోపవిష్టుం డై యుండ హరి యిట్లనియె. 1204

మ. "శుభమే నీకుఁ? బ్రమోదమే సఖులకుం? జుట్టాలకున్ సేమమే?
యభయంబే ప్రజ కెల్ల? [1]గోత్రజుల కాత్మానందమే? మామ ము
క్తభయుండే? వసుదేవదేవకులు తత్కారాగృహంబందు మ
త్ప్రభవవ్యాజనిబద్ధు లై బ్రతికిరే ప్రాణానిలోపేతు లై? 1205

మ. నెఱి నేఁ డిక్కడ నీవు రాఁగ, వగతో నీతోడ నే మైన నా
కెఱుఁగం జెప్పుమటంచుఁ జెప్పరు గదా? యే మందు? రావార్త యే
తెఱఁగున్ లేదని డస్సిరో? వలచిరో? దీనత్వముం జెందిరో?
వెఱతో నా తలిదండ్రు లెట్లు వడిరో? విన్పింపు మక్రూరకా! 1206

వ. మఱియు నీ వేమికారణంబున వచ్చి?" తని హరి యడిగిన, నతండు కంసునికి నారదుండు వచ్చి, చెప్పిన వైరానుబంధప్రకారంబును, గంసుండు దేవకీవసుదేవుల వధియింపఁ గమకించి మానిన తెఱంగును, ధనుర్యాగంబు పేరు సెప్పి పుత్తెంచిన ప్రకారంబును నెఱింగించిన, రామకృష్ణులు నగిరి; తమ్ముం బరివేష్టించిన నందాది గోపకులం జూచి, కృష్ణుం డి ట్లనియె. 1207

శా. "భూనాథుండు మఖంబుఁ జూడఁ బిలువం బుత్తెంచినాఁ; డవ్విభుం
గానం బోవలెఁ; బాలునెయ్యి పెరుఁగుల్ గట్నంబులుం గానికల్
మీనే ర్పొప్పఁగఁ గూడఁబెట్టుఁడు తగన్; మీమీనివాసంబులన్
యానంబుల్ గొని రండు; పోండు మధురాయాత్రాభిముఖ్యంబుగన్." 1208

వ. అని నియమించె; నంత నక్రూరుండు మధురకు హరిం గొనిపోయెడినని యెఱింగి వ్రేతలు గలంగి. 1209

మ. "హరినవ్వుల్, హరిమాటలున్, హరిమనోజ్ఞాలాపముల్, లీలలున్,
హరివేడ్కల్, హరిమన్ననల్, హరికరాబ్జాలంబనాహ్వానముల్,
హరిణీలోచన లందఱున్ మఱి యుపాయం బెట్లొకో?" *యంచు లో
నెరియన్ ముచ్చట లాడి, రంత గము లై యేకాంతగేహంబులన్." 1210

వ. మఱియుఁ దమలో ని ట్లనిరి. 1211

ఉ. "మేటిగృహస్థు బ్రహ్మ యని, మిక్కిలి నమ్మితి మమ్మ! చూడ నే
పాటియు లేదు; మాకుఁ బరిపాలకుఁ డైన సరోజనేత్రు ని

---

1. వంశమునఁబుట్టినవారు. *ఇది పూర్వముద్రణపాఠము. 'దలఁచి పాయంబెట్టునో' అని యొక తర్వాతి ముద్రణము. మఱొక్కటి 'మఱియుపాయంబెట్లొకో' యని అనన్వితమైన దలఁచు పాఠాంతరము, పాఠమందు గ్రహించినది.

చ్చోట వసింప నీక, యొకచోటికిఁ బో విధియించి, [1]పిన్నబి
డ్డాటలు చేసె; నీడుడుకు లక్కట! భారతి కైనఁ జెప్పరే!'' 1212

వ. అని విధిం దూఱుచు, మదనతాపాయత్తచిత్తలై. 1213

ఉ. ''రమ్మని చీరినంతన పురంబున కేఁగెడుఁ; గాని, నన్ను నీ
కొమ్మలు నమ్మినారు; మదకోలల కగ్గము సేసి పోవఁ గా
ముమ్మర మైన తాపమున మ్రగ్గుదుమో!'' యనఁ డంబుజాక్షుఁ; డా
యమ్మలు గోపవృద్ధులుఁ బ్రయాణము వల్దన రైరి; చెల్లరే! 1214

శా. అక్రూరుం డని పేరు పెట్టుకొని, నేఁ డస్మన్మనోవల్లభుం
జక్రిన్ మాకడఁ బాపికొంచు నరుగం జర్చించి, యేతెంచినాఁ;
డక్రూరుం డఁట! క్రూరుఁ డీతఁడు; నిజం బక్రూరుఁ డౌనేని, ని
ర్వక్రత్వంబునఁ గృష్ణుఁ బెట్టి, తనక్రోవం బో విచారింపఁడే? 1215

ఉ. ఫుల్లసరోజలోచనలు, పూర్ణసుధాంశుముఖుల్, పురాంగనల్
మెల్లనె మెల్లి పట్టణముమేడలనుండి, సువర్ణలాజముల్
సల్లగ వారిఁ జూచి, హరి సంగతి సేయఁ దలంచుఁ గాక! వ్రే
పల్లె వసించు ముద్దియలపైఁ బడ నేల తలంచు? నక్కటా! 1216

క. పురసతులవిలోకనములు—సరసాలాపములు, నర్మసంభోగములున్,
మరగి, హరి మనల నొల్లఁడు—నరవరు లోయమ్మ! నూతనప్రియులు గదే? 1217

క. పుట్టిన్నాఁడు హరి నెఱుఁగని—పట్టణసుందరుల కితనిఁ బతిఁ జేసి, కడున్
దట్టపువిరహాగ్నులకును—గట్టిడి దైవంబు ఘోషకాంతల వెదకెన్. 1218

మ. 'హరి నేలా కొనిపోయె?' దంచు మన మా యక్రూరుఁ బ్రార్థింతమా?
'హరిఁ బో నీకుఁడు; నిల్పరే!' యనుచు నేఁ డర్చింతమా వేల్పులన్?
హరిపాదంబుల కడ్డముల్ పడుదమా? హా దైవమా!'' యంచు నా
తరుణుల్ మేనులుఁ జీరలున్ మఱచి, కందర్పజ్వరభ్రాంతలై. 1219

మ. ఉవిదల్ సిగ్గులు మాని, కన్నవల నీరొండొండ వర్షింపఁగా,
వివశత్వంబులతోఁ గపోలతటసంవిన్యస్తహస్తాబ్జలై,
[2]పవనోద్ధూతలతాభలై, ''మముఁ గృపం బాలింపు; గోవింద! మా
ధవ! దామోదర!'' యంచు నేడ్చిరి సుజాతం బైన గీతంబులన్. 1220

వ. అంత మఱునాఁడు సూర్యోదయకాలంబునం గృష్ణుండు దనతోడఁ బయనం
బునకు గమకించి, నడుచుగోపికలను 'మరలి వత్తు', నని దూతికాముఖంబున
నివర్తించి, శకటంబులందుఁ గానికలు, [3]గోరసంబు నిడికొని, నందాదు లయిన

1. బాల్యక్రీడలు. 2. గాలిచేఁ గదలింపఁబడిన తీగెలవంటివారయి. 3. పాలు, పెరుగు, మజ్జిగ మొదలగునవి.

గోపకులు వెనుతగుల నక్రూరచోదితం బయిన రథం బెక్కి, మధురాభిముఖుం డై చను సమయంబున. 1221

చ. "అదె! చనుచున్నవాఁడు ప్రియుఁ; డల్లదె తేఁ; డదె వైజయంతి; య
ల్లదె! రథఘోటకాంఘ్రి[1]రజ "మాదెస మార్గము చూడుఁ" డంచు లో
నాడవెడి మక్కువన్ హరిరథోన్ముఖ లై, గములై, వ్రజాంగనల్
గదలక నిల్చి, చూచి రటు గన్నుల కబ్బినయంతదూరమున్. 1222

వ. ఇట్లు బలభద్రాక్రూరసహితుం డై చని. 1223

క. అవలోకించెను గృష్ణుఁడు- బ్రవిమలకల్లోలపవనభాసితజన్య
స్నవసన్నపాపసైన్యం-గవిజనమాన్యం, [2]గళిందకన్యన్, ధన్యన్. 1224

వ. కని, తత్కాళిందియందుఁ బరిశుద్ధమణిగణసముజ్జ్వలంబు లగు జలంబులు
ద్రావి, తరుసమూహసమీపంబున రామసహితుం డై కృష్ణుండు రథంబు
ప్రవేశించె; నంత నక్రూరుండు వారలకు మ్రొక్కి, వీడ్కొని, కాళిందీహ్రద
యంబు సొచ్చి, విధిపూర్వకంబుగ వేదమంత్రంబుల జపించుచు. 1225

అక్రూరుండు యమునన్ రామకృష్ణుల దర్శించి నుతించుట

ఉ. స్నానము సేసి చేసి, నదిచల్లనినీరను రామకృష్ణులన్
మానుగఁ జూచి, 'వీరు రథమధ్యమునన్ వసియించి యున్నవా;
రీనదినీరిలోపలికి నెప్పుడు వచ్చి?' ర టంచు లేచి, మే
ధానిధి సూచె, వారిని రథస్థుల భక్తమనోరథస్థులన్. 1226

వ. చూచి వెఱఁగుపడి. 1227

శా. కంటిన్ మున్ను రథంబుపై; జలములోఁ గంటిన్; దుదిం గ్రమ్మఱం
గంటిం; దొంటిరథంబుమీఁద; నిదె యీకల్యాణచారిత్రు లే
వెంటం దోఁచిరి రెండుదిక్కుల? మనోవిభ్రాంతియో? నీరిలో
నం టాశ్చర్యము; చూతు" నంచు మఱియు న్స్నాహించి మగ్నాంగుఁ డై.

ఉ. పోషితబాంధవుండు, యదుపుంగవుఁ డా జలమందుఁ గాంచె స
ద్భాషు, సహస్రమస్తకవిభాసితభూషు, నహీశు, భూమిభృ
ద్వేషుఁ, గృపాభిలాషుఁ, బ్రతివీరచమూవిజిగీషు, నిత్యసం
తోషు, నరోషు, నిర్దళితదోషు, ననేకవిశేషు, శేషునిన్. 1229

వ. మఱియు నీలాంబరసంయుతుండును, సిద్ధోరగాదిసన్నుతుండు నై యొప్పు
నప్పాఁపఱేనిం దప్పక కనుంగొని. 1230

1. దుమ్ము. 2. యమునానది.

సీ. ఆభోగిభోగ[1]పర్యంకమధ్యంబున వలనొప్ప పచ్చనివలువవాని,
మేఘంబుపై నున్న మెఱుఁగుచందంబున నురమున శ్రీదేవి యొప్పువాని,
ముసరు తేఁటులు విప్పు ముఖచతుష్కము గల తనయుఁ జాఁజెడి[2]బొడ్డుఁదమ్మివానిఁ,
గదలినబహుపదక్రమవిశేషంబుల రవము సూపెడి నూపురములవాని,

ఆ. జలజగర్భరుద్రసనకసనందన-సద్ద్విజామర[3]ప్రశస్యమాన
చరితుఁ డైనవాని, సౌందర్యఖని యైన-వాని, నొక్కపురుషవర్యుఁ గాంచె.

వ. మఱియును జారులక్షణలక్షితనఖపాదగుల్ఫజానుజంఘోరు కటినాభిమధ్యోదరుం
డును సాదరుండును, శ్రీవత్సకౌస్తుభవనమాలికావిరాజితవిశాలవక్షుండును
బుండరీకాక్షుండును, శంఖచక్రగదాపద్మహస్తుండును సత్త్వగుణప్రశస్తుం
డును, బ్రహ్మసూత్రహారకేయూరకటకకంకణకుండల కిరీటాదివిభూషణుండును
భక్తజనపోషణుండును, సుందరకపోలఫాలనాసాధరవదనకర్ణుండును నీలనీరద
వర్ణుండును, కంబుకంధరుండును కరుణాగుణబంధురుండును, బ్రహ్మాదనారద
సునందనందప్రముఖసంభావితుండును, శ్రీపుష్టితుష్టికీర్తికాంతీలోర్జావిద్యా
విద్యాశక్తిమాయాదిసేవితుండు నై యొప్పు నప్పరమేశ్వరునకు మ్రొక్కి,
భక్తిసంభ్రమంబు[4]లగ్గలంబులుగ గద్గదకంఠుం డై, దిగ్గనం గరంబులు ముకు
ళించి యిట్లని వినుతించె. 1232

దండ. శ్రీమానినీమానచోరా! శుభాకార! వీరా! జగద్ధేతుహేతుప్రకారా!
సమస్తంబు నస్తంగతంబై, మహాలోలకల్లోలమాలాకులాభీలపాథోనిధిం
గూలఁగా, బాలకేళీగతిం దేలి, నారాయణాఖ్యం బటుఖ్యాతిశోభిల్లునీనాభికం
జంబులో లోకపుంజంబులం బన్ను విన్నాణియై మన్న యాబమ్మ యుత్పన్నుఁ
డయ్యెంగదా! పావకాకాశవాతావనీవార్యహంకారమాయామహామానసాదుల్
హృషీకాదులున్, లోకముల్, లోకబీజంబులున్, నిత్యసందోహమై నీమహా
దేహమం దుల్లసించున్, వసించున్, నశించున్, జడత్వంబు లేకాత్మయై
యొప్పు నీయొప్పిదం బెల్ల నోచెల్ల! చెల్లన్ విచారింపఁ దా రెంతవా? రెంత
వారైన మాయాదు, లామాయతోఁ గూడు, క్రీడించు, లోకానుసంధాత
యాధాత నిర్ణేత యే, నీకళారాశికిం, గొంద ఱంభోజగర్భాను లధ్యాత్మలందు,
న్నశేషాధిభూతంబులందు, న్ననేకాధిదైవంబులందున్, సదా సాక్షి వై
యుందు, వంచుం దదంతర్గతజ్యోతి, వీశుండ వంచుం, త్రయీపద్ధతిం గొంద
ఱింద్రాదిదేవాభిధానంబులన్, నిన్నుఁ జొక్కుండవంచున్ మఱింగొంద ఱాయాధ్వ
కర్మంబులం ద్రుంచి, సంసారముం ద్రెంచి, సన్న్యస్తులై మించి, విజ్ఞాన
చక్షుండ వంచున్, మఱిం బాంచరాత్రానుసారంబుగాఁ ద్వన్మయత్వంబుతోఁ

1. పడక, శయ్య. 2. నాభికమలము. 3. పొగడఁదగిన. 4. అధికము.

గొండఱు శ్రీవత్సాంకుఁడ వంచును, మఱికొంద ఱావాసుదేవాదిభేదంబుల నలువురై చెలువొందువాఁడ వంచును, మఱియు నీవు నారాయణాఖ్యుండ వంచును, శివాఖ్యుండ వంచును, మఱియుఁ బెక్కుమార్గంబుల నిన్ను [1]నగ్గింతు; రె ట్లెమి? యేఱుల్ పయోరాశినే, రాసు లై కూడు క్రీడన్ విశేషంబు లై యుండి, నీయంద సమానంబు లీనంబులగు; నేకరాకేందుబింబంబు కుంభాంతరంభంబులం బింబితంబైన వేఱున్నదే! యన్న నేలా? ఘటాంతర్గతాకాశముల్ దద్ఘటాంతంబులం దేక మహాశేఖ, లోకావధిన్ వీఁక నేపోకలం బోక, యేకాకి వై యుండు దీశా! కృశానుండు నెమ్మోము, సోముండు భానుండుఁ గన్నుల్, దిశల్ గర్ణముల్, భూమి పాదంబు, లంభోనిధుల్ గుక్షి, శల్యంబు లద్రుల్, లతాసాలముల్ రోమముల్, గాలి ప్రాణంబు, బాహుల్ సురేంద్రుల్, ఘనంబుల్ గచంబుల్, నభోవీథి నాభి ప్రదేశంబు, రేలుం బగళ్లున్ నిమేషంబు, లంభోజగర్భుండు గుహ్యంబు, వర్షంబు వీర్యంబు, నాకంబు మూర్ధంబు గా, నేక మై యున్న నీమేనిదండం బయోజాతగర్భాండముల్, మండితోదుంబరానోకహానేకశాఖాఫలాపూరితానంత జంతుప్రకాండంబులీలం, బ్రసిద్ధోద[2]రాశిస్థజంతుప్రకారంబుగా నిండి యుండున్, మహారూప! నీరూపముల్ వెగ్గలం బగ్గడింపన్, లయాంభోధిలో మీనుమేనన్ విరోధిన్ నిరోధించి, సాధించి, మున్ వేధకున్ వేదరాశిం బ్రసాదింపవే? త్రుంపవే కైటభశ్రీమధుం? జక్రి వై మొత్తవే? యెత్తవే మందరాగంబు? రాగంబుతోఁ గూర్మలీలాపరిష్పందివై మేదినిన్ మీఁదికిం ద్రోచి, దోషాచరుం గొమ్ములన్ నెమ్ములం జిమ్ముచున్, గ్రువ్వవే? త్రవ్వవే ఘోరవైరిన్ నృసింహుండవై? దండి వై దండి వైరోచనిం జూచి యాచింపవే? పెంపవే మేను బ్రహ్మాండమున్నిండఁ? [3]బాఱుండ వై రాజకోటిన్ విపాటింపవే? రాజవై రాజబింబాస్యకై దుర్మదారిన్ విదారింపవే? నొంపవే క్రూరులన్ వాసుదేవాదిరూపంబులన్? శుద్ధబుద్ధుండ వై వైరిదారాంతరంగంబుల న్నంతరంగంబులుంగా గరంగింపవే? పెంపు దీపింపవే కల్కిమూర్తిం బ్రవర్తించి? నీ న్నెన్న నే నెవ్వఁడన్? నన్ను మాయావిపన్నున్, విషణ్ణుం, బ్రపన్నుం, బ్రసన్నుండ వై ఖిన్నతం బాపి, మన్నింపవే, పన్నగాధీశతల్పా! కృపాకల్ప! వందారుకల్పా! నమస్తే నమస్తే నమస్తే నమః. 1233

మ. కలలం బోలెడి పుత్రమిత్రవనితాగారాదిసంయోగముల్
జలవాంఛారతి నెండమావులకు నాసల్ సేయు చందంబునం

1. పొగడుదురు. 2. జలరాశి (సముద్రమున) నుండు ప్రాణులరీతిగా. 3. బ్రాహ్మణుఁడవై-పరశురాముఁడవై,

దలఁతుఁగా సత్యము లంచు; మాధవుండ, వృథాతత్త్వజ్ఞుండఁగా; నాకు నీ
విలసత్పాదయుగంబు సూపి, కరుణం బీక్షింపు లక్ష్మీపతీ!'' 1234

వ. అని మఱియును వినుతింప నక్రూరునికి యమునాజలంబులలోన తన మొదలి మేను సూపి, చాలించి, నటునికై వడిం దిరోహితుం డైన, నక్రూరుండు నీరు వెడలి వెఱఁగుపడుచు వచ్చి, రథారోహణంబు సేసిన, హరి యి ట్లనియె.

క. ''జలములు చేరువ నున్నవి-తలపోయఁగ నీవు పోయి తడ వయ్యె; నదీ
జలముల, నభమున ధరణిం-గలుగనిచోద్యములు, నీకుఁ గానంబడెనే?'' 1236

వ. అనిన నతం డి ట్లనియె. 1237

క. ''నీలోన లేనిచోద్యము-లేలోకములందుఁ జెప్ప; రీశ్వర! నీటన్
నేలన్, నింగిని నున్నవె?-నీలోఁ జోద్యంబు లెల్ల నెగడె మహాత్మా.'' 1138

వ. అని పలికి సాయంకాలమునకు నక్రూరుండు మధురానగరంబు సేర రథంబు గడపె; నంత నటమున్న చని, నందాదులు పురోపవనంబున విడిసి యుండ, వారలం గూడికొని, కృష్ణుం డక్రూరునిం జూచి, ''నీవు రథంబు గొనుచు నగరంబునకుం జనుము; మేము వెనుక వచ్చెద'' మనిన నతం డి ట్లనియె. 1239

క. ''నాయింటికి విచ్చేయుము-నీయంఘ్రిసరోజరేణునికరము సోఁకన్
నాయిల్లు పవిత్రం బగు-శ్రీయుత! నీభటునిఁ బెద్ద సేయం దగదే?'' 1240

వ. అని మఱియుఁ బ్రార్థించిన, హరి యి ట్లచియె. 1241

శ్రీకృష్ణమూర్తి మధురానగరప్రవేశము సేయుట.

క. ''యదుకులవిద్వేషణుఁడై-మదమున వర్తించు కంసు మర్దించి, భవ
త్సదనంబుఁ జూడ వచ్చెదఁ-బొద యీయాస్యందనము గొనుచుఁ బురమున కనఘా!''

వ. అని పలికిన నక్రూరుండు పురంబునకుం జని, ''రామకృష్ణులు వచ్చి'' రని కంసున కెఱింగించి, తనగృహంబునకుం|జనియె; నంత నపరాహ్ణంబున బలభద్రగోపాల సహితుం డై కృష్ణుండు. 1243

మ. పరిఖల్, గోటలుఁ, గొమ్మలుం, బడగలుం, బ్రాసాదముల్, వీథులున్,
హరులుం, దేరులు, వీరులున్, గజములున్, హర్మ్యంబులున్, వాద్యముల్,
తరణుల్, ధాన్యములున్, ధనంబులు, మహోద్యానంబులున్, దీర్ఘికల్,
గర మాశ్చర్యరుచిం దనర్చుమధురన్ గాంచెన్ విభుం డంతటన్. 1244

వ. కని యప్పురంబు ప్రవేశించి వచ్చు సమయంబున. 1245

ఉ. "సంతతపఃఫలంబు, సుగుణంబులపుంజము, గోపకామినీ
బృందమునోముపంట, [1]సిరివిందు, దయాంబుధి, యోగిబృందముల్
డెందములందుఁ గోరెడు [2]కడిందినిధానము, సేరవచ్చె; నో
సుందరులార! రండు; చని చూతము కన్నులకోర్కి దీఱఁగన్." 1246

వ. అని మఱియు గోవిందసందర్శనకుతూహలంబులఁ బౌరసుందరులు పరస్పరాహూయమానలై, భుంజానలై భోజనభాజనంబులు దలంగఁ ద్రోచియు, శయానలై లేచియు, నభ్యజ్యమానలై జలంబు లాడకయు, గురుజనశిక్ష్యమాణలై యోడకయు, గృహకార్యప్రవర్తమానలై పరిభ్రమింపకయు, రమణరమమాణలై రమింపకయు, [3]శిశుజనబిభ్రాణలై డించియు, నలంకుర్వాణలై యన్యోన్యవస్త్రాభరణమాల్యానులేపనంబులు వీడ్వడ ధరించియు నరిగి. 1247

క. వీటఁ గల చేడె లెల్లను-హాటకమణిఘటితతుంగహర్మ్యాగ్రములం
గూటువలు గొనుచుఁ, జూచిరి-పాటించి విశాలవక్షుఁ బద్మదళాక్షున్. 1248

సీ. "వీఁడటే! రక్కసి విగతజీవఁగఁ జన్నుఁబాలు ద్రావినమేటిబాలకుండు?
వీఁడటే! నందుని వెలఁదికి జగమెల్ల ముఖమందుఁ జూపినముద్దులాఁడు?
వీఁడటే! మందలో వెన్నలు దొంగిలి దర్పించి మెక్కినదాఁపరీఁడు!
వీఁడటే! యలయించి ప్రేతలమానంబు సూఱలాడిన లోకసుందరుండు?
తే. వీఁడు సేకున్నపుర మటవీస్థలంబు;-వీనిఁ బొందనిజన్మంబు విగతఫలము;
వీనిఁ బలుకనివచనంబు విహగరుతము;-వీనిఁజూడనిచూడ్కులువృథలువృథలు.

మ. చెలియా! గోపిక లీకుమారతిలకుం జింతించుచుం, బాడుచుం,
గలయం బల్కుచు, నంటుచున్, నగుచు, నాకర్షించుచున్, [4]హస్తగా
మలకక్రీడకుఁ దెచ్చి, నిచ్చలును సమ్మానంబులం బొందఁగాఁ
దొలిజన్మంబుల నేమి నోఁచిరొకదే దుర్గప్రదేశంబునన్?" 1250

క. అని మఱియుఁ బౌరకాంతలు,-మునుకొని హరిరూపు నేత్రములవెంటను, లోఁ
గొని, తాల్చిరి హృదయములను,-జనితప్రమదమున విరులు సల్లుచు నధిపా!

వ. మఱియును. 1252

క. నానావిధగంధములుఁ బ్ర-సూనఫలాదులను, [5]హరితశుభలాజములుం,
గానిక లిచ్చుచు, విప్రులు-మానుగఁ బూజించి రా కుమారోత్తములన్.

1. లక్ష్మీదేవికి ప్రియమయినవాఁడు. 2. గొప్పధననిధి వంటివాఁడు. 3. పిల్లలను ఎత్తుకొన్నవారై. 4. చేతియందుండు ఉసిరిక కాయలవంటి ఆటలకు. 5. పచ్చని మంగళకరములయిన పేలాలు.

వ. ఆ సమయంబున నగరద్వారంబునుండి వచ్చు రాగకారుం డను నొక్కరజకుం
గని హరి యి ట్లనియె. 1254

శ్రీకృష్ణుండు రజకునిఁజంపి వాయకసుదాము లొసంగు పూజల నంగీకరించి మేలొసంగుట

ఉ. "వింతల మై నరేశ్వరునిపీటికి వచ్చితి మేము; మాకు మా
మందలలోనఁ గట్టికొన మంచి పటంబులు లేవు; నీముకిఁ
సుందరధౌతచేలములు శోభిలుచున్నవి; తెమ్ము; నిన్ను మే
లందెదు; నిమ్ము; రాజుదెస నల్లుర మో రజకాన్వయాగ్రణీ!" 1255

వ. అనిన రోషించి వాఁ డిట్లనియె. 1256

శా. "ఎట్టెట్టా మనుజేంద్రచేలములు మీకేఁ బాడియే? మీరలుం
గట్టం బోలుదురే? పయోఘృతదధిగ్రాసంబులన్ మత్తులై
యిట్టాడం జనెఁగాక! గొల్లలకు మీ కెబ్భంగి నోరాడెడిన్?
గట్టా! ప్రాణముఁ గోలుపోయెదు సుమీ! కంసోద్ధతిన్ బాలకా! 1257

క. మారాజుసొమ్ముఁ గైకొన-నేరాజులు వెఱతు; రింతయొల్లినమే? నీ
కీరాజరాజగృహమున-నీరాజస మేల? గొల్ల! యేఁగుము తలఁగన్." 1258

వ. అనిన విని రోషించి. 1259

క. ఘోరకరాగ్రతలంబున-ధీరుఁడు కృష్ణుండు శిరము దెగిపడఁ గొట్టెం,
బౌరులగుండెలు వగులఁగ-వీరోద్రేకిన్, మదావివేకిన్, [1]జాకిన్. 1260

వ. ఇట్లు భగ్నుం డైన రజకునిం జూచి, వానివారలు పటంబులు డించి, వెఱచి
పఱచిన, రామకృష్ణులు వలసిన వస్త్రంబులు ధరియించి, కొన్ని గోపకుల
కొసంగి, చనుచుండ. 1261

క. అంతట నొక[2]వాయకుఁ డా-క్రాంతన్ వసుదేవసుతులఁ గని, బహువస్త్రా
త్యంతమృదుపటాభరణము-లెంతయు సంతసముతోడ నిచ్చెన్ మెచ్చన్. 1262

శా. కారుణ్యంబున వానిఁ గైకొని, యలంకారంబు గావించి, శృం
గారోదంచితదిగ్గజేంద్రకలభాకారంబులం బొల్చి రా
శూరుల్; మాధవుఁ డంత వాయకునిశుశ్రూషన్ మహాప్రీతుఁ డై,
సారూప్యంబును, లక్ష్మియు, న్నొసఁగె నైశ్వర్యాదిసంధాయి యై. 1263

వ. అంత నారామకృష్ణులు సుదాముం డను[3]మాలాకారు గృహంబునకుఁ జనిన,
నతండు గని, లేచి, గ్రక్కున మ్రొక్కి, చక్కన యర్ఘ్యపాద్యాదికంబు

1. చాఁకలివానిని. 2. పాలె, నేఁత నేయువాఁడు. 3. పూలదండలు కట్టువాఁడు.

లాచరించి, సానుచరు లయిన వారలకుఁ దాంబూలకుసుమగంధంబు లొసంగి, యిట్లనియె. 1264

ఉ. "పావన మయ్యె నాకులము; పండెఁ దపంబు; గృహంబు లక్ష్మికిన్
సేవిత మయ్యెఁ; నిష్టములు సేకుఱె; విశ్వనిదానమూర్తులై
భూవలయంబు గావ నిటు పుట్టినమీరలు రాకఁ జేసి, నే
నేవిధ మాచరింతుఁ? బను లెయ్యవి? బంట; నెఱుంగఁ జెప్పరే!" 1265

వ. అని పలికి. 1266

క. దామోదరరాముల, కు-ద్దామయశోహసితతుహినధాములకు, వధూ
కాములకుఁ దెచ్చియిచ్చె సు-దాముఁడు ఘనసురభికుసుమదామము లధిపా!

క. వారును మాలికుఁ డిచ్చిన-భూరికుసుమదామములను భూషితులై, "నీ
కోరినవర మిచ్చెద" మని-కారుణ్యము సేయ, నతఁడు గని యిట్లనియెన్.

క. "నీపాదకమలసేవయు-నీపాదార్చకులతోడి నెయ్యమును, నితాం
తాపారభూతదయయును, దాపసమందార! నాకు దయసేయఁగదే!" 1269

వ. అని వేఁడికొనిన నిచ్చి, మఱియు మాధవుం డమ్మాలికునకు బలాయుఃకాంతికీర్తి
సంపద లొసంగి, వానిగృహంబు వెడలి, రాజవీథిం జని చని. 1270

క. ఆ నలినాక్షుఁడు గాంచెను-[1]నానాలేపముల భాజనము సేకొనుచుం
బూని చనుదెంచుదానిని-నాననరుచినిచయవినమితాబ్జం, గుబ్జన్. 1271

వ. కని యిట్లనియె. 1272

క. "ఎవ్వరిదానవు? లేపము-లెవ్వరికిం గోరి కొనుచు నేఁగెదు? నీపే
రెవ్వతె? మా కిమ్మిన్నియు-నివ్వటిలెదు చక్క నగుచు నీరజనేత్రా!" 1273

వ. అనిన నయ్యబల యిట్లనియె. 1274

ఉ. "చక్కనివాఁడ వౌదు; సరసంబుల నొంపకు; మెల్లవారికిన్
జక్కఁదనంబు లెక్కడివి? చారుశరీర [2]త్రివక్ర యండ్రు; నే
నిక్కము కంసుదాసిని; వినిర్మలలేపనవిద్యదాన, నన్
మిక్కిలి రాజు మెచ్చుఁ; దగ మీరు విలేపనముల్ ధరింపరే?" 1275

క. అని పలికి, యా కుమారుల-తనువులు, నగవులును, వీక్షితమ్ములు, మాటల్
దనచిత్తముఁ గరఁగించిన-వనులేపము లిచ్చె, వారి కబల ప్రియముతోన్.

1. అనేకవిధములయిన సుగంధద్రవ్యములు గలపాత్ర. 2. మూఁడువంకరలు గలది.

సీ. ఇవ్విధంబునఁ గుబ్జ యిచ్చిన లేపంబు లన్నియుఁ, దాను దేహమున నలఁది
కొని, ప్రసన్నతనొంది, కుబ్జ[1]మువ్వంకల యొడలు సక్కఁగ నొత్తియునుపఁ దలఁచి,
తత్పదంబులమీఁదఁ దనపదంబులు ద్రొక్కి, హస్తాంగుళద్వయ మబలగౌద
క్రింద విప్పుగ నిడి, కృష్ణుఁడు మీఁదికి నెత్తిన, వక్రత లెల్ల మాని,
ఆ. చక్క నైన చిత్తజన్ముబాణముక్రియఁ-గొమరు మిగిలి, పిఱుఁదు, గుచయుగంబు
సొంపు సేయఁ, దరుణి సుందరమూర్తి యై-కమలనయనుఁ జూచి కాంక్షతోడ.

క. "వేంచేయుము నాయింటికిఁ-బంచశరాకార!" యనుచుఁ బైకొం గాక
ర్షించి, హరిఁ దిగిచెఁ; గామిని-పంచాశుగబాణజాలభగ్నహృదయ యై. 1278

క. కామిని తిగిచినఁ గృష్ణుఁడు-రాముని వీక్షించి, నగుచు "రాజానన! మ
త్కామితముఁ దీర్చి, పిదపన్-నీమందిరమునకు వత్తు; నేఁ డలుగకుమీ!"

వ. అని వీడుకొలిపి, కృష్ణుండు [2]విపణిమార్గంబునం జని చని, తాంబూలమాలికా
గంధంబులును, బహువిధంబు లయిన కానికలును, పౌరు లిచ్చినఁ బరిగ్రహిం
చుచు, ధనుశ్శాల కరిగి, యందు. 1280

క. సురరాజువింటికై వడి-గురుతర మై భూరివీరగుప్తం బయి, దు
స్తర మైన విల్లు పొగడని-నరులు వల దనంగ [3]బిట్టు నగి వికసితుఁ డై. 1281

శా. బంధుల్ మే లన, వామహస్తమునఁ జాపం బెత్తి, మౌర్వీలతా
సంధానం బొనరించి, కొంచెపుఁదెగన్ శబ్దించుచున్, ధీరతా
సింధుం డా హరి దాని ఖండితముగాఁ జేసెన్, జనుల్ చూడఁగా,
గంధేభంబు రసాలదండము నొగిన్ ఖండించుచందంబునన్. 1282

క. కోదండభంగనిర్గత-నాదము వీనులకు భీషణంబయి, యాశా
రోదోంతరములు నిండుచు-భేదించెన్ భోజవిభుని బింకము నధిపా! 1283

అ. అప్పుడు. 1284

ఉ. "అద్రిశ! రాచవిల్ విఱిచె నర్భకుఁ డెంతయు శంక లేక; నేఁ
డుద్దవిడిన్ సహింపఁ దగ; దుగ్రతఁ బట్టుఁడ" యంచుఁ గ్రుద్ధు లై
గ్రద్దన లేచి, తద్ధనువుకావలివా రరుదేర, వారి న
య్యుద్దులఁ గూడి, పట్టి మడియించిరి కార్ముకఖండహస్తు లై. 1285

వ. ఇట్లు రామకృష్ణులు మథురాపురంబున విహరించి, వెడలి విడిదలకుం జని;
రంత. 1286

1. మూఁడువంకరలు. 2. అంగడివీధి. 3. అధికముగా.

సూర్యాస్తమయ చంద్రోదయములవర్ణనము.

మ. గగనారణ్యచరాంధకారగజముం [1]గాలాహ్వయవ్యాధుఁ డ
చ్చుగఁ బట్టన్ గమకించి, మచ్చికట కై చూతాంకురశ్రేణిచే
నొగిఁ గల్పించిన కందుకం బనఁగ, సూర్యుం డంత వీక్షింపఁగాఁ
దగె మందప్రభతోడఁ బశ్చిమమహాధాత్రీధరేంద్రంబునన్. 1287

క. తరుణుఁ డగు శీతకరునికి–మరగి, [2]వియల్లక్ష్మి దన్ను మాని, ముదుకఁడున్
ఖరకరుఁడు ననుచు ద్రొబ్బిన–కరణిన్, రవి పశ్చిమాద్రికడఁ గ్రుంకె నృపా!

ఆ. "కళలు గలుగుఁ గాక! కమల తోడఁగుఁ గాక,–శివునిమౌళిమీఁదఁ జేరుఁ గాక!
నన్ను నొల్లఁ; దపనుఁ డైన మత్పతి" యని–సాధ్వి భంగిఁ గమలజాతి మొగిడె.

క. సుందరసాయంసంధ్యా–వందనవిప్రార్ఘ్యతోయవజ్రహతోద్య
న్మందేహాసురరక్త–స్యందముక్రియఁ గెంపుసొం పెసఁగె నపరదిశన్. 1290

ఆ. భూమి నిండి, మింటఁ బూర్ణ మై, కర్కట–మకర మీనరాశి మహిత మైన
హరియశస్సుధాబ్ధియందలితుంపురు–లనఁగఁ జుక్క లొప్పె నాకసమున. 1291

క. ఎల్లదిశలు నిండినశ్రీ–వల్లభుగుణమహిమ బ్రహ్మ [3]వాసించుటకై
చల్లిన మృగమద మనఁగా–వెల్లివిరిసెఁ దమము గగనవీథుల నెల్లన్. 1292

క. ఆచీఁకటి వెనుతగిలినఁ–బ్రాచీదిశనుండి గంతుఁబరువున రవి భ
ర్మాచలముమలఁకత్రోవను–వే చనియెం గాక; నిలిచి విఱుగక యున్నే? 1293

ఉ. "మీకును వైరి మెప్పుకును, మిక్కిలి మాకును వైరి, రాజు దో
షాకరుఁ, డింక వచ్చు; జలజాతములార! మదీయబాలురం
జేకొనుఁ" డంచు బాలకులఁ జీఁకటి దాఁచినభంగిఁ జిక్కి, రా
రాక వసించెఁ దుమ్మెదలు రాత్రి [4]సరోరుహకుట్మలంబులన్. 1294

సీ. ప్రాచీదిశాంగనాఫాలతలంబున దీపించు సింధూరతిలక మనఁగ,
దర్పించి విరహులధైర్యవల్లులు ద్రెంప దర్పకుం డెత్తినదాత్ర మనఁగ,
నలిగి కాలకిరాతుఁ డంధకారమృగంబు ఖండింప మెఱయించు ఖడ్గ మనఁగ,
గగనతమాలవృక్షముతూర్పుకొమ్మను లలిత మై మెఱయుపల్లవ మనంగఁ,

ఆ. దొగలు సంతసిల్ల, దొంగలు భీతిల్లఁ,–గడలి మిన్ను ముట్టి కడలుకొనఁగఁ,
బొడిచె శీతకరుఁడు భూరిచకోరక–ప్రీతికరుఁడు, జారభీతికరుఁడు. 1295

క. దర్పితతారాధిపపరి–సర్పితకిరణౌఘమిళితసకలదిశం బై
యేర్పడి, [5]కమలభవాండము–కర్పూరపుఁగోవిభంగిఁ గనుపట్టె నృపా! 1296

---

1. కాలము అను పేరుగల వేటకాఁడు. 2. ఆకాశలక్ష్మి. 3. సువాసనవాఘ్రాణించుటకు. 4. కమలముల మొగ్గలు. 5. బ్రహ్మాండము.

క. ఆ రేయి గోపయుతులై - క్షీరాన్నము గుడిచి, రామకృష్ణులు మదిఁ గం
సారంభ మెఱిఁగి, యిష్టవి - హారంబుల నప్రమత్తులై యుండి రటన్. 1297

క. తనపురికి రామకృష్ణులు - సనుదెంచి, నిజానుచరులఁ జంపుటయు, మహా
ధనువుఁ గదిసి విఱుచుటయును - విని, కంసుఁడు నిద్ర లేక విహ్వలమతియై. 1298

సీ. కర్ణరంధ్రములు చేఁ గప్పిన, లోపలి ప్రాణఘోషము వినఁబడక యుండెఁ;
దోయాదికములందుఁ దొంగిచూచినయంతఁ, దలగాన రాదయ్యెఁ దనువుమీఁదఁ;
కరశాఖ నాసికాగ్రంబుపై నిడిచూడ, గ్రహతారకలు రెండుగా నగపడె;
వెలుఁగున నిలుచుండి వీక్షింపఁగా, మేని నీడ సరంధ్రమై నేలఁ దోఁచె;

ఆ. నడుగుజాడ దృష్ట మాట లేదయ్యెను; - దరువులెల్ల [1]హేమతరువు లగుచు
మెఱయుచుండెఁ; గాలమృత్యువు డగ్గఱ - బుద్ధి యెల్లఁ గలఁగె భోజపతికి.

క. గరళముఁ దినుటయుఁ, బ్రేతముఁ - బరిరంభించుటయు, [2]నగ్నభావుఁ డవుటయున్,
శిరమునఁ దైలము వడుటయు, - ఖరపతి నెక్కుటయు, నతఁడు కలలోఁ గనియెన్.

వ. మఱియు "రక్తకుసుమమాలికాధరుండై యొక్కరుండ నెక్కడనేనియుం
జనుచున్నవాఁడ" నని కల గాంచి, మరణహేతుక భ్రాంతిం జింతా
క్రాంతుండై, నిద్రఁ జెందక, వేగించుచున్న సమయంబున. 1301

## సూర్యోదయ వర్ణనము

క. అరుణహరినఖరవిదళిత - గురుతిమిరేభేంద్రకుంభకూటవినిర్ము
క్తరుధిరమౌక్తికముల క్రియ - సురపతిదిశఁ గెంపుతోడఁ జుక్కలు మెఱసెన్.

సీ. [3]పౌలోమి దనబాలుపాన్పుపైఁ గనుపట్టఁ, బన్నినపవడంపుబంతి యనఁగ,
నాయురర్థములవ్యయంబు లొత్తిలి, చాటుకాలజాంఘికుచేతిఘంట యనఁగ,
ఘనజంతుజీవితకాలరాసుల, విధి కొలువ నెత్తినహేమకుంభ మనఁగ,
బశ్చిమదిక్కాంత పరఁగఁ గై సేయుచోఁ, ముందట నిడుకొన్న ముకుర మనఁగఁ,

తే. గోకతాపోపశమదివ్యఘుటిక యనఁగఁ,
బద్మినీకాంతనోములఫల మనంగ,
మూఁడుమూర్తులసారంపుముద్ద యనఁగ,
మిహిరమండల ముదయాద్రిమీఁద నొప్పె. 1303

క. వచ్చెం జల్లనిగాడ్పులు; - విచ్చెం గమలములు; దమము విరిసి బిలంబుల్
చొచ్చెం; బద్మమరందము - మెచ్చెం దుమ్మెదలు గ్రోలి మిహిరుఁడు వొడమన్.

క. సంకాశితోదయాచల - పంకజసఖకిరణరాగపరిపూర్ణంబై,
పంకేరుహగర్భాండము - కుంకుమసలిలంపుఁ గ్రోవికొమరున నొప్పెన్. 1035

1. బంగారుచెట్లు. 2. వివస్త్రుఁడై యుండుట. 3. శచీదేవి.

వ. తదనంతరంబున. 1906

సీ. పాషాణవల్మీకపంకాదిరహితంబు, మృదులకాంచననిభమృణ్మయంబు
గమనీయకస్తూరికాజలసిక్తంబు, బద్ధచందనదారుపరివృతంబు,
మహనీయకుసుమదామధ్వజతోరణమండితోన్నతమంచమధ్యమంబు,
బ్రాహ్మణక్షత్త్రాదిపౌరకోలాహలం, బశ్రాంత[1]తూర్యత్రయాంచితంబు,

ఆ. నిర్మలంబు. సమము, నిష్కంటకంబునై,-పుణ్యపురుషుమనముఁబోలి కంస
సైన్యతుంగ మగుచు సంతుష్టలోకాంత-రంగమైన మల్లరంగ మొప్పె. 1307

క. ఆమల్లరంగపరిసర భూమిస్థితమంచమందు భోజేంద్రుఁడు మా
న్యామాత్యసంయుతుండై-భూమీశులు గొలువ నుండెఁ బొఱ్ఱుచు నధిపా!

మ. సకలాంభోనిధిమేఖలావహనముం జాలించి, యేతెంచు నా
గకులాగంబులభంగి నొప్పుచుఁ, దగం గైసేసి, చాణూరము
ష్టికకూటుల్ శలతోశలుల్ గురువులన్ సేవించుచున్, రంగధా
త్రికి నేతెంచిరి, తూర్యఘోషముల నుద్రేకం బనేకంబుగన్. 1309

క. నందాదులైన గోపకు-లందఱుఁ జని, కానుకలు సమర్పించి, నృపున్
సందర్శించి, తదనుమతిఁ-జెంది, మహామంచముల వసించిరి వరుసన్. 1310

వ. అంత రామకృష్ణులు నలంకృతులై, మల్లదుందుభినినదంబు విని, సందర్శన
కుతూహలంబున. 1311

క. ఓడక రంగద్వారము,-జాడం జని, వారు కనిరి సమదకువలయా
పీడంబున్, భిన్నపరా-క్రీడంబుం, బ్రమదకంటకేతచూడంబున్. 1312

వ. కని, తత్కరిపాలకశ్రేష్ఠుం డైన [2]యంబష్ఠునికి మేఘనాదగంభీరభాషణంబుల
రిపు భీషణుండగు హరి యి ట్లనియె. 1313

శ్రీకృష్ణుండు కువలయాపీడ మనుగజంబును వధించుట

శా. "ఓరీ కుంజరపాల! మాదెసకు నీయుద్వృత్త దేభేంద్రముం
బ్రేరేఁపం బనిలేదు; త్రిప్పు; మరలం బ్రేరేఁచినన్, నిన్ను గం
భీరోగ్రాశనితుల్యముష్టిహతులన్ భేదించి, నేఁ డంతకుం
జేరం బుత్తు మహోత్తరద్విపముతో, సిద్ధంబు యుద్ధంబునన్." 1314

వ. అని పలికి. 1315

ఉ. మించినకొప్పుఁ జక్కనిడి, మే లనఁ బచ్చనిచీర కాసె బం
ధించి, లలాటకుంతలతతిన్ మరలించుచు, సంగరక్రియా

1. నాట్యము, సంగీతము, వాద్యము. 2. మావటివాఁడు - ఏనుగులను శిక్షించువాఁడు.

చుంచుతఁ బేర్చి, బాలకుఁడు చూచు జనంబులు దన్ను "బాపురే!"
యంచు నుతింప, డగ్గఱియె హస్తజితాగము గంధనాగమున్. 1316

క. అంజక బాలకుఁ డనియును,-[1]గొంజక దయ మాలి, రాజకుంజర! యంతం
గుంజరమును డీకొలిపెను-గుంజరపాలకుఁడు గోపకుంజరుమీఁదన్. 1317

వ. మఱియు నయ్యనేకపం బనేకపపాలకప్రేరితం బయి, మహావాతసంఘాతసముద్ధూతం బగు [2]విలయకాలకీలికేళిని బిట్టు మిట్టిపడి, మృత్యుదేవతయెత్తునం గాలుపోలిక, శమనునిగమనిక, నెదిరి మదసలిలపరిమళలుబ్ధపరిభ్రమద్భ్రమరగాయకఝుంకృతు లహంకృతి సంపాదింప, గులకుంభిసోదరగుహాకుంభగుంభనంబుగా ఘీంకరించి రోషభీషణశేషభోగిభోగభయంకరం బగు కరంబున శౌరిం జీరి, చీఱికిం గొనక పట్టిన, నట్టిట్టు గెంటి విధుంతుదవదనగహ్వరంబువలన విడివడి యుఱుకుతరణికరణి, దర్పించి కుప్పించి, పాదమధ్యంబునకు నసాధ్యుం డై దూఁటి, దాఁటి మాటుపడినం, గ్రోధబంధురం బై సింధురంబు మహార్ణవమధ్య మంథాయమాన మందరమహీధరంబు కైవడి జిఱజిఱం దిరిగి, కానక భయానకం బై కాలివెరవునం గని పొంగి, చెంగటం బ్రళయదండిదండప్రశస్తం బగు హస్తంబు వంచి, వంచించి, చుట్టిపట్టి పడఁద్రోయంగ మకించినం, జలింపక, తెంపున హరి కరిపిఱింది కుఱికి మహోరాహువాల వల్లికాకర్షణోదీర్ణుం డగు సుపర్ణు తెఱంగున నెగిరి, శుండాలంబువాలంబు లీలం గేల నొడిసిపట్టి, జళిపించి, పంచవింశతిబాణాసనప్రమాణదూరంబు బీరంబునం ద్రిప్పి వైవ, నవ్వారణంబు దుర్నివారణం బై రణంబున కోహటింపక, సవ్యాపసవ్యపరిక్రమణంబుల నవక్రం బై కవిసిన, నపసవ్యసవ్య క్రమంబులం దప్పించి, రొప్పి కుప్పించిన యెదుర్కొనినఁ [3]గర్కశుం డయి, మేచకాచలతుంగశృంగనిభం బగు కుంభికుంభంబు చక్కటి వ్రక్కలై, చెక్కలెగయ, దురంత కల్పాంతజీమూత ప్రభూతనిర్ఘాతనిష్ఠురం బగు ముష్టి సారించి, యూఁచి పొడిచినం, దద్వికీర్ణపూర్ణరక్తసిక్తమౌక్తికంబులు వసుంధరకు, సంధ్యారాగరక్తతారకాచ్ఛన్నం బగు మిన్ను చెన్ను లవరింప, నిలువరింపక, మ్రొగ్గి మోఁకరిలి, మ్రొగ్గక దిగ్గిన నగ్గజంబు లేచి, త్రోచి, చూచి, నడచి, సంహారసమయసముద్రసంఘాతసంభూతసముత్తుంగభంగసంఘటితం బగు కులాచలంబు క్రియఁ గ్రమ్మర నమ్మహాభుజునిభుజాదండంబులవలన ఘట్టితం బై [4]కట్టలుక ముట్టి, నెట్టుకొను ముమ్మరంబుగం గొమ్ములం జిమ్మిన, నమ్మేటి చేసూటి మెఱసి, హస్తాహస్తి సంగరంబునఁ గరంబొప్పి దప్పింబడక నొప్పించిన, నకుంఠితకాలకంఠ కఠోరభల్లభగ్నం బగు పురంబు పగిది, జలధిం జటులఝంఝూనిలవికలం

1. సందేహింపక. 2. ప్రళయకాలమునందలి అగ్ని యొక్క విలాసముతో. 3. కఠినమయిన వాఁడు. 4. ఎక్కువ కోపముతో.

బగు కలంబుకైవడి, నమ్మదకలభంబు బలంబు దక్కి చిక్కి స్రుక్కిపడి లోభికరం
బునుం బోలె దానసలిలధారావిరహితంబై విరహితలంపునుం బోలె నిరంతర
చిత్రజాతవిగ్రహంబై, గ్రహణకాలంబునుంబోలెఁ బరాధీన ఖరకరంబై,
ఖరకరోదయంబునుం బోలె భిన్నపుష్కరంబై, పుష్కరవైరివిలసనంబునుం
బోలె నభాసితపద్మకంబై, యున్న సమయంబున. 1318

శా. కాలం ద్రొక్కి, సరోషుఁడై నగవుతోఁ, గంఠీరవేంద్రాకృతిం
గేలన్ భీషణదంతముల్ వెఱికి, సంక్షీణంబుగా మొత్తి, గో
పాలగ్రామణి వీరమాళిమణియై ప్రాణంబులం బాపె, నా
శైలేంద్రాభముఁ, బ్రాణలోభము, నుదంచత్సారగంధేభమున్. 1319

వ. మఱియు దంతిదంతతాడనంబుల, దంతావళపాలకులం గాలుఁద్రోలి కవిసి, తత్ప్ర
దేశంబు వాసి. 1320

మ. కరిదంతంబులు మూఁపులందు మెఱయన్, ఘర్మాంబువుల్ మోములన్
నెరయం, గోపకు లంత నంత మలయన్, [1]నిత్యాహవస్థేము లా
హరిరాముల్ సనుదెంచి, కాంచిరి మహోగ్రాడంబరాపూరితా
మరమర్త్యాదిజనాంతరంగము, లసన్మల్లావనీరంగమున్. 1321

సీ. మహితరౌద్రంబున మల్లుర [2]కశని యై, నరుల కద్భుతముగ నాథుఁ డగుచు,
శృంగారమునఁ బురస్త్రీలకుఁ గాముఁ డై, నిజమృత్యు వై కంసునికి భయముగ,
మూఢులు బీభత్సమును బొంద వికటుఁడై, తండ్రికిదయరాఁగఁ దనయుఁడగుచు,
ఖలులకు విరసంబుగా దండి యై, గోపకులకు హాస్యంబుగాఁ గులజుఁ డగుచు,
ఆ. బాంధవులకుఁ బ్రేమ భాసిల్ల వేలుపై-శాంత మొనర యోగిజనుల కెల్లఁ
బరమతత్త్వ మగుచు, భాసిల్లె బలునితో-మాధవుండు రంగమధ్యమందు. 1322

వ. అప్పుడు. 1323

క. వచ్చిన కుంభీంద్రంబును-వచ్చినబలమాధవులను, వరుసం గని, తా
నొచ్చినచిత్తముతోడుతఁ-జెచ్చెరఁ గడు వెఱచె భోజసింహుం డధిపా! 1324

ఉ. ధీరుల, వస్త్రమాల్యమణిదీప్తవిభూషణధారులన్, మహా
కారుల, సర్వలోకశుభకారుల, మానవమానినీమనో
హారుల, రంగభూతలవిహారుల, గోపకుమారులన్, మహా
వీరులఁ జూచి చూచి, తనివిం దుదిముట్టక లోకు లందఱున్. 1325

ఉ. సన్నుతరామకృష్ణముఖచంద్రమయూఖసుధారసంబులం
గన్నులఁ ద్రావుచందమునఁ గాంచుచు, జిహ్వల నంటి చూచు లీ

1. ఎడతెగని యుద్ధమునందు స్థిరముగానుండువారు. 2. పిడుగు.

ల న్నుతి సేయుచుం, గరములం బరిరంభము సేయుభంగి న
త్యున్నతిఁ జూపుచుం, దగిలి యొండొరుతోడ రహస్యభాషలన్. 1326

క. “వసుదేవునివాసంబున-వసుధన్ రక్షింప, వీరు వైష్ణవతేజో
లసనమునఁ బుట్టినారఁట?-పసిబిడ్డ లనంగఁ జనదు పరదేవతలన్. 1327

సీ. చంపె రక్కసిఁ బట్టి; చక్రవాతునిఁ గూల్చెఁ; బడ ద్రొబ్బె మద్దుల; బకుని జీరె;
నఘదైత్యుఁ బొరిగొనె; నడరి వత్సకుఁ ద్రుంచె; గిరియెత్తి దేవేంద్రుఁ [1]గ్రించుపఱిచెఁ;
గాళియు మర్దించె; గహనానలముఁ ద్రావెఁ; గేశి నంతకపురి క్రేవ కనిచె;
మయుపుత్త్రుఁ బరిమార్చె; మఱియును దానవభటుల మర్దించి, గోపకులఁ గాచె;
తే. గోపకాంతలమనములఁ గోర్కెఁ దీర్చె-నీసరోరుహలోచనుం, డీశుభాంగుఁ,
డీమహామహుఁ, డీదిగ్గజేంద్రనిభుఁడు-మనుజమాత్త్రుఁడె తలపోయ మాధవుండు?”

## శ్రీకృష్ణబలరాములు చాణూరముష్టికులను వధించుట

వ. అని పలుకుచుఁ, బౌరజనులు సూచుచుండ రామకృష్ణులకుఁ జాణూరుం డిట్లనియె.

మ. “వనమార్గంబున గోపబాలకులతో వత్సంబులన్ మేపుచుం
బెనఁగన్, ‘మిక్కిలి నేర్చినా’ రనుచు నీ పృథ్వీజనుల్ సెప్ప మా
మనుజేంద్రుం డిట మిమ్ముఁ జీరఁ బనిచెన్ మల్లాహవక్రీడకుం;
జనదే కొంతపరాక్రమింప మనకున్ సభ్యుల్ విలోకింపఁగన్? 1330

మ. జవసత్త్వంబులు మేలె? సాము గలదే? [2]సత్త్రాణమే మేను? భూ
ప్రవరుం డౌనన మి మ్మనంగవలెనే? పాళీ లభీష్టంబు లే?
పవివో? కాక కృతాంతదండకమవో? ఫాలాక్షునేత్రాగ్నివో?
[3]నవనీతంబులముద్ద గాదు పెనఁగన్; నాముష్టి, గోపార్భకా! 1331

క. జనములు నేర్చినవిద్యలు-జననాథునికొఱకుఁ గాదె? జననాథుఁడు నీ
జనములు మెచ్చఁగఁ యుద్ధం-బున మనముం గొంత ప్రొద్దు పుత్తమె? కృష్ణా!”

వ. అనిన విని హరి యి ట్లనియె. 1333

ఉ. “సాములు లేవు; పిన్నలము; సత్త్వము గల్దనరాదు; మల్లసం
గ్రామవిశారదుల్ గులిశకర్కశదేహులు మీరు; మీకడ
న్నేము చరించు టెట్లు? ధరణీపతివేడ్కలు సేయువారముం
గాము; వినోదముల్ సలుపఁ గా దన వచ్చునె యొక్కమాటికిన్? 1334

క. నీతోడుత నేఁ బెనఁగెదఁ-బ్రీతిన్ ముష్టికునితోడఁ బెనఁగెడి బలుఁ; డు
గ్రాతత[4]మల్లాహవమున-భూతలనాథునికి మెచ్చుఁ బుట్టింతు సభన్.” 1335

---

1. అవమానముచేసెను. 2. శక్తితోఁగూడినదేనా? 3. వెన్నలముద్ద. 4. మల్లయుద్ధము.

వ. అనిన విని చాణూరుం డిట్లనియె. 1336

శా. "నాతోఁ బోరఁగ నెంతవాఁడ? విసిరో! నాపాటియే నీవు? వి
ఖ్యాతుండఁ, గులజుండ, సద్గుణుఁడ, సత్కర్మస్వభావుండ, నీ
[1]కేతాదృగ్విభవంబు లెల్లఁ గలవే? యీపాటఁ బోరాడుటల్
వ్రేతల్ సూడఁగఁ గుప్పిగంతు లిడుటే? వీక్షింపు గోపార్భకా? 1337

శా. స్థాణున్ మెచ్చఁడు; బ్రహ్మఁ గైకొనఁడు; విష్వక్సేను నవ్వున్; జగ
త్ప్రాణున్ రమ్మనఁ డీడు గాఁడని; మహాబాహాబలప్రౌఢి న
క్షీణుం; డాజికి నెల్లి నేఁ డనఁడు; వైచిత్రిన్ వినోదించున
చ్చాణూరుం డొకగోపబాలుపనికిన్ శక్తుండు గాకుండునే? 1338

క. ప్రల్లద మేటికి? గోపక!-బల్లిదుఁడను, లోకమందుఁ బ్రఖ్యాతుఁడ, నా
చల్లడముక్రిందఁ దూఱని-మల్లురు లేరెందు ధరణిమండలమందున్. 1339

సీ. చలమున నను డాసి జలరాశిఁ జొరరాదు; నిగిడి [2]గోత్రముదండ నిలువరాదు;
క్రీడించి కుంభినిక్రిందికిఁ బోరాదు; మనుజసింహుఁడ నని మలయరాదు;
చేరినఁ బడవైతుఁ జెయి సాఁపగా రాదు; బెరసి నాముందటఁ బెరుఁగరాదు;
భూనాథహింసకుఁ బోరాదు నను మీఱి; శోధింతుఁ గానలఁ జొరఁగ రాదు;
ఆ. ప్రబలమూర్తి ననుచు భాసిల్లఁగా రాదు-ధరఁ బ్రబుద్ధుఁడ నని తలఁపరాదు;
కల్కితనము చూపి గర్వింపఁగా రాదు-తరము గాదు కృష్ణ! తలఁగు తలఁగు.

వ. అది గాక నీవు శ్రీహరి నంటేని. 1341

సీ. మహిమతో నుండంగ మథురాపురము గాని, పొలుపార వైకుంఠపురముగాదు;
గర్వంబుతో నుండఁ గంసునిసభ గాని, సంసారరహితులసభయుఁ గాదు;
ప్రకటించి వినఁగ నాబాహునాదము గాని, నారదువీణాస్వనంబు గాదు;
చదురు లాడఁగ [3]మల్లజనవిగ్రహము గాని, రమతోడి ప్రణయవిగ్రహము గాదు;
తే. వెలసి తిరుగంగ వేదాంతవీథి గాదు-మొఱఁగి పో మునిమనములమూల గాదు;
సాఁగి నడువంగ భక్తులజాడ గాదు-శౌరి! నామ్రోల నీవెందుఁ జనియె దింక?"

వ. అని పలికి. • 1343

సీ. రోషాగ్నిధూమప్రరోహంబుకైవడి, శిరమున సన్నపుశిఖ వెలుంగ,
నాశామదేభేంద్రహస్తసన్నిభములై, బాహుదండంబులు భయదములుగ,
లయసమయాంతకోల్లసితదంష్ట్రలభంగిఁ, జాఁగినకోఱమీసములు మెఱయ,
నల్లనితెగ గల [4]నడగొండచాడ్పున, నాభీలనీలదేహంబు మెఱయఁ,

1. ఇట్టి యైశ్వర్యము. 2. కొండసమీపము. 3. జెట్టులతోయుద్ధముచేయుట. 4. నడచునట్టి పర్వతము.

ఆ. చరణహతుల ధరణి సంచలింపఁగ, నభో-మండలంబు నిండ మల్ల సఱచి,
శౌరిదెసకు నడచెఁ, జాణూరమల్లుండు-పౌరలోకహృదయభల్లుఁ డగుచు.

వ. ఇట్లుగ్గలంబగు నగ్గలిక డగ్గఱిన మల్లునిం గని, మెల్లన మొల్లంబగు బీరంబు వెల్లిగొన, వల్లవవల్లభుం డుల్లసిల్లి, బాహునాదంబున రోదోంతరాళంబు పూరించి, మించి కవిసె; నిట్లిద్దఱు నుద్దవిడి నున్నతవిషమంబు లగు తాణ లిడి, కరి కరియును, హరి హరియును, గిరి గిరియునుం దాఁకు పోఁకం దలపడి, యితరేతర హేతిహింసితంబులగు దవానలంబుల తెఱంగునఁ, బరస్పరదీర్ఘనిర్ఘాతఘట్టితంబులగు మహాభ్రంబులవిభ్రమంబున, నన్యోన్యతుంగతరంగతాడితంబులగు కల్పాంతకాల సముద్రంబులరౌద్రంబున, రోంతోదుల ముష్టిఘట్టనంబుల ఘట్టితశరీరు లై, [1]దద్దరిలక, డగ్గఱి, గ్రద్దన నయ్యిద్దఱుం దిరుగు నెడ, హరి సొచ్చి పేర్చి యార్చి జెట్టిం బట్టి పడందిగిచి, పాదంబుల జాడించి, సముల్లాసంబున నెసకంబునకు వచ్చిన, మెచ్చి నొచ్చి యచ్చపలుండు మీఱి మోరసాఁచి, తెరలక పొరలం ద్రొబ్బిన నబ్బలానుజుం డుబ్బి, గొబ్బున మేను వర్ధిల్ల, నర్ధాంగకంబున నుండి [2]జానువుల నొత్తుచు, నురవడిం గరవడంబున నున్న, నా దుర్నయుండును "బాల! మేలుమే!" లని లీలం గాలు సార నిచ్చి త్రోచినం, జూచి యేచి, ఖేచరు లగ్గించి యుగ్గడింప, నగ్గోపకుమారుండు పాటవంబునను రాటవంబునకుం జని వెన్నెక్కి నిక్కిన, నక్కంసభటుండు మదజలరేఖాబంధురం బగు గంధసింధురంబు చందంబునఁ, బదంబును బదంబునం, గరంబును గరంబునం గ్రహించి, సహించి వహించి, నైపుణంబున లోపలం దిరిగి, యట్టిట్టు దట్టించిన, దిట్టతనంబునం దిటవు దప్పక యప్పద్మలోచనుండు కేడించి, యేచి, సమతలంబున వైచి, ప్రచండంబగు వాని పిచండంబు లాగించి, కాలంగాలు గీలించి, డొక్కరంబు గొనిన నయ్యభ్యాసి సభ్యులు సన్నుతింపం గ్రమ్మఱించి, జడ్డనం గాలడ్డగించి, రక్షించుకొనిన, నా రక్షోవైరి వానికటిచేలంబు వట్టి యెత్తి, యెత్తి నడుమరాగెయిడి, సందువెట్టి నవ్విన, నవ్విరోధి కాలు కాలిలో నిడి వేధించి, నిరోధించిన, నిరోధంబుఁ బాసి తిరిగి వసుదేవపట్టి పట్టిసంబు గొని దట్టించిన, నుబ్బరికచేసి చాణూరుండు హరికరంబు పట్టి హుమ్మని, నెమ్మొగంబునం గాలిడి మీఁదైనం, గేళిబాలకుండు కాలిం గాల నివారించి, మీఁదై నెగడి యుండనీక, దుర్వారబలంబున విదలించి, లేచి [3]గృహీతపరిపంథిచరణుం డై విపక్షునివక్షంబు వజ్రవజ్రసన్నిభం బగు పిడికిటం బొడిచిన, వాఁడు వాఁడిచెడక విజృంభించి, యంభోరాశిమధ్యంబునం దిరుగు శైలంబుపోలిక నేల జిఱజిఱం దిరిగి తన్నిన,

1. భయపడక. 2. మోకాళ్లు. 3. గ్రహింపఁబడిన శత్రువుయొక్క పాదముగలవాఁడు.

వెన్నుండు కుప్పించి [1]యుప్పరంబెగసి, మీఁద నుఱికిన, నతండు కృష్ణపాద
సంధిపరిక్షిప్తపాదుం డై యెగసి రేచి సముద్ధతుం డయ్యె; నయ్యెడ. 1345

క. బలభద్రుఁడు ముష్టికుఁడును-బలములు మెఱయంగఁ జేసి, బాహాబాహిం
బ్రళయాగ్నులక్రియఁ బోరిరి-వెలయుఁగ బహువిధము లైనవిన్నాణములన్.

వ. ఇవ్విధంబున. 1347

క. వల్లవులు పెనఁగి రున్నత-గల్లులతోఁ, భిన్నదిగిభకరవల్లులతోఁ,
మల్లులతోఁ, [2]రిపుమానస-భల్లులతోఁ, భీతగోపపల్లులతోడన్. 1348

వ. ఆసమయంబునఁ బౌరకాంతలు మూఁకలు గట్టి, వెచ్చ నూర్చుచు, ముచ్చట
లకుం జొచ్చి, తమలో ని ట్లనిరి. 1349

ఉ. "మంచికొమారులం, గుసుమమంజులశరీరులఁ, దెచ్చి; చెల్లరే!
యంచితవజ్రసారులు, మహాద్రికఠోరులు నైన మల్లురం
గ్రించులఁ బెట్టి, రాజు పెనఁగించుచుఁ జూచుచు నున్నవాఁడు; మే
లించుక లేదు; మాను మనఁ; డిట్టిదురాత్ముని మున్న వింటిమే? 1350

క. చూచెదరు గాని, సభికులు-నీచిన్నికుమారకులకు నీమల్లురకున్
ఓచెల్ల! యీడు గా దని-సూచింపరు; పతికిఁ దమకు శోకము గాదే? 1351

సీ. వేణునాళముల మై వెలసిన మాధవుం, డధరామృతము లిచ్చి యాదరించుఁ;
బింఛదామముల మై పెరిఁగిన వెన్నుఁడు, మస్తకంబునఁ దాల్చి మైత్రి నెఱపుఁ;
పీతాంబరముల మై బెరసిన గోవిందుఁ, డంసభాగమునఁ బాయక ధరించు;
వైజయంతికల మై వాలినఁ గమలాక్షుఁ, డతికుతూహలమున నఱుతఁ దాల్చుఁ;
తే. దనరుబృందావనంబునఁ దరుల మైనఁ-గృష్ణుఁ డానందమునఁ జేరి క్రీడ సల్పు;
నెట్టినోముల నయిన మున్నిట్టివిధము-లేల కా మైతి మోయమ్మ! యింక నెట్లు?

ఉ. పాపపుబ్రహ్మ గోపికలపల్లెలలోన సృజింపరాదె? ము
న్నీ పురిలోపలన్ మనల నేల సృజించె? నటైన నిచ్చలుం
[3]జేపడుఁగాదె యీసుభగుఁ జెందెడిభాగ్యము? సంతతంబు నీ
గోపకుమారుఁ బొంద మును గోపకుమారిక లేమి నోఁచిరో? 1353

క. గోపాలకృష్ణుతోడను-గోపాలనవేళలందుఁ గూడి, తిరుగు నా
గోపాలు రెంత ధన్యులొ?-గోపాలుర కైన నిట్టి గురురుచి గలదే? 1354

క. శ్రమజలకణ[4]సిక్తంబై-కమలదళేక్షుణునివదనకమలము మెఱసెన్
హిమజలకణసిక్తంబై-కమనీయం బగుచు నున్న కమలముభంగిన్. 1355

---

1. ఆకాశము. 2. శత్రువులయొక్క మనస్సులకు బాణమువంటివారు. 3. స్వాధీనము అగును. 4. తడుపఁబడినది.

ఆ. సభకుఁ బోవరాదు; సభవారిదోషంబు-నెఱిఁగి యూరకున్న, నెఱుఁగకున్న,
నెఱిఁగి యుండి యైన, నిట్టట్టు వలికినఁ-బ్రాజ్ఞుఁ డైనఁ బొందుఁ బాపచయము."

వ. అని పెక్కండ్రు పెక్కువిధంబులం బలుకుచుండఁ దద్బాహుయుద్ధంబున. 1357

క. ధృతి సెడి, లోఁబడె, మల్లుం-డతులితభవజలధితరికి, హతరిపుపురికిన్,
హితకరికిన్, ధృతగిరికిం-శతహరిరవభరితశిఖరిదరికిన్, హరికిన్. 1358

క. హరికిని, లోఁబడి బెగడక-హరియురము మహోగ్రముష్టి నహితుఁడు పొడువన్
హరి కుసుమమాలికాహత-కరిభంగిఁ, బరాక్రమించెఁ గలహోద్ధతుఁడై. 1359

క. శౌరి నెఱిఁ జొచ్చి, కరములు-సూరిగఁ బట్టి త్రిప్పి, కుంభిని వైచెన్;
శూరుం, గలహగభీరున్-వీరుం, జాణూరు, ఘోరు, వికటాకారున్. 1360

క. శోణితము నోర నొలుకఁగఁ-జాణూరుం డట్లు కృష్ణసంభ్రామణసం
క్షీణుండై, క్షోణిం బడి-ప్రాణంబులు విడిచెఁ గంసుప్రాణము గలఁగన్. 1361

క. బలభద్రుండును లోకులు-బలభద్రుం డనఁగఁ బెనఁగి, పటుబాహుగతిన్
బలభేది మెచ్చఁ, ద్రిప్పెను-బలవన్ముష్టికుని గంసుబలములు బెగడన్. 1362

క. త్రిప్పి నేల వైవ, విగ్గన రక్తంబు-వదనగహ్వరమున వఱదవాఱ,
ముష్టికుండు ఘోరముష్టి సత్త్వము సెడి-కూలె, గాలిఁ దరువు గూలినట్లు.

వ. మఱియును. 1364

ఆ. పాటవమునఁ బలుపిడికిట-గూటిం బడఁబొడిచె, బలుఁడు కోపితఘనబా
హాటోపనృపతికీటుం-గూటున్, వాచాటు, నధికఘోరలలాటున్. 1365

వ. అంత నద్దనుజాంతకుండు చరణప్రహారణంబుల భిన్నమస్తకులం జేసి, వాని
చెలులం గూటతోశలశలుల నంతకాంతికంబున కనిచిన. 1366

క. వల్లవబాలకు లని, మన-మల్లవరులు [3]పెనఁగి, నేఁడు మడిసిరి; వీరల్
బల్లిదులు; తలఁడు; తలఁ; డని-చెల్లాచెదరైరి పాఱి చిక్కిన మల్లుల్. 1367

ఉ. మల్లురఁ జంపి గోపకసమాజములో మృగరాజురేఖ శో
భిల్లఁగఁ, బాదపద్మములఁ బెల్లుగ నందెలు మ్రోయ వచ్చు నా
వల్లవరాజనందనుల వారక చూచి, మహీసురాదు ల
ల్లల్లన సంస్తుతించిరి, ప్రియంబుగఁ గంసుఁడు దక్క నందఱున్. 1368

శ్రీకృష్ణుండు కంసుని వధించుట.

వ. అంత సభాజనంబులకలకలంబు నివారించి, మంత్రులం జూచి, కంసుం డిట్లనియె.

---

1. ఓడ. 2. గుఱిగా. 3. ముట్టుకొనుట, ఆక్రమించుట.

ఉ. "వల్లవబాలురన్ నగరివాకిటికిన్ వెడలంగ ద్రొబ్బుఁడీ;
గొల్లల [1]ముట్టికోల్ గొనుఁడు; క్రూరుని నందునిఁ గట్టుఁడు, దుర్వికిం;
డెల్లము గాఁగ నేఁడు వసుదేవునిఁ జంపుఁడు; తండ్రి గాఁడు; వీఁ
డెల్లవిధంబులం బరుల కిష్టుఁడు; కావకుఁ డుగ్రసేనునిన్." 1370

వ. అని పలుకు సమయంబున. 1371

శా. [2]జంఘాలత్వముతో నగోపరిచరత్సారంగహింసేచ్ఛ ను
ల్లంఘింపన్ గమకించు సింహముక్రియన్ లక్షించి, పౌరప్రజా
సంఘాతంబులు తల్లడిల్ల, హరి కంసప్రాణహింసార్థియై
లంఘించెం *దమగంబుమీఁదికి, రణోల్లాసంబు భాసిల్లఁగన్. 1372

క. తమగమున కెగుర యమస-త్తమగణ్యునిఁ జూచి, ఖడ్గధరుఁడై యెదిరెం,
దమగమువారలు వీరో-త్తమగణవిభుఁ డనఁగఁ గంసధరణీపతియున్. 1373

శా. పక్షీంద్రుం డురగంబుఁ బట్టువిధ మొప్పం, గేశబంధంబు లో
కక్షోభంబుగఁ బట్టి, మౌళిమణు లాకల్పాంతవేళాపత
న్నక్షత్రంబులభంగి రాల, రణసంరంభంబు డిందించి, [3]రం
గక్షోణిం బడద్రొబ్బెఁ గృష్ణుఁడు వెసం గంసున్ నృపోత్తంసునిన్. 1374

శా. మంచాగ్రంబుననుండి రంగధరణీమధ్యంబునం గూలి, యే
సంచారంబును లేక చిక్కి, జను లాశ్చర్యంబునుం బొందఁగాఁ
బంచత్వంబును బొంది, యున్న విమతుం బద్మాక్షుఁ డీడ్చెన్, వడిన్
బంచాస్యంబు గజంబు నీడ్చుపగిదిన్, బాహాబలోల్లాసియై. 1375

క. రోషప్రమోదనిద్రా-భాషాశనపానగతులఁ, బాయక చక్రిన్
దోషరతిఁ జూచి యైన, వి-శేషరుచిం గంసుఁ డతనిఁ జెందె నరేంద్రా! 1376

వ. ఆసమయంబున. 1377

క. గోపాలుఁ డొక్కఁ డద్దిర!-భూపాలకుఁ జంపె; వీనిఁ [4]బొదువుం; డేత
ద్రూపాలస్యము లే? లని,-కోపాలఘురోషు లగుచు దర్పోద్ధతులై. 1378

శా. న్యగ్రోధుండును, గహ్వుఁడున్, మొదలుగా నానాయుధానీకసా
మగ్రిం గంసునిసోదరుల్, గవియుదుర్; మాద్యద్గజేంద్రాభుఁడై
యుగ్రుండై పరిఘాయుధోల్లసితుఁడై యొండొండ చెండాడి శా
లాగ్రక్షోణికిఁ బుచ్చె, రాముఁడు గరీయస్థేముఁడై వారలన్. 1379

వ. అయ్యవసరంబున. 1380

---

1. ఆక్రమించుట. * మంచె. 2. పిక్కబలముతో. 3. యుద్ధభూమి. 4. ఆక్రమింపుఁడు.

క. చేతులఁ దాళము లొత్తుచుఁ-జేతోమోదంబుతోడ, సిగముడి వీడం,
[1]పాతర లాడుచు మింటను-గీతము నారదుఁడు వాడెఁ "గృష్ణా!" యనుచున్.

క. వారిజభవరుద్రాదులు-భూరికుసుమవృష్టిఁ గురిసి, పొగడిరి కృష్ణున్;
భేరులు మ్రోసెను; నిర్జర-నారులు దివి నాడి రధికనటనముల నృపా! 1382

వ. అంతటఁ గంసాదులకాంతలు భర్తృమరణదుఃఖాక్రాంత లై, కరంబుల శిరంబులు మోదుకొనుచు, నశ్రుసలిలధారాపరిషిక్తవదన లై, సదనంబులు వెలువడి వచ్చి, వీరశయ్యానిద్రితు లైన విభులం గౌఁగిలించుకొని, సుస్వరంబుల విలపించి; రందుఁ గంసభార్య లి ట్లనిరి. 1383

సీ. గోపాలసింహంబు గోపించి వెల్వడి, నిను గజేంద్రముభంగి నేఁడు గూల్చె;
యాదవేంద్రానిల మాఖిలజవమున, నిను మహీజముమాడ్కి నేల వ్రాల్చె;
వాసుదేవాంభోధివారి [2]యుద్వేల మై, నినుఁ దీవికై వడి నేఁడు ముంచె;
దేవకీసుతవజ్రి దేవత లలరంగ, నినుఁ గొండక్రియ నేఁడు నిహతుఁ జేసె;
తే. హా మనోనాథ! హా వీర! హా మహాత్మ!
హా మహారాజ! నీ విట్లు హతుఁడ వైన,
మనుచు నున్నార; మక్కట! మమ్ముఁ బోలు
కఠినహృదయలు జగతిపైఁ గలరె యెందు! 1384

క. [3]భూతముల కెగ్గు సేసిన-భూతంబులు నీకు నెగ్గు పుట్టించె; వృథా
భూత మగు మనికి యెల్లను-భూతద్రోహికిని శుభము పొంద దధీశా! 1385

క. గోపాలకృష్ణుతోడను-భూపాలక! మున్ను తొడరి పొలిసినవారిన్
నీపాల బుధులు సెప్పరె?-కోపాలస్యములు విడిచి కొలువం దగదే? 1386

వ. అని విలపించుచున్న రాజవల్లభల నూఱార్చి, జగద్వల్లభుం డైన హరి కంసాదులకుం బరలోకసంస్కారంబులు సేయం బనిచి, దేవకీవసుదేవుల బంధనంబు విడిపించి, బలభద్రసహితుం డై వారలకుం బ్రణామంబులు సేసిన. 1387

మ. కని, "లోకేశులు గాని, వీరు కొడుకుల్ గా;" రంచుఁ జిత్తంబులన్
జనయిత్రీజనకుల్ విచారపరు లై శంకింపఁ, గృష్ణుండు దా
జనసమ్మోహిని యైన మాయఁ [4]దదభిజ్ఞానంబు వారించి, యి
ట్లనియెన్ సాగ్రజుఁ డై, మహావినతుఁ డై, యానందసంధాయి యై. 1388

శ్రీకృష్ణుఁడు దేవకీవసుదేవులచెఱ మాన్పి యుగ్రసేనునికిఁ బట్టంబు గట్టుట

సీ. మమ్ముఁ గంటిరి; గాని, మాబాల్యపౌగండకైశోరవయసులఁ గదిసి, మీర
లెత్తుచు, దించుచు, నెలమి మన్నించుచు, నుండుసౌభాగ్యంబు నొంద రైతి;

---

1. నాట్యముచేయుచు. 2. హద్దుమీఱినదై. 3. ప్రాణులు. 4. వారికిఁగలగుర్తును, (తెలివిని).

రాకాంక్ష గలిగియు, నది దైవయోగంబు; తల్లిదండ్రులయొద్దఁ దనయు లుండి,
రే యవసరమున నెబ్భంగి లాలితు లగుచు. వర్ధిల్లుదు; రట్టిమహిమ

తే. మాకు నిన్నాళ్లు లే దయ్యెఁ; మఱియు వినుఁడు;
నిఖిలపురుషార్థహేతు వై! నెగడుచున్న
మేని కెవ్వార లాఘ్యులు? మీర కారె?
యాఋణము దీర్ప నూఱేండ్ల కైనఁ జనదు. 1389

క. చెల్లుబడి గలిగి యెవ్వఁడు-తల్లికిఁ దండ్రికిని దేహధనముల వృత్తుల్
చెల్లింపఁ; డట్టికష్టుఁడు-ప్రల్లదుఁ; డామీఁద [1]నాత్మపలలాశి యగున్. 1390

క. జననీజనకుల వృద్ధులఁ-దనయుల గురువిప్రసాధుదారాదుల, నే
జనుఁడు ఘనుఁ డయ్యుఁ బ్రోవక-వనరును; జీవన్మృతుండు వాఁడు ధరిత్రిన్.

వ. అదియునుం గాక. 1392

శా. కారాశాలల మానిమిత్తము మిముం గంసుండు గారింపఁగా,
వారింపంగ సమర్థతల్ గలిగియున్, వారింపఁగా రాక, ని
ష్కారుణ్యాత్ముల మైన కూరులల, మహాకౌటిల్యసంచారులన్,
సారాతిక్షములార! మమ్ముఁ గొఱఁతల్ సైరించి, రక్షింపరే!'' 1393

వ. అని యిట్లు మాయామనుష్యుం డైన హరి పలికినపలుకులకు మోహితు లై,
వారల నంకపీఠంబుల నిడుకొని, కౌఁగిలించుకొని, వారివదనంబులు కన్నీటం
దడుపుచుఁ, బ్రేమపాశబద్ధు లై దేవకీవసుదేవు లూరకుండి; రంత వాసు
దేవుండు మాతామహుం డైన యుగ్రసేనుం జూచి. 1394

చ. ''అనఘ! యయాతిశాపమున యాదవవీరులకున్ నరేశ్వరా
సనమున నుండరాదు; నృపసత్తమ! రాజవు గమ్ము; భూమి కే
నినుఁ గొలువంగ నిర్జరులు నీ [2]కరిఁ బెట్టుదు; రన్యరాజులం
బనిగొను టెంత? రమ్ము; జనపాలనశీలివి గమ్ము వేడ్కతోన్.'' 1395

వ. అని పలికి. 1396

క. మన్నించి రాజుఁ జేసెను-వెన్నుఁడు [3]సత్యావధాను, విశ్రుతదానున్
సన్నుతమానున్, గదన-చ్ఛిన్నాహితసేను, నుగ్రసేనున్, దీనున్. 1397

వ. తదనంతరంబ తొల్లి కంసభీతులై విదేశంబులం గృశించుచున్న యదువృష్ణి
భోజమరుదశార్హకుకురాంధకప్రముఖు లగు సకలజ్ఞాతిసంబంధులను రావించి,
చిత్తంబు లలర విత్తంబు లిచ్చి, వారివారినివాసంబుల నుండ నియోగించె;
నివ్విధంబున. 1398

1. తన మాంసమునే తినునట్టివాఁడు. 2. కప్పము కట్టుదురు. 3. సత్యమునందే నిలుకడగలవాఁడు.

క. మధుసూదనసత్కరుణా-మధురాలోకనవిముక్తమానసభయులై,
మధురవచనములఁ దారును-మధురానగరంబుప్రజలు మనిరి నరేంద్రా! 1399

వ. అంత నొక్కనాఁడు సంకర్షణసహితుండై, నందునిం జేరి గోవిందుం డిట్లనియె.

శా. "తండ్రిం జూడము; తల్లిఁ జూడము; యశోదాదేవియుం నీవు మా
తండ్రిం దల్లియు నంచు నుండుదుము; సద్ధర్మంబులం దొల్లి మే
తండ్రుల్ బిడ్డల నిట్లు పెంచిరి? భవత్సౌజన్యభావంబులం
దండ్రీ! యింతటివార మైతిమి గదా! తత్తద్వయోలీలలన్. 1401

ఉ. ఇక్కడ నున్న బాంధవుల కెల్లను సౌఖ్యము సేసి, వత్తు మే
మక్కడికిం; మదీయులకు నందఱకుం వినిపింపు మయ్య! నే
మెక్కడ నున్న, మాకు మది నెన్నఁడుఁ బాయవు, మీ[1] వ్రజంబులో
మక్కువతోడ మీరు కృప మా కొనరించు క్రియావిశేషముల్." 1402

వ. అని పలికి, వస్త్రభూషణాదు లొసంగి, సాదరంబుగం గౌఁగిలించుకొని, గోవిందుం డనిచిన, నందుండు [2]ప్రణయవిహ్వలుండై బాష్పజలపూరితలోచనుం డగుచు, వల్లవులుం దానును వ్రేపల్లెకుం జనియె; నంత. 1403

క. గర్గాదిభూసురోత్తమ-వర్గముచే నుపనయనము వసుదేవుఁడు స
న్మార్గంబునఁ జేయించెను-నిర్గర్వచరిత్రులకును, నిజపుత్త్రులకున్. 1404

క. ద్విజరాజవంశవర్యులు-ద్విజరాజముఖాంబుజోపదిష్టవ్రతులై
ద్విజరాజత్వము నొందిరి-ద్విజరాజాదికజనంబు దీవింపంగన్. 1405

వ. ఉపనయనానంతరంబున వసుదేవుండు బ్రాహ్మణులకు [3]సదక్షిణంబుగా ననేక గోహిరణ్యాదిదానంబు లొసంగి, తొల్లి రామకృష్ణులజన్మసమయంబులందు నిజమనోదత్తలైన గోవుల నుచ్చరించి, యిచ్చి, కామితార్థంబుల నర్థులకుం బెట్టె; నిట్లు బ్రహ్మచారులై. 1406

శా. "ఉర్విం మానవు లెవ్వరైన గురువాక్యోద్యుక్తులై కాని, త
త్పూర్వారంభము సేయఁ బోల;" దనుచుం బోధించు చందంబునం
సర్వజ్ఞత్వముతో జగద్గురువులై, సంపూర్ణులై యుండియుం,
గుర్వంగీకరణంబు సేయఁ జని రా గోవిందుఁడుం, రాముఁడున్. 1407

వ. చని, మహావైభవరాశియైన కాశిం జేరి, తత్తీరంబున [4]నవంతీపురనివాసియు, సకల విద్యావిలాసియునైన సాందీపని యను బుధవర్యునిం గని, యథోచితంబుగ దర్శించి, శుద్ధభావవర్తనంబుల భక్తి సేయు చుండ, వారలవలన సంతుష్టుం డై.

1. గొల్లపల్లెయందు. 2. ప్రేమచేఁ గలఁతనొందినవాఁడై. 3. దక్షిణలతోఁ గూడునట్లుగా. 4. ఉజ్జయినీపట్టణము.

శా. వేదశ్రేణియు, సంగకంబులు, ధనుర్వేదంబుఁ, దంత్రంబు, మ
న్వాదివ్యాహృతధర్మశాస్త్రములు, నుద్యన్న్యాయముం, దర్కవి
ద్యాదక్షత్వము, రాజనీతియును, షడ్గప్రక్రియం జెప్పె నా
భూదేవాగ్రణి, రామకృష్ణులకు సంభూతప్రమోదంబునన్. 1409

క. అఱువదినాలుగువిద్యలు-నఱువదినాలుగుదినంబు లంతన, వారల్
నెఱవాదులైన కతమున-నెఱి నొక్కొకనాఁటివినికి నేర్చి రిలేశా! 1410

క. గురువులకు నెల్ల గురులై-గురులఘుభావములు లేక కోమ రొందు జగ
ద్గురులు, త్రిలోకహితార్థము-గురుశిష్యన్యాయలీలఁ గొలిచిరి వేడ్కన్. 1411

వ. ఇట్లు కృతకృత్యులైన శిష్యులం జూచి, వారలమాహాత్మ్యంబునకు వెఱఁగు
పడి, సభార్యుండైన సాందీపని యి ట్లనియె. 1412

శా. "అంభోరాశిఁ బ్రభాసతీర్థమున మున్నస్మత్తనూసంభవుం
డంభోగాహము సేయుచుఁ మునిఁగి, లేఁ డయ్యెం; గృపాంభోనిధుల్,
శుంభద్వీర్యులు, మీరు; మీగురునికిం జోద్యంబుగా [1]శిష్యతఁ
గాంభీర్యంబునఁ బుత్రదక్షిణ యిడం గర్తవ్య మూహింపరే! 1413

క. శిష్యులు బలాఢ్యులైన, వి-శేష్యస్థితి నొంది గురువు జీవించును; ని
ర్దూష్యగుణబలగరిష్ఠులు-శిష్యులరై గురునికోర్కి సేయం దగదే?" 1414

వ. అనిన విని, రామకృష్ణులు [2]గుర్వర్థంబుగా దుర్వారరథారూఢులై రయంబునం
జని, రౌద్రంబున సముద్రంబుఁ జేరి యిట్లనిరి. 1415

క. "సాగర! సుబుద్ధితోడను-మాగురుపుత్రకునిఁ దెమ్ము; మాఱాడిన నీ
వాగడ మవుదువు దుస్సహ-వేగరణాభీలనిశితవిశిఖాగ్నులకున్." 1416

వ. అనిన వారలకు జలరాశి యి ట్లనియె. 1417

ఉ. "వంచన యింత లేదు; యదువల్లభులార! ప్రభాసతీర్థమం
దంచితమూర్తి విప్రసుతుఁ డార్యుఁడు [3]తోయము లాడుచుండ, ను
త్సంచలితోర్మి యొక్కటి ప్రచండగతిం గొనిపోయెఁ; బోవఁగాఁ
బంచజనుండు మ్రింగె, నతిభాసురశీలుని, విప్రబాలునిన్." 1418

వ. అని వానివసియించుచో టెఱింగించిన. 1419

శా. శంఖారావతోడఁ బంచజనుఁడుఁ శంకించి, చిత్తంబులో
సంఖిన్నుండుగ, వార్ధిఁ జొచ్చి, దహనజ్వాలాభహేమోజ్జ్వల
త్పుంఖాస్త్రంబునఁ గూల్చి, వానిజఠరంబుఁ వ్రచ్చి, గోవిందుఁ డ
ప్రేంఖచ్చిత్తుఁడు బాలుఁ గానక గురుప్రేమోదితోద్యోగుఁ డై. 1420

1. శిష్యులయొక్క మర్యాదతో. 2. గురువుయొక్క ప్రయోజనముకొఱకు. 3. స్నానముచేయు.

క. దానవుని దేహజం బగు-మానితశంఖంబుఁ గొనుచు, మసలక బలుఁడుం
  దో నేతేరఁగ, రథి యై-దానవరిపుఁ డరిగె దండధరుపురికి నృపా! 1421

వ. చని సంయమనీనామనగరంబుఁ జేరి, తద్ద్వారంబునఁ బ్రళయకాలమేఘగంభీర
  నినదభీషణం బగు శంఖంబు పూరించిన, విని, వెఱఁగుపడి. 1422

శా. "అస్మద్బాహుబలంబుఁ గైకొనక శంఖారావముల్ మానసా
  పస్మారంబుగ నెవ్వఁ డొక్కొ నగరప్రాంతంబునం జేసె? మ
  ద్విస్మేరావహరోషపావకునిచే విధ్వస్తుఁ డై వాఁడు దా
  భస్మం బై చెడు" నంచు నంతకుఁడు కోపప్రజ్వలస్ఫూర్తి యై. 1423

వ. వచ్చి రామకృష్ణులం గని, వారు లీలామనుష్యు లయినవిష్ణుమూర్తు లని యెఱింగి,
  భక్తితోడం బూజ చేసి, సర్వభూతమయుం డగు కృష్ణునకు నమస్కరించి,
  "యేమి సేయుదు? నాన తి"మ్మనిన నమ్మహాత్ముం డి ట్లనియె. 1424

క. "చెప్పెద; మాగురునందనుఁ-దప్పు గలుగఁ జూచి, నీవు దండనమునకున్
  దెప్పించినాఁడ; వాతని-నొప్పింపుము; మాకు వలయు నుత్తమచరితా!" 1425

క. అనిన విని, "వీఁడె; వీనిం-గొనిపొం" డని భక్తితోడ గురునందను ని
  చ్చినఁ, గృష్ణుఁడువీడ్కొనియెను-ఘనదుర్జనదమనుఁ, మహిషగమనున్, శమనున్.

వ. ఇట్లు జము నడిగి తెచ్చి రామకృష్ణులు సాందీపనికిం బుత్త్రుని సమర్పించి,
  యింక నేమి సేయవలయు నానతిం డనిన నతం డి ట్లనియె. 1427

క. "గురునకుఁ గోరినదక్షిణఁ-గరుణన్ ము న్నెవ్వఁ డిచ్చె? ఘనులార! భవ
  ద్గురునకుఁ గోరినదక్షిణ-దిరముగ నిచ్చితిరి, మీరు దీపితయశు లై. 1428

క. కాలునివీటికిఁ జని మృత-బాలకుఁ దే నొరులవశమె? భవదీయకృపన్
  మేలు దొరకొనియె మాకు; వి-శాల మగుం గాత! మీయశము లోకములన్.

వ. మహాత్ములారా! యేను కృతార్థుండ నైతి"నని దీవించిన, సాందీపనిని వీడ్కొని
  కృతకృత్యు లై రామకృష్ణులు రథారోహణంబు చేసి, మథురకుం జనుదెంచి,
  పాంచజన్యంబు పూరించినఁ గని, నష్టధనంబులు గనినవారిభంగిం బ్రజలు
  ప్రమోదించి; రంత నొక్కనాఁ డేకాంతంబున. 1430

### శ్రీకృష్ణుండు గోపకాంతలచెంతకు నుద్ధవునిఁ బంపుట

శా. "నాపైఁ జిత్తము లెప్పుడున్ నిలుపుచున్, నారాకఁ గాంక్షించుచున్,
  నాపేరాత్మల నావహించుచు, వగన్ నానాప్రకారంబులన్
  గోపాలాంగన లెంతజాలిఁ బడిరో? కోపించిరో? దూఱిరో?
  త్రేపల్లెన్ నిజధర్మ. గేహములలో విభ్రాంతచైతన్య లై." 1431

వ. అని చింతించి. 1432

క. సిద్ధవిచారు, గభీరున్-వృద్ధవచోవర్ణనీయు, వృష్ణిప్రవరున్,
బుద్ధినిధి, నమరగురుసము-నుద్ధవునిం జూచి కృష్ణుఁ డొయ్యన పలికెన్. 1433

శా. ''రమ్మా! యుద్ధవ! గోపకామినులు నా రాకల్ నిరీక్షించుచున్
సమ్మోహంబున నన్నియున్ మఱచి, యేచందంబునం గుందిరో?
తమ్మున్ నమ్మినవారి [1]జిగ్గవిడువన్ ధర్మంబు గా దండ్రు; వే
ఘామ్మా! ప్రాణము లేక్రియన్ నిలిపిరో, ప్రోద్యద్వియోగాగ్నులన్.? 1434

క. ''లౌకిక మొల్లక, న న్నా-లోకించు ప్రపన్నులకును లోఁబడి, కరుణా
లోకనములఁ బోషింతును-నాకాశ్రితరక్షణములు నైసర్గికముల్. 1435

క. సందేహము మానుం; డర-విందాననలార! మిమ్ము విడువను; వత్తున్;
బృందావనమున కని, హరి-సందేశము వంపె'' ననుము సంకేతములన్. 1436

వ. అని మందహాససుందరవదనారవిందుం డై, కరంబు కరంబున నవలంబించి, సరస
వచనంబు లాడుచు వీడుకొలిపిన, నుద్ధవుండును రథారూఢుం డై సూర్యాస్తమ
యసమయంబునకు [2]నందవ్రజంబు సేరి, వనంబులనుండ వచ్చుగోవులచరణరేణు
వులం [3]బ్రచ్ఛన్నరథుం డై మెచ్చి, నందుమందిరంబు ప్రవేశించిన. 1437

శా. ఆపుణ్యాత్మునిఁ గౌఁగిలించుకొని, నందాభీరుఁ డానంది యై,
మాపాలింటికిఁ గృష్ణుఁ డితఁ డనుచున్ మన్నించి, పూజించి, వాం
ఛాపూర్ణంబుగ [4]మంజులాన్న మిడి, మార్గాయాసముం బాపి, స
ల్లాపోత్సాహముతోడ ని ట్లనియె సంలక్షించి మోదంబునన్. 1438

క. ''నామిత్త్రుఁడు వసుదేవుఁడు-సేమంబున నున్నవాఁడె? చెలువుగఁ బుత్త్రుల్
సేమంబున సేవింప, మ-హామత్తుం డైన కంసుఁ డడఁగినపిదపన్. 1439

శా. అన్నా! భద్రమె? తల్లిదండ్రుల మమున్ హర్షించి చింతించునే?
తన్నుం బాసిన గోపగోపికల, మిత్రవ్రాతమున్, గోగణం
బు న్నిత్యంబుఁ దలంచునే? వననదీభూముల్ ప్రసంగించునే?
వెన్నుం డెన్నఁడు వచ్చునయ్య యిటు మావ్రేపల్లెకు న్నుద్ధవా! 1440

క. అంకిలి కలుగక, మాకక-లంకేందునిపగిదిఁ గాంతిలలితం బగు త
త్పంకజనయనునినెమ్మొగ-మింక విలోకింపఁ గలదె యీ జన్మమునన్.?'' 1441

క. అని హరి మున్నొనరించిన-పను లెల్లను జెప్పి చెప్పి. బాష్పాకులలో
చనుఁ డై, [5]డగ్గుత్తికతో-వినయంబున నుండె గోపవీరుం; డంతన్. 1442

1. త్రోసిపుచ్చుట, వదలిపెట్టుట. 2. నందునిగొల్లపల్లె. 3. కప్పఁబడిన రథముగల వాఁడు.
4. మనోహరమగు భోజనము. 5. వణఁకుచున్నట్టి గొంతుకతో.

క. పెనిమిటి బిడ్డనిగుణములు-వినుతింప, యశోద ప్రేమవిహ్వలమతియై
చనుమొనలఁ బాలు గురియఁగఁ-గనుఁగొనలను జలము లొలుకఁగా జెగ్గిలియెన్.

వ. ఇట్లు గోవిందసంకీర్తనాభావవిహ్వలులైన యశోదానందులకు నుద్ధవుం డిట్లనియె. 1444

క. "జననీజనకుల మిమ్ముం-గనుఁగొన శీఘ్రంబె వచ్చుఁ; గని భద్రంబుల్
వనజాక్షుం డొనరించును-మనమున వగవకుఁడు ధైర్యమండనులారా! 1445

మ. బలుఁడుం గృష్ణుఁడు మర్త్యులే? వసుమతీభారంబు వారింప వా
రల రూపంబులఁ బుట్టినాఁడు హరి నిర్వాణప్రభుం; డెవ్వఁ డు
జ్జ్వలుఁడై ప్రాణవియోగకాలమునఁ దత్సర్వేశుఁ జింతించు;, వాఁ
డలఘుశ్రేయముఁ బొందు బ్రహ్మమయుఁడై [1]యర్కాభుఁడై నిత్యుఁడై.

సీ. అట్టినారాయణుం డఖిలాత్మభూతుండు కారణమానవాకారుఁడైనఁ
జిత్తంబు లతనిపైఁ జేర్చి సేవించితి; రతికృతార్థుల రైతి; రనవరతము
శోభిల్లు నింధనజ్యోతిచందంబున, నఖిలభూతములందు నతఁ; డతనికి
జననీజనకదారసఖిపుత్రబాంధవశత్రుప్రియాప్రియజనులు లేరు;

ఆ. జన్మకర్మములును జన్మంబులును లేవు-శిష్టరక్షణంబు సేయుకొఱకు
గుణవిరహితుఁ డయ్యు, గుణి యయి సర్వర-క్షణవినాశకేళి సలుపుచుండు."

వ. అని మఱియుఁ బెక్కువిధంబుల హరిప్రభావంబు లుపన్యసించుచు, నా రేయి
గడపి, మఱునాఁడు దధిమథనశబ్దంబు లాకర్ణించుచు లేచి, కృతానుష్ఠానుం డై
యుద్ధవుం డొక్కరహస్యప్రదేశంబున నున్నసమయంబున. 1448

శా. రాజీవాక్షుఁడు సుందరాస్యుఁడు, మహోరస్కుండు, పీతాంబరుం,
డాజానుస్థితబాహుఁ, డంబురుహమాలాలంకృతుం, డుల్లస
ద్భ్రాజత్కుండలుఁ డొక్కవీరుఁ డిచటన్ రాజిల్లుచున్నాఁడు; మా
రాజీవాక్షునిభంగి నంచుఁ గని రారాజాన్వయుల్ గోపికల్." 1449

వ. కని లజ్జాసహితహాసవిలోకనంబులు ముఖంబులకుం జెలు వొసంగ ని ట్లనిరి.

భ్ర మ ర గీ త ము

చ. "ఎఱుఁగుదు మేము నిన్ను; వనజేక్షణమిత్రుఁడ వీవు; కూరిమిన్
మెఱయుచుఁ దల్లిదండ్రులకు మే లెఱిఁగింపఁ బ్రియుండు పంపఁగా
వఱలెదుభక్తి వచ్చితివి; వారల నైన మనంబులోపలన్
మఱవఁడు శౌరి; మేలు! మఱి మాన్యులు రాజున కెవ్వ రిచ్చటన్? 1451

1. సూర్యునియొక్క కాంతివంటి కాంతిగలవాఁడు.

క. మునివరు లైనను, బంధుల-ఘనసఖ్యము విడువ లేరు, గాక విడువరే?
సనిమిత్తసఖ్య; మూఁకటి-పని దీఱిన [1]సళులు విరులఁ బాయునొ లేదో?" 1452

చ. అని యిటు గోపికల్ వలుక, నం దొకగోపిక కృష్ణపాదచిం
తనమునఁ జొక్కి, చేరువను దైవవశంబునఁ గాంచె నుజ్జ్వల
త్సునిశితసద్వివేకముఁ, బ్రసూనమరందమదాతిరేకమున్,
ఘనమృదునాదసంచలితకాముకలోకముఁ, జంచరీకమున్. 1453

వ. కని హరి తన్నుం బ్రార్థింపఁ బుత్తెంచినదూత యని కల్పించుకొని, యుద్ధవునికి
నన్యాపదేశం బై యొఱుకపడ నయ్యళికిం దొయ్యలి యి ట్లనియె. 1454

మ. "భ్రమరా! దుర్జనమిత్ర! ముట్టకుము మాపాదాబ్జముల్; నాగర
ప్రమదాళీకుచకుంకుమాంకితలసత్ప్రాణేశదామప్రసూ
నమరందారుణితాననుండ వగుటన్, నాథుండు మన్నించుఁ గా
క! మము న్నేఁపుచుఁ బౌరకాంతలశుభాగారంబులన్ నిత్యమున్. 1455

మ. ఒకపువ్వుంబలితేనెఁ ద్రావి, [2]మధుపా! యుత్సాహివై నీవు వే
ఱొకటిం బొందెడుభంగి, మ మ్మధర[3]పీయూషంబునం దేల్చి, మా
యకలంకోజ్జ్వలయౌవనంబు గొని, యన్యాసక్తుఁ డయ్యెన్ విభుం;
డకటా! యాతని కెట్లు దక్కె సిరి? మిథ్యాకీర్తి నమ్మెం జుమీ! 1456

శా. భృంగా! కృష్ణుఁడు మంచివాఁ డనుచు సంప్రీతిం బ్రశంసించె; దీ
సంగీతంబున నేము సొక్కుదుమె? తచ్చారిత్రముల్ వింతలే?
యంగీకారము గావు మాకుఁ; బురకాంతాగ్రప్రదేశంబులన్
సంగీతం బొనరింపు; వా రిడుదు రోజ న్నీకు నిష్టార్థముల్. 1457

మ. సమదాళీశ్వర! చూడు ముజ్జ్వలితహాసభ్రూవిజృంభంబులన్,
రమణీయుం డగు శౌరిచేఁ గరఁగరే రామల్ త్రిలోకంబులం?
బ్రమదారత్నము లక్ష్మి యాతనిపదాబ్జాతంబు సేవింప, ని
క్కము, నే మెవ్వర మాకృపాజలధికిం గారుణ్యముం జేయఁగన్? 1458

శా. రోలంబేశ్వర! నీకు దౌత్యము మహారూఢంబు; నీనేరుపుల్
చాలున్; మచ్చరణాబ్జముల్ విడువు; మస్మన్నాథపుత్రాదులన్
లీలం బాసి, పరంబు డించి, తనకున్ [4]లీనత్వముం బొందుమ
మ్మేలా పాసె విభుండు? ధార్మికులు ము న్నీచందముల్ మెత్తురే? 1459

శా. వాలిం జంపెను వేఁటకానిపగిదిన్; వంచించి దైత్యానుజన్
లోలం బట్టి విరూపఁ జేసెను; బలిన్ లోభంబుతోఁ గట్టి యా

1. తుమ్మెదలు. 2. తుమ్మెదా! 3. అమృతము. 4. లోఁబడిపోవుట.

త్రైలోక్యంబు [1]మొఱంగి పుచ్చుకొనిరే; ధర్మజ్ఞుఁడే మాధవుం
డేలా పట్టెడ! యెగ్గు మావలన; నీ కెగ్గింపఁగా నేటికిన్? 1460

ఉ. పన్నగ మింటిపై కెగసి, పాఱువిహంగము లైన వీనులం
దన్నొకమాట విన్న; గృహదారసుతాదులఁ బాపి, విత్తసం
పన్నత డించి, సంసరణపద్ధతిఁ బాపెడువాఁడు, నిత్యకాం
తు [2]న్నెఱి నున్న మాబ్రదుకు నైఁచునె? యేల మధువ్రతోత్తమా! 1461

మ. కమనీయం బగు వేఁటకానిపలు కాకర్ణించి, నిక్కంబుగాఁ
దమచిత్తంబులఁ జేర్చి, చేరి, హరిణుల్ తద్బాణనిర్భిన్నలై,
యమితోగ్రవ్యథ నొందుభంగి హరిమాయాలాపముల్ నమ్మి, దుః
ఖములం జెందితి, మంగజాస్త్రజనితోగ్రశ్రాంతి నిందిందిరా! 1462

ఉ. బంధుల, బిడ్డలన్, మగల, భ్రాతలఁ దల్లులఁ, దండ్రులన్, మనో
జాంధతఁ జేసి డించి, శర ణందినమమ్ము వియోగదుర్దశా
సింధువులోనఁ ద్రోచి, యిటు సేరక పోవుట పాడి గాదు; పు
ష్పంధయ! మీయధీశునకుఁ బాదములం బడి యొత్తి చెప్పవే. 1463

సీ. కాంచనరత్నసంఘటితసౌధంబులే, మాకుటీరంబులు మాధవునకు?
వివిధనరేంద్రసేవితరాజధానియే, మాపల్లె యదువంశమండనునకు?
సురభిపాదపలతాశోభితారామమే, మాయరణ్యము సింహమధ్యమునకుఁ?
గమనీయలక్షణగజతురంగంబులే, మాధేనువులు కంసమర్దనునకు?

తే. రూపవిభ్రమనైపుణరూఢ లైన
మగువలమె మేము మన్మథమన్మథునకు?
నేల చింతించు మముఁ? గృష్ణుఁ డేల తలఁచుఁ?
బృథివి నధిపులు నూతనప్రియులు గారె?" 1464

వ. అని మఱియు నిట్లనేకవిధంబులఁ గృష్ణసందర్శన[3]లాలస లయి, పలుకుచున్న గోపికలవచనంబులు విని, యుద్ధవుండు మధురాలాపంబుల నూరార్చుచు నిట్లనియె. 1465

మ. "జపదానవ్రతహోమసంయమతపస్స్వాధ్యాయముఖ్యంబులన్
నిపుణుల్ గోరియు, నే విభున్ మనముల న్నిల్పంగలే; రట్టిస
ద్విపులాకారునిపై, మహామహిముపై, విశ్వేశుపై మీ కజ
స్రపటుధ్యానము లిట్లు నిల్చునె? భవచ్చారిత్రముల్ చిత్రముల్. 1466

1. వంచనచేసి. 2. సంపూర్ణముగా. 3. ఆసక్తిగలవారు.

క. నను మీకడకుం గృష్ణుఁడు-పని పంపెడు వేళఁ బిలిచి, పలికిన పలుకుల్
విను; డన్నియు వివరించెద;-వనజేక్షణలార! మీరు వగవకుఁ డింకన్." 1467

వ. అని హరివచనంబులుగా నిట్లనియె. 1468

సీ. "ఎల్లకార్యములకు నేను బ్రధానకారణము గావున, మీకు రమణులార!
కలుగదు మద్వియోగము; చరాచరరూపములలో మహాభూతములు వసించు
కరణి నుండుదు సర్వగతుఁడ నై; నే మనఃప్రాణబుద్ధిగుణేంద్రియాశ్రయుండ;
నాత్మయం దాత్మచే నాత్మఁ బుట్టింతు; రక్షింతును; ద్రుంతు; హృ[1]షీకభూత
తే. గుణగణాకార మాత్మకుఁ గొమరుమిగులు;
నిబిడమాయానుభవమున నిత్యశుద్ధ
మాత్మ విజ్ఞానమయము నై, యమరు గుణముఁ
బ్రకృతికార్యమనోవృత్తిఁ బట్టి పొందు. 1469

చ. కలఁ గని లేచి, మున్ను గలఁ గన్నసమస్తవిధంబుఁ గల్లగాఁ
దలఁచినభంగి, మానసపదార్థముచే నిఖిలేంద్రియార్థముల్
బలమునఁ గట్టి, [2]తజ్జ్ఞుఁడు ప్రపంచము లే దనుఁ; దన్మనంబుఁ దా
రలయక కట్టుడుక్క; బుధుల కవ్వల నొండొకభేద మున్న దే? 1470

ఆ. సాంఖ్యయోగనిగమసత్యతపోదమ-ములు, మనోనిరోధమును, గడపల
గాఁగ నుండు; జలధికడపలగాఁ గల-నదులభంగి నళిననయనలార! 1471

మ. చెలువల్ దవ్వుల నున్న వల్లభులపైఁ జిత్తంబులం గూర్తు రు
త్కలికం; జేరువవారికంటె నదియుం గా, కెప్పుడు న్నన్ను మీ
రలు చింతించుచు నుండఁగోరి, యిటు [3]దూరస్థత్వముం బొందితిం;
దలఁకం బోలదు; నన్నుఁ గూడెదరు నిత్యధ్యానపారీణ లై." 1472

వ. అని మీకుం జెప్పు మని కృష్ణుండు సెప్పె; ననవుడు నుద్ధవునికిం గోపికలు సం
తసించి యిట్లనిరి. 1473

ఉ. "ఇమ్ముల నున్నవాఁడె హరి? యిక్కడి కెన్నఁడు వచ్చు? వచ్చి మా
యుమ్మలికంబు వాపునె? ప్రియుం డిట వచ్చెద నన్న నైఁతురే
యమ్మధురాపురీరమణు? లడ్డము వత్తురు గాక; చెల్లరే!
మమ్ము విధాత నిర్దయుఁడు మన్మథవేదనపాలు సేసెనే! 1474

చ. మఱచు నొకో? మదిం దలఁచి మాధవుఁ డాయమునాతటంబునం
దఱచుగ దివ్యసౌరభలతాగృహసీమల నేము డాఁగఁగా,

1. ఇంద్రియములు. 2. తెలివిగలవాఁడు. 3. దూరముగానుండు భావమును.

[1]మఱువులనుండి నీడలకు మ మ్మెలయించి, కలంచి, దేహముల్
మఱచినఁ, దేర్చి నూల్కొలిపి, మన్మథలీలలఁ దేల్చుచందముల్. 1475

శా. నీతో నర్మగృహంబులం బలుకునే? నే మెల్ల వంశోల్లస
ద్గీతభ్రాంతల మై కళిందతనయాతీరంబునం జేరినం
జేతోజాతసుఖంబులం దనిపి, నూచి త్రస్థితుల్ చూడ శ్రీ
లాతంత్రజ్ఞత దాఁగి, మెల్లన మదాలాపంబు లాలించుటల్. 1476

క. ముచ్చటవేళలఁ జెప్పనె-యచ్చుగ మును నేము నోమునప్పుడు, జలముల్
సొచ్చినమాచేలంబులు-మ్రుచ్చిలి, యిచ్చినవిధంబుమాలం జెల్లన్? 1477

శా. ఏకాంతంబున నీదుపై నొరగి, తా నే మేని భాషించుచో,
మాకాంతుండు వచించునే, [2]రవిసుతామధ్యప్రదేశంబునన్
రాకాచంద్ర[3]మయూఖముల్ మెఱయఁగా, రాసంబు మాతోడ నం
గీకారం బొనరించి బంధనియతిం గ్రీడించువిన్నాణముల్? 1478

సీ. తనుఁ బాసి యొక్కింతతడవైన నిటమీఁద, నేలపై మేనులు నిలువ వనుము;
నేలపై మేనులు నిలువక యటమున్న, ధైర్యంబు లోక్కటఁ దలఁగు ననుము;
ధైర్యంబు లొక్కటఁ దలఁగినపిమ్మటఁ, జిత్తంబు లిక్కడఁ జిక్క వనుము;
చిత్తంబు లిక్కడఁ జిక్కక వచ్చినఁ, బ్రాణంబు లుండక పాయు ననుము;
తే. ప్రాణములుపోవ మఱివచ్చి ప్రాణవిభుఁడు-ప్రాణిరక్షకుఁడగు తన్నుఁబ్రాణులెల్లఁ
జేరి, దూఱంగ మఱి యేమి సేయువాఁడు?-వేగ విన్నప మొనరింపవే మహాత్మ!

క. తగులరె మగలను మగువలు?-దగులదె తను మున్న కమల? దగవు విడిచియుం
దగిలినమగువల విడుచుట-దగుఁ; దగ; దని, తగవు పలుకఁ దగుదువు హరికిన్.

సీ. విభుఁడు మాప్రేమపల్లెవీథుల నేతేరఁ, జూతుమే యొకనాఁడు చూడ్కు లలరఁ?
బ్రభుఁడు మాతోడ నర్మభాషలు భాషింప, విందుమే యొకనాఁడు వీను లలరఁ?
దనువులు పులకింప దయితుండు డాసినఁ, గలుగునే యొకనాఁడు కౌఁగిలింపఁ?
'బ్రాణేశ మమ్మేల పాసితి?' వని దూఱ, దొరకునే యొకనాఁడు తొట్రుపడఁగ?
తే. వచ్చునేహరి మేమున్నవనముఁజూడ?-దలఁచునే భర్త మాతోడితగులు తెఱఁగుఁ?
దెచ్చునే విధి మన్నాథుఁ దిట్టువడక?-యెఱుఁగఁబలుకు మహాత్మ! నీకెఱుఁగవచ్చు."

వ. అని "దుఃఖార్ణవమగ్నం బైన గోకులంబు నుద్ధరింపుము; రమానాథ!" యని
గోపికలు పలికి, తదనంతరంబ మఱియు [4]నుద్ధవనిగదితం బయిన కృష్ణసందే
శంబువలన విరహవేదనలు విడిచి, యుద్ధవునిం బూజించి; రిట్లు కృష్ణలీలవర్ణనలు

1. రహస్యస్థలములు. 2. యమునానదియొక్క మధ్యభాగములందు. 3. కిరణములు.
4. ఉద్ధవునిచేఁ జెప్పఁబడినది.

సేయుచు, వ్రేపల్లె నుద్ధవుండు గొన్ని నెల లుండి, నందాదుల వీడ్కొని, మరలి రథారూఢుం డై చని చని. 1482

క. సారమతిఁ బ్రణుతి సేయుచు-నారయ నుద్ధవుఁడు గాంచె, నఘసంహారిన్, హారిన్, మథురానగరవి-హారిన్, రిపుజనమదాపహారిన్, శౌరిన్, 1483

వ. కని యథోచితంబుగా సంభాషించుచుఁ, దనచేత నందాదులు పుత్తెంచినకానికలు, బలకృష్ణులకు నుగ్రసేనునికి వేఱువేఱ యిచ్చె''నని చెప్పి శుకుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె, 1484

కృష్ణుం డుద్ధవునితోఁ జేరుకొని కుబ్జాగృహంబునకు నరుగుట

మ. ''తను ము న్నంగజకేళిఁ గోరిన లతాతన్విన్, రతిక్రీడలం
దనుపం గోరి, జనార్దనుం డరిగె రత్నస్వర్ణమాల్యానులే
పనభూషాంబరధూపదీపపరిదీప్తం బై, మనోజప్రదీ
పన మై యున్న తదీయగేహమునకుం [1]బంచేషుపంచేషుఁ డై. 1485

వ. ఇట్లరిగి తద్గేహమధ్యంబున. 1486

ఆ. కాముశరమువోలెఁ, [2]గమలారికళవోలె-మొలఁగి యాడ నేర్చు మెఱుపుఁబోలె, నిఖిలభువనమోహినీదేవతయుఁబోలెఁ-జెలువు మెఱసి యున్న చెలువఁ గనియె.

మ. హరి యేతెంచిన లేచి సంభ్రమముతో, నాళీసమూహంబుచే
సిరియొప్పన్ విహితోపచారములు తాఁ జేయించి, సౌవర్ణసుం
దరతల్పస్థితుఁ జేసి యుద్ధవుని నుద్యత్ప్రీతిఁ బూజించి, 'భా
సురపీఠంబున నుండు' మంచు మది నౌత్సుక్యంబు శోభిల్లఁగన్. 1488

క. ఆళీనివహానివేదిత-మాలామృగనాభిపంకమణిమయభూషా
చేలాలంకృత యగుచును-హేలావతి గోరె వనరుహేక్షణుఁ గవయన్. 1489

క. లీలావతీకృతోల్లస-దేలాకర్పూరమిళితహితమధురమహా
హాలారసపానమద-శ్రీలాలిత యగుచు నబల చేరెం గృష్ణున్. 1490

మ. సరసాలోకనవృష్టి పైఁ గురియుచున్, సమ్యగ్వచోవైఖరిం
గరఁగంజేసి సువర్ణకంకణసమగ్రం బైన సైరంధ్రికేల్
కరపద్మంబునఁ బట్టి, తల్పమున కాకర్షించి, గంభీరతం
బరిరంభాదుల నాన పుచ్చి, మరు సంభావించుచున్ వేడుకన్. 1491

ఉ. జాతియుఁ, గాలముం, గళయు, సత్త్వము, దేశము, భావచేష్టలున్
ధాతువుఁ, బ్రాయముం, గుణముఁ, దద్దశయున్, హృదయంబుఁ, జాడ్కయుం

1. మన్మథునకు మన్మథుని వంటివాఁడై. 2. చంద్రకళ.

బ్రీతివిశేషముం, దెలిసి, పెక్కువిధంబులఁ దొయ్యలిక్ మనో
జాతసుఖంబులం దనిపె శౌరి వధూహృదయాపహారి యై. 1492

క. కరపద్మంబుల మాధవుఁ-గరమొప్పం గౌఁగిలించి, కామానలమున్
గరభోరువు వర్జించెను,-"గరమరు" దని తోడి శీతకరముఖు లలరన్. 1493

సీ. సనకాదుల్ తలపోసి, కాననివిభుఁ, సర్వప్రభుఁ, దుర్లభుఁ,
మును దా నిచ్చిన యంగరాగసుకృతామోదంబునం గూడియుఁ,
[1]ఘననిర్వాణవిభూతి యిమ్మనక, యాకంజాక్షి యేఁ బాయఁ జా
ల; ననుం గొన్నిదినంబు లంగభవలీలం దేల్పవే నావుడున్. 1494

తే. వనిత గోరుకొనినవర మిచ్చి, శౌరి యా-యుద్ధవుండుఁ దాను నువిదయిల్లు
వెడలె; నపుడు తియ్యవిలుకాఁడు సురభితోఁ-దీగయిల్లు వెడలు తెఱఁగు మెఱయ.

క. ఏవేదంబులఁ గానని-దేవోత్తముఁ గాంచి, ముక్తిఁ దెరువడుగక, రా
జీవేక్షణ రతి యడిగెను-భావింపఁ దదీయకర్మఫల మెట్టిదియో? 1496

క. కారుణ్యంబునఁ గృష్ణుఁడు-తారుణ్యము మెఱసి, మదనతంత్రంబుల లీ
లారణ్యవీథిఁ దేల్చెను-సైరంధ్రిన్, విభవవిజితశక్రపురంధ్రిన్. 1497

వ. తదనంతరంబ కృష్ణుం డుద్ధవరామసహితుం డై హస్తినాపురంబునకు నక్రూరునిం బనుపం దలంచి, తద్గృహంబునకుం జనిన, నతండు వారలం గని లేచి, రామకృష్ణులకు నమస్కరించి, యుద్ధవుం గౌఁగిలించుకొని, వారి నందఱ యథావిధిం బూజించి, హరిపాదంబులు దనతొడలమీఁద నిడుకొని, యిట్లనియె.

క. "అనుచరులఁ దానుఁ గంసుఁడు-ననియెన్ మీచేత జమునిసదనంబునకున్
ఘనులార! మీబలంబున-నొనరఁగ యాదవులవంశ [2]ముద్ధృతమయ్యెన్. 1499

వ. మహాత్ములారా! మీరు విశ్వాదిపురుషులరు; విశ్వకారణులరు; విశ్వమయులరగు మీకుం గార్యకారణంబులు లే; వవధరింపుము; పరమేశ్వరా! నీవు రజోగుణంబున నఖిలంబు సృజియించి, కారణరూపంబునఁ దదనుప్రవిష్టుండ వై, శ్రుతదృష్టకార్యరూపప్రపంచాకారంబున దీపించుచుందువు; కార్యరూప చరాచరదేహంబులకుం గారణంబు లైన భూప్రముఖంబులను గతంబు లైన కార్యరూపదేహంబులు నై ప్రకాశించుచందంబున నొక్కండవు, కారణరహితుండవు, నాత్మతంత్రుండవు నై యుండియు, విశ్వాకారంబునఁ బెక్కగుదువు; సృష్టిస్థితిలయంబులం జేయుచుండియు, విజ్ఞానమూర్తి వగుటం బరిభ్రాంతుం డైన జీవునిభంగి గుణకర్మబద్ధుండవు కావు; కావున సిద్ధంబు తన్నిమిత్తంబు బంధహేతువును సిద్ధింపదు. 1500

1. ఉత్తమమయిన మోక్షలక్ష్మి. 2. ఉద్ధరింపఁబడినది.

సీ. పరఁగ జీవునినైన బంధమోక్షము లంట; వంటునే పరతత్త్వ మైననిన్ను?
నంటునే యాశ! దేహాద్యుపాధులు [1]ననిర్వచనీయములు గాన, వరుస నీకు?
జన్మంబు జన్మసంశ్రయభేదమును లేవు; కావున బంధమోక్షములు లేవు;
గణుతింప ని [2]న్నులూఖలబద్ధుఁ గనుటయు, నహిముక్తుఁ డనుటయు నస్మదీయ
ఆ. బాలబుద్ధి గాదె? పాషండముఖరమా-ర్గములచేత నీజగద్ధితార్థ
మైనవేదమార్గ మడఁగి పో వచ్చిన-నవతరించి నిలుపు దంబుజాక్ష! 1501

క. ఆ నీవు ధరణిభారము-మానిచి, రక్కసుల నెల్ల మర్దించుటకై,
యానకదుందుభియింటను-మానుగ జన్మించితివి సమంచితకీర్తిన్. 1502

మ. త్రిజగత్పావనపాదతోయములచే దీపించి, వేదామర
ద్విజముఖ్యాకృతి వైన నీవు కరుణన్ విచ్చేయుటం జేసి, మా
నిజగేహంబులు ధన్యతం దనరెఁ బో; నిన్నార్యు లర్చింపఁగా
నజితత్వంబులు వారి కిత్తు వనుకంపాయత్తచిత్తుండ వై. 1503

శా. ఏపుణ్యాతిశయప్రభావముననో, యీజన్మమం దిక్కడన్
నీపాదంబులు గంటి; నిన్నెఱిఁగితిన్; నీవుం గృపాళుండ వై
నాపై నర్మిలిఁ జేసి, మాన్పఁగదవే, నానాధనాగారకాం
తాపుత్రాదులతోడిబంధనము భక్తవ్రాతచింతామణీ!'' 1504

వ. అని పలికిన నగుచు, నక్రూరునికి మాటలవలన సంసారబంధం బగు
మోహంబుఁ గీలుకొలుపుచు, హరి యి ట్లనియె. 1505

కృష్ణుం డక్రూరుని హస్తినాపురంబునకుఁ బంపుట

క. ''బంధుండవు, సద్యోహిత-సంధుండవు, వావిఁ జూడ జనకుఁడవు, కృపా
సింధుండ, వెల్లగుణముల-నంధుండవు గావు; ప్రోవ నర్హుఁడ వెందున్. 1506

చ. కొలుతురు మర్త్యు లిష్టములు గోరి, శిలామయదేవసంఘమున్
జలమయతీర్థసంఘమును సంతతము; న్నటు వారు గొల్వఁగా,
వల దన రాదు గాక! భగవత్పదభక్తుల రైన మీక్రియన్
[3]సాలయక దేవతీర్థములు చూచినయంతనె కోర్కె లిచ్చునే? 1507

వ. మహాత్మా! పరమభాగవతుండ వైన నీవు మా కభీష్టంబు లొనరింప నర్హుండవు;
వినుము; పాండురాజు పరలోకగతుం డైనఁ గుంతీసహితు లైన పాండవులు
ధృతరాష్ట్రశాసనంబునఁ గరిపురంబున నున్నవా రఁట! నిజపుత్రమోహితుం
డగు నయ్యంధనృపతి వారియందు సమత్వంబునం జరింపం; డటుగావున. 1508

1. చెప్పుటకు సాధ్యముకానివి. 2. రోటికిఁగట్టఁబడినవాఁడు. 3. ఆలసింపక, లోఁబడక.

క. వారలు బంధులు గావున–వారలకును మే లొనర్చి, వారలరంగా
వారింప వలయు దుస్స్థితి;–[1]వారిజరిపువంశ! పొమ్ము వారిం జూడన్." 1509

వ. అని పలికి, సంకర్షణోద్ధవసహితుండై హరి నిజగృహంబునకుం జనుటయు, నక్రూరుండు కౌరవరాజధాని యగు కరిపురి కరిగి, యందు ధృతరాష్ట్రభీష్మ విదురబాహ్లికభారద్వాజగౌతమదుర్యోధనకర్ణాశ్వత్థామాదులం గుంతీసహితులైన పాండవులం దక్కినబంధుప్రజలనుం గని, యథోచితసత్కారంబుల నంది, తద్వర్తనంబు లెఱింగికొనుచుఁ, గొన్ని దినంబు లుండ, నొక్కనాఁడు విదురుండు విన [2]నేకతంబున నక్రూరునికిం గుంతి యిట్లనియె. 1510

శా. "అన్నా! తల్లులుఁ దండ్రులున్, భగినులు, న్నల్లుండ్రు, మద్భ్రాతలున్,
నన్నుం, బొమ్మనువేళ నే మనిరి? మా నెవ్వాల్ విచారింతురే?
యున్నారా సుఖయుక్తులై? మృగి వృకవ్యూహంబులో నున్న రే
ఖ, న్నే నిక్కడ నున్నదానఁ గుమనఃకౌరవ్యమధ్యంబునన్. 1511

మ. కఱపించెన్ ఫణికోటిచే; [3]లతికలం గట్టించి గంగానదిన్
నెఱిఁ ద్రోపించె; విషాన్వితాన్న మొసఁగెన్; నిద్రారతిం జెంది యే
మఱి యుండం బొడిపించె నాయుధములన్; మత్పుత్రులం దేమియుం
గొఱగాఁ డీ ధృతరాష్ట్రసూనుఁడు మహాక్రూరుండు గార్యంబులన్. 1512

మ. బలుఁడుం గృష్ణుఁడు నెన్నఁ డైనఁ దమలో భాషించి, మేనత్తబి
డ్డలకున్ మేలు దలంతురే? వగపులన్ డయ్యంగఁ బాలై; రయో!
జలజాతాక్షుఁడు, భక్తవత్సలుఁ డిలాచక్రంబు భాగించి, యి
మ్ముల నిప్పించునె నాకుమారకులకున్ ముఖ్యప్రకారంబునన్?" 1513

వ. అని పలికి కృష్ణునిఁ జిత్తంబున నిల్పి, నమస్కరించి, సంకీర్తనంబు చేసి, "సర్వాత్మక! సర్వపాలక! పుండరీకాక్ష! శరణాగత నైన నన్ను రక్షింపు" మని వగచుచున్న కుంతికి నక్రూరుండు విదురసమేతుండై, ప్రియవచనంబుల దుఃఖోపశమనంబు సేసి, వీడ్కొని, బంధుమిత్రమధ్యంబున సుఖోపవిష్టుండై యున్న ధృతరాష్ట్రున కి ట్లనియె. 1514

ఉ. "నీయనుజుండు పాండుధరణీవిభుఁ డీల్గిన, నీవు భూమి ధ
ర్మాయతబుద్ధి నేలుచుఁ, బ్రజావళిఁ గాచుచు, గౌరవంబుతోఁ
బాయక లోకులందు [4]సమభావన చేసితివేనిఁ, గీర్తియున్,
శ్రేయముఁ గల్గు; వే ఱొకటి సేసిన దుర్గతి గల్గు భూవరా! 1515

1. చంద్రవంశమునఁబుట్టినవాఁడా! 2. రహస్యమున, ఒంటరిగా. 3. తీగలు. 4. సమమైనబుద్ధితో.

సీ. అవనీశ! పాండవులందు నీనందనులందు సమానుండ వగుట బుద్ధి;
యెవ్వనితో యోగ మిం దెవ్వనికి నిత్య? మంగనాగారపుత్రాదికముల
వలన నయ్యెడి దేమి? వసుమతి నొకజంతు వుదయింప, నొకజంతు వుక్కడంగు;
నొకఁడు పుణ్యముఁ జెంద, నొకఁడు పాపమునొందు; మీనజీవనభూతమిళితజలము
ఆ. తత్తరూజు లెల్లఁ ద్రావుచు? రట్లు మూ-ఢాత్ము విత్త మెల్ల నపహరింతు
[1]రహితు లైన కొడుకు; లటమీఁద మనియైనఁ-జచ్చియైనఁ, దండ్రి జాడఁ జనడు.

క. కావున మూఢాత్ముఁడ వై-నీ వార్జించినధనంబు నీపుత్రులు, దు
ర్భావులు, పుచ్చుకొనం-గాభూవర! నిందితుఁడ వగుదు భూనాకములన్. 1517

శా. నిందం బొందకు మయ్య! యీతనువు దా నిద్రాకళాదృష్ట మా
సందోహంబువిధంబు నిల్వదు సుమీ! జాత్యంధతం బొందియుఁ,
మందప్రజ్ఞత లేల చేసెదవు? సమ్యగ్జ్ఞానచక్షుండ వై,
సందేహింపక యిమ్ము పాండవులకుఁ సర్వంసహాభాగమున్.'' 1518

వ. అనిన ధృతరాష్ట్రుం డి ట్లనియె. 1519

సీ. ''నీమాట మంచిది; నిశ్చయ మగు; నైన నస్థిరం బైన నాయంతరంగ
మందు నిల్వదు; సుదామాచలస్ఫటికశిలాతలోద్యత[3]తటిల్లతికభంగి,
నమృతంబు నొందియు, నానందితుఁడు గాని నరుమాడ్కి, నేను నానంద మొంద;
నీశ్వరాజ్ఞావిధ మెవ్వఁడు దప్పింపనోపు? విజ్ఞానియై యుండి యైన
ఆ. విశ్వ మెల్లఁ జేసి, విభజించి, గుణముల-నెవ్వఁ డనుసరించె; నెవ్వఁ డవని
భార మెల్లఁ బాయఁ బ్రభవించె దేవకి-కెవ్వఁ [4]డాత్మతంత్రుఁ డీశ్వరుండు.

వ. అట్టికృష్ణునకు నమస్కరించెద; నానందనందనునిదివ్యచిత్తంబునం గల తెఱం
గున బ్రదుకం గలవార''మని వీడ్కొలిపిన, నక్రూరుం డతనితలం పెఱింగి
యి ట్లనియె; ''నీతలంపుఁ గనుంగొంటి; నీ కిష్టం బగునట్లు వర్తింపు''మని పలికి
మరలి మథురకుం జనుదెంచి, తదీయవృత్తాంతంబు రామకృష్ణుల కెఱింగించె;
నంతఁ గంసభార్యలగు నస్తియుఁ, బ్రాప్తియు విధవలై దుఃఖించుచుం దమతండ్రి
యైన జరాసంధుకడకుం జని. 1521

శా. ''వాండ్రుఁ బీండ్రును రాజులే? యనుచు గర్వప్రౌఢితో యాదవుల్
వేండ్రం బైన బలంబుతో మథురకుఁ వే వచ్చి, నిష్కారణం
బాండ్రుఁ, బిడ్డలు, బంధులుఁ వగవఁ గంసాదిక్షమానాథులం
దండ్రీ! చంపిరి; కృష్ణుచేత నిటు వైధవ్యంబు వచ్చెం జుమీ!'' 1522

---

2. శత్రువులు. 3. మెఱుపుతీగ. 4. ఆత్మకు లోఁబడినవాఁడు.

వ. అనిన విని, ప్రళయకాలానలంబు తెఱంగున మండిపడి, శోకరోషంబులు బంధురంబులుగా జరాసంధుం డిట్లనియె. 1523

శా. ఏమీ? కృష్ణుఁడు కంసునిన్ రణములో హింసించె? నోచెల్ల! నా
సామర్థ్యంబు దలంపఁ డించుకయు; మచ్చండప్రతాపానలో
ద్దామార్చుల్ వడి నేఁడు గాల్చు యదుసంతానాటవీవాటికన్
భూమిం గ్రుంగిన, నింగిఁ బ్రాకిన, మహాంభోరాశిలోఁ జొచ్చినన్. 1524

క. యాదవవిరహిత యగుఁ బో-మేదిని నాచేత నేఁడు; మీఁదుమిగిలి సం
పాదితబలు లై హరిరు-ద్రాదులు నింద్రాదు లెవ్వ రడ్డం బైనన్." 1525

జరాసంధుఁడు మథురమీఁద దండెత్తి వచ్చి కృష్ణునితో యుద్ధముసేయుట.

వ. అని పలికి సమరసన్నాహసంకులం బగు చిత్తంబునఁ గోపంబు దీపింప, సంగరభేరి వ్రేయించి, కదలి. 1526

క. దక్షుం డై యిరువదిమూఁ-డక్షౌహిణు లైన బలము లనుగతములుగా
నాక్షణమ జరాసంధుఁడు-ప్రక్షోభముతోడ మథురపైఁ జనియె నృపా! 1527

క. గంధేభతురగరథభట-బంధురచరణోత్థితోగ్రపాంసుపటలయో
గాంధీభూతము లై దివి-మంథరగతి నడచె నపుడు మార్తాండహయల్. 1528

వ. ఇట్లు చని, నిరంతరకిసలయపత్త్రకోరకకుసుమఫలభారవినమితవృక్షవిలసితమహో
ద్యానంబును, నుద్యానవనభాగవలమానజలోన్నయనదారుయంత్రలతానిబద్ధ
కలశవిముక్తసలిలధారాశీకర పరంపరాసంపాదిత వర్షాకాలంబును, గాలకింకర
సదృశవీరభటరథతురగసామజానీకసంకులంబును, గులాచారధర్మప్రవీరపౌరజన
భాసురంబును, సురాభేద్యమానమహోన్నతాట్టాలకయాత్రభయంకరప్రాకార
చక్రంబును, జక్రసారసహంసాదికలారావకలితసరోవరంబును, సరోవరసం
ఫుల్లహల్లకకమలపరిమళమిళిత పవనవిరాజితంబును, జితానేకమండలేశ్వరభూ
షణమణిగణరజోనివారితమదగజేంద్రదానజలప్రభూతపంకంబును, బంకరహిత
యాదవేంద్రదత్తసువర్ణాచల కల్పతరు కామధేను సమ్మర్దితవిద్వజ్జననికేతంబును,
కేతనసన్నిబద్ధచామరమయూరచాపశింజినీనినదపరిపూరితాభ్రంబును, నభ్రంలి
హమహాప్రాసాదసౌధగవాక్షరంధ్రనిర్గత ఘనసారధూపధూమపటలవిలోకనసం
జనిత జలధర భ్రాంతివిభ్రాంతశిఖండితాండవరుచిరంబును, జిరతరానేక దేవా
లయజోఘుష్యమాణతూర్యనినద పరిభావిత పారావారకల్లోలఘోషంబును,
ఘోషకామినీప్రాణవల్లభబాహుదండపరిరక్షితంబు నై, పరులకు నలక్షితం
బై న మథురానగరంబు సేరి, వేలాలంఘనంబు సేసి, వెల్లివిరిసినమహార్ణవంబు
తెఱంగునఁ బట్టణంబునకు ముట్టణంబుఁ జేసి, చుట్టును విడిసిన జరాసంధుని
బలంబుఁ గనుంగొని, బలానుజుం డగు హరి దనమనంబున. 1529

శా. "¹ఐదున్నాలుఁగు, నాఱు, రెండు, నిరుమూఁడక్షౌహిణుల్ సుట్టి, సం
ఛాదించెం బుర మెల్ల; మాగధునెడన్ సామంబు దానంబు సం
భేదంబుం బని లేదు; దండవిధి శోభిల్లం బ్రయోగించి, యీ
భూదేవీవరభార మెల్ల నుడుపం బోలున్ జయోద్భాసి నై. 1530

క. ఏ నవతరించు టెల్లను-మానుగఁ జతురంతధరణిమండలభరముల్
మానుపుకొఱకుం గాదే?-పూనెద నిది మొదలు దగిలి భూభర ముడుపన్. 1531

ఆ. మగధనాథుఁ బోర మడియింపఁ బోలదు;
మడియ కున్న వీఁడు మరలి మరలి
బలముఁ గూర్చుకొనుచుఁ బఱతెంచుఁ; బఱతేరఁ
ద్రుంప వచ్చు, నేలదోసఁగు దొఱఁగ." 1532

వ. అని యిట్లు తలపోయుచున్న సమయంబున, నభోభాగంబున నుండి మహా
ప్రభాసమేతంబులును, ²సపరిచ్ఛద సూతంబులును, ననేక బాణబాణాసన
చక్రాదివివిధాయుధోపేతంబులు నైన రథంబులు రెండు మనోరథంబులు పల్ల
వింప, దైవయోగంబునఁ జేర వచ్చినం జూచి, హరి సంకర్షణున కిట్లనియె.

శా. "కంటే రామ! రథంబు లాయుధములున్ గాఢప్రకాశంబు లై
మింటన్ వచ్చెను; వీనిఁ గైకొని సురల్ మెచ్చన్ నృపశ్రేణులన్
బంటింపం బని లేదు; చంపుము; ధరాభారంబు వారింపు; మీ
వెంటన్ నీయవతారముల్ సఫల మౌ; వేవేగ లె మ్మాజికిన్." 1534

వ. అని పలికి. 1535

క. ³ఖరు లై, దృఢకవచధను-ర్ధరు లై, యధికతరధానుచరు లై, మదవ
త్కరు లై, ఘనహరు లై బల-హరు లయ్యెడ నాజి కేఁగి రతిభీకరు లై.

వ. ఇట్లు సమరసన్నాహంబునం బురంబు వెడలి. 1537

ఉ. అన్యులు దల్లడిల్ల, దనుజాంతకుఁ డొత్తె గభీరఘోషశా
లిన్యమహాప్రభావవికటీకృతపద్మభవాండజంతుచై
తన్యము, ధన్యమున్, దివిజతాపసమాన్యముఁ, బ్రీతభక్తరా
జన్యము, భీతదుశ్చరితశాత్రవసైన్యముఁ, బాంచజన్యమున్. 1538

క. సింధురభంజనపూరిత-బంధురతరశంఖనినదభారమున జరా
సంధునికిం గల సైన్యము-లంధము లై సంచలించె నాహవభూమిన్. 1539

వ. అయ్యవసరంబున మాగధుండు మాధవున కిట్లనియె. 1540

---

1. 5+4+6+2+6=23 ఇరువదిమూఁడు. 2. అలంకారములతోఁగూడిన గుడ్డలు. 3. పరాక్రమముగలవారు.

సీ. "అవలించి రొప్పంగ నాలమందలు గావు, గంధగజేంద్రసంఘములు గాని;
పరికించి వినంగ నంభారవంబులు గావు, వాజీంద్రహేషారవములు గాని;
పదహతిం గూల్పంగం బ్రాంతబం డ్లివి గావు, నగసమానస్యందనములు గాని;
ప్రియము లాడంగ నాభీరలోకము గాదు, కాలాభనైరివర్గంబు గాని;
తే. యార్ప వనవహ్ని గాదు బాణాగ్ని గాని;
మఱియు బృందావనము గాదు; [1]మొనలు గాని;
యమున గాదు నటింప; ఘోరాజి గాని;
పోరు నీ కేల? గోపాల! పొమ్ము పొమ్ము. 1541

మ. తరుణిం జంపుటయో, బకుం గెడపుటో, ధాత్రీజముల్ గూల్చుటో,
ఖరముం ద్రుంచుటయో, ఫణిం బఱపుటో, గాలిం నిబంధించుటో,
గిరి హస్తంబునం దాల్చుటో, లయమహాగ్నిస్ఫారదుర్వారదు
ర్భరబాణాహతి నెట్లు నిల్చెదవు సప్రాణుండ వై? గోపకా! 1542

వ. అదియునుం గాక. 1543

సీ. గోపికావల్లకీఘోషణంబులు గావు, [2]శింజినీరవములు చెవుడుపఱచు;
వల్లవీకరముక్తవారిధారలు గావు, శరవృష్టిధారలు చక్కసేయు;
ఘోషాంగనాపాంగకుటిలాహతులు గావు, నిశితాసినిహతులు నిగ్రహించు;
నాభీరకామినీహస్తాబ్జములు గావు, ముష్టిఘాతంబులు మురువుడించు;
తే. నల్ల వ్రేపల్లెగాదు, ఘోరావనిశ-మకరసంఘాతసంపూర్ణమగధరాజ
వాహినీసాగరం బిది; వనజనేత్ర! నెఱసి నిను దీవికైవడి నేఁడు ముంచు." 1544

వ. అనిన శ్రీహరి యి ట్లనియె. 1445

ఉ. "పంతము లేల? తొల్లి జనపాలురం బోరుల గెల్చినాఁడ వం;
ద్రంతియు చాలదే? [3]బిరుదు లాడుట బంటుతనంబు త్రోవయే?
యింతటం దీఱెనే? మగధ! యేటికిం జ్రేలెదు; నీవ యేల? క
ల్పాంతమహోగ్రపావకుని నైన హరింతు; వరింతు సంపదన్. 1546

క. గోపాలుండ వని పలికితి-భూపాలక! దీన నేమి? పోరాడంగా
గోపాలమహీపాల-వ్యాపారాంతరము దెలియ వచ్చుం బిదపన్." 1547

వ. అనిన రోషబంధురుం డై జరాసంధుం డి ట్లనియె. 1548

ఉ. బాలుండ వీవు; కృష్ణ! బలభద్రునిం బంపు రణంబు సేయ; 'గో
పాలకబాలుతోడ జనపాలశిఖామణి యైన[4]మాగధుం

1. సైన్యములు. 2. అల్లెత్రాటియొక్క ధ్వనులు. 3. ప్రజ్ఞలు తెలుపుట. 4. జరాసంధుఁడు.

జాలము సేసె' నంచు జను లాడెడిమాటకు సిగ్గు పుట్టెడిం;
జాలుఁ; దొలంగు; దివ్యశరజాలుర మమ్ము జయింప వచ్చునే!'' 1549

వ. అనిన నగధరుం డి ట్లనియె. 1550

క. పొగడుకొనుదురే శూరులు–మగఁటిమిఁ జూపుదురు గాక! మాగధ! నీకున్
మగతనము గలిగెనేనిం–దగు మెఱయ; [1]వికత్థనములు దగ వీ పోరన్.'' 1551

వ. అనిన రోషించి. 1552

చ. పవనుఁడు మేఘరేణువుల భానుకృశానులఁ గప్పుకైవడిన్,
వివిధబలౌఘముం బనిచి, వేగమ మాగధుఁ డావరించె, భూ
మ్యవనచరిష్ణులం, గువిమతావనినాథనిరాకరిష్ణులన్,
దివిషదలంకరిష్ణుల, [2]నతిస్థిరజిష్ణుల, రామకృష్ణులన్. 1553

మ. హయహేషల్, గజబృంహితంబులు, [3]రథాంగారావముల్, శింజినీ
చయటంకారములున్, వివర్ధితగదాచక్రాస్త్రనాదంబులున్,
జయశబ్దంబులు, భేరిభాంకృతులు, నిస్సాణాదిఘోషంబులున్,
భయదప్రక్రియ నొక్కవీఁక నెగసెన్ బ్రహ్మాండభేదంబుగన్. 1554

వ. మఱియు నయ్యెడ మాగధమాధవవాహినులు రెండు నొండొంటిం దాఁకి, రౌద్రంబున సంవర్తసమయసముద్రంబులభంగి నింగికిం బొంగి, చెలంగి చలంబునం దలపడి పోరునెడ మసరు కవిసి, మహారణ్యంబులు వెలువడి మార్కొను మదగజంబులమాడ్కిని, మహోత్కంఠంబు లగు కంఠీరవంబుల తెఱంగున, దుర్లభంబు లగు శరభంబులచాడ్పునం, బ్రచండంబు లగు గండభేరుండంబులగమనికం, దమతమమొనలకుం దలకడచి వీరరసంబు వివిధరూపంబులైన విధంబునం బదుగురు, నూర్వురు, వేవురు, గములై కులకుధరగుహాంతరాళంబులు నిండ, సింహనాదంబు లొనర్చుచు, నార్చుచు, నట్టహాసంబులు సేయుచు, నరివీరుల రోయుచుఁ, బటహకాహళభేరీశంఖశబ్దంబులకు నుబ్బుచు, గర్వంబునం బ్రబ్బుచు, గదల వ్రేయుచుఁ, గాండంబుల నేయుచు, ముద్గరంబుల నొత్తుచు, ముసలంబుల మొత్తుచు, కుంతంబులఁ గ్రుచ్చి యెత్తుచుఁ, గరవాలంబులం ద్రెంచుచుఁ, జక్రంబులం ద్రుంచుచుఁ, శస్త్రంబులం దఱుఁగుచుఁ, జిత్రంబుగఁ దిరుగుచుఁ, బరిఘంబులఁ ద్రిప్పి కొట్టుచుఁ, బ్రాసంబులం బెట్టుచు, శూలంబులఁ జిమ్ముచు, సురియలఁ గ్రుమ్ముచు, బహు భంగులఁ బరాక్రమించు వీరభటులును, నిబిడనీరంధ్ర[4]నేమినిర్ఘోషంబుల నాకాశంబు నిరవకాశంబుగ ననర్గళచక్రమార్గంబులం బడు పదాతులు చదియ నరదంబులు దోలి, వివిధాయుధ

1. డంబములు. 2. మిక్కిలి స్థిరమయిన జయశీలురను. 3. రథాంగ + ఆరావముల్, తేరుల యొక్క ధ్వనులు. 4. కమ్ములచప్పుడు.

ప్రయోగంబుల వైరుల వ్రచ్చి, చిందఱవందఱలాడు రథికులును, రథికశరపరం
పరలఁ గంపింపక మహామోఘమేఘధారలకుఁ జలింపని ధరణీధరంబులచాడ్పున
రథంబులకుం గవిసి, కల్పాంతకాలదండిదండప్రచండంబు లగు శుండాదండంబులు
సాఁచి పూఁచి, కడనొగ లొడిసి, తిగిచి, కుదిచి, విఱిచి, కూబరములు
నుఱుములుగ జిఱిజిఱం ద్రిప్పివైచియు, భటులఁ జటులగతిం బంతులక్రియ
నెగురవైచి, దంతంబులఁ గ్రుచ్చియు, ఘోటకంబుల వ్రచ్చియు, విచ్చలవిడిం
దిరుగు కరులును, వజ్రవజ్రధారలకుం దప్పి కకుప్పులకు నెగయుఱెక్కలు గల
గిరులనిరులం బక్కెరలతోడ హేషారవభీషణంబు లై, మనోజవంబు లగు తురం
గంబులం బఱపి, తురంగపదపాంసుపటలప్రఘాతబహుళాంధకారంబులు
గరకలిత కఠోరఖడ్గమరీచిజాలంబుల నివారించుచు, నానాప్రకారంబులం బ్రతి
వ్యూహంబులం జించి చెండాడు [1]రాహుత్తులుం గలిగి, సంగ్రామంబు భీమం
బయ్యె; నంత. [ముక,

క. చెదురథములుఁ, దెగుహయములును-బడుకరులును, మడియుభటులుఁ, బఱచురుధిర
మడియుతల, లొఱగుతనువులు-పొడియగుతొడవులును, మధురిపునిదెసఁ గలిగెన్.

క. భీతం బై, హతసుభట, వ్రాతం బై, భగ్నతురగవారణరథసం
ఘాతం బై, విజయశ్రీ-వీతం బై, యదుబలంబు విఱిగె నరేంద్రా! 1557

శా. "యోధాగ్రేసరుఁ డీ హలాయుధుఁడు; లోకోత్కృష్టబాహాబల
శ్రీధౌరేయుఁడు కృష్ణుఁ; డిట్టిఘనులం జిత్రంబు! నేఁ డిట్లు సం;
రోధించెన్; బలముం దెరల్చె; మగధేంద్రుం" డంచు నీక్షించుచున్
సౌధాగ్రంబులఁ బౌరకాంతలు మహాసంతప్తలై రెంతయున్. 1558

వ. ఇట్లు దనమొనలు విఱిగి పాఱినం గనుంగొని, సమరసంరంభంబున హరి విశ్వం
భరాభరణవేదండశుండాభంబు లగు బాహుదండంబులు పెంచి, విజృంభించి
బ్రహ్మాండకుహరకుంభపరిస్ఫోటనం బగు పాంచజన్యనినదంబు నిబిడనిర్ఘాతశబ్దం
బుగా, నుదంచితపింఛదామంబు [2]సంక్రందనచాపంబుగాఁ, బ్రశస్తహస్త
లాఘవంబున శరాకర్షణసంధానమోక్షణంబు లేర్పడక, నిర్వక్రచక్రాకారంబు
తోడ మార్తాండమండలప్రభాప్రచండం బగు శార్ఙ్గకోదండంబులు క్రొమ్మెఱుం
గులుగా, దిగ్గజేంద్రకర్ణభీషణంబు లగు గుణఘోషణంబులు ఘుమఘుమారావ
దుస్సహంబు లయిన గర్జనంబులుగా, రథతురంగమరింఖాసముద్ధూతపరాగ
పటల పరంపరాసంపాదితపుంజీభూతం బగు పెంజీకటి యిరులు గా, నసమసమరస
న్నాహచాతురీవిశేషంబులకుం జొక్కి, నిక్కి కరంబు లెత్తి, నర్తనంబులం
బ్రవర్తించు నారదహస్తవిన్యాసంబులు లీలాతాండవమండితమహోత్కంఠంబు

1. గుఱ్ఱపురౌతులు. 2. ఇంద్రధనుస్సు.

లగు నీలకంఠంబులుగా, సుందరస్యందన నేమినిర్ఘోషభీతు లయి కుంభికుంభంబులపై వ్రాలు పిరులు మత్తమయూరకేకారవచకితు లై యువతికుచకుంభములమీఁద వ్రాలెడు కాముకులుగా, నానానరేంద్రరక్తపిపాసాపరవశంబులై వాచఱచుచున్న భూతవ్రాతంబులు "[1]వర్షవర్షే"తినిస్వనంబు లొసంగుచాతకంబులుగా, నభంగసంగరప్రేరకుండగు హలాయుధుండు వృష్టికారణం బగు మందసమీరణంబుగా, ననల్పకల్పాంతకాలనీలవలాహకంబు భాతిం బరఁగు మేనిచాయతోడం దోయజనాభుం డరాతిచతురంగదేహక్షేత్రంబులం బుంఖానుపుంఖంబులుగ నసంఖ్యాతబహువిధదివ్యబాణవర్షంబులు గురియునెడ, శస్త్రాస్త్రపరంపరాసంఘట్టనజనితంబు లగు మిడుఁగుఱులు వర్షాకాలవిహితవిద్యోతమాన [2]ఖద్యోతంబును, విశిఖవికీర్ణవీరకోటీరఘటితపద్మరాగశకలంబు లింద్రగోపంబులును, మహితమార్గణవిదళితమత్తమాతంగకుంభమౌక్తికంబులు వడగండ్లును, జటులార్ధచంద్రశరచ్ఛిన్నచరణంబు లయి "కృష్ణ! కృష్ణ! నిలు; నిలు" మని పలుకుచుం గూలెడు మేనులు, [3]కృషీవలకరపరశుధారావిదళితమూలవిశాలసాలంబులును, భాసురభల్లభగ్నంబు లయిన వదనగహ్వరంబులవలన డుల్లెడు దంతపుంజంబులు, మాలతీకుసుమమంజరులును, నవ్యనారాచభిన్నదేహంబు లయి దిగ్గనఁ గ్రొగ్గండ్లవలన వెడలురక్తస్యందసందోహంబులతో, సంచరింపక ప్రాణంబులు విడుచు శుండాలంబులు సెలయేఱులతోడి కొండలును, గఠోరకాండ ఖండితంబు లయిన భుజాదండంబులతోడఁ గలసి పడిన వజ్రమయకంఠికాభరణంబులు భోగిభోగ సమేత కేతకీసుమంబులును, బ్రళయార్ణవకల్లోలశబ్దసన్నిభంబు లయిన భేరీరవంబులు భీకరభేకనికరారవంబులును, దారుణేషువిలూన వాహవారణ మనుజమస్తిష్కంబు రొంపియు నైసొంపు మెఱయ, నాభీలకీలాల ప్రవాహంబులు ప్రవహించె; నందు భుజంబులు భుజంగంబులుగఁ, గపాలంబులు [4]కమఠంబులుగ, శిరోజంబులు [5]శైవాలంబులుగఁ, గరంబులు మీనంబులుగ, హయంబులు నక్రంబులుగ, గజంబులు దీవులుగ, ధవళచ్ఛత్రంబులు [6]నురువులుగఁ, జామరంబులు గలహంసంబులుగ, భూషణరత్న రేణురాసులు పులినంబులుగ నొప్పె; నప్పుడు. 1559

లయవిభాతి. హసితహరినీలనిభవసనము, విశాలకటి
నసమనయనాద్రిపరిలసిత మగు మేఘో
ల్లసనము వహింపఁ, గరకిసలయము హేమమణి
విసరవలయద్యుతులు దెసలతుదలందుం

---

1. వర్షింపుము వర్షింపుము అను ధ్వనులు. 2. మిణుఁగురు పుర్వులు. 3. సేద్యగాండ్ర యొక్క. 4. తాఁబేళ్లు. 5. నాఁచుతీఁగలు. 6. నురుగు.

బసలు గురియంగ, సరభసమున బలుండు దర
హాసితము ముఖాబ్జమున నెసఁగ, ఘనకాలా
యసమయమహోగ్రతరముసలము వడిన్ విసరి
కసిమసఁగి శత్రువుల నసువులకుఁ బాపెన్. 1560

లయవిభాతి. ప్రలయసమయాంతకుని చెలువునఁ, గటాక్షముల
నలఘుచటులాగ్నికణములు సెదరఁ, గోలా
హలముగ సువర్ణ మణివలయనిచయోజ్జ్వలిత
హలము వడిఁ జాఁచి, శిరములు, నురములు, న్ని
ర్దలితములుగన్ శకలములుగ నొనరింపఁ, గని
బెలుకుఱీ, జరాసుతునిబలము రణవీథిం
జలితదనుజావలికి, బలికి, భయభీతసుర
ఫలికిఁ, ద్రిజగచ్ఛలికి, హలికిఁ దలడించెన్. 1561

శా. రోషోద్రేకకళాభయంకరమహారూపంబుతో, నొక్కచే
నీషాదండము సాఁచి, లాంగలము భూమీశోత్తమగ్రీవలన్
భూపాల్ రాలఁ దగిల్చి, రాఁ దిగిచి, సంపూర్ణోద్ధతిన్ రోఁకటన్
వేపంబుల్ సెడ మొత్తె రాముఁడు రణోర్విన్ నెత్తురుల్ జొత్తిలన్. 1562

క. హలిహలహృతకరికుంభ-స్థలముక్తాఫలము లోలిఁ దనరెఁ గృషికలాం
గలమార్గకీర్ణబీజా-వలికైవడి నద్భుతాహవక్షేత్రమునన్. 1563

క. తఱిమి [1]హలి, హలము విసరుచు
నెఱిఁ గదిసిన, బెగడి విమతనికరము లెడలై
వెఱఁగుపడు; నొదుఁగు; నడఁగును;
మఱుపడుఁ; జెడు; మడియుఁ; బొరలు; మరలుం; దెరలున్. 1564

క. హరి తిగ్మగోశతంబుల-హరిదంతర మెల్లఁ గప్పునాకృతిఁ గడిమిన్,
హరి తిగ్మగోశతంబుల-హరిదంతర మెల్లఁ గప్పె నతిభీకరుఁడై. 1565

సీ. పదుగు రేగురు దీర్ఘబాణముల్ గాఁడిన, గుదులు గ్రుచ్చినభంగిఁ గూలువారుఁ;
దలలు ద్రెవ్విన, మున్ను దారు వీక్షించిన వారల నొప్పించి, వ్రాలువారుఁ;
బదములు దెగి పడ్డ, బాహులఁ బోరి, నిర్ధూలితబాహులై మ్రొగ్గువారు;
[2]క్షతముల రుధిరంబు జల్లింప, నిర్ఝరయుతశైలములభంగి నుండువారు;

ఆ. భ్రాతృపుత్రమిత్రబంధువుల్ వీఁగిన-నడ్డ మరుగుదెంచి, యడఁగువారు;
వాహనములు దెగిన, వడి నన్యవాహనా-ధిష్ఠు లగుచు నెదిరి, త్రెళ్లువారు.

---

1. హలము = నాఁగలి-ఆది కలవాఁడు, బలరాముఁడు. 2. గాయములనుండి.

వ. మఱియును. 1567

శా. "ఈకాయంబులఁ బాసినంతటన మా కెగ్గేమి? జేతృత్వముల్
నీకుం జెల్లదు? కృష్ణ! నిర్జరుల మై నిన్నోర్తు మా మీఁదటన్
వైకుంఠంబున" నంచుఁ బల్కు క్రియ దుర్వారాస్త్రభిన్నాంగు లై,
యాకంపింపక కొంద ఱాడుదురు గర్వాలాపముల్ కృష్ణునిన్. 1568

వ. ఇవ్విధంబున. 1569

క. జగతీశ! యేమి సెప్పుదు-నగణితబలయవార్ధి భయద మై, మూఁగిన య
మ్మగధేశుబలము నెల్లను-దెగఁ జూచిరి హరియు, హలియుఁ, దీవ్రక్రీడన్.

క. భువనభవస్థితివిలయము-లవలీలం జేయుహరికి, నరినాశన మెం
త విషయ? మైన మనుజుఁ డై-భవ మొందుటఁ జేసి, పొగడఁబడియెం గృతులన్.

వ. ఆ సమయంబున. 1572

శా. [1]అంహఃకర్మలు దల్లడిల్ల, భయదాహంకారుఁ డై సీరి దో
రంహం బొప్ప, హలాహతిన్ రథధనూరథ్యంబులం గూల్చి, త
త్సంహారస్పృహఁ జొచ్చి, పట్టెను జరాసంధున్, మదాంధున్, మహా
సింహంబుం బ్రతిసింహముఖ్యము బలశ్రీఁ బట్టునే ర్పేర్పడన్. 1573

వ. ఇట్లు పట్టుకొని. 1574

ఉ. కుంఠితు లై పరుల్ వెగడ, ఘోరబలుండు, బలుండు వాని [2]సో
ల్లుంఠము లాడుచున్, దిగిచి, లోకభయంకర మైన ముష్టిచేఁ
గంఠగతాసుఁ జేసి, [3]తమకంబున మొత్తఁగ, భూభరక్షయో
త్కంఠితుఁడు చక్రి మీఁ దెఱిఁగి, కార్యము గల్దని మాన్పి, యి ట్లనున్. 1575

శా. "దుఃఖింపం బని లేదు; పొమ్ము; బలసందోహంబులం దెమ్ము; చే
తఃఖేదం బెడలంగ రమ్ము; రిపులం దండింపు; కాదేని, భూ
స్వర్గఖేలజ్జన మెల్ల మెచ్చ, నృప! నీశౌర్యోన్నతుల్ సూపి, మే
దఃఖండంబులు భూతముల్ దినఁ దనుత్యాగంబు సేయం దగున్." 1576

వ. అని నగుచు విడిపించిన, [4]చిడిముడికి నగ్గలం బయిన సిగ్గున మ్రగ్గి, నెమ్మొగంబు
నూపక, కోపకపటభావంబులు మనంబునం బెనంగొనఁ "దపంబు చేసియైన
వీరలం జయించెద" నని పలాయితు లైన రాజులం గూడికొనుచు, జరాసంధుండు
దిరిగి చనియె; సురలు గుసుమవర్షంబులు గురియ, హలియు, హరియును మధురా
నగరజనవందిమాగధ జేగీయమాను లై, వీణావేణుమృదంగశంఖదుందుభినిన

1. పాపకర్మలు. 2. ఎత్తిపొడుపు మాటలు. 3. ఉత్సాహము. 4. అవమానము.

దంబు లాకర్ణించుచు, [1]మృగమదజలసిక్తవిమలవీథికాశతంబును, వివిధచిత్రకేత
నాద్యలంకృతంబును, సువర్ణమణిమయజయస్తంభనిబద్ధతోరణసంయుతంబును,
వేదనాదనినాదితంబును, సంతుష్టజనసంకులగోపురంబు నైన పురంబుఁ
బ్రవేశించి; రందు. 1577

ఉ. "వెల్లువ లైన వైరినృపవీరుల నెల్ల జయించి, వీటికిఁ
బల్లిదు లైన కృష్ణబలభద్రులు వచ్చుచు నున్నవారు; రం;
డుల్లములారఁ జూత" మని యున్నతసౌధము లెక్కి, వారిపైఁ
బల్లవపుష్పలాజములు పౌరపురంధ్రులు సల్లి రెల్లెడన్. 1578

వ. ఇట్లు పురంబు ప్రవేశించి, యుద్ధప్రకారం బెల్ల నుగ్రసేనున కెఱింగించి,
కృష్ణుం డిచ్ఛావిహారంబుల నుండె; మఱియు నెక్కుడుమత్సరంబున నమ్మాగ
ధుండు మహీమండలంబునం గల దుష్టమహీపతుల నెల్లం గూడికొని, [2]సప్తదశ
వారంబులు సప్తదశాక్షౌహిణీబలసమేతుండై మథురానగరంబుపై విడిసి,
మాధవభుజాప్రాకారరక్షితు లగు యాదవులతోడ [2]నాలంబు చేసి, నిర్మూలిత
బలుం డై పోయి, క్రమ్మఱ నష్టాదశయుద్ధంబునకు వచ్చునెడం, గలహవిద్యా
విశారదుం డగు నారదుండు కాలయవనుకడకుం జని, యి ట్లనియె. 1579

మ. "యవనా! నీవు సమస్తభూపతుల బాహాఖర్వగర్వోన్నతిం
బవనుం డభ్రములన్ హరించుపగిదిన్ భంజించియు, న్నేల యా
దవులన్ గెల్వవు? వారలన్ మఱచితో? దర్పంబు లేకుండెనో?
యవివేకస్థితి నొందితో? వెఱచితో? [4]హైన్యంబునుం జెందితో? 1580

క. యాదవులలోన నొక్కఁడు–మేదినిపై సత్త్వరేఖ మెఱసి, జరాసం
ధాదులఁ దూలం దోలెను;–దాదృశుఁ డిల లేఁడు; వినవె తత్కార్యంబుల్?" 

వ. అనిన విని కాలయవనుం డి ట్లనియె. 1582

శా. "ఏమీ నారద! నీవు చెప్పినవరుం డేరూపువాఁ? డెంతవాఁ?
[5]డేమేరన్ విహరించు? నెవ్వఁడు సఖుం? డెం దుండు? [6]నేపాటిదో
స్సామర్థ్యంబునఁ గయ్యముల్ సలుపు? నస్మద్బాహుశౌర్యంబు|సం
గ్రామక్షోణి భరించి, నిల్వఁగలఁడే? గర్వాఢ్యుఁడే? చెప్పుమా!" 1583

వ. అనిన విని, దేవముని యి ట్లనియె. 1584

సీ. నీలజీమూతసన్నిభశరీరమువాఁడు, తామరసాభనేత్రములవాఁడు,
పూర్ణేందుబింబముఁ బోలెడిమోమువాఁ, డున్నతదీర్ఘబాహువులవాఁడు,

1. కస్తూరి. 2. పదునేడుపర్యాయములు 3. యుద్ధము. 4. నీచత్వము. 5. ఎట్టిశక్తితో.
6. ఎంతమాత్రము.

శ్రీవత్సలాంఛనాంచితమహోరమువాఁడు, కౌస్తుభమణిపదకంబువాఁడు,
శ్రీకరపీతకౌశేయచేలమువాఁడు, మకరకుండలదీప్తి మలయువాఁడు,

తే. రాజ! యింతంతవాఁ డనరానివాఁడు,-మెఱసి దిక్కుల నెల్లను మెఱయువాఁడు,
దెలిసి యేవేళలం దైనఁ దిరుగువాఁడు,-పట్టనేర్చినఁ గాని లోఁబడనివాఁడు."

వ. అని మఱియు నతనిలక్షణంబులు చెప్పిన, విని సరకు సేయక. 1586

ఉ. "యాదవుఁ డెంతవాఁడు? ప్రళయాంతకుఁ డైన నెదిర్చెనేనియుం
గా దనఁ బోర; మత్కలహకర్కశబాహుధనుర్విముక్తనా
నాదృఢహేమపుంఖకఠినజ్వలదస్త్రపరంపరాసము
త్పాదితవహ్నికీలముల భస్మము సేసెదఁ దాపసోత్తమా!" 1587

వ. అని పలికి, కాలయవనుండు మూఁడుకోట్లమ్లేచ్ఛవీరులం గూడుకొని, శీఘ్రగమ
నంబున దాడివెడలి, మథురాపురంబుమీఁద విడిసినం జూచి, బలభద్రసహి
తుండై కృష్ణుం డిట్లని వితర్కించె. 1588

సీ. "యవనుండు పుర మెల్ల నావరించెను; నేఁటియెల్లింటిలోపల నీనడుమను
మాగధుండును వచ్చి,మనమీఁద విడియును; యవనమాగధులుమహాప్రబలులు;
పురి రెండువంకలఁ బోరుదు; రట్టిచో [1]నోపినభంగి నొక్కొక్కచోట
మనము యుద్ధము సేయ, మఱి యొక్కఁ డెడసొచ్చి,బంధులనందఱఁబట్టిచంపు;
తే. నొండెఁ గొనిపోయి చెఱఁ బెట్టు నుగ్రకర్ముఁ
డైనమాగధుఁ; డది గాన నరివరులకు
విడియఁ, బోరాడఁగా రాని [2]విషమభూమి
నొక్కదుర్గంబు సేసి, యం దునుపవలయు." 1589

వ. అని వితర్కించి, సముద్రు నడిగి సముద్రమధ్యంబునఁ బండ్రెండుయోజనంబుల
నిడుపు, నంతియ వెడల్పుం గల దుర్గప్రదేశంబు సంపాదించి, తన్మధ్యంబునం గృ
ష్ణుండు సర్వాశ్చర్యకరంబుగ నొక్కనగరంబు నిర్మింపు; మని విశ్వకర్మం
బంచిన. 1590

ఆ. వరుణపురముకంటె, వాసవుపురికంటె,-ధనదుపీటికంటె, దండధరుని
నగరికంటె, బ్రహ్మనగరంబుకంటెఁ, బ్ర-స్ఫుటము గాఁగ నొక్కపురముఁ జేసె.

వ. అందు. 1592

క. ఆకసముతోడిచూ లనఁ,-బ్రాకారము పొడవు గలదు; పాతాళమహా
లోకముకంటెను లోఁ తెం-తో కల దాప[3]రిఖ; యెఱుఁగ దొరక దొకరికిన్.

1. శక్తియున్నంతలో. 2. ఎచ్చుతగ్గులుగల ప్రదేశము, సాధ్యముగానితావు. 3. అగడ్త.

క. కోటయు మిన్నును దమలోఁ-బాటికి జగడింప, నడ్డపడి నిల్చినవా
చాటులరుచిఁ, దారకములు-[1]కూటువ లై కోటతుదలఁ గొమరారుఁ బురిన్.

శా. సాధుద్వారకవాటకుడ్యవలభిస్తంభార్గళాగేహళీ
వీథీవేదిగవాక్షచత్వరసభావేశ్మప్రఘాణప్రపా
సౌధాట్టాలకసాలహర్మ్యవిశిఖాసోపానసంస్థానముల్
శ్రీధుర్యస్థితి నొప్పుఁ గాంచనమణి[2]స్నిగ్ధంబు లై యప్పురిన్. 1595

క. కూడి గ్రహంబులు దిరుఁగఁగ,-మేడలతుదినిలువులందు మెలఁగెడిబాలల్
క్రీడింపరు పురుషులతో-వ్రీడం దద్వేళలందు విను మాపేటన్. 1596

ఉ. ఆయతవజ్రనీలమణిహాటక నిర్మితహర్మ్యసౌధవా
తాయనరంధ్రనిర్గతసితాభ్రమహాగరుధూపధూమముల్
తోయదపంక్తులో యనుచుఁ దుంగమహీరుహరమ్యశాఖలం
జేయుచు నుండుఁ దాండవవిశేషము లప్పురిఁ [3]గేకిసంఘముల్. 1597

ఆ. సరస నడచుచుండి, సౌధాగ్రహేమకుం-భములలోన నినుఁడు ప్రతిఫలింప
నేర్పరింపలేక, నినులు పెక్కండ్రుచుఁ-బ్రజలు సూచి, చోద్యపడుదు రందు.

ఉ. శ్రీరమణీయగంధములఁ జెన్ను వహించుఁ బురీవనంబులం
గోరకజాలకస్తబకకుట్మలపుష్పమరందపూరవి
స్ఫారలతాప్రకాండవిటపచ్ఛదపల్లవవల్లరీశిఖా
సారపరాగమూలఫలసంభృతవృక్షలతావిశేషముల్. 1599

క. శ్రీకరములు, జనహృదయవ-శీకరములు, మందపవనశీర్ణమహాంభ
[4]శ్శీకరములు, హంసవిహం-గాకరములు, నగరికువలయాబ్జాకరముల్. 1600

క. నవకుసుమామోదభరా-జవనము, రతిఖిన్నదేహజస్వేదాంభో
[5]లవనము, సమధిగతవనము,-పవనము విహరించుఁ బౌరభవనములందున్.

క. 'బ్రహ్మత్వము లఘు వగు' నని-బ్రహ్మయు బిరుదులకు వచ్చి పట్టఁడు గా, కా
బ్రహ్మాదికళలఁ దప్పరి,-బ్రహ్మజనుల్ బ్రహ్మఁ జిక్కుపఱుపరె చర్చన్? 1602

క. నగరీభూసురకృతలస-దగణితమఖధూమపిహిత మై కాక, మహా
గగనము నీలం బగునే?-మిగులఁగ బెడఁగగునె? గ్రహసమృద్ధం బయ్యున్.

క. తిరుగరు పలు; కర్థులకును, సురుఁగరు;-ధన మిత్తు; రితరసుదతీమణులఁ
మరుగరు; రణమునఁ బిఱిఁదికి-నరుగరు రాజన్యతనయు లా నగరమునన్.

క. రత్నాకర మై జలనిధి,-రత్నము లీ నేర; దేటిరత్నాకర మో?
రత్నములఁ గొనుదు; రిత్తురు-రత్నాకరజయులు వైశ్యరత్నములు పురిన్.

---

1. గుంపులు. 2. నునుపు. 3. నెమిళ్లగుంపులు. 4. తుంపురులు. 5. తొలఁగించునది.

క. తుంగంబులు, కరహతగిరి-శృంగంబులు, దానజలవశీకృతభృంగీ
భృంగంబులు, పటుశైలస-మాంగంబులు, నగరి మత్తమాతంగంబుల్. 1606

క. ప్రియములు, జితపవనమనో
రయములు, కృతజయము, లధికరమణీయగుణా
[1]న్వయములు, సవినయములు, ని
ర్భయములు, హతరిపుచయములు పట్టణహయముల్. 1607

క. పులులపగిదిఁ, గంఠీరవ-ములక్రియ, శరభములమాడ్కి, ముదితమదేభం
బుల తెఱఁగున నానావిధ-కలహామహోద్భటులు, భటులు గల రా వీటన్.

క. ఆ వీట నుండువారికి-భావింపఁగ లేవు క్షుత్పిపాసాదులు; త
ద్గోవిందకృపావశమున-[2]దేవప్రతిమాను లగుచు దీపింతు రిలన్. 1609

సీ. ఆసక్తి కృష్ణముఖావలోకనమంద, హరిపాదసేవనమంద చింత,
వెఱపు నారాయణవిముఖకార్యములంద, పారవశ్యము విష్ణుభక్తియంద,
బాష్పనిర్గతి చక్రిపద్యసంస్తుతులంద, పక్షపాతము శార్ఙ్గిభక్తులంద,
లేమి గోవిందాన్యలీలాచరణమంద, శ్రమము గోవిందపూజనములంద,
తే. బంధ మచ్యుతేతరదుష్టపదములంద-జ్వరము మాధవవిరహితక్షణములంద,
మచ్చరము లీశకైంకర్యమతములంద-నరవరోత్తమ! వినుము తన్నాగరులకు.

వ. మఱియు నప్పురవరంబున హరికిం బారిజాతమహీజంబును, సుధర్మ యనియెడి దేవసభయును దేవేంద్రుం డిచ్చె; కర్ణైకదేశంబుల నలుపు గలిగి మనోజవంబులును, శుక్లవర్ణంబులు నైన తురంగంబుల వరుణుం డొసంగె; మత్స్యకూర్మపద్మమహాపద్మశంఖముకుందకచ్ఛపనీలంబు లను నెనిమిదినిధులఁ గుబేరుండు సమర్పించె; నిజాధికారసిద్ధికొఱకుఁ దక్కినలోకపాలకులును దొల్లి తమకు భగవత్కరుణాకటాక్షవీక్షణంబుల సంభవించిన సర్వసంపదల మరల నతిభక్తితో సమర్పించి; రివ్విధంబున. 1611

క. దర్పించి, చేసి పురము స-మర్పించెను విశ్వకర్మ మంగళగుణసం
తర్పితగహ్వారికిని, గురు-దర్పిత[3]దుఃఖప్రవాహతరికిన్ హరికిన్. 1612

వ. ఇట్లు విశ్వకర్మనిర్మితం బైన ద్వారకానగరంబునకు నిజయోగప్రభావంబున మథురాపురజనుల నందఱం జేర్చి, బలభద్రున కెఱింగించి, తదనుమతంబున నందనవనంబు నిర్గమించు పూర్వదిగ్గజంబు పెంపున, మేరుగిరిగహ్వరంబు వెలు

---

1. వంశములుగలవి. 2. దేవతలతో సమానులు. 3. దుఃఖము అను ప్రవాహమును దాటించు ఓడయగువానికి.

వడు కంఠీరవంబు తెఱంగున, హరిహయదిగంతరాళంబున నుదయించు నంధ
కారపరిపంథికైవడి, మథురానగరంబు వెలువడి, నిరాయుధుండై యెదురు
వచ్చుచున్న హరిం గని. 1613

శ్రీకృష్ణుండు నిరాయుధుండై కాలయవనుఁడు వెంట నంటఁ బరుగెత్తుట

మ. "కరిసంఘంబులు లేవు; రావు తురగౌఘంబుల్; రథవ్రాతముల్
పరిసర్పింపవు; రారు శూరులు; ధనుర్బాణాసిముఖ్యాయుధో
త్కరముం బట్టఁడు; శక్రచాపయుతమేఘస్ఫూర్తితో మాలికా
ధరుఁ డొక్కం, డదె! నిర్గమించె నగరద్వారంబునం గంటిరే? 1614

శా. ఎన్నే నయ్యె దినంబు లీనగరిపై నేతెంచి పోరాటకున్?
ము న్నెవ్వండును రాఁడు; వీఁ డొకఁడు [1]నిరుక్తాయుధుం డేఁగుదెం
చె; న్నన్నోర్వఁగనో? ప్రియోక్తులకునో? శ్రీఁ గోరియో? చూడుఁ" డం
చు న్నాత్మీయజనంబుతోడ యవనేశుం డిట్లు తర్కింపఁగన్. 1615

క. విభు లగు బ్రహ్మప్రముఖుల-కభిముఖుఁ డై, నడవకుండునట్టి గుణాఢ్యుం
డిభరాజగమన మొప్పఁగ-నభిముఖుఁ డై నడచెఁ గాలయవనున కధిపా!

వ. ఆ సమయంబున నయ్యాదవేంద్రు నేర్పడం జూచి. 1617

మ. "వనజాతాక్షుఁడు, సింహమధ్యుఁడు, రమావక్షుండు, శ్రీవత్సలాం
ఛనుఁ, డంభోధరదేహుఁ, డిందుముఖుఁ, డంచద్దీర్ఘబాహుండు, స
ద్వనమాలాంగదహారకంకణసముద్యత్కుండలుం, డీతఁ డా
ముని సూచించిన వీరుఁ డా" ననుచు నమ్మూఢుండు గాఢోద్ధతిన్. 1618

సీ. చటులవాలాభీల[2]సైంహికేయునిభంగి, లాలితేతరజటాలతిక దూలఁ,
బ్రళయావసర[3]బృహద్భానుహేతిద్యుతిఁ, బరుషారుణశ్మశ్రుపటలి ప్రేలఁ,
[4]గాదంబినీచ్ఛన్నకాంచనగిరిభాతిఁ, గవచసంవృతదీర్ఘకాయ మమర,
వల్మీకసుప్తదుర్వారాహికైవడిఁ, [5]గోశంబులో వాలు కొమరుమిగుల,
ఆ. నార్చి పేర్చి మించి, యశ్వంబుఁ గదలించి-"కమలసంభవాదిఘనుల కైనఁ
బట్టరాని ప్రోడఁ బట్టెద"నని జగ-దవనుఁ బట్టఁ గదిసె యవనుఁ డధిప! 1619

క. ఇటు దన్నుఁ బట్ట వచ్చిన-బటుతరజవరేఖ మెఱసి, పట్టువడక ది
క్తటము లదర, హరి పాఱెం-జటులగతిన్ వాఁడుఁ దోడఁ జను దేరంగన్.

వ. అప్పుడు కాలయవనుం డిట్లనియె. 1621

1. వదలిపెట్టఁబడిన బాణములు గలవాఁడు. 2. రాహువు. 3. అగ్నిహోత్రుఁడు.
4. మేఘములవరుస. 5. ఒఱ.

మ. "యదువంశోత్తమ! పోకు; పోకు; రణ మీ నర్హంబు, గంసాదులన్
గదనక్షోణి జయించి తీ వని సమిత్కామంబునన్ వచ్చితిన్;
విదితఖ్యాతులు వీటిఁబోవ నరికిన్ వె న్నిచ్చి, యిబ్భంగి నేఁ
గుదురే రాజులు? రాజమాత్రుఁడవె? వైగుణ్యంబు వచ్చుం జుమీ! 1622

మ. బలిమిన్ మాధవ! నేఁడు నిన్ను భువనప్రఖ్యాతిగాఁ బట్టుదున్,
జలముల్ సొచ్చిన, భూమిక్రిందఁ జనినన్, శైలంబుపై నెక్కినన్,
బలిదండన్ విలసించినన్, వికృతరూపంబుం బ్రవేశించినన్,
జలధిన్ దాఁటిన, నగ్రజన్మహలికాశ్వాటాకృతుల్ దాల్చినన్. 1623

వ. అదియునుం గాక. 1624

మ. శరముల్ దూఱవు; మద్ధనుర్గుణలతాశబ్దంబు లేతేర; వా
హరిరింఖోద్ధతధూళి గప్పు; దకటా! హాస్యుండ వై పాఱె; దు
ర్వరపై నేక్రియఁ బోరితో? కదిసి మున్ వాతాశితోఁ గేశితోఁ
గరితో మల్లురతో జరాతనయుతోఁ గంసావనీనాథుతోన్." 1625

వ. అని పలుకుచుఁ గాలయవనుండు వెంట నరుగుదేర, సరకుసేయక, మంద
హాసంబు ముఖారవిందంబునకు సౌందర్యంబు నొసంగ, "వేగిరపడకు, రమ్ము
ర"మ్మనుచు హరియును. 1626

సీ. అదె యిదె లోఁబడె నని పట్ట వచ్చినఁ, గుప్పించి లంఘించుఁ గొంతదడవు;
పట్ట రా దీతని పరు వగ్గలం బని భావింపఁగా, సమీపమున నిలుచు;
నడరి పార్శ్వంబుల కడ్డంబు వచ్చినఁ, గేడించి యిట్టట్టుఁ [1]గికురువెట్టు;
వల్మీకతరుసరోవరము లడ్డం బైన, సవ్యాపసవ్యసంచరతఁ జూపుఁ;
తే. బల్లముల డాఁగు; దిబ్బల బయలువడును;
నీడలకుఁ బోవు; నిఱుముల నిగిడి తాఱు;
"నన్నుఁబట్టిన నీవు మానవుఁడ"వనుచు
యవనుఁ డెగవంగ బహుజగదవనుఁ డపుడు. 1627

వ. మఱియును. 1628

సీ. సకలభూతవ్రాతసంవాసుఁ డయ్యును, వనములు నగములు వరుస దాఁటు;
లోకోన్నతుండును [2]లోకచక్షుఁడు నయ్యు, మాటిమాటికి నిక్కి మగిడిచూచుఁ;
బక్షవిపక్షసంబంధశూన్యుం డయ్యుఁ, దను విపక్షుఁడు వెంటఁ దగుల నిగుడు;
విజయాపజయభావవిరహితుం డయ్యుఁ, దా నపజయంబును జెందినట్ల తోఁచు;

1. మోసగించును. 2. లోకమునకుఁ గన్నువంటివాఁడు.

ఆ. నభయభయవిహీనుఁ డయ్యు, భీతునిమాడ్కిఁ-గానఁబడును; సర్వకాలరూపుఁ
డయ్యుఁ, గాలచకితుఁ డైనకైవడి వన-మాలి పఱచు వెఱపు మాలి యధిప!

వ. ఇవ్విధంబున. 1630

క. దారితశాత్రవభవను, న-పారమహావేగవిజితపవనున్, యవనున్
దూరము గొని చని, కృష్ణుఁడు-ఘోరంబగు నొక్కశైలగుహ వడిఁ జొచ్చెన్.

క. ''అదె లోఁబడె, నిదె లోఁబడె;-నదె యిదె పట్టెద'' నటంచు నాశావశుఁడై
యదుసింహునిపదపద్ధతి-వదలక, గిరిగహ్వరంబు వాఁడుం జొచ్చెన్. 1632

వ. ఇట్లు సొచ్చి, మూఢహృదయంబునుంబోలెఁ దమఃపూర్ణం బయిన గుహాంతరాళంబున [1]దీర్ఘతల్పనిద్రితుం డై గుఱువెట్టుచున్న యొక్క మహాపురుషునిం గని, శ్రీహరిగాఁ దలంచి. 1633

ఉ. ''ఆలము సేయ లేక, పురుషాధమ! దుర్లభకంటకద్రుమా
భీలమహాశిలాసహితభీకరకుంజరఖడ్గసింహశా
ర్దూలతరక్షుసంకలితదుర్గపథంబునఁ బాఱుతెంచి, యీ
శైలగుహన్ [2]సనిద్రుక్రియఁ జాఁగి నటించినఁ, బోవ నిత్తునే? 1634

క. ఎక్కడ నెవ్వారలకును-జిక్కవనుచు నారదుండు సెప్పెను; నాకుం,
జిక్కితి; వెక్కడఁ బోయెదు?-నిక్కముగా నిద్రపుత్తు నిన్నీకొండన్.'' 1635

ఆ. అనుచు యవనుఁ డట్టహాసంబు గావించి-చటులకఠినకులిశసదృశ మైన
పాద మెత్తి తన్నెఁ, బాఱి తద్దేహంబు-నగగుహాం బ్రతిస్వనంబు నిగుడ.

ఉ. తన్నిన లేచి నీల్గి, కనుఁదమ్ములు మెల్లన విచ్చి, లోపలన్
సన్నపుఁ [3]గిన్క వర్ధిల, దిశల్ గని, దృష్టిసమిద్ధవిగ్రహో
త్పన్నమహాగ్నికీలముల భస్మము సేసె నతండు సాయక
చ్ఛిన్నవిరోధికంఠవను, శ్రీభవనున్, యవనున్ లఘుక్రియన్. 1637

వ. ఇ ట్లేకక్షణమాత్రంబున యవనుండు [4]నీఱయ్యె'' ననిన విని రా జిట్లనియె.

ముచుకుందుని పూర్వకథాభివర్ణనము.

ఆ. ''ఎవ్వఁ డాతఁ? డతని కెవ్వండు దండ్రి? ఘో-రాద్రిగుహకు నేటి కతఁడు వచ్చి,
నిద్రవోయె? యవను నిటు గాల్ప నెట్లోపెఁ?-దెలియఁబలుకు నాకు ధీవరేణ్య!''

వ. అనినం బరీక్షిన్నరేంద్రునకు నతికుతూహలంబుతో శుకయోగివర్యుం డిట్లనియె ''నిక్ష్వాకుకులసంభవుండు, మాంధాతకొడుకు, ముచుకుందుం డను రాజు,

---

1. పాడవయిన పడకయందు నిద్రించుచున్నవాఁడు. 2. నిద్రతోఁగూడినవాఁడు. 3. కోపము. 4. బూడిదయయ్యెను.

రాక్షసభీతు లైన వేల్పులం బెద్దకాలంబు సంరక్షించిన మెచ్చి, వా రమరలోక
రక్షకుం డైన యారాజకుమారునికడఁ జేరి, యి ట్లనిరి. 1640

మ. “జగతి న్నిర్గతకంటకం బయిన రాజ్యంబున్ విసర్జించి, శూ
రగణాగ్రేసర! పెద్దకాలము మమున్ రక్షించి; తీలోన నీ
మగువల్, మిత్రులు, బంధులున్, సుతులు, సంబంధుల్, భువిన్ లేరు; కా
లగతిం జెందిరి; కాల మెవ్వరికి దుర్లంఘ్యంబె, దా నారయన్. 1641

క. కాలము ప్రబలులకును బలి,-కాలాత్ముం డీశ్వరుం; డగణ్యుఁడు జనులం
గాలవశులఁగాఁ జేయును;-గాలము గడవంగ లేరు ఘను లెవ్వారున్. 1642

క. వర మిచ్చెద; మర్థింపుము-ధరణీశ్వర! మోక్షపదవి దక్కను, మే మె
వ్వరమును విభులము గా;మీ-శ్వరుఁ డగు హరి దక్క మోక్షసంగతిఁ జేయన్.”

వ. అని పలికిన, దేవతలకు నమస్కరించి, ముచుకుందుండు నిద్రం గోరి, దేవదత్త
నిద్రావశుం డై పర్వతగుహాంతరాళంబున శయనించి యుండె; యవనుండు
నీఱైనపిమ్మట హరి ముచుకుందునిముందఱ నిల్చిన. 1644

సీ. వనరుహాలోచను, వైజయంతీదామశోభితు, రాకేందుసుందరాస్యు,
మకరకుండలకాంతిమహిత[1]గండస్థలుఁ, గౌస్తుభాలంకృతు, ఘనశరీరు,
శ్రీవత్సలాంఛనాంచితవక్షు, మృగరాజమధ్యుఁ, జతుర్బాహు, మందహాసుఁ,
గాంచనసన్నిభ[2]కౌశేయవాసు, గాంభీర్యసౌందర్యశోభితుఁ, బ్రసన్ను,
ఆ. నమ్మహాత్ముఁ జూచి, యాశ్చర్యమును బొంది-తన్మనోజ్ఞదీప్తి దనకుఁ జూడ
నలవి గాక చకితుఁ డై, యెట్టకేలకుఁ-బలికెఁ బ్రీతి నవనిపాలకుండు. 1645

మ. “శశివో? యింద్రుఁడవో? [3]విభావసుఁడవో? చండప్రభారాశివో?
శశిచూడామణివో? పితామహుఁడవో? చక్రాంకహస్తుండవో?
దిశలున్ భూమియు మిన్ను నిండె నిదె నీ తేజంబుఁ జూడంగ దు
ర్వశ మై; యెవ్వఁడ? వేల వచ్చి? తిచటన్ వర్తించె దేకాకి వై? 1646

క. ఈయడవి విషమకంటక-[4]భూయిష్ఠము; ఘోరసత్త్వపుంజాలభ్యం;
బో యయ్య! యెట్లు వచ్చితి?-నీయడుగులు కమలపత్త్రనిభములు సూడన్. 1647

వ. మహాత్మా! యేను నీ శుశ్రూషణంబు సేయం గోరెద; నీజన్మగోత్రంబు లే నె
ఱుంగ, నర్హుండ నేని నెఱింగింపుము; నే నిక్ష్వాకువంశసంభవుండ, మాంధాతృ
నందనుండ, ముచుకుందుం డనువాఁడ; దేవహితార్థంబు చిరకాల[5]జాగరశ్రాం
తుండ నయి నిద్ర నొంది, యింద్రియసంచారంబులు మఱచి. 1648

1. చెక్కిళ్లుగలవాఁడు. 2. పట్టువస్త్రమును ధరించినవాఁడు. 3. అగ్ని దేవుఁడు. 4. నిండినది.
5. మేలుకొనియుండుట.

శా. ఏ నిద్రించుచు నుండ, నొక్కమనుజుం డేతెంచి దుష్కర్ముఁ డై
తా నీఱై, చెడె నాత్మకిల్బిషమునన్ దర్పోగ్రుఁ డై; యంతటన్
శ్రీనాథాకృతి వైన నిన్నుఁ గని, వీక్షింప న్నశక్తుండ నై,
దీనత్వంబును జెందితిన్; ననుఁ గృపాదృష్టిన్ విలోకింపవే.'' 1649

వ. అనిన విని మేఘగంభీరభాషణంబుల హరి యిట్లనియె. 1650

సీ. ''భూరజంబుల నైన భూనాథ! యెన్నంగఁ జనుఁ గాని, నాగుణజన్మకర్మ
నామంబు లెల్ల నెన్నంగ నెవ్వరుఁ జాల; రది యేల? నాకును నలవి గాదు;
నేలకు [1]వ్రేఁ గైననిఖలరాక్షసులను నిర్జించి, ధర్మంబు నిలువఁ బెట్ట
బ్రహ్మచే మున్ను నేఁ బ్రార్థింపఁబడి, వసుదేవునింటను వాసుదేవుఁ డనఁగఁ

ఆ. గరుణ నతవరించి, కంసాఖ్యుతో నున్న-కాలనేమిఁ జంపి, ఖలుల మఱియుఁ
ద్రుంచుచున్నవాఁడ; దొడరి నీచూడ్కి నీ-ఱైనవాఁడు కాలయవనుఁ డనఘ!

వ. వినుము; తొల్లియు నీవు నన్ను సేవించినకతంబున, నిన్ననుగ్రహింప నీశైలగుహకు నేతెంచితి; నభీష్టంబు లయిన వరంబు లడుగు మిచ్చెద; మద్భక్తు లగు జనులు గ్రమ్మఱ శోకంబున కర్హులు గా''రనిన హరికి ముచుకుందుండు నమస్కరించి, నారాయణదేవుం డగుట యెఱింగి, ''యిరువదియెనిమిదవ మహాయుగంబునందు నారాయణుం డవతరించు''నని మున్ను గర్గుండు చెప్పుటఁ దలంచి. 1652

ముచుకుందుఁడు శ్రీకృష్ణుని స్తోత్రము చేయుట

క. ''నీమాయఁ జిక్కి, పురుష-స్త్రీమూర్తికజనము నిన్ను సేవింపదు; వి
త్తామయగృహగత మై సుఖ-తామస మై కామవంచితం బయి యీశా! 1653

ఉ. పూని యనేకజన్మములఁ బొంది, తుదిం దనపుణ్యకర్మసం
తానము పేర్మిఁ గర్మవసుధాస్థలిఁ బుట్టి, ప్రపూర్ణదేహుఁ డై
మానవుఁ డై, గృహేచ్ఛఁ బడు మందుఁ; [2]డజంబు తృణాభిలాషి యై
కానక పోయి, నూతఁ బడుకైవడి నీపదభక్తిహీనుఁ డై, 1654

క. తరుణీపుత్రధనాదుల-మరగి, మహారాజ్యవిభవమదమత్తుఁడ నై,
[3]నరతనులుబ్ధుఁడ నగునా-కరయఁగ బహుకాల మీశ! [4]యాఱడివోయెన్.

క. ఘటకుడ్యసన్నిభం బగు-చటులకళేబరముఁ జొచ్చి, జనపతి నంచుం
బటుచతురంగంబులతో-నిటు నటుఁ దిరుగుదును; నిన్ను నెఱుఁగక యీశా!

ఆ. వివిధకామభోగవిషయలాలసు, మత్తు-నప్రమత్తవృత్తి నంతకుండ
వై ననీవు వేళ యరసి త్రుంతువు; సర్ప-మొదిఁగి మూషికంబు నొడియునట్లు.

---

1. భారము. 2. మేఁక. 3. మనుష్యశరీరము. 4. వ్యర్థమయ్యెను.

క. నరవరసంజ్ఞిత మై, రథ-కరిసేవిత మైన యొడలు కాలగతిఁ భీ
కరమృగభక్షిత మై, [1]దు-స్తరవిట్క్రిమిభస్మసంజ్ఞితం బగు నీశా! 1658

ఆ. సకలదిశలు గెలిచి, సములు వర్ణింపంగఁ-జారుపీఠ మెక్కి సార్వభౌముఁ
డైన సతులగృహములందుఁ గ్రీడాభోగ-వృత్తి నుండు నిన్ను వెదక లేఁడు. 1659

ఆ. మానసంబుఁ గట్టి, మహితభోగంబులు-మాని, యింద్రియములమదము లడఁచి,
తపము సేసి, యింద్రతయ కోరుఁగాని, నీ-యమృతపదము గోరఁ డజ్ఞుఁ; డీశ!

సీ. సంసారియై యున్న జనునకు నీశ్వర! నీకృప యెప్పుడు నెఱయఁ గల్గు;
నప్పుడు బంధంబు లన్నియుఁ దెగిపోవు; బంధమోక్షం బైనఁ బ్రాప్త మగును
సత్సంగమంబు; సత్సంగమంబున నీమభక్తి సిద్ధించు; నీభక్తివలన
సన్ముక్తి యగు; నాకు సత్సంగమముకంటె మును రాజ్యబంధనిర్మూలనంబు
తే. గలిగినది; దేవ! నీయనుగ్రహము గాదె?
కృష్ణ! నీసేవ గాని దక్కినవి వలదు;
[2]ముక్తిసంధాయి వగు నిన్ను ముట్ట గొలిచి,
యాత్మబంధంబు గోరునే యార్యుఁ డెందు? 1661

వ. కావున రజస్తమస్సత్త్వగుణంబుల యనుబంధంబు లగు నైశ్వర్యశత్రుమరణ ధర్మాది విశేషంబులు విడిచి, యీశ్వరుండును, విజ్ఞానఘనుండును, నిరంజనుండును, నిర్గుణుండును, నద్వయుండును నైన పరమపురుషుని నిన్నాశ్రయించెదఁ; జిరకాలంబు గర్మఫలంబులచేత నార్తుండ నై, క్రమ్మఱం దద్వాసనల సంతప్తుండ నై, తృష్ణం బాయక, శత్రువు లైన యింద్రియంబు లాఱింటిని గెలువలేని నాకు శాంతి యెక్కడిది? విపన్నుండ నైన నన్ను నిర్భయుం జేసి రక్షింపు" మనిన ముచుకుందునికి హరి యిట్లనియె. 1662

ఉ. "మంచిది నీదుబుద్ధి; నృపమండన! నీవు [3]పరార్థ మెట్లు వ
ర్తించిన నైనఁ, గోరికల దిక్కునఁ జిక్కవు; మేలు; నిర్మలో
దంచివృత్తి నన్ గొలుచు ధన్యు లబద్ధులు; నెట్లు నీకు ని
శ్చంచలభక్తి గల్గెడిని; సర్వము నేలుము; మాన నేటికిన్? 1663

వ. నరేంద్రా! నీవు తొల్లి క్షత్రధర్మంబున నిలిచి, మృగయావినోదంబుల జంతువుల వధియించినాఁడవు; తపంబునం దత్కర్మవిముక్తుండ వై, తర్వాతిజన్మంబున సర్వభూతసఖిత్వంబు గలిగి, బ్రాహ్మణశ్రేష్ఠుండ వై నన్నుం జేరెద"వని వీడ్కొలిపిన, హరికిఁ బ్రదక్షిణంబు వచ్చి, నమస్కరించి, గుహ వెడలి, సూక్ష్మప్రమాణ దేహంబు

1. దాటుటకసాధ్యముకాని, మలము, పురుగులు బూడిద యను పేరుగలది. 2. ముక్తినిగూర్చువాఁడు. 3. ఇతరుల ప్రయోజనము కొఱకు.

లతో నున్న మనుష్యపశువృక్షలతాదులం గని, కలియుగంబు ప్రాప్తం బగు నని తలంచి, యుత్తరాభిముఖుం డై తపోనిష్ఠుం డగుచు, సంశయంబులు విడిచి, సంగంబులు పరిహరించి, విష్ణునియందుఁ జిత్తంబుఁ జేర్చి, గంధమాదనంబు ప్రవేశించి, మఱియు నరనారాయణనివాసం బైన బదరికాశ్రమంబు చేరి, శాంతుం డై హరి నారాధించుచుండె; నిట్లు ముచుకుందుని వీడ్కొని. 1664

శా. అచ్ఛిద్రప్రకటప్రతాపరవిచే నాశాంతరాళంబులం
బ్రచ్ఛాదించుచుఁ గ్రమ్మఱన్ మథురకుం బద్మాక్షుఁ డేతెంచి, పే
[1]టాచ్ఛాదించి, మహానిరోధముగఁ జక్రాకారమై యున్న యా
మ్లేచ్ఛవ్రాతము నెల్లఁ ద్రుంచె రణభూమిం బెంపు సొంపారఁగన్. 1665

జరాసంధుండు ప్రవర్షణగిరిని దహించుట

వ. ఇట్లు మ్లేచ్ఛులం బొరిగొని, మఱియు నమ్మథురానగరంబునం గల ధనంబు ద్వారకానగరంబునకుం బంచిన మనుష్యులు గొనిపోవునెడ. 1666

సీ. ఘోటకసంఘాతఖురసమున్నిర్గతధూళి జీమూతసందేహముగను,
మహనీయ మదకలమాతంగకట[2]దానధారలు కీలాలధారలుగను,
నిరుపమస్యందననేమినిర్ఘోషంబు దారుణగర్జిత ధ్వానముగను,
నిశితశస్త్రాస్త్రమానితదీర్ఘరోచులు లలిత[3]సౌదామినీలతికలుగను,
తే. శత్రురాజప్రతాపాగ్ని శాంతముగను,
వృష్టికాలము వచ్చునవ్విధము దోఁప,
నేఁగుదెంచె జరాసంధుఁ డిరువదియును
మూఁడునక్షౌహిణులు దన్ను మొనసి కొలువ. 1667

చ. ఇటు చనుదెంచి యున్న మగధేశ్వరవాహినిఁ జూచి, యుద్ధసం
ఘటనము మాని, మానవులకై వడి భీరులభంగి నోడి, ముం
దటిధన మెల్ల డించి, మృదుతామరసాభపదద్వయుల్ [4]క్రియా
పటువులు రామకేశవులు పాఱిరి ఘోరవనాంతంబులన్. 1668

వ. ఇట్లు పఱచుచున్నకృష్ణబలభద్రులం జూచి, వారల ప్రభావంబు లెఱుంగక, పరిహసించి. 1669

ఉ. "ఓ యదువీరులార! రభసోద్ధతిఁ బాఱకుఁ; డిట్లు పాఱినం
బో యెడివాఁడఁ గాను; మిము భూమి నడంగిన, మిన్నుఁ బ్రాకినం,
దోయధిఁ జొచ్చినం, దగిలి త్రుంచెద"నంచు సమస్తసేనతోఁ
బాయక వచ్చె వెంటఁబడి బాహుబలాఢ్యుఁడు మాగధేశుఁడున్. 1670

1. నగరమాక్రమించి. 2. మదధారలు. 3. మెఱుపుతీగ. 4. కార్యములయందు దక్షులయినవారు.

వ. మఱియుం బలాయమానులై బహుయోజనంబుల దూరంబు సని, విశ్రాంతులై "తమకు డాఁగ నెల వగు" నని యింద్రుండు మిక్కిలి వర్షింపఁ, బ్రవర్షణాఖ్యంబై పదునొకండుయోజనంబులపొడవును నంతియ వెడలుపును గల గిరి యెక్కి; రంత. 1671

శా. ఆశైలేంద్రముఁ జుట్టి రా విడిసి, రోషావిష్టుఁడై మాగధో
ర్వీశుం డా వసుదేవనందనులఁ దా వీక్షింపఁగా లేక, త
న్నాశేచ్ఛన్ బిలసానుశృంగములఁ బూర్ణక్రోధుఁడై కాష్ఠముల్
రాశుల్ గా నిడి, చిచ్చు వెట్టఁ బనిచెన్ రౌద్రంబుతో భృత్యులన్. 1672

వ. ఇట్లు జరాసంధపరిజనప్రదీపితం బైన మహానలంబు దరికొనియె; నందు. 1673

క. పొగ లెగసెఁ;బొగలతుదలను,మిగులు చుమిడుఁగుఱులునిగిడె;మిడుఁగుఱుల గ్నిము
న్నుగ బ్రహ్మాండము నిండెను; భగభగమని మంటలొదవె భయదములగుచున్.

వ. మఱియు నమ్మహానలంబు బిలసానుశృంగవృక్షలతాకుంజపుంజంబుల దరికొని, శిఖలు కిసలయంబులుగ, విస్ఫులింగంబులు విరులుగ, సముద్ధూతధూమపటలంబులు బంధురస్కంధశాఖా[1]విసరంబులుఁగ, ననోకహంబుకైవడి నభ్రంకషంబై ప్రబ్బి, కఠోరసమీరణసమున్నతమహోల్కాజాలతిరోహిత వియచ్చరవిమానంబును, వివిధ విధూమస్ఫులింగవిలోకనప్రభూత నూతనతారకాభ్రాంతి విభ్రాంత గగనచరంబును, సంతప్యమానసరోవరసలిలంబును, విశాలజ్వాలాజాలజాజ్వల్యమానతక్కోలచందనాగరుకర్పూరధూమవాసనావాసిత గగనకుహరంబును, గరాళకీలాజాలదందహ్యమానకీచకనికుంజపుంజసంజనితచిటచిటారావపరిపూరిత దిగంతరాళంబును, భయంకరబహుళతరశిఖాభిద్యమాన పాషాణఘోషణపరిమూర్ఛిత ప్రాణిలోకంబును, సంతప్యమానశాఖిశాఖాంతర నిబిడ సీడనిహితశాబకవియోగదుఃఖడోలాయమానవిహంగకులంబును, మహాహేతిసందీప్యమాన [2]కటిసూత్రసంఘటితమయూరఫించకుచకలశయుగళభారాలసశబరకామినీసమాశ్రిత నిర్ఝరంబును, దగ్ధానేక [3]మృగమిథునంబునై యేర్చె నెడ. 1675

క. ఇల నేకాదశయోజన-ములపొడ వగు శైలశిఖరముననుండి వడిన్
బలకృష్ణులు రిపుబలముల-వెలి కుఱికిరి-కానఁబడక విలసితలీలన్. 1676

వ. ఇట్లు శత్రువుల వంచించి, యాదవేంద్రులు సముద్రపరిఖం బైన ద్వారకానగరంబునకుం జనిరి; జరాసంధుండు "వారలు దగ్ధులై" రని తలంచుచు బలంబులుం దానును మగధదేశంబునకు మరలి చనియె; నంత. 1677

1. సముదాయము. 2. మొలత్రాడు. 3. జింకల జంటలు గలది.

## రుక్మిణీకల్యాణకథాప్రారంభము

క. ఆ వనజగర్భపంపున,-రైవతుఁ డను రాజు దెచ్చి రామున కిచ్చెన్
రేవతి యనియెడు కన్యను; భూవర! మును వింటి కాదె బుద్ధిం దెలియన్?

వ. తదనంతరంబ. 1679

మ. "ఖగనాథుం డమరేంద్రు గెల్చి సుధ మున్ గైకొన్నచందంబునన్
జగతీనాథులఁ జైద్యపక్షచరులన్ సాళ్వాదులం గెల్చి, [1]భ
ద్రగుఁ డై చక్రి వరించె భీష్మకసుతన్, రాజీవగంధిన్, రమా
భగవత్యంశభవన్, మహాగుణమణిన్, బాలామణిన్ రుక్మిణిన్." 1680

వ. అనిన రా జిట్లనియె; మున్ను రాక్షసవివాహంబున స్వయంవరంబునకు వచ్చిన
హరి రుక్మిణిం గొనిపోయె నని పలికితివి; కృష్ణుం డొక్కరుం డెవ్విధంబున
సాళ్వాదులం జయించి, తనపురంబునకుం జనియె; నదియునుం గాక. 1681

శా. కల్యాణాత్మక మైన విష్ణుకథ లాకర్ణించుచున్ [2]ముక్తవై
కల్యుం డెవ్వఁడు తృప్తుఁ డౌ, నవి వినంగాఁ గ్రొత్తలై చుండు; సా
కల్యం బేర్పడ, భూసురోత్తమ! యెఱుంగం బల్కవే; రుక్మిణీ
కల్యాణంబు వినంగ నాకు మదిలోఁ గౌతూహలం బయ్యెడిన్.

క. భూషణములు సెవులకు, బుధ-తోషణము, లనేకజన్మదురితౌఘవిని
శ్శోషణములు, మంగళతర-ఘోషణములు, గరుడగమనుగుణభాషణముల్."

వ. అని రా జడిగిన శుకుం డిట్లనియె. 1684

చ. "వినుము; విదర్భదేశమున వీరుఁడు, [3]కుండినభర్త భీష్మకుం
డనునొకదొడ్డరాజు గలఁ, డాతని కేవురు పుత్రు; లగ్రజుం
డనఘుఁడు రుక్మినాఁ బరఁగు; నందఱకుం గడగొట్టుచెల్లెలై
మనుజవరేణ్య! పుట్టె నొకమానిని రుక్మిణి నాఁ బ్రసిద్ధ యై. 1685

క. బాలేందురేఖ దోఁచిన-లాలిత యగు నపరదిక్కులాగున, ధరణీ
పాలునిగేహము మెఱసెను-బాలిక జన్మించి యెదుగ భాసుర మగుచున్.

వ. మఱియు దినదినప్రవర్ధమాన యై. 1687

సీ. పేర్వేర బొమ్మలపెండ్లిండ్లు సేయుచు, నబలలతోడ వియ్యంబు లందు;
గుజ్జెనగూళ్ళను గొమ రొప్ప వండించి, చెలులకుఁ బెట్టించుఁ జెలువు మెఱసి;
రమణీయమందిరారామదేశంబులఁ బువ్వుఁదీగెలకును బ్రోది వెట్టు;
సదమలమణిమయసౌధభాగంబుల లీలతో [4]భర్మడోలికల నూఁగు;

---

1. శుభమునుపొందువాఁడై. 2. కలఁతమానినవాఁడు. 3. కుండినదేశమునకు రాజు.
4. బంగారు ఉయ్యెలలు.

తే. బాలికలతోడఁ జెలరేఁగి బంతు లాడు;-శారికాకీరపంక్తికిఁ జదువు సెప్పు;
బర్హిసంఘములకు ముఱిపములు గఱపు;-మదమరాళంబులకుఁ జూపుమందగతులు.

వ. అంత. 1689

సీ. దేవకీసుతుకోర్కి-తీగెలు వీడంగ, నెలఁదికి మైదీగె వీడఁ దొడఁగెఁ;
గమలనాభునిచిత్త-కమలంబు వికసింపఁ, గాంతి నింతికి ముఖకమల మొప్పెఁ;
మధువిరోధికిలోన మదనాగ్ని పొడచూపఁ, బొలఁతికిఁ బనుదోయి పొడవునూపెఁ;
శౌరికి ధైర్యంబు సన్నమై డయ్యఁగ, జలజాక్షిమధ్యంబు సన్న మయ్యెఁ;
ఆ. హరికిఁ బ్రేమబంధ మధికంబు గాఁ, గేశ-బంధ మధిక మగుచు బాల కమరెఁ;
బద్మనయనువలనఁ బ్రమదంబు [1]నిండార-నెలఁతయౌవనంబు నిండి యుండె.

వ. ఇట్లు రుక్మి, రుక్మరథ, రుక్మబాహు, రుక్మకేశ, రుక్మనేత్రు లను నేవురకుం
జెలియలైన రుక్మిణీదేవి దన యెలప్రాయంబున. 1691

క. తనతండ్రిగేహమునకుం-జనుదెంచుచు నున్న యతిథిజనులవలనఁ గృ
ష్ణునిరూపబలగుణాదులు-విని, 'కృష్ణుఁడు దనకుఁ దగినవిభుఁ' డని తలఁచెన్.

క. ఆలలనరూపు, బుద్ధియు-[2]శీలము, లక్షణము, గుణముఁ, జింతించి తగన్
'బాలారత్నముఁ దన కి-ల్లాలుగఁ జేకొందు' ననుచు హరియుం దలఁచెన్.

వ. అంత. 1694

ఉ. బంధువు లెల్లఁ 'గృష్ణునకు బాలిక నిచ్చెద' మంచు [3]శేముషీ
సింధువు లై విచారములు సేయఁగ, వారల నడ్డపెట్టి దు
స్సంధుఁడు రుక్మి కృష్ణునెడఁ జాల విరోధముఁ జేసి 'మత్తపు
ష్పంధయవేణి నిత్తు, శిశుపాలున' కంచుఁ దలంచె నంధుఁడై. 1695

ఉ. అన్నతలంపు దా నెఱిఁగి, యన్నవనీరజగంధి లోన నా
పన్నత నొంది, యాప్తుఁ డగు బ్రాహ్మణు నొక్కనిఁ జీరి, "గర్వసం
ఛన్నుఁడు రుక్మి నేఁడు ననుఁ జైద్యున కిచ్చెద నంచు నున్నవాఁ;
డెన్నివిధంబులం జని బుధేశ్వర! చక్రికి విన్నవింపవే. 1696

క. అయ్యా! కొడుకువిచారము-లయ్యయి వారింపఁజాలఁ; డటు గా కుండన్
[4]నెయ్య మెఱిఁగించి, చీరుము-చయ్యన నిజసేవకానుసారిన్, శౌరిన్." 1697

వ. అని కొన్నిరహస్యవచనంబులు సెప్పిన విని, బ్రాహ్మణుండు ద్వారకానగరంబు
నకుం జని, ప్రతిహారులవలనఁ దనరాక యెఱింగించి, యన్నగధరుం డున్న
నగరు ప్రవేశించి, యందుఁ గనకాసనాసీనుండై యున్న పురుషోత్తముం

---

1. సంపూర్ణముకాఁగా. 2. సదాచారము, మంచిస్వభావము. 3. తెలివితేటలయందు సముద్రమువంటివారు. 4. స్నేహము.

గాంచి, 'పెండ్లికొడుకవు గ'మ్మని దీవించిన, ముసిముసినగవులు నగుచు బ్రహ్మణ్యదేవుం డైన హరి దనగద్దియ దిగ్గన డిగ్గి, బ్రాహ్మణుం గూర్చుండ నియోగించి, తనకు దేవతలు సేయు చందంబునం బూజలు సేసి, సరసపదార్థ సంపన్నం బైన యన్నంబుఁ బెట్టించి, రెట్టించినప్రియంబున నయంబున భాసురుం డైన భూసురుం జేరి, లోకరక్షణ ప్రశస్తం బయిన హస్తంబున నతనియడుగులు[1] పుడుకుచు మెల్లన యిట్లనియె. 1698

సీ. "జగతీసురేశ్వర! సంతోషచిత్తుండ వై యున్న నీధర్మ మతిసులభము;
వృద్ధసమ్మత మిది; విత్త మెయ్యది యైనఁ బ్రాపింప హర్షించు బ్రాహ్మణుండు;
దనధర్మమున నుండుఁ; దరలఁ డాధర్మంబు; గోరిక లతనికిఁ గురియుచుండు;
సంతోషి గాఁ డేని శక్రుఁ డైన నశించు; నిర్ధనుం డైనను నిద్రవోవు;
ఆ. సంతసించె నేని సర్వభూతసుహృత్త-ములకుఁ, బ్రాప్తలాభ ముదితమాన
సులకు, శాంతులకును, సుజనులకును, గర్వ-హీనులకును వినతు లే నొనర్తు.

ఉ. ఎవ్వని దేశమం దునికి, యెవ్వనిచేఁ గుశలంబు గల్గు మీ,
కెవ్వనిరాజ్యమందుఁ బ్రజ లెల్ల సుఖింతురు, వాఁడు మత్ప్రియుం;
డివ్వనరాశిదుర్గమున కెట్లరుదెంచితి వయ్య! నీవు? లే
నవ్వులు గావు; నీతలఁపునం గల మే లొనరింతు ధీమణీ." 1700

వ. అని యిట్లు లీలాగృహీతశరీరుం డైనయప్పరమేశ్వరుం డడిగిన, ధరణీసురవరుం డతనికి సవినయంబుగా నిట్లనియె; దేవా! విదర్భదేశాధీశ్వరుం డైన భీష్మకుం డను రాజు గలం; డా రాజుకూఁతురు రుక్మిణి యనుకన్యకామణి గల. దయ్యిందు వదన నీకుం[2]గైంకర్యంబు సేయంగోరి, వివాహమంగళప్రశస్తం బయిన యొక్క-సందేశంబు విన్నవింపు మని పుత్తెంచె; నవధరింపుము. 1701

సీ. ఏ నీగుణములు కర్ణేంద్రియంబులు సోఁక, దేహతాపంబులు దీఱి పోవు,
నే నీశుభాకార మీక్షింపఁ, గన్నుల కఖిలార్థలాభంబు గలుగు చుండు,
నే నీచరణసేవ లేప్రొద్దుఁ జేసిన, భువనోన్నతత్వంబుఁ బొందఁ గలుగు,
నే నీలసన్నామ మేప్రొద్దు భక్తితోఁ దడవిన, బంధసంతతులు వాయు,
తే. నట్టి నీయందు నాచిత్త మనవరతము-నచ్చి యున్నది; నీయాన నాన లేదు;
కరుణఁ జూడుము కంసారి! ఖలవిదారి!-శ్రీయుతాకార! మానినీచిత్తచోర!

శా. ధన్యుల్, లోకమనోభిరాముఁ, గులవిద్యారూపతారుణ్యసౌ
జన్యశ్రీబలదానశౌర్యకరుణాసంశోభితుల్, నిన్ను నే
కన్యల్ గోరరు? కోరదే మును రమాకాంతాలలామంబు? రా
జన్యానేకపసింహ! నావలననే జన్మించెనే మోహముల్? 1703

1. స్పృశించుచు. 2. సేవ.

ఉ. శ్రీయుతమూర్తి! యోపురుషసింహమ! సింహముపాలిసొమ్ము [2]గో
మాయువు గోరుచందమున మత్తుఁడు చైద్యుఁడు నీపదాంబుజ
ధ్యాయిని నైన నన్నుఁ బడిఁ దాఁ గొనిపోయెద నంచు నున్నవాఁ;
డాయధమాధముం డెఱుఁగఁ డద్భుతమైన భవత్ప్రతాపమున్. 1704

మ. వ్రతముల్, దేవగురుద్విజన్మబుధసేవల్, దానధర్మాదులున్,
గతజన్మంబుల నీశ్వరున్ హరి జగత్కల్యాణుఁ గాంక్షించి, చే
సితినేనిన్, వసుదేవనందనుఁడు నాచిత్తేశుఁ డౌఁ గాక! ని
ర్జితులై పోదురు గాక! సంగరములోఁ జేదీశముఖ్యాధముల్. 1705

ఉ. అంకిలి సెప్ప లేదు; చతురంగబలంబులతోడ [1]నెల్లి యో
పంకజనాభ! నీవు శిశుపాలజరాసుతులన్ జయించి, నా
వంకకు వచ్చి, రాక్షసవివాహమునన్ భవదీయశౌర్యమే
యుంకువ సేసి, కృష్ణ! పురుషోత్తమ! చేకొని పొమ్ము వచ్చెదన్. 1706

సీ. లోపలిసౌధంబులోన వర్తింపంగఁ దే వచ్చునే? నిన్నుఁ దెత్తు నేనిఁ,
గావలివారలఁ గల బంధువులఁ జంపి, కాని తే రా దని కమలనయన!
భావించి తేని నుపాయంబు సెప్పెద; నాలింపు; కులదేవయాత్రఁ జేసి,
నగరంబు వెలువడి, [2]నగజాతకును మ్రొక్కఁ బెండ్లికి [3]మునుపడఁ బెండ్లికూఁతు
తే. నెలమి మావారుఁ బంపుదు; రేను నట్లు-పురము వెలువడి యేతెంచి, భూతనాథు
సతికి మ్రొక్కంగ, నీవు నాసమయమందు-వచ్చి, కొనిరమ్ము నన్ను నవార్యచరిత!

మ. ఘను లాత్మీయతమోనివృత్తికొఱకై గౌరీశుమర్యాద నె
వ్వనిపాదాంబుజతోయమందు మునుఁగన్ వాంఛింతు; రే నట్టి నీ
[4]యనుకంపన్ విలసింప నేని, వ్రతచర్యన్ నూఱుజన్మంబులన్
నినుఁ జింతించుచుఁ బ్రాణముల్ విడిచెదన్, నిక్కంబు ప్రాణేశ్వరా! 1708

సీ. ప్రాణేశ! నీమంజుభాషలు విన లేని కర్ణరంధ్రంబులకలిమి యేల?
పురుషరత్నమ! నీవు భోగింపఁగా లేని తనులతవలని సౌందర్య మేల?
భువనమోహన! నిన్నుఁ బొడగానఁగా లేని చక్షురింద్రియముల సత్త్వ మేల?
దయిత! నీయధరామృతం బానఁగా లేని జిహ్వకు ఫలరససిద్ధి యేల?
ఆ. నీరజాతనయన! నీవనమాలికా-గంధ మబ్బ లేని [6]ఘ్రాణ మేల?
ధన్యచరిత! నీకు దాస్యంబు సేయని-జన్మ మేల యెన్ని జన్మములకు?" 1709

వ. అని యిట్లు రుక్మిణీదేవి పుత్తెంచిన సందేశంబును రూపసౌందర్యాదివిశేషంబు
లును, బ్రాహ్మణుండు హరికి విన్నవించి, కర్తవ్యం బెద్ది సేయ నవధరింపు; మని
సవర్ణనంబుగా మఱియు ని ట్లనియె. 1710

1. నక్క. 2. రేపు. 3. పార్వతీదేవి. 4. ముందుగా. 5. దయ. 6. ముక్కు.

సీ. "పల్లవవైభవాస్పదములు పదములు; [1]కనకరంభాతిరస్కారు లూరు;
లరుణప్రభామనోహరములు కరములు; కంబుసౌందర్యమంగళము గళము;
మహితభావాభావమధ్యంబు మధ్యంబు; చక్షురుత్సవదాయి చన్నుదోయి;
పరిహసితార్ధేందుపటలంబు [2]నిటలంబు; జితమత్తమధుకరశ్రేణి వేణి;

ఆ. భావజాశుగముల ప్రాపులు చూపులు;-కుసుమశరునివింటికొమలు బొమలు;
చిత్తతోషణములు చెలువభాషణములు;-జలజనయనముఖము చంద్రసఖము.

ఉ. ఆ యెలనాఁగ నీకుఁ దగు; నంగనకుం దగు దీవు; మాయుపా
ధ్యాయులయాన; పెండ్లియగుఁ; దప్పదు; జాడ్యము లేల? నీవు సే
తోయమువారిఁ గూడుకొని, తోయరుహాననఁ దెత్తు గాని, వి
చ్చేయుము; శత్రులన్ నుఱుము సేయుము; సేయుము శోభనం బిలన్." 1712

శ్రీకృష్ణుండు కుండిననగరంబునకు రథారూఢుండై చనుట.

వ. అని యిట్లు పలికిన బ్రాహ్మణునివలన విదర్భరాజతనయ పుత్తెంచిన సందేశంబును, రూపసౌందర్యాదివిశేషంబులును విన నవధరించి, నిజకరంబున నతనికరంబు పట్టి, నగుచు నయ్యాదవేంద్రుం డిట్లనియె. 1713

ఉ. "కన్నియమీఁద నాతలఁపు గాఢము; కూరుకు రాదు రేయి నా
కెన్నఁడు; నావివాహము సహింపక రుక్మి దలంచు కీడు; నే
మున్నె యెఱుంగుదుం; బరులమూఁక వధించి, కుమారిఁ దెత్తు; వి
ద్వన్నుత! మ్రాను [3]ద్రచ్చి నవవహ్నిశిఖన్ వడిఁ దెచ్చుకైవడిన్. 1714

క. వచ్చెద విదర్భభూమికిఁ;-జొచ్చెద భీష్మకునిపురము; సురుచిరలీలం
దెచ్చెద; బాలన్ [4]ప్రేల్మిడి-వ్రచ్చెద, నడ్డంబు రిపులు వచ్చినఁ బోరన్." 1715

వ. అని పలికిన రుక్మిణీదేవి పెండ్లినక్షత్రంబు దెలిసి, తనపంపున రథసారథి యైన దారుకుండు శైబ్యసుగ్రీవమేఘపుష్పవలాహకంబు లను తురంగంబులం బూన్చి, రథ మాయత్తంబు చేసి తెచ్చిన నమోఘమనోరథుండై, హరి దాను బ్రాహ్మణుండును రథారోహణంబుఁ జేసి, యేకరాత్రంబున నానర్తకదేశంబులు గడచి, విదర్భదేశంబునకుం జనియె; నంతఁ గుండినపురీశ్వరుండైన భీష్మకుండు కొడుకునకు వశుండై, కూఁతు శిశుపాలున కిత్తునని శోభనోద్యోగంబులు సేయించె; నప్పుడు. 1716

సీ. రచ్చలు, [5]క్రంతలు, రాజమార్గంబులు, విపణిదేశంబులు, విశదములు గఁ
జేసిరి; చందనసిక్తతోయంబులు గలయంగఁ జల్లిరి; కలువడములు

1. బంగారు అరఁటిచెట్లను ధిక్కరించునవి. 2. నొసలు. 3. తఱచి. 4. చిటికలో. 5. సందుత్రోవలు.

రమణీయవివిధతోరణములు గట్టిరి; సకలగృహంబులుఁ జక్కఁ జేసి
కర్పూరకుంకుమాగరుధూపములు వెట్టి; రతివలుఁ బురుషులు నన్ని యెడల

ఆ. వివిధవస్త్రములను, వివిధమాల్యాంబరా-భరణలేపనములఁ, బరఁగియుండి
రఖిలవాద్యములు మహాప్రీతి మ్రోయించి-యుత్సవమున నగర మొప్పి యుండె.

వ. అంత నా భీష్మకుండు విహితప్రకారంబునం బితృదేవతల నర్చించి, బ్రాహ్మణులకు
భోజనంబులు వెట్టించి, మంగళాశీర్వచనంబులు సదివించి, రుక్మిణీదేవి నభిషిక్తం
జేసి, వస్త్రయుగళభూషితం గావించి, రత్నభూషణంబు లిడంజేసె; ఋగ్యజుస్సా
మాథర్వణమంత్రంబుల మంగళాచారంబు లొనరించి, భూసురులు రక్షాకర
ణంబు లాచరించిరి; పురోహితుండు గ్రహశాంతికొఱకు నిగమనిగదితన్యాయం
బున హోమంబుఁ గావించె; మఱియు నా రాజు దంపతులమేలుకొఱకుఁ దిలధేను
కలధౌతకనకచేలాదిదానంబులు ధరణిదేవతల కొసంగె; నయ్యవసరంబున.

మ. భటసంఘంబులతో, రథావళులతో, భద్రేభయూథంబుతోఁ,
బటువేగాన్వితఘోటకవ్రజముతో, బంధుప్రియశ్రేణితోఁ,
గటుసంరంభముతో, "విదర్భతనయం గైకొందు" నంచున్ [1]విశం
కటవృత్తిం జనుదెంచెఁ జైద్యుఁడు గడున్ గర్వించి యవ్వీటికిన్. 1719

ఉ. "బంధులఁ గూడి, కృష్ణబలభద్రులు వచ్చినఁ బాఱఁ దోలి, [2]ని
ర్బంధరవృత్తిఁ జైద్యునికి మానినిఁ గూర్చెద," మంచు నుల్లస
త్సింధురవీరరథ్యరథసేనలతోఁ జనుదెంచి రా జరా
సంధుఁడు, దంతవక్త్రుఁడును, సాల్వవిదూరకపౌండ్రకాదులున్. 1720

వ. మఱియు నానాదేశంబులరాజు లనేకు లేతెంచి; రందు శిశుపాలు నెదుర్కొని
పూజించి, భీష్మకుం డొక్క [3]నివేశంబున నతని విడియించె; నంత నా వృత్తాం
తంబు విని. 1721

చ. "హరి యొకఁ డేఁగినాఁడు; మగధాదులు చైద్యహితానుసారులై
నరపతు లెందఱేనిఁ జనినారు; కుమారికఁ దెచ్చుచోట సం
గర మగుఁ; దోడు గావలయుఁ గంసవిరోధికి;" నంచు వేగఁ దా
నరిగె హలాయుధుండు గమలాక్షునిజాడ ననేకసేనతోన్. 1722

క. ఆలోపల నేకతమున-నాలోలవిశాలనయన యగు రుక్మిణి, త
న్నాలోకలోచనుఁడు హరి-యాలోకము చేసి, కదియఁ డని శంకితయై. 1723

శా. "లగ్నం బెల్లి; వివాహముం గదిసె; నేలా రాఁడు గోవిందుఁ, [4]డు
ద్విగ్నం బయ్యెడి మానసంబు; వినరో వృత్తాంతమున్; బ్రాహ్మణుం

1. విస్తారమగు ప్రవర్తనముతో. 2. అడ్డములేని వర్తనముతో. 3. గృహము. 4. కలఁత పొందినది.

డగ్నిద్యోతనుఁ డేటికిం దడసెఁ? నా యత్నంబు సిద్ధించునో?
భగ్నంబై చనునో? విరించికృత మెబ్భంగిన్ బ్రవర్తించునో? 1724

మ. ఘనుఁ డా భూసురుఁ డేఁగెనో? నడుమ మార్గశ్రాంతుఁడై చిక్కెనో?
విని, కృష్ణుం డిది దప్పుగాఁ దలఁచెనో? విచ్చేసెనో యీశ్వరుం?
డనుకూలింపఁ దలంచునో? తలఁపఁడో? [1]యార్యామహాదేవియున్
నను రక్షింప నెఱుంగునో? యెఱుఁగదో? నాభాగ్య మెట్లున్నదో?" 1725

వ. అని వితర్కించుచు. 1726

ఉ. పోఁ డను బ్రాహ్మణుండు యదుపుంగవుపీటికి; వాసుదేవుఁడున్
రాఁ డను; నింకఁ బోయి హరి రమ్మని చీరెడి యిష్టబంధుఁడున్
లేఁ డను; రుక్మికిం దగవు లే; డిటఁ జైద్యున కిత్తు నంచు ను
న్నాఁ డను; గౌరి కీశ్వరికి నావలనం గృప లేదు నేఁ డనున్. 1727

ఉ. చెప్పదు తల్లికిం దలఁపుఁజిక్కు; దిశల్ దరహాసచంద్రికం
గప్పదు; వక్త్రతామరసగంధసమాగతభృంగసంఘమున్
రొప్పదు; నిద్రఁ గైకొన; దురోజపరస్పరసక్తహారముల్
విప్పదు; కృష్ణమార్గగతవీక్షణపంక్తులు ద్రిప్ప దెప్పుడున్. 1728

చ. తుడువదు కన్నులన్ వెడలు తోయకణంబులు; కొప్పుఁ జక్కఁగా
ముడువదు; నెచ్చెలిం గదిసి ముచ్చటకుం జన; దన్న మేమియుం
గుడువదు; నీరముం గొనదు; కూరిమిఁ గీరముఁ జేరి పద్యముల్
నొడువదు; [2]వల్లకీగుణవినోదము సేయదు; డాయ దన్యులన్. 1729

సీ. మృగనాభి యలఁదదు మృగరాజమధ్యమ; జలముల నాడదు జలజగంధి;
ముకురంబు సూడదు [3]ముకురసన్నిభముఖి; పువ్వులు దుఱుమదు పువ్వుఁబోఁడి;
వనకేళిఁ గోరదు వనజాతలోచన; హంసంబుఁ బెంపదు హంసగమన;
లతలఁ బోషింపదు లతికాలలితదేహ; తొడవులు దొడువదు తొడవుతొడవు;
ఆ. తిలక మిడదు నుదుటఁ దిలకినీతిలకంబు-కమలగృహముఁ జొరదు కమలహస్త
'గారవించి తన్నుఁ గరుణఁ గైకొన వన-మాలి రాఁడు, తగవు మాలి' యనుచు.

వ. మఱియును. 1731

మ. మలఁగున్ మెల్లనిగాలికిం; బటురటన్మత్తద్విరేఫాలికిం
దలఁగుం; గోయిలమ్రోఁతకై యలఁగు; నుద్యత్కీరసంభాషలం
గలఁగున్; వెన్నెలవేఁడిమి న్నలఁగు; మాకందాంకురచ్ఛాయకుం
దొలఁగుం; గొమ్మ మనోభవానలశిఖాదోదూయమానాంగియై. 1732

1. గౌరీదేవి, పార్వతి. 2. వీణాతంత్రులమీటి వేడుకతో వాయింపదు. అని భావము. 3. అద్దము.

వ. ఇట్లు హరిరాక కెదురుచూచుచు, సకలప్రయోజనంబులయందును విరక్తయై, మనోజానలంబునం బొగిలెడి మగువకు, శుభంబుఁ జెప్పు విధంబున వామలోచనభుజంబు లదరు నంతఁ, గృష్ణు [1]నియోగంబున వేగంబున బ్రాహ్మణుండు సనుదెంచిన, నతనిముఖలక్షణం బుపలక్షించి, యా కలకంఠి మహోత్కంఠతోడ నకుంఠితయై, మొగంబునం జిఱునగవు నిగుడ, నెదురుసని నిలువంబడిన, బ్రాహ్మణుం డి ట్లనియె. 1733

ఉ. "మెచ్చె భవద్గుణోన్నతి; కమేయధనావళు లిచ్చె నాఁడు; దా
వచ్చె సుదర్శనాయుధుఁడు వాఁడె; సురాసురు లెల్ల నడ్డమై
వచ్చిన నైన, రాక్షసవివాహమునం గొనిపోవు నిన్ను; నీ
సచ్చరితంబు, భాగ్యమును, సర్వము నేఁడు ఫలించెఁ గన్యకా!" 1734

వ. అనిన వైదర్భి యి ట్లనియె. 1735

మ. "జలజాతేక్షణుఁ దోడి తెచ్చితివి, నాసందేశముం జెప్పి; నన్
నిలువం బెట్టితి; నీకృపన్ బ్రదికితిన్; నీయంతపుణ్యాత్మకుల్
గలరే? దీనికి నీకుఁ బ్రత్యుపకృతిం గావింప నే నేర; నం
జలిఁ గావించెద; భూసురాన్వయమణీ! సద్బంధుచింతామణీ!" 1736

వ. అని నమస్కరించె: నంత రామకృష్ణులు దనకూఁతువివాహంబునకు వచ్చుట విని, తూర్యఘోషంబులతో నెదుర్కొని, విధ్యుక్తప్రకారంబునం బూజించి, మధుపర్కంబు లిచ్చి, వివిధాంబరాభరణంబులు మొదలైన కానిక లొసంగి, భీష్మకుండు బంధుజనసేనాసమేతులైనవారలకుఁ దూర్ణంబున సకలసంపత్పరిపూర్ణంబులైన నివేశంబులు కల్పించి, విడియించె; నిట్లు గూడిన రాజుల కెల్లను [2]వయోవీర్యబలవిత్తంబు లెట్లట్ల కోరిన పదార్థంబు లెల్ల నిప్పించి, పూజించె; నంత విదర్భపురంబు ప్రజలు హరిరాక విని, వచ్చి చూచి, నేత్రాంజలులం దదీయవదనకమల పానంబు సేయుచు. 1737

మ. "తగు నీచక్రి విదర్భరాజసుతకుం; దథ్యంబు వైదర్భియుం
దగు నీచక్రికి; నింతమంచి దగునే దాంపత్య? మీయిద్దఱిం
దగులం గట్టిన బ్రహ్మ నేర్పరి గదా? దర్పాహతారాతియై
మగఁ డౌఁ గావుతఁ! జక్రి యీరమణికిన్ మాపుణ్యమూలంబునన్." 1738

వ. అని పలికి; రాసమయంబున. 1739

సీ. సన్నద్ధులై బహుశస్త్రసమేతులై, బలసి చుట్టును వీరభటులు గొలువ,
ముందట [3]నుపహారములుఁ గానికలుఁ గొంచు, వర్గంబులై వారవనిత లేఁగఁ,

1. ఉత్తర్వుచేత. 2. వయస్సు-పరాక్రమము, బలము, ధనములు. 3. పిండివంటలు.

బుష్పగంధాంబరభూషణకలితలై, పాడుచు భూసురభార్య లరుగఁ,
బణవమర్దలశంఖపటహకాహళవేణుభేరీధ్వనుల మిన్ను పిక్కటిలఁగఁ,
ఆ. దగిలి సఖులు గొలువఁ, దల్లులు బాంధవ-సతులుఁ దోడ రాఁగ, సవినయముగ
నగరు వెడలి నడచె, నగజాతకును మ్రొక్క-బాల చికురపిహితఫాల యగుచు.

వ. మఱియు సూతమాగధవందిగాయకపాఠకజను లంతంత నభినందించుచుం జను
దేర, మందగమనంబున ముకుందచరణారవిందంబులు డెందంబునఁ దలంచుచు
నిందుధరసుందరీమందిరంబు సేరి, సలిలధారాధౌతకరచరణారవిందయై, [1]వార్చి,
శుచియై, గౌరీసమీపంబునకుం జనియె; నంత ముత్తైదువ లగు భూసురోత్తములభా
ర్యలు భవసహితయైన భవానికి మజ్జనంబు గావించి, గంధాక్షతంబు లిడి, వస్త్ర
మాల్యభూషణాదుల నలంకరించి, ధూపదీపంబు లొసంగి, నానావిధోపహారం
బులు సమర్పించి, కానిక లిచ్చి, దీపమాలికల [2]నివాళించి, రుక్మిణీదేవిని
మ్రొక్కించి; రప్పుడు. 1741

ఉ. "నమ్మితి నామనంబున [3]సనాతను లైన యుమామహేశులన్;
మిమ్ముఁ బురాణదంపతుల మేలు భజింతుఁ గదమ్మ!; మేటిపె
ద్దమ్మ! దయాంబురాశివి గదమ్మ! హరిం బతిఁ జేయు మమ్మ! నిన్
నమ్మినవారి కెన్నఁడును నాశము లేదు గదమ్మ! యీశ్వరీ!" 1742

వ. అని గౌరీదేవికి మ్రొక్కి, పతులతోడం గూడిన బ్రాహ్మణభార్యలకు [4]లవణాపూ
పంబులును, దాంబూలకంఠసూత్రంబులును, నిక్షుదండంబులు, నిచ్చి రుక్మిణీ
దేవి వారలం బూజించిన. 1743

ఆ. వార లుత్సహించి, వలనొప్ప దీవించి-సేస లిడిరి యువతిశిరమునందు;
[5]సేస లెల్లఁ గాల్చి, శివవల్లభకు మ్రొక్కి-మౌననియతి మాని, మగువ వెడలె.

వ. ఇట్లు మేఘమధ్యంబు వెలువడి విలసించు క్రొక్కారుమెఱుంగు తెఱంగున, మృగ
ధరమండలంబు నిర్గమించి చరించు మృగంబుచందంబునఁ, గమలభవనర్తకుం
డెత్తిన జవనికమఱుంగు దెరలి పొడసూపినమోహినీదేవతకైవడి, దేవదానవ
సంఘాత కరతలసవ్యాపసవ్యసమాకృష్యమాణ పన్నగేంద్రపాశపరివలయిత
పర్యాయపరిభ్రాంత మందరాచల మంథానమథ్యమానఘూర్ణిత ఘుమఘుమా
యిత మహార్ణవమధ్యంబుననుండి చనుదెంచు నిందిరాసుందరివై భవంబున,
బహువిధప్రభాభాసమానయై యిందుధరగేహినీమందిరంబు వెలువడి, మానస
కాసారహేమకమలకాననవిహరమాణమదమరాళంబుభంగి, మందగమనం

1. ఆచమనముచేసి. 2. హారతులెత్తి. 3. పురాతనులు. 4. ఉప్పుతోఁజేయఁబడిన భక్ష్య
ములు. 5. అక్షతలు.

బునఁ గనకకలశయుగళసంకాశ కర్కశపయోధరభారపరికంప్యమానమధ్య యై, రత్నముద్రికాలంకృతం బైన కెంగేల నొక్కసఖిలలామంబు నైదండ గొని, రత్ననివహసమంచిత కాంచనకర్ణపత్త్రమయూఖంబులు గండభాగంబుల నర్తనంబులు సలుప, నరవిందపరిమళకుతూహలావతీర్ణ మత్తమధుకరంబులవాడ్కి నరాళంబులైన కుంతలజాలంబులు ముఖమండలంబునం గ్రందుకొన, సుందర మందహాసరోచులు దిశలందు బాలచంద్రికాసౌందర్యంబు నావహింప, నధర బింబఫలారుణ మరీచిమాలికలు రదనకుందకుట్మలంబుల కనురాగంబు సంపాదింప, మనోజాతకేతన సన్నిభంబైన పయ్యెదకొంగు దూఁగ, సువర్ణమేఖలా ఘటితమణికిరణపటలంబు లకాలశక్రచాపజనకంబులై మెఱయఁ, జెఱకు విలుతుం డోర వెఱికి, వాఁడియిడి బళిపించిన ధగద్ధగాయమానంబులగు బాణంబులపగిది సురుచిరవిలోకననికరంబులు రాజవీరులహృదయంబులు భేదింప, [1]శింజానమంజుమంజీరనినదంబులు సెవులపండువులు సేయఁ, బాదసంచారంబున హరిరాక కెదురుచూచుచు, వీర మోహిని యై చనుదెంచు సమయంబున. 1745

మ. అళినీలాలకఁ, బూర్ణచంద్రముఖి, నేణాక్షిం, బ్రవాళాధరం,
గలకంఠిన్, నవపల్లవాంఘ్రియుగళన్, గంధేభకుంభస్తనిం,
బులినశ్రోణి, నిభేంద్రయాన, నరుణాంభోజాతహస్తన్, మహో
త్పలగంధిన్, మృగరాజమధ్యఁ గని విభ్రాంతాత్ములై రందఱున్. 1746

వ. మఱియు నయ్యింతిదరహాసలజ్జావలోకనంబులం జిత్తంబు లేమఱి, ధైర్యంబులు దిగనాడి, గాంభీర్యంబులు విడిచి, గౌరవంబులు మఱచి, చేష్టలు మాని, మెఱుకలుడిగి, యాయుధంబులు దిగవైచి, గజతురగరథారోహణంబులు సేయనేరక, రాజులెల్ల నేలకు వ్రాలి; రా యేణీలోచన, తన వామకరనఖంబుల [2]నలకంబులు దలంగం ద్రోయుచు, నుత్తరీయంబు సక్క నొత్తుచుఁ, గడగంటి చూపులం గ్రమంబున నా రాజలోకంబు నాలోకింపుచు. 1747

మ. కనియెన్ రుక్మిణి చంద్రమండలముఖుం, గంఠీరవేంద్రావల
గ్నున్, నవాంభోజదళాక్షుఁ, జారుతరవక్షున్, మేఘసంకాశదే
హు, నగారాతిగజేంద్రహస్తనిభబాహుం, జక్రిఁ, బీతాంబరున్,
ఘనభూషాన్వితుఁ, గంబుకంఠు, విజయోత్కంఠున్, జగన్మోహనున్. 1748

కృష్ణుండు శత్రురాజులు చూచుచుండ రుక్మిణీదేవిని గొనిపోవుట

వ. కని తదీయరూపవయోలావణ్యవైభవగాంభీర్యచాతుర్యతేజోవిశేషంబులకు సంతసించి, మనోభవశరాక్రాంతయై రథారోహణంబు గోరుచున్న వరారోహం

1. ధ్వనిచేయుచున్న. 2. ముంగురులు.

జూచి, పరిపంథిరాజలోకంబు సూచుచుండ మందగమనంబున గంధసింధు
రంబులీలం జనుదెంచి, [1]ఫేరవంబులనడిమిభాగంబు గొని చను కంఠీరవంబు
కైవడి, నిఖిలభూపాలగణంబుల గణింపక తృణీకరించి, రాజకన్యకం దెచ్చి,
హరి దన రథంబుమీఁద నిడికొని, భూనభోంతరాళంబులు నిండ శంఖంబు
పూరించుచు, బలభద్రుండు తోడ నడవ, యాదవవాహినీపరివృతుండై,
ద్వారకానగర మార్గంబు పట్టి చనియె; నంత జరాసంధవశు లయిన రాజు
లందఱు హరిపరాక్రమంబు విని, సహింపనోపక. 1749

మ. "ఘనసింహంబులకీర్తి నీచమృగముల్ గైకొన్నచందంబునన్
మనకీర్తుల్ గొని, బాలఁ దోడ్కొనుచు నున్మాదంబుతో గోపకుల్
సనుచున్నా; రదె! శౌర్య మెన్నఁటికి? మీశస్త్రాస్త్రముల్ గాల్పనే?
తనుమధ్యన్ విడిపింపమేని, నగరే ధాత్రీజనుల్ క్రంతలన్?" 1750

వ. అని యొండొరులం దెలుపుకొని, రోషంబులు హృదయంబుల నిలుపుకొని,
సంరంభించి తనుత్రాణంబులు వహించి, ధనురాదిసాధనంబులు ధరియించి, పం
తంబులాడి, తమతమ చతురంగబలంబులం గూడికొని, జరాసంధాదులు యదు
వీరుల వెంటనంటి, తాఁకి నిలునిలుండని ధిక్కరించి పలికి, [2]యుక్కు మిగిలి,
మహీధరంబులమీఁద సలిలధారలు గురియు ధారాధరంబులచందంబున, బాణ
వర్షంబులు గురిసిన, యాదవసేనలం గల దండనాయకులు కోదండంబు లెక్కిడి,
గుణంబులు మ్రోయించి, నిలువంబడి; రప్పుడు. 1751

క. అరిబలభటసాయకముల-హరిబలములు గప్పఁబడిన నడరెడు భీతిన్,
[3]హరిమధ్య సిగ్గుతోడను-హరివదనముఁ జూచెఁ జకితహరిణేక్షణయై. 1752

వ. ఇట్లు చూచిన. 1753

క. "వచ్చెద రదె! యదువీరులు-వ్రచ్చెద; రరిసేన; నెల్ల వైరులు పెలుచన్
నొచ్చెదరును; విచ్చెదరును-జచ్చెదరును నేఁడు చూడు జలజాతాక్షీ!" 1754

వ. అని రుక్మిణీదేవిని హరి యూఱడించె; నంత బలభద్రప్రముఖు లైన యదు
వీరులు ప్రళయవేళల మిన్నునం [4]బన్ని బలుపిడుగు లడరించు పెనుమొగిళుల
వడువున, జరాసంధాదిపరిపంథిరాజచక్రంబుమీఁద నవక్రపరాక్రమంబున
శిఖిశిఖాసంకాశ నిశితశిలీముఖనారాచభల్లప్రముఖంబు లైన బహువిధబాణ
పరంపరలు గురియ, నదియును విదళితమత్తమాతంగంబును, విచ్ఛిన్న
తురంగంబును, విభిన్నరథవరూథంబును, వినిహతపదాతియూథంబును, విఖం
డితవాహవారణరథారోహణమస్తకంబును, [5]విశకలితవక్షోమధ్యకర్ణకంఠ

---

1. నక్కలు. 2. బలము. 3. సింహము నడుమువంటి నడుముగలది. 4. ఆక్రమించి.
5. వేఱుచేయఁబడిన - ముక్కలుగాఁ జేయఁబడిన.

కపోలహస్తంబును, విస్ఫోటిత కపాలంబును, వికీర్ణ కేశజాలంబును, విపాటిత
చరణజానుజంఘంబును, విదళిత దంతసంఘంబును, విఘటితవీరమంజీరకేయూరం
బును, విభ్రష్టకుండలకిరీటహారంబును, విస్మృతవీరాలాపంబును, విదార్యమాణ
గదాకుంతతోమరపరశుపట్టిస ప్రాసకరవాలశూలచక్రచాపంబును, వినిపాతిత
కేతనచ్ఛత్రచామరంబును, విలూన తనుత్రాణంబును, విలీయమానఘోటక
సంఘరింఖాసముద్ధూతధరణీపరాగంబును, వినష్టరథవేగంబును, వినివారిత
సూతమాగధవందివాదంబును, వికుంఠితహయహేషా పటహభాంకార కరటి
ఘటాఘీంకార రథనేమిపటపటాత్కార తురగనాభిఘంటా ఘణఘణాత్కార
వీరహుంకార భూషణఝణఝణాత్కార నిస్సాణధణధణాత్కార మణినూపుర
క్రేంకార కింకిణీకిణకిణాత్కార శింజినీటంకార భటపరస్పరధిక్కారనాదంబును,
వినిర్భిద్యమానరాజసమూహంబును, విద్యమాన రక్తప్రవాహంబును,
విశ్రూయమాణభూతవేతాళకలకలంబును, విజృంభమాణ ఫేరవకాకగృధ్ర
కంకాదిసంకులంబును, ప్రచలితకబంధంబును, ప్రభూత పలలగంధంబును,
ప్రదీపితమేదోమాంసరుధిరఖాదంబును, ప్రవర్తితడాకినీప్రమోదంబును నై
యుండె; నప్పుడు. 1755

చ. మగిడి చలించి పాఱుచును, మాగధముఖ్యులు గూడి యొక్కచో
వగచుచు నాలిఁ గోల్పడినవానిక్రియం గడు [1]వెచ్చ నూర్చుచున్
మొగమున దప్పి దేరఁ, దమముందటఁ బొక్కుచునున్న చైద్యుతోఁ
"బగతురచేతిలోఁ బడక ప్రాణముతోఁడుత నున్నవాఁడవే! 1756

వ. అని మఱియును. 1757

ఆ. "బ్రదుకవచ్చు నొడలఁ బ్రాణంబు లుండిన;-బ్రదుకు గలిగె నేని భార్యగలదు;
బ్రదికి తీవు; [2]భార్యపట్టు దయ్యె మెఱుంగు;-వగవవలదు; చైద్య! వలదు వలదు.

వ. వినుము; దేహధారి స్వతంత్రుండు గాఁడు; జంత్రగానిచేతిజంత్రపుబొమ్మకైవడి
నీశ్వరతంత్రపరాధీనుండై, సుఖదుఃఖంబులందు వర్తనంబులు సలుపు; తొల్లి
నేను మథురాపురంబుమీఁదఁ బదియేడుమాఱులు పరాక్రమంబున విడిసి,
చక్రిచేతం బరాజితబలచక్రుండనై [3]కామపాలుచేతం బట్టువడి, కృష్ణుండు
కరుణసేసి విడిపించిన వచ్చి క్రమ్మఱ నిరువదిమూఁడక్షౌహిణులం గూడికొని,
పదునెనిమిదవమాఱు దాడిచేసి, శత్రులం దోలి విజయంబు చేకొంటి; నిట్టి
జయాపజయంబులందు హర్షశోకంబుల నెన్నండునుం జెంద; నేఁటి దినంబున
నీ కృష్ణున కెదిరిపోర, మన రాజలోకంబు లెల్ల నుగ్రాత్ముంగూడుకొని యెదిరిపోరిన
నోడుదు మింతియకాక దైవయుక్తం బయిన కాలంబునం జేసి, లోకంబులు
పరిభ్రమించుచుండు; నదియునుం గాక. 1759

1. వేఁడి శ్వాసములు విడుచుచు. 2. పెండ్లాము విషయము. 3. బలరాముఁడు.

మ. తమకుం గాలము మంచిదైన, మనలం ద్రైలోక్యవిఖ్యాతవి
క్రములన్ గెల్చిరి యాదవుల్ హరిభుజాగర్వంబునన్ నేఁడు; గా
లము మేలై చనుదెంచెనేని, మనమున్ లక్షించి, విద్వేషులన్
సమరక్షోణి జయింత; మింతపనికై శంకింప నీ కేటికిన్?'' 1760

వ. అని యిట్లు జరాసంధుండు, నతనియొద్దిరాజులును శిశుపాలునిపరితాపంబు నివారించి, తమతమభూములకుఁ జనిరి; శిశుపాలుండు ననుచరసేనాసమేతుండై, తన నగరంబునకుం జనియె; నంత రుక్మి యనువాఁడు కృష్ణుండు రాక్షసవివాహంబునం దనచెలియలిం గొనిపోవుటకు సహింపక, యేకాక్షౌహిణీ బలంబుతోడ సమరసన్నాహంబునం గృష్ణుని వెనుతవిలి పోవుచుఁ, దన సారథితో నిట్లనియె. 1761

ఉ. ''బల్లిదు నన్ను భీష్మజనపాలకుమారకుఁ బిన్నఁజేసి, నా
చెల్లెలి రుక్మిణిం గొనుచుఁ జిక్కనిక్కపుబంటుపోలె, నీ
గొల్లఁడు పోయెడిన్; రథముఁ గూడఁగఁ దోలుము; తేజితోల్లస
[1]ద్భల్లపరంపరన్ మదముఁ బాపెదఁ; జూపెద నాప్రతాపమున్.'' 1762

వ. అని యిట్లు రుక్మి యనువాఁడు హరికోలంది యెఱుంగక, సారథి నదలించి, రథంబు గూడం దోలించి, ''గోపాలక! వెన్నముచ్చ! నిమిషమాత్రంబు నిలునిలు''మని తిరస్కరించి, బలువింట నారి యెక్కించి, మూఁడువాఁడి తూపుల హరి నొప్పించి, యి ట్లనియె. 1763

సీ. ''మాసరివాఁడవా? మాపాపఁ గొనిపోవ, నేపాటిగలవాఁడ? వేది వంశ?
మెందు జన్మించితి? వెక్కడఁ బెరిగితి? వెయ్యది నడవడి? యెవ్వఁ డెఱుఁగు?
మానహీనుఁడ వీవు; మర్యాదలును లేవు; మాయ గైకొని కాని మలయరావు;
నిజరూపమున శత్రునివహంబుపైఁ బోవు వసుధేశుఁడవు గావు; వావి లేదు;
ఆ. కొమ్మనిమ్ము; నీవు గుణరహితుండవు;-విడువు విడువ వేని విలయకాల
[2]శిఖిశిఖాసమానశితశిలీముఖముల-గర్వ మెల్లఁ గొందుఁ గలహమందు.''1764

వ. అని పలికిన నగధరుండు నగి, యొక్క బాణంబున వానికోదండంబు ఖండించి, యాఱుశరంబుల శరీరంబు దూఱనేసి, యెనిమిదివిశిఖంబుల రథ్యంబులం గూల్చి, రెండమ్ముల సారథిం జంపి, మూఁడు వాఁడితూపులఁ గేతనంబుఁ ద్రుంచి, మఱియు నొక్కవిల్లందినం దునిమి, వెండియు నొక్కధనువు పట్టిన విదళించి, క్రమంబునం బరిఘపట్టిసశూలచర్మాసిశక్తితోమరంబులు ధరియించిన, దునుకలు చేసి, క్రమ్మఱ నాయుధంబు లెన్ని యెత్తిన నన్నియు శకలంబులు గావించె; నంతటఁ దనివిసనక వాఁడు రథంబు డిగ్గి, ఖడ్గహస్తుండై, దవానలంబుపయిం

1. బాణముల సమూహము. 2. అగ్నిజ్వాలలతో.

బడు మిఱుతచండంబున గదిసిన, ఖడ్గకవచంబులు చూర్ణంబులు సేసి, మెఱుం
గులు చెదర [1]కడిదంబు వెఱికి జళిపించి, వానిశిరంబు తెగ వ్రేయ గమకించి
నడుచుచున్న నడ్డంబు వచ్చి, రుక్మిణీదేవి హరిచరణారవిందంబులు పట్టుకొని,
యిట్లనియె. 1765

మత్తకోకిలము. "నిన్ను యీశ్వర! దేవదేవుని నిర్ణయింపఁగ లేక, యో
సన్నుతామరకీర్తిశోభిత? సర్వలోకశరణ్య! మా
యన్న యీతఁడు నేఁడు చేసె మహాపరాధము నీయెడన్;
నన్ను మన్ననసేసి కావు; మనాథనాథ! దయానిధీ! 1766

మత్తకోకిలము. కల్ల లే దని విన్నవించుట గాదు; వల్లభ! యీతనిన్
బ్రల్లదుం దెగఁ జూచితేనియు, భాగ్యవంతుల మైతి; మే
మల్లుఁ డయ్యె ముకుందుఁ డీశ్వరుఁ డంచు మోదితులైన మా
తల్లిదండ్రులు పుత్త్రశోకముఁ దాల్చి, చిక్కుదు రీశ్వరా!" 1767

మ. అని దగ్గుత్తికతో, మహాభయముతో, [2]నాకంపితాంగంబుతో,
వినతక్రాంతముఖంబుతో, శ్రుతిచలద్వేణీకలాపంబుతోఁ,
గనుదోయిం జడిగొన్న బాష్పములతోఁ, గన్యాలలామంబు మ్రొ
క్కిన, రుక్మిం దెగ వ్రేయఁబోక, మగిడెం గృష్ణుండు రోచిష్ణుఁడై. 1768

వ. ఇట్లు చంపక "బావా! ర"మ్మని చిఱునగవు నగుచు, వానిం బట్టి బంధించి,
గడ్డంబును, మీసంబును, దలయును, రేవులు వాఱఁ గొఱిగి, విరూపింజేసె;
నంత యదువీరులు పరసైన్యంబులం బాఱఁదోలి, తత్సమీపంబునకు వచ్చి;
రప్పుడు హతప్రాణుండై కట్టువడి యున్న రుక్మిం జూచి, కరుణసేసి బలభద్రుండు
బంధంబులు విడిచి, హరి దగ్గఱి యిట్లనియె. 1769

క. "తల మనక భీష్మనందను-తలయును, మూతియును, గొఱుగఁ దగవే? బంధుం
దలయును మూతియుఁగొఱుగుట-తలఁ దఱుగుటకంటెఁ దుచ్ఛతరము మహాత్మా!

క. కొందఱు రిపు లని కీడును,-గొందఱు హితు లనుచు మేలుఁ గూర్పవు; నిజ; మీ
వందఱియందును సముఁడవు;-పొందఁగ నే లయ్యె విషమబుద్ధి? ననంతా!"

సహోదరువిభంగమునకు ఖిన్నయగురుక్మిణీదేవిని బలభద్రుం డూరార్చుట.

వ. అని [3]తర్జించి పలికి, రుక్మిణీదేవి నుపలక్షించి యి ట్లనియె. 1772

శా. "తోడంబుట్టినవానిభంగమునకున్ దుఃఖించి, మాకృష్ణు నె
గ్గాడం జూడకు మమ్మ! పూర్వభవకర్మాధీనమై ప్రాణులం

1. ఖడ్గము. 2. వణఁకుచున్నశరీరము. 3. బెదరించి.

గీడున్ మేలును జెందు; లేఁ డొకఁడు శిక్షింపంగ, రక్షింప; నీ
తోడంబుట్టువు [1]కర్మశేషపరిభూతుండయ్యె నేఁ డియ్యెడన్. 1773

క. చంపెడిదోషము గలిగిన-జంపఁ జనదు బంధుజనులఁ; జను విడువంగాఁ;
జంపిన దోషము సిద్ధము;-చంపను మఱి యేల మున్న చచ్చినవానిన్? 1774

ఆ. బ్రహ్మచేత భూమిపతుల కీ ధర్మంబు-కల్పితంబు; రాజ్యకాంక్షఁ జేసి
తోడిమూలు నయినఁ దోడఁబుట్టినవాఁడు-చంపుచుండుఁ గ్రూరచరితుఁ డగుచు.

క. భూమికి ధనధాన్యములకు-భామలకును మానములకుఁ బ్రాభవములకుం
గామించి, మీఁదు గానక-శ్రీమదమున మానధనులు చెనకుదు రొరులన్.

వ. వినుము; దేవమాయం జేసి దేహాభిమాను లైన మానవులకుఁ బగవాఁడు, బంధుం, డుదాసీనుం డను మోహంబు సిద్ధం బయి యుండు; జలాదులయందుఁ జంద్రసూర్యాదులు, ఘటాదులందు గగనంబును, బెక్కయి కానంబడుభంగి, దేహధారుల కందఱికి నాత్మ యొక్కఁడయ్యును, బెక్కండై తోఁచు; నాద్యంతంబులు గల యీ దేహంబు ద్రవ్యప్రాణగుణాత్మకం బయి, యాత్మయందు నవిద్యచేతఁ గల్పితం బై దేహిని, సంసారంబునం ద్రిప్పు; సూర్యుండు తటస్థుండై యుండఁ, బ్రకాశమానంబు లయిన దృష్టిరూపంబులుబోలె, నాత్మ [2]తటస్థుండై యుండు; దేహేంద్రియంబులు ప్రకాశమానంబు లగునాత్మకు వేఱొక్కటితోడ సంయోగవియోగంబులు లేవు; వృద్ధిక్షయంబులు చంద్రకళలకుం గాని, చంద్రునికి లేనికైవడి, జన్మనాశంబులు దేహంబునకుం గాని, యాత్మకుఁ గలుగ నేరవు; నిద్రవోయినవాఁ డాత్మను విషయఫలానుభోగంబు సేయించు తెఱంగున, నెఱుక లేనివాఁడు నిజము గాని యర్థంబునందును భవంబు నొందుచుండుఁ; గావున. 1777

క. అజ్ఞానజ మగు శోకము-విజ్ఞానవిలోకనమున విడువుము; నీకుం
బ్రజ్ఞావతికిం దగునే?-యజ్ఞానులభంగి వగవ నంభోజముఖీ! 1778

వ. ఇట్లు బలభద్రుచేతఁ దెలుపంబడి, రుక్మిణీదేవి దుఃఖంబు మాని యుండె; నంత రుక్మి యనువాఁడును బ్రాణావశిష్టుండై విడువంబడి, తన విరూపభావంబునకు [3]నెరియుచు, "హరిం గెలిచి కాని కుండినపురంబు చొర" నని ప్రతిజ్ఞ చేసి, తత్పురసమీపంబున నుండె; నివ్విధంబున. 1779

శ్రీకృష్ణుండు రుక్మిణీదేవిని బెండ్లియాడుట.

క. రాజీవలోచనుఁడు హరి-రాజసమూహముల గెలిచి, రాజస మొప్పన్
రాజిత యగు తనపురికిని-రాజాననఁ దెచ్చె, బంధురాజి నుతింపన్. 1780

---

1. కర్మశేషముచే నవమానింపఁబడినవాఁడు. 2. ఎందును జేరనివాఁడు-సంబంధింపనివాఁడు.
3. తపించుచు, మండుచు.

వ. అంత నయ్యాదవేంద్రుని నగరంబున సమారబ్ధవివాహకృత్యంబును, బ్రవర్తమాన గీతవాద్యనృత్యంబును, బ్రతిగృహాలంకృతవిలసితాశేషనరనారీవర్గంబును, బరిణయమహోత్సవసమాహూయమాన మహీపాలగజఘటాగండమండల దానసలిలధారాసిక్తమార్గంబును, బ్రతిద్వారమంగళాచారసంఘటిత క్రముకకదళికా కర్పూరకుంకుమాగరుధూపపరిపూర్ణకుంభంబును, విభూషిత సకలగృహవేదికాకవాట[1]దేహళీ స్తంభంబును, విచిత్రకుసుమాంబరరత్నతోరణవిరాజితంబును, సముద్ధూతకేతనవిభ్రాజితంబును నై యుండె; నయ్యవసరంబున. 1781

మ. ధ్రువకీర్తిన్ హరి పెండ్లియాడె నిజచేతోహారిణిన్, మాననై
భవగాంభీర్యవిహారిణిన్, నిఖిలసంపత్కారిణిన్, సాధుబాం
ధవసత్కారిణిఁ, బుణ్యాచారిణి, మహాదారిద్ర్యసంహారిణిన్,
సువిభూషాంబరధారిణిన్, గుణవతీచూడామణిన్, రుక్మిణిన్. 1782

క. సతులుం దారును బౌరులు–హితమతిఁ గానికలు దెచ్చి యిచ్చిరి; కరుణో
న్నతవర్ధిష్ణులకును, మా–నిత[2]రోచిష్ణులకు, రుక్మిణీకృష్ణులకున్. 1783

క. హరిపెండ్లికిఁ గైకేయకు–కురుసృంజయయదువిదర్భకుంతినరేంద్రుల్
పరమానందముఁ బొందిరి–ధరణీశులలోన గాఢతాత్పర్యములన్. 1784

క. హరి యీ తెఱఁగున రుక్మిణి–నరుదుగఁ గొనివచ్చి, పెండ్లియాడుట విని 'దు
ష్కరకృత్య' మనుచు వెఱఁగం–దిరి రాజులు రాజసుతులు దిక్కుల నెల్లన్.

ఆ. అనఘ! యాదిలక్ష్మి యైన రుక్మిణితోడఁ–గ్రీడ సలుపుచున్న కృష్ణుఁ జూచి
పట్టణంబులోని ప్రజ లుల్లసిల్లిరి–ప్రీతు లగుచు, ముక్తభీతు లగుచు.'' 1786

వ. అని చెప్పి. 1787

క. కువలయరక్షాతత్పర!–కువలయదళనీలవర్ణ! కోమలదేహా!
కువలయనాథశిరోమణి!–కువలయజనవినుతవిమలగుణసంఘాతా! 1788

మాలిని. సరసిజనిభహస్తా! సర్వలోకప్రశస్తా!
నిరుపమశుభమూర్తీ! నిర్మలారూఢకీర్తీ!
పరహృదయవిదారీ! భక్తలోకోపకారీ!
గురుబుధజనతోషీ! ఘోరదైతేయశోషీ! 1789

1. గడపమ్రాను. 2. ప్రకాశించువారు.

## గద్యము

ఇది శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్యప్రణీతంబయిన శ్రీమహాభాగవతం బను పురాణంబునందు దేవకీదేవివివాహంబును, గగనవాణీశ్రవణంబును, కంసోద్రేకంబును, వసుదేవప్రార్థనంబును, యోగమాయాప్రభావంబును, బలభద్రజన్మంబును, బ్రహ్మాదిసురస్తోత్రంబును, కృష్ణావతారంబును, ఘోషప్రవేశంబును, యోగనిద్రాచరితంబును, నందపుత్రోత్సవంబును, పూతనాసంహారంబును, శకటభంజనంబును, తృణావర్తమరణంబును, గర్గాగమనంబును, నారాయణాదినామనిర్దేశంబును, బాలక్రీడయును, మృద్భక్షణంబును, వాసుదేవవదనగహ్వరవిలోక్యమాన చరాచరసమస్తలోకవిలోకనంబును, నవనీతచౌర్యంబును, యశోదారోషంబును, నులూఖలబంధనంబును, నర్జునతరుయుగళనిపాతనంబును, నలకూబరమణిగ్రీవులశాపమోక్షణంబును, బృందావనగమనంబును, వత్సపాలనంబును, వత్సాసురవధయును, బకదనుజవిదారణంబును, నఘాసురమరణంబును, వత్సాపహరణంబును, నూతనవత్సబాలకల్పనంబును, బ్రహ్మవినుతియు, గోపాలనంబును, గార్దభాసురహింసనంబును, కాళియఫణిమర్దనంబును, గరుడకాళియనాగవిరోధకథనంబును, ప్రలంబాసురహింసనంబును, దవానలపానంబును, వర్షర్తువర్ణనంబును, శరత్కాలలక్షణంబును, వేణువిలాసంబును, హేమంతసమయసమాగమంబును, గోపకన్యాచరితహావిష్యవ్రతంబును, కాత్యాయనీసేవనంబును, వల్లవీవస్త్రాపహరణంబును, విప్రవనితాదత్తాన్నభోజనంబు, నింద్రయాగనివారణంబును, నందముకుందసంవాదంబును, పర్వతభజనంబును, పాషాణసలిలవర్షంబును, గోవర్ధనోద్ధరణంబును, వరుణకింకరుండు నందునిం గొనిపోయిన హరి దెచ్చుటయును, వేణుపూరణంబును, గోపికాజనఘోషనిర్గమనంబును, యమునాతీరవనవిహారణంబును, కృష్ణాంతర్ధానంబును, ఘోషకామినీగణపరిదేవనంబును, గోపికాన్వేషణంబును, గోపికాగీతలును, హరిప్రసన్నతయును, రాసక్రీడనంబును, జలకేళియును, సర్పరూపకుం డయిన సుదర్శనవిద్యాధరుండు హరిచరణతాడనంబున నిజరూపంబు వడయుటయును, శంఖచూడుం డను గుహ్యకుని వధించుటయు, వృషభాసురవిదళనంబును, నారదవచనంబున హరిజన్మకథ యెఱింగి కంసుండు దేవకీవసుదేవుల బద్ధులం జేయుటయును, ఘోటకాసురుం డయిన కేశి యను దనుజుని వధియించుటయును, నారదస్తుతియును, వ్యోమదానవమరణంబును, నక్రూరాగమనంబును, నక్రూరరామకృష్ణుల సల్లాపంబును, ఘోషనిర్గమనంబును, యమునాజలాంతరాళంబున నక్రూరుండు హరివిశ్వరూపంబు గాంచుటయు, నక్రూరస్తవంబును, మథురానగరప్రవేశంబును, రజకవధయును, వాయకమాలాకారసమ్మానంబును, కుబ్జాప్రసాదకరణంబును, ధనుర్భంగంబును, కంసుదుస్స్వప్నంబును, కువలయాపీడపీడనంబును, రంగస్థలప్రవేశంబును, చాణూరముష్టికులవధయును, కంసవధయును, వసుదేవదేవకీ బంధమోక్షణంబును, నుగ్రసేనురాజ్యస్థాపనంబును, రామకృష్ణులు సాందీపనివలన విద్య లభ్యసించుటయును, సంయమనీనగరగమనంబును, గురుపుత్రదానంబును, నుద్ధవునిఘోషయాత్రయును, భ్రమరగీతలును, కుబ్జావాసగమనంబును, కరినగరంబునకు నక్రూరుండు సని కుంతీదేవి నూఱార్చుటయు, కంసభార్యలగు నస్తిప్రాప్తులు జరాసంధునకుం గంసుమరణం బెఱింగించుటయును, జరాసంధునిదండయాత్రయును, మథురానగరనిరోధనంబును, యుద్ధంబున జరాసంధుండు సప్తదశవారంబులు పలాయితుం డగుటయును, నారదప్రేరితుండై కాలయవనుండు మథురపై దాడివెడలుటయును, ద్వారకానగరనిర్మాణంబును, మథురాపురనివాసులం దనయోగబలంబున హరి ద్వారకానగరంబునకుం దెచ్చుటయును, కాలయవనుండు హరివెంటంజని గిరిగుహాయందు నిద్రితుండైన ముచుకుందునికోపదృష్టివలన నీఱగుట

యును, ముచికుందుండు హరిని సంస్తుతి చేసి తపంబునకుం జనుటయును, జరాసంధుండు క్రమ్మఱ
రామకృష్ణులపై నేతెంచుటయును, ప్రవర్షణపర్వతారోహణంబును, గిరిదహనంబును, గిరి డిగ్గనుఱికి
రామకృష్ణులు ద్వారకానగరంబునకుం జనుటయును, రుక్మిణీజననంబును, రుక్మిణీసందేశంబును,
వాసుదేవాగమనంబును, రుక్మిణీగ్రహణంబును, రాజలోకపలాయనంబును, రుక్మి యనువాని భంగం
బును, రుక్మిణీకల్యాణంబును నను కథలు గల దశమస్కంధంబునందలి పూర్వభాగము. 1790



శ్రీరస్తు

శ్రీకృష్ణాయ నమః

# శ్రీమదాంధ్రభాగవతము

## దశమస్కంధము, ఉత్తరభాగము

శ్రీకర! పరిశోషితర-త్నాకర! కమనీయగుణగణాకర! కారు
ణ్యాకర! భీకరశరధా - రాకంపిత దానవేంద్ర! రామనరేంద్రా! 1

వ. మహనీయగుణగరిష్ఠు లగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యాన వైఖరీ సమేతుం డైన సూతుం డిట్లనియె; నట్లు ప్రాయోపవిష్టుం డైన పరీక్షిన్న రేంద్రుండు "రుక్మిణీపరిణయానంతరంబున నైన కథావృత్తాంతం బంతయు వినిపింపు" మనిన శుకయోగీంద్రుం డిట్లనియె. 2

ప్రద్యుమ్నకుమారచరిత్ర ప్రారంభము

ఉ. "తామరసాక్షునంశమున దర్పకుఁ డీశ్వరుకంటిమంటలం
దా మును దగ్ధుఁడై, పిదపఁ దత్పరమేశుని దేహలబ్ధికై,
వేమఱు నిష్ఠఁ జేసి, హరివీర్యమునం బ్రభవించె రుక్మిణీ
కామినిగర్భమం దసురఖండను[1]మాఱటమూర్తియో యనన్. 3

వ. అంత నా డింభకుండు ప్రద్యుమ్నుం డనుపేర విఖ్యాతుం డయ్యె; నాశిశువు సూతికాగృహంబునం దల్లిపొదిఁగిట నుండం, దనకు శత్రుం డని యెఱింగి, శంబరుం డను రాక్షసుండు దన మాయాబలంబునం గామరూపియై వచ్చి, కొనిపోయి సముద్రంబులో వైచి, తనగృహంబునకుం జనియె; నంత నా[2]శాబకుండు జలధి జలంబునం దిగంబడ నొడిసి, యొకమహామీనంబు మ్రింగె; నందు.

క. జాలిఁ బడి పాఱు జలచర-జాలంబులఁ బోవనీక చని, రోషాగ్ని
జ్వాలలు నిగుడఁగ, నూరక-జాలంబులు వైచి పట్టి జాలరు లంతన్. 5

వ. సముద్రంబులోన నా మీనంబును, దత్సహచరంబులైన మీనంబులనుం బట్టికొని, తెచ్చి, శంబరునకుం గానికఁగా నిచ్చిన, నతండు "వండి తెం"డని [3]మహానసగృహంబునకుం బంచిన. 6

1. మఱియొక రూపము. 2. బాలుఁడు. 3. వంటయిల్లు.

క. రాజనగరియెడ బాలలు-రాజీవముకడుపు వ్రచ్చి, రాజనిభాస్యున్
రాజశిశువుఁ గని, చెప్పిరి-రాజీవదళాక్షి యైన రతికి నరేంద్రా! 7

వ. అంత నారదుండు వచ్చి, బాలకునిజన్మంబును, శంబరోద్యోగంబును, మీనోదర ప్రవేశంబునుం జెప్పిన విని, యా రతి మాయావతి యనుపేర శంబరుని యింటఁ బాతివ్రత్యంబు సలుపుచు, దహనదగ్ధుం డయిన తనపెనిమిటి శరీర ధారణంబు సేయుట కెదురుచూచుచున్నయది గావున, నయ్యర్భకుండు దర్పకుం డని తెలిసి మెల్లన పుత్రార్థిని యైనతెఱంగున శంబరునియనుమతి వడసి, [1]సూపకారులయొద్ద నున్నపాపనిం దెచ్చి పోషించుచుండె; నా కుమారుండును శీఘ్రకాలంబున నారూఢయౌవనుం డై. 8

క. సుందర మగు తనరూపము-సుందరు లొకమాఱు దేఱి చూచినఁ జాలున్,
సౌందర్య మేమి చెప్పను?-'బొందెద' మని డాయుబుద్ధిఁ బుట్టించు నృపా! 9

సీ. "చక్కని వారలచక్కఁదనంబున కుపమింప నెవ్వఁడు యోగ్యుఁ డయ్యె?
మిక్కిలితపమున మెఱయునంబికకు నై, శంకరు నెవ్వఁడు సగము సేసె?
బ్రహ్మత్వమును బొంది, పరఁగువిధాతను వాణికై యెవ్వఁడు వాఁడి సెఱిచె?
[2]వేయిడాగులతోడివిబుధలోకేశుని మూర్తికి నెవ్వఁడు మూల మయ్యె?
తే. మునుల తాలిమి కెవ్వఁడుముల్లుసూపు-మగల,మగువల నెవ్వండుమరులుకొలుపుఁ?
గుసుమధనువున నెవ్వండుకొనువిజయము-చిగురువాలున నెవ్వండుసిక్కుపఱుచు?"

వ. అని తన్ను లోకులు వినుతించుప్రభావంబులు గలిగి, పద్మదళలోచనుండును, ప్రలంబబాహుండును, జగన్మోహనాకారుండు నైన పంచబాణునిం గని, లజ్జాహాస గర్భితంబు లైన చూపులం జూచుచు మాయావతి సురతభ్రాంతిఁ జేసినం జూచి, ప్రద్యుమ్నుం డిట్లనియె. 11

మత్తకోకిలము. "నాతనూభవుఁ డీతఁ డంచును, నాన యించుక లేక, యో
మాత! నీ విదియేమి? నేఁ డిటు మాతృభావము మాని, సం
ప్రీతిఁ గామినిభంగిఁ జేసెదు పెక్కు[3]విభ్రమముల్; మహా
ఖ్యాతవృత్తికి నీకు ధర్మము గాదు మోహము సేయఁగాన్." 12

వ. అనిన రతి యిట్లనియె; "నీవు నారాయణనందనుండ వైన కందర్పుండవు; పూర్వకాలంబున నేను నీకు భార్య నైన రతిని; నీవు శిశువవై యుండు నెడ నిర్దయుండై దొంగిలి, తల్లిం దొఱంగఁ జేసి, శంబరుండు కొనివచ్చి, నిన్ను నీరధిలో వైచిన నొక్కమీనంబు మ్రింగె; మీనోదరంబు వెడలి; తీవు మీఁదటికార్య మాకర్ణింపుము. 13

1. వంటచేయువారు, 2. సహస్రకిరణములు, గుఱుతులు. 3. విలాసములు.

క. మాయావి వీఁడు; దుర్మతి-మాయఁడు సంగరములం; దమర్త్యుల గెలుచున్;
మాయికరణమున వీనిన్-మాయింపుము, మోహనాదిమాయలచేతన్. 14

మత్తకోకిలము. పాపకర్ముఁడు వీఁడు; నిన్నిటఁ బట్టి తెచ్చిన లేచి, "నా
పాపఁ డెక్కడఁ బోయెనో? సుతుఁ బాపితే విధి!" యంచుఁ, దాఁ
గ్రేపుఁ బాసినగోవుభంగిని ఖిన్న యై, వడి గాఢసం
తాప యై, నిను నోఁచి కాంచినతల్లి [1]కుయ్యిడ కుండునే?" 15

వ. అని పలికి, మాయావతి మహానుభావుం డైన ప్రద్యుమ్నునికి సర్వశత్రుమాయా
వినాశిని యయిన మహామాయావిద్య నుపదేశించె; నివ్విధంబున. 16

మ. గురుమాయారణవేది యై, కవచి యై, కోదండి యై, బాణి యై,
హరిజుం "డోరి నిశాట! వైచితివి నాఁ డంభోనిధిన్ నన్ను; ఘో
రరణాంభోనిధి వైతు నిన్ను; నిదె వేర" మ్మంచుఁ జీరెన్, మనో
హరదివ్యాంబరు, నుల్లసద్దనుజసేనాడంబరున్ శంబరున్. 17

చ. అదలిచి, యిట్లు కృష్ణసుతుఁ డాడిన నిష్ఠురభాషణంబులం
బదహతు డై వడిం [2]గవియు పన్నగరాజముఁ బోలి, శంబరుం
డదరుచు లేచి వచ్చి, గద నచ్యుతనందను వ్రేసె, నుజ్జ్వల
ద్భిదురకఠోరఘోషసమభీషణనాదము చేసి యార్చుచున్. 18

క. దనుజేంద్రుఁడు వ్రేసినగదఁ-దనగదచేఁ బాయ నడిచి, దనుజులు బెదరన్
దనుజాంతకునికుమారుఁడు-దనుజేశునిమీఁద నార్చి తనగద వైచెన్. 19

వ. అంత నా రక్కసుండు వెక్కసం బగు రోసంబునఁ, దనకుఁ దొల్లి మయుం డెఱిం
గించిన దైతేయమాయ నాశ్రయించి, మింటికి నెగసి, పంచబాణునిపై బాణ
వర్షంబు గురిసిన, నమ్మహారథుండు నొచ్చియు సంచలింపక మచ్చరంబున సర్వ
మాయావినాశని యైన సాత్త్వికమాయం బ్రయోగించి, దనుజుని బాణవృష్టి
నివారించె; మఱియు వాఁడు భుజగగుహ్యకపిశాచమాయలు పన్ని నొప్పించిన
నన్నియుం దప్పించి. 20

క. దండధరమూర్తిఁ గైకొని-యొం డాడక చక్రిసూనుఁ డుగ్రతరాసిన్
ఖండించె, శంబరునితలఁ-గుండలకోటీరమణులు గుంభిని రాలన్. 21

క. [3]చిగురాకడిదపుధారను-జగములఁ బరవశము సేయు చలపాదికి దో
డ్డగు నుక్కడిదంబునఁ దన-పగతుం దెగ వ్రేయు టెంతపని? చింతింపన్. 22

క. బెగడుచు నుండఁగ, శంబరుఁ-దెగడుచుఁ, బూవింటిజోదుధీరగుణంబుల్
పొగడుచుఁ, గురిసిరి ముదమున-నెగడుచుఁగుసుమములముసురు నిర్జరు లధిపా!

---

1. మొఱపెట్టక. 2. ఆక్రమించు. 3. చిగురు అను బాణముయొక్క అంచుచేత (పదునుచేత).

రతీదేవి ప్రద్యుమ్నసహిత యై గగనమార్గంబున ద్వారకకుం బోవుట

వ. ఇట్లు శంబరుని వధియించి, విలసిల్లుచున్న యించువిలుకానిం గొంచు, నాకాశ
చారిణి యైన యా రతీదేవి గగనపథంబుఁ బట్టి, ద్వారకానగరోపరిభాగంబునకుం
జనుదెంచిన. 24

ఆ. మెఱుఁగుఁదీగెతోడి మేఘంబుకైవడి-యువిదతోడ మింటినుండి కదలి
యరుగుదెంచె మదనుఁ డంగనాజనములు-మెలఁగుచున్న లోనిమేడకడకు. 25

మ. జలదశ్యాముఁ, బ్రలంబబాహుయుగళుం, జంద్రాననున్, నీలసం
కులవక్త్రాలకుఁ, బీతవాసు, ఘనవక్షున్, సింహమధ్యున్, మహో
త్పలపత్త్రేక్షణు, మందహాసలలితుం, బంచాయుధున్, నీరజా
క్షులు దా రేమఱుపాటు చూచి, హరి యంచుం డాఁగి రయ్యోయెడన్. 26

క. కొందఱు హరి యగునందురు-కొందఱు చిహ్నములు కొన్ని కొన్ని హరికి లే
వందురు; మెల్లనె తెలియుద-మందురు, మదుఁ జూచి కొంద ఱబలలు గుములై.

క. హరి యని వెనుచని, పిదపన్-హరిఁ బోలెడువాఁడు గాని, హరి గాఁ డనుచున్
హరిమధ్య లల్లనల్లన-హరినందను డాయ వచ్చి రాశ్చర్యమునన్. 28

ఉ. అన్నులు సేర వచ్చి, మరు నందఱుఁ జూడఁగఁ, దాను వచ్చి, సం
పన్న గుణాభిరామ, హరిపట్టపుదేవి, విదర్భపుత్త్రి క్రేఁ
గన్నుల నా కుమారకునికై వడి నేర్పడఁ జూచి, [1]బోటితోఁ
జన్నులు సేఁప నిట్లనియె, సంభ్రమదైన్యము లుల్లసిల్లఁగన్. 29

శా. "ఈకంజేక్షణుఁ, డీకుమారతిలకుం, డీయిందుబింబాననుం,
డీకంఠీరవమధ్యుఁ డిచ్చటికి నేఁ డెందుండి యేతెంచెనో?
యీకల్యాణునిఁ గన్నభాగ్యవతి యు న్నేనోములన్ నోఁచెనో?
యే కాంతామణియందు వీఁగి కనెనో యే కాంతుఁ డీకాంతునిన్? 30

శా. ఆలీ! నాఁ తొలుచూలిపాపనికి బోర్కాడించి, నే సూతికా
శాలామధ్యవిశాలతల్పగత నై, చన్నిచ్చి నిద్రింప, నా
బాలున్ నాచనుఁబాలకుం జెఱిచి, యే పాపాత్ము లేత్రోవ ము
న్నే లీలం గొనిపోయిరో? శిశువుఁ దా నేతల్లి రక్షించెనో? 31

క. కొడుకఁడు నాపొదిగిటిలోఁ-జెడి పోయిననాఁటనుండి, చెలియా! తెలియం
బడ దే వార్తయు; నతఁ డే-[3]వడువున, నెచ్చోట నిలిచి, వర్తించెడినో? 32

క. ఇందాఁక వాఁడు బ్రదికిన-సందేహము లేదు, దేహచాతుర్యవయ
స్సౌందర్యంబుల లోకులు-వందింపఁగ, నితనియంత వాఁ డగుఁజుమ్మీ! 33

1. చెలికత్తెతో. 2. మొదటఁబుట్టిన. 3. విధముగా.

మ. అతివా! సిద్ధము నాఁటిబాలకున కీ యాకార, మీ వర్ణ, మీ
గతి, యీ హాసవిలోకనస్వరము, లీ గాంభీర్య, మీ కాంతి; వీఁ
డతఁడే కాఁ దగు; నున్నవారలకు నా[1]యాత్మేశుసారూప్యసం
గతి సిద్ధింపదు; వీనియందు మిగులం గౌతూహలం బయ్యెడిన్. 34

క. పొదలెడి ముదమునఁ జిత్తము;-గదలెడి నాయెడమమూఁపు; గన్నులవెంటం
బొరలెడి నానందాశ్రులు;-మొదలెడిఁ బాలిండ్లఁ బాలు; మే లయ్యెడినో?" 35

వ. అని డోలాయమానమానసయై వితర్కించుచు. 36

క. "తనయుఁడని నొడువఁ దలఁచును;-దనయుఁడుగాకున్న మిగులఁ దతిఁగొని సవతుల్
దను నగియెద"రని తలఁచు; న-తనుసంశయ మలమికొనఁగఁ దనుమధ్య మదిన్.

వ. ఇట్లు రుక్మిణీదేవి విచారించుచుండ, లోపలినగరికావలివారివలన విని, కృష్ణుండు
దేవకీవసుదేవులం దోడ్కొని చనుదెంచి, సర్వజ్ఞుం డయ్యు, నేమియు వివ
రింపక యూరకుండె; నంత నారదుండు సనుదెంచి, శంబరుండు గుమారునిం
గొనిపోవుట మొదలైన వార్త లెఱింగించిన. 38

క. "చచ్చినబాలుఁడు గ్రమ్మఱ, వచ్చిన క్రియ వచ్చెఁ బెక్కువర్షములకు; నీ
సచ్చరితు నేఁడు గంటిమి; చెచ్చెర ము న్నెట్టి తపము సేయంబడెనో?" 39

వ. అని యంతఃపురకాంతలును, దేవకీవసుదేవరామకృష్ణులు, యథోచితక్రమం
బున నా దంపతుల దివ్యాంబరాభరణాలంకృతుల సత్కరించి, సంతోషించిరి;
రుక్మిణీదేవియు నందనుం గౌఁగిలించుకొని. 40

శా. "అన్నా! నా చనుఁ బాపి, నిన్ను దనుజుం డంభోనిధిన్ వైచెనే?
యెన్నేవర్షము లయ్యెఁ బాసి; సుత! నీ వేరీతి జీవించి, యే
సన్నాహంబున శత్రు గెల్చితివో? యాశ్చర్యంబు సంధిల్లెడిన్;
నిన్నుం గాంచితి నింతకాలమునకున్; నే ధన్యతం జెందితిన్." 41

వ. అని కొడుకుం జూచి సంతోషించి, కోడలిగుణంబులు [2]కైవారంబు సేసి, వినో
దించుచుండె; నంత ద్వారకానగరంబుప్రజలు విని, హర్షించి; రందు. 42

క. సిరిపెనిమిటిపుత్త్రకుఁ డగు,-మరు గని హరిఁ జూచినట్ల, మాతలు దమలోఁ
గరఁగుదురట; పరకాంతలు-మరుఁ గని మోహాంధకారమగ్నలు గారే?" 43

వ. అని చెప్పి శుకుం డిట్లనియె. 44

శ్రీకృష్ణుండు లోకాపవాదనివృత్తికొఱకు స్యమంతకమణిం దెచ్చుట

క. "సత్రాజిత్తు నిశాచర,-శత్రునకుం గీడు సేసి, సద్వినయముతోఁ
బుత్త్రి, స్యమంతకమణియును-మైత్రిం గొని తెచ్చి యిచ్చె; మనుజాధీశా!" 45

---

1. నాభర్తయొక్క చక్కని రూపము కలిగియుండుట. 2. పొగడుట.

వ. అనిన విని రా జిట్లనియె. 46

ఆ. "శౌరి కేమి తప్పు సత్రాజితుఁడు సేసెఁ? గూఁతు, మణిని నేల కోరి యిచ్చె?
నతని కెట్లు గలిగె నా స్యమంతకమణి?-విప్రముఖ్య! నాకు విస్తరింపు." 47

వ. అనిన విని శుకయోగివర్యుం డిట్లనియె; "సత్రాజిత్తనువాఁడు సూర్యునకు భక్తుండై చెలిమి సేయ, నతనివలన సంతసించి, సూర్యుండు స్యమంతకమణి నిచ్చె; నా మణి కంఠంబునఁ ధరియించి, సత్రాజిత్తు భాస్కరనిభంగి [1]భాసమానుండై, ద్వారకానగరంబునకు వచ్చిన దూరంబున నతనిం జూచి, జనులు మణిప్రభా[2]పటలతేజోహృతదృష్టు లయి సూర్యుం డని శంకించి వచ్చి, హరి కిట్లనిరి. 48

క. నారాయణ! దామోదర!-నీరజదళనేత్ర! చక్రి! నిఖిలేశ! గదా
ధారణ! గోవింద! నమస్కారము యదుపుత్ర! నిత్యకల్యాణనిధీ! 49

మ. దివిజాధీశ్వరు [3]లిచ్చగింతురు గదా! దేవేశ నిన్ జూడ; యా
దవవంశంబున గూఢమూర్తివి జగత్త్రాణుండ వై యుండఁగా
భవదీయాకృతిఁ జూడ, నేఁ డిదె రుచిప్రచ్ఛన్నదిగ్భాగుఁడై
రవియో, నీరజగర్భుఁడో, యొకఁడు సేరన్ వచ్చె మార్గంబునన్." 50

వ. అని యిట్లు పలికిన మూఢజనులఁ జూచి గోవిందుండు నగి "మణిసమేతుం డైన సత్రాజితుండు గాని సూర్యుండు గాఁ" డని పలికె; నంత సత్రాజితుండు శ్రీయుతం బయి మంగళాచారసంచారం బైన తనగృహంబునకుం జని, మహీసురులచేత నిజదేవతామందిరంబున నమ్మణిశ్రేష్ఠంబు ప్రవేశంబు సేయించె; నదియును బ్రతిదినంబు నెనిమిది బారువుల సువర్ణంబు గలిగించుచుండు. 51

క. ఏరా జేలెడు వసుమతి-నా రత్నము పూజ్యమాన మగు, నక్కడ రో
గారిష్టసర్వమాయిక-మారీదుర్భిక్షభయము మాను నరేంద్రా! 52

క. అమ్మణి యాదవవిభునకు-నిమ్మని, హరి యడుగ, నాతఁ డీక ధనేచ్ఛం
బొమ్మని పలికెను; 'జక్రికి, నిమ్మణి-యీఁకున్న మీఁద నే మగు?' ననుచున్. 53

వ. అంత. 54

చ. అడరెడు వేడ్కఁ గంఠమున నమ్మణిఁ దాల్చి, ప్రసేనుఁ డొక్కనాఁ
డడవికి ఘోరవన్యమృగయారతి నేఁగిన, వానిఁ జంపి పైఁ
బడి మణిఁ గొంచు నొక్కహరి పాఱఁగ, దాని వధింప, డాసి, యే
ర్పడఁ గనె జాంబవంతుఁడు [4]ప్రభాత్తదిగంతము నాస్యమంతమున్. 55

1. ప్రకాశించునట్టివాఁడు. 2. సముదాయము. 3. ఇష్టపడుదురు. 4. కాంతులచే నాక్రమించిన దిక్కులకొనభాగములు కలది.

క. కని జాంబవంతుఁ డామణిఁ-గొని పోయి, సవిశాలశైలగుహఁ జొచ్చి, ముదం
బునఁ దనకూరిమిసుతకును-ఘనకేళీకందుకంబుగాఁ జేసె నృపా! 56

వ. అంత సత్రాజితుండు తన సహోదరుం డైన ప్రసేనునిం గానక, దుఃఖించుచు.

మ. "మణి కంఠంబునఁ దాల్చి, నేఁ డడవిలో మావాఁడు వర్తింపఁగా,
మణికై పట్టి వధించినాఁడు; హరి కీ మర్యాద లే" యంచు దూ
షణముం జేయఁగ, వానిదూషణముఁ గంసధ్వంసి యాలించి, 'యే
వ్రణముల్ నాయెడ లేదు; నింద గలిగెన్ వారించు టే రీతియో?' 58

వ. అని వితర్కించి. 59

మ. తనవా రెల్లఁ బ్రసేనుజాడఁ దెలుపం, దర్కించుచున్ వచ్చి, త
ద్వనవీథిం గని నేలఁ గూలిన మహాశ్వంబుం, బ్రసేనుం, బ్రసే
నుని హింసించిన సింహముం, మృగపతిన్ నొప్పించి, ఖండించి, యేఁ
గిన భల్లూకము సొచ్చి యున్నగుహయుం గృష్ణుండు రోచిష్ణుఁడై. 60

వ. కని తనవెంట వచ్చిన ప్రజల నెల్ల గుహాముఖంబున విడిచి, సాహసంబున మహానుభావుం డైన హరి నిరంతరనిబిడాంధకారబంధురం బయి భయంకరం బై విశాలం బయిన గుహాంతరాళంబు సొచ్చి, చని, యక్కడ నొక్కబాలిక కెదుర [1]దర్శనీయకేళికందుకంబుగా ప్రేలం గట్టఁబడిన యమ్మణిశ్రేష్ఠంబుఁ గని, హరింప నిశ్చయించి. 61

క. మెల్లనె పదము లిడుచు యదు, వల్లభుఁ డా శిశువుకడకు వచ్చిన, గుండెల్
జల్లనఁగఁ జూచి, కంపము-మొల్లంబుగ దాని దాది మొఱవెట్టె నృపా! 62

వ. అంత నాధ్వని విని, బలవంతుం డైన జాంబవంతుండు వచ్చి, తనస్వామి యని కృష్ణు నెఱుంగక, ప్రాకృతపురుషుం డని తలంచి, కృష్ణునితో రణంబు చేసె; నందు. 63

క. [2]పలలమునకుఁ బోరెడు డే-గల క్రియ శస్త్రములఁ, దరులఁ, గరముల, విజయే
చ్ఛల నిరువదియెనిమిది దిన-ములు పోరిరి నగచరేంద్రముఖ్యుఁడు, హరియున్.

క. అడిదములుఁ, దరులు విఱిగిన-బెడిదము లగు మగతనములఁ [3]బిఱుతివక వడిం
బిడుగులవడువునఁ బడియెడి-పిడికిటిపోటులను గలన బెరసి రిరువురున్. 65

శా. స్పష్టాహంకృతు లుల్లసిల్ల హరియున్, భల్లూకలోకేశుఁడున్
ముష్టాముష్టి, నహర్నిశంబు జయసమ్మోహంబునం బోరుచోఁ,
బుష్టిం బాసి, ముకుందముష్టిహతులం బూర్ణశ్రమోపేతుఁ డై,
పిష్టాంగోరుశరీరుఁడై యతఁడు దా భీతాత్ముఁడై యిట్లనున్. 66

1. చూడఁదగిన వినోదమును గల్గించు చెండుగా. 2. మాంసము. 3. వెనుకకుఁబోక.

వ. "దేవా! నిన్నుఁ బురాణపురుషు, నధీశ్వరు, విష్ణుం, బ్రభవిష్ణు, నెఱుంగుదు; సర్వభూతంబులకుం బ్రాణప్రతాపధైర్యబలంబులు నీవ; విశ్వంబునకు సర్గస్థితిలయంబు లెవ్వ రాచరింతురు, వారికి సర్గస్థితిలయంబులఁ జేయునీశ్వరుండవు నీవ; యాత్మవు నీవ; యని మఱియును. 67

సీ. బాణాగ్ని నెవ్వఁడు పఱపి పయోరాశి నింకించి బంధించి యేపు మాపెఁ?
బరఁగ నెవ్వఁడు ప్రతాపప్రభారాశిచే దానవగర్వాంధతమస మడఁచెఁ?
గంజాతములు ద్రెంచు కరిభంగి నెవ్వఁడు దశకంఠుకంఠ బృందములు ద్రుంచె?
నాచంద్రసూర్యమై యమరు లంకారాజ్యమునకు నెవ్వఁడు విభీషణుని నిలిపె?
తే. నన్ను నేలిన లోకాధినాథుఁ డెవ్వఁ?-డంచితోదారకరుణారసాబ్ధి యెవ్వఁ?
డాతఁడవు నీవ కావె? మహాత్మ! నేఁడు-మాఱుపడి యెగ్గు సేసితి; మఱువవలయు."

వ. అని యిట్లు పరమభక్తుండైన జాంబవంతుండు వినుతించిన, నతనిశరీరనిగ్రహనివారణంబుగా భక్తవత్సలుండైన హరి దన కరంబున నతనిమేను నిమిరి, మేఘగంభీరభాషణంబుల నిట్లనియె. 69

క. "ఈ మణి మాచేఁ బడె నని-తామసు లొనరించు నింద దప్పెడుకొఱకై
నీమందిర మగు బిలమున-కే మరుదెంచితిమి భల్లుకేశ్వర! వింటే." 70

వ. అనిన విని, సంతసించి, జాంబవంతుఁడు మణియునుం, దనకూఁతు జాంబవతి యను కన్యకామణియునుం దెచ్చి, హరికిఁ గానికఁగా సమర్పించె; నటమున్న హరివెంట వచ్చినవారలు బిలంబువాకిటం బండ్రెండు దినంబులు హరిరాక కెదురుచూచి, [1]వేసరి, వగచి, పురంబునకుం జని; రంత దేవకీవసుదేవులును, రుక్మిణియును, మిత్రబంధుజ్ఞాతిజనులును గుహ సొచ్చి కృష్ణుఁడు రాక చిక్కె నని శోకించి. 71

క. 'దుర్గమ మగు బిలమున హరి-[2]నిర్గతుఁడై చేరవలయు నేఁ' డని పౌరుల్
వర్గములై సేవించిరి-దుర్గం, గృతకుశలమార్గ, దోషితభర్గన్. 72

క. [3]దోలాయితమానసులై-జాలింబడి, జనులు గొలువఁ, జండిక పలికెన్
"బాలామణితో, మణితో-హేలాగతి వచ్చు నంబుజేక్షణుఁ"డనుచున్. 73

క. యత్నము సఫలం బయిన స-పత్నసమూహములు బెగడఁ, బద్మాక్షుం డా
రత్నముతోఁ, గన్యాజన-రత్నముతోఁ బురికి వచ్చె రయమున నంతన్. 74

క. మృతుఁడైనవాఁడు పునరా-గతుఁడైన క్రియం దలంచి, కన్యామణిసం
యుతుఁడై వచ్చిన హరిఁ గని-వితతోత్సవకౌతుకముల వెలసిరి పౌరుల్. 75

1. విసుగుఁబొంది. 2. బయలువెడలినవాఁడై. 3. ఉయ్యేలవలెఁ గదలుచున్న మనస్సుగలవారు.

క. హరిముంగలఁ గేలుమొగిచి కీర్తన-సరణులఁ గావించుచును వినిర్మలమతులై,
సుతబంధుపుత్రజాయా-పరిజన కులముం గొలిచి కృష్ణుఁ బద్మదళాక్షున్. 760

వ. బహుప్రకారంబులం బొగడుచుఁ, దమతమ దేశంబులకుం జని. 761

క. నలినదళలోచనుండు దము-దెలిపినధర్మపద్ధతిని జగమున నై
యలఁ బరిపాలించుచు, సుఖ-ముల నుండిరి మహితనిజవిభుత్వము లలరన్.

వ. ఇట్లు కృష్ణుండు జరాసంధవధంబును, రాజలోకంబునకు బంధమోక్షణంబును గావించి, వాయునందనవాసవతనయులుం దానును జరాసంధతనయుం డగు సహదేవుండు సేయు వివిధంబు లగు పూజలు గైకొని, యతని నుండ నియమించి, యచ్చోటు గదలి, [1]కతిపయప్రయాణంబుల నింద్రప్రస్థపురంబునకుం జనుదెంచి, తద్ద్వారప్రదేశంబున విజయశంఖంబులు పూరించినఁ, బ్రతిపక్షభయదంబును, బాంధవప్రమోదంబును నగు నమ్మహాఘోషంబు విని, పౌరజనంబులు జరాతనయుమరణంబు నిశ్చయించి, సంతసిల్లిరి; వారిజాక్షుండును, భీమసేనపార్థులతోఁ బురంబు ప్రవేశించి, ధర్మనందనునకు వందనం బాచరించి, తమపోయిన తెఱంగును, నచ్చట జరాసంధుని వధియించినప్రకారంబును సవిస్తరంబుగా నెఱింగించిన, నతండు విస్మయవికచలోచనంబుల నానందబాష్పంబులు గురియ, నమ్మాధవుమాహాత్మ్యంబునకుం, దమయందలి భక్తిస్నేహదయాదిగుణంబులకుం [2]బరితోషంబు నొందుచుఁ గృష్ణునిం జూచి యిట్లనియె. 763

సీ. "కమలాక్ష! సర్వలోకములకు గురుఁడ వై తేజరిల్లెడుభవదీయమూర్తి
యంశాంశసంభవు లగు లోకపాలురు నీయాజ్ఞఁ దలమోచి, నిఖిలభువన
పరిపాలనిపుణు లై భాసిల్లుచున్నవా; రట్టి నీ కొకనృపు నాజ్ఞ సేయు
టరయ, నీమాయ గా; కది నిక్కమే? యేక మై, యద్వితీయ మై, యవ్యయంబు
తే. నైన నీతేజమున కొకహాని గలదె?-చిన్మయాకార! నీపాదసేవకులకు
నాత్మపరభేదబుద్ధి యెందైనఁ గలదె?-పుండరీకాక్ష! గోవింద! భువనరక్ష!"

ధర్మరాజు చేసెడు రాజసూయంబునందు శ్రీకృష్ణుండు శిశుపాలుని వధించుట.

వ. అని గోవిందునిం బొగడి, యద్దేవునినుమతంబునం గుంతీసుతాగ్రజుండు పరతత్త్వవిజ్ఞాను లైన ధరణీసురులను [3]ఋత్విజులం గా వరియించి. 765

సీ. సాత్యవతేయ కశ్యప భరద్వాజోపహూతి విశ్వామిత్ర వీతిహోత్ర
మైత్రేయ పైల సుమంతు మధుచ్ఛంద గౌతమ సుమతి భార్గవ వసిష్ఠ
వామదేవాకృతవ్రణ కణ్వ జైమిని ధౌమ్య పరాశ రాథర్వ కవషు,
లసిత వైశంపాయ నాసురి భార్గవ క్రతు వీరసేన గర్గ త్రికవ్య

1. కొన్నిప్రయాణములచేత. 2. సంతోషము. 3. యజ్ఞములందుఁ జేయఁదగు తంత్రముల నడపువారలు.

ఆ. ముఖ్యు లైన పరమమునులను, గృపుని, గాం-గేయ కుంభజ బాహ్లికేయ విదుర
కురుకుమార బంధు కులవృద్ధ భూసుర-సుర నరేంద్ర వైశ్య శూద్రవరుల. 766

క. రప్పించ వారు హర్షము-లుప్పతిలఁగ నేఁగుదెంచి, యుచితక్రియలం
దప్పక కనుఁగొనుచుండఁగ-నప్పుడు విధ్యుక్తనియతు లై భూమిసురుల్. 767

ఆ. కడఁగి సవనభూమిఁ గనకలాంగలముల-నర్థి దున్ని పాండవాగ్రజునకు
నచట దీక్ష చేసి, యుచితస్వర్ణమ-యో[1]పకరణముల నలోపముగను. 768

వ. ఇట్లు నియమంబున సముచితక్రియాకలాపంబులు నడపుచుండె; నప్పుడు. 769

క. సకలావనీశు లిచ్చిన-యకలంకసువర్ణరత్నహయధనవస్త్ర
ప్రకరంబులు మొద లగు కా-నుక లందుకొనఁ సుయోధనుని నియమించెన్.

సీ. అర్థిజాతము గోరినట్టి వస్తువు లెల్లఁ దగఁ బంచి యిడఁగ [2]రాధాతనూజు,
సరసాన్న పానాదిసకలపదార్థముల్ పాకముల్ సేవింపఁ బవనతనయుఁ,
బంకజోదరునొద్దఁ బాయక పరిచర్య దవిలి కావింప వాసవతనూజు,
సవననిమిత్తంబు సంచితద్రవ్యంబు పెంపుతో వేగ తెప్పింప నకులు,
తే. దేవగురువృద్ధధాత్రీసురావలులను
నరసి పూజింప సహదేవు, నఖిలజనులఁ
బాలుచుం[3]మృష్టాన్నతతులఁ దృప్తులను జేయ
ద్రౌపదిని నియోగించెను ధర్మసుతుఁడు. 771

వ. అయ్యవసరంబున. 772

చ. హరి శిఖి దండపాణి [4]నికషాత్మజ పాశి సమీర గుహ్యకే
శ్వర శశిమౌళి పంకరుహసంభవ చారణ సిద్ధ సాధ్య కి
న్నర గరుడోరగామరగణంబులు వచ్చి, మఖంబుఁ జూచి, య
చ్చెరువడి "తొల్లి యెవ్వరును జేయు మఖంబులు నింత యొప్పునే? 773

క. అది గాక యిందిరావిభు-పదములు సేవించునట్టి భాగ్యము గలుగం,
దుదిఁ బడయరాని బహుసం-పద లెవ్వియుఁ గలవె! యనుచుఁ బ్రస్తుతి సేయన్.

వ. అప్పుడు. 775

చ. అమరసమాను లై తనరు యాజకవర్గము లోలి రాజసూ
యమఖవిధానమంత్రముల నగ్నిముఖంబుగఁ జేసి, ధర్మజుం
గ్రమమున వేలిపింపఁ గ్రతురాజసమాప్తిదినంబునన్ నృపో
త్తముఁడు గడంగి, యాజక[5]సదస్యగురుద్విజకోటిఁ బెంపునన్. 776

1. సామగ్రులు. 2. కర్ణుఁడు-రాధచేఁ బెంపఁబడినవాఁడు. 3. మధురములగు అన్నములు. 4. నిర్‌ఋతి దిక్కునకధిపతి. 5. సభ్యులు.

వ. పూజించునప్పు "డిం దగ్రపూజార్హు లెవ్వా?" రని యడిగిన, సదస్యులు దమకుఁ దోఁచిన విధంబులం బలుక, వారి భాషణంబులు వారించి, వివేకశీలుండును, జతురవచనకోవిదుండును, నగు సహదేవుండు భగవంతుండును, యదుకుల సంభవుండును నైన శ్రీకృష్ణునిం జూపి "యిమ్మహాత్ముని సంతుష్టుం జేసిన, భువనంబు లన్నియుం బరితుష్టిం బొందు" నని చెప్పి ధర్మజుం జూచి యిట్లనియె.

ఉ. కాలము, దేశముం, గ్రతువుఁ గర్మముఁ, గర్తయు, భోక్తయుం, జగ
జ్జాలము, దైవముం, గురువు, సాంఖ్యము, మంత్రము, నగ్ని, యాహుతుల్,
వేళలు, విప్రులుం, జననవృద్ధిలయంబుల, హేతుభూతముల్,
లీలలుఁ, దాన యై తగ వెలింగెడు నక్కటి తేజ మీశుఁడున్. 778

చ. ఇతఁడె; యితండు గన్ను లొకయించుక మోడ్చిన, నీ చరాచర
స్థితభువనంబు లన్నియు నశించు; నితం డవి విచ్చి చూచినన్
వితతము లై జనించుఁ; బ్రభవిష్ణుఁడు, విష్ణుఁడు నైనయట్టి యీ
క్రతుఫలదుండు గా కొరుఁ డొకం డెటు లర్హుఁడు శిష్టపూజకున్? 779

ఉ. ఈ పురుషోత్తముం, జగదధీశు, ననంతుని, సర్వశక్తుఁ, జి
ద్రూపకు [1]నగ్రపూజఁ బరితోషితుఁ జేయ, సమస్తలోకముల్
వే పరితుష్టిఁ బొందుఁ; బృథివీవర! కావున నీవు కృష్ణునిన్
శ్రీపతిఁ బూజసేయు మెడసేయక; మాటలు వేయు నేటికిన్?" 780

క. అని సహదేవుఁడు వలికిన-విని, యచ్చటిజనులు, మనుజవిభులును, ఋషులున్
మునుకొని మనముల మోదము-దనుకఁగ "నిది లెస్స" యనిరి; ధర్మజుఁ డంతన్.

క. మునిజనమానస[2]మధుకర-వనజాతము లైనయట్టి వారిజదళలో
చనుపదయుగళప్రక్షా-ళన మొగిఁ గావించి, తజ్జలంబులు భక్తిన్. 782

క. తానును, గుంతియు, ననుజులు, మానుగ ద్రుపదాత్మజయును, మస్తకములఁ బెం
పూనిననియతి ధరించి మ-హానందముఁ బొంది రతిశయప్రీతిమెయిన్. 783

క. చంచత్కాంచనరుచిరో-దంచితవస్త్రముల, నూతనార్కప్రభలన్,
మించిన రత్నములం బూ-జించెన్ ధర్మజుఁడు కృష్ణు జిష్ణు సహిష్ణున్. 784

వ. ఇట్లు పూజించి, యానందబాష్పజలబిందుకండళితనయనారవిందంబుల గోవిందుని సుందరాకారంబు దర్శింపఁజాల కుండె; నట్లు పూజితుండై తేజరిల్లు పుండరీకాక్షు నిరీక్షించి, హస్తంబులు నిజమస్తకంబుల ధరించి, వినుతులు సేయుచు నఖిలజనంబులు జయజయశబ్దంబు లిచ్చిరి; దేవతలు వివిధతూర్యఘోషంబులతోడం బుష్పవర్షంబులు గురియించి; రయ్యవసరంబున. 785

1. ప్రథమము చేయఁదగినపూజ. 2. తుమ్మెదలకుఁ గమలములు.

క. దమఘోషసుతుండు పద్మాక్ష-నము సూచి సహింప, కలుక నత్రిలఁగాఁ బీ
ఠము డిగ్గి, నిలిచి నిజహ-స్తము లెత్తి, మనోభయంబు దక్కినవాఁ డై. 786

వ. అప్పుండరీకాక్షుండు వినుచుండ సభాసదులం జూచి యిట్లనియె. 787

క. "చాలుఁ బురే! యహహా! యీ-కాలము గడపంగ దురవగాహం బగు; నీ
తేలా తప్పెను? నేఁ డీ, బాలకువచనముచేతఁ బ్రాజ్ఞులబుద్ధుల్. 788

వ. ఇట్లు దప్పిన తెఱం గెట్లనినఁ [1]పాత్రాపాత్రవివేకంబు సేయనేర్చిన విజ్ఞాననిపుణులు, నున్నతసత్త్వగరిష్ఠులు, బహువిధతపోవ్రతనియమశీలురు, ననల్పతేజులు, మహైశ్వర్యశక్తిధరులుఁ, బరతత్త్వవేదులు, నఖిలలోకపాలపూజితులు, విగతపాపులుఁ, బరమయోగీంద్రులు నుండ, వీరిం గైకొనక వివేకరహితు లై గోపాలబాలునిం బూజసేయుటకు నెట్లు సమ్మతించిరి? పురోడాశంబు [2]సృగాలంబున కర్హంబగునే? యనుయునుం గాక. 789

సీ. గురుదేవశూన్యుండు; కులగోత్రరహితుండు; దలిదండ్రు లెవ్వరో తడవఁ గాన;
మప్పులఁ బొరలెడు! నాదిమధ్యావసానంబులం దరయ మానంబు లేదు;
బహురూపి యై, పెక్కుభంగుల వర్తించు! వానివర్తనములు వరుస లేవు,
పరికింప విగతసంబంధుండు; దలపోయ మానిమిత్తంబున మాని సయ్యెఁ;
తే. బరఁగ మున్ను యయాతిశాపమునఁ జేసి-వాసి కెక్కఁడ యీయదువంశ మెల్ల;
బ్రహ్మతేజంబు నెల్లఁ గోల్పడిన యితఁడు-బ్రహ్మఋషి సేవ్యుఁ డగునె గోపాలకుండు?

క. జారుఁడు, జన్మావధియును-జోరుఁడు, [3]ముప్పోకలాఁడు, సుమహితపూజా
చారక్రియలకు నర్హుఁడె-వారక యితఁ?"డనుచు నశుభవాక్యస్ఫూర్తిన్. 791

చ. అని తను దూఱ నాడిన మురాంతకుఁ డా శిశుపాలువాక్యముల్
విని, మదిఁ జీరికిం గొనఁడు, విశ్రుతఘేరవరావ మాత్మఁ గై
కొనని మృగేంద్రురీతి, మునికోటియు రాజులుఁ బద్మనాభు నా
డిన యవినీతభాషలకు డెందమునం గడు వంత నొందుచున్. 792

ఉ. వీనులు మూసికొంచు, విన విస్మయ మంచు 'ముకుంద! మాధవ!
శ్రీనిధి! వీని నే గతికిఁ జేర్చెదొ?' యంచు, దురాత్ముఁ దిట్టుచు,
న్నా నరనాథులుఁ, మునులు, నచ్చట నిల్వక పోవఁ, బాండుసం
తానము లప్రమేయబలదర్పమహోద్ధతరోషచిత్తు లై. 793

వ. అప్పుడు కేకయసృంజయభూపతులుం, దామును, వివిధాయుధపాణు లై యదల్చి నిల్చిన, వాఁడునుం [4]బెఱుతివక యదల్చి, పలుకయు వాలునుం గైకొని,

1. తగినవారియొక్కయు, తగనివారియొక్కయు జ్ఞానము. 2. నక్క. 3. మూఁడుత్రోవలఁ బోవువాఁడు. 4. వెనుకకుఁబోక.

లెక్కి, యతిమనోహరవిభవాభిరామంబై చనుదెంచుచుండె; నప్పుడు వారాంగనాజనంబులు దమతమవారలం గూడికొని. 302

సీ. కనకాద్రిసానుసంగతకేకికులజాతిఁ గ్రొమ్ముళ్ళ పింఛుల గునిసి యాడఁ,
దరళతాటంకముక్తాఫలాంశుద్యుతుల్ చెక్కుటద్దములతోఁ జెలిమి సేయఁ,
బాలసీ యద్భృశ్యమై పోని క్రొమ్మెఱుంగుల గతులఁ గటాక్షదీధితులు దనర,
మంచునై నెగయు నూఁకించు జక్కవ లనఁ జన్నులు జిలుఁగుకంచెలల నఱుమ,

తే. మహితకుచభారకంపితమధ్య లగుచు
నర్థి మొలనూళ్లు మొఱయఁ, బయ్యెదలు [1]జీరఁ,
గరసరోజాతకంకణక్వణనములును
జరణనూపురఘోషముల్ సందడింప. 303

వ. మఱియు నయ్యిందువదన లందంద మందగమనంబునం జెందు ఘర్మజలబిందుసందోహకందళితమందహాసచంద్రికాసుందరవదనారవిందంబుల నిందిందిరరుచిరచికురబృందంబులు చిందఱవందఱలై, సందడిగొన, నమందానందహృదయలై సువర్ణశృంగసంగతంబులైన సంకుమదమలయజముఖసురభితోయంబులు సముదాయంబులై తమతోయంబుల వారిపయిం జల్లుచుఁ, జెందొవలఁ గెందలిరుల రచియించినచిమ్మనగ్రోవులం దావులు గల పూఁదేనియలు నించి, [2]వావులు దెలిపి, శేవలు మీఱఁ గ్రేవల నుండి, యిమ్ములం గని చిమ్ముచు, మృగమదకుంకుమపంకంబును గొంకక బింకంబుల జంకె లోలయం బంకజసన్నిభంబు లగు మొగంబుల నేమఱించి చరుముచు, నుల్లంబులు పల్లవింపం బెల్లడరి యందియలు గల్లుగల్లని మొరయఁ గ్రేళ్లు దాఁటుచుం, జారుచంద్రికాసారఘనసారధూళిమిళితరజనీపరాగంబు రాగంబు రంజిల్లం, గరంబులం బుచ్చికొని, శిరఃబులం జల్లుచు, జిత్తంబుల నమ్మత్తకాశినులవృత్తంబు లగు కుచంబుల కెత్తు వత్తు మని బిత్తరించు పువ్వుగుత్తులం దత్తఱంబున వ్రేయుచుఁ, బరిహసించుచు, నన్యోన్యకరకిసలయకనకకరండభరితం బగు పన్నీటం జెంగావిజిలుఁగుఁబుట్టంబులు దట్టంబుగాఁ దోఁగి, మర్మంబులు బయలు పడిన, నగ్గలంబు లగు సిగ్గులకు నొప్పిదంబు లగు తమకనుఱెప్ప లడ్డంబు సేయుచుఁ, బురుషులుం దాము నా రామ లభిరామలీలారసోక్తు లెనయ, నంతరంగంబుల సంతసంబునం బంతంబులిచ్చుచు, వసంతంబు లాడి; రవ్వేళ నతులవిమానారూఢు లైన యింద్ర[4]పురంధ్రీజనంబులుంబోలె హాటకశిబిక లెక్కి నిజచేటికాజనంబులు సేవింపం జనుదెంచు భూకాంతకాంతాజనంబులుం దమ సరసంబులకు నర్హంబు లైన ధరణీపాలవధూలలామంబు లాదరించు చెలులపైఁ దమ సఖీజనంబులం బురికొల్పి, చల్లించుచు, భావగర్భితంబు

1. క్రిందు రాచుకొనుచుండఁగా. 2. వరుసలు. 3. వస్త్రములు. 4. అంతఃపురస్త్రీలు.

భుజాగర్వదుర్వారుండై గోవిందునిం బడసువర్తులైనవారలం గుపితుండై నిందింప, నమ్ముకుందుం డాగ్రహంబున లేచి, తనకెదురై యెదిర్చి యున్న శిశుపాలుని, హాస్యేక్షణంబుల వీక్షించుచు, నా క్షణంబ తన హస్తకంబు నిశిత ధారాకరాళం బైన చక్రంబున నవక్రపరాక్రముండై ¹రుధిరంబు దొరఁగం దునుము; నమ్మహాకలకలం బాకర్ణించి, చైద్యబలంబులు తదీయపక్షచరులైన భూపతులును ²గనుకనిం బఱచి; రయ్యవసరంబున. 794

క. మునివరులును జనపతులును-గనుఁగొని వెఱఁగందఁ, జైద్యుగాత్రమునందుం
డనుపమ తేజము వెలువడి-వనజోదరు దేహమందు వడిఁ జొచ్చె; నృపా!" 795

వ. అనిన మునివరునకు భూవరుం డిట్లనియె. 796

క. "కమలాక్షుని నిందించిన-దమఘోషతనూభవుండు దారుణనరకకూ
పమునం బొందక, యేక్రియ-సుమహితమతిఁ గృష్ణునందుఁ జొచ్చె? మునీంద్రా!"

వ. అనిన శుకయోగి రాజయోగి కిట్లనియె. 798

మ. "మధుదైత్యాంతకుమీఁదిమత్సరమునన్ మత్తిల్లి, జన్మత్రయా
వధి యేప్రొద్దుఁ దదీయరూపగుణదివ్యధ్యానపారీణధీ
నిధి యౌటన్, శిశుపాలభూవిభుఁడు తా ³నిర్ధూతసర్వాఘుఁడై
విధిరుద్రాదుల కందరాని పదవిన్ వే పొందె; నుర్వీశ్వరా! 799

వ. అంత ధర్మనందనుండు ఋత్విగ్గణంబులను, సదస్యులను, బహుదక్షిణలం దనిపి, వివిధార్చనలం బూజించి, యవభృథస్నానక్రియాపరితోషంబున. 800

సీ. మురజమృదంగగోముఖశంఖడిండిమపణవాదిరవము లంబరము నిండఁ,
గవిసూతమాగధగాయకవంది⁴వైతాళికవినుతు లందంద బెరయ,
వితతమర్దళవేణువీణారవంబులగతులకు ⁵నర్తకీగతులు సెలఁగఁ,
దరళవిచిత్రకధ్వజపతాకాంకితస్యందనగజవాజిచయము లెక్క,

తే. సుతసహోదరహితపురోహితజనంబు-గటకకేయూరహారకంకణకిరీట
వస్త్రమాల్యానులేపనవ్రాతములను-విభవ మొప్పారఁ గై సేసి వెడల, నంత.

వ. మఱియు యదు సృంజయ కాంభోజ కురు కేకయ కోసలభూపాలముఖ్యులు చతుర్విధసేనాసమేతులై, ధరణి గంపింప, వెన్నడి నడతేర, ఋత్విజ్నికాయంబును సదస్యులను బ్రహ్మఘోషంబు లొలయ, మున్నిడికొని శోభమానానూనప్రభాభాసమానసువర్ణమయమాలికాదివ్యమణిహారంబులు గంఠంబునం దేజరిల్ల, నున్నతజవాశ్వంబులం బూన్చిన పుష్పరథంబు గళత్రసమేతుండై

1. రక్తము. 2. తత్క్షణమే. 3. నాశనము చేయఁబడిన సకలపాపములు కలవాఁడు. 4. స్తుతిపాఠకులు. 5. నాట్యమాడు స్త్రీలయొక్క నడకలు.

నెక్కి యతిమనోహరవిభవాభిరాముం డై చనుదెంచు చుండె; నప్పుడు పౌరాంగనాజనంబులు తమతమమేడలం గూడికొని. ౮౦౨

సీ. కనకాద్రిసానుసంగతకేకికులభాతిఁ గ్రొమ్ముళ్ళు పింఛాల గునిసి యాడఁ,
వరళతాటంకముక్తాఫలాంశుద్యుతుల్ చెక్కుటద్దములతోఁ జెలిమిసేయఁ,
బొలసి యదృశ్యమై పోవక్రొమ్మెఱుంగుల గతులఁ గటాక్షదీధితులు దనర,
మించుపై నెగయ నూఁకించుచక్కవ లనఁ జన్నులు జిలుఁగుకంచెలల నఱుమ,

తే. మహితకుచభారకంపితమధ్య లగుచు
నర్థి మొలనూళ్లు మొఱయఁ, బయ్యెదలు [1]జీరఁ,
గరసరోజాతకంకణక్వణనములును
జరణనూపురఘోషముల్ సందడింప. ౮౦౩

వ. మఱియు నయ్యిందువదన లందంద మందగమనంబునం జెందు ఘర్మజలబిందు సందోహకందళితమందహాసచంద్రికాసుందరవదనారవిందంబుల నిందిందిరరుచిర చికురబృందంబులు చిందఱవందఱ లై, సందడిగొన, నమందానందహృదయ లై సువర్ణశృంగసంగతంబు లైన సంకుమదమలయజముఖసురభితోయంబులు సముదాయంబు లై తమతోయంబుల వారిపయిం జల్లుచుఁ, జెందొవలఁ గెందలిరుల రచియించినచిమ్మనఁగ్రోవులం దావులు గల పూఁదేనియలు నించి, [2]వావులు దెలిపి, తేవలు మీఱఁ గ్రేవల నుండి, యిమ్ములం గని చిమ్ముచు, మృగమదకుంకుమపంకంబును గొంకక బింకంబుల జంకె లొలయం బంకజసన్నిభంబు లగు మొగంబుల నేమఱించి చరుముచు, నుల్లంబులు పల్లవింపం బెల్లడరి యందియలు గల్లుగల్లని మొరయఁ గ్రేళ్లు దాఁటుచుం, జారుచంద్రికాసారఘనసారధూళిమిళితరజనీపరాగంబు రాగంబు రంజిల్లం, గరంబులం బుచ్చికొని, శిరంబులం జల్లుచు, జిత్తంబుల నమ్మత్తకాశినులవృత్తంబు లగు కుచంబుల కెత్తు వత్తు మని బిత్తరించు పువ్వుగుత్తులం దత్తఱంబున వ్రేయుచుఁ, బరిహసించుచు, నన్యోన్యకరకిసలయ కనకకరండభరితం బగు పన్నీటం జెంగావిజిలుఁగు[3]బుట్టంబులు దట్టంబుగాఁ దోఁగి, మర్మంబులు బయలు పడిన, నగ్గలంబు లగు సిగ్గులకు నొప్పిదంబు లగు తమకనుఱెప్ప లడ్డంబుసేయుచుఁ, బురుషులుం దాము నా రామ లభిరామలీలా రసోక్తు లెనయ, నంతరంగంబుల సంతసంబునం బంతంబులిచ్చుచు, వసంతంబు లాడి; రవ్వేళ నతులవిమానారూఢు లైన యింద్ర[4]పురంధ్రిజనంబులుంబోలె హాటకశిబిక లెక్కి నిజచేటికాజనంబులు సేవింపం జనుదెంచు భూకాంతకాంతాజనంబులుం దమ సరసంబులకు నర్హంబు లైన ధరణీపాలవధూలలామంబు లాదరించు చెలులపైఁ దమ సఖీజనంబులం బురికొల్పి, చల్లించుచు, భావగర్భితంబు

1. క్రింద రాచుకొనుచుండఁగా. 2. వరుసలు. 3. వస్త్రములు. 4. అంతఃపురస్త్రీలు.

లగు వారిచేఁ బరిహాసోక్తుల మందహాసచంద్రికలు ముఖకమలలీలావిలాసలక్ష్మిం
బ్రోదిసేయం జని; తద్విధంబున నిజసామ్రాజ్యవిభవంబు ప్రాజ్యంబుగా నజాత
శత్రుండు గంగాప్రవాహంబునఁ గలిసి, యందు నిజవధూయుక్తుం డై, శాస్త్రోక్త
ప్రకారంబున నవభృథస్నానం బాచరించె; నాసమయంబున. 804

క. [1]అనిమిషదుందుభిఘనని-స్వనములు వీతెంచెఁ; బుష్పవర్షము గురిసెన్;
ముని దేవపితృమహీసుర-వినుతుల రవ మెసఁగె; నప్పుడు విమలచరిత్రా! 805

క. నరు లెట్టిపాపు లైనను-గర మర్థిని నెద్దిసేసి గతకల్మషు లై
చరియింతు, రట్టి[2]యవభృథ-మరుదుగఁ గావించి రెలమి నఖిలజనంబుల్. 806

ఆ. అంత ధర్మతనయుఁ డభినవమృదులదు-కూలసురభికుసుమమాలికాను
లేపనములు రత్నదీపితభూషణా-వళులు దాల్చి, వైభవమున నొప్పె. 807

వ. అంత నవభృథస్నానానంతరంబున మరలి చనుదెంచి. 808

ఉ. పాండుతనూభవాగ్రజుఁడు, పాండుయశోనిధి, భాసమానమా
ర్తాండనిభుండు, యాజకసదస్యమహీసురమిత్రబంధురా
జ్మండలిఁ బూజ చేసి, బుధమాన్యచరిత్రుఁడు వారి కిచ్చె నొం
డొండ దుకూలరత్నకనకోజ్జ్వలభూషణముఖ్యవస్తువుల్. 809

వ. అట్లు నారాయణపరాయణు లై దేవసమానప్రకాశప్రభావంబుల, సకలనర
నారీలోకంబు లనర్ఘ్యరత్నమయభూషణమాల్యానులేపనంబులు ధరియించి,
పరమానందభరితాత్ము లై యొప్పి యుండి; రంత. 810

చ. సునిశితభక్తిఁ దన్మఖముఁ జూడఁగ వచ్చినయట్టి దేవతా
మునిధరణీసురప్రకరభూవరవిడ్జనశూద్రకోటి య
జ్జనవరచంద్రుచే నుచితసత్కృతులం బరితోషచిత్తు లై,
వినయముతోడ ధర్మజుని వీడ్కొని పోవుచుఁ బెక్కుభంగులన్. 811

చ. హరిచరణాంబుజాతయుగళార్చకుఁ డై పెనుపొందు పాండుభూ
వరసుతు రాజసూయమఖవైభవముల్ నుతియించుచున్, సమా
దరమున నాత్మభూముల కుదారత నేఁగిరి; ధర్మసూనుఁడున్
సరసిజనేత్రుఁ దా ననుపఁజాలక 'యుండు' మటంచు వేఁడినన్. 812

వ. అట్లు పాండవాగ్రజుప్రార్థనం గైకొని, దామోదరుండు సమస్తయాదవులను
గుశస్థలికిఁ బోవం బనిచి, [3]కతిపయపరిజనంబులుం దానును నతనికిం బ్రియంబుగాఁ
దన్నగరంబునఁ బ్రమోదంబున నుండె'' నని చెప్పి మఱియు ని ట్లనియె. 813

---

1. దేవతలయొక్క. 2. యజ్ఞాంతమునఁజేయు మంగళస్నానము. 3. కొందఱుసేవకుల.

చ. "జనవర! పాండుభూపతనుజాతుఁడు దుస్తర మా మనోరథా
బ్ధిని సరసీరుహాక్షుఁ డను తెప్పకతంబున దాఁటి, భూరిశో
భనయుతుఁ డై, మనోరుజయుఁ బాసి, ముదాత్మకుఁ డై వెలింగెఁ; స
వ్వనరుహనాభుదాసజనవత్సలకుం గలవే యసాధ్యముల్? 814

వ. అట్టియెడ. 815

ఆ. రాజసూయమఖవరప్రభావమునకు-నఖిలజనులు మోదమంది; రపుడు
కలుషమానసుండు కుల[1]పాంసనుఁడు సుయోధనుఁ డొకండు దక్క, ధరణినాథ.

వ. అనిన విని శుకయోగీంద్రునకుఁ బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె. 817

ఆ. "అఖిలజనులకెల్ల నానందజనక మై-యెనయు[2]మఖము కురుకులేశ్వరునకుఁ
గర మసహ్య మైనకారణ మెయ్యది?-యెఱుఁగఁ బలుకు నాకు నిద్ధచరిత!"

చ. అనిన మునీంద్రుఁ డిట్లను ధరాధిపుతోఁ "గురురాజు పాండునం
దనులదెస న్ననేకదురితంబులు నిచ్చలుఁ జేయుచుండు; నై
నను నొకనాఁడు పంకరుహనాభదయాపరిలబ్ధభూరిశో
భనజితదేవదైత్యనరపాలకరాజ్యరమామహత్త్వమై. 819

చ. వెలయు ననూనసంపదల విశ్రుతకీర్తులు మిన్ను ముట్టఁ, బెం
పలరిన పాండుభూవరసుతాగ్రజుఁ డా త్రిపురంబులోన ను
జ్జ్వలమణిభూషణాంశురుచిజాలము పర్వఁ, బయోజనాభు సను
త్కలిక భజించుచుఁ ఘనసుఖస్థితి భూరిమనోహరాకృతిన్. 820

వ. ఉండం గనుంగొని, యదియునుం గాక యొక్కనాఁడు లలితాష్టమీశశాంక బింబంబుల విడంబించుచు నింద్రనీలరుచినిచయంబు నపహసించు కుటిలకుంతలంబులు నటనంబు సలుపం దనరు నిటలఫలకంబులును, బుష్పచాపుచాపంబు రూపు నేపు సూపు భ్రూయుగోపాంతంబు లై, సౌదామనీదామరుచిస్తోమంబు లై, కర్ణాంతసీమంబు లై యంజనంబులతోడ రంజిల్లు నేత్రకంజంబులును, నవమల్లికాముకుళవిభాసితదంతమరీచికానిచయోద్దీపితమందహాసచంద్రికాధవళితంబులును, ముకురోపమితంబులు నై కర్ణకుండలమణిమరీచిజాలంబులు, బెరసి బహుప్రకారంబులఁ బర్వం బొలుచు కపోలపాలికలును, విలసితగ్రైవేయకముక్తాఫలహారనిచయంబుల కిమ్ముచూపక మిసమిసని పసగల మెఱుంగులు గిఱికొన మీఁటినం బగులునవం బోఁగడం దగి, మొగంబులకుం బుటంబు లెగయు నుత్తుంగపీనకుచభారంబుల వ్రేఁగు లాఁగలేక తూఁగాడుచుం గరతల[4]పరిమేయంబు లగు మధ్యభాగంబులును, ఘనజఘనమండలావతీర్ణకాంచనకాంచీ

1. కులమును ధ్వంసముచేయువాఁడు. 2. యజ్ఞము. 3. ఉత్సాహము. 4. కొలఁతచేయఁదగినవి.

కలాపకింకిణీకలకలనినాదోల్లసితంబులగు కటిప్రదేశంబులును, సల్లలితహల్లక
పల్లవకాంతులఁ బెల్లుగొల్లలు గొని యభిరామంబులై శోభిల్లు పదపాణి
తలంబులును, నలసగతులం బదంబులం దనరు మణినూపురంబులు గోపురంబులం
బ్రతిస్వనంబు లొలయ మొరయ నలరు చరణారవిందంబులును, రత్నవలయ
కంకణాంగుళీయకాదివివిధ భూషణ ద్యుతి నిచయంబు [1]ఉష్ణమరీచికరనిచ
యంబుల ధిక్కరింప, వెలుఁగు కరకంజంబులును, మృగమదఘనసారహరిచంద
నాగరుకుంకుమపంకంబుల భాసురంబు లగు వాసనలు నాసారంధ్రంబులకు [2]వెక్క
సంబులై పొలయు సౌభాగ్యంబులు గలిగి చైతన్యంబు నొందిన మాణిక్యపు
బొమ్మలవిధంబున గగనమండలంబు నిర్గమించి, వసుధాతలంబున సంచరించు
చంద్రరేఖలచెలువున శృంగారరసంబు మూర్తీభవించి జగంబుల మోహపఱుచు
మోహినీదేవతల చందంబున విలసించు మాధవవధూసహస్రంబులసంగతిని
సౌదామనీలతయునుం బోలె నొప్పుచుండెడు ద్రుపదరాజనందనవిభవంబును,
రాజసూయమహాధ్వరోత్సవంబునం జూచి, చిత్తంబు త్తలపడ సుయోధనుండు
సంతాపానలంబునం గ్రాఁగుచుండె; నంత నొక్కనాఁడు ధర్మనందనుండు నిర్మ
లం బగు సభాభవనంబునకుం జని. 821

సీ. సుతసహోదరపురోహితబాంధవామాత్యపరిచారభటకోటి బలసి కొలువఁ,
గలితమాగధమంజుగానంబుఁ బాఠకపఠనరవంబును బ్రమద మొసఁగఁ,
గంకణఝుణఝుణత్కారంబు శోభిల్ల సరసిజాననలు చామరము లిడఁగ,
మయవినిర్మితసభామధ్యంబునను భాసమానసింహాసనాసీనుఁ డగుచు,
తే. నమరగణములు గొలువఁ బెంపారు [3]ననిమి
షేంద్రుకైవడి మెఱసి యుపేంద్రుఁ డలర,
వరుసఁ గొలు వున్నయత్తఱి దురభిమాని
క్రోధమాత్సర్యధనుఁడు సుయోధనుండు. 822

ఉ. కాంచనరత్నభూషణనికాయముఁ దాల్చి, సముజ్జ్వలప్రభో
దంచితమూర్తి నొప్పి, పణిహారులు ముందటఁ గ్రందు వాయ వా
రింప, సహోదరుల్ నృపవరేణ్యులు పార్శ్వములన్ భజింప, నే
తెంచెను రాజసంబున యుధిష్ఠిరుపాలికి వైభవోన్నతిన్. 823

వ. అట్లు సనుదెంచి, మయమాయామోహితం బైన సభాస్థలంబునందు. 824

క. సలిలములు లేనిచోటున–[4]వలువలు వెస నెగయఁ దిగిచి, వారక తోయం
బులు గలచోటను జేలం–బులు దడియఁగఁ బడియె, నిజవిభుత్వము దఱఁగన్.

1. సూర్యునియొక్క. 2. అధికములు, అతిక్రమించినవి. 3. దేవేంద్రుఁడు. 4. వస్త్రములు.

క. ఈ విధ మంతయుఁ గనుఁగొని-పావని సత్త్వంబును, నచటిపాత్రప్రులును, గాం
తావళియును, యమతనయుఁడు-వారించెఁ జేసన్నఁ దమ్ము హాసింపంగన్. 826

వ. దామోదరానుమోదితుఁ డయి మహోత్సవంబుగాఁ బరిహాసంబులు సేసిన, సుయోధనుండు లజ్జానతవదనుం డై, కుపితమానసుం డగుచు, నయ్యెడ నిలువక వెలువడి నిజపురంబున కరిగె; నయ్యవసరంబున క్షితిపాలు రైన సభాసదు లగు నచ్చటిజనంబుల కోలాహలంబు సంకులం బైన నజాతశత్రుండు చిత్తంబున ఖిన్నుఁ డై యుండె; నప్పుండరీకాక్షుండు భూభారనివారణకారణుం డగుటం జేసి దుర్యోధనుఁ డవహాసంబునకుం గారణం బయ్యె నంత. 827

క. హరి ధర్మసుతుని వీడ్కొని-తరుణీహితబంధుజనకదంబము గొలువం
బరితోషమునఁ గుశస్థల-పురమునకుం జనియె మోదమున నరనాథా! 828

చ. జనవరబంధమోక్షణముఁ, జైద్యవధంబును, బాండురాజనం
దనమఖరక్షణంబును నుదారతఁ జేసినయట్టి దేవకీ
తనయు చరిత్రభాసురకథాపఠనాత్ములు గాంతు రిష్టశో
భనబహుపుత్త్రకీర్తులును, భవ్యవివేకము, విష్ణులోకమున్.'' 829

క. అని శుకయోగీంద్రుం డ-మ్మనుజేంద్రునిఁ జూచి, పలికె ''మఱియును శ్రీకృ
ష్ణునియద్భుతకర్మంబులు-వినిపింతుం జిత్తగింపు విమలచరిత్రా! 830

సాల్వుండు శివప్రసాదంబున సౌభకవిమానంబు వడసి ద్వారకాపురిపై దండెత్తుట

సీ. వసుధేశ! విను; మును వైదర్భిపరిణయవేళ దుర్మదశిశుపాలభూమి
వరునకుఁ దోడ్పడ నరుదెంచి, సైనికావలితోడఁ దొడరి, [2]దోర్బలము దూలి,
హరిచేత నిర్జితు లైనరాజులలోనఁ జైద్యునిచెలికాఁడు సాల్వభూమి
పతి జరాసంధాదిపార్థివప్రకరంబు విన మత్సరానలవిపులశిఖల

తే. ధాత్రి నిటమీఁద [3]వీతయాదవము గాఁగఁ,
గడఁగి సేయుదు నని దురాగ్రహముతోడఁ
బంతములు వల్కి, యటఁ జని భరితనిష్ఠఁ
దపము గావింపఁ బూని సుస్థలమునందు. 831

క. ధృతి వదలక, యుగ్రస్థితిఁ-బ్రతిదినముఁ బిడికెఁ [4]డవనిరజ మశనము గా
నతినియమముతో నాపశుపతి, శంకరు, ఫాలనయను, [5]భర్గు, నుమేశున్.

క. చెదరని నిజభక్తిని ద-త్పదపద్మము లాత్మ నిలిపి, పాయక యొకయేఁ
డుదితక్రియ భజియించిన-మదనారియు వానిభక్తిమహిమకు వశుఁ డై. 833

1. ఎగతాళి. 2. భుజబలము. 3. నశింపఁబడిన యదువంశము. 4. దుమ్ము. 5. ఈశ్వరుఁడు.

క. బోరనఁ బ్రత్యక్షుం డై—''కోరినవర మేమి యైనఁ గొసరక యిత్తున్;
వారక వేఁడు'' మ టన్నను—నారాజతపోధనుండు హరునకుఁ బ్రీతిన్. ౮౩౪

తే. వందనం బాచరించి, యానందవికచ-వదనుఁ డై నొస లంజలిఁ గదియఁ జేర్చి,
''శ్రితదయాకార! నన్ను రక్షించెదేని-నెఱుఁగ వినిపింతు వినుము మదీప్సితంబు.

తే. గరుడగంధర్వయక్షరాక్షససురేంద్ర-నరులచే సాధ్యపడక, నావలయునెడల
నభ్రపథమునఁ దిరిగెడునట్టి మహిత-వాహనము నాకు దయ సేయు; వరద! యీశ!''

వ. అని యభ్యర్థించినఁ బ్రసన్నుం డై హరుండు వానికోర్కి కనురూపం బైన విమానంబు నిర్మింప మయుని నియోగించిన, నతండును ''నట్ల చేసెద'' నని కామగమనంబును నతివిస్తృతంబునుగా లోహంబున నిర్మించి సౌభకం బను నామం బిడి, సాల్వున కిచ్చిన, వాఁడును బరమానందంబునుం బొంది, తద్విమానారూఢుం డై, యాదవులవలనిపూర్వవైరంబుఁ దలంచి, దర్పాంధచేతస్కుం డై, ద్వారకానగరంబుపైఁ జని, నిజసేనాసమేతంబుగాఁ దత్పురంబు నిరోధించి.

సీ. సరిదుపవనసరోవరములు మాయించి, బావులు గలఁచి, కూపములు సెఱిచి,
కోటలు వెస [1]పీటతాటముల్ గావించి, పరిఖలు పూడ్చి, వప్రములు ద్రొబ్బి,
యట్టళ్లు ధరఁ గూల్చి, యంత్రముల్ దునుమాడి, కాంచనధ్వజపతాకములు నఱికి,
భాసురగోపురప్రాసాదహర్మ్యేందుశాలాంగణములు భస్మములు చేసి,

తే. విమలకాంచనరత్నాదివివిధవస్తు-కోటి నెల్లను నందంద కొల్ల పుచ్చి,
ప్రజలఁ జెఱపట్టి, దొరలను భంగపెట్టి, దఱిమి యిబ్భంగిఁ బెక్కుబాధల నలంచి.

చ. మదమున నంతఁ బోవక, విమానయుతంబుగ నభ్రవీథికిన్
గొదకొని యేపుమై నెగసి, [2]కొంకక శక్తిశిలామహీరుహ
ప్రదరము లోలిమైఁ గురిసి, బంధురభూమిపరాగశర్కరల్
వదలక చల్లుచున్, వలయవాయువుచే దిశ లావరించుచున్. 839

వ. అట్టియెడ. 840

క. చటులపురత్రయదనుజో-త్కటదుస్తర[3]బాధ్యమానధారుణిగతి న
ప్పుటభేదన మెంతయు వి-స్ఫుటపీడం జెంది, వగల సుడివడుచుండన్. 841

చ. కని భగవంతుఁడున్, రథిశిఖామణియు, న్నగు రౌక్మిణేయుఁ డ
జ్జనముల[4]'నోడ కుండుఁ' డని, సంగరకౌతుక మొప్ప దివ్యసా
ధనములఁ బూని, సైనికకదంబము గొల్వ ననూనమీనకే
తనరుచి గ్రాల, నున్నతరథస్థితుఁ డై వెడలెన్ రణోర్వికిన్. 842

వ. అయ్యవసరంబున. 843

1. తలక్రిందులు. 2. సంశయింపక. 3. బాధింపఁబడుచున్న. 4. భయపడకయుండుఁడని.

చ. సమధికబాహుశౌర్యజితచండవిరోధులు వెళ్లి రన్నత
క్షమ, గద, భాను, వింద, శుక, సాత్యకి, సారణ, చారుదేష్ణ, సాం
బ, మకరకేతనాత్మజ, శ్వఫల్కతనూభవ, తత్సహోదర
ప్రముఖయదూత్తముల్ విమతభంజను లై, కృతవర్మ మున్నుగన్. 344

క. వారణవాజిస్యందన-వీరభటావలులు సనిరి విశ్వము వడఁకన్
ఘోరాకృతి వివిధాయుధ-భూరిద్యుతు లర్కబింబముం గబళింపన్. 845

వ. చని, యా గోవిందనందనస్యందనంబుల్ బలసందోహంబునుం దలకడచి, యదు
సైన్యంబులు సాల్వబలంబులతోడం దాఁకొని, బెరయునప్పుడు దేవదానవసం
కులసమరవిధంబునం దుములం బయ్యె; నయ్యెడ. 846

మ. [1]వితతజ్యాచయటంకృతుల్ మదజలావిర్భూతశుండాలఘీం
కృతు, లుద్యద్భటహుంకృతుల్, మహితభేరీభాంకృతుల్, భీషణో
ద్ధతనిస్సాణధణంకృతుల్, ప్రకటయోధవ్రాతసాహంకృతుల్,
కుతలంబుల్, దివి నిండ మ్రోసె రిపుసంక్షోభంబుగా భూవరా! 847

మ. హరిరింఖారథ[2]నేమిసద్భటపదవ్యాఘట్టనోద్ధూతదు
స్తరధూళీపటలప్రభూతనిబిడధ్వాంతప్రవిధ్వంసకృ
త్కరశాతాసిగదాదిహేతిరుచు లాకాశంబు నిండన్, వియ
చ్చరదృక్కుల్ మిఱుమిట్లు గొల్ప, సమరోత్సాహంబు సంధిల్లఁగన్. 848

చ. తలకొని సైనికుల్ గవిసి తాఁకొని, పేర్కొని పాసి డాసి, యం
కిలి గొన, కెమ్ములమ్ములఁ బగిల్చి, నొగి, ల్చితరేతరుల్ తలల్
నలియఁగ మొత్తి; రొత్తి నయనంబుల నిప్పులు రాల, లీల నొఁ
దలలు, లలాటముల్ ఘనగదాహతి నొంచి కలంచి పోరఁగన్. 849

వ. అయ్యవసరంబునఁ బ్రద్యుమ్నుండు గనుంగొని. 850

మ. అనయంబుం గలుషించి, సౌభపతి మాయాకోట్లు చంచచ్ఛరా
సననిర్ముక్తనిశాతదివ్యమహితాస్త్రశ్రేణిచేఁ దత్క్షణం
మన లీలాగతి నభ్రగుల్ మనములన్ భూషింప, మాయించె న
వ్వనజాతాప్తుఁడు భూరిసంతమసముల్ వారించుచందంబునన్. 851

వ. మఱియును. 852

చ. అతిరథికోత్తముం డన నుదంచితకాంచనపుంఖపంచవిం
శతివిశిఖంబుల న్నతనిసైనికపాలుని నొంచి, యుగ్రుఁ డై

1. విస్తారమయిన అల్లెత్రాళ్ల సముదాయములయొక్క టంకారములు - ధ్వనులు. 2. రథచక్రము చుట్టునుండు కమ్మి.

[1]శతశతకోటికోటినిజసాయకముల్ వరఁగించి, సాల్వభూ
పతికకుదంబు నొంచి, బయలైరథ్యులై నడుఁ జెచ్చి వెండియున్. 853

చ. పదిపదియమ్ములన్ మనుజపాలకకేతువుల నొంచి, రోషముం
గదురఁగ మూఁడుమూఁడు శితకాండములన్ రథదంతివాజులం
జదియఁగ జేసి, యొక్కొకనిశాతశరంబున సైనికావళిన్
మదము లడంచి, యి ట్లితఁడు సమానపటిమం బరాక్రమించినన్. 854

క. దుర్మానవహరునద్భుత-కర్మమునకు నుభయసైనికప్రకరంబుల్
నిర్మలమతి నుతియించిరి-ధర్మాచలధైర్యు, విగతభయుఁ, బ్రద్యుమ్నున్. 855

వ. అయ్యవసరంబున. 856

ఉ. సాంబుని సాల్వభూవిభుఁడు సాయకజాలము లేసి నొంచినన్,
జాంబవతీతనూభవుఁడు చాపము సజ్యము సేసి, డాసి సా
ల్వుం బదియేనుతూపుల నవోన్నతవక్షము గాఁడ నేసి, శా
తాంబకవింశతి న్నతనిసాథక మల్లలనాడ నేసినన్. 857

చ. గదుఁడు మహోగ్రవృత్తి నిజకార్ముకనిర్గతవిస్ఫురద్విధుం
తుదవదనాభబాణవితతుల్ వరఁగించి, విరోధిమస్తముల్
[2]గుదులుగఁ గ్రుచ్చి యెత్తుచు, నకుంఠితవిక్రమకేళిలోలుఁడై
చదల సురల్ నుతింప రథసత్తముఁ డొప్పె నరేంద్రచంద్రమా! 858

ఉ. సాత్యకి చండరోషమున సాల్వమహీవరు భూరిసాభసాం
గత్య చతుర్విధోగ్రబలగాఢతమఃపటలంబు, భాసురా
దిత్యమయూఖపుంజరుచితీవ్రశరంబులఁ జూపి, సైనిక
స్తుత్యపరాక్రమప్రకటదోర్బలుఁడై విలసిల్లె భూవరా! 859

ఉత్సాహము. భానువిందుఁ డుద్ధతిన్ [3]విపక్షపక్షసైన్యదు
ర్మానకాననానలోపమానచండకాండసం
తాన మూన నేసి, చూర్ణితంబు చేసెఁ, జాహవి
ద్యానిరూఢి దేవతావితాన మిచ్చ మెచ్చఁగాన్. 860

ఉత్సాహము. చారుదేష్ణుఁ డాగ్రహించి శత్రుభీషణోగ్రదో
స్సారదర్ప మేర్పడన్ నిశాతబాణకోటిచే
దారుణప్రతాపసాల్వదండనాథమండలిన్
మారి [4]రేఁగినట్లు పిల్కుమార్చి పేర్చి యార్చినన్. 861

1. నూరుపిడుగుల సముదాయములతో సాటియగు బాణములు. 2. గుత్తులుగ. 3. శత్రుసైన్యము. 4. విజృంభించినట్లు.

క. శుకుఁ డాయోధనవిజయో-త్సుకమతి బాహాబలంబు సొప్పడ, విశిఖ
ప్రకరంబులఁ దను శౌర్యా-ధికుఁ డన విద్వేషిబలతతిం బరిమార్చెన్. 862

ఉ. సారణుఁ డేపుమై గదిసి శాత్రవపేటులు సంచలింప, వి
స్ఫార మెలర్పఁ, గుంతశరశక్తిగదా[1]క్షురికాదిహేతులన్
వారక వాజిదంతిరథవర్గములం దునుమాడి, కాల్వురన్
వీరముతోడఁ బంపె [2]జమువీటికిఁ గాఁపుర ముగ్రమూర్తి యై. 863

క. అక్రూరుఁడుఁ, దదనుజులు న-వక్రపరాక్రమము మెఱసి, వైరుల బాహా
విక్రమమున వధియించిరి-చక్రప్రాసాదివివిధసాధనములచేన్. 864

మ. కృతవర్మక్షితినాయకుండు విశిఖశ్రేణిం బ్రమత్తార్యధి
శ్రితవర్మంబులఁ జించి, మేనుల శతచ్ఛిద్రంబులం జేయ, న
ద్భుతకర్మం బని సైనికుల్ వొగడ, శత్రుల్ దూలుచో సంగర
క్షితిధర్మంబుఁ దలంచి, కాచె రథికశ్రేష్ఠుండు భూమీశ్వరా! 865

వ. అయ్యవసరంబున సాల్వుండు కోపోద్దీపితమానసుం డై యుండ, మాయావిడం
బకం బైన సౌభకం బప్పుడు. 866

సీ. ఒకమాటు నభమునఁ బ్రకటంబుగాఁ దోఁచు; నొకమాటు ధరణిపై నొయ్యనిలుచు;
నొకమాటు శైలమస్తకమున వర్తించు; నొకపరి చరియించు నుదధినడుమ;
[3]నొక్కతోయంబున నొక్కటియైయుండు; నొక్కెడఁ గనుఁగొనఁ బెక్కులగును;
నొకమాటు సాల్వసంయుక్తమై పొడసూపు; నొకతోయ మన్నియు నుడిగితోఁచు;
ఆ. నొక్కతేప కొఱవి యుఱుముగఁ ద్రిప్పిన-గతి మహోగ్రవృత్తిఁ గానవచ్చుఁ;
మఱియుఁ బెక్కుగతుల నరివరుల్ గలఁగంగఁ-దిరిగె సౌభకంబు ధీవరేణ్య!

వ. ఇవ్విధంబున సౌభకంబు వర్తించుటం జేసి, యదుసైన్యంబులచే దైన్యంబు
నొందిన నిజసైన్యంబుల మరలం బురికొల్పి, సాల్వుం డప్పుడు. 868

క. [4]స్ఫురదనలాభశరంబులు-పొరిఁ బొరిఁ బుంఖానుపుంఖములుగా నేయం,
దెరలియు, మరలియు, మురిసియు, విరిసియుఁ, బిఱుతివక పోరె వెస యదుబలముల్.

క. అయ్యెడ మానము వదలక,-డయ్యక, మగపాడితోఁ దృఢంబుగఁ బోరన్
దయ్యా మెఱుంగును; నెక్కటి-కయ్యం బపు డయ్యెఁ బేరుగల యోధులకున్.

క. మును ప్రద్యుమ్నకుమారుని-ఘననిశితాస్త్రములచేతఁ గడు నొచ్చిన సా
ల్వునిమంతిరి, ద్యుమనాముఁడు-సునిశితగద చే నమర్చె సుమహితశక్తిన్. 871

---

1. మంగలకత్తివంటిది. 2. యమునిపట్టణమునకు. 3. ఒక పర్యాయము. 4. ప్రకాశించునట్టి యగ్నితో సమానములగు బాణములు.

చ. వెరవును లావునుం జేవయును వీరముఁ బీరముఁ గల్గి డాసి యా
సరసిజనాభనందను విశాలభుజాంతరముం బగిల్చినన్
విరవిరవోయి, మేను నిడువెండ్రుక లెత్తఁగఁ, జేతిసాధనో
త్కరములు దేరిపై వడలి, కన్నులు మూయుచు మూర్ఛ నొందినన్. 872

ఆ. [1]సమరధర్మవేది, సమధికనయవాది-దారుకునిసుతుండు, ధైర్యయుతుఁడు
రథముఁ దోలికొనుచు, రణభూమి వెడలి వే-చనియె; మూర్ఛ దేఱె శంబరారి.

ఉ. సారథిఁ జూచి యి ట్లనియె "శాత్రవవీరులు సూచి నవ్వఁగా
దేరు రణక్షితిన్ వెడలఁ దెచ్చితి; తెచ్చితి దుర్యశంబు; పం
కేరుహనాభుఁడున్, హలియు, గేలి గొనన్, యదువంశసంభవుల్
బీరము దప్పి యిప్పగిదిఁ బెల్కుఱి పోవుదురే రణంబునన్ ?" 874

వ. అనిన నతం డతని కిట్లనియె. 875

క. "రథి రిపుచే నొచ్చిన సా-రథియును,-సారథియు నొవ్వ రథియును, గావం
బృథుసమరధర్మ; మీఁక [2]న-వ్యథచిత్తుఁడ వగుచుఁ గడఁగు వైరుల గెలువన్"

వ. అనిన విని. 877

ఉ. సంచితభూరిబాహుబలశౌర్యుఁడు, సారథిమాట కాత్మ మో
దించి, రవిప్రకాండరుచిదీపితచాపముఁ దాల్చి, మౌర్వి సా
రించి, గుణధ్వనిన్ బృహదరిప్రకరంబుల భీతి ముంచి, తో
లించె రథంబు, మేదిని చలింపఁగ నా ద్యుముమీఁద నేర్పునన్. 878

వ. అట్లు డగ్గఱి. 879

చ. అరితను వష్టబాణముల నాగ్రహవృత్తిఁ బగిల్చి, నాల్గిటం
దురగములన్ వధించి, [3]యొకతూపున సారథిఁ ద్రుంచి, రెంట ని
ష్ఠురతరకేతుచాపములు చూర్ణము చేసి, యొకమ్మునన్ భయం
కరముగఁ ద్రుంచె నా ద్యుమునికంఠ మకుంఠితవిక్రమోద్ధతిన్. 880

మ. కని సాంబప్రముఖాదియాదవరు లుత్కంఠాత్ములై మీనకే
తను నగ్గించి, సువర్ణపుంఖనిశితాస్త్రశ్రేణి సంధించి, సా
ల్వునిసైన్యావలిమస్తముల్ [4]వెరవు లావున్ మీఱఁగా నొక్కయె
త్తున వే త్రుంచిరి, తాటిపండ్లు ధరఁ దోడ్తో రాల్చుచందంబునన్. 881

వ. అట్టియెడ. 882

1. యుద్ధధర్మములను దెలిసినవాఁడు. 2. శ్రమలేని మనస్సు గలవాఁడవు. 3. ఒక్కబాణము
చేత. 4. ఉపాయము.

స్రగ్ధర. హేలన్ గొబ్బంబు లేచెన్ గులధర లదరన్ బెగడంగన్; గృష్ణుఁడై యుగ్రమూర్తై
వ్రాలన్ జేసెన్; బ్రచండస్థితి ఘన సుభటవ్రాతముల్; శోణితంబుల్
గ్రోలన్, మాంసంబు నంజం గొఱికి నెముకలన్, గుంపులై సోలుచున్ భే
తాళక్రవ్యాద[2]భూతప్రేతకములు జతలై; తాళముల్ దట్టి యాడన్. 883

వ. మఱియు నొక్కెడ. 884

సీ. ఖండితశుండాలకాండముల్ నక్రముల్, ఘోటతుండంబులు భుజగసమితి,
పదతలంబులు కచ్ఛపంబులు, దంతముల్ శుక్తులు, కుంభవిద్యుక్తమౌక్తి
కములు రత్నములు, వాలములు జలౌకముల్, మెడలు భేకంబులు, మెదడు రొంపి,
ప్రేవులు వనసంపుఁదీవెలు, నరములు నాఁచు, మజ్జంబు ఫేనంబు, లస్థి

ఆ. సైకతములు, రక్తచయము తోయంబులు-నొరగు నెడల, నొరలు మొఱలు ఘనత
రంగరవముగా మతంగజాయోధన-స్థలము జలధిఁ బోల్పఁ దగె నరేంద్ర! 885

వ. ఇవ్విధంబున యదుసాల్వబలంబులు చలంబునఁ బరస్పరజయకాంక్షలం దల
పడి పోరు పూర్వపశ్చిమసముద్రంబులవడువున నిరువదియేడుదినంబు లతిఘోరం
బుగాఁ బోరునెడ, నింద్రప్రస్థపురంబుననుండి ద్వారకానగరంబునకు నగధ
రుండు సనుదేర, ముందటం గానవచ్చు దుర్నిమిత్తంబులం గనుంగొని,
కృష్ణుండు దారుకునిం జూచి యిట్లనియె. 886

శా. "కంటే దారుక! [3]దుర్నిమిత్తము లనేకంబుల్ మహాకీలముల్
మింటన్, మేదినిఁ దోఁచుచున్నయవి; నెమ్మిన్ ఖాండవప్రస్థ మే
నుంటం జైద్యహితక్షితీశ్వరులు మాయోపాయులై మత్పురి
న్గెంటింపం జనుదేరఁ బోలుదురు; పోనీ తేరు వేగంబునన్." 887

వ. అని యతిత్వరితగతిం జనుదెంచి, తత్పురంబు డగ్గఱి, మహాబలపరాక్రమం
బులం బ్రతిపక్షబలంబుతోడం దలపడి, పోరు యదుబలంబులను నభోవీథి నభే
ద్యమాయావిడంబనంబునఁ బ్రతివీరు లెంతకాలంబునకు నే యుపాయంబునను
సాధింప నలవిగాని సౌభకవిమానంబునం దున్న సాల్వునిం గని, తద్విమానంబు
డాయం దన తేరు దోల సారథిని నియమించి, కదియం జను మురాంతకుని
వీక్షించి, యదుసైనికప్రకరంబులు పరమానందంబునుం బొందిరి; మృతప్రా
యంబులై యున్న సైన్యంబులఁ గనుంగొని, సౌభకపతి విక్రమక్రియాక
లాపుం డగుచు నురవడించి. 888

చ. మిణుఁగురు లెల్లెడం జెదర, మింటను మంటలు పర్వ, ఘంటికా
ఘణఘణభూరినిస్వననికాయమునన్ [4]హరిదంతరాళముల్

1. క్రిందఁబడును. 2. భూతముల సముదాయములు. 3. అపశకునములు. 4. దిక్కుల యొక్క మధ్యప్రదేశములు.

వసారి; మహోగ్రశక్తిఁ గొని వారక దానవుఁ డేయ దైవదా
రుణగతి వింతయైన నిజరోచులతోఁ బడు ముక్కలై వడిన్. 889

క. కన్నీ జనుదేరఁగఁ గని; మహాప్లవ నగధరుఁ డలుకఁ దీవిలవోలెన్ దానిం
బొడిపొడి సైమ్ఖరఁ దొరఁగఁగ-నడుమన వెసఁ ద్రుంచె. శౌర్య-సారాహమునన్.

చ. గురుభుజుఁ డంతఁ బోవక, యకుంఠితశూరత శత్రుసైన్యముల్
దెరలఁగ, నుగ్రతం గొఱవిఁ ద్రిప్పినకైవడి, మింట దిర్దిరం
దిరుగుచు దుర్నిరీక్ష్య మగు దీపితసౌభము, సాల్వుఁ, జండభా
స్కరకిరణాభషోడశనిశాతశరంబుల గాఁడ నేసినన్. 891

చ. కడు వడి నల్గి వాఁడు నిజకార్ముకముల్ [1]జలదస్వనంబుకై
వడి మొరయించుచున్, వెడఁదవాతిశరంబులఁ బద్మలోచను
న్నెడమభుజంబు గాఁడ వడి నేసినఁ, దెం పఱి చేతిశార్ఙ్గముల్
విడిచె రథంబుపై; గగనవీథి సురల్ భయ మంది చూడఁగన్. 892

క. "హాహా" యని భూతావలు-లాహాకారములు సేయ, నంతట దేవ
న్నాహరిఁ గనుఁగొని,యతఁడు-త్సాహంబునఁ బలికె బాహుశౌర్యస్ఫూర్తిన్.

చ. "నలినదళాక్ష! మత్సఖుఁడు నాఁ దగు చైద్యుఁడు గోరినట్టి కో
మలి నవిసేత్రిమైఁ [2]దగవు మాలి వరించితి; వంతఁ బోక దో
ర్బలమున ధర్మనందనుసభాస్థలి నేమఱి యున్నవాని, న
చ్ఛలమునఁ జంపి; తట్టి కలుషంబున నేఁడు రణాంగణంబునన్. 894

క. తల చెడి పాఱక బాహా-బల మొప్పఁగ నాదుదృష్టిపథమున ధృతితో
నిలిచిన, నిష్ఠురవిశిఖా-[3]ర్చులముంచి మదీయసఖుని సూ డిటు దీర్తున్." 895

చ. అనిన మురాంతకుండు దరహాసము మోమునఁ దొంగలింప, సా
ల్వునిఁ గని "యోరి! లావు బలువుం గల పోటరివోలెఁ బ్రేలె; దే
మనినను బాటు సన్నిహిత మౌట యెఱుంగవు; మూఢచిత్త! పొ"
మ్మని, గదఁ గేలఁ ద్రిప్పి యభియాతిని శత్రుని వ్రేసె నుద్ధతిన్. 896

వ. అట్లు వ్రేసిన. 897

క. పెనుమూర్ఛ నొంది, వెస ము-క్కున వాతను నెత్తు రొల్కఁ, గొంతవడికి నొ
య్యన తెలిసి, నిలువరింపక-చనె వాఁడు నదృశ్యుఁ డగుచు సౌభముఁ దానున్.

వ. అయ్యవసరంబున. 899

---

1. మేఘముయొక్క ధ్వని - ఉఱుము. 2. ధర్మము లేక, న్యాయములేనివాఁడవయి. 3. మంటలు.

తే. గగనమండలంబు నొకఁ డాప్తుఁ డగుచు వచ్చి–నందనందనుపాదారవిందములకు
వందనము సేసి, "యానకదుందుభిని మ–హోగ్రుఁడై పట్టి తెచ్చె సాల్వుండు కడఁగి.

తే. దేవ! మీ కెఱిఁగింపఁగాఁ బిలిచి యిటకు–దేవకీదేవి నన్నుఁ బుత్తెంచె" ననఁగ
విని, సరోరుహనాభుండు ఘనవిషాద–మగ్నుఁ డయ్యెను గురుమీఁదిమమతఁ జేసి.

క. "నరగంధర్వసురాసుర–వరులకు నిర్జింపరానివాఁడు, బలుం డే
మఱ కరయ హీనబలుచేఁ–బరికింపఁగ నెట్లు పట్టువడెనొక్కో" యనుచున్. 902

వ. మఱియును. 903

క. భావంబు గలఁగ, "నాహా!–దైవకృతం బెవ్వరికిని దప్పింపఁగ రా;
దే విధి నైనను" నని శో–కావిలమతిఁ బలుకుచున్న నత్తఱి వాఁడున్. 904

వ. తనమాయాబలంబునఁ గ్రమ్మఱం దోఁచి, [1]కృతకవసుదేవునిఁ గల్పించి, యతనిం బంధించి కొని తెచ్చి "పుండరీకాక్ష! నిరీక్షింపు; భవజ్జనకుండు వీఁడె; యిప్పుడు నీవు గనుంగొన వీనితలఁ ద్రుంతు; నింక నెవ్వనికిం గా మనియెదు? కావం గల శక్తిగలదేనిం గావు" మని దురాలాపంబు లాడుచు [2]మృత్యుజిహ్వాకరాళం బైన కరవాలంబు గేలంబూని జళిపించుచు, నమ్మాయావసుదేవునిశిరంబు దునిమి, తన్మస్తకంబు గొని, వియద్వర్తియై చరియించు సౌభకవిమానంబు సొచ్చె; నంత గోవిందుండు గొంతదడవు మనంబున ఘనం బగు శోకంబునం గుందుచుండి, యాత్మసైనికులు దెలుపం దెలివొంది, యది మయోదితం బైన సాల్వుని మాయోపాయం బని యెఱింగె; నంతం దనకు వసుదేవుండు పట్టువడె నని చెప్పిన దూతయు, నమ్మాయాకళేబరంబును, నాక్షణంబ విచిత్రంబుగా మాయం బై పోయె; ననంతరంబ. 905

క. మును లపుడు గొంద ఱచటికిఁ–జనుదెంచి, [3]విమోహుఁ డైన జలజదళాక్షుం
గనుఁగొని సమధికభక్తిఁ–వినయంబునఁ బలికి రంత విష్ణున్ జిష్ణున్. 906

సీ. "కమలాక్ష! సర్వలోకములందు సర్వమానవులు సంసారనానావిధైక
దుఃఖాబ్ధిమగ్నులై, తుదిఁ జేర నేరక, వికలత్వమునఁ బొందువేళ, నిన్నుఁ
దలఁచి, దుఃఖంబులఁ దరియింతు; రట్టి సద్గుణనిధి వై దేవకోటి కెల్లఁ
[4]బట్టుఁగొమ్మ వై, పరబ్రహ్మాఖ్యఁ బొగ డొంది, పరమయోగీశ్వరప్రకరగాఢ
తే. పరచిదానందదివ్యరూపమున వెలుఁగు;–దనఘ! నీ వేడ? నీచజన్మాత్మజనిత
ఘనభయస్నేహమోహశోకంబు లేడ?"–యనుచు సంస్తుతి సేసి, వా రరిగి; రంత.

---

1. మాయావసుదేవుఁడు. 2. మృత్యుదేవతయొక్క నాలుకవలె భయంకరంబయిన.
3. దిక్కు తెలియనివాఁడు. 4. ఆధారము.

చ. హరి దనమీఁద ఘోరనిశితాశుగజాలము వేయు సాల్వభూ
వరు వధియింపఁ గోరి, బహువారిదనిర్గతధారికావృష్టివి
స్ఫురణ నసూనతీవ్రశరపుంజములన్ గగనంబుఁ గప్పి, క్రూ
ష్మజ రిపుపాళిరత్నమకుటము జాలము వక్త్రముఁ ద్రుంచి, కొంపియున్. 908

మ. వితతక్రోధముతోడఁ గృష్ణుఁడు జగద్విఖ్యాతకౌమోదకీ
ప్రతతశక్తిన్ వడిఁ ద్రిప్పి, మింట మెఱుంగుల్ పుట్టఁగాఁ బర్వి, ను
గ్రతఁ జంచద్గద వైచి త్రుంచె కసఁ జూర్ణంబై ధరన్ రాల, నా
యతభూరిత్రిపురాభమున్, మహితమాయాశోభమున్, సౌభమున్. 909

వ. అట్లు కృష్ణుండు దమ్మాయనిర్మితమాయావిమానంబు, నిజగదాహతి నింతింతలు
తునియలై సముద్రమధ్యంబునం దొరంగం జేసిన, సాల్వుండు గోటలు
వెదకిన భుజంగంబు భంగి, గంపడంగి, విన్ననై విగతమాయాబలుం డయ్యును,
బోలివోవని బీరంబున వసుధాతలంబునకు డిగ్గి, యాగ్రహంబున. 910

క. కరమునఁ బవినిభ మగు భీ-కరగద ధరియించి కదియఁగాఁ జనుదేరన్,
మురహరుఁ డుద్ధతి సాల్వుని-కరము గదాయుక్తముగను ఖండించె నృపా! 911

క. అంతం బోవక కినుక న-నంతుఁడు విలయార్కమండలాయతరుచిదు
ర్దాంతం బగు చక్రంబు ని-తాంతంబుగఁ బూన్చి, సాల్వధరణీపుమీఁదన్. 912

క. గురుశక్తి వైచి, వెస భా-సురకుండలమకుటరత్నశోభిత మగు త
చ్ఛిరము వడిఁ ద్రుంచె, నింద్రుఁడు-వరకులిశముచేత వృత్రువధియించుక్రియన్.

శ్రీకృష్ణుండు దంతవక్త్రుని సంహరించుట

వ. ఇట్లు మాయావి యైన సాల్వుండును, సౌభకంబును గృష్ణుచేతం బొలియుటఁ
గనుంగొని, నిజసఖు లగు సాల్వపౌండ్రకశిశుపాలురకుఁ బారలౌకికక్రియలు
మైత్రిం గావించి, దంతవక్త్రుం డతిభీషణాకారంబుతో నప్పుడు. 914

చ. పెటపెటఁ బండ్లు గీఁటుచును, బెట్టుగ మ్రోయుచుఁ, గన్నుఁగ్రేవలం
జిటచిట విస్ఫులింగములు చింద, మహోద్ధతపాదఘట్టనన్
నట నిట నై ధరిత్రి వడఁకాడ, వడిన్ గద కేలఁ ద్రిప్పుచున్,
మిటమిట మండువేసవిని మించు దివాకరుఁ బోలి యుగ్రతన్. 915

చ. వడిఁ జనుదేరఁ జూచి, యదువల్లభుఁ డుల్లము [3]పల్లవింప, న
ప్పుడు గదఁ గేలఁ బూని, రథమున్ రయ మొప్పఁగ డిగ్గి, యుగ్రతం
గడఁగి విరోధికి న్నెదురుగాఁ జన, వాఁ డతినీచవర్తి యై
యడరుచు నట్టహాసముఖుఁ డై [4]వలచే గదఁ ద్రిప్పుచున్ హరిన్. 916

1. పదునట్లు. 2. కోపము. 3. వికసింపఁగా. 4. కుడిచేత.

వ. కనుంగొని, పరిహాసోక్తులుగా నిట్లనియె "నీవు మదీయభాగ్యంబునం జేసి నేఁడు నా దృష్టిపథంబునకు గోచరుండ వైతివి; మిత్రద్రోహి వైన నిన్ను ¹మాతులేయుండ వని మన్నింపక, దేహంబునందు వర్తించు నుగ్రవ్యాధి నౌషధాదిక్రియల నివర్తింపం జేయు చికిత్సకుని చందంబున, బంధుహాసపాత్రుండవు గావున నిన్ను దంభోళిసంరంభగంభీరం బైన మదీయగదాదండహతిం బరేతనివాసంబున కనిచి, మున్ను నీచేత నిహతు లైన నాదుసఖులఋణంబుఁ దీర్తు" నని దుర్భాష లాడుచు డగ్గఱి. 917

చ. పెనుగదఁ బూన్చి; కృష్ణు తల బిట్టుగ మొత్తిన, నంతశౌరి యా
గనదెడి గంధసింధురముకై వడి సింధురభంజనుండు పెం
పున ²పవిభాసమానగదఁ బూని, మహోగ్రతఁ ద్రిప్పి, దంతవ
క్త్రునియురముం బగిల్చినఁ బగుల్కొనుచున్, రుధిరంబు గ్రక్కుచున్. 918

వ. తత్క్షణంబ పర్వతాకారం బగు దేహంబుతో నొఱలుచు, నేలం గూలి, కేశపాశంబులు చిక్కువడఁ, దన్నుకొనుచుఁ బ్రాణంబులు విడిచె; నప్పుడు నిఖిలభూతంబులు నాశ్చర్యంబు నొందఁ దద్గాత్రంబుననుండి యొక్క సూక్ష్మతేజంబు వెలువడి, గోవిందుని దేహంబుఁ బ్రవేశించె; నయ్యవసరంబున నగ్రజుమరణంబు గనుంగొని కుపితుం డై, కనుంగవల నిప్పు లుప్పతిల్ల విదూరథుండు గాలానలజ్వాలాభీలకరాళం బైన ³కరవాలంబును, బలకయుం గేలం దాల్చి, దామోదరు దెసకుఁ గవయుటయుం గనుంగొని. 919

చ. జలరుహలోచనుండు నిజసాధన మై తనరారుచక్రముం
వలనుగఁ బూన్చి వైవ, నది వారక వానిశిరంబు ద్రుంచె; న
బ్బలియుఁడు సౌభసాల్వశిశుపాలసహోదరతత్సహోదరా
వలుల వధించి, తత్కులమువారి ననేకులఁ ద్రుంచె నీగతిన్. 920

వ. అయ్యవసరంబున. 921

క. నరమునియోగిసురాసుర-గరుడోరగసిద్ధసాధ్యగంధర్వనభ
శ్చరకిన్నరకింపురుషులు-హరిమహిమ నుతించి రద్భుతానందములన్. 922

వ. మఱియు నప్సరోజనంబులు నృత్యంబులు సలుప, వేల్పులు కుసుమవర్షంబులు గురియ, దేవతూర్యంబు లవార్యంబు లై మొరయ, యదువృష్ణిప్రవరులు సేవింపఁ, బరమానందంబునుం బొంది నిజవిజయాంకితంబు లైన గీతంబుల వందిజనంబులు సంకీర్తనంబులు సేయ, నతిమనోహరవిభవాభిరామంబును, నూతనాలంకారంబును నైన ద్వారకానగరంబు శుభముహూర్తంబునం బ్రవేశింపం జనునెడ. 923

1. మేనమామకుమారుఁడు. 2. వజ్రాయుధముతో సమానముగ వెలుఁగుచున్న గదను. 3. ఖడ్గము.

క. పురసతులు విరులు లాజలు-[1]గురుసౌధాగ్రములనుండి కురియఁగ, ఘనకాం
బుదహాసుం డంతఃపుర-వర మధ్యముఁ జొచ్చె, వైభవం బలరారన్. 924

వ. అట్లు యోగీశ్వరేశ్వరుండును, షడ్గుణైశ్వర్యసంపన్నుండును, నిఖిలజగదీశ్వరుం
డును నైన పురుషోత్తముండు సుఖం బుండె; నంత. 925

క. కౌరవపాండవపృథుసమ-రారంభ మెఱింగి, తీర్థ యాత్ర నెపము గా
సీరాంకుఁ డుభయకులులకు-నారయ సముఁ డగుటఁ జేసి యరిగె; నరేంద్రా!

బలరాముండు తీర్థయాత్రకుఁ జనుట

వ. అట్లు సని, మొదలం బ్రభాసతీర్థంబున నవగాహంబు సేసి, యందు దేవర్షి పితృ
తర్పణంబులు సంప్రీతిం గావించి, విమల తేజోధను లగు భూసుర ప్రవరులు దనతో
నరుగుదేరం గదలి చని, క్రమంబున సరస్వతియు, బిందుసరోవరంబును, వజ్ర
తీర్థంబును, విశాలానదియు, సరయువును, యమునయు, జాహ్నవీతీర్థంబునుం
గనుంగొనుచు, నచట నచట నవగాహన దేవర్షి పితృతర్పణ బ్రాహ్మణసంతర్ప
ణంబులను, భూసురయుక్తుం డై నడపుచుం జని, సకలలోక స్తుత్యంబును, నిఖిల
మునిశరణ్యంబు నగు నైమిశారణ్యంబు సొచ్చి, యందు దీర్ఘ సత్రంబు నడపు
చున్న మునిజనంబులం గనుంగొనిన, వారును బ్రత్యుత్థానంబు సేసి, రామునకు
వినతు లై యాసనపూజావిధానంబులు గావించిన, నతండును బ్రముదితమాన
సుం డగుచు సపరివారంబుగాఁ గూర్చున్న యెడ. 927

క. ఆ నెడఁ దనుఁ గని ప్రత్యు-త్థాననమస్కారవిధులు దగ నడపక పెం
పూనిన పీఠముపై నా-సీనుం డగు సూతు శేముషీవిఖ్యాతున్. 928

వ. కనుంగొని, యతనిసమీపంబున నున్న విప్రవరులం జూచి రాముండు రోషించి
"వీఁడు నన్నుఁ గని లేవ కుండుటకు హేతు వెయ్యదియొకో? యీ [2]ప్రతిలోమజా
తుండు మునిగణసభాస్థలంబునఁ దా నొక్క ముఖ్యుండపోలె, దురభిమానంబున
శక్తిమనుమనివలనం గొన్ని కథలు గాథలు గఱచి, విద్వద్ధన్యునివిధంబున విఱ్ఱ
వీఁగెడును; నీచాత్ముం డభ్యసించువిద్య లెల్లను మనంబున విచారించి చూచిన
మదకారణంబులు గాని, సత్త్వగుణగరిష్ఠంబులు గావు; ధర్మ సంరక్షణంబు సేయ
నవతరించిన మాకు నిట్టి దుష్టమర్దనం బవశ్యకర్తవ్యం" బని తలఁచి, హస్తం
బున ధరించిన [3]కుశాగ్రంబున నా సూతుని వధించిన, నక్కడిమునీంద్రు లెల్ల
హాహాకారంబులతోడం దాలాంకునిం జూచి యి ట్లనిరి. 929

క. "అనఘా! యితనికి బ్రహ్మా-సన మే మిచ్చుటను, నీవు సనుదే నితఁ డా
సనము దిగఁ డయ్యె; నింతయు-మును నీమది నెఱుఁగ నర్థముం గలదె? హలీ!

1. గొప్పమేడలయొక్క పైభాగములనుండి. 2. తాఱుమాఱుగ జనించినవాఁడు, అనఁగా తక్కువకులమువారికి గొప్పకులమువారివలన జనించినవాఁడు. 3. దర్భయొక్క అగ్రభాగముచేత.

క. ఎఱిఁ గెఱిఁగి బ్రహ్మహత్యా-దురితంబున, నీమనంబు దూలకొనెఁ; బాపో
త్తరప్రాయశ్చిత్తము-దొరకొని కావింపు మయ్య! దుర్జనహరణా! 931

వ. అదియునుం గాక, పరమపావనుండ వైన నీవు ధర్మంబు దప్పిన, నెవ్వాఁడు మాన్పం గలఁడు? కావునఁ బ్రాయశ్చిత్తంబు గైకొని నడపకున్న ధర్మంబు నిలువ; దట్లు గావున దీనికిం బ్రతీకారంబు పుట్టింపు" మనిన నతండు వారలం గనుంగొని, "తామసంబున నిట్టి పాపంబు సేయంబడియె; దీనికి ముఖ్యపక్షంబునఁ బ్రకృతి వెలింగింపుండు; వీనికి నాయువును బహుసత్త్వంబును నొసంగిన, మీ కిష్టం బగునే, నట్లు నా యోగమాయచేఁ గావింతు" ననిన నమ్మునులు నీయస్త్ర మాహాత్మ్యంబునకు, మృత్యువునకు, మాకు నెవ్విధంబున వైకల్యంబు నొందకుండు నట్లు గావింపు" మనిన నతం డందఱం జూచి యిప్పుడు. 932

క. ధాత్రీవరసమధికచా-రిత్రుఁడు [1]హలపాణి వలికె ధృతి "నాత్మా వై
పుత్రకనామాసి" యనుప-విత్రశ్రుతివాక్యసరణి విశదం బగుటన్. 933

క. ఈ సూతసూనుఁ డిపుడు మ-హాసత్త్వము నాయువును ననామయమును వి
ద్యాసామర్థ్యము గలిగి, సు-ధీసత్తములార! యీక్షితిఁ విలసిల్లున్." 934

వ. అని సూతుం బునర్జీవితుంగాఁ జేసి, మునులం జూచి యిట్లనియె. 935

తే. ఏ నెఱుంగక చేసిన యీ యవజ్ఞ-శాంతి నొంద, నేయది యభీష్టంబు మీకు?
దానిఁ గావింతు" ననిన మోదంబు నొంది, పలికి రత్తాపసులు హలపాణిఁజూచి.

చ. "హలధర! యిల్వలుం డను [2]సురారితనూజుఁడు పల్వలుండు నాఁ
గలఁ డొకదానవుండు; బలగర్వమునం బ్రతిపర్వమందు న
చ్చలమున వచ్చి, మా సవనశాలల మూత్రసురాస్రపూయవి
ట్పలలము లోలిమైఁ గురిసి, పాడఱఁ జేయును యజ్ఞవాటముల్. 937

వ. కావున నా దుష్టదానవుం ద్రుంచుటయు మాకుం గరంబు సంతసం బగు; నంత మీఁద నీవు విమలచిత్తుండ వై భారతవర్షంబునం గల తీర్థంబుల ద్వాదశ మాసంబు లవగాహనంబు సేయు; మట్లయిన [3]సర్వపాపనిష్కృతి యగు" నని పలుకునంతం బర్వసమాగమమం బైన. 938

సీ. మునులు యజ్ఞక్రియోన్ముఖు లౌటఁ గనుఁగొని,
పఱతెంచి యసుర తద్భవనములను
రక్తవిణ్మూత్రసురామాంసజాలంబు
నించి [4]హేయంబు గావించి, పెలుచ

1. బలరాముఁడు. 2. దేవతలకు శత్రువగు రాక్షసుని కొడుకు. 3. సకలపాపములకుఁ బ్రాయశ్చిత్తము. 4. అసహ్యము, నీచము.

కెంపారి కాఱెడు జెన్నలు చురకెడు
        వక్రానిలము వీచి, వడల వడకు
గాటుకకొండసంగతిఁ బొల్చు మేను దా
        మ్రశ్మశ్రుకేశసమాజములును,

తే. నవ్యచర్మాంబరము, భూరినాసికయును-గఱుకుమిడిగ్రుడ్లు నిప్పులు గ్రక్కు దృష్టి,
వ్రేలుపెదవులు, దీర్ఘకరాళ[1]జిహ్వ-కయును, ముడివడ్డబొమలును గలుగువాని.

మహాస్రగ్ధర. కనియెం దాలాంకుఁ డుద్యత్కటుచటులనటత్కాలదండాభశూలుఁ,
జనరక్తాసిక్తతాలుఁ, సమధికసమరోత్సాహలోలుం, గఠోరా
శనితుల్యోదగ్రదంష్ట్రాజనితశిఖికణాచ్ఛాదితాశాంతరాళుం,
హననవ్యాపారశీలు, న్నతిదృఢఘనమస్తాస్థిమాలుం, గరాళున్. 940

ఉ. వెండియుఁ గ్రొమ్మెఱుంగు లుడువీథి వెలుంగఁగ నుల్లసద్గదా
దండముఁ గేలఁ ద్రిప్పుచు, సుదారత దా, బలభద్రుఁ డాసురో
ద్దండవిఘాతుఁ డా ముసలదారుణలాంగలముల్ దలంప, మా
ర్తాండనిభంబులై యెదురఁ దత్క్షణమాత్రన తోఁచిన న్వెసన్. 941

వ. అట్లు సన్నిహితంబు లైన తనకార్యసాధనంబు లగు నిజసాధనంబులు ధరియించి, యప్పుడు. 942

చ. గగనమునం జరించు సురకంటకుకంఠము చేతినాఁగటం
దగిలిచి, రోఁక లెత్తి, బెడిదం బడరన్ నడునెత్తి మొత్తినన్,
బుగబుగ నెత్తు రొల్క, నిల బోరగిలం బడె వజ్రధారచేఁ
దెగి ధరఁ గూలు భూరిజగతీధరముం బురుడింప బెట్టుగాన్. 943

వ. అట్లు పల్వలుండు మడిసిన. 944

క. మునివరులు గామపాలుని-వినుతించిరి వేయువేల విధముల, వృత్రుం
దునిమిన యింద్రుని నమరులు-వినుతించినరీతి నపుడు విమలచరిత్రా! 945

తే. అంత నభిషిక్తుఁ జేసి యత్యంతసురభి-మంజులామ్లాన[2]కంజాతమాలికయును,
నంచితాభరణములు, దివ్యాంబరములు-నర్థి నిచ్చినఁ దాల్చి యా హలధరుండు.

క. దేవేంద్రుఁ బోలి యొప్పెను-ధీవిలసితుఁ డగుచు మునితతిన్ వీడ్కొని, తన్
సేవించుచుఁ గతిపయవి-ప్రావలి సను దేరఁ గౌశికాఖ్యంబునకున్. 947

వ. చని, యమ్మహానదిం గృతస్నానుండై, యచ్చోటు వాసి, సరయువునందుఁ గ్రుంకులిడి, ప్రయాగ నవగాహనంబు సేసి, దేవర్షిపితృతర్పణంబు లాచరించి,

1. నాలుక. 2. కమలములతోఁ గూర్చఁబడిన దండ.

పులస్త్యాశ్రమంబు సొచ్చి, గోమతిం దర్శించి, గండకీనది నుత్తరించి, విదళిత భవపాశయగు విపాశయందుఁ దోఁగి, శోణనదంబున నాప్లావితుం డై, గయ నాడి, గంగాసాగరసంగమంబు దర్శించి, మహేంద్రనగరంబున కరిగి, 948

క. రాముఁడు గనుఁగొనె భార్గవ-రాముఁ, రజనీశకులధరావరనగసు
త్రాముఁ, సన్నుతసుగుణ-స్తోముం, గారుణ్యసీము, సుజనలలామున్. 949

ఆ. కని, నమస్కరించి, కౌతుకం బలరార-నతని వీడుకొని, హలాయుధుండు
గొమరు మిగిలి సప్తగోదావరికి నేఁగి,-యందుఁ దీర్థమాడి, యచటు గదలి.

వ. [1]వేణీపంపాసరస్సులం జూచి, భీమనది కేఁగి, యందుఁ గుమారస్వామిని దర్శించి, శ్రీశైలంబునకుం జని, వేంకటాచలంబు దర్శించి, కామకోటిశక్తి నిరీక్షించి, కాంచీపురంబుఁ గాంచి, కావేరికిం జని, యమ్మహావాహిని నవగాహనంబు సేసి. 951

స్రగ్ధర. సేవించెన్ రంగధాముఁ, శ్రితనివహపయస్సింధుసంపూర్ణసోమున్,
గావేరీమధ్యసీముఁ, ఘనకలుషమహాకాలకూటోగ్రభీముఁ,
దేవారిశ్రీవిరాముఁ, దివిజవినుతసందీపితానంతనాముఁ,
ధీవిజ్ఞానాభిరాముం, ద్రిభువనవిలసద్దేవతాసార్వభౌమున్. 952

వ. అచ్చోటువాసి, వృషభాద్రి నెక్కి, హరిక్షేత్రంబు ద్రొక్కి, మధురాపురంబున కరిగి సేతుబంధనంబు మెట్టి, యచటం బదివేలపాఁడిమొదవుల భూసురుల కిచ్చి, రామేశ్వరుం దర్శించి, తామ్రపర్ణికిం జని, మలయాచలం బెక్కి, యగస్త్యునిం గని నమస్కరించి, దక్షిణసముద్రంబు దర్శించి, [2]కన్యాఖ్యదుర్గాదేవి నుపాసించి, పంచాప్సరం బను తీర్థంబున నాప్లవనం బాచరించి, గోకర్ణంబున నిందుమౌళిని దర్శించి, ద్వీపవతి యైన కామదేవిని వీక్షించి, తాపిం బయోష్ణిని దర్శించి, నిర్వింధ్యంబు గడచి, దండకావనంబున కరిగి, మాహిష్మతీపురంబున వసియించి. మను తీర్థం బాడి, క్రమ్మఱం బ్రభాసతీర్థంబునకు వచ్చి, యచ్చటి బ్రాహ్మణజనంబుల వలనం బాండవధార్తరాష్ట్రులభండనంబునందు సకలరాజలోకంబు పరలోకగతు లగుటయు, వాయునందనసుయోధనులు గదాయుద్ధసన్నద్ధు లై యుండుటయు నెఱింగి వారల వారించుతలంపున నచ్చటికిం జని. 953

తే. ధర్మనందనుఁ, దనకు వందనము సేయు
కృష్ణు, నరు, మాద్రిసుతుల వీక్షించి, యేమి
వలుక కుగ్రగదాదండపాణు లగుచుఁ
గ్రోధమునఁ బోరు భీమదుర్యోధనులను. 954

1. కృష్ణానది, తుంగభద్రానదీతీరమునఁగల పంప యను సరోవరము. 2. కన్యాకుమారి.

వ. చూచి, వారల డాయం జని, యి ట్లనియె. 955

సీ. “వీరపుంగవులార! వినుఁడు మీలోపల ¹భూరిభుజాసత్త్వమున నొకండు,
²ప్రకటితాభ్యాససంపద్విశేషంబున నొక్కండు నధికుఁడై యుంటఁ జేసి
సమబలు; లటు గాన చర్చింపఁగా నిందు జయ మొక్కనికి లేదు సమరమందుఁ;
గాన యూరక పోరంగా నేల మీ?”కని వారింప నన్యోన్యవైరములను

తే. వదరి, తొల్లింటిదుర్భాష లాత్మలందుఁ
దలఁచి, తద్భాషణము ³లపథ్యములు గాఁగ
మొక్కలంబునఁ బోర, నా ముష్టికాసు
రారి వీక్షించి “వీరిశుభాశుభములు. 956

వ. ఎట్లు గావలయు నట్ల యయ్యెడుం గాక!” యని యచ్చోట నిలువక, యుగ్ర
సేనాదిబంధుప్రకరంబులు పరితోషంబున నెదుర్కొన, ద్వారకాపురంబు
సొచ్చి, యందుండి మగిడి, నైమిశారణ్యంబునకుం జని, యందులమునిపుంగవు
లనుమతింప నచ్చట నొక్కమఖంబు గావించి, బహుదక్షిణ లొసంగి, యంచిత
జ్ఞానపరిపూర్ణు లగునట్లుగా వరం బిచ్చి, రేవతియునుం దానును బంధుజ్ఞాతి
యుతంబుగా నవభృథస్నానం బాచరించి యనంతరంబ. 957

చ. విలసితమాల్యచందననవీనవిభూషణరత్నవస్త్రముల్
పొలుపుగఁ దాల్చి, యంచితవిభూతిఁ దలిర్చెను బూర్ణచంద్రికా
కలితసుధాంశురేఖ నెసకం బెసఁగఁ నిజబంధులోచనో
త్పలచయ ముల్లసిల్లఁ, ⁴బరిపాండురచారుయశోవిలాసుఁ డై. 958

వ. ఇవ్విధంబున ననంతుండు, నప్రమేయుండును, మాయామానుషవిగ్రహుండు,
ననంఖ్యబలశాలియు నైన బలదేవుం డతివైభవంబున నిజపురంబు ప్రవేశించి,
సుఖం బుండె” నని చెప్పి యి ట్లనియె. 959

కు చే లో పా ఖ్యా న ము

క. హలధరుఁ డమర్త్యచరితుం–డలఘుభుజాబలుఁ డొనర్చినద్భుతకర్మం
బులు పెక్కు; నాల్గుమోములు–గలమేటియు లెక్కవెట్టఁ గలఁడె? నరేంద్రా!

చ. అనిన మునీంద్రుఁ గన్గొని ధరాధిపుఁ డిట్లనుఁ “బద్మపత్త్రలో
చనునియనంతవీర్యగుణసంపద వేమఱు విన్న నైననుం
దనియదు చిత్త; మచ్యుతకథావిభవం బొకమాటు వీనులకా
వినిన, మనోజపుష్పశరవిద్ధుఁడు నైన విరామ మొందునే? 961

1. అధికమగు భుజబలమున. 2. పరిశ్రమ యను సంపదతోఁగూడిన ఎక్కువ శక్తితో.
3. హితములుకానివి. 4. మిక్కిలి తెల్లనైన.

వ. అదియునుం గాక. 962

చ. హరి భజియించు హస్తములు హస్తము; లచ్యుతుఁ గోరి మ్రొక్కు న
చ్ఛిరము శిరంబు; చక్రధరుఁ జేరినచిత్తము చిత్త; మిందిరా
వరుఁ గనుదృష్టి దృష్టి; మురవైరి నుతించినవాణి వాణి; యధో
క్షజుకథ లాను కర్ణములు కర్ణము లై విలసిల్లుఁ బో భువిన్. 963

క. హరిపాదతీర్థసేవా-పరుఁ డై విలసిల్లునట్టి భాగవతుని [1]వి
స్ఫురితాంగము లంగము; లా-పరమేశ్వరు నెఱుఁగ నాకుఁ బలుకు, మునీంద్రా!''

సీ. అనుచు వేదవ్యాసతనయుండు డాయభిమన్యుతనయునిఁ జూచి యిట్లనియెఁ బ్రీతి;
''జనవర! గోవిందసఖుఁడు కుచేలుండు నా నొప్పు విప్రుండు మానధనుఁడు,
విజ్ఞానరాగాదివిరహితస్వాంతుండు, శాంతుండు, ధర్మవత్సలుఁడు, ఘనుఁడు,
విజితేంద్రియుఁడు, బ్రహ్మవేత్త, దారిద్ర్యంబు బాధింప, నొరులఁ గార్పణ్యవృత్తి
తే. నడుగఁ బోవక, తనకుఁ దా నబ్బినట్టి-కాసు పదివేలనిష్కముల్ గాఁ దలంచి,
యాత్మ మోదించి, పుత్రదారాభిరక్ష-యొకవిధంబున నడపుచు నుండు నంత.

సీ. లలితపతివ్రతాతిలకంబు, వంశాభి
జాత్య తద్భార్య, దుస్సహదరిద్ర
పీడచేఁ గడు నొచ్చి, పెదవులు దడుపుచు
శిశువు [2]లాఁకటిచిచ్చుచేఁ గృశించి,
మలమల మాఁడుచు, మానసం బెరియంగఁ,
''బట్టెఁ డోరెము మాకుఁ బెట్టు'' మనుచుఁ
బత్రభాజనధృతపాణు లై తనుఁ జేరి
వేఁడిన, వీనులు [3]సూఁడినట్ల
తే. యైన, నొకనాఁడు వగచి, నిజాధినాథుఁ-జేరి యిట్లని పలికె; ''నోజీవితేశ!
తట్టుముట్టాడునిట్టి పేదఱిక మిట్లు-నొంప, దీని కుపాయ మూహింప వైతి.'' 966

వ. అని మఱియు ని ట్లనియె. 967

తే. ''బాలసఖుఁ డైన యప్పద్మపత్రనేత్రుఁ-గాన నేఁగి, దారిద్ర్యాంధకారమగ్ను
లైన మము నుద్ధరింపుము; హరికృపాక-టాక్షరవిదీప్తి వడసి, మహాత్మ! నీవు.

వ. మఱియును. 969

చ. వరదుఁడు, సాధుభక్తజనవత్సలుఁ, డార్తశరణ్యుఁ, డిందిరా
వరుఁడు, దయాపయోధి, భగవంతుఁడు, కృష్ణుఁడు దాఁ [4]గుశస్థలి

1. ప్రకాశించునట్టి అవయవములు. 2. ఆఁకలి యనునట్టి యగ్ని. 3. మాడిపోయినట్లు. 4. ద్వారక.

పురమున యాదవప్రకరముల్ భజియింపఁగ నున్నవాఁడు; సే
వరిగిన నిన్నుఁ జూచి విభుఁ డప్పుడ యిచ్చు ధనాదిసంపదల్. 970

మ. కలలోనం దను మున్నెఱుంగని మహాకష్టాత్ముఁడై నట్టి దు
ర్బలుఁ డాపత్సమయంబునన్ నిజపదాబ్జాతంబు లుల్లంబులోఁ
దలఁప, న్నాతని మెచ్చి, [1]యార్తిహరుఁడై తన్నైన నిచ్చున్; సుని
శ్చలభక్తిన్ భజియించువారి కిడఁడే సంపద్విశేషోన్నతుల్?" 971

క. అని చెప్పిన నమ్మానిని-సునయోక్తుల కలరి, భూమిసురుఁ "డా కృష్ణుం
గన నేఁగుట యిహపరసా-ధన మగు "నని మదిఁ దలంచి తనసతితోడన్.

తే. "నీవు చెప్పినయట్ల రాజీవనేత్రు-పాదపద్మంబు లాశ్రయింపంగఁ జనుట
పరమశోభన; మా చక్రపాణి కిపుడు-గాని కేమైనఁ గొంపోవఁ గలదె మనకు?"

తే. అనిన నయ్యింతి "యాఁగాక!" యనుచు విభుని
శిథిలవస్త్రంబుకొంగునఁ బృథుకతండు
లముల నొకకొన్ని ముడిచి, నెయ్యమున ననుపఁ
జనియె గోవిందదర్శనోత్సాహి యగుచు. 974

వ. అట్లు సనుచుం దన మనంబున. 975

సీ. "ద్వారకానగరంబు నేరీతిఁ జొత్తును? భాసురాంతఃపురవాసి యైన
యప్పుండరీకాక్షు నఖిలేశు నెబ్భంగి దర్శింపఁగలనొ? తద్ద్వారపాలు
రెక్కడివిప్రుఁడ? విం దేల వచ్చెద? వని యడ్డపెట్టరే, నపుడు వారి
కేమైనఁ [2]బరిదాన మిచ్చి, చొచ్చెద నన్న, నూహింప నర్థశూన్యుండ నేను;
తే. ఐన నా భాగ్య; మతనిదయార్ద్రదృష్టి
గాక తలపోయఁగా నొండు గలదె? యాతఁ
డేల నన్ను [3]నుపేక్షించు? నేటిమాట!"
లనుచు నా ద్వారకాపుర మతఁడు సొచ్చి. 976

వ. ఇట్లు ప్రవేశించి, రాజమార్గంబునం జని చని, కక్ష్యాంతరంబులు గడచి, చని ముందట. 977

సీ. విశదమై యొప్పు షోడశసహస్రాంగనాకలితవిలాససంగతిఁ దనర్చి,
మహనీయతపనీయమణిమయగోపురప్రాసాదసౌధహర్మ్యములు నూచి,
మనము బ్రహ్మానందమును బొందఁ గడు [4]నుబ్బి, సంతోషబాష్పముల్ జడిగొనంగఁ,
బ్రకటమై విలసిల్లు నొకవధూమణిమందిరమున నింతులు చామరములు వీవఁ,

---

1. ఆపదలను పోఁగొట్టునట్టివాఁడు. 2. కానుక. 3. ఆదరింపకయుండును. 4. ఉప్పొంగి.

తే. దనరు మృదుహంసతూలికాతల్పమందుఁ
దానుఁ బ్రియయును బహువినోదములఁ దనరి,
మహితలావణ్యమన్మథమన్మథుండు
ననఁగఁ జూపట్టు పుండరీకాయతాక్షు. 978

సీ. ఇందీవరశ్యాము, వందితసుత్రాముఁ, గరుణాలవాలు, భాసురకపోలుఁ,
గౌస్తుభాలంకారుఁ, గామితమందారు, సురుచిరలావణ్యు, సుకశరణ్యు,
హర్యక్షనిభమధ్యు, నఖిలలోకారాధ్యు, ఘనచక్రహస్తు, జగత్ప్రశస్తు,
ఖగకులాధిపయానుఁ, గౌశేయపరిధానుఁ, బన్నగశయను, నబ్జాతనయను,
తే. మకరకుండలసద్భూషు, మంజుభాషు,
నిరుపమాకారు, దుగ్ధసాగరవిహారు,
భూరిగుణసాంద్రు, యదుకులాంభోధిచంద్రు,
విష్ణు, [1]రోచిష్ణు, జిష్ణు, సహిష్ణుఁ, గృష్ణు. 979

మ. కని డాయం జనునంతఁ గృష్ణుఁడు, దళత్కంజాక్షుఁ డప్పేదవి
ప్రుని, నశ్రాంతదరిద్రపీడితుఁ, గృశీభూతాంగు, జీర్ణాంబరున్,
ఘనతృష్ణాతురచిత్తు, హాస్యనిలయున్, [2]ఖండోత్తరీయుం, గుచే
లుని నల్లంతనె చూచి, సంభ్రమవిలోలుం డై దిగెం దల్పమున్. 980

క. కర మర్థి నెదురుగాఁ జని–పరిరంభణ మాచరించి, బంధుస్నేహ
స్ఫురణం దోడ్తెచ్చి, సమా–దరమునఁ గూర్చుండఁ బెట్టెఁ దన తల్పమునన్.

తే. అట్లు గూర్చుండఁ బెట్టి, నెయ్యమునఁ గనక–కలశసలిలంబుచేఁ గాళ్లు గడిగి భక్తిఁ
దజ్జలంబుల తనదుమస్తమునఁ దాల్చి–లలితమృగమదఘనసారమిళిత మైన.

తే. మలయజము మేన జొబ్బిల్ల నలఁది, యంత
శ్రమము వాయంగఁ దాళవృంతమున విసరి,
బంధురా[3]మోదకలితధూపంబు లొసఁగి,
మించు మణిదీపముల నివాళించి, మఱియు. 983

వ. సురభికుసుమమాలికలు సిగముడిం దుఱిమి, కర్పూరమిళితతాంబూలంబు నిడి, ధేనువు నొసంగి, సాదరంబుగా స్వాగతం బడిగిన, నప్పు డవ్విప్రుండు మేనం బులకాంకురంబు లంకురింప, నానందబాష్పజలబిందుసందోహుం డయ్యె; నట్టి యెడం బద్మలోచనుండు మన్నించు నంగనామణి యగు రుక్మిణి కరకంకణ రవంబు లొలయం జామరలు వీవఁ, దజ్జాతవాతంబున [4]ఘర్మసలిలంబు నివా

1. ప్రకాశించునట్టివాఁడు. 2. చినిఁగిన మీఁదిపంచ గలవాఁడు. 3. సువాసనతోఁ గూడిన ధూపము. 4. చెమట.

రించుచుండఁ జూచి, శుద్ధాంతకాంతానివహంబులు దమ మనంబుల నద్భుతం
బంది, యి ట్లనిరి. 984

ఉ. "ఏ తపంబు సేసె నొకొ యీధరణీదివిజోత్తముండు తొల్
బామున? యోగివిస్ఫురదుపాస్యకుఁ డై తనరారు నీ జగ
త్స్వామి రమాధినాథు నిజతల్పమునన్ వసియించి యున్నవాఁ;
డీ మహనీయమూర్తి కెనయే మునిపుంగవు లెంతవారలున్? 985

వ. అదియునుం గాక. 986

చ. తనమృదు[1]తల్పమందు వనితామణి యైన రమాలలామహెం
దును నెడఁగాఁ దలంపక, యదుప్రవరుం డెదు రేఁగి, మోదముం
దనకఁగఁ గౌఁగిలించి, యుచితక్రియలం బరితుష్టుఁ జేయుచున్,
వినయమునన్ భజించె; ధరణీసురుఁ డెంతటి భాగ్యవంతుఁడో!" 987

వ. అను నయ్యవసరంబున. 988

క. మురసంహరుఁడు కుచేలుని-కరము గరంబునఁ దెమల్చి, [2]కడఁకన్ మన మా
గురుగృహమున వర్తించిన-చరితము లని కొన్ని నుడివి, చతురత మఱియున్.

సీ. "బ్రాహ్మణోత్తమ! వేదపాఠనలబ్ధదక్షత గలచారు వంశంబువలనఁ
బరిణయం బై నట్టి భార్య సుశీలవర్తనములఁ దగ భవత్సదృశ యగునె?
తలఁప గృహక్షేత్రధనదారపుత్రాదులందు నీచిత్తంబు సెందకుంట
తోఁచు చున్నది; యేను దుది లోకసంగ్రహార్థంబు కర్మాచరణంబు సేయు

తే. గతి, మనంబులఁ గామమోహితులు గాక-యర్థిమై యుక్తకర్మంబు లాచరించి,
ప్రకృతిసంబంధములు వాసి, భవ్యనిష్ఠ-[3]దవిలియుందురు కొంద ఱుత్తములు భువిని."

వ. అని మఱియు ని ట్లనియె. 991

క. "ఎఱుఁగుదువె మనము గురుమం
దిరమున వసియించి, యతఁడు దెలుపఁగ వరుసన్
ఎఱుఁగఁగ వలసిన యర్థము
లెఱిఁగి, పరిజ్ఞానమహిమ లెఱుఁగుట లెల్లన్?" 992

వ. అని మఱియు గురుప్రశంస సేయం దలంచి, యి ట్లనియె. 993

తే. "తివిరి యజ్ఞానతిమిరప్రదీప మగుచు
నవ్యయం బైన బ్రహ్మంబు ననుభవించు
భరితసత్త్వుండు, సత్కర్మనిరతుఁ, డతుల
భూసురశ్రేష్ఠుఁ, డనఘుండు, బుధనుతుండు. 994

---

1. పానుపు. 2. ఉత్సాహముతో. 3. ఆసక్తినిబూని.

వ. అమ్మహాత్మునివలన సకలవర్ణాశ్రమంబులవారికి నేను [1]విజ్ఞానప్రదుండ నగు గురుండనై యుండి, గురుభజనంబు పరమధర్మం బని యాచరించితి; నది గావున,

క. భూసురుల కెల్ల ముఖ్యుఁడ-నై సకలకులాశ్రమంబులందును నెప్పుడున్
ధీసుజ్ఞానప్రదుఁ డన-[2]దేశికుఁ డన నొప్పుచుందు, ధృతి నెల్లెడలన్. 996

తే. అట్టి వర్ణాశ్రమంబులయందు నర్థ-కుశలు లగువారు నిఖిలైకగురుఁడ నైన
నాదువాక్యంబుచే భవార్ణవము పెలుచ-దాఁటుదురు మత్పదాంబుజధ్యానపరులు.

వ. అదియునుం గాక, సకలభూతాత్మకుండ నైన యేను తపోవ్రతయజ్ఞదానశమదమాదులచేత సంతసింపను, గురుజనంబులఁ బరమభక్తి సేవించువారలం [3]బరిణమింతు''నని చెప్పి మఱియు ''మనము గురుమందిరంబున నున్నయెడ, నొక్కనాఁడు గురుపత్నిని యుక్తుల మై యింధనార్థం బడవికిం జనిన, నయ్యవసరంబున.

సీ. ఘుమఘుమారావసంకులఘోరజీమూతపటలసంఛన్నాభ్రభాగ మగుచుఁ,
జటులఝంఝానిలోత్కటసముద్ధూతనానావిధజంతుసంతాన మగుచుఁ,
జండదిగ్వేదండతుండనిభాఖండవారిధారాపూర్ణవసుధ మగుచు,
విద్యోతమానోగ్రఖద్యోతకిరణజిద్విద్యుద్ద్యుతిచ్ఛటావిభవ మగుచు,
తే. నడరి జడి గురియఁగ, నినుఁ డస్తమింప-భూరి[4]నీరంధ్రనిబిడాంధకార మేచి,
సూచికాభేద్య మై వస్తుగోచరంబు-గానియట్లుండ మనము నవ్వానఁ దడిసి.

తే. బయలు గొండియుఁ, బెనుమిఱ్ఱు పల్లములును,
రహితసహితస్థలంబు లేర్పఱుపరాక
యున్న యత్తఱి మనము నొండొరులచేతు
లూతఁగాఁ గొని, నడచుచు నుండునంత. 1000

క. బిసబిస నెప్పుడు నుడుగక-విసరెడి వలిచేత, వడఁకు విడువక, మనముం
బస చెడి మార్గముఁ గానక-మసలితి; మంతటను నంశుమంతుఁడుఁ బొడిచెన్.

క. తెలతెలవాఱెడివేళం-గలకల మని పలికెఁ బక్షిగణ మెల్లెడలన్
మిలమిలని ప్రొద్దుపొడుపున-ధళధళ మనుమెఱుఁగు [5]దిగ్వితానము నిండెన్.

క. అప్పుడు సాందీపని మన-చొప్పరయుచు వచ్చి, వానసోఁకునను వలిం
దెప్పిఱిలుటఁ గని, ఖేదం-బుప్పతిలం బలికె ''నకట! యోవటులారా! 1003

చ. కటకట యిట్లు మాకొఱకుఁగాఁ జనుదెంచి, మహాటవిన్ [6]సము
త్కటపరిపీడ నొందితిరి; గావున శిష్యులు మాఋణంబు నీఁ

1. తెలివిని ఇచ్చువాఁడు. 2. ఉపదేశించువాఁడు. 3. ఇష్టపడుదును. 4. అవకాశములేని.
5. దిక్కులసముదాయము. 6. అధికమయినబాధను.

గుట కిది కారణంబు; సమకూరెడిఁ బో యిట మీఁద మీకు వి
స్ఫుటధనబంధుదారబహుపుత్త్రవిభూతిజయాయురున్నతుల్." 1004

క. అని గారవించి, యూరక-మనలం దోడ్కొనుచు నాత్మమందిరమునకుం
జనుదెంచుట లెల్లను నీ-మనమునఁ దలఁతే?" యటంచు మఱియుం బలికెన్.

వ. "అనఘా! మన మధ్యయనంబు సేయుచు, నన్యోన్యస్నేహవాత్సల్యంబులం జేయు కృత్యంబులు మఱవవు గదా?" యని యివి యెల్లం దలంచి యాడు మాధవు మధురాలాపంబులు విని, యతనిఁ గనుంగొని కుచేలుం డిట్లనియె. 1006

క. "వనజోదర! గురుమందిర-మున మనము వసించునాఁడు ముదమునఁ గావిం
పని పను లెవ్వియుఁ గలవే?-విను; మవి యట్లుండ నిమ్ము; విమలచరిత్రా! 1007

క. [1]గురుమతిఁ దలఁపఁగ ద్రిజగ-ద్గురుఁడ వనం దగిన నీకు గురుఁ డనఁగా నొం
డొరుఁ డెవ్వఁ? డింతయును నీ-కరయంగ విడంబనంబ యగుఁ గాదె; హరీ!"

వ. అని సాభిప్రాయంబుగాఁ బలికిన పలుకులు విని, సమస్తభావాభిజ్ఞుం డైన పుండరీకాక్షుండు మందస్మితసుందరవదనారవిందుం డగుచు, నతనిం జూచి, "నీవిచ్చటికి వచ్చునప్పుడు నాయందుల భక్తిం జేసి నాకు నుపాయనంబుగా నేమి పదార్థంబు దెచ్చితి? వప్పదార్థంబు [2]లేశమాత్రం బైనఁ బదివేలుగా నంగీకరింతు; నట్లుగాక నీచవర్తనుం డై మద్భక్తిం దగులని దుష్టాత్ముండు హేమాచలతుల్యం బైన పదార్థంబు నొసంగిన, నది నామనంబునకు సమ్మతంబు గాదు; కావున. 1009

క. దళ మైనఁ, బుష్ప మైనను, ఫల మైనను,-సలిల మైనఁ, బాయనిభక్తిం
గొలిచిన జను లర్పించిన-నెలమిన్ రుచిరాన్నముగ నె యేను భుజింతున్."

క. అని పద్మోదరుఁ డాడిన-వినయోక్తుల కాత్మ నలరి, విప్రుఁడు దాఁ దె
చ్చిన యడుకులు దగ నర్పిం-పను నేరక, మోము వాంచి పలుకక యున్నన్.

వ. అవ్విప్రుండు సనుదెంచిన కార్యంబు కృష్ణుండు దన దివ్యచిత్తంబున నెఱింగి, "యితండు పూర్వభవంబున నైశ్వర్యకాముండై, నన్ను సేవింపం; డైన నిక్కుచేలుండు నిజకాంతాముఖోల్లాసంబుకొఱకు నాయొద్దకుఁ జనుదెంచినవాఁ; డితనికి నింద్రాదులకుఁబడయరాని బహువిధంబు లైన సంపద్విశేషంబు లీక్షణంబ యొడఁగూర్చవలయు" నని తలంచి, యతండు [3]జీర్ణవస్త్రంబుకొంగున ముడిచి తెచ్చిన యడుకులముడియఁ గని, 'యిది యేమి?' యని యొయ్యనయమ్ముడియఁ దన కరకమలంబుల విడిచి, యయ్యడుకులు కొన్ని పుచ్చుకొని, 'యివియ సకలలోకంబులను, నన్నును బరితృప్తిం బొందింపఁజాలు'' నని యప్పుడు. 1012

1. గొప్పబుద్ధితో. 2. కొంచెమయినను. 3. ప్రాఁతగుడ్డ.

క. మురహరుఁడు పిడికెఁడటుకులు–గర మొప్పఁగ నారగించి, కౌతూహలి యై
మఱియును బిడికెఁడు గొనఁ–దత్సతి యపుడు పట్టెఁ గమల కరకమలమునన్.

క. "సాంపారఁగ నతనికి బహు–సంపద లందింప, నివియ చాలును; నింకే భ
క్షింపఁగ వలవదు; త్రిజగ–త్సంపత్కర! దేవదేవ! సర్వాత్మ! హరీ!" 1014

వ. అని యిట్లు వారించె; నక్కుచేలుండు నా రాత్రి, గోవిందుమందిరంబునఁ దనకు హృదయానందకరంబు లగు వివిధపదార్థంబు లనుభవించి, మృదులశయ్యాతలంబున నిద్రించి, తన మనంబునం దన్ను సమధికస్వర్గభోగానుభవుంగాఁ దలంచుచు, మఱునాఁ డరుణోదయంబున మేల్కాని, కాలోచితకృత్యంబులు దీర్చి; యిందిరారమణుండు దన్నుఁ గొంతద వ్వనిచి యామంత్రితుం జేయఁ, జనుచు నందనందనసందర్శనానందలోలాత్ముం డై తనమనంబున ని ట్లనియె. 1015

క. "నాపుణ్య మరయ నెట్టిదొ?–యీ పుణ్యనిధిం, బ్రశాంతు, నచ్యుతు, నఖిల
వ్యాపకు, బ్రహ్మణ్యునిఁ, జి–దూపకుఁ, బురుషోత్తమునిఁ, బడసి గనుఁగొంటిన్.

సీ. పరికింపఁ [1]గృపణస్వభావుండ నై నట్టి యే నెడ? నిఖిలావనీశ్వరి యగు
నిందిరాదేవికి నెనయంగ నిత్యనివాసుఁ డై యొప్పు నవ్వాసుదేవుఁ
డెడ? న న్నర్థిమైఁ దోడఁబుట్టినవానికై వడిఁ గౌఁగిటఁ గదియఁ జేర్చి,
దైవంబుగా నన్ను భావించి, నిజతల్పమున నుండి సత్క్రియల్ పూని నడపి,

తే. చారునిజవధూకరసరోజాతకలిత–చామరానిలమున గతశ్రమునిఁ జేసి,
శ్రీకుచాలిప్తచందనాంచితకరాబ్జ–తలములను నడ్గు లొత్తె వత్సలత మెఱసి.

వ. కావున. 1018

ఉ. శ్రీనిధి యిట్లు నన్నుఁ బచరించి, ఘనంబున విత్తమేమియు
న్నీని తెఱంగు గానఁబడె; నెన్న దరిద్రుఁడు [2]సంపదంధుఁ డై
కానక తన్నుఁ జేరఁ డని కాక, శ్రితార్తిహరుండు, సత్కృపాం
భోనిధి, సర్వవస్తుపరిపూర్ణునిఁగా ననుఁ జేయ కుండునే?" 1019

వ. అని తన మనంబున [4]వితర్కించుచు నిజపురంబునకుం జని చని, ముందట. 1020

సీ. భానుచంద్రప్రభాభాసమానస్వర్ణ చంద్రకాంతోపలసౌధములును,
గలకంఠశుకనీలకంఠసముత్కంఠమానిత[5]కూజితోద్యానములును,
ఫుల్లసితాంభోజహల్లకకహ్లారకైరవోల్లసితకాసారములును,
మణిమయకనకకంకణముఖాభరణవిభ్రాజితదాసదాసీజనములుఁ

1. ఉత్సాహము కలవాఁడు. 2. నీచబుద్ధి కలవాఁడు. 3. ఐశ్వర్యముచేఁ గన్నుగానని వాఁడు. 4. ఆలోచనచేయుచు. 5. ధ్వని చేయఁబడుచున్న వనములు.

తే. గలిగి చెలువొందు సదనంబు గాంచి, విస్మ
యమును బొందుచు, నిట్టి పుణ్యాత్ము నుండు
నిలయ మెవ్వరో? యమర్త్యస్వామి నగరమై మహిత
వైభవోన్నతలక్ష్మీనివాస మగుచు." 1021

వ. అని తలపోయుచున్న యవసరంబున. 1022

తే. దివిజవనితలఁ బోలెడు తెఱవ లపుడు-డాయ నేతెంచి 'యిందువిచ్చేయుఁడ' నుచు
విమలసంగీతనృత్యవాద్యములు చెలఁగ-గరిమఁదోడ్తెని చనిరంతిపురమునకును.

వ. ఇట్లు సను దేర, నతనిభార్య యైన సతీలలామంబు దనమనంబున నానందరసమగ్న
యగుచు. 1024

సీ. తనవిభురాక ముందటఁ గని, మనమున హర్షించి, వైభవం బలర మనుజ
కామినీరూపంబు గైకొన్న యిందిరావనితచందంబునఁ దనరుచున్న
కలకంఠి, తనవాలుఁగన్నుల క్రేవల నానందబాష్పంబు లంకురింప,
నతనిపాదంబుల కాత్మలో మ్రొక్కి, భావంబున నాలింగనంబు సేసె;
తే. [1]నా ధరాదేవుఁ డతులదివ్యాంబరాభ-రణవిభూషితలై, రతిరాజుసాయ
కములగతి నొప్పు పరిచారికలు భజింప,-లలితసౌభాగ్య యగు నిజలలనఁజూచి.

క. ఆ నారీరత్నంబును-దానును ననురాగరసము దళుకొత్తఁగ ని
త్యానందము నొందుచుఁ బెం-పూనినహరిలబ్ధవైభవోన్నతి మెఱయన్. 1026

సీ. కమనీయపద్మరాగ స్తంభకంబులుఁ, గొమరారు పటికంపుఁ [2]గుడ్యములును,
మరకతనవరత్నమయకవాటంబులుఁ, గీలితహరినీలజాలకములు,
దీపితచంద్రకాంతోపలవేదులు, నంచితవివిధపదార్థములును,
దగు హంసతూలికాతల్పంబులును, హేమలాలితశయనస్థలములుఁ, దనరు
తే. సమధికోత్తుంగభద్రపీఠములసిరులు-మానితోన్నత [3]చతురంతయానములును,
వలయు సద్వస్తుపరిపూర్ణవాటికలును-గలిగిచెలువొందు మందిరం బెలమిఁజొచ్చి.

వ. సుఖంబున నుండునట్టియెడం, దనకుమనోవికారంబులు వొడమకుండ వర్తించుచు,
నిర్మలం బగు తనమనంబున ని ట్లను "నింతకాలం బత్యంతదురంతం బగు దారి
ద్ర్యదుఃఖార్ణవంబున మునింగియున్న నాకుం గడపటఁ గలిగిన విధంబున నిప్పుడు.

ఆ. ఎన్నఁ గ్రొత్త లైన యిట్టిసంపదలు నా-కబ్బు టెల్ల హరిదయావలోక
నమునఁజేసి కాదె? నళినాక్షుసన్నిధి-కర్థినగుచు నేను నరుగుటయును. 1029

క. నను, నా వృత్తాంతంబును-దనమనమునఁ గనియు, నేమి [4]నడపక, ననుఁ బొ
మ్మని, యీసంపద లెల్లను-నొనరఁగ నొడఁగూర్చి, నన్ను నొడయనిఁ జేసెన్.

---

1. అబ్రాహ్మణుఁడు. 2. గోడలు. 3. పల్లకీలు. 4. విచారణచేయక.

వ. ఇట్టి పురుషోత్తముండు భక్తినిష్ఠులైన సజ్జనులు లేశమాత్రంబగు పదార్థంబైన భక్తిపూర్వకంబుగా సమర్పించిన, నది [1]కోటిగుణితంబుగాఁ గైకొని మన్నించుటకు నిదియ దృష్టాంతంబు గాదె? మలినదేహుండును, జీర్ణాంబరుండు నని చిత్తంబున హేయంబుగాఁ బాటింపక నా చే నున్న యటుకు లాదరంబున నారగించి. నన్నుం గృతార్థునిం జేయుట యతని [2]నిర్హేతుకదయయ కాదె? యట్టి కారుణ్యసాగరుండైన గోవిందుని చరణారవిందంబులయందుల భక్తి ప్రతిభవంబునం గలుగుంగాక!" యని యప్పుండరీకాక్షునియందుల తాత్పర్యంబునం దగిలి, పత్నీసమేతుండై నిఖిలభోగంబులయందు నాసక్తిం బొరయక, రాగాది విరహితుండును, నిర్వికారుండును నై, యఖిలక్రియలందు ననంతునియనంత ధ్యానసుధారసంబునం జొక్కుచు, విగతబంధనుండై యపవర్గప్రాప్తి నొందె; మఱియును. 1031

ఆ. దేవదేవుఁ [3]డఖిలభావజ్ఞుఁ డాశ్రిత-వరదుఁ డైన హరికి ధరణిసురులు
దైవతములు గాన, ధరణిదివిజుల-కంటె దైవ మొకఁడు గలదె భువిని? 1032

క. మురహరుఁ డిట్లు కుచేలునిఁ-గరితార్థునిఁ జేసినట్టి చరితము విను స
త్పురుషుల కిహపరసుఖములు-హరిభక్తియు యశముఁ గలుగు నవనీనాథా!"

### శ్రీకృష్ణుఁడు సకుటుంబముగా గ్రహణస్నానమునకుఁ బోవుట

వ. అనిన మఱియుఁ బరాశరపౌత్రున కర్జునపౌత్రుం డి ట్లనియె. 1034

ఆ. "దుష్టశిక్షణంబు, దురితసంహరణంబు-శిష్టరక్షణంబుఁ జేయఁ దలఁచి,
భువిని మనుజుఁ డగుచుఁ బుట్టిన శ్రీకృష్ణ-విమలచరిత మెల్ల విస్తరింపు."

వ. అనిన శుకుం డి ట్లనియె. 1036

సీ. "ధరణీశ! బలుఁడును సరసిజోదరుఁడు నవోన్నతసుఖలీల నుండునంతఁ
జటులోగ్రకల్పాంతసమయమందునుబోలె దృగసహ్యమై సముద్దీప్త మగుచు
రాజిల్లు సూర్యోపరాగంబు సనుదెంచు టెఱిఁగి, భూజను లెల్ల వరుసఁ గదలి
మును జమదగ్నిరాముఁడు పూని ముయ్యేడుమాఱులు ఘనబలోదారుఁ డగుచు

తే. నిజభుజాదండమండితనిబిడనిశిత-చటులదంభోళిరుచిరభాస్వత్కుఠార
మహితధారావినిర్భిన్నమనుజపాల-దేహనిర్ముక్తరుధిరప్రవాహములను. 1037

తే. ఏను మడువులు గావించె నెచట నేని-నట్టిపావనసుక్షేత్ర మగు స్యమంత
పంచకంబున కపుడు సంభ్రమముతోడఁ-జనిరి బలకృష్ణులును సంతసం బెలర్ప.

వ. ఇట్లు నిష్కర్ములైన రామకృష్ణులు లోకధర్మానుపాలనప్రవర్తనులై, ద్వారకానగర రక్షణంబునకుఁ బ్రద్యుమ్నగదసాంబసుచంద్రశుకసారణానిరుద్ధకృత

---

1. కోటియంతలు. 2. కారణములేని దయ. 3. సమస్తమైన యభిప్రాయములు తెలిసినవాఁడు.

వర్షాదిదోషదమని నియమించి, తాను నక్రూరవసుదేవోగ్రసేనాదిసకల యాదవులుం గాంతాసమేతు లై, స్రక్చందనాభరణవస్త్రాదులు ధరియించి, శోభనాకారంబులతోడం బుష్పకవిమానంబు లనం బొలుచు నరదంబులను, మేఘంబుల ననుకరించు గజంబులను, మనోవేగంబు లైన తురంగంబుల నెక్కి, వియచ్చరులం బురుడించు పురుషులు దమ్ము సేవింపం జని యప్పుణ్యతీర్థంబుల నవగాహనంబు సేసి, యుపవసించి యనంతరంబ. 1039

క. భూసురవరులకు ననుపమ-వాసోలంకారధేనువసురత్నధరి
శ్రీసుమహితవస్తువు-లుల్లాసంబున దాన మిచ్చి, లాలితు లగుచున్. 1040

క. పునరవగాహనములు వెం-పొనరం గావించి, బంధుయుక్తముగా భో
జనకృత్యంబులు దీర్చి, స-వనురాగము లుల్లసిల్ల నచ్చోటం దగన్. 1041

క. ఘనశాఖాకీర్ణము లై-యినరశ్ముల దూఱ నీక, యొసకం బెసఁగన్
ననిచిన పొన్నలనీడల-ననిచినవేడుకల నందనందనముఖ్యుల్. 1042

క. తనరిన పల్లవరుచిరా-సనముల నాసీను లగుచు, సత్సుఖగోష్ఠిం
బెను పొందఁగ నట వసియిం-చినచోఁ దత్పుణ్యతీర్థసేవారతు లై. 1043

వ. మున్న చనుదెంచి యున్న మత్స్యోశీనరకోసలవిదర్భకురుసృంజయకాంభోజ కేకయమద్రకుంత్యారట్టకేరళాదిభూపతులును, మఱియుం దక్కినరాజవరులును, హితులును, నందగోపాదిగోపాలురును, గోపికాజనంబులును, ధర్మరాజాను గతు లై వచ్చిన భీష్మద్రోణధృతరాష్ట్రగాంధారీకుంతీపాండవతద్దారనివహసంజయ విదుర కృప కుంతిభోజ విరాట భీష్మక నగ్నజిద్ద్రుపద శైబ్యధృష్టకేతు కాశి రాజ దమఘోషవిశాలాక్షమైథిలయుధామన్యుసుశర్ములును, సపుత్త్రకుం డైన బాహ్లికుండును మొదలుగా ననేకులు నుగ్రసేనాదియాదవప్రకరంబులం బూజలం దృప్తులం జేసిన, వారునుం బ్రముదితాత్ము లై; రయ్యెడ. 1044

క. ఆ రాజులు గాంచిరి నిజ-నారీయుతు లగుచు నంగనాపరివారున్,
ధీరున్, దానవకులసం-హారున్, గోపీమనోవిహారు, ను దారున్. 1045

వ. కని యమ్మాధవబలదేవులు సేయు సముచితపూజావిధానంబులం బరితృప్తు లై, యమ్ముకుందు సాన్నిధ్యంబు గలిగి, తదీయసంపద్విభవాభిరాము లై విలసిల్లు చున్న యుగ్రసేనాదియదువృష్ణిపుంగవులం జూచి, వారలతోడ నా రాజవరులు మాధవుండు విన ని ట్లనిరి. 1046

మ. "మనశాస్త్రంబులు, వాక్కులున్, మనములున్, ³మాంగల్యముం బొంది పా
వన మై యెప్పుడి నేర మావిభునిభాస్వత్పాదపంకేజసే

1. సంతోషముతో. 2. సూర్యకిరణములు. 3. శోభనము.

ఘన[1]తోయంబుల; నే మహాత్ముని పదాబ్జాతంబు లెందేని సో
కినచోట్లెల్లను ముక్తిహేతు వగు, నీ కృష్ణుండె పో; చూడఁగన్. 1047

చ. సనకసనందనాదిమునిసత్తము లంచితయోగదృష్టిచేఁ
బనివడి యాత్మలన్ వెదకి పట్ట నగోచరమైనమూర్తి యి
ట్లనవరతంబు మాంసనయనాంచలగోచరుఁ డయ్యె నట్టె! యే
మన నగు వీరిపుణ్యమున? కాదట నెట్టి తపంబు సేసిరో? 1048

మ. నిరయస్వర్గము లాత్మఁ గైకొనక, తా నిర్వాణమూర్తైన యీ
హరిఁ జూడన్, హరితోడఁ బల్క, హరిమే [2]నంటన్, హరిం బాడఁగా,
హరితో నేఁగ, సహాసనాస్తరణశయ్యావాసులై యుండఁగన్,
హరిబంధుత్వసఖిత్వముల్ గలుగుభాగ్యం బెట్లు సిద్ధించెనో?" 1049

తే. అనుచు యాదవవృష్ణిభోజాంధకులును
హరిదయాలబ్ధనిఖిలార్థు లగుచు నున్న
మనికిఁ దమచిత్తములఁ బలుమాఱుఁ బొగడి,
పరిణమించిరి; యంత [3]నప్పాండుమహిషి. 1050

వ. అప్పుడు. 1051

క. తన సుతులకు గాంధారీ-తనయులు గావించు నపకృతంబుల కాత్మన్
ఘనముగ నెరియుచు నచ్చటఁ-గనుఁగొనె వసుదేవు, విగతకల్మషభావున్.

వ. అట్లు గనుంగొని యతనితో ని ట్లనియె. 1053

క. "ఓ యన్న! పాండుతనయులు-నీ యల్లు రడవులయందు నెఱి మృగములలోఁ
బాయని యిడుమలఁ బడ, [4]కరు-ణాయత్తుల రగుచు మీర లరయఁగ వలదే?"

వ. అని బహుప్రకారంబుల సంతాపించుచు మఱియు ని ట్లనియె. 1055

క. "అతిబలవంతపువిధి దాఁ-బ్రతికూలం బైనఁ గలరె బంధువు?" లనుచున్
ధృతి గలఁగ బాష్పజలపూ-రితలోచన యగు సహోదరిం జూచి, యనెన్.

సీ. "తల్లి! నీ కేల సంతాపింప మనమునఁ? దలఁపక విధి నేల సొలసె దింత?
యఖిలనియామకుం డగు నీశ్వరుఁడు మాయా[5]యవనికాంతరుఁడై నయట్టిసూత్ర
ధారునికై వడిఁ దగిలి నటింపఁగ, మనుజులు కీలుబొమ్మలు దలంపఁ;
గావున విధిసేఁతఁ గడచి వర్తింపంగ దేవతలకు నైనఁ దీఱ; దట్లు

1. జలములు. 2. తాఁకఁగా. 3. పాండురాజుభార్యయగు కుంతి. 4. దయతోఁగూడినవారు.
5. తెఱలోపలనుండువాఁడు.

తే. క్రోధచిత్తుఁడు కంసుండు బాధ పఱుప-నిలయములు దప్పి, యే యడవులఁ జరింప,
ఘనకృపానిధి యీ హరి గలుగఁబట్టి-కోరి మా కిన్ని క్షేమముఁ జేరఁ గలిగె.”

వ. అని యూఱడిలం బలుకు నవసరంబున. 1058

క. నందయశోదలు గోపక-బృందంబులు గోపికలును [1]చేరికొని, పరమా
నందంబునఁ జనుదెంచిరి-మందరధరుఁ జూచువేడ్క మనములఁ బొడమన్.

వ. ఇట్లు సనుదెంచి. 1060

క. అతిచిరకాలసమాగతు-నతని నిరీక్షించి, వృష్ణియాదవభోజ
ప్రతతులు నెదురేగి, సము-న్నతితో నాలింగనములు నడపిరి వరుసన్. 1061

క. వసుదేవుఁడు వారికి సం-తసమునఁ గావించె సముచితక్రియ; లంతన్
ముసలియు, హరియును మ్రొక్కిరి-వెస నందయశోదలకును వినయం బెసఁగన్.

వ. అట్లు నమస్కృతులు సేసి, యాలింగనంబులు గావించి, నయనారవిందంబుల నానందబాష్పంబులు దొరఁగ నడలేని స్నేహంబులు చిత్తంబుల నత్తమిల్ల, నేమియుం బలుక కుండి; రంత నయ్యశోదాదేవి రామకృష్ణుల నిజాంకపీఠంబుల నునిచి, యక్కునం గదియం దిగిచి, చెక్కులు ముద్దుగొని, శిరంబులు మూర్కొని, చిబుకంబులు పుడుకుచుఁ, బునఃపునరాలింగనంబులు గావించి, పరమానందంబుం బొందుచు నున్నంతఁ, బదంపడి. 1063

చ. స్థిరమతితోడ రోహిణియు దేవకియుం దగ నందగోపసుం
దరిఁ గని, కౌఁగిలించికొని, తత్కృతు లెల్లఁ దలంచి, “యింతి! నీ
వరుఁడును నీవు బంధుజనవత్సలతన్ మును చేయు సత్కృతుల్
మఱవఁగ వచ్చునే తలఁప మా కిఁక నెన్నఁటికిం? దలోదరీ! 1064

క. జననం బందుట మొదలుగ-ఘనమోహముతోడఁ బెంచుకతమునఁ, దమకున్
జననీజనకులు వీ రని-మనములఁ దలపోయ లేరు మము నీతనయుల్. 1065

క. [2]అంటినప్రేమను వీరిం-గంటికి ఱెప్పడ్డమైనగతిఁ బెంపఁగ, మా
కంటెన్ నెన రౌటను, మీ-యింటన్ వసియించి యుండి రిన్నిదినంబుల్.”

వ. అని యిట్లు ప్రియాలాపంబులు వలుకుచుండు నవసరంబున గోపాలసుందరు లమందానందకందళితహృదయ లయి, హృదయేశ్వరుం డైన గోవిందుండు చిరకాలసమాగతుం డగుటం జేసి, యతనిం జూచుతలంపు లుల్లంబుల వెల్లిగొనం, జేరి.

చ. నళినదళాక్షుఁ జూచి, నయనంబులు మోడ్వఁగఁ జాల కాత్మలన్
వలచి, తదీయమూర్తివిభవంబుఁ దలంచుచుఁ, గౌఁగిలించుచుం,

1. చుట్టుకొని. 2. ఎక్కుడైనప్రేమతో.

బులకలు మేన జాదుకొనఁ, బొల్తురు సాక్షిరి బ్రహ్మముగా మనం
బులఁ గని [1]చొక్కు యోగిజనముం బురుడింపఁగ మానవేశ్వరా! 1068

చ. పొలఁతుల ఘాన మాత్రఁ గని, ఫుల్లసరోరుహలోచనుండు వా
రల నపు డేకతంబునకు రమ్మని తోకొని పోయి, యందు న
క్కిలిఁ [2]బరిరంభణంబు లొసరించి, లసద్దరహాసచంద్రికా
కలితకపోలుఁ డై పలికెఁ గాంతల, భక్తినితాంతచిత్తలన్. 1069

చ. "వనజదళాక్షులార! బలవద్రిపువర్గములన్ జయింపఁగాఁ
జని తడ వయ్యెఁ; దీనికి [3]భృశంబుగ మీమది నల్గ కుండుఁడీ!
యనయము దైవ మిట్లు సచరాచరజాలము నొక్కవేళఁ గూ
ర్చును; నొకవేళఁ బాపును [4]మరుద్ధతతూలతృణంబులుం బలెన్. 1070

సీ. తరలాక్షులార! మద్భక్తి చేతములకుఁ దనరు మోక్షానందదాయకంబు,
జపతపోవ్రతదానసత్కర్మముల ముక్తి కలుగంగ నేరదు; కాన తలఁప
విధిశివసనకాదివిమలచిత్తంబులఁ బొడమని భక్తి మీబుద్ధులందు
జనియించె; మీపూర్వసంచిత[5]సౌభాగ్య మెట్టిదో? యది తుదముట్టె; నింక
తే. నటమటము గాదు; మీకు నెన్నఁటికి నైనఁ-గలుగ నేరవు నిరయసంగతము లైన
జన్మకర్మము లిటమీఁద మన్మనీష-సుమహిత ధ్యానలార! యో రమణులార!

సీ. అఖిలభూతములకు ననయంబు నాదిమధ్యాంతకాంతర్బహిర్వ్యాప్తి నేన;
ఘటపటాదికభూతకార్యంబులకు నుపాదానకారణము లై తనరునట్టి
గగనానిలానలకక్షోణులను భూతపంచకం బైక్యత వడయుఁ గాదె?
లోకంబులందుఁ బంచీకరణవ్యవస్థలచేత నట్టి భూతములరీతి
తే. గగనముఖభూతతత్కార్యకారణములఁ-దగిలి, యాధార హేతుభూతంబ నైన
నాకుఁ బర మన్య మొక్కఁ డెన్నంగ లేదు-విమలమతులార! మాటలు వేయు నేల?"

తే. అనినఁ దెలివొంది, వారు దేహాభిమాన-ములు సమస్తంబు విడిచి 'యో నలిననాభ!
నిఖిలజగదంతరాత్మ! మానితచరిత్ర!-భక్తజనమందిరాంగణపారిజాత! 1073

తే. ఘోరసంసారసాగ[6]రోత్తారణంబు
ధీయుతజ్ఞానయోగి హృద్ధ్యేయవస్తు
వగుచుఁ జెలువొందు నీచరణాంబుజాత
[7]యుగళమును మామనంబులఁ దగులనీవె?'' 1074

---

1. ఆనందించు. 2. కౌఁగిలింతలు. 3. అధికముగ. 4. గాలిచేత ఎగురఁగొట్టఁబడిన దూది పింజెలవలె. 5. అదృష్టము. 6. దాఁటించునది. 7. జత.

క. అని వేఁడినఁ గృష్ణుఁడు, ముని-వినుతుఁడు కరుణించి, వల్లవీజనములు గో
రినయట్ల యిచ్చెఁ గరుణా-వననిధి, సద్భక్తలోకవత్సలుఁ డంతన్. 1075

ఉ. ధర్మతనూభవుం గని పదంబులకున్ నతుఁడై, సపర్యలన్
నిర్మలభక్తిమై నడపి, నీవును దమ్ములు బంధుకోటి స
త్కర్మచరిత్రులై తగు సుఖంబుల నొప్పుచు నున్నవారె? నా,
నర్మిలిఁ బాండవాగ్రజుఁడు నమ్మధుసూదనుతోడ నిట్లనున్. 1076

క. "సరసిజనాభ! భవత్పద-సరసీరుహ మాశ్రయించు జను లతిసౌఖ్య
స్ఫురణం బొలుపారుచు భువిఁ-జరియింపరె? భక్తపారిజాత! మురారీ! 1077

వ. అదియునుం గాక. 1078

సీ. సుమహితస్వప్నసుషుప్తిజాగరములన్ మూఁ డవస్థలఁ బాసి, వాఁడి మిగిలి
వెలి నుండు; లోనుండు; విశ్వమై యుందువు; విశ్వంబు నీయందు వెలుఁగుచుండు;
భవదీయమహిమచేఁ బాటిల్లు భువనంబు; లుదయించు నొకవేళ; నుడిగి మడుఁగు;
[1]సంచితాఖండితజ్ఞానివై యొప్పుచు నవిహతయోగమాయాత్మఁ దనరి,
తే. దురితదూరులు నిత్యముక్తులకుఁ జెంద-నలవి యై పెంపు దీపింతు; వంబుజాక్ష!
ఘనకృపాకర! నిఖిలవికారదూర!-నీకు మ్రొక్కెద సర్వలోకైకనాథ!" 1079

క. అని వినుతించిన నచ్చటి-జనపాలకబంధుమిత్రసకలజనములున్
విని, [2]యనురాగిల్లిరి నె-మ్మనముల నానందజలధిమగ్నులు నగుచున్. 1080

తే. అట్టియొప్పగువేళ నెయ్యంబు మెఱసి-యొక్కచోటను సంతోషయుక్తలగుచు
దానవాంతకసతులును, ద్రౌపదియును-గూడి తమలోన ముచ్చట లాడుచుండి.

లక్షణ యను శ్రీకృష్ణునియష్టమభార్య ద్రౌపదీదేవికిఁ దన వివాహవృత్తాంతంబు దెలుపుట

వ. అట్టియెడఁ గృష్ణకథావిశేషంబులు పరితోషంబున నుగ్గడించుచుఁ, బ్రసంగ
వశంబున నా రుక్మిణీదేవి మొదలగు శ్రీకృష్ణుభార్యలం గనుంగొని, పాంచాలి
యిట్లనియె "మిమ్ముఁ బుండరీకాక్షుండు వివాహం బయిన తెఱంగులు విని
పింపుం" డనిన వారును [3]దమపరిణయంబుల తెఱంగులు మున్ను నే నీకుం
జెప్పినవిధంబున వినిపించి; రందు సవిస్తరంబుగాఁ దెలియం బలుకని మద్రరాజ
కన్యకావృత్తాంతం బా మానిని పాంచాలికిం జెప్పిన విధంబు విను" మని
శుకుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె. 1082

సీ. "పాంచాలితో మద్రపతిసుత యిట్లను" సంగీతవిద్యావిశారదుండు
నారదుచేత వీణాస్వనకలిత మైనట్టి గోవిందకథామృతంబు

---

1. శ్రేష్ఠమయినట్టియు నశింపఁబడనట్టి జ్ఞానముకలవాఁడు. 2. ప్రేమించిరి. 3. తమ వివాహములు.

పులస్త్యాశ్రమంబు సొచ్చి, గోమతిం దర్శించి, గండకీనది నుత్తరించి, విదళిత
భవపాశయగు విపాశయందుఁ దోఁగి, శోణనదంబున నాప్లావితుం డై, గయ
నాడి, గంగాసాగరసంగమంబు దర్శించి, మహేంద్రనగరంబున కరిగి. 948

క. రాముఁడు గనుఁగొనె భార్గవ-రాముఁ, రజనీశకులధరావరనగసు
త్రాముఁ, సన్నుతసుగుణ-స్తోముం, గారుణ్యసీము, సుజనలలామున్. 949

ఆ. కని, నమస్కరించి, కౌతుకం బలరార-నతని వీడుకొని, హలాయుధుండు
గొమరు మిగిలి సప్తగోదావరికి నేఁగి,-యందుఁ దీర్థమాడి, యచటు గదలి.

వ. [1]వేణీపంపాసరస్సులం జూచి, భీమనది కేఁగి, యందుఁ గుమారస్వామిని దర్శించి, శ్రీశైలంబునకుం జని, వేంకటాచలంబు దర్శించి, కామకోటిశక్తి నిరీక్షించి, కాంచీపురంబుఁ గాంచి, కావేరికిం జని, యమ్మహావాహిని నవగాహనంబు సేసి. 951

స్రగ్ధర. సేవించెన్ రంగధామున్, శ్రితనివహపయస్సింధుసంపూర్ణసోముం,
గావేరీమధ్యసీమున్, ఘనకలుషమహాకాలకూటోగ్రభీమున్,
దేవారిశ్రీవిరామున్, దివిజవినుతసందీపితానంతనామున్,
ధీవిజ్ఞానాభిరాముం, ద్రిభువనవిలసద్దేవతాసార్వభౌమున్. 952

వ. అచ్చోటువాసి, వృషభాద్రి నెక్కి, హరిక్షేత్రంబు ద్రొక్కి, మధురాపురంబున కరిగి సేతుబంధనంబు మెట్టి, యచటం బదివేలపాఁడిమొదవుల భూసురుల కిచ్చి, రామేశ్వరుం దర్శించి, తామ్రపర్ణికిం జని, మలయాచలం బెక్కి, యగస్త్యునిం గని నమస్కరించి, దక్షిణసముద్రంబు దర్శించి, [2]కన్యాఖ్యదుర్గాదేవి నుపాసించి, పంచాప్సరం బను తీర్థంబున నాప్లవనం బాచరించి, గోకర్ణంబున నిందుమౌళిని దర్శించి, ద్వీపవతి యైన కామదేవిని వీక్షించి, తాపిం బయోష్ణిని దర్శించి, నిర్వింధ్యంబు గడచి, దండకావనంబున కరిగి, మాహిష్మతీపురంబున వసియించి, మనుతీర్థం బాడి, క్రమ్మఱం బ్రభాసతీర్థంబునకు వచ్చి, యచ్చటి బ్రాహ్మణజనంబుల వలనం బాండవధార్తరాష్ట్రులభండనంబునందు సకలరాజలోకంబు పరలోకగతు లగుటయు, వాయునందనసుయోధనులు గదాయుద్ధసన్నద్ధు లై యుండుటయు నెఱింగి వారల వారించుతలంపున నచ్చటికిం జని. 953

తే. ధర్మనందనుఁ, దనకు వందనము సేయు
కృష్ణు, నరు, మాద్రిసుతుల వీక్షించి, యేమి
వలుక కుగ్రగదాదండపాణు లగుచుఁ
గ్రోధమునఁ బోరు భీమదుర్యోధనులను. 954

1. కృష్ణానది, తుంగభద్రానదీతీరమునఁగల పంప యను సరోవరము. 2. కన్యాకుమారి.

వ. చూచి, వారల జాడయుం జని, యి ట్లనియె. 955

సీ. "వీరపుంగవులార! వినుఁడు మీలోపల [1]భూరిభుజాసత్త్వమున నొకండు,
[2]ప్రకటితాభ్యాససంపద్విశేషంబున నొక్కండు నధికుఁడై యుంటఁ జేసి
సమబలు; లటు గాన చర్చింపఁగా నిందు జయ మొక్కనికి లేదు సమరమందుఁ;
గాన యూరక పోరఁగా నేల మీకు?" యని వారింప నన్యోన్యవైరములను

తే. నడరి, తొల్లింటిదుర్భాష లాత్మ లందుఁ
దలఁచి, తద్భాషణము [3]లపథ్యములు గాఁగ
మొక్కలంబునఁ బోర, నా ముష్టికాసు
రారి వీక్షించి "వీరిశుభాశుభములు. 956

వ. ఎట్లు గావలయు నట్ల యయ్యెడుం గాక!" యని యచ్చోట నిలువక, యుగ్ర
సేనాదిబంధుప్రకరంబులు పరితోషంబున నెదుర్కొన, ద్వారకాపురంబు
సొచ్చి, యందుండి మగిడి, నైమిశారణ్యంబునకుం జని, యందులమునిపుంగవు
లనుమతింప నచ్చట నొక్కమఖంబు గావించి, బహుదక్షిణ లొసంగి, యంచిత
జ్ఞానపరిపూర్ణు లగునట్లుగా వరం బిచ్చి, రేవతియునుం దానును బంధుజ్ఞాతి
యుతంబుగా నవభృథస్నానం బాచరించి యనంతరంబ. 957

చ. విలసితమాల్యచందననవీనవిభూషణరత్నవస్త్రముల్
పొలుపుగఁ దాల్చి, యంచితవిభూతిఁ దలిర్చెను బూర్ణచంద్రికా
కలితసుధాంశురేఖ నెసకం బెసఁగన్ నిజబంధులోచనో
త్పలచయ ముల్లసిల్లఁ, [4]బరిపాండురచారుయశోవిలాసుఁ డై. 958

వ. ఇవ్విధంబున ననంతుండు, నప్రమేయుండును, మాయామానుషవిగ్రహుండు,
నసంఖ్యబలశాలియు నైన బలదేవుం డతివైభవంబున నిజపురంబు ప్రవేశించి,
సుఖం బుండె" నని చెప్పి యి ట్లనియె. 959

## కుచేలోపాఖ్యానము

క. హలధరుఁ డమర్త్యచరితుం-డలఘుభుజాబలుఁ డొనర్చినద్భుతకర్మం
బులు పెక్కు; నాల్గుమోములు-గలమేటియు లెక్కపెట్టఁ గలఁడె? నరేంద్రా!

చ. అనిన మునీంద్రుఁ గన్గొని ధరాధిపుఁ డిట్లనుఁ "బద్మపత్రలో
చనునియనంతవీర్యగుణసంపద వేమఱు విన్న నైననుం
దనియదు చిత్త; మచ్యుతకథావిభవం బొకమాటు వీనులన్
వినిన, మనోజపుష్పశరవిద్ధుఁడు నైన విరామ మొందునే? 961

---

1. అధికమగు భుజబలమున. 2. పరిశ్రమ యను సంపదతోఁగూడిన ఎక్కువ శక్తితో.
3. హితములుకానివి. 4. మిక్కిలి తెల్లనైన.

వ. అదియునుం గాక. 962

చ. హరి భజియించు హస్తములు హస్తము; లచ్యుతుఁ గోరి మ్రొక్కు త
చ్ఛిరము శిరంబు; చక్రధరుఁ జేరినచిత్తము చిత్త; మిందిరా
వరుఁ గనుదృష్టి దృష్టి; మురవైరి నుతించినవాణి వాణి; య
క్షరుకథ లాను కర్ణములు కర్ణము లై విలసిల్లుఁ బో భువిన్. 963

క. హరిపాదతీర్థసేవా-పరమై విలసిల్లునట్టి భాగవతుని [1]వి
స్ఫురితాంగము లంగము; లా-పరమేశ్వరు నెఱుఁగ నాకుఁ బలుకుమ, మునీంద్రా!''

సీ. అనుడు వేదవ్యాసతనయుఁ డాయభిమన్యుతనయునిఁ జూచి యిట్లనియెఁ బ్రీతి;
''జనవర! గోవిందసఖుఁడు కుచేలుండు నా నొప్పు విప్రుండు మానధనుఁడు,
విజ్ఞానరాగాదివిరహితస్వాంతుండు, శాంతుండు, ధర్మవత్సలుఁడు, ఘనుఁడు,
విజితేంద్రియుఁడు, బ్రహ్మవేత్త, దారిద్ర్యంబు బాధింప, నొరులఁ గార్పణ్యవృత్తి
తే. నడుగఁ బోవక, తనకుఁ దా నబ్బినట్టి-కాసు పదివేలనిష్కముల్ గాఁ దలంచి,
యాత్మ మోదించి, పుత్రదారాభిరక్ష-యొకవిధంబున నడపుచు నుండు నంత.

సీ. లలితపతివ్రతాతిలకంబు, వంశాభి
జాత్య తద్భార్య, దుస్సహదరిద్ర
పీడచేఁ గడు నొచ్చి, పెదవులు దడుపుచు
శిశువు [2]లాఁకటిచిచ్చుచేఁ గృశించి,
మలమల మాఁడుచు, మానసం బెరియంగఁ,
''బట్టెఁడో రెము మాకుఁ బెట్టు'' మనుచుఁ
బత్త్రభాజనధృతపాణు లై తనుఁ జేరి
వేఁడిన, వీనులు [3]సూఁడినట్ల
తే. యైన, నొకనాఁడు వగచి, నిజాధినాథుఁ-జేరి యి ట్లని పలికెఁ; ''బ్రాణేశ!
తట్టుముట్టాడునిట్టి పేదఱిక మిట్లు-నొంప, దీని కుపాయ మూహింప వైతి.''966

వ. అని మఱియు ని ట్లనియె. 967

తే. ''బాలసఖుఁ డైన యప్పద్మపత్త్రనేత్రుఁ-గాన నేఁగి, దారిద్ర్యాంధకారమగ్ను
లైన మము నుద్ధరింపుము; హరికృపాక-టాక్షరవిదీప్తి వడసి, మహాత్మ! నీవు.

వ. మఱియును. 969

చ. వరదుఁడు, సాధుభక్తజనవత్సలుఁ, డార్తశరణ్యుఁ, డిందిరా
వరుఁడు, దయాపయోధి, భగవంతుఁడు, కృష్ణుఁడు దాఁ [4]గుశస్థలీ

---

1. ప్రకాశించునట్టి అవయవములు. 2. ఆఁకలి యనునట్టి యగ్ని. 3. మాడిపోయినట్లు.
4. ద్వారక.

పురమున యాదవప్రకరముల్ భజియింపఁగ నున్నవాఁడు; ని
వరిగిన నిన్నుఁ జూచి విభుఁ డప్పుడ యిచ్చు నహీనసంపదల్. 970

మ. కలలోనం దను మున్నెఱుంగని మహాకష్టాత్ముఁ డైనట్టి దు
ర్బలుఁ డాపత్సమయంబునన్ నిజపదాబ్జాతంబు లుల్లంబులోఁ
దలఁప న్నంతన మెచ్చి, [1]'యార్తిహరుఁ డై తన్నైన నిచ్చున్; మని
శ్చలభక్తిన్ భజియించువారి కిడఁడే సంపద్విశేషోన్నతుల్?'' 971

క. అని చెప్పిన నమ్మానిని-సునయోక్తుల కలరి, భూమిసురుఁ "డా కృష్ణుం
గన నేఁగుట యిహపరసా-ధన మగు" నని మదిఁ దలంచి తనసతితోడన్.

తే. "నీవు సెప్పినయట్ల రాజీవనేత్రు-పాదపద్మంబు లాశ్రయింపంగఁ జనుట
పరమశోభన; మా చక్రపాణి కిపుడు-గానికేమైనఁ గొంపోవఁ గలదె మనకు?"

తే. అనిన నయ్యింతి "యౌఁగాక!" యనుచు విభుని
శిథిలవస్త్రంబుకొంగునఁ బృథుకతండు
లముల నొకకొన్ని ముడిచి, నెయ్యమున ననుపఁ
జనియె గోవిందదర్శనోత్సాహి యగుచు. 974

వ. అట్లు సనుచుం దన మనంబున. 975

సీ. "ద్వారకానగరంబు నేరీతిఁ జొత్తును? భాసురాంతఃపురవాసి యైన
యప్పుండరీకాక్షు నఖిలేశు నెబ్భంగి దర్శింపఁగలనొ? తద్ద్వారపాలు
రెక్కడివిప్రుఁడ? విం దేల వచ్చెద? వని యడ్డపెట్టిరే, నపుడు వారి
కే మైనఁ [2]బరిదాన మిచ్చి, చొచ్చెద నన్న, నూహింప నర్థశూన్యుండ నేను;

తే. ఐన నా భాగ్య; మతనిదయార్ద్రదృష్టి
గాక తలపోయఁగా నొండు గలదె? యాతఁ
డేల నన్ను [3]నుపేక్షించు? నేటిమాట!"
లనుచు నా ద్వారకాపుర మతఁడు సొచ్చి. 976

వ. ఇట్లు ప్రవేశించి, రాజమార్గంబునఁ జని చని, కక్ష్యాంతరంబులు గడచి, చని
ముందట. 977

సీ. విశద మై యొప్పు షోడశసహస్రాంగనాకలితవిలాససంగతిఁ దనర్చి,
మహనీయతపనీయమణిమయగోపురప్రాసాదసౌధహర్మ్యములు సూచి,
మనము బ్రహ్మానందమును బొందఁ గడు [4]నుబ్బి, సంతోషబాష్పముల్ జడిగొనంగఁ,
బ్రకట మై విలసిల్లు నొకవధూమణిమందిరమున నింతులు చామరములు వీవఁ,

---

1. ఆపదలను పోఁగొట్టునట్టివాఁడు. 2. కానుక. 3. ఆదరింపకయుండును. 4. ఉప్పొంగి.

తే. దనరుమృదుహంసతూలికాతల్పమందుఁ
దానుఁ బ్రియయును బహువినోదములఁ దనరి,
మహితలావణ్యమన్మథమన్మథుండు
ననఁగఁ జూపట్టు పుండరీకాయతాక్షు. 978

సీ. ఇందీవరశ్యాము, వందితసుత్రాముఁ, గరుణాలవాలు, భాసురకపోలుఁ,
గౌస్తుభాలంకారుఁ, గామితమందారు, సురుచిరలావణ్యు, సురశరణ్యు,
హర్యక్షునిభమధ్యు, నఖిలలోకారాధ్యు, ఘనచక్రహస్తు, జగత్ప్రశస్తు,
ఖగకులాధిపయానుఁ, గౌశేయపరిధానుఁ, బన్నగశయను, నబ్జాతనయను,

తే. మకరకుండలసద్భూషు, మంజుభాషు,
నిరుపమాకారు, దుగ్ధసాగరవిహారు,
భూరిగుణసాంద్రు, యదుకులాంభోధిచంద్రు,
విష్ణు, [1]రోచిష్ణు, జిష్ణు, సహిష్ణుఁ, గృష్ణు. 979

మ. కని డాయం జనునంతఁ గృష్ణుఁడు, దళత్కంజాతుఁ డప్పేదవి
ప్రుని, నశ్రాంతదరిద్రపీడితుఁ, గృశీభూతాంగు, జీర్ణాంబరున్,
ఘనతృష్ణాతురచిత్తు, హాస్యనిలయున్, [2]ఖండోత్తరీయుం, గుచే
లుని నల్లంతనె చూచి, సంభ్రమవిలోలుం డై దిగెం దల్పమున్. 980

క. కర మర్థి నెదురుగాఁ జని-పరిరంభణ మాచరించి, బంధుస్నేహ
స్ఫురణం దోడ్తెచ్చి, సమా-దరమునఁ గూర్చుండఁ బెట్టెఁ దన తల్పమునన్.

తే. అట్లు గూర్చుండఁ బెట్టి, నెయ్యమునఁ గనక-కలశసలిలంబుచేఁ గాళ్లు గడిగి భక్తిఁ
దజ్జలంబుల తనదుమస్తమునఁ దాల్చి-లలితమృగమదఘనసారమిళిత మైన.

తే. మలయజము మేన జొబ్బిల్ల నలఁది, యంత
శ్రమము వాయంగఁ దాళవృంతమున విసరి,
బంధుర[3]ామోదకలితధూపంబు లొసఁగి,
మించు మణిదీపముల నివాళించి, మఱియు. 983

వ. సురభికుసుమమాలికలు సిగముడిం దుఱిమి, కర్పూరమిళితతాంబూలంబు నిడి, ధేనువు నొసంగి, సాదరంబుగా స్వాగతం బడిగిన, నప్పు డవ్విప్రుండు మేనం బులకాంకురంబు లంకురింప, నానందబాష్పజలబిందుసందోహుం డయ్యె; నట్టి యెడం బద్మలోచనుండు మన్నించు నంగనామణి యగు రుక్మిణి కరకంకణ రవంబు లొలయం జామరలు వీవఁ, దజ్జాతవాతంబున [4]ఘర్మసలిలంబు నివా

1. ప్రకాశించునట్టివాఁడు. 2. చినిఁగిన మీఁదిపంచ గలవాఁడు. 3. సువాసనతోఁ గూడిన ధూపము. 4. చెమట.

రించుచుండఁ జూచి, శుద్ధాంతకాంతానివహంబులు పను మనంబుల నద్భుతం
బంది, యి ట్లనిరి. 984

ఉ. ''ఏ తపంబు సేసె నొకొ యీధరణీదివిజోత్తముండు తొల్
జామున? యోగివిస్ఫురదుపాస్యకుఁడై తనరారు నీ జగ
త్స్వామి రమాధినాథు నిజతల్పమునన్ వసియించి యున్నవాఁ;
డీ మహనీయమూర్తి కెనయే మునిపుంగవు లెంతవారలున్? 985

వ. అదియునుం గాక. 986

చ. తనమృదు[1]తల్పమందు వనితామణి యైన రమాలలామపెం
దును నెడఁగాఁ దలంపక, యదుప్రవరుం డెదు రేఁగి, మోదముం
దనుకఁగఁ గౌఁగిలించి, యుచితక్రియలం బరితుష్టుఁ జేయుచున్,
వినయమునన్ భజించె; ధరణీసురుఁ డెంతటి భాగ్యవంతుఁడో!'' 987

వ. అను నయ్యవసరంబున. 988

క. మురసంహారుఁడు కుచేలుని-కరము గరంబునఁ దెమల్చి, [2]కడఁకన్ మన మా
గురుగృహమున వర్తించిన-చరితము లని కొన్ని నుడివి, చతురత మఱియున్.

సీ. ''బ్రాహ్మణోత్తమ! వేదపాఠనలబ్ధదక్షత గలచాపు వంశంబువలనఁ
బరిణయం బైనట్టి భార్య సుశీలవర్తనములఁ దగ భవత్సదృశ యగునె?
తలఁప గృహక్షేత్రధనదారపుత్రాదులందు నీచిత్తంబు సెందకుంట
తోఁచు చున్నది; యేను దుది లోకసంగ్రహార్థంబు కర్మాచరణంబు సేయు

తే. గతి, మనంబులఁ గామమోహితులు గాక-యర్థిమై యుక్తకర్మంబు లాచరించి,
ప్రకృతిసంబంధములు వాసి, భవ్యనిష్ఠ-[3]దవిలియుందురు కొంద ఱుత్తములు భువిని.''

వ. అని మఱియు ని ట్లనియె. 991

క. ''ఎఱుఁగుదువె మనము గురుమం
దిరమున వసియించి, యతఁడు దెలుపఁగ వరుసన్
ఎఱుఁగఁగ వలసిన యర్థము
లెఱిఁగి, పరిజ్ఞానమహిమ లెఱుఁగుట లెల్లన్?'' 992

వ. అని మఱియు గురుప్రశంస సేయం దలంచి, యి ట్లనియె. 993

తే. ''తివిరి యజ్ఞానతిమిరప్రదీప మగుచు
నవ్యయం బైన బ్రహ్మంబు ననుభవించు
భరితసత్త్వుండు, సత్కర్మనిరతుఁ, డతుల
భూసురశ్రేష్ఠుఁ, డనఘుండు, బుధనుతుండు. 994

1. పానుపు. 2. ఉత్సాహముతో. 3. ఆసక్తినిబూని.

వ. అమ్మహాత్మునివలన సకలవర్ణాశ్రమంబులవారికి నేను [1]విజ్ఞానప్రదుండ నగు గురుండనై యుండి, గురుభజనంబు పరమధర్మం బని యాచరించితి; నది గావున,

క. భూసురుల కెల్ల ముఖ్యుఁడ-నై సకలకులాశ్రమంబులందును నెప్పుడున్
ధీసుజ్ఞానప్రదుఁ డన-[2]దేశికుఁ డన నొప్పు చుందు, ధృతి నెల్లెడలన్. 996

తే. అట్టి వర్ణాశ్రమంబులయందు నర్థ-కుశలు లగువారు నిఖిలైకగురుఁడ నైన
నాదువాక్యంబుచే భవార్ణవము కెలుచ-దాఁటుదురు మత్పదాంబుజధ్యానపరులు.

వ. అదియునుం గాక, సకలభూతాత్మకుండ నైన యేను తపోవ్రతయజ్ఞదానశమద మాదులచేత సంతసింపను, గురుజనంబులఁ బరమభక్తి సేవించువారలం [3]బరిణమింతు''నని చెప్పి మఱియు ''మనము గురుమందిరంబున నున్నయెడ, నొక్కనాఁడు గురుపత్నిని యుక్తుల మై యింధనార్థం బడవికిం జనిన, నయ్యవసరంబున.

సీ. ఘుమఘుమారావసంకులఘోరజీమూతపటలసంఛన్నాభ్రభాగ మగుచుఁ,
జటులఝంఝానిలోత్కటసముద్ధూతనానావిధజంతుసంతాన మగుచుఁ,
జండదిగ్వేదండతుండనిభాఖండవారిధారాపూర్ణవసుధ మగుచు,
విద్యోతమానోగ్రఖద్యోతకరణజిద్విద్యుద్ద్యుతిచ్ఛటావిభవ మగుచు,
తే. నడరి జడి గురియఁగ, నినుఁ డస్తమింప-భూరి[4]నీరంధ్రనిబిడాంధకార మేచి,
సూచికాభేద్య మై వస్తుగోచరంబు-గానియట్లుండ మనము నవ్వానఁ దడిసి.

తే. బయలు గొందియుఁ, బెనుమిట్టు పల్లములును,
రహితసహితస్థలంబు లేర్పఱుపరాక
యున్న యత్తఱి మనము నొండొరులచేతు
లూఁతఁగాఁ గొని, నడచుచు నుండునంత. 1000

క. బిసబిస నెప్పుడు నుడుగక-విసరెడి వలిచేత, వడఁకు విడువక, మనముం
బస చెడి మార్గముఁ గానక-మసలితి; మంతటను నంశుమంతుఁడుఁ బొడిచెన్.

క. తెలతెలవాఱెడివేళం-గలకల మని పలికెఁ బక్షిగణ మెల్లెడలన్
మిలమిలని ప్రొద్దుపొడుపున-ధళధళ మనుమెఱుఁగు [5]దిగ్వితానము నిండెన్.

క. అప్పుడు సాందీపని మన-చొప్పరయుచు వచ్చి, వానసోఁకునను వలిం
దెప్పిఱిలుటఁ గని, ఖేదం-బుప్పతిలం బలికె ''నకట! యోవటులారా! 1003

చ. కటకట యిట్లు మాకొఱకుఁగాఁ జనుదెంచి, మహాటవిన్ [6]సము
త్కటపరిపీడ నొందితిరి; గావున శిష్యులు మాఋణంబు నీఁ

---

1. తెలివిని ఇచ్చువాఁడు. 2. ఉపదేశించువాఁడు. 3. ఇష్టపడుదును. 4. అవకాశములేని. 5. దిక్కులసముదాయము. 6. అధికమయినబాధను.

గుట కిది కారణంబు; సమకూరెడిఁ బో యిల మీఁద మీకు వి
స్ఫుటధనబంధుదారబహుపుత్త్రవిభూతిజయాయురున్నతుల్.” 1004

క. అని గారవించి, యాయన-మనలం దోడ్కొనుచు నాత్మమందిరమునకుం
జనుదెంచుట లెల్లను నీ-మనమునఁ దలఁతే?” యటంచు మఱియుం బలికెన్.

వ. “అనఘా! మన మధ్యయనంబు సేయుచు, నన్యోన్యస్నేహవాత్సల్యంబులం జేయు కృత్యంబులు మఱవవు గదా?” యని యని యెల్లం దలంచి యాడు మాధవు మధురాలాపంబులు విని, యతనిఁ గనుంగొని కుచేలుం డిట్లనియె. 1006

క. “వనజోదర! గురుమందిర-మున మనము వసించునాఁడు మునమునఁ గావిం
పని పను లెవ్వియుఁ గలవే?-విను; మవి యట్లుండ నిమ్ము;విమలచరిత్రా! 1007

క. “[1]గురుమతిఁ దలఁపఁగ ద్విజగ-ద్గురుఁడ వనం దగిన నీకు గురుఁ డనఁగా నొం
డొరుఁ డెవ్వఁ? డింతయును నీ-కరయంగ విడంబనంబ యగుఁ గాదె; హరీ!”

వ. అని సాభిప్రాయంబుగాఁ బలికిన పలుకులు విని, సమస్తభావాభిజ్ఞుం డైన పుండరీకాక్షుండు మందస్మితసుందరవదనారవిందుం డగుచు, నతనిం జూచి, “నీవిచ్చటికి వచ్చునప్పుడు నాయందుల భక్తిం జేసి నాకు నుపాయనంబుగా నేమి పదార్థంబు దెచ్చితి? వప్పదార్థంబు [2]లేశమాత్రం బైనఁ బదివేలుగా నంగీకరింతు; నట్లుగాక నీచవర్తనుం డై మద్భక్తిం దగులని దుష్టాత్ముండు హేమాచలతుల్యం బైన పదార్థంబు నొసంగిన, నది నామనంబునకు సమ్మతంబు గాదు; కావున. 1009

క. దళమైనఁ, బుష్ప మైనను, ఫల మైనను,-సలిల మైనఁ, బాయనిభక్తిం
గొలిచిన జను లర్పించిన-నెలమిన్ రుచిరాన్నముగనె యేను భుజింతున్.”

క. అని పద్మోదరుఁ డాడిన-వినయోక్తుల కాత్మ నలరి, విప్రుఁడు దాఁ దె
చ్చిన యడుకులు దగ నర్పిం-పను నేరక, మోము వాంచి పలుకక యున్నన్.

వ. అవ్విప్రుండు చనుదెంచిన కార్యంబు కృష్ణుండు దన దివ్యచిత్తంబున నెఱింగి, “యితండు పూర్వభవంబున నైశ్వర్యకాముండై, నన్ను సేవింపం; డైన నిక్కుచేలుండు నిజకాంతాముఖోల్లాసంబుకొఱకు నాయొద్దకుఁ జనుదెంచినవాఁ; డితనికి నింద్రాదులకుఁ బడయరాని బహువిధంబు లైన సంపద్విశేషంబు లీక్షణంబ యొడఁగూర్పవలయు” నని తలంచి, యతండు [3]జీర్ణవస్త్రంబుకొంగున ముడిచి తెచ్చిన యడుకులముడియఁ గని, ‘యిది యేమి?’ యని యొయ్యనయమ్ముడియఁ దన కరకమలంబుల విడిచి, యయ్యడుకులు కొన్ని పుచ్చుకొని, యివియ సకలలోకంబులను, నన్నును బరితృప్తిం బొందింపఁజాలు” నని యప్పుడు. 1012

1. గొప్పబుద్ధితో. 2. కొంచెమయినను. 3. ప్రాంతగుడ్డ.

దవిలి యేఁ గ్రోలి చిత్తము దన్మయత్వంబుఁ గాంచి, మోదించుచు నుండు నంత
¹దుహితృవత్సలుండు మద్రుఁడు దా నది విని, సదుపాయ మొక్కటి మదిఁ దలంచి,

తే. చదల నెబ్బంగి నైన గోచరము గాక-వారిమధ్యములో నఖివ్యాప్తిఁ దోఁచు
మత్స్యయంత్రంబు కల్పించి, మనుజు లెంత-వారికైనను దివ్య మోహంగరాని,

తే. ధనువుఁ బవిచండనిష్ఠురాస్త్రంబు నచట-నంచితంబైన గంధపుష్పాక్షతలను
బూజగావించి, యునిచి, యే పురుషుఁ డేని-నిద్ధబలమున సిబ్బాస మెక్కు వెట్టి

క. "ఈ సాయకంబు ²నారిం-బోసి, వెసన్ మత్స్యయంత్రముఁ దరఁ గూలన్
వేసిన, శౌర్యధురీణుఁడు-నా సుత వరియించు" నని జనంబులు వినఁగన్. 1085

క. చాటించిన, నవ్వార్తకుఁ-జాటించిన సంభ్రమముల బాణాసనమౌ
ర్వీటంకారమహారవ-పాటితశాత్రవులు బాహుబలసంపన్నుల్. 1086

క. సుందరతనులు, దదుత్సవ-సందర్శనకుతుకు, లమితసైన్యులు, భూభృ
న్నందనులు తేతెంచిరి జన-నందితమగు లగుచు మద్రనగరంబునకున్. 1087

క. చనుదెంచిన వారికి మ-ద్రజనకుఁడు వివిధార్చనములు సమ్మతిఁ గావిం
చిన, నా బాహుబలాఢ్యులు-ధనువుం జేరంగ నరిగి ధైర్యస్ఫూర్తిన్. 1088

వ. ఇట్లు డగ్గఱి ³యద్ధనువుం గనుంగొని. 1089

ఉ. కొందఱు పూన లేక చనఁ, గొందఱు పూని కదల్ప లేక పోఁ,
గొంద ఱొకింత యెత్త, నొకకొందఱు మోపిడ లేక డక్కఁగాఁ,
గొంద ఱొకింత యెక్కిడుచుఁ గోరి, నృపాలకు లిట్లు సిగ్గునుం
జెంది, తలంగి పోవుచును 'సీ! యిట కేఁగుట సేతత' ప్పనన్. 1090

వ. అట్టియెడ. 1091

క. భీముఁడు, రాధేయుఁడు ను-ద్దామగతి న్నెక్కు ద్రోచి, తగ నమ్మీనం
బేమఱక దిరుగు చుంటయుఁ-దామేమియు నెఱుఁగ లేక తలఁగిన పిదపన్. 1092

క. అమరేంద్రతనయుఁ డమ్మ-త్స్యము నేయ నుపాయ మెఱిఁగి, తగ నేసియు,మీ
నము ద్రుంప లేక సిగ్గున-విముఖుం డై చనియె నంత వికలుం డగుచున్.

వ. ఇట్లు సకలరాజకుమారులుం దమతమ ప్రయత్నంబులు విఫలంబు లైన ముఖార
విందంబులు ముకుళించి, ⁴దైన్యంబున విన్ననై చూచుచున్నయెడ. 1094

చ. సరసిజపత్రలోచనుఁడు చాపము సజ్యము సేసి, యుల్లస
చ్ఛర మరిఁ బోసి, కార్ముకవిశారదుఁ డై యవలోకవాలె ఖే

1. కుమార్తెయందు దయగలవాఁడు. 2. అల్లెత్రాటియందుఁ గూర్చి. 3. ఆ ధనుస్సును. 4. దీనత్వము.

చర మగు విమానముం బనిచెఁ సత్వరతన్ సురసిద్ధసాధ్యఖే
చరజయశబ్ద మొప్పఁ జెలువం గురిసెం దివిఁ బుష్పవర్షముల్. 1095

వ. అయ్యవసరంబున నేను బరితుష్టాంతరంగ నై పరమానందవికచవదనారవింద నగుచు, [1]ఇందిందిరసన్నిభంబు లగు చికురబృందంబులు విలసదలికఫలకంబునం దళుకు లొలుకు ఘర్మజలకణంబులం గరంగు మృగమదతిలకంపుఁ బుటసలున మసలు కొనినం గరకిసలయంబున నొసరించుచు, మిసమిస మను [2]మెఱుంగుగములు గిఱికొను నెఱిగాను వడవడ వడంక, నప్పుడు మందగమనంబున. 1096

చ. లలితపదాబ్జనూపురకలధ్వనితోఁ, దరహాసచంద్రికా
కలితకపోలపాలికలఁ గప్పు సువర్ణవినూత్నరత్నకుం
డలరుచు లొప్పఁ, గంకణఝణంకృతు లింపెసలార, రంగభూ
తలమున కేఁగుదెంచి, ముఖతామరసం బపు డెత్తి చూచుచున్. 1097

చ. నరపతులం గనుంగొని, మనంబున వారిఁ దృణీకరించి, మ
త్కరజలజాతదివ్యమణికాంచనమాలిక నమ్మురారికం
ధరమున లీలమై నిడి, పదంపడి [3]నవ్యమధూకదామ మా
హారికబరిం దగిల్చితి, నయంబునఁ గన్నుల లజ్జ దేరఁగన్. 1098

వ. అప్పుడు. 1099

చ. కొలఁదికి మీఱఁగా డమరుగోముఖడిండిమమడ్డుశంఖకా
హళమురళీమృదంగపణవానకదుందుభిఢక్కకాంస్యమ
ర్దళమురజారజాదివివిధధ్వను లేపున భూనభోంతరం
బులఁ జెలఁగెన్; [4]నటీనటనముల్ దనరారె మనోహరాకృతిన్. 1100

వ. అంత. 1101

చ. అమరగణంబుఁ దోలి యురగారి సుధాకలశంబుఁ గొన్న చం
దమున సమస్తశత్రువసుధావరకోటిఁ దృణీకరించి, య
క్కమలవిలోచనుండు ననుఁ గౌఁగిట నొప్పఁగఁ జేర్చి, సింహచం
క్రమణ మెలర్పఁ గొంచుఁ జనెఁ గాంచనచారురథంబుమీఁదికిన్. 1102

వ. అట్లు రథారోహణంబు సేసిన. 1103

చ. తురగచతుష్కముల్ విమతదుర్దమశూరతఁ బూన్చి, దారకుం
డరదము ద్రొప్ప, శత్రునికరాంధతమఃపటలప్రచండభా

---

1. తుమ్మెదలతో సమానములగు. 2. కాంతుల సముదాయములు. 3. క్రొత్తయిప్పపూలదండను.
4. నాట్యస్త్రీలయొక్క నృత్యములు.

స్ఫురదుచి నొప్పనట్టి నిజకార్ముకయుక్తగుణప్రఘోషసం
ఛరితదిగంతరుం డగుచుఁ, బద్మదళాక్షుఁడు వోవు చుండఁగన్. 1104

వ. అట్టియెడ సకలరాజలోకంబును గృష్ణునివిభవంబునకుఁ జూపోపక, యసంఖ్యాంబులగు మూఁకలు గట్టి, యమ్మహాత్ముని మాహాత్మ్యంబు దెలియక, దర్పాంధులై కడంగి. 1105

ఉ. భావభవప్రసూనశరబాధితమానసులై సమస్తధా
త్రీవరనందనుల్ [1]బలుపుఁ, [2]దెంపును, [3]పెంపును, [4]సొంపు సేర్పడన్
దేవకిరీటరత్నరుచిదీపితపాదసరోజుఁ డైన రా
జీవదళాక్షుఁ దాఁకిరి విశృంఖలవృత్తి నతిప్రయత్నులై. 1106

వ. అంత. 1107

చ. సరసిజలోచనుండు నిజశార్ఙ్గశరాసనముక్త హేమపుం
ఖరుచిరశాతసాయకనికాయములన్ రిపుకోటి నేసి, సిం
ధురరిపువిక్రమప్రకటదోర్బలుఁడై విలసిల్లి, యొత్తె దు
స్తరచలితాన్యసైన్యమును, సజ్జనమాన్యముఁ, బాంచజన్యమున్. 1108

ఉ. ఆతటి భూరిబాహుబలులైన విరోధినరేశ్వరుల్ మృగ
వ్రాతము లొక్క పెట్ట [5]మృగరాజకిశోరముపై నెదిర్చిన
ట్లుతరులై, చతుర్విధసమిద్ధబలంబులతోడఁ గూడి, ని
ర్ఘాతకళంకుఁ డైన నవతోయజనేత్రునిఁ జుట్టు ముట్టినన్. 1109

చ. అలిగి మురాంతకుండు గులిశాభశరంబుల నూత్నరత్నకుం
డలములతోఁ, శిరంబులు రణన్మణినూపురరాజితోఁ, బదం
బులుఁ గటకాంగుళీయకవిభూషణచాపశరాలితోడఁ జే
తులు నిలఁ గూలఁగా [6]విజయదోహలియై తునుమాడె వెండియున్. 1110

క. హతశేషులు సొక్కాకుల-గతిఁదూల నిశాతపవనకాండముల సము
ద్ధతి నేసి, తోలి విజయోన్నతుఁ డై నిజనగరి కేఁగె నగధరుఁ డంతన్.

వ. అట్లు మహితమంగళాలంకృతంబును, నతిమనోహరవిభవాభిరామంబు నగు ద్వారకానగరంబున కరుగుదెంచిన, మజ్జనకుండును బ్రియంబునఁ దోడన చనుదెంచి. 1112

చ. రణితవినూత్నరత్నరుచిరస్ఫుటనూపురహారకర్ణభూ
షణకటకాంగుళీయకలసత్పరిధానకిరీటతల్ప వా -

---

1. బలము. 2. సాహసము. 3. అతిశయము. 4. అందము. 5. సింహపుఁబిల్ల. 6. గెల్పునందు ఉత్సాహము గలవాఁడు.

రణరథవాజి [1]హేతినికరంబులనుం, బరిపాలితాశ్రితా
ప్రాణిగణోత్తరం బయిన పద్మభవాత్మున కిచ్చె నెమ్మితోన్. 1113

వ. ఇట్లు మహనీయ తేజోనిధి యైన మాధవుండు నవాప్తనిఖిలవస్తుసంప్రాప్తుం డయ్యును,
“నిజాధికారశుద్ధి జనక మరలం గర్మాచరణంబును, నిజాత్మ రక్షణ వ్రాతంబును
సమర్పించె” నని భూసురనికరంబులు వినుతింప, మాతండ్రి యైన బ్రహ్మకర్తనుండు
నన్నును, సమస్త వస్తువులను గృష్ణునకు సమర్పించి, క్రమంబున సకలయాద
వులనుం బూజించి, మరలి నిజపురంబునకుం జనియె” నని చెప్పినఁ గుంతియు,
గాంధారియుఁ, గృష్ణయు, నఖిలనృపాలకాంతాజనంబును, గోపికలుం దమ
తమ మనంబుల సర్వభూతాంతర్యామియు, లీలామానుషవిగ్రహుండు నైన
పుండరీకాక్షుచరణారవిందస్మరణానందపరవశ లై కృష్ణుం బ్రశంసించి; రంత.

నారదాదిమహర్షులు శ్రీకృష్ణదర్శనంబు సేసికొని వసుదేవునిచేఁ గ్రతువు సేయించుట

చ. [2]బలవదరాతిమర్దనులఁ, బాండురనీలనిభప్రభాంగులం,
గలితనిజాననాంబుజవికాసజితాంచితపూర్ణచంద్రమం
డలులఁ, బరేశులన్, నరవిడంబనులం, గరుణాపయోధులన్,
విలసదలంకరిష్ణుల, నవీనసహిష్ణుల, రామకృష్ణులన్. 1115

వ. సందర్శించు తలంపులఁ దమహృదయారవిందంబులఁ బ్రేమంబు సందడిగొన
నప్పుడు. 1116

ఉ. ధీరమతిన్ ద్విత, త్రితక, దేవల, సాత్యవతేయ, కణ్వులున్,
నారద, గౌతమ, చ్యవన, నాకజ, గార్గ్య, వసిష్ఠ, గాల, వాం
గీరస, కశ్య, పాసిత, సుకీర్తి, [3]మృకండుజ, కుంభసంభవ, వాం
గీరసులు, యాజ్ఞవల్క్య, మృగశృంగముఖాఖిలతాపసోత్తముల్. 1117

వ. చనుదెంచినం, గృష్ణుండు వారలకుఁ బ్రత్యుత్థానంబు సేసి, వందనంబు లాచ
రించి, వివిధార్చనలు గావించి, యి ట్లనియె. 1118

సీ. “సన్మునీశ్వరులార! జన్మభాక్కుల మైన మాకు నిచ్చోట సమ్మతిని దేవ
నికర[4]దుష్ప్రాపులు, నిరుపమయోగీంద్రు లైన మీదర్శనం బబ్బెఁ గాదె?
ధృతి మందభాగ్యు, లింద్రియపరతంత్రులు నైన మాధాత్ముల కనఘులార!
భవదీయదర్శనస్పర్శనచింతనపాదార్చనలు దుర్లభంబు లయ్యు,
తే. నేఁడు మాకిట సులభ మై నెగడెఁ గాదె?-జగతిపైఁ దీర్థభూతులు, సాధుమతులు
మిమ్ము దర్శించుటయ చాలుఁ; నెమ్మితోడ-వేఱ తీర్థంబు లవనిపై వెదక నేల?

1. బాణములసమూహములను. 2. బలముగలిగిన శత్రువులను మర్దించువారు. 3. మార్కండేయుఁడు. 4. పొందుటకు సాధ్యముకానివారు.

వ. అదియునుం గాక యుదకమయంబు లైన తీర్థంబులును, [1]మృచ్ఛిలామయంబు లైన దేవగణంబులును దీర్ఘదేవతారూపంబులు గా కుండుట లే; దయిన నవి చిరకాలసేవనార్చనలం గాని పావనంబులు సేయవు; సత్పురుషులు దర్శనమాత్రంబునం బావనంబు సేయుదు" రని వెండియు. 1120

సీ. "ఆదిత్యచంద్రాగ్ని మేదినీతారాంబుమారుతాకాశవాఙ్మనము లోలిఁ
బరికింపఁ దత్తదుపాసనంబులఁ బవిత్రములు సేయఁగ సమర్థములు గావు;
సకలార్థగోచరజ్ఞానంబు గల మహాత్మకులు దాదు ముహూర్తమాత్ర సేవఁ
జేసి పావనములు సేయుదు; రదియు న ట్లుండె; ధాతుత్రయయుక్తమైన

తే. కాయమం దాత్మబుద్ధియుఁ, గామినీ కు
మారులందు స్వకీయాభిమానములును,
దివిరి జలమునఁ దీర్థబుద్ధియును జేయు
నట్టి మూఢుండు పశుమార్గుఁ డనఁగఁ బరఁగు." 1121

వ. అని యివ్విధంబునం గృష్ణుం డాడిన [2]సాభిప్రాయంబు లగు వాక్యంబులు విని, యమ్మునీంద్రులు విభ్రాంతహృదయు లై యూర కుండి ముహూర్తమాత్రంబున కమ్మహాత్ము ననుగ్రహంబు వడసి, మందస్మితముఖు లై యప్పుండరీకాక్షున కిట్లనిరి: "దేవా! నేమును, దత్త్వవిదుత్తము లయిన బ్రహ్మరుద్రాదులును భవదీయమాయావిమోహితుల మై యుందుము; [3]నిగూఢం బయిన నీయిచ్ఛచేత మమ్ము ననుగ్రహించితివి; భవదీయచరిత్రంబులు విచిత్రంబు; లిమ్మేదిని యొక్కటి యయ్యును బహురూపంబులఁ గానంబడు విధంబున నీవు మొదలఁ గారణరూపంబున నేకంబయ్యును, ననేకరూపంబులు గైకొని, జగదుత్పత్తిస్థితిలయంబులకు హేతుభూతంబు నా నద్భుతకర్మంబులం దగిలి, లీలావతారంబులు గైకొని, దుష్టజననిగ్రహంబును, శిష్టజనరక్షణంబును గావించు చుందు; వదియునుంగాక, వర్ణాశ్రమధర్మంబు లంగీకరించి, పురుషరూపంబున వేదమార్గంబు విదితంబు సేసిన బ్రహ్మగోవింద రూపివి; తపస్స్వాధ్యాయనియమంబులచేత నీహృదయంబు పరిశుద్ధంబు, గావున బ్రహ్మస్వరూపం బైన వేదంబునందు వ్యక్తావ్యక్తస్వరూపంబు లేర్పడఁగా నుందువు; కావున బ్రాహ్మణకులంబు నెల్ల బ్రహ్మకులాగ్రణి వై రక్షించినమహానుభావుండవు; [4]మాయాజవనికాంతరితుండ వైన నిన్ను నీ భూపాలవర్గంబును, నేమును దర్శింపం గంటిమి; మాజన్మవిద్యాతపోమహిమలు సఫలంబు లయ్యె; నీకు నమస్కరించెద" మని బహువిధంబులఁ గృష్ణు నభినందించి, యమ్మురాంతకుచేత నామంత్రణంబు వడసి, తమతమ నివాసంబులకుఁ బోవం దలంచునవసరంబున. 1122

1. మట్టితోను శాళ్ళతోను గూడినవి, విగ్రహములు. 2. అభిప్రాయముతోఁగూడినవి. 3. కనఁబడక దాఁగియున్న. 4. మాయ యను తెఱమరుగునందుండినవాఁడవు.

సీ. అమ్మునీశ్వరులకు నానతమూర్ధుఁడై యతిభక్తి వందనం బాచరించి,
“తాపసోత్తములార! ధర్మతత్త్వజ్ఞులు మన్నించి వినుఁడు నా విన్నపంబు;
సత్కర్మనితతిచే సంచితకర్మచయంబు వాపెడు నుపాయంబు నాకు
ఘనదయామతిఁ జెప్పుఁడ” నిన నమ్మునివరుల్ భూవరుల్ విన వసుదేవుఁ జూచి
తే. యెలమిఁ బలికిరి “నిఖిలయజ్ఞేశుఁ డైన
కమలలోచనుఁ గూర్చి యాగంబు సేయు;
కర్మమునఁ గాయు నెట్టి దుష్కర్మ మైన;
నిదియె ధర్మంబు గాఁగ నీమదిఁ దలంపు. 1123

వ. అదియునుంగాక. 1124

క. దేవర్షిపితృఋణంబులు-భూవర! మఖవేదపాఠపుత్రులచేతన్
వావిరి [1]దీఁగని పురుషుఁడు-పోవు నధోలోకమునకుఁ బుణ్యచ్యుతుఁ డై. 1125

వ. అట్లగుటం జేసి నీవును. 1126

క. వరతనయాధ్యయనంబులఁ-దరియించితి [2]ఋణయుగంబు; దడయక ధరణీ
వర! దేవ ఋణము సవనా-చరణుఁడ వై యీఁగు టొప్పు సమ్మతితోడన్.”

క. అనవుడు నవ్వసుదేవుఁడు-మునివరులకు నతియె వినయమున “మీరలు సె
ప్పినయట్లు మఖము సేసెద-దినకరనిభులార! మీరు దీర్పఁగ వలయున్.” 1123

వ. అని యభ్యర్థించి, యమ్మునీంద్రుల యాజకులఁ గా వరించి, యప్పుణ్యతీర్థోపాంతంబున మహేంద్రామితవైభవంబున నష్టాదశభార్యాసమేతుం డై దీక్షఁ గైకొని, యమ్మహాధ్వరంబు వేదోపదిష్టవిధిం బరిసమాప్తించి, ఋత్విజ్నికాయంబుల బహుదక్షిణలఁ దనిపి భార్యాసమేతుం డై, యవభృథస్నానం బాచరించి, వివిధ మణివిభూషణవిచిత్రాంబరసురభికుసుమానులేపనంబులు ధరించి, నిఖిల భూదేవ ముని బంధు రాజలోకంబుల నుచితసత్కారంబులఁ బ్రీతులం గావించిన, వారును గృష్ణానుమతి నాత్మనివాసంబులకుం జని; రందు. 1129

ఉ. ఆతతి నుగ్రసేనవసుధాధిపపంకజనాభముష్టికా
రాతులు దమ్ము నర్థి మధురప్రియభాషల నిల్వ వేఁడినం,
గౌతుక మాత్మ [3]నివ్వటిలఁగా వసియించిరి గోపగోపికా
వ్రాతముతోడ నచ్చట ధరావర! నందయశోద లిమ్ములన్. 1130

క. హరినయముల, హరిప్రియముల,-హరిమధురాలాపములను, హరికథల మనో
హరలీలఁ దగిలి నందుఁడు-నిరుపమగతి నచట మూఁడునెల లుండె; నృపా!

1. తొలఁగింపని. 2. రెండు అప్పులు-ఋషిఋణము, పితృఋణము. 3. అతిశయింపఁగా.

చ. జలరుహలోచనాదియదుసత్తము లందఱు నన్ని భంగులం
గలితవిభూషణాంబరనికాయము లిచ్చి బహూకరించి, పే
ర్కొలిపిన, నందముఖ్యులు ముకుందపదాబ్జమరందపానస
ల్లలితనిజాత్మ [1]షట్పదములన్ మరలించుచు [2]నెట్టకేలకున్. 1132

వ. చని చని. 1133

ఆ. మరలి మరలి, "కృష్ణ! మాధవ! గోవింద!-పద్మనాభ! భక్తపారిజాత!
దేవదేవ!" యనుచుఁ దివిరి చూచుచు, మథు-రాభిముఖులు నగుచు నరిగి; రంత.

క. క్రమమున వచ్చుటఁ బ్రావృ-ట్సమయం బగుటయును, బంధుజనయాదవవ
ర్గము లోలిఁ గొలువ, [3]సురగణ-నమితులు బలకృష్ణు లాత్మనగరంబునకున్.

వ. వచ్చి, సుఖం బుండునంత. 1136

శ్రీకృష్ణబలభద్రులు మృతులైన తమసహోదరులఁ దెచ్చి దేవకీదేవికిఁ గనఁబఱచుట

సీ. అవనీశ! యొక్కనాఁ డానకదుందుభిభార్య పద్మాక్షుఁడు, బలుఁడుఁ దొల్లి
శరధిలోఁ జొచ్చినగురుతనూభవుని మరలంగఁ దెచ్చిన మహిమ యెల్ల
జనములు దమలోన సన్నుతుల్ సేయంగ, విని, తనసుతులు దుర్వృత్తుఁడైన
కంసుచే నిహతులై, కాలుని పురి నున్నవారి నందఱఁ జూడఁ గోరి, కృష్ణ
తే. బలులకడ కేఁగి, కన్నులబాష్పకణము-లొలుక "నో రామ! రామ! నిత్యోన్నతాత్మ!
పరమపావనమూర్తి! యో మురవిభేది!-యిందిరానాథ! యోగీశ్వరేశ! కృష్ణ!

క. మురకంసచైద్యపౌండ్రక-నరకజరాతనయయవననరనాయకులన్,
దురితాత్ములఁ బొరిగొని, భూ-భర [4]ముడిపినయట్టిమేటిబలులు దలంపన్. 1138

ఆ. జననవృద్ధివిలయసంగతి నిఖిలంబుఁ-బొందఁ జేయు పరమపురుషులార!
మీకు లీల తా సుమీ యని నమ్మిన-దాన నేను వినుఁ డుదారులార!" 1139

వ. అని యనేకవిధంబుల వినుతించుచు నిట్లనియె: "మీరలు మహానుభావులరు; మీరు దొల్లి యనేకకాలంబు సనినక్రిందట మృతుం డై [5]దండధరుమందిరంబున నున్న గురుకుమారుని, మీమహాప్రభావంబులు లోకంబులఁ బరిపూర్ణంబులై ప్రకాశింప, నక్కాలునిచెంతనుండి మగుడం దెచ్చి, గురుదక్షిణగా నొసంగితి; రివ్విధంబునం గంసునిచేత హతులైన మత్పుత్రుల నందఱ మరలం దెచ్చి, నామనంబున నున్న దుఃఖంబు నివారింప వలయు"నని దేవకీదేవి ప్రార్థించినం, దమతల్లి యాడిన మృదుమధురవాక్యంబు లత్యాదరంబున నాద

1. తుమ్మెదలు. 2. అతిప్రయాసతో. 3. దేవతాబృందముచే నమస్కరింపఁ బడినవారు. 4. పోఁగొట్టిన. 5. యమునిగృహమున.

రించి, యప్పుడు బలకృష్ణులు సముదాగమనమహోత్సవంబున సుతలంబున
కుం జని; రట్టియెడ. 1140

మ. కనియెన్ దానవుఁ డింద్రసేనుఁడు పరేశుల్ కంజాక్షులన్, దక్షులన్,
ఘనసారాంబుదవర్ణులన్, నిఖిలలోకైకప్రభావ్యాప్తులం,
జనరక్షా హలచక్రపాణులను, భక్తత్రాణులన్, నిత్యశో
భనవర్ధిష్ణుల, రామకృష్ణుల, జయభాగ్జిష్ణులన్, జిష్ణులన్. 1141

చ. కని [1]హితకోటితో నెదురుగాఁ జనుదెంచి, మనోనురాగసం
జనితకుతూహలుం డగుచుఁ [2]జాఁగిలి మ్రొక్కి, సమగ్రకాంచనా
సనముల నుంచి, తచ్చరణసారససేచనసర్వలోకపా
వనసలిలంబు వారిదల ధ్రువంబుగఁ దాల్చి, సుభక్తియుక్తుఁడై. 1142

సీ. సురభికాలాగరుహరిచందనైలాదిధూపంబు లా విశ్వరూపకులకుఁ,
గాంచనపాత్రసంగతరత్నకర్పూరదీపంబు లా జగద్దీపకులకుఁ,
బాయసాపూపాన్నపక్వఫలాదినైవేద్యంబు లా వేదవేద్యులకును,
దనరు వినూత్నరత్నప్రభాభాసితాభరణంబు లా దైత్యహరణులకును,

తే. మిలమిలనిమించుతోఁ బొలుపలరుబహువి-ధాంబరంబులు నీలపీతాంబరులకు,
సలలితకుసుమమాలికామలయజాను-లేపనంబులు [3]భూరినిర్లేపులకును. 1143

వ. సమర్పించి, యప్పుండరీకాక్షునిచరణారవిందంబు లొత్తుచు, నానందబాష్ప
పూరంబు దోరంబుగా రోమాంచకంచుకితశరీరుం డగుచుం, గరకమలంబుల ఫాల
భాగంబునం గదియించి. 1144

ఉ. ధీయుతుఁ డై "నమో భగవతే, హరయే, పరమాత్మనే, ముకుం
దాయ, సమస్తభక్తవరదాయ, నమః పురుషోత్తమాయ, కృ
ష్ణాయ, మునీంద్రవంద్యచరణాయ, సురారిహరాయ, సాంఖ్యయో
గాయ, వినీల భాస్వదలకాయ, [4]రథాంగధరాయ, వేధసే." 1145

వ. అని యభినందించి యి ట్లనియె. 1146

ఉ. "రాజసతామసాత్త్వికులకు రాదు గదా నినుఁ గాన? నవ్యపం
కేజదళాయతాక్ష! మునిగేయపవిత్రచరిత్ర! విస్ఫుర
ద్రాజకళాధరాజసురరాజముఖామరమౌళిరత్నవి
భ్రా[illegible]పాదపీఠ! భవబంధవిమోచన! పద్మలోచనా! 1147

మ. మది నూహింపఁగ యోగివర్యులు భవన్మాయాలతాబద్ధులై
యిది యిత్థమ్మన లేరు; తామసుల మై యేపాటి మాబోఁటి దు

1. హితులగువారి సముదాయముతో. 2. సాష్టాంగనమస్కారముచేసి. 3. ఏ విధమగు సంబంధములేనివారు. 4. చక్రమును ధరించిన విష్ణుదేవునికొఱకు.

ర్త్యము లేరెవ్వరు నెఱుంగఁ జాలుమహా! సమ్యగ్జ్ఞానధీయుక్తి నీ
పదముల్ సేరెడి త్రోవఁ జూపి, [1]భవకూపంబుం దరింపింపవే? 1148

ఉ. వైరముచేతఁ జేదినృపవర్గముఁ, గామముచేత గోపికల్,
మీఱినభక్తి నాశ్రితులు మిమ్ము నహర్నిశముం దనంబులం
దారఁగ నీక, రూపగుణతత్పరులై మిముఁ బొందుకై వడిన్
భూరివివేక సత్త్వగుణముల్ గల దేవత లంద నేర్తురే? 1149

క. కాన భవత్పదపద్మ-ధ్యానంబునఁగాని, శాస్త్రతత్త్వంబులచేఁ
గానఁ డ శ్రుతిసంవేద్యం-బైన భవత్పదముఁ; జిన్మయాకార! హరీ! 1150

వ. దేవా! యే నరుం డైన నేమి శ్రద్ధాగరిష్ఠచిత్తుం డై నిన్ను సేవించు, నట్టి
మహాత్ముండు [2]విధిచోదితం బయిన ప్రమాణంబువలన విముక్తుం డై వర్తించు;
నట్లు గావున యోగీశ్వరేశ్వరుండ వైన నీ [3]వీశితవ్యుల మైన మమ్ము నిష్పాపులం
జేయు'' మని నుతించి, మఱియు ని ట్లనియె. 1151

మత్తకోకిలము. ''కంటిఁ; గంటి భవాబ్ధి దాఁటఁగఁ; గంటి ముక్తినిధానముం;
గంటి నీకరుణావలోకముఁ; గంటిఁ బాపము వీడ; ము
క్కంటి తామరచూలియుం బొడఁ గాననట్టి మహాత్మ! నా
యింటికిం జనుదెంచి; తీశ్వర! యేఁ గృతార్థతఁ బొందితిన్. 1152

వ. దేవా! యేను భవద్దాసుండ; నేది వంచినం జేయుదు; నిచ్చటికి మీరలు
విజయంబుచేసిన కార్యం బాన తీయవలయు'' నని కరంబులు మొగిచి, విన్న
వించినం బుండరీకాక్షుం డతనివాక్యంబులకు సంతసిల్లి, యి ట్లనియె. 1153

సీ. ''బలదైత్య! విను; మున్ను ప్రథమయుగంబున నామరీచికి భార్యయైన వర్ణ
యను నింతివలన నందను లార్వు రుద్భవ మైరి; వా రొక్కనాఁ డబ్జభవుఁడు
దనపుత్రిపై మోహమునఁగూడి రతికేళి యొనరింప, మీఱి నవ్వుటయుఁ గ్రోధ
మంది ''యాసుర యోనియందుఁ బుట్టుం'' డని ఘనశాప మిచ్చె నవ్వనజజుండు;
తే. తన్నిమిత్తమునను వారు దగిలి హేమ-కశిపునకుఁ బుట్టి; రంత నాకౌకసులకు
నొడవ వీరలఁ దెచ్చి, యయ్యోగమాయ-యడరి దేవకిగర్భంబులందుఁ జొనుప.

క. దొరఁకొని కంసుఁడు దోడ్తోఁ-[4]బొరిగొనెఁ; దత్పుత్రశోకమునఁ దనచిత్తం
బెరియఁగ, దేవకి వారల-దరిసింపఁగఁ గోరి పనుపఁ దగ నసురేంద్రా! 1155

క. వచ్చితిమి వారిఁ గ్రమ్మఱఁ-దెచ్చెద మని తల్లికోర్కెఁ దీర్పఁగ నిపు డే
మిచ్చటికిని; నీకడఁ బొర-[5]పొచ్చెము లేకున్నవారె పో; వీరవఘా! 1156

1. సంసారము అను బావి. 2. బ్రహ్మదేవునిచేతఁ బ్రేరేపింపఁబడిన. 3. అధికారము
చూపఁదగినవారము. 4. చంపెను. 5. లోపము.

క. వీరలఁ దోకొని [illegible]-ధాతకునకు [illegible]; [illegible],
వీరలు సంతతి శాపముఁ-దీఱి, సుదీర్ఘ ప్రసాదపూతులై యగుచున్. 1157

క. పొలుపుగ సుగతిం బొందఁగఁ-గల'' రని హరి యాన యిచ్చి, కరుణాన్వితుఁడై
బలిచే ననుమతిఁ గొని, నా-ల్గురఁ దోకొని వచ్చె సిద్ధరాజమండలికిన్. 1158

వ. అట్లు వారలం దోడి తెచ్చి, తల్లి కిట్లనియె. 1159

క. ''కనుఁగొనుము; వీరె నీనం-దను'' లని [1]జనయిత్రికిఁ దన ముఖంబున వారి
న్నునిచిన, నద్దేవకియును-ఘనపుత్ర స్నేహమోహకలితాత్మక యై. 1160

క. చన్నులు దిగ్గనఁ జేఁపఁగఁ-గన్నుల నానంద బాష్పకణములు దొరఁగం,
గ్రన్నన కౌఁగిట నిడి, ''ననుఁ-గన్నన్నలు వచ్చి'' రనుచుఁ గౌతుక మొప్పన్.

వ. అట్లు కౌఁగిటం జేర్చి, నిజాంకపీఠంబున నునిచి, శిరంబులు మూర్కొని, చిబు
కంబులు పుణుకుచుం, బ్రేమాతిశయంబున మేనఁ బులక లోలయం జన్నిచ్చిన,
వారును వైష్ణవమాయామోహితు లై స్తన్యపానంబు సేయుచు, భగవంతుం
డయిన రథాంగపాణియంగసంగంబున విగతకల్మషు లై, [2]విధిశాపసాగరంబు
హరిదయాకటాక్షం బను నావచేతం దరించి, స్వరూపంబులు ధరించి, కృష్ణునకుఁ,
దల్లిదండ్రులకు వందనం బాచరించి, గగనపథంబున నిజస్థానంబున కరిగి; రంత.

క. ''చచ్చిన బాలురఁ గ్రమ్మఱఁ-దెచ్చుట గడుఁ జిత్ర'' మనుచు దేవకి మదిలో
[3]నచ్చెరువడి, యిది యంతయు-నచ్చపు హరిమాయ గాక! యని తలఁచె; నృపా!

క. పరమాత్ముఁ డఖిలజగదీ-శ్వరుఁ డగు కృష్ణుండు సేయు సత్కృత్యంబుల్
పరికింప నెన్నఁ బెక్కులు-ధరణీవర!'' యనిన రాజు దా ముని కనియెన్.

సుభద్రా పరిణయము

సీ. ''మునినాథ! పార్థుండు వనజనాభుని సహోదరి సుభద్రను నే విధమునఁ బెండ్లి
యయ్యెను? నావిధం బంతయు నాకును దెలియంగ నెఱిఁగింపు; ధీవిశాల!''
యనవుడు నా వ్యాసతనయుఁ డాతనిఁ జూచి ''వినవయ్య! నృప! దేవవిభునిసుతుఁడు
మును తీర్థయాత్రాసముత్సుకుం డై చని, రమణఁ బ్రభాసతీర్థమున నుండి

తే. యా తలోదరితోడి నెయ్యంబు కలిమిఁ
జూడఁ గోరుచు 'రాముండు సుందరాంగిఁ
గౌరవేంద్రున కీ సమకట్టె' ననుచుఁ
దనకు నెఱుఁగ రా, నా పురందరసుతుండు. 1165

వ. ఇట్లు సుభద్రాదర్శనోత్సాహంబు దన మనంబున సందడిగొనం, ద్రిదండివేషంబు
ధరియించి, ద్వారకాపురంబునకుం జనుదెంచి, యప్పౌరజనంబులు భక్తి

1. తల్లి. 2. బ్రహ్మశాపము అను సముద్రము. 3. ఆశ్చర్యమును పొంది.

స్నేహంబుల ననిశంబుఁ బూజింపఁ, దనమనోరథసిద్ధి యగునంతకుం గనిపెట్టు
కొని, వానకాలంబు నను నంతయు నప్పురంబున నుండు సమయంబున. 1166

క. రాముఁడు [1]తత్కపటాకృతిఁ-గా మదిఁ దెలియంగ లేక, పగ నొకనాఁ డా
భూమీవరతాపసుఁ బో-రామిం గని, యాత్మమందిరమునకుఁ దెచ్చెన్. 1167

ఆ. తెచ్చి భిక్షసేయ, దేవేంద్రతనయుండు-గుడుచుచుండి, యచటఁ గోరి మెలఁగు
నసమబాణమోహనాస్త్రంబుకై వడి,-నిరవమోహిని నవ విహారశీల. 1168

వ. అట్లు సుభద్ర విహరించుచున్న సమయంబున. 1169

చ. జలరుహపత్రనేత్రననుసంభవ, చారువధూలలామ, స
ల్లలితవిహారవిభ్రమవిలాసము లాత్మకు విందు సేయ న
బ్బలరిపునందనుండు గని, భావజసాయకజాడ్యమానవి
హ్వాలహృదయాబ్జుఁ డై నిలిపె నత్తరుణీమణియందుఁ జిత్తమున్. 1170

ఉ. ఆ తరుణీశిరోమణియు నర్జును, నర్జునచారుకీర్తివి
ఖ్యాతుని, నింద్రనందను, నకల్మషమానసుఁ, గామినీమనో
జాతునిఁ జూచి, పుష్పశరసాయకజర్జరితాంతరంగ యై
భీతిలి యుండె, సిగ్గు మురిపెంబును మోహముఁ దేఱు చూపులన్. 1171

వ. అట్లానృపసత్తమయుత్తకాశిను లొండొరులచిత్తంబులు చిత్తజాయత్తంబు లై
కోర్కులు దత్తఱింపం, [2]దాల్ములు పీడ, సిగ్గునం జిట్టుముట్టాడుచున్న యంత
నొకనాఁడు దేవతామహోత్సవనిమిత్తం బ[3]త్తలోదరి పురంబు వెలుపలికి నరుగు
దెంచిన, నర్జునుండు దేవకీవసుదేవులయనుమతంబు వడసి, తానును దోడన
చని, యప్పుడు. 1172

సీ. సాంద్రశరచ్చంద్రచంద్రికాస్ఫూర్తిచే రాజిల్లు పూర్ణిమా[4]రజనిపోలెఁ,
బూర్ణేందుబింబాపతీర్ణ మై యిలమీఁద భాసిల్లు హరిణడింభంబుఁబోలె,
సులలితమేఘమండలమును నెడఁబాసి వసుధఁ [5]గ్రుమ్మరు తటిద్వల్లిపోలె,
మాణిక్యరచితసన్మహితచైతన్యంబు వొందిన పుత్తడిబొమ్మపోలె,

తే. లలితవిభ్రమరుచికళాలక్షణములఁ-బొసఁగ రూపైన శృంగారరసముఁబోలె
నర్థిఁ జరియించుచున్నపద్మాయతాక్షిఁ,-బ్రకటసద్గుణభద్ర, సుభద్రఁ జూచి.

వ. అప్పుడు డాయం జని, యరదంబుపై నిడికొని పోవుచుండఁ గనుంగొని, యదు
బలంబులు మదంబున నంటం దాఁకిన, నప్పు డయ్యాఖండలనందనుండు
ప్రచండ గాండీవకోదండనిర్ముక్తకాండంబులం దూలించి, యఖండబాహుదండ

---

1. వానియొక్క మాయాస్వరూపమును. 2. ఓర్పులు. 3. సన్నని నడుము గలది. 4. రాత్రి.
5. మెలఁపుతీఁగ.

విజయప్రకాండుం డై పాండవప్రస్థపురంబున కరిగె; నట బలభద్రుండు దద్వార్త
విని, విలయసమయసమీరసఖునికై వడిం బటురోషభీషణాకారుం డై క్రోధించి
నం గని, కృష్ణుం డాదిగాంగల బంధుజనంబు లతనిచరణంబులకుం బ్రణమిల్లి,
మృదుమధురభాషణంబుల ననునయించి, యొడంబడునట్లుగా నాడిన నతండును
సంతుష్టుం డయి, మనంబునం గలంక దేఱి, యప్పుడు. 1174

క. కరులం, దేరుల, నుత్తమ-హరులన్, మణిహేమభూషణాంబరభృత్యో
త్కరదాసికాజనంబుల-[1]నరణంబుగ నిచ్చి పంపె ననుజకుం బ్రీతిన్. 1175

వ. ఇట్లు కృష్ణున కభిమతంబుగా నర్జునసుభద్రల కరణం బిచ్చి, పంపె'' నని శుక
యోగీంద్రుండు మఱియు ని ట్లనియె. 1176

శ్రీకృష్ణుండు ఋషిసమేతుం డయి మిథిలానగరమునకుం బోవుట

సీ. ''నరనాథ! విను భువనప్రసిద్ధంబుగ దీపించునట్టి విదేహదేశ
మందు, భూకాంతకు నాననదర్పణం బనం దనర్చిన మిథి లనుపురమునం
గలండు శ్రీహరిపాదకంజాతభక్తుండు, గళితరాగాదివికారుం, డమల
చరితుం, డక్రోధుండు, శాంతుండు, నిగమార్థకోవిదుం డగు శ్రుతదేవుం డనెడి
తే. భూసురోత్తముం డొకం; [2]డనిచ్ఛాసమాగ-తంబుతుష మైన హేమశైలంబుగాంగం
దలంచి, పరితోషమందుచుం దనగృహస్థ-ధర్మమున నుండె సముచితకర్ముం డగుచు.

ఉ. ఆపురి నేలువాండు బహుళాశ్వుండు నా నుతి కెక్కినట్టి ధా
త్రీపతి యా ధరాసురునిరీతిని నిష్కలుషాంతరంగుం డై,
యే పనులందు ధర్మగతి నేమఱ కర్థిం జరించుచుండె; ల
క్ష్మీపతి వారిపైం గరుణ సేసి ప్రసన్నముఖాంబుజాతుం డై. 1178

వ. అట్లు కృష్ణుండు వారలం జూచువేడ్క నిజస్యందనారూఢుం డయి, నారద
వామదేవాత్రికృష్ణరామాసితారుణదివిజగురుకణ్వమైత్రేయచ్యవను
లును, నేనును మొదలైన మును లనుగమింపం జనుచుం, దత్తద్దేశనివాసు
లగు నానర్తధన్వకురుజాంగలవంగమత్స్యపాంచాలకుంతిమధుకేకయకౌసలాది
భూవరులు వివిధవస్తుప్రచయంబులు గానిక లిచ్చి సేవింప, గ్రహమధ్యగతుం
డై దీపించు సూర్యునిం బోలి యప్పుండరీకాక్షుండు మందస్మితసుందర
వదనారవిందుం డగుచు వారలం గరుణార్ద్రదృష్టిం జూచి, యోగక్షేమంబు
లరసి, సాదరభాషణంబుల నాదరించుచుం, [3]గతిపయప్రయాణంబులం జని చని,
విదేహనగరంబు డాయం జనుటయు నా బహుళాశ్వుండు నమ్మాధవు రాక విని,
మనంబున హర్షించుచు వివిధపదార్థంబులు గానికలుగాం గొని, తానును,
శ్రుతదేవుండును నెదురుగాం జనుదెంచి, యప్పుడు. 1179

1. కానుక, కట్నము. 2. కోరకయే లభించినది. 3. కొన్ని ప్రయాణములు.

ఉ. ఆ మునికోటికిన్ వినయ మారఁగ వందన మాచరించి, యా
రామరసాభలోచనుఁ, డుదారచరిత్రుఁడు, పాపగోత్రసు
త్రాముఁడు, భక్తలోకశుభదాయకుఁ డైన రమేశు సద్గుణ
స్తోముని పాదపద్మములు సోఁకఁగ మ్రొక్కి, వినమ్రుఁడై తగన్. 1180

చ. కరములు మోడ్చి, "యో పరమకారుణికోత్తమ! నీవు, నీ ముని
శ్వరులును మద్గృహంబునకు వచ్చి, మముం గృప సేసి, యిచ్చలం
గర మనురక్తిఁ బూజనలు గైకొనుఁ" డంచు నుతించి వేఁడ నా
హరి మనమందు వారివినయంబుల కెంతఁ బ్రమోద మందుచున్. 1181

చ. తిరముగ వారియిష్టములు దీర్పఁ దలంచి, మురాసురారి యొం
డొరుల కెఱుంగకుండ [1]మునియూథముఁ, దానును నేఁగె వారిమం
దిరముల కేకకాలమున; ధీరత నా ధరణీవరుండు వా
రిరుహదళాయతాక్షు, మునిబృందములం గనకాసనంబులన్. 1182

సీ. కూర్చుండ నియమించి, కొమరారు కాంచనకలధౌతకలశోదకములచేతఁ
పాదముల్ గడిగి, తత్పావనజలములు దానును, సతియును, బాంధవజనంబుఁ
గర మర్థి నిజమస్తకంబుల ధరియించి, వివిధార్చనములు సద్విధి నొనర్చి,
మణిభూషణాంబరమాల్యానులేపనరాజితధూపనీరాజనములు

తే. భక్తిఁ గావించి, పరిమృష్టబహువిధాన్న-పాయసాపూప పరిపక్వఫలము లోలి
నారగింపఁగఁ జేసి, కర్పూరమిళిత-లలితతాంబూలములు నెయ్య మలర నొసఁగె.

వ. ఇట్లు సమర్పించి, యనంతరంబ యమ్మిథిలేశ్వరుం డైన జనకుండు పరమానందం
బును బొంది. 1184

చ. హరిపదపద్మయుగ్మము నిజాంకతలంబునఁ జేర్చి, యొత్తుచుం
"బురుషవరేణ్య! యీ నిఖిలభూతగణావలియాత్మలందు సు
స్థిరమతిఁ [2]గర్మసాక్షివి; సుధీవర! నీ పదభక్తకోటితో
నరయ నుమాధినాథచతురాస్యులుఁ బోల రటందు వెప్పుడున్. 1185

వ. అట్టి లోకవిదితం బయిన భవద్వాక్యంబు నిక్కంబుగా భవదీయపాదారవిందంబు
లందు నొకానొక వేళ లేశమాత్రధ్యానంబు గల నాగృహంబున కకించనుండని
చిత్తంబునం దలంపక, భక్తవత్సలుండ వగుటం జేసి విజయంచేసితివి; భవ
త్పాదపంకేరుహసేవారతిం దగిలిన మహాత్ములు [3]త్వద్ధ్యానంబు వదలం జాలు
దురే? నిరంతరంబును శాంతచిత్తులై నిష్కించను లైన యోగీంద్రులకు నీ
వలనం గోరిక గలవారలకు నిన్నైన నిత్తువు గదా!" యని వెండియు నిట్లనియె.

1. మునుల సముదాయము. 2. సకలకార్యములకును సాక్షిగానుండువాఁడు, చూచువాఁడు.
3. నీయొక్క ధ్యానము.

తే. "కృష్ణ! పరమాత్మ! యదుకులక్షీరవార్ధి-పూర్ణచంద్ర! దేవకీపుత్ర! సుజన
వినుత! నారాయణ! యచ్యుత! దేవదేవ!-భక్తజనపారిజాత! యశేష! పరమపురుష!

ఉ. శ్రీపురుషోత్తమాఖ్య! యదుసింహకిశోరక! భక్తలోకర
క్షాపరతంత్ర! నీవు, మునిసంఘముఁ గొన్ని దినంబు లుండవే;
నీపదపద్మరేణువులు నెమ్మి మదీయగృహంబు సోఁకినం
దాపసవంద్య! యే నిపుడ ధన్యుఁడ నయ్యెదఁ గాదె? మాధవా!" 1188

వ. అని యభ్యర్థించినఁ బ్రసన్నుం డై, యప్పుండరీకాక్షుండు నిఖిలకులప్రదీపకుం
డైన జనకచక్రవర్తిం గరుణించి, యమ్మిథిలానగరంబునఁ బౌరజనంబులకు
నున్నత శోభనంబులు గావించుచుం గొన్ని దినంబు లుండె; నంత. 1189

మ. శ్రుతదేవుండును మోదితాత్ముఁడై మునిజనస్తోమంబుతో నిందిరా
పతిఁ దోకొంచు నిజాలయంబునకు నొప్పన్నేఁగి, యచ్చోట స
మ్మతి [1]దర్భాస్తరణంబుల న్నునిచి, సమ్యగ్జ్ఞానపారీణుఁ డై
సతియుం దానుఁ బదాబ్జముల్ గడిగి, చంచద్భక్తిఁ దత్తోయముల్. 1190

చ. శిరములఁ దాల్చి; నవ్యతులసీదళదామకుశప్రసూనవి
స్ఫురదరవిందమాలికలఁ బూజ లొనర్చి, [2]గృహాంధకూపసం
చరణుఁడ నైన నాకడకుఁ జక్రి దనంతనె వచ్చునట్టు సు
స్థిరమతి నే తపంబు మును సేసితినో యని సంతసించుచున్. 1191

తే. మఱియుఁ దత్పాదతీర్థంబు మందిరమునఁ-గలయఁ జిలికించి, సంప్రీతిఁ గడలుకొనఁగఁ
బత్రఫలపుష్పతోయముల్ భక్తి నొసఁగి-హరి మురాంతకుమూర్తి నిజాత్మ నిలిపి.

తే. మానితంబుగ విశ్వనిదానమూర్తి-యైన కృష్ణుండు దనయింట నారగించెఁ
దనమనోరథసిద్ధియుఁ దనకు నబ్బె-ననుచుఁ బై [3]పుట్ట మల్లార్చి యాడుచుండె.

చ. తరుణియుఁ దానుఁ బుత్రులుఁ బదంపడి కృష్ణు భజించుచుండి, త
చ్చరణము లంకపీఠమునఁ జాఁచిన మెల్లన యొత్తుచుం, రమా
వరుఁ గని పల్కె "భక్తజనవత్సల! మామకభాగ్య మెట్టిదో?
హరచతురాస్యులు న్నెఱుఁగనట్టి నినుం గనుఁగొంటి నెమ్మితోన్. 1194

క. మునియోగిమానసస్ఫుట-వనజంబుల [4]నెల్లప్రొద్దు వర్తించు భవ
ద్ఘనదివ్యమూర్తి నాలో-చనగోచర మయ్యెఁ గాదె? సర్వాత్మ! హరీ! 1195

వ. దేవా! నీసచ్చరితంబులు గర్ణరసాయనంబులుగా నాకర్ణించుచు, నీకుం బూజ
లొనర్చుచు, నీచరణారవిందంబులకు వందనంబులు సేయుచు, నీ దివ్యనామ

1. దర్భతోఁ జేయఁబడిన చాపలు. 2. గృహము అను చీఁకటిబావియందుఁ దిరుగుచున్న
వాఁడ నైన. 3. వస్త్రమును ఎగురవేయుచు. 4. సర్వకాలములందును.

సంకీర్తనంబులు సేయుచుం దమ శరీరంబులు భగవత్సదనంబులుగా వెలుంగు నిర్మల బోధాత్ములగువారి చిత్తంబు లను దర్పణంబులం గానంబడుచుండుదు; కర్మ విశిష్టచిత్తులైనవారి హృదయంబుల నుండియు, దూరగుండ నగుదు” నని మఱియు నిట్లనియె. 1196

సీ. “నిను మ్రొక్కెదఁ గృష్ణ! నిగమాంతసంవేద్య! లోకరక్షక! భక్తలోకవరద!
నీ పాదసేవనవిరతుని నన్ను సేవనిం బంపె; దాన శ్రీ”మునినిఁ గృష్ణుఁ
డెలనవ్వు మోమునఁ జెలువొంద, నా విప్రకర మాత్మకరమునఁ గదియఁ జేర్చి,
పాటించి యతనితోఁ బలికెఁ; “దపశ్శక్తి నలిలిన యమ్మునివర్యు లెప్పుడుఁ

తే. దమపదాంబుజరేణువితానములను-దవిలి, లోకంబులను [1]బవిత్రంబు సేయు
వారు నన్నుఁ గూడి, యెప్పుడు వలయునెడల-కరుగుదెంతురు; నీభాగ్యగరిమ నిటకు.

వ. చనుదెంచిరి; పుణ్యస్థలంబులును, విప్రులును, దేవతలును సంస్పర్శనదర్శనార్చనంబులం బ్రాణులను సమస్తకిల్బిషంబులం బాయం జేయుదు; రది యునుం గాక, బ్రాహ్మణుండు జననమాత్రంబున జీవకోటియందు ఘనుం డై యుండు; జపతపోధ్యానాధ్యయనాధ్యాత్మలం [2]జతురుం డై, మత్కళాశ్రయుం డయ్యెనేని, నతం డుత్తముం డై వెలుంగు; నతనిం జెప్ప నేల?” యని వెండియు నిట్లనియె. 1198

క. “నా మది విప్రులపైఁ గల-ప్రేమము నా తనువునందుఁ బెట్టనికతనన్
భూమీసురు లర్హులు; నీ-వీ మునులం బూజ సేయు [3]మిద్ధచరిత్రా! 1199

క. ఇదియే నాకిష్టము; ననుఁ-బదివేలవిధంబు లొలయ భజియించుటగా
మది కిం పగు; నటు గావున-వదలని భక్తిన్ భజింపు వసుధామరులన్.” 1200

క. అని సర్వలోకవిభుఁ డగు- వనజోదరుఁ డానతిచ్చు వాక్యంబుల జా
డన భూమీసురుఁ డమ్ముని-జనులకు సద్భక్తిఁ బూజ సలిపెన్ వరుసన్. 1201

చ. ఎనయఁగఁ గృష్ణుఁ డంత మిథిలేశ్వరభూసురులం గృపావలో
కన మొలయ న్ననూనసుభగస్థితిఁ బొందఁగఁ జేసి, వారి వీ
డ్కొని, రథ మెక్కి, దివ్యమునికోటియుఁ దానును వచ్చెఁ గ్రమ్మఱన్
జనవర! మోక్షదం బగు [4]కుశస్థలికిం బ్రమదాంతరంగుఁ డై.” 1202

శ్రుతిగీతలు

వ. అని చెప్పిన బాదరాయణికి నభిమన్యునందనుం డి ట్లనియె: “మునీంద్రా! ఘటపటాదివస్తుజాతంబుభంగి [5]నిర్దేశింప నర్హంబు గాక, సత్త్వాదిగుణశూన్యం

1. పావనము 2. నేర్పుగలవాఁడు. 3. శ్రేష్ఠమయిన నడవడికలవాఁడా! 4. ద్వారక.
5. తెల్పుటకు.

బైన బ్రహ్మంబునందు సత్త్వాదిగుణగోచరంబు లైన వేదంబు లేక్రమంబున
వర్తించు; నట్టిచందంబు నా కెఱింగింపు” మనిన భూవరునకు మునివరుం
డిట్లనియె: “సకలచేతనాచేతనాంతర్యామి యైన సర్వేశ్వరుండు సర్వశబ్ద
వాచ్యుండు గావున సకలజంతునివహంబులకు బుద్ధీంద్రియమనఃప్రాణశరీరంబు
లను సృజియించి, చేతనవర్గంబునకు జ్ఞానప్రదుం డగుం గావున, సకలనిగమ
సమూహంబులును దత్స్వరూపగుణవైభవప్రతిపాదకంబులు గావున ముఖ్యం
బై ప్రవర్తించు; శ్రుతిస్తోత్రం బుపనిషత్తుల్యంబు; ననేకపూర్వఋషిపరంపరా
యాతంబును నైన దీనిని శ్రద్ధాయుక్తుం డై యెవ్వం డనుసంధించు, నతనికి
మోక్షంబు సులభంబు; దీనికి నారాయణాఖ్యాతం బగు నొక్కయుపాఖ్యానంబు
గలదు; వినిపింతు వినుము: భగవత్ప్రియుం డైన నారదుం డొక్కనాఁడు
నారాయణాశ్రమంబునకుం జని, ఋషిగణసమేతుం డైన నారాయణఋషిం
గనుంగొని, నీవు నన్నడిగినట్ల యమ్మహాత్ముని నడిగిన, నతండు ము న్నీయ
ర్థంబు శ్వేతద్వీపవాసు లైన సనకసనందనాదిదివ్యయోగీంద్రులు ప్రశ్న సలి
పిన, వారలకు సనందనుండు సెప్పిన ప్రకారంబు నీ కెఱింగించెద నని చెప్పం
దొడంగె; శయానుం డైన రాజశ్రేష్ఠునిఁ దత్పరాక్రమదక్షతాచిహ్నంబులను
నుతియించు వందిజనంబులచందంబున జగదవసానసమయంబున ననేకశక్తి
యుతుం డై, యోగనిద్రావశుం డైన సర్వేశ్వరుని వేదంబులు స్తోత్రంబు
సేయు విధంబు నారాయణుండు నారదునకుం జెప్పిన తెఱంగున విను” మని
యి ట్లనియె. 1203

సీ. “జయజయ! హరి! దేవ! సకలజంతువులకు జ్ఞానప్రదుండవు; గాన వారి
వలన దోషంబులు గలిగిన సుగుణసంతానంబుగాఁ గొని, జ్ఞానశక్తి
ముఖ్యషడ్గుణపరిపూర్ణతఁ జేసి, మాయాత్మ విశిష్టుండ వగుచుఁ, గార్య
కారణాత్మకుఁడ వై, కడఁగి చరించుచు నున్న నీయందుఁ బయోరుహాక్ష!
తే. తివిరి [1]యామ్నాయములు ప్రవర్తించుఁగాన,
ప్రకటత్రిగుణాత్మకం బైన ప్రకృతితోడి
యోగ మింతయు మాన్పవే; యోగిమాన
సాంబుజాత[2]మధువ్రత!” యని నుతించి. 1204

వ. అదియునుం గాక. 1205

సీ. పరమవిజ్ఞానసంపన్ను లైనట్టి యోగీంద్రులు మహితనిస్తంద్రలీలఁ
బరిదృశ్యమాన మై భాసిల్లు నిమ్మహీపర్వతముఖరప్రపంచ మెల్లఁ
బరఁగ బ్రహ్మస్వరూపము గాఁగఁ దెలియుదు; రెలమి నీవును జగద్విలయవేళ
[3]నవశిష్టుఁడవు గాన, యనఘ! నీయందు నీ విపులవిశ్వోదయవిలయము లగు

1. వేదములు. 2. తుమ్మెదవంటివాఁడు. 3. మిగిలియుండువాఁడు.

తే. [1]ఘటశరావాదు లగు మృద్వికారములు [2]మృ-దాత్మకంబైనయట్లు పద్మాయతాక్ష!
తవిలి కారణరూపంబుఁ దాల్చి, లీలఁ-గడఁగు నీయందు బుద్ధివాక్కర్మములను.

క. అలవడఁ జేయుచు నందఱు-బలకొని, యిలఁ బెట్టఁబడినపదవిన్యాసం
బులు పతనకారణముగా-నలవున సేవించుచును, గృతార్థులు నగుచున్. 1207

క. లీలం బ్రాకృతపురుష-కాలాదికనిఖిల మగు జగంబుల కెల్లన్
మాలిన్యనివారక మగు-నీ లలితకథాసుధాబ్ధిని గ్రుంకి తగన్. 1208

చ. భరితనిదాఘతప్తుఁ డగు పాంథుఁడు శీతలవారిఁ గ్రుంకి, దు
ష్కర మగు తాపముం దొఱఁగుకైవడి, [3]సంసరణోగ్రతాపముల్
వెరవునఁ బాయుచుందురు; నిన్ను భజించుమహాత్మకుల్ జరా
మరణమనోగుణంబులఁ గ్రమంబునఁ బాయుట సెప్ప నేటికిన్? 1209

వ. అదియునుం గాక. 1210

సీ. అనయంబు దేహి నిత్యానిత్యసద్విలక్షణమునఁ, బంచకోశవ్యవస్థ
నభివృద్ధిఁ బొరయుచు, నందులోపల నున్న ప్రాణాన్నబుద్ధివిజ్ఞానమయము
లను చతుష్కోశంబు లవ్వల వెలుఁగొందు నానందమయుఁడవు గాన, దేవ!
సురుచిరస్వప్రకాశుండవు, నీపరిగ్రహము గల్గుటఁ జేసి కాదె? ప్రకృతి
తే. మహదహంకారపంచతన్మాత్రగగన-పవన తేజోంబుభూభూత[4]పంచకాది
కలితతత్త్వముల్ బ్రహ్మాండకార్యకరణ-మందు నెపుడు సమర్థంబు లగుటఁ జూడ.

క. కోరి శరీరులు భవదను-సారంబుల నిహపరైకసౌఖ్యంబులఁ బెం
పారఁగ నందుచు నుందురు-ధీరజనోత్తము లనంగ దివిజారిహరా! 1212

ఆ. నిన్ను ననుసరింప నేరని కుజనులు-[5]పవనపూర్ణచర్మభస్త్రిసమితి
యోజఁ జేయుచుందు; రుచ్ఛ్వాసనంబులు-బలసి యాత్మదేహభజను లగుచు.

సీ. దేవ! కొందఱు సూక్ష్మదృక్కు-లైనట్టి మహాత్మకు లుదరస్థుఁడైన వహ్ని
గా మదిఁ దలఁతురు; కైకొని మఱికొంద ఱారుణు లను పేర నమరఋషులు
లీల సుషుమ్నానాడీమార్గగతుఁడవై హృత్ప్రదేశమునఁ జరించుచున్న
రుచిదహరాకాశరూపిఁగా భావింతు; రట్టి హృత్పద్మంబునందు వెడలి,
తే. వితతమూర్ధన్యనాడికాగతుల నోలి
బ్రహ్మరంధ్రంబుఁ బ్రాపించి, పరమపురుష!
సుమహితానందమయపరంజ్యోతిరూపి
వైన నినుఁ బొంది, మఱి పుట్ట రవనియందు. 1214

1. కుండ, మూఁకుడు మొదలగునవి. 2. మట్టితో నుండునవి. 3. సంసారము. 4. పంచభూతములు, తన్మాత్రలు. 5. గాలిచే నిండిన తోలుతిత్తుల సముదాయము.

వ. మఱియు [1]వివిధకాష్ఠాంతర్గతుం డయిన పావకుండు తద్గతదోషంబునం బొరయక నిత్యశుద్ధుం డై, తరతమభావంబున వర్తించు చందంబున స్వసంకల్ప కృతంబులయిన విచిత్రశరీరంబులందు నంతర్యామి వై ప్రవేశించి, తత్తద్విచిత్ర కర్మానుగతంబై న హేయంబులం బొరయక, సకలాత్మసమంబై యేకరసం బై బ్రహ్మం బైన నిన్ను నైహికాముష్మికఫలసంగమంబు లేక విగతరజోగుణంబులు గలిగి, కొందఱు భజియించుచుందురు; ఇదియునుం గాక, దేవా! భవదీయ సంకల్పాధీనంబులయిన శరీరంబులం బ్రవేశించియున్న జీవసమూహంబు నీకు శేషభూతం బని తెలిసి, కొందఱు భవనివారకం బయిన శ్రీమత్త్వచ్చరణార విందంబులు సేవించి, కృతార్థు లగుదురు; మఱియును. 1215

సీ. అనఘ! దుర్గమ మైన యాత్మతత్త్వంబుఁ బ్రవర్తించుకొఱకు దివ్యంబు లైన
యంచితరామకృష్ణాద్యవతారముల్ భజియించి యున్న నీభవ్యచరిత
మను సుధాంభోనిధి నవగాహనము సేసి, విశ్రాంతచిత్తు లై వెలయుచుండి,
మోక్షంబు బుద్ధి నపేక్షింప నొల్లరు; మఱియుఁ గొందఱు భవచ్చరణపంక
ఆ. జములఁ దగిలి పుణ్యతము లైన హంసల-వడువు నొంది, భాగవతజనముల
నొనరువారు ప్రకటయోగిజనప్రాప్య-మైన ముక్తిఁ గోర రాత్మలందు. 1216

ఉ. కొందఱు నీ శరీరము లకుంఠితభక్తి భవద్వశంబు లై
చెందఁగ, నీపదాబ్జములు సేరి భజించుచుఁ, దత్సుఖాత్ము లై
యుందురు; కొంద ఱీ తనువు లొప్పి ధరించి, భవత్పదాబ్జముల్
పొందుగఁ గొల్వ లేక, యిలఁ బుట్టుచుఁ జచ్చుచు నుందు; రవ్యయా! 1217

చ. యమనియమాదియోగమహిమాత్మకు లైన మునీంద్రులున్, విరో
ధమునఁ దలంచు [2]చైద్యవసుధావరముఖ్యనృపుల్, ఫణీంద్రభో
గము లన నొప్పు బాహువులు గల్గిన నిన్ను భజించు గోపికల్,
క్రమమున నేమునుం సరియ కామె భవత్కృప? కంబుజోదరా! 1218

మ. అరవిందాక్ష! భవత్స్వరూప మిలఁ బ్రత్యక్షంబునం గాన నె
వ్వరికిం బోలదు; శాస్త్రగోచరుఁడ వై వర్తింతు; నీ సృష్టిముం
దర సద్రూపుఁడ వైన నీవలన నే [3]ధాత్రాద్యమర్త్యుల్ జనిం
చిరి; ని న్నంతకుము న్నెఱుంగఁ గలమే చింతింప నే? మచ్యుతా! 1219

వ. అట్టి నిన్నుఁ బరమాణుకారణవాదు లైన కణ్వగౌతమాదులును, బ్రకృతికారణ వాదు లయిన సాంఖ్యులును, దేహాత్మవాదు లయిన బౌద్ధులును వివిధంబు లైన కుతర్కంబులచేతం బరస్పరవ్యాహతంబు లైన మతంబులు దమతమ తర్క-

1. అనేక విధములయిన కట్టెలయందుండునట్టి యగ్ని. 2. శిశుపాలుఁడు మొదలగు రాజులు. 3. బ్రహ్మదేవుఁడు మొదలగు దేవతలు.

పాపంబుల నపహరించుచుండు, నిన్నుం దెలియ లేరు; మహాభాగ్యవంతు లయిన యోగీంద్రులకు నీవు ప్రత్యక్షం బైన, నీవి యన్నియు నసత్యంబు లనికానవచ్చు; రెండియుం గొంటఱు సచరాచరవస్తుజాతంబులకు నంతర్యామి వై, సర్వంబు నీవ యగుటం దెలియ లేక, నిత్యం బనియు, ననిత్యం బనియు వివేకబుద్ధిం దెలియుదురు; గాని, భవదీయదివ్యతత్త్వంబు నిక్కంబుగఁ దెలియం జాలరు; కొందఱు జగచ్ఛరీరుండవు గాన, జగద్రూపకుండ వైన నిన్నుఁ [1]కటకమకుట కర్ణికాదివివిధభూషణభేదంబులం గనకంబు నిజస్వరూపంబు విడువక వర్తించు చందంబున జగద్వికారానుగతుండ వయ్యును, నిఖిల హేయప్రత్యనీకకల్యాణ గుణాత్మకుండ వై యుండు వని యాత్మవిదు లయినవారు దెలియుదురు; కడి యునుం గాక, 1220

మ. వనజాతాక్ష! భవత్పదాబ్జయుగసేవాసక్తు లైనట్టియ
జ్జనముల్ మృత్యుశిరంబుఁ దన్ని, ఘనసంసారాంబుధిం దాఁటి, పా
వను లై, లోకములుం బవిత్రములు గా వర్తించుచున్, నిత్యశో
భన మై యొప్పెడి ముక్తిఁ బొందుదురు శుంభద్దైవభావోపేతు లై. 1221

మ. మిము సద్భక్తి భజింప నొల్ల, కిల [2]దుర్మేధం బ్రవర్తించు నీ
చమతివ్రాతము, నేర్పునం బసులఁ బాశశ్రేణి బంధించు చం
దమునం బెక్కగునామరూపములచేతన్ వారి బంధించి, దు
ర్గమసంసారపయోధిఁ ద్రోతువు; దళత్కంజాతపత్త్రేక్షణా! 1222

వ. దేవా! కర్మమూలంబు లయిన పాణిపాదంబులు లేనివాఁడ వయ్యును, స్వతంత్రుఁడవు గావున, బ్రహ్మాదులు భవత్పరతంత్రు లై యుండుదురు; స్థిరచరరూపంబులు గల చేతనకోటికి నీవు సర్వవిధనియంతవు గావున, నీకృపావలోకనంబు గలవారికి మోక్షంబు కరస్థితం బై యుండు; భవత్కృపావలోకనంబు లేని కష్టాత్ములు దుర్గతిం గూలుదురు; దట్టిజీవులు దేవతిర్యఙ్మనుష్యస్థావరాదిశరీరంబులు సొచ్చి, యణురూపు లై యుండుదు; రందును నీ వుండు వంతరాత్మ వగుచు; మఱియును.

క. మదిఁ దలపోయఁగ [3]జలబు-ద్బుదములు ధరఁ బుట్టి పొలియుపోలికఁ గల యీ
త్రిదశాది దేహములలో-వదలక వర్తించు నాత్మవర్గము నోలిన్. 1224

ఆ. ప్రళయవేళ నీవు భరియింతు వంతయుఁ-గారణంబ వగుటఁ గమలనాభ!
భక్తపారిజాత! [4]భవభూరితిమిరది-నేశ! దుష్టదైత్యనాశ! కృష్ణ! 1225

చ. అనఘ! జితేంద్రియస్ఫురణు లయ్యును, జంచల మైన మానసం
బను తురగంబు బోధమహితాత్మవివేకపుసూత్రిత్రాట న

1. కంకణములు, కిరీటములు, కమ్మలు. 2. దుర్బుద్ధితో. 3. నీటిబుగ్గలు. 4. సంసారము అను గొప్ప చీకటికి సూర్యునివంటివాఁడా!

ల్లన కడిమిం గఁ బట్టను దలంచుచు; ముక్తి కుపాయలాభ మే
యనువున లేమికిఁ జిక్కి వగల నందెడు నాత్ముఁడు వో; తలంపఁగన్. 1226

చ. గురుపదపంకజాతములు గొల్వని శాలబుద్ధి మహాబ్ధిని
స్తరణకుఁ [1]గర్ణధారరహితం బగు నావను సంగ్రహించు జే
హరిగతి భూరిదుస్తరభవాంబుధిలోన మునుంగుచుండు; రం
బురుహదళాక్ష! నీవు పరిపూర్ణుఁడ వై తనరారఁగా నొగిన్. 1227

తే. పుత్రదారగృహక్షేత్రభూరివిషయ-ఘనసుఖాసక్తుఁ డగుచు నే మనుజుఁ డేని
నర్థిఁ జరియించు, వాఁడు భవాబ్ధిలోనఁ-జెంది, యెన్నాళ్లకును దరిఁ జేర లేఁడు.

సీ. జగతిపై బహుతీర్థసదనంబు లనఁ గల్గి పుణ్యానువర్తనస్ఫురితు లగుచుఁ,
బాటించి నీయందు బద్ధమత్సరములు లేక, [2]భక్తామరానోకహంబ
వగు భవత్పాదాబ్జయుగళంబు సేవించి, భవపాశముల నెల్లఁ బాఱఁదోలి,
సమమతు లై యదృచ్ఛాలాభతుష్టి మేదసమముగాఁ గైకొని, సాధు లగుచుఁ

తే. బాదతీర్థంబు గల మహాభాగవతజ
నోత్తమోత్తము లైనట్టి యోగివరుల
వార కెప్పుడు సేవించువాఁడు వొందుఁ
బ్రవిమలానందమయ మోక్షపదము; మఱియు. 1229

వ. 'సత్త్వైనప్రకృతివలన నుత్పన్నం బైనయీజగత్తు సత్తు గావలయు; నది యెట్లని
నం, గనకోత్పన్నంబు లైన భూషణంబులు కనకమయంబు లయి కానంబడు
చందంబున' నని సాంఖ్యుండు పలికిన విని, యద్వైతవాది యిట్లను; నెయ్యది
యుత్పన్నంబు గాఁ దది సత్తును గాదను వ్యతిరేకవ్యాప్తినియమంబు నిత్య
సత్యం బైన బ్రహ్మంబునందుఁ దర్కహతం బగుఁ; గావునం బ్రపంచంబు
మిథ్య యని నిరూపించిన, నా ప్రపంచంబు బ్రహ్మావిశేషణం బై కార్యకారణా
వస్థలు గలిగి యున్న యంతమాత్రంబున మిథ్య గా నేర; దా ప్రపంచంబునకుఁ
గార్యకారణావస్థలు నిత్యంబులు; గావున, నవస్థాద్వయయుక్తం బయిన ప్రపం
చంబు నిత్యం బనిన, వెండియు నద్వైతి యిట్లను; బహుగ్రంథప్రతిపాదితం
బయిన జగన్మిథ్యాత్వంబు లేమి యెట్లనిన నదియునుం గర్మవశు లైన జడుల
నవిద్యాప్రతిపాదకం బైన కుతర్కసమేతం బైన [3]భారతి, యంధపరంపరా
వ్యవహారంబునం జేసి, భ్రమియించుఁ; గారణావస్థయందును బ్రహ్మావిశేషణం
బైన సూక్ష్మరూపంబునం బ్రపంచంబు సత్తై యుండు; సత్యంబు బాధా
యోగ్యంబు గావున, నీకు శేషం బయి యుండుఁ; గావున నీవు దేహగతుం
బైన దేహియందు నంతర్యామి వయ్యుం, గర్మఫలంబులం బొరయక కర్మఫల

1. ఓడనడుపువాఁడు లేని ఓడను. 2. భక్తులకుఁ గల్పవృక్షమువంటివాఁడు. 3. సరస్వతి.

భోక్తయైన జీవునకు సాక్షిభూతుండ వై యుందు; వట్టి నిన్ను నజ్ఞులైన మానవులు నిజకంఠలగ్నం బయిన [1]కంఠికామణి నిత్యసన్నిహితం బై వెలుంగుచుండినను, గానక వర్తించు తెఱంగున, హృదయపద్మమధ్యంబున ననంత తేజోవిరాజమానుండవై ప్రకాశించు నిన్నుం దెలియలేరు; సకల బ్రహ్మాండనాయకుండవైన నీయందు శ్రుతులు ముఖ్యవృత్తిం బ్రవర్తించు"నని శ్రుత్యధిదేవతలు నారాయణు నభినందించిన తెఱంగున సనందనుండు మహర్షుల కెఱింగించిన ప్రకారం బని నారాయణర్షి నారదునకుం జెప్పిన, నమ్మహాత్ముండు మజ్జనకుండైన వేదవ్యాసమునీంద్రునకు నుపన్యసించె; నయ్యర్థంబు నతండు నాకుం జెప్పినవిధంబున నీకుం జెప్పితి; ఈ యుపాఖ్యానంబు సకలవేదశాస్త్రపురాణేతిహాససారం; బుపనిషత్తుల్యంబు; దీనిం బఠించువారును, వినువారును విగతకల్మషులై యిహపరసౌఖ్యంబుల నొంది వర్తింతు"రని చెప్పిన శుకయోగీంద్రునకు రాజేంద్రుం డిట్లనియె. 1230

### పరీక్షిత్తునకు శుకయోగి విష్ణుసేవాప్రాశస్త్యంబు సెప్పుట

మ. "మునినాథోత్తమ! దేవమానవులలో ముక్కంటి సేవించు వా
రనయంబున్ బహువస్తుసంపదల సౌఖ్యానందులై యుండ, న
వ్వనజాతాక్షు రమామనోవిభుని శశ్వద్భక్తి సేవించు స
న్మునివర్యుల్ గడుఁ బేద లౌటకుఁ గతంబున్ నా కెఱింగింపవే!" 1231

సీ. నా వుఁడు శుకయోగి నరనాథుఁ గనుఁగొని, "విను మెఱింగింతుఁ దద్విధము దెలియ;
ఘనశక్తిసహితుండు [2]కాలకంధరుఁడు; దా, వినుతగుణత్రయాన్వితుఁడు గాన,
రాగాదియుక్తమై రాజిల్లు సంపద లాతనిఁ గొలుచువా రందుచుండు;
రచ్యుతుఁ, బరము, ననంతు, గుణాతీతుఁ, బురుషోత్తముని, నాదిపురుషు, ననఘు
తే. నర్థి భజియించువారు రాగాదిరహితు-లగుచు దీపింతు రెంతయు; ననఘచరిత!
ధర్మనందనుఁ డశ్వమేధంబు సేసి-పిదప సాత్త్వికకథనముల్ ప్రీతితోడ. 1232

ఉ. నారదసంయమీంద్రువలనన్ వినుచుండి, యనంతరంబ పం
కేరుహనాభుఁ జూచి యడిగెం దగ నిప్పుడు నీవు నన్ను [3]నిం
డారినభక్తిమై నడిగినట్లు; యతండును మందహాసవి
స్ఫారకపోలుఁడై పలికెఁ బాండుతనూభవుతోడఁ జెచ్చెరన్. 1233

సీ. "వసుమతీనాథ! యెవ్వనిమీఁద నాకనుగ్రహబుద్ధి వొడము, నా ఘనునివిత్త
మంతయుఁ గ్రమమున నపహరించిన, వాఁడు ధనహీనుఁ డగుచు సంతాప మంద,
విడుతురు బంధు; లవ్విధమున నొంటరియై చేయునది లేక, యఖిలకార్య
భారంబు లుడిగి, మద్భక్తులతో మైత్రి నెఱపుచు, విజ్ఞాననిరతుఁ డగుచుఁ,

1. కంఠహారమునందలి రత్నము. 2. ఈశ్వరుఁడు, శివుఁడు. 3. సంపూర్ణమయిన భక్తితో.

తే. విడవ వాఁ డన్యమానంతపదముఁ దాత్మ-నెఱఁగ శ్రీవిష్ణులోకసంప్రాప్తి నొందుఁ;
గాన ముక్తిని మీఁదల మాపఁజాల రమహితు-నడరి భజియింతు రితర దేవతల నెప్పుడు.

క. సేవింప వారు దమకుం-గావించిన సేవనములు గని, నిజములుగా
భావించి, వారి మఱతురు-భావమునఁ [1]గృతఘ్నవృత్తి బని తమపనిగన్. 1235

క. మెలఁగుచు నుందురు; దీనికిఁ-గల దొకయితిహాస; మిప్పుడు గైకొని నీకుం
దెలియఁగఁ జెప్పెద; దానన-యలవడు నీ వడుగు ప్రశ్న కగు నుత్తరమున్.

శివద్రోహంబు సేయం బూనిన వృకాసురుండు విష్ణుమాయచే మడియుట

క. శకుఁ డను దైత్యునితనయుఁడు-వృకుఁ డనువాఁ డొకఁడు, దుర్వివేకుఁడు, సుజన
ప్రకరముల నలఁపఁ దెరువున-నొకనాఁ డదిగుండి, దివ్యయోగిం గనఁగన్.

వ. కనుంగొని. 1238

క. కరములు ముకుళించి "మునీ-శ్వర! నారద! లలితధీవిశారద! నన్నుం
గరుణించి యాన తీ శుభ-కరు లగుహరిహరహిరణ్యగర్భులలోనన్. 1239

ఆ. కడఁగి కొలువ శీఘ్రకాలంబులోనన-యిష్ట మైన వరము లిచ్చునట్టి
దైవ మెవ్వఁ?"డనిన దానవుఁ గనుఁగొని-మునివరుండు పలికె ముదముతోడ.

వ. "వినుము; దుర్గుణసుగుణంబులలో నొక్కటి మెచ్చుటం గలుగు, నచ్చుట నాతు
ణంబ కోపప్రసారఫలంబులు సూపువాఁ డమ్మహేశ్వరుఁ డందు ఫాలలోచనుం; డవ్వి
ధంబుఁ దెలిసినవారై బాణాసురదశకంధరులు సమగ్రభక్తియుక్తులై సేవించి,
యసమానసామ్రాజ్యవైభవంబుల నొంది, ప్రసిద్ధులై; రట్లు గాన, నీవు నమ్మ
హాత్ముని సేవింపు; మతనివలన నభిమతఫలంబులు వేగంబ ప్రాప్తం బయ్యెడు"
నని చెప్పిన నతం డాతుణంబ. 1241

సీ. దీపించు కేదారతీర్థంబునకు నేఁగి, యతిసాహసాత్మకుం డగుచు నియతి
లోకముల్ వెఱఁ గంద, నాకాలకంధరు, వరదుని, [2]నంబికావరునిఁ గూర్చి
తనమేనికండ లుద్దండుఁ డై ఖండించి, యగ్ని కాహుతులుగా నలర వేల్చి,
దర్పకారాతి ప్రత్యక్షంబు గా కున్న, జడియక సప్తవాసరమునందుఁ

తే. బూని, తత్తీర్థమునఁ గృతస్నానుఁ డగుచు-వెడలి మృత్యువుకో ఱనావెలయునట్టి
గండ్రగొడ్డంటఁ దనమస్తకంబు దునుము-కొనఁగఁ బూనిన, నయ్యగ్నికుండమునను.

క. అరుదుగ వెలువడి, రుద్రుఁడు-గరుణ దలిర్పంగ వానికర మాత్మకరాం
బురుహమునఁ బట్టి, "తెగువకుఁ-జోర వలవదు; మెచ్చు వచ్చె; సుమహితచరితా!

క. నీమదిఁ బొడమినకోరిక-లే మైనను వేఁడు; మిపుడ యిచ్చెద" ననినం
దా మనమున సంతసపడి-[3]యామనుజాశనుఁడు హరుపదాంబుజములకున్. 1244

1. చేసిన మేలు మఱచినవాని భావము. 2. ఈశ్వరుఁడు. 3. ఆ రాక్షసుఁడు.

తే. వందనం బాచరించి, "యో యిందుమకుట!-ఫాలలోచన! వరద!మహాత్మ!నీతలము
నేను నెవ్వనితలమీఁద నిడిన, వాఁడు-మస్తకము నూఱు వ్రయ్యలై మడియునీశ!"

క. అని వేఁడిన నమ్మాటలు-విని, [1]మదనారాతి నవ్వి, విబుధాహితుఁ గో
రిన వరముఁ దదయ నిచ్చెన్-దనుజుఁడు తద్వరపరీక్షఁ దాఁ జేయుటకున్. 1246

వ. ఆక్షణంబ వరదానగర్వంబున దుర్వృత్తుం డై కడంగి. 1247

క. ఆ హరుమస్తకమునఁ గర-సాహసమునఁ జేయి వెట్టఁ జడియక కదియన్,
"ఓహో! తన మెచ్చులు దన-కాహా! పై వచ్చె" ననుచు నభవుఁడు భీతిన్.

క. దనుజుఁడు దన వెనువెంటం-జనుదేఁ, ముల్లోకములును [2]సంత్రాసముఁ గై
కొని పాఱ, సురలు మనములఁ-దనికిరి దానికిని బ్రతివిధానము లేమిన్. 1249

వ. అట్లు చని చని. 1250

సీ. నిరుపమానంద మై, నిఖిలలోకములకు నవల దై, యమృతపదాఖ్యఁ దనరి,
దినకరచంద్రదీధితులకుఁ జొర రాక, సలలితసహజతేజమున వెలుఁగు
సమధికం బగు శుద్ధసత్త్వగరిష్ఠ మై, కర మొప్ప యోగీంద్రగమ్య మగుచు,
హరిపదధ్యానపరాయణు లైన తద్దాసుల కలరు నివాస మగుచుఁ,
తే. బ్రవిమలానంతతేజోవిరాజమాన-దివ్యమణిహేమకలితసందీప్తభవ్య
సౌధమండపతోరణస్తంభవిపుల-గోపురాదిభాసురము వైకుంఠపురము. 1251

వ. కనుంగొని, యమ్మహాస్థానంబు డాయం జనుటయు, నప్పుండరీకాక్షుం డఖండ వై భవంబునం గుండలీశ్వరభోగతల్పంబునం బరమానందకందళితహృదయార విందుం డై, యిందిరానయనచకోరకంబుల నిజమందహాససాంద్రచంద్రికా వితతిం దెల్పుచు, నార్తభక్తజనరక్షణంబు పనిగా మెలంగుచు, వివిధవినోదం బులం దగిలి యుండియు, ఫాలలోచనుం డద్దనుజపాలునకుం దలంపక యిచ్చిన వరంబు దనతలమీఁద వచ్చినం గలంగి చనుదెంచుట తన దివ్యచిత్తంబున నెఱింగి, యక్కాలకంధరునియవస్థ విచారింపఁ దలంచి, యయ్యిందిరాదేవి తోడి వినోదంబు సాలించి, యప్పుడు. 1252

సీ. తాపింఛరుచితోడఁ ద్రస్తరించెడు మేనుఁ, [3]బసిఁడిముంజియుఁ, దగుపట్టుగోకయు,
ధవళాంశురుచిజన్నిదంబును, దిన్నని దండంబుఁ, జేతఁ గమండలువును,
బసుపుగోఁచియుఁ, జిన్నిపట్టెవర్ధనమును, రాజితం బైన మృగాజినంబుఁ,
దూలాడుసిగయును, వ్రేలు మాఱటగోఁచి, వేలిమిబొట్టును, వ్రేళ్ల దర్భ
తే. దనర సందీప్తహవ్యవాహనసమాన-కాంతిఁ జెలువొంది, యద్భుతక్రమ మెలర్పఁ
జతురగతి నప్డు వటుకవేషంబు దాల్చి,-వచ్చి, యా నీచదానవవరునిఁ జేరి.

1. మన్మథునకు శత్రువు; శివుఁడు. 2. భయము. 3. బంగారు మొలత్రాడు.

వ. వైతవంబున నతనికి నమస్కరించి, వివిధమధురభాషణంబుల ననునయించుచు, నయ్యసురవరున కిట్లనుః "నిర్వేదంబున [1]మార్గపరిశ్రాంతుండ వై యింతదూరం బేల చనుదెంచితి? సకలసౌఖ్యకారణం బైన యీశరీరంబు నిరర్థకంబు సేసి, వృథాయాసంబున దుఃఖపడుపం డగునే? యిచ్చోటం గొంతదడవు విశ్రమింపు; నీ ప్రయాసంబునకుం గతం బెయ్యది? కపటహృదయుండవుగాక, నీ యధ్యవసాయం బెఱింగింపం దగునేని, నెఱింగింపు" మని మృదుమధురంబుగాఁ బలికిన, నమ్మహాత్ముని సుధారసతుల్యంబు లయిన వాక్యంబులు విని, సంతసిల్లి యప్పిశితాశనుండు దనపూనిన కార్యం బతని కెఱింగించిన. 1254

చ. హరి దరహాస మొప్పఁ [2]బిశితాశనుఁ గన్గొని పల్కె; "దానవే
శ్వర! మును దక్షుశాపమునఁ జాలఁ బిశాచిప తైట, సూనృత
స్ఫురణము మాలి, సంతతము బొంకుచు నుండు పురారిమాట నీ
వరయక, వెంట నేఁగఁ దగ; [3]దాతనిచేఁతలు మాకు వింతలే? 1255

ఆ. నిజము పలికెనేని నెఱిఁ దన తలమీఁద-నీకరంబు మోప నీక తలఁగి
వచ్చునోటు; నితనివలనఁ బ్రత్యయమునఁ-బగుల నేమి గలదు? దనుజవర్య!

ఆ. అశుచి యగుచు నతని నంటఁగఁ బని గాదు;-కాలుఁ జేయిఁ గడిగి, కడఁక వార్చి,
యతని వెంట వేడ్క నడుగుడువే నీవు-నవల నంటఁ దగును, నసురనాథ! 1257

మ. అతిదుశ్శంకలు మాని, ప్రోత్సహిన దైత్యారాతి మాయావిమో
హితుఁడై, విస్మృతి నొంది, తామసముచే నేపారి, వాఁ డాత్మపా
ణితలంబుల్ దననెత్తి మోపికొని, తా నేలన్ వెసం గూలె; వి
శ్రుతదంభోళిహతిన్ వడిం బడు మహాక్షోణీధరంబో యనన్. 1258

వ. అట్లు దనతల నూఱువ్రయ్యలై, నేలం గూలిన యసురం గని, యప్పుడు. 1259

క. సుర లసురాంతకుమీఁదన్-వరమందారప్రసూనవర్షము లోలిం
గురిసిరి; తుములంబై దివి-మొరసెన్ సురదుందుభిప్రముఖతూర్యంబుల్. 1260

క. పాడిరి గంధర్వోత్తము;-లాడిరి దివి నప్సరసలు; నన్యోన్యము లై
కూడిరి గ్రహములు; భయముల-వీడిరి మునికోటు లంత విమలచరిత్రా! 1261

క. మురహరుఁ డెలనవ్వొలయఁగఁ-బురహరుఁ దగఁ జూచిపలికె; "భూతేశ్వర! యీ
[4]నరభోజనుండు నీ కీ-త్తఱి నెగ్గొనరింపఁ దలఁచి, తానే పొలిసెన్. 1262

వ. అది యట్టిద కాదె? యిజ్జగంబున నధికుం డయినవానికి నపకారంబు గావించిన మానవునకు శుభంబు గలుగునే? యదియునుం గాక జగద్గురుండ వగు నీ కవజ్ఞ

1. త్రోవబడలికగలవాఁడవై. 2. మాంసము ఆహారముగాఁగలవాఁడు, రాక్షసుఁడు. 3. అతని చేష్టలు. 4. రాక్షసుఁడు.

దలంచు కష్టాత్ముండు "వారిచియుటం జెప్పనేల యిట్టి దుష్టచిత్తుల కిట్టివరంబు లిచ్చుట గర్జంబు గా"దని యప్పురాంతకుని వీడ్కొలిపిన; నతండు మురాంతకుని ననేక విధంబుల నభినందించి, నిజమందిరంబునకుం జనియె" నని చెప్పి యిట్లనియె.

క. "మానవనాయక! యీ యాఖ్యానంబుం జదువ, వినిన ఘనపుణ్యులు ని
త్యానందసౌఖ్యముల పెం-పూనుదు; రటమీఁద ముక్తి నొందుదు రెలమిన్."

వ. అని చెప్పి శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె. 1265

క. "జననాయక! యింకఁ [2]బురా-తనవృత్తం బొకటి నీకుఁ దగ నెఱిఁగింతుం;
వినుము; తపోమహిమలఁ జెం-దిన మునిజనములు సరస్వతీనదిపొంతన్. 1266

భృగుమహర్షి త్రిమూర్తుల ప్రాశస్త్యంబు శోధింపఁబోవుట

క. వితతక్రియ లొప్పఁగ స-త్క్రతువుల నొనరించు చచటఁ గైకొని "లక్ష్మీ
పతిభవపితామహులలో-నతులితముగ నెవ్వ రధికు" లని తమలోనన్. 1267

వ. ఇట్లు దలపోసి "తన్మహత్త్వం బంతయుం దెలిసి ర"మ్మని భృగుమహాముని నమ్ముువ్వురు వేల్పులకడకుం బంపిన, నత్తాపసోత్తముండు సని చని ముందట.

క. జలరుహసంజాతసభా-స్థలమున కొగి నేఁగి, యతనిసత్త్వగుణంబుం
దెలియుటకైనుతివందన-ములు సేయక యున్న నజుఁడు "ముసముస" యనుచున్.

క. మనమునఁ గలఁగుచు, భృగుఁ దన-తనుజాతుం డనుచు బుద్ధిఁ దలఁచినవాఁడై
ఘనరోషస్ఫురితాగ్ని-న్ననయము శాంతోదకముల నల్లన యార్చెన్. 1270

చ. మహితతపోధనుండు మునిమండనుఁ డయ్యెడఁ బాసి, వెండియు
న్నహిపతిభూషుఁ గాన [3]రజతాద్రికి నేఁగిన, నగ్గిరీంద్రుపైఁ
దుహినమయూఖశేఖరుఁడు దుర్గయుఁ దానును విశ్రమించుచుం
[4]ద్రుహిణతనూభవుండు సనుదెంచుట కాత్మఁ బ్రమోద మందుచున్. 1271

క. "కనుఁగొని, భ్రాతృస్నేహం-బునఁ గౌఁగిటఁ జేర్తు"ననుచు ముక్కంటి రయం
బున నెదురేఁగిన, ముని రు-ద్రునియందులసత్త్వగుణ మెఱుంగుటకొఱకై.

వ. అతనిం గైకొనక యూరకుండిన. 1273

ఉ. ఆ నిటలాంబకుండు గమలాసననందనుఁ జూచి, భూరికా
లానలరోషవేగభయదాకృతిఁ దాల్చి, పటుస్ఫులింగసం
తానము లొల్క, శూలమునఁ దాపసముఖ్యునురంబు వ్రేయఁగాఁ
బూనినఁ, బార్వతీరమణి బోరన నడ్డము వచ్చి చెచ్చెరన్. 1274

1. నశించుట. 2. పూర్వపుఁజరిత్రము. 3. వెండికొండ. 4. బ్రహ్మకుమారుఁడు.

క. తనవిభుపాదములకు వం-దనముం గావించి సముచితక్రియముల న
య్యనలాక్షునికోపము మాన్పిన సన్మునినాథుం దనదు నిలువక చనియెన్.

సీ. పొలుపొందు వైకుంఠపురమున కేతెంచి, యచట నందు సముజ్జ్వలైశ్వర్య మొప్పఁ
గమలాంకపర్యంకగతుఁడై సుఖించు సర్వోత్కృష్టభూషా వక్షస్స్థలంబుఁ
దనపాదమున బిట్టు దన్నఁగ నెన్నఁడు గాన్పు వచ్చి, మునిఁ జూచి, నగధరుండు
పదములు కెరఁగి, "యో తాపసోత్తమ! యిట్లు నీవచ్చు టెఱుఁగ లేక,

తే. యున్న నా తప్పు మన్నించి, నన్నుఁ గరుణఁ
జూచి, యీదివ్యమణిమయసత్పీఠిఁ దనరు
రుచిరసింహాసనమునఁ గూర్చుండు; మిన్న
తాపసోత్తమ! యభయప్రదాననిపుణ! 1276

క. అలఘుపవిత్రభవత్పద-జలములు నను, నస్మదీయ[1]జఠరస్థజగం
బుల, లోకపాలురను బొలు-పలరఁగఁ బుణ్యులను జేయు నఘచరిత్రా! 1277

వ. మునీంద్రా! భవదీయపాదాబ్జ[2]హతి మదున్నతాంతరంబునకు భూషణం బయ్యె; భవ
దాగమనంబు మాఁబోటివారికి శుభావహం బగుంగాదె! యేను ధన్యుండ
నైతి" నని మృదుమధురాలాపంబుల ననునయించిన, నమ్మునివరుండు లక్ష్మీ
నాథుసంభాషణంబులకుఁ జిత్తంబునం బరమానందంబు నొంది, యమ్ముకుందు,
ననంతకల్యాణ గుణనిధి నభినందించి, యానందబాష్పధారాసిక్తకపోలుం
డగుచుఁ, దద్భక్తిపారవశ్యంబున నొండు వలుక నేరక, యతనిచేత [3]నామం
త్రణంబు వడసి, మరలి సరస్వతీతీరంబున నున్న మునులసన్నిధికిం జనుదెంచి,
వారలం గనుంగొని. 1278

సీ. మునినాయకులతోడఁ దనపోయివచ్చిన తెఱఁగును, దనమది దృష్టమైన
మూఁడుమూర్తుల విధంబును నెఱింగించిన, విని వారు, మనముల విస్మయంబు
నంది, చిత్తంబున సందేహమును బాసి, చిన్మయాకారుఁడు, శ్రీసతీశుఁ,
డనుపముఁ, డనవద్యుఁ, డఖిలకల్యాణగుణాకరుఁ, డాదిమధ్యాంతరహితుఁ

తే. డై తనర్చిన పుండరీకాక్షుఁ డొకఁడ
కాక గణుతింప దైవ మొక్కరుఁడు వేఱ
కలఁడె? యనుబుద్ధి విజ్ఞానకలితు లగుచు
హరిపదాబ్జాతయుగళంబు నర్థిఁ గొలిచి. 1279

వ. అట్లు సేవించి, యవ్యయానందం బయిన వైకుంఠధామంబు నొంది" రని చెప్పి
వెండియు ని ట్లనియె. 1280

1. కడుపునందుండు. 2. దెబ్బచేత. 3. సెలవునుబొంది.

శ్రీకృష్ణుండు మృత బాలకుల విప్రునకుఁ దెచ్చుట

సీ. "నరనాథ! యొకనాఁడు నలినాయతాక్షుండు పాలించు కుశస్థలీపురమునందు
సుఖ ముండ, నొక్కభూసురునకు నిల్లాలియందు బుత్త్రుండు జన్మించి, పుట్టినపుడ
మృతుఁ డైన, ఘనశోకవిహ్వలచేఁ గ్రాఁగుచు 1నాడింభకుని గొంచు నవనిసురుఁడు
సనుదెంచి, పెలుచ రాజద్వారమునఁ బెట్టి, కన్నులబాష్పాంబుకణము లొలుక,
తే. "బాపురే! విధి నను దుఃఖపఱుపఁ దగునె?"
యనుచు దూఱుచుఁ, దనుఁ దిట్టికొనుచు, వగల
డెంద మందంద 2యెరియఁ, నాక్రందనంబు
సేయుచును వచ్చి, యా విప్రశేఖరుండు. 1281

సీ. అధికశోకంబున నలమటఁ బొందుచు, నచ్చటిజనులతో ననియెఁ బెలుచ;
"బ్రాహ్మణద్వేషపరుఁ డయి తగ శాస్త్రపద్ధతి నడపక, పాపవర్తి
యై, క్షత్త్రబంధువు నగుపాపిదురితంబుచేత మత్పుత్త్రుండు జాతమైన
యప్పుడ మృతుఁ డయ్యె; నక్కట! హింసకు 3రోయక యెప్పు డన్యాయకారి
తే. యగుచు, విషయానుగతచిత్తుఁ డైనయట్టి
రాజుదేశంబు ప్రజలు నిరాశు లగుచు,
దుఃఖములఁ జాల వనటఁ బొందుదు" రటంచు
నేడ్చుచును నట నిల్వక యేఁగె; నపుడు. 1282

వ. ఇవ్విధంబున మఱియును దనసుతులు మృతు లయిన, వారలం గొనివచ్చి,
యవ్విప్రుండు రాజుమొగసాలం బెట్టి, రోదనంబు సేయుచు, నెప్పటియట్ల కొన్ని
గాథలు సదివి పోవుచుండె; నవ్విధంబున నెనమండ్రుసుతులు మృతు లైన
పిదపం, దొమ్మిదవ సుతుండును మృతుం డైన, వాని నెత్తికొని వచ్చి యెప్పటి
విధంబునఁ బలవరించుచున్న యా బ్రాహ్మణునిం గని, యర్జునుం డిట్లనియె. 1283

క. "ఈపగిది నీవు వగలఁ-బాపోవఁగఁ జూచి, యకట! వారింపంగా
4నోపిన విలుకాఁ డొక్కఁ-డీపురి లేఁ డయ్యెఁ? నయ్య! యిది పాప మగున్.

సీ. పుత్త్రులఁ గోల్పోయి, భూరిశోకంబున వనటఁ బొందుచు విప్రవరులు సాల
నేరాజురాజ్యమం దేని వసింతురో యా రాజుఁ దలపోయ నవనిమీఁద
నటునిఁగా నాత్మ నెన్నం దగు; నీపుత్త్ర నే బ్రదికించెద నిపుడు పూని;
యటు సేయ నైతినే ననలంబు సొచ్చెద" నని భూసురుఁడు వెఱఁగందఁ బలుక,
తే. నతఁడు విని, "యీవెడఁగుమాట లాడఁ దగునె?
భూరివిక్రమశాలి రాముండు, మేటి

1. ఆ పిల్లవానిని. 2. మండుచుండఁగా. 3. అసహ్యపడక. 4. శక్తికలిగిన ధనుర్విద్యయందు నేర్పరి.

బలుఁడు హరియును, శౌర్యసంపన్నుఁ డనఁగఁ
జనదు ప్రద్యుమ్నుఁ డతనినందనుఁడు; మఱియు. 1285

తే. వినుతబలు లైన యాదవవీరవరులుఁ-గలుగ వారలచేఁ గాని కార్య మీవు
నక్కఁ బెట్టుట యెట్లు? నీ వెఱుఁగ వేఁ-బొమ్ము” నావుడు నయ్యింద్రపుత్త్రుఁ డపుడు.

క. మనమున నురహంకారము-ఘనముగఁ బొడముటయు, నపుడు కవ్వడి విప్రుం
గనుఁగొని యచ్చటిజనములు-వినఁగా నిట్లనియె రోషవిహ్వలమతి యై. 1287

మ. “బలుఁడం గాను; మురాసురాంతకుఁడఁ గాఁ; బ్రద్యుమ్నుఁడం గాను; నేఁ
దెలియం దత్తనయుండఁ గా; నని విరోధివ్రాతముల్ భీషణో
జ్జ్వలగాండీవధనుర్విముక్తనిశితాస్త్రశ్రేణిచేఁ బీన్గుపెం
టలు గావించు పరాక్రమప్రకటచండస్ఫూర్తి నేఁ బార్థుఁడన్. 1288

వ. అదియునుంగాక. 1289

చ. బలిమిఁ బురాంతకుం దొడరి బాహువిజృంభణ మొప్ప నెక్కటిం
దలపడి పోరినట్టి రణధైర్యుని, నన్ను నెఱుంగ వక్కటా!
పలుకుట మృత్యుదేవతను బింక మడంచి, [2]భవత్తనూజుల
న్నలవుఁ జలంబుఁ జూపి, కొనియాడఁగ నిప్పుడ తెచ్చి యిచ్చెదన్.” 1290

వ. అని నమ్మంబలికిన యర్జునుప్రతిజ్ఞకు భూసురుండు మనంబున నూఱడిల్లి, యతని నభినందించుచు నిజమందిరంబునకుం జని, కొన్నిదినంబు లుండునంత, భార్యకుం బ్రసూతివేదనాసమయం బయినం జనుదెంచి, వివ్వచ్చుం గని, తద్విధం బెఱింగించిన, నయ్యింద్రనందనుం డప్పుడు. 1291

చ. లలితవిశిష్టసంచితజలంబుల నాచమనంబు సేసి, సు
స్థలమున నిల్చి, రుద్రునకు సమ్మతి మ్రొక్కి, మహాస్త్రవేది ని
ర్మలశుభమంత్రదేవతల మానసమందుఁ దలంచి, గాండివం
బలవడ నెక్కుఁ ద్రోచి, బిగియం గదియించి నిషంగయుగ్మమున్. 1292

సీ. భూసురువెంట నిమ్ముల నేఁగి, సూతికాభవనంబుచుట్టును బాణవితతి
నరికట్టి, దిక్కులు నాకాశపథము ధరాతలంబెల్ల [3]నీరంధ్రముగను
శరపంజరముఁ గట్టి, శౌర్యంబు దీపింపఁ గడు నప్రమత్తుఁ డై కాచియున్న
యెడ, నమ్మహీసురునింతికిఁ బుత్త్రుండు జనియించె; నప్పు డచ్చటిజనంబు
తే. “పోయెఁ బోయెఁ గదే!” యని బొబ్బలిడఁగ,
బొందితోడన యాకాశమునకు మాయఁ

1. ఓ యర్జునుఁడు. 2. నీకుమారులను. 3. దట్టమైనది, సందులేనిది.

జెందె; నప్పుడ మఱలంబు నొంది, భూమి
సురుఁడు విలపించుచును మురహరునికడకు. 1293

వ. అప్పుడు వని. 1294

క. ముందట నిల్చి, "ముకుంద! స-నందనమునివినుత! నందనందన! పరమా
నంద! శరదిందుచందన-కుందయశస్సాంద్ర! కృష్ణ! గోవింద! హరీ! 1295

వ. అవధరింపుము; దేవా! యర్జునుం డనెడి పౌరుషవిహీనుం డాడిన[1]వ్యర్థవాగ్జల్పంబులు నమ్మి, పుత్త్రుం గోలుపడి, జేల నైననన్ను నేమందు? నిఖిలవిశ్వోత్పత్తిస్థితిలయం బులకుఁ బ్రధానహేతుభూతుండవయిన నీవు సమర్థుండవయ్యు, వారింపం జాలక చూచుచుండ, నొక్క మనుష్యమాత్త్రుండు దీర్పం జాలెడువాఁడు గలఁడే?" యని వెండియు. 1296

క. "ఎక్కడిపాండుతనూభవుఁ?-డెక్కడివిలుకాఁడు? వీని కెక్కడిసత్త్వం?
బెక్కడిగాండీవము? దన-కెక్కడిదివ్యాస్త్రసమితి? యే మనవచ్చున్?" 1297

క. అని తను నోడక నిందిం-చిన విని, యయ్యర్జునుండు చిడిముడిపడుచుం
దనవిద్యామహిమ పెంపునఁ-జని యొక్క వెస [2]దండపాణిసదనంబునకున్. 1298

క. చని యందు ధారుణీసుర-తనయులు లేకుంటఁ దెలిసి, తడయక నింద్రా
గ్నినిరృతివరుణసమీరణ-ధనదేశానాలయములు దగఁ బరికించెన్. 1299

వ. వెండియు. 1300

చ. నరసురయక్షకింపురుషనాగనిశాచరసిద్ధసాధ్యఖే
చరవిహగేంద్రగుహ్యకపిశాచనివాసములందు రోసి, భూ
సురసుతు లేఁగినట్టిగతి చొప్పడ కుండుటఁ జూచి, క్రమ్మఱన్
ధరణికి నేఁగుదెంచి, [3]బెడిదంబుగ నగ్ని సొరంగఁ బూనినన్. 1301

వ. అవ్విధం బంతయు నెఱింగి, యమ్మురాంతకుండు "విప్రనందనుల నీకుం జూపెద" నని యనలంబు సొరకుండ నివారించి, యప్పుడు. 1302

ఉ. సుందరదివ్యరత్నరుచిశోభిత మై తనరారు కాంచన
స్యందన మంబుజాప్తుఁ డుదయాచల మెక్కువిధంబు దోఁపఁ, బౌ
రందరి దాను నెక్కి, తనురశ్ములు దిగ్వితతిన్ వెలుంగ, గో
విందుఁ డుదారలీలఁ జనె, విప్రతనూజగవేషణార్థి యై. 1303

చ. చని, పురగోష్ఠదుర్గవనజానపదాచలపక్కణప్రభూ
తనదనదీసరోవరయుతక్షితి నంతయు దాఁటి, సప్తవా

1. వ్యర్థములయినమాటలు. 2. యమునిగృహమునకు. 3. భయంకరముగ. 4. దేహకాంతులు.

¹[illegible] దిక్కులం, [illegible] ప్రదేశంబుల [illegible]
జనగము నాక్రమించుచు. [illegible] ³[illegible]. 1304

చ. మసలక భూరిసంతమసమండలముం దరియంగఁ జొచ్చి, యా
హాసమునం బోవఁ బోవఁగ [illegible] గోచరించకుం,
నన మఱి, ²మోఁకరిల్లి, [illegible] నిల్చినన్,
బిసరుహపత్త్రలోచనుఁ డశేష్య [illegible] గనన్. 1305

సీ. బాలభానుప్రభాభాసమానద్యుతిఁ గర [illegible] భాగంబుఁ బనుప,
నమ్మహాస్త్రం బేఁగి, చిమ్మచీఁకటి నెల్ల [illegible] నఱికి వైచి,
యగ్రభాగంబున నతులితగతి నేఁగ నా [illegible] మున నిజస్యందనంబు
గడువడిఁ దోలి, యాకడఁ దిత[illegible]భూమిఁ గడప, ముందఱఁ కడఁ గానరాక

తే. మిక్కుటంబుగ దృష్టి మిఱిమిట్లు గొనఁగఁ
జదల వెలుఁగొందు దివ్యతేజంబుఁ జూచి
మొనసి గాండీవి కన్నులు మూసికొనుచు
నాత్మ భయ మంది, కొంతద న్వారిగి యుండె. 1306

తే. కడఁగి దుర్వారమారుతోత్కటవిధూత–చటులసత్తరంగభీషణగభీర
వారిపూరంబు జొచ్చి, తన్నీరమధ్య–భాగమునఁ గోటిసూర్యప్రభలు వెలుఁగ.

వ. మఱియుం జారుదివ్యమణిసహస్రస్తంభాభిరామంబును, నాలంబితకమనీయ
నూత్నరత్నమాలికాలంకృతంబును, భానుశశిముఖాగమ్యంబును, ననంత
తేజోవిరాజితంబును, బునరావృత్తిరహితమార్గంబును, నిత్యైశ్వర్యదాయకం
బును, నవ్యయంబును, నత్యున్నతంబును, ననూనవిభవంబును, బరమయోగీంద్ర
గమ్యంబును, బరమభాగవతనివాసంబును నై యొప్పు దివ్యధామంబునందు.

సీ. సాంద్రశరచ్చంద్రచంద్రికాకర్పూరనీహారహారాభ దేహ మమర,
నిందిందిరేందీవరేంద్రనీలద్యుతిఁ గర మొప్పు మేచకకంఠసమితి,
యరుణాంశుబింబభాసురపద్మరాగవిన్యస్తసహస్రోరుమస్తకములు,
వివృతాననోద్గతవిమదధూమరేఖల లీలఁ జూపట్టిన నాలుకలును,

తే. గలితసాయంతనజ్వాలజ్వాలనకుండ–ముల విడంబించు వేఁడిచూపులును గలిగి
భూరికలధౌతగిరినిభాకార మమరఁ–బరఁగు భోగీంద్రభోగతల్పంబునందు. 1309

వ. సుఖాసీనుం డై యున్నవాని డాయం జని, యప్పుడు. 1310

---

1. కులపర్వతముల సముదాయములు. 2. మోఁకాళ్లమీఁద నిలిచి. 3. భయంకరమగు చీఁకటి ప్రదేశము.

సీ. సజలనీలాంబుదశ్యామాయమానాంగు, నా¹ భావనముదితాంతరంగు,
సనకాదియోగిహృత్సరసిజాతాళీంద్రు, ముఖపద్మరుచిజితపూర్ణచంద్రుఁ,
గమనీయనిఖిలజగద్ధితచారిత్రుఁ, బ్రత్యూషసంఫుల్లపద్మనేత్రు,
నిందిరాహృదయారవిందారుణోల్లాసు, శ్రీకరపీతకౌశేయవాసు,
తే. హారకుండలకటకకేయూరమకుట-కంకణాంగదమణిముద్రికాకటిసూత్ర
రత్ననూపురకాంచీవిరాజమాను-భవమహార్ణవశోషు, సద్భక్తపోషు. 1311

వ. మఱియు సునందాదిపరిజనసంతతసేవితు, నానందకందళితహృదయారవిందు, నరవిందవాసినీవసుంధరాసుందరీసమేతు, నారదయోగీంద్రసంకీర్తనానందితు, నవ్యయు, ననఘు, ననంతు, నప్రమేయు, నజితు, నవికారు, నాదిమధ్యాంతరహితు, భవవిలయాతీతుఁ, గరుణాసుధాసముద్రు, నచ్యుతు, మహానుభావుఁ, బరమపురుషుఁ, బురుషోత్తము, నిఖిలజగదుత్పత్తిస్థితిలయకారణుఁ, జిదచిదీశ్వరు, నష్టభుజుఁ, గౌస్తుభశ్రీవత్సవక్షు, శంఖచక్రగదాపద్మశార్ఙ్గాదిదివ్యసాధను, సర్వశక్తిసేవితుఁ, బరమేష్ఠిజనకు, నారాయణుం గనుంగొని, దండప్రణామంబులు సేసి, కరకమలంబులు మొగిచి, భక్తిపూర్వకంబుగా నభినందించిన, నయ్యాదిదేవుండును వారలం గరుణావలోకనంబు నిగుడ నవలోకించి, దరహాసపూరంబు దోరంబుగా సాదరంబుగ ని ట్లనియె. 1312

క. "ధరణికి వ్రేఁగగు దైత్యులఁ-బొరిఁబొరి వధియించి, ధర్మముఁ నిలుపుటకై
ధర జనియించితి రిరువురు-నరనారాయణు లనంగ నా యంశమునన్. 1313

క. ఆరూఢనియతితోఁ బెం-పారిన మిము నిమ్మునీంద్రు లర్థిం జూడం
గోరిన, మీవచ్చుటకై-ధారుణిసురసుతుల నిటకుఁ దగఁ దే వలసెన్." 1314

క. అని "యీడింభకులను దో-డ్కొని పొం"డని యిచ్చి వీడుకొలిపిన, వారల్
వినతు లయి పెక్కువిధముల-వినుతించుచు నచటు వాసి, విప్రునిసుతులన్.

వ. తోడ్కొని, సంప్రాప్తమనోరథు లయి, యబ్బాలకులఁ దత్తద్వయోరూపంబులతోడఁ దెచ్చి, యా బ్రాహ్మణునకు సమర్పించిన, నతండు సంతుష్టాంతరంగుం డయ్యె; నయ్యవసరంబున. 1316

చ. అనిమిషనాథనందనుఁ, ²డహర్పతితేజుఁడు కృష్ణుతోడఁ దాఁ
జని యచటం గనుంగొనిన సర్వశరణ్యునిఁ బుండరీకనే
త్రుని నిజధామవైభవసమృద్ధికిఁ, దన్మహనీయమూర్తికిన్
మనమున మోద మంది, పలుమాఱును సన్నుతిఁ జేసె; భూవరా! 1317

---

1. సంసారమను మహాసముద్రమును ఇంకింపఁజేయువాఁడు. 2. సూర్యుని తేజస్సువంటి తేజస్సు గలవాఁడు.

తే. వారిజాక్షుని, భక్తమందారు, ననఘుఁ—గృష్ణు, నిఖిలేశుఁ, గేశవు, జిష్ణుఁ, బరము
వినుతిసేయుచుఁ బౌత్త్రాదిజనములకు—నందనము లాచరించి, యానంద మొందె.

వ. అంత. 1319

మ. హరి, సర్వేశుఁ, డనంతుఁ, డాద్యుఁ, డభవుం, డామ్నాయసంవేది, భూ
సురముఖ్యప్రజలన్ సమస్తధనవస్తుశ్రేణి నొప్పారఁగాఁ
బరిరక్షించుచు, ధర్మముల్ నిలుపుచుం, బాపాత్ములం ద్రుంచుచుం,
బరమోత్సాహము మెలర్ప భూరిశుభవిభ్రాజిష్ణుఁడై ద్వారకన్. 1320

క. జనవినుతముగాఁ బెక్కు—స—వనములు దనుఁదాన కూర్చి, వైదికయుక్తిం
బొనరించుచు, ననురాగము—మనమునఁ జెలుఁగొత్త దైత్యమర్దనుఁ డెలమిన్.

వ. అట్లు కృష్ణుండు ద్వారకానగరంబునఁ బూజ్యం బగు రాజ్యంబు సేయుచుఁ,
బురందరవిభవంబున నిరవొంది, కనకమణిమయవిమానమండపగోపురప్రాసాద
సౌధచంద్రశాలాంగణాదివివిధభవనంబులందు రంగ దుత్తుంగ తరంగ
డోలావిలోల కలహంసచక్రవాకకారండవసారసక్రౌంచముఖజలవిహంగ విలస
దుచ్చలిత గరుదనిలదళితదమలకమలకుముదకహ్లారసందోహనిష్యందమకరందరస
పానమదవదిందిందిరకులగాయకఝుంకారనినదంబులును, నిరంతరవసంత
సమయసముచితపల్లవిత కోరకిత బాలరసాలజాలలాలిత కిసలయవిసరఖాదన
జాతకుతూహలాయమాన కషాయకంఠకలకంఠకలరవ మృదంగ ఘోషంబు
లును, నిశితనిజచంచూపుటనిర్దళితసకలజననయనానందసుందరనందితమాకంద
పరిపక్వఫలరంధ్రవిగళితమధుర రసాస్వాదనముదితరాజకీరశారికానికరమృదు
మధురవచనరచనావళకృత్యంబులును నమరఁ, బురపురంధ్రీజనపీనపయోధర
మండలవిలిప్తలలితకుంకుమపంకసంకులసౌగంధ్యానుబంధబంధురగంధానుమోది
తుండును, జందనాచలసానుదేశసంజాతమంజులమాధవీలతానికుంజపుంజమం
జులకింజల్కరంజితనివాసవిసర విహరమాణ శబరికాకబరికాపరిపూర్ణసురభి
కుసుమమాలికాపరిమళవహుండును, గళిందకన్యకాకల్లోలసందోహపరిస్పంద
కందళితమందగమనుండును నగు మందానిల విదూషకునిచేఁ బోషితాభ్యాసిత
లాలిత లగు నేలాలతానటీవితానసటనంబులచే విరాజితంబు లగు కాసారతీర
భాసురోద్యానంబులందును, జారుఘనసారపటీర బాలరసాలసాల నీపతాపింఛ
జంబూజంబీరనింబకదంబప్రముఖముఖ్యశాఖిశాఖాకీర్ణశీతలచ్ఛాయా విరచిత
విమల చంద్రకాంతోపలవేదికాస్థలంబులందును, నుదంచితపింఛవిభాసితబాల
నీలకంఠ కేకారవాకలితకృతక మహీధరంబులందును, లలితమణివాలుకానేక
పులినతలంబులందును, గప్పురంపుఁదిప్పలను, గురువేరుచప్పరంబులను, విర
చితదారుయంత్రనిబద్ధకలశనిర్యత్పయోధారాశీకరపరంపరా సంపాదితనిరంతర
హేమంతసమయప్రదేశంబులందును, నిందిరారమణుండు షోడశసహస్రవధూ

ముక్తంబులై యొప్పుచుఁ గన్నులపండువులై, లలితసౌధాంగణనీలతోరణమేచక నీలవిరచితం
బుల విడంబింపుచుఁ, గరేణుకాకలితదిగ్గజంబులనొప్పఁ రాజిల్లుచు, సలిలకేళివిహా
రంబులు కొలఁకులుగా ననేకలీలావినోదంబులు సలుపుచు సంతతప్రకారంబులఁ
గొలుచుచున్న యుపవనంబున. వివిధవేణువీణాదివాద్యంబులను, మంజులగానం
బులను, గణికానాయకమాగధవందిమాగధజనసంకీర్తనంబులను, నటనటీజన
నాట్యంబులను, విదూషకపరిహాసోక్తులను, సరససల్లాపమృదుమధుర భాషణంబు
లను బ్రొద్దుపుచ్చుచు, నానందసాబ్ధి నోలలాడుచుండె; నంత. 1322

మ. అరవిందాక్షపదాంబుజాతయుగళధ్యానానురాగక్రియా
సరసాలాపవిలోకనానుగతచంచత్సౌఖ్యకేళీరతిం
దరుణుల్ [1]నూఱుఁబదాఱువేలు మహితోత్సాహంబునం జొక్కి త
త్పరలై యొండు దలంపకుండిరి సవిభ్రాంతాత్మలై భూవరా! 1323

వ. అదియునుం గాక. 1324

మ. హరినామాంకిత మైన గీత మొకమా టాలించి, మూఢాత్ములున్
విరతిం బొందఁగఁ జాలి యుందు రఁట! యావిశ్వాత్ము నీక్షించుచుం,
బరిరంభించుచు, నంటుచున్, నగుచు, సంభాషించుచు న్నుండు సుం
దరు లానందనిమగ్న లౌట కిలఁ జోద్యం బేమి? భూవల్లభా!" 1325

వ. అని చెప్పి మఱియు ని ట్లనియె. 1326

ఉ. "ద్వారక కృష్ణుఁ డిప్పగిది వైదికయుక్తి గృహస్థధర్మ మే
పారఁగఁ బూని, ధర్మమును, నర్థముఁ, గామము నందుఁ జూపుచుం,
గోరిక మీఱ సజ్జనులకుం గతి దాన యనంగ నొప్పి, సం
సారగతిన్ మెలంగె, నృపసత్తమ! లోకవిడంబనార్థ మై. 1327

సీ. హరి యిట్లు గృహమేధి యగుచు, [2]శతోత్తరషోడశసాహస్రసుందరులను
మును నీకు నెఱిఁగఁ జెప్పినరీతి నందఱ కన్నిరూపములు దా నర్థిఁ దాల్చి,
కైకొని యొక్కొక్కకామినీమణియందు రమణ నమోఘవీర్యమునఁ జేసి
పదురేసి కొడుకులఁ బడసె; రుక్మిణ్యాదిపట్టమహిషులకు సంభవము లైన

తే. నందనులలోన ధరణి నెన్నంగ బాహు
బలపరాక్రమవిజయసంపద్విశేష
మానితాత్ములు [3]పదునెనమండ్రు; వారి
నెఱుఁగ వినిపింతు వినుము రాజేంద్రచంద్ర!" 1328

1, 2. శ్రీకృష్ణునిభార్యలు 16108 అని కలదు. అష్టభార్యలు, షోడశసహస్రము. 16008 ఉండవలెను. 3. పదునెనిమిది (18) ముఖ్యులగు పుత్రులు.

[illegible]

మ. [illegible]
[illegible]
[illegible]
[illegible] చిత్రంబు? [illegible] 1334

వ. ఇవ్విధంబున గోపికాజనమనోజాతుం డైన కృష్ణుండు లీలామానుషవిగ్రహుం డై నిజరాజధాని యైన ద్వారకాపురంబున ననూనుషవిభవంబు లను సౌఖ్యంబులం బొదలుచుండె” నని చెప్పి మఱియు ని ట్లనియె. 1335

మ. “మనుజేంద్రోత్తమ! యేను నీకుఁ ద్రిజగన్మాంగల్య మై యొప్పఁ జె
ప్పిన యీకృష్ణకథాసుధారసము సంప్రీతాత్ము లై భక్తిఁ గ్రో
లిన పుణ్యాత్ములు గాంతు రింపు సుఖముల్; నిర్ధూతసర్వాఘు లై
యనయంబుం దుదిఁ గాంతు రచ్యుతపదం బైనట్టి కైవల్యముల్.” 1336

క. అని యిట్లు బాదరాయణి-మనమున రాగిల్ల, నాభిమన్యునకుం జె
ప్పిన విధమున సూతుఁడు ముని-జనుల కెఱిఁగింప వారు సమ్మతితోడన్. 1337

క. సూతుని బహువిధముల సం-ప్రీతునిఁ గావించి, మహిమఁ బెంపారుచు వి
ఖ్యాతికి నెక్కిన కృష్ణక-థాతత్పరు లైరి, బుద్ధిఁ దఱుఁగనిభక్తిన్. 1338

చ. సరసిజపత్త్రనేత్ర! రఘునత్తమ! దుష్టమదాసురేంద్రసం
హారణ! దయాపయోధి! జనకాత్మభవానవపద్మమిత్ర! భా
స్కరకులవార్ధిచంద్ర! మిహికానసుధాధరనూతిసన్నుత
స్ఫురితచరిత్ర! భక్తజనపోషణభూషణ! పాపశోషణా! 1339

క. మారీచభూరిమాయా-నీరంధ్రమహాంధకారరవిరేజహితా!
శ్రీరమణవినుతపాదాం-భోరుహ! మహితావతార! పుణ్యవిచారా! 1340

మాలిని. శరధిమదవిరామా! సర్వలోకాభిరామా!
సురరిపువిషభీమా! సుందరీలోకకామా!
ధరణివరలలామా! తాపసస్తోత్రసీమా!
సురుచిరగుణధామా! సూర్యవంశాబ్ధిసోమా! 1341

---

1. అనుభవములను బోఁగొట్టునది. 2. మనుష్యులకుసాధ్యపడని సంపదలు. 3. తొలఁగింపఁబడిన సకల పాపములు గలవార లై.

## గద్యము

ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన శ్రీమహాభాగవతం బను మహాపురాణంబునందుఁ బ్రద్యుమ్నజన్మంబును, శంబరోద్యోగంబును, సత్రాజిత్తునకు సూర్యుండు శ్యమంతకమణి నిచ్చుటయును, తన్నిమిత్తంబునఁ బ్రసేనుని సింహంబు వధియించుటయును, దాని జాంబవంతుండు చంపి మాణిక్యంబు గొనిపోవుటయును, గోవిందుండు ప్రసేనునిఁ దునిమి మణిఁ గొనిపోయె నని సత్రాజిత్తు కృష్ణునిపై నింద నారోపించుటయును, కృష్ణుండు తన్నిమిత్తంబున జాంబవంతునితోడఁ బోరి మణియుక్తంబుగా జాంబవతిం గొనివచ్చి వివాహం బగుటయును, సత్రాజిత్తునకు మణి నిచ్చుటయును, సత్యభామాపరిణయంబును, పాండవులు లాక్షాగృహంబున దగ్ధులైరని విని వాసుదేవుండు బలభద్రసహితుండయి హస్తినాపురంబునకరుగుటయును, నక్రూరకృతవర్మల యనుమతంబున శతధన్వుండు సత్రాజిత్తుం జంపి మణిఁ గొనిపోవుటయును, తదర్థం బా సత్యభామ కరినగరంబునకేఁగి కృష్ణునకు విన్నవించిన నతండు మరలి చనుదెంచి శతధన్వుం ద్రుంచుటయును, బలభద్రుండు మిథిలానగరంబునకుం జనుటయును, నందు సుయోధనుండు రామునివలన గదావిద్య నభ్యసించుటయును, కృష్ణుండు సత్రాజిత్తునకుం బరలోకక్రియలు నడపుటయును, స్యమంతకమణిం దాఁచినవాఁడయి యక్రూరుండు భయంబున ద్వారకానగరంబు విడిచిపోయిన నతని లేమి ననావృష్టి యైనం గృష్ణుఁ డక్రూరుని మరల రప్పించుటయును, దామోదరుం డింద్రప్రస్థపురంబున కరుగుటయును, నం దర్జునసమేతుం డయి మృగయావినోదార్థం బరణ్యంబునకుం జని కాళిందిం గొనివచ్చుటయును, ఖాండవదహనంబును, నగ్నిపురుషుం డర్జునునకు నక్షయతూణీర గాండీవకవచరథరథ్యంబుల నిచ్చుటయును, మయుండు ధర్మరాజునకు సభ గావించి యిచ్చుటయును, నగధరుండు మరలి నిజనగరంబున కరుగుదెంచి కాళిందిని వివాహం బగుటయును, మిత్రవిందానగ్నజితీభద్రామద్రరాజకన్యలం గ్రమంబునఁ బరిగ్రహింపం బగుటయును, నరకాసురవధంబును, తద్గృహంబున నున్న రాజకన్యకలం బదాఱువేలం దెచ్చుటయును, స్వర్గగమనంబును, నదితికిం గుండలంబు లిచ్చుటయును, పారిజాతాపహరణంబును, పదాఱువేల రాజకన్యలం బరిణయం బగుటయును, రుక్మిణీదేవివిప్రలంభంబును, రుక్మిణీస్తోత్రంబును, కృష్ణకుమారోత్పత్తియును, తద్గుణజనసంఖ్యయును, ప్రద్యుమ్నవివాహంబును, ననిరుద్ధజన్మంబును, తద్వివాహార్థంబు కుండినగరంబునకుం జనుటయును, రుక్మిబలభద్రుల జూదంబును, రుక్మివధయును, నుషాకన్య యనిరుద్ధుని స్వప్నంబునం గని మోహించుటయును, తన్నిమిత్తంబునఁ జిత్రరేఖ సకలదేశరాజులఁ బటంబున లిఖించి చూపి యనిరుద్ధునిఁ దెచ్చుటయును, బాణాసురయుద్ధంబును, నృగోపాఖ్యానంబును, బలభద్రుని ఘోషయాత్రయును, కాళిందీభేదనంబును, కృష్ణుండు పౌండ్రకవాసుదేవకాశిరాజుల వధియించుటయును, కాశిరాజపుత్త్రుం డయిన సుదక్షిణుం డభిచారహోమంబు గావించి కృత్యం బడసి కృష్ణునిపైకిం బుత్తెంచిన సుదర్శనంబుచేతఁ గృత్యను సుదక్షిణసహితంబుగాఁ గాశీపురంబును భస్మంబు సేయుటయును, బలరాముండు రైవతనగరంబునందు ద్వివిదుం డను వనచరుని వధియించుటయును, సాంబుండు దుర్యోధనుకూఁతు రగు లక్షణ నెత్తికొనివచ్చినఁ గౌరవు లతనిం గొనిపోయి చెఱఁబెట్టుటయును, తద్వృత్తాంతం బంతయు నారదువలన విని బలుండు నాగనగరంబునకుఁ జనుటయును, గౌరవు లాడిన యగౌరవవచనంబులకు బలరాముండు కోపించి హస్తినాపురంబు గంగం బడఁద్రోయ గమకించుటయును, గౌరవులు భయంబున నంగనాయుక్తంబుగా సాంబునిం దెచ్చి యిచ్చుటయును, బలభద్రుండు ద్వారకానగరంబునకు వచ్చుటయును, నారదుండు హరి పదాఱువేలకన్యకల నొక ముహూర్తంబున నందఱ కన్ని రూపులై

శ్రీ ర స్తు

శ్రీకృష్ణాయ నమః

# శ్రీమదాంధ్రభాగవతము

## ఏకాదశస్కంధము

శ్రీసీతాపతి! లంకే-శాసురసంహారచతుర! శాశ్వతనుతవా
ణీసత్యధిభూధవవృ-త్రాసురరిపుదేవజాల! రామనృపాలా! 1

వ. మహనీయగుణగరిష్ఠు లగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీ
సమేతుం డైన సూతుం డిట్లనియె: "నట్లు [1]ప్రాయోపవిష్టుం డైన పరీక్షిన్న
రేంద్రుం గని శుకయోగీంద్రుం "డయ్యా! జన్మకర్మవ్యాధివిమోచనంబునకుఁ
గారణంబగు దివ్యౌషధంబు గావున, శ్రీమన్నారాయణకథామృతంబు గ్రోలు"
మని యిట్లనియె. 2

మ. "బలవత్సైన్యముతోడఁ గృష్ణుఁడు మహాబాహాబలోపేతుఁ డై,
కలనన్ రాక్షసవీరవర్యుల వడిన్ ఖండించి, భూభార ము
జ్జ్వల మై యుండఁగ ద్యూతకేళికతనం జావంగఁ, [2]గౌరవ్యస
ద్బలముం బాండవసైన్యము న్నడఁచె, భూభాగంబు గంపింపఁగన్. 3

వ. అంత. 4

క. మునివరులు సంతసిల్లిరి;-యనయము నందాదులకును హర్షం బయ్యెం;
దన నిజభక్తులు యాదవ-ఘనవీరసమూహ మపుడు గడు నొప్పెసఁగన్. 5

మ. విదితుం డై సకలామరుల్ గొలువ నుర్వీభారముల్ మాన్పి, దు
ర్మదసంయుక్తవసుంధరాధిపతులన్ మర్దించి, కంసాదులం
దుదిముట్టన్ వధియించి, కృష్ణుఁ డతిసంతుష్టాత్ముఁ డై యున్నచో
యదుసైన్యంబులు భూమి మోవఁగ [3]నసహ్యం బయ్యె నత్యుగ్ర మై. 6

సీ. ఈరీతి శ్రీకృష్ణుఁ డేపారఁ బూతనా, శకట, తృణావర్త, సాల్వ, వత్స,
చాణూర, ముష్టిక, ధేను, ప్రలంబక, దైత్యాఘ, శిశుపాల, దంతవక్త్ర,

1. అన్నపానముల వదలి చావునకై సిద్ధపడినవాఁడు. 2. కౌరవులయొక్క సైన్యమును.
3. ఓర్చుకొనరానిది.

